20 శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy)**

సంపుటము ౨౦. { ప్రజోత్పత్తినామసంవత్సరము. మాఘఫాల్గునమాసములు. } సంచిక ౬.



కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచేఁ బరిషత్కార్యాలయమునఁ
బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-0-0.

విడిసంచిక రు ౦-౮-౦.

1932.

## ప్రతిష్ఠాపకులు.

శ్రీ రాజా రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు, పిఠాపురము మహారాజావారు. పరిషత్సర్వజ్ఞాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.

శ్రీ రాణీ వత్సవాయ వేంకట సుభద్రయ్యమ్మ జగపతిబహద్దరుగారు- మును రాణీగారు.

కీ. శే. శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఆంధ్ర సాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### అధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

కిడాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకటకృష్ణపంతులుగారు ఎం. ఏ.

### కార్యనిర్వాహక సభాసభ్యులు.

దివాన్ బహదూర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు.

రావుసాహెబ్ డాక్టర్ వేమూరి రామకృష్ణారావుగారు ఎం. ఏ., ఎల్. టి. P H D
(కోశాధ్యక్షులు.)

శ్రీ త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు.

కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., యల్. టి.

దర్భా వేంకటశివరామరాజుగారు, బి. ఏ., బి. ఎల్.

అక్కి వేంకటరామయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావు నాయుడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మారావునాయుడుగారు.

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

| సంపుటము ౨౦. | ప్రజోత్పత్తినామసంవత్సరము.<br>చైత్రవైశాఖమాసములు. | సంచిక ౧. |
|---|---|---|


## స్వవిషయము.



ఈసంచికతోఁ బరిషత్పత్రికకు నిరువదియవవత్సరము ప్రారంభించినది. పత్రికయందు భాషావిషయక మగువ్యాసములు, శతకములు, ప్రబంధములు, ప్రకటింపఁబడుచున్నవి. ప్రమోదూతసంవత్సరమున ననంతకవికృతరసాభరణ మును, చిన్నయసూరిచే రచింపఁబడిన సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణమును, ఆంధ్రశబ్దశాసనమును, బ్రకటించియుంటిమి. శతకసముచ్చయమునందలి ప్రథ మభాగము, పరిషత్పుస్తకభాండాగారమున ద్వితీయభాగమును ముగింపఁబ డినవి. షోడశకుమారచరిత్రమునకుఁ బ్రత్యంతరము లభించి యుండలేదు. 2, 5, 6, 7, ఆశ్వాసములు మాత్రము సంపూర్ణముగఁ గలవు. మృదుమధు రశైలిని రచింపఁబడి యుండుటచే గ్రంథ మసంపూర్ణ మైననుఁ గొంతభాగ మును బ్రకటించితిమి. మిగిలినభాగము నీసంవత్సరమునఁ బూర్తిచేసి, గోపరాజక వికృత ద్వాత్రింశత్సాలభంజికలఁ బ్రకటింతుము. ఆంధ్రశబ్దచింతామణికి బాల సరస్వతి రచియించిన టీక యాంధ్రవ్యాకరణమున కత్యంతోపయోగకర మగుటచే దాని నీసంచికయందే ప్రారంభించితిమి. శతకములను బరిషత్పుస్తక భాండాగార విషయములను నెప్పటియటులు ప్రకటింపఁ దలఁచినారము. భాషా భిమానులు తమచందాధనములను సంపూర్తిగ నొసఁగి, నూతనముగఁ జందా దారులను జేర్పించి మాకుఁ దోడ్పడుదు రని విశ్వసించుచున్నాము.

శ్రీరాములు.

# కవిత్వతత్త్వము.

—ఉ. భా. ప్రవీణ-గాధావఝుల రామనాథశాస్త్రిగారు, కాకినాడ.—

---

శ్రీపరమేశ్వరుని సృష్టియందు లలితకళలలో నెల్లఁ గవిత్వ మగ్రస్థానము నలంకరించినది.

"సారస్వతం కిమపి తత్సుమహారహస్యం
యద్గోచరేచ విదుషాం నిపుణైకసేవ్యమ్॥
తత్సిద్ధయే పరమయం పరమోభ్యుపాయో
యచ్చేతసో విదితవేద్యవిధేః సమాధిః॥"

కవిత్వ మన నేమి:—తనకుం గలిగిన యేరసముయొక్క గాని యావేశముకు దాననుభవించుచు నాయుద్రేకమును లోకులకు వెల్లడించి వారినుద్రిక్తమనస్కులం జేయుట. తత్కాలమున లోకుల నానందింపఁజేయుటయు ఫల మనందగు. అది యెట్టి దనిన:—

గానము, చిత్రలేఖనము, కవిత్వము వీనిని లలితకళ లందురు. ఈమూఁడును నానందమునకుఁ దానకము లయ్యును నించుక భేదముఁ గలిగియున్నవనుట నిర్వివాదాంశము.

ఇందు మొదటిది యాలించినంతన శ్రోత్రపేయమై శ్రవణానందము నందఁజేయును. చిత్రలేఖనము చూచినంతన కన్నులపండు వొనర్చును, కడపటిది యగుకవిత్వ మట్టిది మాత్రమ కాక వినుట యుఁ జూచుట యుఁ గాక మానససంబంధి యగుయోజనాబలమున నానందరసాబ్ధి నోలలాడించును. ఇట్లనుట గానచిత్రలేఖనములయందు నానందము లేదని కాని వానికి మానసికప్రచారము లేదని కాని నాయభిప్రాయము గాదు. మనము చక్కని గానమాలించిన నావినునప్పుడు మాత్రమ కాక తలంపునకుఁ దగిలినపు డెల్ల నామధురసంగీతనినాదము మనచెవులఁ బ్రతిధ్వనించుచున్నటులే తోఁచును. అంతియకాక శ్రోతలహృదయముల నాకర్షించి ద్రవింపఁజేసి ప్రపంచమును మఱపించి తద్రసాస్వాదనమునఁ జొక్కించి పరవశులఁ జేయును. అట్లు కావుటనే రాలఁ గరఁగించు నని యు, మ్రోళ్ళఁ జివురొత్తించు నని యుఁ జెప్పుదురు. అయిన నిందు విశేష మే మందురా, కుక్షింభరు లయి పాడు బిచ్చగాండ్ర

సంగీతములను గూర్చి చెప్పుట గాదు గాని పూర్వజన్మవాసనావశమున నబ్బిన సంగీతానుభవమును యోగ్యుఁడగు గాయకుఁడు తనకుం గలిగిన రసావేశమున నిమగ్నుఁడై తన్నుఁదా మఱచి శ్రోతల హృదయముల నరికట్టి రసాస్వాదనాయత్తచిత్తులం జేసి ప్రపంచమును సైతము మఱపించి మోహపరవశులం జేయును.

ఇఁక జిత్రలేఖనమును నట్టిదియ. చిత్రకారుఁడు దాను చూచిన లేక భావించిన యొకానొకదృశ్యమును నిపుణత మెఱయ జీవకళ లుట్టిపడం జిత్రించి చూపఁ సమ్మోహ మందఁజేయును. ఇందును భావనాశక్తియుఁ దత్ప్రకటనమును బ్రధానములు. మనోహర మగుగాన మానందము నెటులు నెలకొల్పునో యటులనే మనోహరచిత్రదర్శనము ననిర్వచనీయానంద మొసంగును. తాను భావించిన చిత్తరువును గన్నులఁగట్టినట్లు నెదుట నిలిచి వాడాడుచున్నటులఁ జిత్రించిన దాని మఱపుఁగొన నేరికేని శక్య మగునా? అట్లే స్రష్టయి తనభావనాప్రపంచమునఁ దాను సృజించినచిత్తరువుల లలితపదముల మూలమునఁ జూపఁ హృదయఫలకములఁ జిత్రించును. పాత్రోచితము లగు పదములఁ బ్రయోగించియు విషయమునకుం దగినరీతి సొగసైనవర్ణనలం జేసియు వృత్తముల నెదుట సాక్షాత్తుగఁ గన్నులఁ గట్టినటులఁ గల్పించుటయే యన్నిటికన్న మిన్నయగు కవితాలక్షణము. కన్నులఁ గట్టినటులు కలగాంచిన రూప మెదుట నిలిచినటులు నాకృతులు మనములకుం దట్టనియది కవిత గానేరదు. ఈ మహేంద్రజాలకౌశలమునకు నాధార మగుగుణము భావనాశక్తి. కావున నాలలితకళాత్రికమున కవినాభావసంబంధము గలిగి వేఱు సేయ వీలుగానంత దట్ట మగుమైత్రి గలిగియున్నది. అనఁగా గానము చిత్రకళ కవిత్వము వీనిలో నొకదానియం దొకటి యిమిడి యున్న వనుట. అందును "ఉత్తరోత్తరం బలీయః" అనున్యాయమునుబట్టి గానముకంటెఁ జిత్రలేఖనమును జిత్రకళకంటెఁ గవిత్వమును శాశ్వతానంద మొసంగు నని యాశయము. చూచుఁడు- కవికిని మహాయోగికిని భేదము లేదందురు. వీ రుభయులును మోక్షమున కర్హు లనుచుందురు. కాని కవితాశక్తియే యోగశక్తి కన్న మిన్నయని నాయభిప్రాయము. ఇట్లంటి నని నాపైఁ గినియకుఁడు. పరమయోగి, యోగాభ్యాసవశమునఁదనచిత్తము నాపరబ్రహ్మమున లయించి తద్రసానుభవమున నానందపరవశుఁ డగును. ఇఁక సుకవి యందురా- తనప్రతి

భావిశేషమునఁ దనభావనాశక్తిమూలమునఁ దాను గల్పించిన నూతనప్రపంచమున సర్వసముఁడై కావ్యరూపమున నందఱకుం బాలొసంగి సహృదయులసైతము తనచే సృజింపఁబడిన బ్రహ్మాండంబునకుం గొనిపోయి యానందాతిథ్యమొసంగి తానానందించి వారల నానందింపఁజేయును. అంతమాత్రమునఁ గవి యోగిపుంగవునకుం దుల్యుఁడగునా, యోగి కుండు సిద్ధు లుండునా యందురేమో, కవి కంతమాత్రపు సిద్ధులు గాక యతిశయించిన ప్రభావము సైత ముండవచ్చును.

కవియును యోగిపుంగవునివలె దివ్యదృష్టి త్రికాలజ్ఞత గలిగియుండు ననుట విదితమే గదా! వట్టి తెలియుట మాత్రము కాక తమగన్నులఁ గట్టినటులు ప్రదర్శించి శాశ్వతత్వ మొసంగును. వేయేల యోగిపుంగవునకు బ్రహ్మానందభిక్ష సైతము కవి యొసంగిన దనక తప్పదు. ఏలయనఁ, గవి బ్రహ్మ యొక్క యనుభావమును జిత్రింప దానిని మననాభ్యాసవశంబున యోగి బ్రహ్మమున లయించి యనిర్వచనీయానందము నొందుచున్నాఁడు.

దేశాంతరవృత్తమునకు.

"ప్రాణానా మనిలేన వృత్తి రుచితా సత్కల్పవృక్షే వనే
తోయే కాంచనపద్మరేణుకపిశే పుణ్యాభిషేకక్రియా
ధ్యానం రత్నశిలాగృహేషు విబుధస్త్రీసన్నిధౌ సంయమో
యత్కాంక్షంతి తపోభి రన్యమునయ స్తస్మిం స్తపస్యం త్యమీ॥

ద్వీపాంతరవ్యవహారః.

"అనేన సార్థం విహారాంబురాశే స్తీరేషు తాడీవనమర్మరేషు
ద్వీపాంతరానీతలవంగపుష్పై రపాకృతస్వేదలవా మరుద్భిః॥

ఇటు లనేకము లున్నవి- గ్రంథవిస్తరభీతిఁ జెప్పఁ జాలనైతిని. దేశకాలపరిస్థితులకును గవితకును గలసంబంధము:—కవితకు భావనాశక్తి యెటులు ముఖ్యమో యటులే దేశకాలపరిస్థితులును గారణములు గాకపోవు. ఉద్రేకము రసావేశమునకు హేతువు. ఉద్రేకమునకు దేశకాలపరిస్థితుల యావరణమే మూలము. దేశచరిత్రముల వైపు నొకపరి తిలకింపుఁడు. దేశ మితరుల పాలయి మహాయుద్ధములతో నిండి యుండిన సమయాన వీరరసప్రధానకావ్యములును, దేశస్వాస్థ్యము గుదిరి సుఖముగ నున్నప్పుడు శృంగారరసకావ్యములును బయలువెడలినటులు గననగును.

మహాయుద్ధములతో దేశ మల్లలనాడు సమయముననే నన్నెచోడుఁడు, నన్నయ మొదలగుమహాకవు లుద్భవించిరి. ఆకాలముననే యాంధ్రకవిత తలయెత్తినటు లాంధ్రభారతాది గ్రంథములు ప్రబలనిదర్శనములు- ఇటీవల మహమ్మదీయుల దండయాత్రలమూలమున దేశ మల్లలనాడుసమయమునఁ గృష్ణదేవరాయలమూలమున నొకింత స్వాస్థ్య మేలపడినది. అదియు మెఱపుతీఁగవంటిదియై పోయినది. ఆకాలమునసైతము మనోహరశృంగారప్రబంధము లుద్భవించినవి. ఏల యందురా! అట్టిసంఘర్షణకాలమున నెట్టి జడుఁడైనను గొంచెముగనో గొప్పగనో దేశభక్తిఁ గలిగి యుండుట సాజము. సామాన్యులహృదయములు సైతము వీరరసప్రపూర్ణము లయి యుండును. అట్టియెడ దారాపుత్రాదుల వీడి యుద్ధరంగమున కేగుమహావీరుల హృదయాంతరాళముల నెన్ని భావపరంపరలు మెఱసి పోవుచుండునో యోజింపుఁడు. తనవారి నందఱ విడిచి పోవలయునే యనుదిగులు, పోకున్న మానప్రాణములకుఁ దెత్తురనురోసము, దేశమునకై వినియోగింపని యీ పాడుదేహ మేల కాల్పనా యను తెగువ. ఈ మొదలగు భావపరంపర లెట్లు దొంతరదొంతరలై ముందునకు నెట్టుకొనివచ్చునో గమనింపుఁడు. ఈసందర్భమున పల్నాటివీరచరిత్రమున బాలచంద్రునికథ యొంతయు నిదర్శనము. కావున నుద్రేకమే కవితాశక్తికిఁ బ్రాణాధార మగుకారణము,

భారతరామాయణముల కర్తలగు నాదికవులయుఁ బ్రబంధనిర్మాత లగు మధ్యకవులయు ననుభావముల నొకింత చవిచూతము.

కవిత్వమునకుఁ బ్రతిభ, భావనాశక్తి, సందర్భశుద్ధి, పాత్రోచితపద్యరచన ముఖ్యములు భావనాశక్తి యన విషయముల మనసునఁ బ్రతిబింబింపఁజేయు సామర్థ్యము. ప్రతిబింబించుటయు కాదు. ప్రత్యక్షముగ నవతార మెత్తునట్లు సేయుట. శ్రీరామభరతులు, కృష్ణార్జునులు, భీష్మాభిమన్యులు మొదలగువారిని మన మెన్నఁడును జూడకున్నను నిత్యముం జూచుచు సరససల్లాపము లాడుచున్న యిరుగుపొరుగువారికన్న నెన్నియోమడుంగులు సత్వముం దాల్చినవారై మనలోసత్యనివాస మేర్పఱిచికొనిరి గదా, ఈరీతి కృత్రిమములసైతము మూర్తీభవింపఁ జేయువారే మహాకవులు. అట్టిభావనాశక్తి లేనిపాండిత్యము జీవము లేనిశరీరమువోలె జుగుప్సాజనక మగును.

మఱి భావనాశక్తి యెట్లలవడు నందురా, అది యొక్కఁడు నేర్పువాఁ

డును లేఁడు. నేర్పువిధానములును లేవు. కాని వారివారి మనోబలములకొలఁది బరిపూర్ణత సిద్ధించునే గాని వేఱొం డుపాయము గానము. ఈ సందర్భమున నొకకవి యిట్లు నుడివినాఁడు.

"సతతకవిత్వతత్త్వరససంపద యొక్కరి సొమ్ము గాదు భా
రతిదయ సాధవార్ధి కవిరాజులమానసము ల్ఘటంబు లా
యతముకొలంది లభ్యమగు నయ్యమృతంబు"-

అని, కేవల కల్పితముల సైతము సాక్షాత్కారముం దాల్చిన చేతన ములఁ జేయఁజూచినయది గాన భావనాశక్తి నాటకరచనాకౌశలముతో ననుసంధించి యుండును. అనఁగా నాటకరచనాశక్తి యలవడినం గాని కావ్యముల సైతము యథార్థముగఁ గన్పట్టఁజాలవు.

ఈ నాటకకళాకౌశలము నన్నయతిక్కనాదులలో నెంత పరిపూర్ణతఁ గాంచినదియు భారతము నొకపరి యైనఁ జదివినవారి కెల్ల విదితమే.

భావనాశక్తిని బ్రకాశింపఁజేయునది ప్రకృతి. మానవహృదయములతో నిరంతరసంయోగము గలప్రకృతులు మూఁడు గలవు.

1. ఆలోచనములు—అనఁగాఁ గార్యకారణములఁ గూర్చియు వస్తుస్వరూపాదుల నిర్ణయించుటను గూర్చియు జేయునాలోచనములు.
2. భావములు—అనఁగా, కామము, క్రోధము, రాగము, కరుణ మొదలగు చిత్తసంచారజనకము లగుభావములు.
3. నిశ్చయము—అనఁగా నేదే నొకదానిం గోరి సాధింపఁ బూని నిశ్చయించుకొనుట.

ఇందు భావములు భావనాశక్తి నుద్రేకింపఁజేయుటలో ముఖ్యము లనక తప్పదు. భావనాశక్తిశూన్యు లయి జంత్రపుబొమ్మలకైవడి నిర్వికారులగువారు గూడఁ బద్యములఁ గూర్పనచ్చునే గాని యంతమాత్రమున వారు సుకవు లగుట యసంభవము.

ఏవృత్తాంతమునైనఁ దాను జూచినటుల వర్ణింపవలె నన్న దాని స్థితిగతులును, అందలిపాత్రముల కష్టసుఖములును దాను భావించి యనుభవించినం గాని చెప్పుట దుర్లభము. వేయేల తానాపాత్రముల లీనము గావలయు. కొందఱు చిత్తచాంచల్యమునకుఁ దావీయ సమ్మతింపరు. అట్టివారియందేదేని పాండిత్య మున్నఁ బ్రకాశింపవచ్చునే గాని శిల్పకళ యేమాత్రమును బ్రకా

శింపడు. భావములు, కోరికలు, రసములు వెల్లివిరిసెనేని యట్టివాఁ డూరక మూఁగవాఁడై యుండనోపఁడు. ఏదోవిధమునఁ దనభావములఁ బ్రకటించి భారము దీర్చుకొనుచుండును. చూడుఁడు- మన మనుదినమును జూచి నిరసించు వస్తువుల నైతము కవి తనభావనాబలంబునఁ జక్కనిశిల్పముగఁ జిత్రించి మనలఁ దలలూఁపఁజేయును. అట్టిజాలవిద్య కాధారము భావనాశక్తియే కదా !-

అంతియ కాదు కవి తాను బ్రకృతియందు దర్శించుదృశ్యములను హెచ్చించియో తగ్గించియో తనశిల్పమున కనువగురూపముగ మార్చి జీవకళలం దళుకొత్తునటులు చిత్రించును.

ఈ సందర్భమున మహాకవి కాళిదాసు "యద్యత్సాధునచిత్రేస్యా త్క్రియతే తత్త దన్యథా" అని నుడివి యున్నాఁడు.

భారతకవుల భావనాశక్తి యెంత గభీరమో వివరింప నేరితరము ! సమయోచితవర్ణనాప్రావీణ్యమున నీకవిత్రయమున కెవ్వరు నీడు రాఁ జాల రనుట సాహసము గానేరదు. అందును దిక్కనను గూర్చి వచింప నే నెంతటివాఁడను. పనికిమాలిన యలంకారములు వారిరచనములం దెచ్చటను గానరావు. తుదకు వర్ణనాంశములఁ జెప్పునప్పుడు నైతము కథావేగమునకు భంగము గలిగింపనంత తక్కువగఁ జేయుదురే గాని కథను నైతము మఱపొందించునంత దీర్ఘతమములుగ సాగింపరు.

భారత మితరగ్రంథములకన్న నెన్నియో మడుంగులు గౌరవపాత్రమగుటకుం గారణము విషయము. దానిం బ్రదర్శించినమార్గములు, శైలి మొదలగునవి. అయినఁ బ్రతివానిమనసునకుఁ దట్టిన ట్లెల్ల రచించిన కవిత్వమగునా ! యని యధిక్షేపింతురేమో- కవి యగువాఁడు దనభావానుసారము రచింపవలయు నంటినే గాని, భావముల ప్రకారము వ్రాయువారందఱుఁ గవులగుదు రని నాయభిప్రాయము గాదు. అట్టివారును రచించిన నేమిలోప మందురా ! వారియందును నొకానొకచోఁ బాండిత్య ముండిన నుండవచ్చును. అంతమాత్రమునఁగవితాంశమునకుఁబాండిత్యమే యాధారమని చెప్పఁజాలను.

రాత్రిందివములు కష్టించి నిఘంటువులును, ప్రాచీనకావ్యములును వ్యాకరణములును వల్లె వేసినంతమాత్రమునఁ గవితాంశము గల్గనేరదు. తన మనమున నెన్నియో భావములు ప్రభవించినం గదా యితరులహృదయముల బావము లుపలతిలఁ జేయుట. కావుననే కేవల శుష్కపండితులకంటెను లోక

వాసనల ననుభవించి యానందించు సామాన్యులే మేలందురు. సామ్యము వర్ణ నకుపకరణ మగునే గాని ప్రధానము గానేరదు. ఒక సొగసైనవస్తువును జూచినపుడు సామ్యము లున్నను లేకున్నను సంతోష ముదయించును. ఇటులనే సమస్తవస్తువులయందునుండు స్వతస్సిద్ధ మగుభావముల రీతులకు మానవప్రకృతులతోఁ గలసంబంధముల రీతుల వర్ణించుటయే కవితకుఁ బ్రథమగణ్యము. ఇక్కార్యమునకు సాదృశ్యనిరూపణాద్యలంకారములు తమంతఁ దాము దొరలి వచ్చిన రావచ్చునే గాని, యలంకారములు లేకుండుట యైశ్వర్యమునకు లోప మని చింతించు కుబేరసోదరులరీతి భ్రమించి యనవసర మగుతావుల నలంకారముల బలవంతముగఁ దూర్చుట కవితాప్రవాహమునకు నడ్డంకులు గల్పించుటయే గదా. అటులైన సర్వసామాన్యముగ నలంకారముల నేలవాడుదు రందురేమో దానికిని హేతువు లేకపో లేదు.

అలంకారరచన యాలోచనాశక్తికిఁ జేరినంత భావనాశక్తికిఁ జేరిన యది గాదు. కార్యోత్సాహము, భావప్రాబల్యము క్షీణించినవరికి భావనాశక్తి కుంఠితము. అందుచే రేవగ లాలోచించి దిగ్భ్రమ గల్పించు వెఱ్ఱియూహల నల్లుచుందురు. అంతమాత్రమున నదియుఁ గవిత యనఁ జెల్లునా.

"సర్కసు" లోఁ బరిశ్రమ సేయువారిరీతిఁ బదముల నెట్టులు గావలసిన నట్టుల వంచియో కుంచియో చూపినంతమాత్రమున నదియుఁ గవిత యనం దగునా. యీవిపరీతాలంకారరచనకుఁ గారణము భావశూన్యత యని తొలుఁదొల్తనే మనవిచేసి యుంటిని. అంగీకారము లేనివర్ణనములు ప్రత్యేకము నెంతయద్భుతము లయ్యును నింద్యములే. కథ యను నిండుటాకృతినిఁ దీర్పఁ జాలనివాఁడు ప్రత్యేకావయవము లనందగు వర్ణనలం దీర్పంగల్గునా! కావున విమర్శనమునఁ గథా పాత్రములు, ప్రకృతివిశేషములు, వర్ణనలు, నివి యన్నియు నెడతెగని మైత్రిఁ గలిగి యేకాకృతిగ నున్నవా యను విచారణ ప్రధానముగదా ! కథాగమనము సరికట్టు దీర్ఘవర్ణనలం జేయుట రసవిహీనమున కొకగుఱుతు కావుననే వసుచరిత్రము (శబ్దాలంకారముల) ను గూర్చి పలువురిట్లు గర్హించియున్నారు.

"ప్రాయేణ యమకే చిత్రే రసపుష్టి ర్నవిద్యతే"

"కావ్యాంతర్గడుభూతాయా సాతు నేహ ప్రపంచ్యతే"

ఇట్లు విశ్వనాథపంచాననుఁడు పలికె.

వసుచరిత్ర:—అనుప్రాసములు, శ్లేషలు, యమకాదులును, నిండుఁబెక్కులు గలవు. ఇంత యేల, వసుచరిత్రమున శ్లేషయో శబ్దాలంకారమో లేని పద్య మరు దనుట సాహసము గాదు. మఱియు నీగ్రంథమునందుఁ గైశిక్యాది వృత్తులు, వైదర్భ్యాది రీతులు, మాధుర్యాదిగుణములు, ద్రాక్షాదిపాకములు, శృంగారాదిరసములు, ఉద్దీపనవిభావాదిసంభోగశృంగారములు లోనగు నరసభూపాలీయములోని కావ్యగుణములకు లక్ష్యము లగుపద్యములు చాలఁగఁ గలవు. దీనింబట్టియే వసుచరిత్రము నరసభూపాలీయమునకు లక్ష్యగ్రంథ మందురు. లక్ష్యగ్రంథ మనుట సమంజసమే. ఏలయన, నిండుఁ జాలినన్ని కథాపరికరములు లేవు. శబ్దాలంకారములు, శ్లేష, వర్ణనానైపుణ్యము, పదాడంబరము మాత్రము గానవచ్చును. ప్రతిపద్యమును భాషామాధుర్యమును వెల్లడించు రత్నము లనవచ్చును. కాని కథాసూత్రమున గ్రుచ్చు వీలు లేదు. భట్టుమూర్తి సాహిత్యసముద్రమును మథించి రత్నములఁ బ్రోగుచేసెను, సానలఁ దీర్చి మెఱుంగు లిడినాఁడు. అంతియే గాని కథాసూత్రమున గ్రుచ్చి భారతికి సమర్పింపలేకపోయెను.

రామరాజభూషణుఁడు తనగ్రంథమున ననితరసాధ్యము లగు వర్ణనల నతిచమత్కృతిగఁ బెక్కు పద్యములు రచించినాఁ డనుట సత్యమే, యావిషయమున నాతనికిఁ గృతజ్ఞులము గావలసినదే. అయిన నేమి, యవి యన్నియుఁ గథావేగమునకు నడ్డంకు లనక తప్పదు. కథయే లేనప్పుడు కథావేగ మేమందురా- నాకును సమ్మతమే. ప్రత్యేకముగఁ జూచిన మనోహరము లయ్యును గథాంగములతోఁ బొందిక లేనివి, భావనాశక్తిచే నిరర్గళముగ వచ్చిన స్వచ్ఛందధారలును గావు. మఱి యే మందురా-సామ్యశక్తిచే శుక్తిమతీనదిని వలెనే బలాత్కారమున నంకించుకొన్న యదియే. సామ్యములు సైతము వస్తుతత్త్వములంబట్టి తటస్థించినవియును గావు. నామాదిభాషాశక్తిచేఁ గృతకము లయినవి. వే యేల భాషతోఁ జేయు నొకరకపు "కుస్తీ"వంటిది యనక తప్పదు. ఇట్లంటివని నాకు వసుచరిత్రయందు గౌరవభావము లే దని యనుకొనకుఁడు. భాషాజ్ఞానమున కిది మంచియాధారము. పదములలో నెంతటి సత్తువ యున్న దని చూడఁ గోరువారికి దీనియంత ప్రయోజనకారి మఱి యొక్కటిఁ గానము.

# నాటకరసవిచారణ.

—మల్లాది సూర్యనారాయణశాస్త్రులుగారు- రాజమహేంద్రవరము—

---

ఇంతకుమున్ను రూపకలక్షణమును గూర్చి రెండువ్యాసములు భారతికి వ్రాసియున్నాను. వానితరువాయిగా నిపు డీవ్యాసము వ్రాయుచున్నాను.

దశవిధము లైనరూపకములలో నాటకము మొదటిది. ఆంధ్రీకరణములు గాని తెలుఁగుదృశ్యకావ్యము లన్నియు సంస్కృతలక్షణము ననుసరింపక నాటకసంజ్ఞనే స్వతంత్రములుగా వెలువడుచుండుటచేతను ప్రదర్శించున దెల్ల నాటక మనియే వ్యవహరింపఁబడుటచేతను, మనభాషలో దృశ్యరూపకశబ్దములకు నాటక మనెడియర్థమే స్థిరపడుచున్నది.

నాటకములో వీరము గాని శృంగారము గాని ప్రధానరసముగా నుండవలె నని ప్రాచీననియమము కలదు. దానినిబట్టి తక్కినరసములు ప్రధానములు కాఁగూడ దని గ్రహింపఁదగును. కాని, అప్రధానములుగా నుండఁగూడ దని గ్రహింపరాదు. ఇందుకుఁ గాళిదాసాదుల శాకుంతలాదులందుఁ గనవచ్చు రసాంతరములే దృష్టాంతము. మఱియు నేదైన నొకనాటకమందు నాయికకుఁ గాని, నాయకునకుఁ గాని, యిద్దఱికిని గాని సంబంధించిన చర్యలయం దానాటకకథ కనుగుణముగా వీరమో లేక శృంగారమో ప్రధానముగా గోచరింపవలెను గాని, ఆనాటకమందలి యితరపాత్రముల మాటలయందుఁగూడ నట్టియారసమే గోచరింపవలె నన్ననియమమును లేదు; ఆనాయికానాయకచర్యలయం దైనను, అప్రధానములుగా సందర్భములనుబట్టి యితరరసములు గోచరింపరా దన్ననియమమును లేదు. అట్టివే యున్నచో, ఇపుడే సంస్కృతలక్షణము ననుసరించినయెడల రూపకరచనయందు వైవిధ్యమే కనఁబడ దనెడి యాక్షేపణము వినవచ్చుచుండ నపు డింకను జెప్పవలెనా ? పేళ్ళు వే ఱయినను శృంగారనాటకము లన్నియు నొకటిగాను, వీరనాటకము లన్నియు నొకటిగాను గనఁబడకపోవునా ? అట్లే యైనచో రసజిజ్ఞాసారసవిచారముల కవకాశమే లేకపోవును. కావుననే రసవిషయమునఁ బ్రాచీను లట్టియసంబద్ధనియమములు గావింపను లేదు; ఒకరిద్ద ఱేవో కొన్నిసూచనలు చేసినను పూర్వకవులు వానిని బాటింపనులేదు. అదిగాక:—

ఒక ప్రధానరసమునకు రసాంతరముతో సంఘర్షణ కలిగినపుడే దాని ప్రాధాన్యముయొక్క విలువ హెచ్చుటయు, దానితోఁ జూపఱచిత్తము తన్మయ మగుటయు సంభవించును. అట్లు కలుగదేని ప్రేక్షకునిభావ ముద్బుద్ధముగాక మన్నుతిన్నపామువలె నట్లే పడియుండును. అట్లనఁనేల ? రసాంతరసంఘర్షణ లేక శుద్ధముగా నొక్కరసమే వర్ణించిననాటకము లేదా ? అట్టిది రంజకము కాదా ? అని యడుగవచ్చును గాని నిజము చెప్పవలసివచ్చినచో నట్టి దెందును లేదనియే చెప్పవలెను. రసాంతరసంఘర్షణ గలనాటకములే బహుళముగా నుండుటచే, ఆమాట వాడవలసివచ్చినది కాని, ఆద్యంత మొక్కరీతిగా నొక్కరసమే వర్ణింపఁబడిన దనుకొన్న యేదో యొకనాటకమం దైనను, ఆరసమున కవస్థాభేదము కనిపింపకపోదు. అదియును గనఁబడకుండఁగా నాటకము రచియించుటయు శక్యముకాదు. అట్లు రచించిననాటకము నాటకమును గాదు.

రసము రసత్వధర్మముచే నొక్కటే యైనను, ఆలంబనవిభావనాది భేదములనుబట్టి శృంగారవీరాదిభేదములు పొందునట్లుగా, ఏరసమైనను దనయవస్థాభేదములనుబట్టి యాస్వాదగోచరరూపభేదములను బొందకపోదు. ఆభేదములకును వశముగాక బిఱ్ఱబిగిసికొని కూర్చున్నరసము రాయిగాని రసమే కాదు. ఈవిషయమునకు సంస్కృతనాటకచక్రమున నెన్నియో యుదాహరణములు కనవచ్చును. ఇందు కొకదృష్టాంతము తీసికొందము.

తీపి తియ్యఁదన మనుధర్మమున నొక్కటే యైనను, ఆతీపిలో ననేకభేదములు కలవు. బెల్లము తీపివేఱు, పంచదారతీపి వేఱు; ఈ రెంటికంటెను గలకండతీపి భిన్నముగా నుండును. తేనె తీపికిని చెఱకుతీపికిని బోలికయే కనఁబడదు. ఇట్లే, అన్నిరుచులలోను భేదము గోచరించునుగదా ! అట్లే, శృంగారమనురస మొకటేయైనను దానికి- అయోగము, సంయోగము, వియోగము- అనుభేదములను లాక్షణికులే కనిపెట్టిరి. అందు, అయోగశృంగారము దృఙ్మనస్సంగసంకల్ప జాగరకృశతారతిహ్రీ త్యాగోన్మాదమూర్ఛావర్ణనలచేతను, సంభోగశృంగారము సల్లాపసంస్పర్శనచుంబనాలింగనాదివర్ణనలచేతను, విప్రలంభశృంగారము శాపప్రవాసబంధనాపహరణాన్వేషణాస్మరణరణమరణాదివర్ణనలచేతను, ఎన్నెన్ని భిన్నగతులఁ బోషింపఁబడుచున్నదో చూడుఁడు. అట్టిభిన్నగతులే లేక, అయోగము నొక్కచూపు వర్ణించియు, సంయోగము నొక్కసమావేశనము వర్ణించియు, వియోగము నొక్కమరణమును వర్ణించియుఁ

బోధింప శక్య మగునా ? అపు డది రస మగునా ? ఇంతెందుకు ? ఒక్కసారి పూర్వనాటకములవైపు దృష్టి త్రిప్పుఁడు.

స్వప్నవాసవదత్తలోను శాకుంతలములోను మృచ్ఛకటికములోను ప్రధానరసము శృంగారమే కదా ! కాని వానిలోని రసములకు శృంగారశబ్దమునఁ దప్ప మఱెందును సామ్యము కానరాదు. ఆనాయకులపద్ధతులు వేఱు, ఆనాయికల సౌశీల్యములు వేఱు. ఆరసములకుఁ గల్గినరసాంతరసంఘర్షణలు వేఱు, ఆరసముల యవస్థాంతరములు వేఱు. వేయేల ? ఆరసపోషణవిధానములే వేఱు. అయినను, ఆమూఁడును మూఁడుదారులు త్రొక్కి మూర్ఖులహృదయములనుగూడ నెట్లు రంజింపఁజేయఁజాలియున్నవో చిత్తగింపుఁడు. కావున నేరసమైనను, రసాంతరసంఘర్షణవల్లఁ గాని, అవస్థాంతరసంఘటనమువల్లఁ గాని సముచితముగాఁ బోషింపఁబడి సహృదయహృదయాహ్లాదకర మగు ననుట నిజము. ఇక్కడ నొక్కమాట.

రసపోషణము సర్వసాధారణము కాదు. అది విశేషప్రతిభాశాలుల సొమ్ము. దృశ్యకావ్యేందిరకు, కథౌచిత్యము శరీరము, పాత్రౌచిత్య మారోగ్యము, రసౌచిత్యము జీవము. ఈమూఁడును ముఖ్యములే యైనను, అం దారోగ్యము మిక్కిలి ముఖ్యము. శరీరము సర్వావయవసంపూర్ణ మైనను, ఆరోగ్యము సరిగా లేకున్న నది రూపము చెడునట్లు కృశించును; ఆబడుగుదేహమునే యంటిపెట్టుకొని యుండి కళాహీనమై క్రమముగా జీవము క్షీణించును. కావున, ఇటు శరీరపోషణమునకును, అటు జీవరక్షణమునకును, ఆరోగ్యము ప్రధానమగుట తెల్లము. అట్లే పాత్రౌచితియుఁ గథకును రసమునకును గూడఁ బుష్టిని గలిగించును. పాత్రములు సముచితముగా నున్నంతసేపును రసము చక్కఁగాఁ బ్రవహించును. అవి తప్పుదారి త్రొక్కెనా, ఇది యెక్కడనో యంతరించును. మఱి కనఁబడదు. కావున నాటకరసశోభ యంతయుఁ బాత్రపోషణముపై నాధారపడి యున్నదనుట ధ్రువము.

పాత్రపోషణము రసపోషణముకంటెను క్లిష్టమైనది. అది నాటకజీవమైనరస ముప్పొంగఁజేయ నాధార మగుటయే యందుకుఁ గారణము. కొన్నినాటకములలో నిపుడు, ఇంద్రబృహస్పతియుధిష్ఠిరకృష్ణార్జునులవంటి యుత్తమపాత్రములసంభాషణ మానాయకులశీలములకే కాక యాయానాటకములయందలి రసములకును లోపము దెచ్చునట్లుగాఁ గనవచ్చుచున్నది. అందుచేతనే పా

త్రపోషణము క్లిష్ట మని చెప్పవలసివచ్చినది. ఇప్పుడు రంగస్థలములఁ బ్రదర్శింపఁబడు నాటకములను జక్కఁగాఁ బరిశీలించినచో రసపోషణ పాత్రపోషణములెట్లున్నవో, యెట్లుండవలెనో గోచరించు ననుటకంటె నిప్పట్టున వానింగూర్చి యధికముగా వ్రాయఁజాలను. ఇఁక నీప్రసంగ మిట్లుంచి నాటకమునం దేదో యొకటి ప్రధానరస మన్నను, రసాంతరసంఘర్షణవల్లనే దానిప్రాధాన్యము యొక్క విలువ హెచ్చు నన్నవిషయమునకు నుదాహరణముగా నుత్తరరామచరిత్రనాటకమును గ్రహించి యించుక పరిశీలింతము. *

ఉత్తరరామచరిత్రమునఁ బ్రధానరసము విప్రలంభశృంగార మని కొందఱును, కరుణ మని కొందఱును, పత్త్రికావాదము సలుపుచుండుట చదువరులెఱిఁగియుందురు. మన కిపుడావివాదముతోఁ బనిలేదు. నేను దీనిని 1909లో నాంధ్రీకరించి ప్రకటించినపుడు పీఠికలో నిందలి ప్రధానరసము సకరుణమైన విప్రలంభ మని వ్రాసియున్నాను. ఇప్పటికిని నాయభిప్రాయ మదియే.

మహాకవి భవభూతి యీనాటకము దుఃఖాంతముగా సమాప్త మగుట కిష్టపడక రామునికి మరల జానకీసమావేశము గలిగినట్లు లంతర్నాటకమున వర్ణించెనే కాని, ఆసమావేశము సత్యముకా దని యీక్రిందిమాటలవల్లనే స్పష్టపడును. "సీత అమ్మా! ఈజీవలోకపరాభవ మనుభవింపఁజాలను. నన్ను నీలో విలయము చేయుము.

వసుంధర—నామాట విని పాలువిడిచిపెట్టునంతవఱకు నీపిల్లలను జూచుకొనుచునుండుము తరువాత నీకిష్టమైనట్లు చేసెదను.

రాముఁడు—హా సచ్చరిత్రదేవతా సీతా! దీనిఁబట్టి నీవు లోకాంతరమున విశ్రమించియున్నా వనుట నిశ్చయము"

పైవిషయమును రామునియీక్రింది వాక్యములు గూడ బలపఱుచుచున్నవి.

"వానరసేన గూర్చుకొని వారిధిదాఁటి విచిత్రమైనక
య్యానకు లోక మచ్చెరువునందఁగ రావణుఁగూల్చుదాఁక ము
న్నైనవియోగ మోర్చుకొననయ్యె, ననంతము ఘోరమైన యీ
జానకివిప్రలంభ మిఁకఁ జచ్చెడిదాఁక సహింపనయ్యెడిన్"

---

* ఈనాటకమును నేనాంధ్రీకరించితిని గావునఁ పాఠకులెల్లరకును తెలియుటకై యందలి శ్లోకములకు బదులుగాఁ దెలుఁగుపద్యము లుదాహరించితిని,

అయినను గవి నాటకము శుభాంతముగా సమాప్తి నొందించుటచేతను, కథ భార్యాభర్తలవియోగదుఃఖముతో నిండిన దగుటచేతను, ఇందలిరసము సకరుణవిప్రలంభ మనవలసివచ్చినది, గాని, లేకున్న నిందుఁ బ్రధానరసము కరుణ మనియే చెప్పవలసివచ్చును. దీనివల్ల నాటకలక్షణమున కవిరుద్ధముగా నిందు విప్రలంభశృంగారము ప్రధాన మైన దనియు, దానికిఁ గరుణముతో సంఘర్షణము సంభవించిన దనియు విదిత మగును. ఇఁక నిందలి రసపోషణవిధాన మెట్లున్నదో చూతము. భవభూతిమహాకవి ప్రస్తావనలోనే-

"అవనిపుత్త్రి మహాసాధ్వి యఖిలపూజ్య
యైనవైదేహియెడ నింక లాఁమజనము
రక్కసునియింట నుంటయే లెక్క చేయు
నమ్మహాగ్నిపరీక్షను నమ్మఁబోదు."

"కాని యీలోకాపవాదము మనమహారాజుచెవిని బడెనేని మిక్కిలి కష్టము సంభవించును జుమీ! అయినను మునీంద్రులును దేవతలును సర్వవిధముల శ్రేయస్సు సమకూర్పఁగలరు."

అనునటీసూత్రధారుల సంభాషణమున లోకాపవాదరూప మయినప్రథమాంకార్థమును, తజ్జన్య మైన సీతాప్రవాసవిప్రయోగమును, ఆమెను గంగాతమసావసుంధరాదులును వాల్మీకియు రక్షించుట యనునితరాంకార్థమునుసూచించుచుఁ గథాబీజమును విప్రలంభరసమునఁ దడిపి నాటి, ఉద్దిష్టరసోచితముగాఁ గల్పించిన వసిష్ఠసందేశమునకు రాముఁడు-

"ప్రజలయారాధనంబె నాప్రాణపదము
దానికై స్నేహమును గాని దయను గాని
సౌఖ్యమును గాని తుదకు నీజనకతనయఁ
గాని విడిచెదఁ జింత యింతేని లేక"

అని సమక్షమున నున్నసీతకూడ మెచ్చునట్లుగా బదులు పలికిన దానవీరసూచక మగు నుదారవచనముల దోహద మొనర్చి, దుర్ముఖునివలన సీతాపవాదము విని దుఃఖించి "దేవి! నీపాదపద్మస్పర్శము రామునిశిరస్సున కిదియే కడపటిది" అని కన్నీరు విడుచుచు నిద్రించుచున్న సీతపాదము లొక్కసారి నెత్తిని బెట్టుకొని యామెను విడిచి వెడలిపోవు రామునిదురంతసంతాపమును బ్రకటించుట యనునెపమున మొలకెత్తించెను. కవి యిట్లీయంకమున నాద్రి

యందు విప్రలంభము సూచించి యంతమందు దాని రూపము గనఁబఱిచియు, మధ్యభాగమున నందంను విప్రలంభశృంగారచ్ఛాయ కనవచ్చునట్లుగా శృంగారమునే వర్ణించెను. అది సముచితమే. అతిపవిత్రము నతిగాఢము నైనసీతారాముల యన్యోన్యానురాగమును దనివిడీఱ నాస్వాదించినపుడే కాని తరువాత వర్ణింపఁబోవు వారిదురంతవియోగసంతాపము సామాజికులహృదయముల నొక్కమాఱుగాఁ జుఱుక్కున నాట దనెడియుద్దేశముతోనే కవి యట్లు వర్ణించెను. అందుకే చిత్రప్రదర్శనము తెచ్చిపెట్టెను. అందును, ఏవి రాముని నిర్మల ప్రేమామృతమున సీతహృదయము నోలలాడించి పరవశముగావించునో, ఏవి యాయనుకూలనాయకుని నిష్కల్మషహృదయము విప్పి సాభిజ్ఞానముగా జానకికన్నులకుఁ గనఁబఱుచునో, అట్టివిషయములే ముఖ్యముగాఁ బ్రదర్శించెను. అదేకదా రసపోషణపద్ధతి! ఇట్లు చిత్రప్రదర్శన మొక్కరసపోషణమునకు నిదాన మగుటయే కాదు. మొత్తము నాటకకథ కంతకును మూలాధారమై నిలిచినది. అదిగదా కథాసన్నివేశపద్ధతి!

తనమూర్ధాభిషేకమహోత్సవము చూడవచ్చిన జనకమహారాజు కొన్ని దినము లుండి మరల మిథిలకు వెళ్లుటచేఁ దండ్రియెడఁబాటున వికలచిత్తయైనప్రియురాలి మనోవేదన నసాధారణ వినోదోపాయమున నపనయించి యామెమనస్సు త్రిప్పుటకై రాముఁడు చిత్తరువు నిర్మింపఁజేసినట్లు కవి యాతనిచే నొక్కమాటపలికించెను గాని,కథాసన్నివేశమున కనుగుణము లైనప్రయోజనము లెన్నో యాచిత్రప్రదర్శనమున నిమిడియున్న వనుట నిజము. ఇఁక నొక్కగంటలో సీతారాములకు దీర్ఘవియోగము సంభవింప నున్నది గావున, ఆయనుకూలదంపతు లావివాహముగా గృహమందును వనమందును చిన్నతనమునను యౌవనమునను మనసారఁ గ్రోలిన యనురాగరసమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని యానందించుటకును, తనవియోగమున రాముఁడు పడ్డశ్రమదుఃఖములను సీత చూచి తనయెడ నతనికిఁ గలనిత్యసత్యప్రేమ నింక నెక్కుడుగ విశ్వసించుటకును, గర్భములోని కుశలవులకు జృంభకాస్త్రప్రదానము చేయించుటకును, సీతను గంగావసుంధరల కప్పగించుటకును, వసిష్ఠుని యానతి కనుగుణముగా సీతకోరిన గంగాస్నానతత్తీరవిహారరూపమైన గర్భవాంఛ ననుగ్రహించుటకును, ఆకోరికయే నెపముగా లోకాపవాదభీతుఁడైనరాముఁడు సీత నడవిలో విడిచిపెట్టించుటకును, రాఁబోవుసంకటములలోని కథారసములకు రా

చబాట వేయుటకును, గ్రంథకర్త చిత్రప్రదర్శనము కల్పించెను. ఇఁక నిందు శృంగార మెట్లు వర్ణింపఁబడెనో చూతము.

దేశకాలవేషాదిక మైనవిభావము కారణముగాఁ బరస్పరానురక్తు లగు యౌవనవంతులయానందాత్మక మైన సుఖానుభవమే రతి. అదియే శృంగారము. ఇందుకు దేశవిభావకారణ మగుసీతారాములసుఖానుభవముచూడుఁడు-

—। ప్రస్రవణాద్రిదర్శనము విషయము ।—

"తలఁతువె లక్ష్మణుండు బహుభా పరిచర్యలు చేయ దానిపై
నలరుచు నున్నయాదినము? లాసరసోదకగౌతమీనదిన్
దలఁతువె? దానిచెంతఁ బులినంబుల. ముచ్చటలాడుచున్నయుం
దలఁతువె? నాఁటిపర్తన మెదం దలఁతే లలితాంగి జానకీ!

మఱియు నొక్కమాట. ఇది యెప్పుడైనఁ దలఁచెదవా ప్రేయసీ!
ఒక్కొకబాహుతోడ నొడలుబ్బఁగ బిగ్గఁ గవుంగిలించి ను
న్నెక్కిళు లొక్కటై కదియ నెమ్మదిగా మన మేమియేమి యో
మక్కువమీఱ మాటపయి మాటగ ముచ్చట లాడుకొంచు ను
న్నక్కడినాఁటిరాత్రి నలుయామము లంతనె యంతరింపవే?"

(అలసిపోయిన సీత బుజమును దనమెడమీఁదఁ జేర్చుకొని రాముఁడు సంతోషముతో)

"అరయంజాలను దుఃఖమో సుఖమొ మూర్ఛావస్థయో నిద్రయో
గరళావేగమొ మత్తొ నీవు ననుదాఁకం బుట్టి నాయింద్రియో
త్కరముం ద్రొక్కి మనోవికార మొకఁ డేకాకారమై లేచి యాం
తరచైతన్యము నంతలోఁ గలఁచు నంతం దేర్చునేమే సఖీ!

సీత—ఇందాశ్చర్యమేమి? మీానిశ్చలానుగ్రహ మట్టిది.

రాముఁడు—అపుర నీమాటలరయఁ గర్ణామృతములు
మానసరసాయనంబులు మ్లానజీవ
పుష్పవికసనములు నంగమోహనంబు
లగుచు నానందపెట్టు న న్నంబుజాక్షి!"

ఇంక నిట్టి వెన్నో కలవు గాని గ్రంథవిస్తరభీతిచే నుదాహరింపనైతిని. మార్దవము తప్పక హాయిగొలుపు శృంగారరసమర్యాద కీయుదాహరణములు చాలవా? కాని విప్రలంభచ్ఛాయతోడి శృంగారమునకుఁ గూడ రెండుమూ

టలు చదువుదము. తనఱొమ్ము నానుకొని నిద్రించినసీతను జూచి రాముఁడు-

"నానిలయంబులక్ష్మి యిది నానయనామృత మీమెతాఁకు నా
మేన నలందుచందనము, మేలగుముత్తెపుదండ నామెడం
బూనిన యీభుజంబు తనువు న్నను నీమెకుఁ జెందినట్టిదే
వైనను, గాని యీమెవిరహంబు భరింప నశక్య మెంతయున్"

అన్నమాటలలో, పైమూఁడుపాదములందును బ్రియాసౌందర్యసౌశీల్యాస్వాదరూప మగుశృంగారము గోచరించుచున్నది, నాల్గవపాదములో ననుభూతవియోగస్మరణముతో నాగామివిరహము సూచిత మగుచున్నది. ప్రస్తుతసంబంధియు భిన్నార్థము నై యాకస్మికముగ వచ్చిన యిట్టిమాటకు గండ మని లాక్షణికులు పేరుపెట్టిరి. ఇట్లు రాముఁ డనుకొనుచుండఁగానే దుర్ముఖుఁడు వచ్చి లోకాపవాదము నెఱిఁగించెను. అది మొదలుగాఁ దక్కిన ప్రథమాంక కథ యంతయు విప్రలంభముతోనే నిండిన దగుట విదితమే కదా! మఱియు నిందే హావభావవిభావాదివర్ణనమున శృంగారమును బోషించుచు దాని ప్రక్క భార్గవ శూర్పణఖాదర్శనమున భయానకమును, సీతాహరణదర్శనమునఁ గరుణమును, వర్ణించుచు దానికి మెఱుఁగుపెట్టిన భవభూతిరసపోషణచాతుర్యము నిం దెంతని వివరింపవచ్చును? దీనివలన రసాంతరసంఘర్షణము లేక యేరసమును శోభిల్ల దనుటమాత్రమే మన మిపుడు గ్రహింపఁదగును.

తరువాత ద్వితీయాంకమున సీతావృత్తాంతము స్మరించు నాత్రేయీవాసంతీసంభాషణ మంత యుఁ గరుణమయ మనియే చెప్పవచ్చును. రాముఁడు శంబూకవధనెపమున జనస్థానమును, బంచవటిని, బ్రవేశించి మున్ను సీతతోఁ గలసినివసించిన యాయాప్రదేశములు చూచి విచారించు సందర్భమున నున్న కథాభాగమంతటను, నాటకలక్షణమునకు లోఁబడి విప్రలంభశృంగారముకూడ స్ఫురించుచున్న దనవలసి వచ్చునేమో కాని నిజమున కందు, కరుణమే విస్తరిల్లిన దని చెప్పవలెను. ఇందుకు రాముని యీక్రిందిమాటలే ప్రమాణము.

"తనువుననుండియుండి యెగఁదన్నెడు తీవ్రవిషద్రవంబు రీ
తిని, మును డొక్కలో నణఁగి దెబ్బఁజలించిన ముళ్ళుముక్కలా
గున, సెలలెత్తి బద్దలగు గుండియలోని రణంబుమాడ్కి, నా
వెనుకటిశోకమే మరల వేఁపఁగఁ జొచ్చెను నూతనంబుగా."

"అక్కట! యింట నున్నగతి నాకమలాక్షిని గూడి పెక్కు నా
ళ్ళెక్కడనుంటి? దేనికథ లెప్పటికప్పుడె యూరుచుండు మా

కక్కసమనీయపంచవటి నాసతి మాపినపాపి రాఘవుం
డొక్కఁడు నిప్డు డెట్లు కనునో ? చని చూడక యెట్లుపోవునో ? ”

‘ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే’ అను ప్రసిద్ధికిఁ బాత్రమైన యీనాటకమందలి కథాకల్పనము నిరుపమాన మగుటచే నిం దీగుణ మున్నది యిది లేఁ దని చెప్పవలసిన యవసరమే కనఁబడదు గాని, అందును, ప్రథమాంకమందలి చిత్రప్రదర్శనము తృతీయాంకమునందలిసీతా రామసమాగమము సప్తమాంకమందలి యంతర్నాటకము ననునవి మూఁడును నాటకేందిరకు మూఁడురత్నహారము లనుట యతిశయోక్తి కాదు. మఱియును—

“కవి చతురానన ప్రతిభఁ గల్పితమైన విచిత్రసృష్టికిన్
దవిలినదేశకాలసురదానవమానవవృత్త మెల్ల ని
క్కువ మనునట్లుగా నెదుటఁ గూర్చి చూపఱ చిత్తముల్ సుఖా
ర్ణవమున నోలలార్చు కృతిరాజము రూపకమే తలంపఁగన్.”

అనులక్షణమునకు లక్ష్యముగాఁ దగిన యిందలితృతీయాంకమునఁ గవి యుద్దేశించిన సకరుణవిప్రలంభము పూర్తిభవించి రాతినిగూడఁ గరఁగించున ట్లున్న దనుటయు నతిశయోక్తి కాదు. అదియుంగాక, గంగా యమునా సరస్వతులవలె విప్రలంభ కరుణసంభోగశృంగారములు కొంతవఱ కెడనెడఁ గలసి ప్రవహించుటయే దీనిప్రత్యేకప్రశంసకుఁ గారణ మనుటయు యథార్థోక్తికాక పోదు. ఇట్లు శృంగారాదిరసములు స్ఫురించుచున్నను, ఈనాటకమందలి విప్రలంభము విశేషించి దుఃఖాత్మకమే యగుటచే, కవి యిందలి ప్రధానరసము కరుణమనియు శృంగారాదు లప్రధానరసము లనియుస్వాభిప్రాయమును తమసా వాక్యమున నిట్లు వెల్లడించియుండెను.

‘కరుణరస మొక్కటే వేఱుకారణముల, వేఱువేఱువిధంబులమాఱుచుండు
సలిలమొక్కటె బిందుతుషారభంగ, బుద్బుదావర్తరూపముల్ పొందునట్లు’

ఈయభిప్రాయము నౌచిత్యమును గొంతపరిశీలింతము.

రంగము పంచవటి రాముఁ డచ్చటికిఁ గార్యాంతరప్రసక్తిచే వచ్చెను గాని సీత కనఁబడు నని రా లేదు. ఆవిరహ మట్టిదగుటచే నతని కట్టిసంకల్పము జనించుటకే వీలులేదు. ఇఁకనో, గంగాదేవి పన్నినయుపాయమును బట్టి కుశలవుల జన్మదినోత్సవసందర్భమున సూర్యు నారాధించుట యను నెపము పెట్టి తమసాదేవి సీత నచ్చటికిఁ గొనివచ్చెను గాని యిఁకఁ దనజన్మములో రాముని దర్శింతు నన్నయాశ యామెకును లేదు. అట్టియెడఁ బరస్పరసందర్శనమున

నిరాశ చెందియున్నవారి యవస్థలఁ గరుణముగాక విప్రలంభ మెట్లు గోచరించును ? కాని యిం దొక్క విశేషము.

సీతారాములు చిరకాలము నివసించిన పంచవటిలోఁ బ్రవేశించిరి. అందలి చిరపరిచితము లయిన ప్రదేశములును మృగపక్షిపాదపాదులును వారిస్నేహసల్లాపక్రీడాదులకు సాక్షులయి యున్నవి. అవి వారికిఁ గనఁబడక మానవు. వాటిని జూచి తమపూర్వవృత్తాంతము స్మరించుకొని తమవియోగ మానాఁడే వచ్చినట్లు గా వారు దుఃఖింపక పోరు. ఆపట్టున వారిచేష్టలయందు విప్రలంభము గోచరించుట సహజమే కాని యదియుఁ గరుణమయముగానే యుండు ననుటయు సహజమే. వారిద్దఱికిని బ్రాణసఖి యు వనదేవతయు నగు వాసంతి రామునికిఁ దోడు, ఆదంపతుల శ్రేయమే కోరుచున్న తమసాదేవి సీతకుఁదోడు, వారిద్దఱికిని వీరిద్దఱు కనఁబడరు. వీరిమాటలు వినఁబడవు. వీరిరువురికిని వారి రువురు కనఁబడుదురు. వారిమాటలు వినఁబడును.

"విమానరాజనూ !" యన్న రామునికంఠస్వరము వినఁగానే, ఉఱుము విన్న బాలమయూరికిఁబోలె సీతకు విలాసరూప మగుసాత్త్వికభావ ముదయించెను. చిక్కి పాలిపోయియున్న యతనిఁ జూడఁగానే యామెకు విరహవికారమైనమూర్ఛ వచ్చెను. పంచవటిని జూడఁగానే హృదయమున దాఁగియున్న విరహదుఃఖ ముబుకుటచే రామునికి మూర్ఛ వచ్చెను. అతని యవస్థ చూచిన సీత హృదయమును దుఃఖాగ్ని దహించెను. ఈపట్టున శృంగారవిప్రలంభకరుణము లెట్లు మెలివేసికొనుచున్నవో కనిపెట్టుచుండుఁడు.

సీత రాముని లేవనెత్తెను. రాముని యానందమునకు మేర లేదు. సీత "నా కిపు డిదే యెక్కువ" యనుచుఁ బతిస్పర్శసుఖపరవశ యయ్యు నయ్యానందమును శంకాభయములతో నాస్వాదించెను గాని, రాముఁడు సీత కరస్పర్శమున జనించిన పరమసుఖమున మై మఱచి, తమ యప్పటివియోగము మాటయే మఱచిపోయి జానకితో నున్నట్లే యి ట్లానందించెను.

"పరమాహ్లాద మొనర్చి జీవనము నాపాదించి రక్షించునీ
కరసంస్పర్శము మున్నెఱింగినదె నిక్కం బౌర ! చిత్తవ్యథా
భరజాతం బగుమూర్ఛ నిప్పు డిది పోవం ద్రోసి యానందసం
భరితం బౌజడభావ మంగములఁ బర్వం జేయు నూత్నంబుగా".
"ఘనవియోగమున నాకస్మికఘటనచే బరవశం బయి మ్రానుపడినయట్లు
భర్తదుఃఖంబునకు దుఃఖపడినయట్టు, ఘనతరంబగు ననురక్తిఁ గరఁగినట్లు"

సీతహృదయ మానందించెను. మరల నింకొకసారి రాముఁడు మూర్ఛిల్లెను. సీత యతని స్పృశించినది. రాముఁడు మూర్ఛదేఱి యామెచేయి పట్టుకొని వాసంతితో—"ప్రేయసీసంస్పర్శసంజనిత మైనశృంగారభయముచే నా నందమగ్న మై నాయొడలు పరవశ మగుచున్నది. ఈచెయ్యి నీవుకూడఁ బట్టుకొనుము" అనుచు స్పర్శజన్యరతి ననుభవించెను. చేయూడఁదీసికొని యు-
సీత—"మగనిఁ దాఁకినసుఖముచే గగురుపాటు

చెమట కంపంబు గదురు నీ విమలతనువు

గాలిఁ గదలుచు వాన చుక్కలకుఁ దడిసి

మొగ్గదొడిగిన కడిమిసొంపును వహించె."

అని తమస యన్నట్లుగా సాత్త్విక భావంబు లంకురింప నానందపరవశురాలయ్యెను. చూచితిరా! కరుణములో విప్రలంభములో సంభోగశృంగార మంత చక్కఁగా నిముడునట్లు వర్ణించిన కవిరసపోషణచాతుర్యము! ఇఁకనో, భార్యాభర్తృవియోగమునకు సంబంధించిన దగుటచే విప్రలంభముపేరుగూడ వెన్నంటి వచ్చుచున్నను, ముందుముందు కరుణమే సార్వత్రికమై రసాంతరసంఘర్షణ గాంచుచుఁ దఱిమెనఁబెట్టినట్లు తళతళలాడుచుండును.

పా లెంతతియ్యగా నున్నను, పంచదార కలసినప్పటితీపి రాదు. అట్లే రస మెంతయాస్వాద్యమైనను రసాంతరము కలసినప్పటి మాధుర్యమును దానికిరాదు. వీరమునుండి యద్భుతమును, రౌద్రమునుండి కరుణమును బుట్టునట్లే కరుణమునుండి క్రోధముగూడ జనియించి యాస్వాదగోచర మగును. ఇందుకీయుదాహరణములు చూడుఁడు.

"రాముఁడు—ఓపౌరజానపదులారా! మహాత్ములారా!

జానకి యింటనుండుట యసమ్మతమయ్యెను మీకుఁ గావునన్

గానఁ దృణంబుమాడ్కి విడనాడితి మీ కపుడైన జాలి యిం

తేనియుఁ బుట్టెనే? మది దహించెడు నప్పటిభావముల్, దయా

హీనుఁడ దిక్కులేక యిపు డేడ్చెద మీర లనుగ్రహింపుఁడీ!"

మఱియును జనకుఁడు (నాల్గవయంకము) సీతను దలఁచి దుఃఖించి "హాకుమారీ! పతివ్రతాశిరోమణీ!

"అనుచితనింద భర్త విడనాడినయట్టి పరాభవంబు కా

ననగతి కాన్పువేదన యనన్యసహాయత దుఃఖవార్ధి ముం

చినతఱి దుష్టజంతువులు చేరినయప్పుడు భీతిచెంది 'నా
యన' యని యెన్నిసార్లు హృదయంబున నన్నుఁ దలంచితోకదా!"
"అహాహా! దురాత్ము లగుపౌరుల నిర్దయత్వము?
ఆహా! శ్రీరాముని శీఘ్రకారిత్వము" అనుచుఁ గార్గ్యకమెత్తనా శాప మివ్వనా యని లేచెను. పైస్థలములయందు కరుణముతోఁ గ్రోధము పుట్టినట్లున్నది గాని దాని కతికినట్లు గా లే దనుటయే రసరసాంతరసంఘటనమందలి కవినైపుణిని వెల్లడించును. ఇట్లే రసాంతరసంఘటనమున కుదాహరణము లిం దేని చూపవచ్చును. అయిన నింకొకటి రెండు :—

శృంగారవీరకరుణాదు లెనిమిదిమాత్రమే రూపకప్రధానరసములుగాఁ బరిగణింపఁబడినను, తక్కినవి యం దుపరసములుగా నుండుట కాటంకము కనఁబడదు. సుప్రసిద్ధరూపకము లన్నిటియందును రూపకేతరరసములు సందర్భోచితముగా వర్ణింపఁబడుటయే యిందుకుఁ దార్కాణము-అట్లే యిందును.

అరుంధతీకౌసల్యలు లవుని జూచి ప్రేమించి దగ్గఱకుఁ బిలిచి యొడిలోఁ గూర్చుండఁబెట్టుకొని 'సీత మొగమే వీనిమొగ' మని యానందించుచున్నపుడు జనకుఁడు మనుమనిఁ జూచి హృదయమున వాత్సల్య ముప్పొంగ—

"అనుగుంగూఁతురిచాయ రాముఋచి తా నచ్చొత్తినట్లుండె నీ
తనియుం దీముఖకాంతి యీమొదలిసౌందర్యంబు నీవాణి యీ
వినయం బీయనుభావ మయ్యెవియ, హా విశ్వంభరానందినీ
తనయా! నాహృదయంబు చంచలగతిన్ ధావించు వేదారుల౯.

అనుచు విచారించె. ఇందు వత్సలముతోఁ గరుణమైక్యమైనది. మఱియు నేనాటకమం దైనను, కథాసన్నివేశ మొక్కరసమునకే యనుగుణముగా నుండ దని యింతకుమున్ను చదివియుంటిమి. ఆయభిప్రాయమునకుఁ దగినట్లుగా నిందును, ప్రధానరసమును వెనుకవేసికొనియు దానిని గప్పిపుచ్చియు హాస్యవీరాద్భుతాదిరసములు ముందుకు వచ్చినచోట్లును గలవు. ఇందుకు వాల్మీకి శిష్యసంభాషణమును, లవ చంద్రకేతు సంవాదమును, జృంభకాస్త్ర మహిమయు మున్నగునవి యుదాహరణములు. పోరాటమునకు డీకొన్నలవ చంద్రకేతువులు పరస్పరము చూచుకొని స్నేహావివశు లగుటయు, ఆసందర్భమున సుమంత్రుఁడు లవుని జూచి సీతకొడు కేమో యని భ్రాంతిపడి కన్నీరు విడిచి, "హృదయమా! వేషధారిఁ బడెద వేమి?

“నీదు మొలకెత్తునభిలాషకాదియైన, బీజమును ముందుగా దుష్టవిధిహరించె
హృదయమా! యొక్కడైనను మొలకలుకోసి, నట్టితీఁగకు మొగ్గలుపుట్టునొక్కో?”

అని విచారించుట యు, తన్ను లాలించిన సుమంత్రునితో “ పెదనా యనగా రనపత్యులై యుండ సూర్యవంశమునకుఁ బ్రతిష్ఠ యేది?” యనుటయుఁ గథలోఁ జక్కఁగా నతికిన భవభూతి పూర్వోక్తమయిన రససంకీర్ణతను మనస్సున నుంచుకొనియే లవునిచే “అబ్బా! రసక్రమము మిశ్రీకృత మగుచున్నది” అని పించెను. రసాంతరసంఘటనము చేతనే రసముయొక్క విలువ హెచ్చుననుట కీనాటకకర్త వచనమే పరమప్రమాణము. ఇఁక నీనాటకప్రాణములలో నొకటియైనవిషయ మిం కొకటి యున్నది. అది రామకుశలవుల సమావేశరంగము. ఈనాటకమందలి ప్రతిరంగము ప్రదర్శనమున రక్తి కట్టునదే యైనను, దీనివలె సామాజికులను చిత్రప్రతిమలఁ గావించునది యంతర్నాటకరంగము తప్ప వేఱు లే దేమో యని నాయనుమానము. ఇందలి వీరభక్తివత్సలకరుణ శృంగారవిప్రలంభముల యేకీభావమే యిందుకుఁ గారణము.

దాండాయనునివల్ల లవునికిని రామసేనకును సంగ్రామము సంభవించినమాట విని కుశుఁ డుగ్రుఁడై విల్లుచేపట్టి వీరోక్తులు పలుకుచువచ్చుచుండ నతనిఁజూచి రాముఁడు “ఈపాపఁడు వచ్చు వీరరసభాసురమూర్తియో దర్పమోయనఁగ” అనుచు శాంతముగా నతనిఁ బ్రశంసించెను. అప్పుడు లవుఁ డన్నను గలసికొని రామాయణకథానాయకుఁడైన శ్రీరామమూర్తి యిచ్చట నున్నాఁడు, వినయముతో రమ్మని చెప్పఁగా నతఁ డందు కంగీకరించి యట్లే వచ్చి ఆమహనీయునింజూచి భక్తిరసం బుప్పతిల్ల,

““ఏమియనుభావ మేమిరూ పేమిమహిమ!
అహహా! రామాయణకవీంద్రుఁ డనఘుఁడైన
యర్హనాయకు సమకూర్చి యర్హదివ్య
ఫణితి వాగ్దేవి నుపయోగపఱిచెఁగాదె”

అనుచు స్తుతించి రామునికి నమస్కరించె. రాముఁడు నతనిఁ గౌఁగిలించుకొని పుత్రాలింగనసంజనిత మగు నానందాబ్ధి నోలలాడెను. ముప్వురు నొక్కచోఁ గూర్చుండిరి. రాముఁడు కుశలవులయాకారసంపద పరిశీలించి వారు తనపుత్రులే యని సాభిజ్ఞానముగాఁ దనమనస్సునకు సరిపెట్టుకొనుచు వీరి నడిగి తెలిసికొందునా యని కన్నీరు విడిచెను. ఈసందర్భమున లవుఁ డన్నమాటకు బదులుగాఁ గుశుఁ డిట్లు పలికెను.

"ఆఁ తమ్ముఁడా! ఏమిది?
ఆయెను సీతలేనిబ్రతు కక్కట! దుఃఖము రాదె యేనికిన్?
ప్రేయసి పోయినన్ జగము పెద్దయరణ్యము, వారిప్రేమ మ
జ్ఞేయ మపార మీవిరహసింధువు, దీని నెఱుంగవొక్కొ? రా
మాయణ మెన్నఁడుం జదువనట్టులు ప్రశ్నలు వేయఁజూతువే?''

రసము నటనిష్ఠము కాదు కాని, ఇందలిప్రతివాక్యము చదువునపుడును అనుకార్యకుశుఁడుగూడఁ గంటనీరు పెట్టకపోఁ డనుచో, కరుణరసమూర్తి యై యెదుట నున్నయనుకార్యరాముని జూచుసామాజికులహృదయము కరుణాపారము గాంచుననుట కాశ్చర్యమేమి? తరువాత-

లవుఁడు చదివినశ్లోకమున రాముఁడు మందాకినీతీరవనవిహార సమయమందలి సీతతోడి ప్రణయక్రీడాప్రసంగము స్మరించుకొని తన్మయుఁ డై సీతను మనసున నిలిపి సలజ్జస్మితస్నేహముగాఁ బలికిన యీక్రిందివాక్యముల నతనిభావ మెట్లు స్ఫురించుచున్నదో చూడుఁడు.

"శ్రమజలశీతలం బయి నిరాభరణోజ్జ్వల కర్ణపాళిర
మ్యము నయి పత్త్రభంగమలినాకృతిఁ జెందని చెక్కులన్ మనో
జ్ఞమునయి యేటిగాలి కలకల్ చలియించి పడంగ, వాని మ
ధ్యమునఁ జెలంగుఫాలరుచు లారిన నాఁటిమొగంబు నెంచెదన్"

మహాకవి భవభూతి సకరుణవిప్రలంభమును ప్రధానరసముగాఁ గై కొనియు, కథౌచిత్యమునకుఁ బాత్రౌచిత్యమునకు సరిపడునట్లుగా సహృదయహృదయరంజక మగునట్లుఁగా రసాంతర సంఘర్షణము గావించుచు రసౌచిత్యము పాటించుచు నీ నాటకమును శుభాంతముగా సమాప్తి నొందించుచు,

"కనకవిగ్రహమూల మీకనకగాత్రి, పుణ్యచారిత్ర నీదేవి భూమిపుత్రి
యీమె సహధర్మచారిణి యై మెలంగ, నశ్వమేధం బొనర్పు ధర్మానురక్తి.

అనుచు నరుంధతిచే సీతను రాముని కప్పగింపఁజేసెను. నేను నీవ్యాసమును పాఠకలోకమున కప్పగించితిని. ఇట్లు నాటకరసవిచారణ చేయుసందర్భమున నేను గావించిన రసనిరూపణమందును, రసవిచారణార్థమై యుదాహరణముగాఁ గైకొన్న యుత్తరరామచరిత్రరసమును బరిశీలించుటయందునుగల లోపములను మన్నించిపాఠకులు గుణములు గ్రహింతురుగాక యని కోరుచున్నాను.

# ముద్రారాక్షసము.

—ఓలేటి వేంకటసుబ్బారాయశాస్త్రిగారు—విజయనగరము.

---

విశాఖదత్తమహాకవి రచించిన ముద్రారాక్షసనాటకము నాటకలోకమునఁ బ్రఖ్యాతిఁబడసిన విషయము సర్వజనవిదితమే. ఈకవి చాలశ్రమపడి తనగ్రంథమును నిపుణముగా రచించియున్నాఁడు. ఈనాటకమందలి ప్రధాన రస, నాయక విషయముల వాదోపవాదములు జరుగుచున్నవి. ఆవాదముల విషయమున నాకుఁదోఁచినరీతిగఁ గొంతవఱకు విమర్శించి సహృదయలోకమునకు వెల్లడింప నుత్సాహము గల్గుటచే దీనిని వ్రాయఁబూనితిని. కాన దీనిలోనున్నగుణలేశముల గ్రహింప సహృదయులగు విమర్శకులఁ బ్రార్థించుచున్నవాఁడను.

కావ్యమునకు రసమే జీవనము. జీవనము లేని యేదియు శోభింపదు. అట్టిజీవన మగు నంగిరసముఁగూర్చి పలువురు పలుతెఱంగుల నద్భుత మనియు వీర మని యు ను వాదములు జరుపుచున్నారు. అద్భుతవాదు లీక్రిందియుక్తులఁ జూపుచున్నారు.

(1) వీరరసమునకు స్థాయి యగునుత్సాహమున కాలంబనవిభావము క్షత్రియుఁడు గాని వీరభటుఁడు గాని కావలయును. ప్రకృతనాటకమున నాలంబనవిభావముగా, చంద్రగుప్తుని దీసికొనిన నతఁ డుదాసీనుఁడును, శూద్రుఁడును గాన నర్హుఁడుగాఁడు–చాణక్యుని దీసికొనిన నతనియందు నుత్సాహ మున్నను క్షత్రియవీరభటాన్యతరుఁడు గాక బ్రాహ్మణజాతివాఁ డగుట నర్హుఁడు గాఁడు- కాఁబట్టి యిట నంగి వీరరసము కాకపోఁగా నద్భుతమే ప్రధానరసము.

(2) వీరరసమునకు స్థాయి యగునుత్సాహమున కుద్దీపనవిభావాదులు ప్రకృతనాటకమున నసమగ్రముగా లక్ష్యము లగుచుండుటచేతను నద్భుతరసస్థాయి యగువిస్మయమునకు విభావాదు లన్నియుఁ గాన్పించుటచేత నిట ప్రధానరస మద్భుతము.

(3) వ్యాఖ్యాకర్తలు "కర్తా సౌ నాటక స్యాద్భుత రసవిలస త్సంవిధాన ప్రవీణః" "అద్భుతరసవిషయక స్యాస్య నాటకస్య" మొద లగువానిచేఁ బ్రధానత్వ మద్భుతమునకే యిచ్చిరి.

(4) సామాజికులచే వీరరస మనుభూయమానము గాక యద్భుతమే యనుభవింపఁబడుచున్నది.

(5) అంగీకరించినవారు నద్భుతమే ప్రధానరస మని భావించి యాంగీకరించిరి.

“అద్భుతరసే హి విస్మయః స్థాయీ అద్భుతకర్తా పురుష ఆలంబనమ్, తదనుగుణా శ్చేష్టాదయోఽనుభావాః విస్మయజనకాని లోకోత్తరకర్మాణి ఉద్దీపనాని ఏతదనుగుణా ఏవ చ సాత్త్వికవ్యభిచారిణః” అని లక్షణము.

ఈనాటకమునఁ బ్రతిస్థలమున విస్మయము నిపుణముగా నిరూపింపఁబడుటను, అద్భుతకర్త చాణక్యుఁ డాలంబనవిభావ ముండుటను, రాక్షసప్రయోగాదు లుద్దీపనవిభావము లుండుటను, చాణక్యోపదేశపురస్సృతరాక్షసప్రయోగనిరాకరణము లనుభావము లుండుట, నిట నద్భుతరసమే ప్రధానము.

అంగిరస మద్భుత మైనచో “వీరశృంగారయో రేకః ప్రధానం యత్ర వర్ణ్యతే తదేవ నాటకమ్” అనునాటకలక్షణము ప్రవర్తించుట యె ట్లని కొందఱిమతము. కాని యానందవర్ధనాచార్యులుగారు “ప్రసిద్ధే పి ప్రబంధానాం నానారసనిబంధనే, ఏకో రసోఽంగీకర్తవ్య స్తేషా ముత్కర్ష మిచ్ఛతా” అని చెప్పియుండుటచే నిట నద్భుతమున కంగిత్వ మున్నను నాటకత్వలక్షణహాని లేదు. శాన్తరసప్రధానకము లైననాగానంద, ప్రబోధచంద్రోదయాదులు నాటకత్వలక్షణలక్షితము లైనట్లు, నద్భుతరసప్రధానక మైన నీముద్రారాక్షసముగూడ నాటకత్వలక్షణలక్షితము కావచ్చును. కాఁబట్టి యిట, ప్రధానరస మద్భుతము. వీరము ప్రధానాంగము. ఇతరము లగుకరుణశాన్తాదు లంగములు.

అద్భుతరసవాదుల యుక్తులకన్న వీరరసవాదులయుక్తులు సమంజసముగా నుండుటచేత నద్భుతరసఖండనతోఁ గూడ నా యుక్తుల నిరూపింతును.

(1) ఉత్సాహమున కాలంబనవిభావము లే దనుట యవిచారమూలకము. చంద్రగుప్తుఁడె యాలంబనము. శూద్రుఁడు నుదాసీనుఁడు నగుట నర్హుఁడు కాఁ డనిరి. చంద్రగుప్తుఁడు క్షత్రియుఁ డని చెప్పితీరవలయును. చూడుఁడు- “The Caste of Chandragupta Mourya” అనువ్యాసములో కొంద ఱిక్రిం దివిధమున నిరూపించిరి. హరిక్రిష్ణడెజ్ గారు:—

పూర్వనందులు క్షత్రియులు పూర్వనందసుతుఁ డగుచంద్రగుప్తుఁడు కూడ క్షత్రియుఁడే. “పూర్వనందసుత స్తతః” ఇత్యాదులచేఁ బూర్వనందసు

తుఁ డైనట్లు స్పష్టముగాఁ జెప్పఁబడెను. గాన, చంద్రగుప్తుఁడు క్షత్త్రియుఁడు.
Ray Chaudary:—

"మహావంశం" అనుపాళీగ్రంథములో "మోరియానంఖత్తియానం వంసే జాతం సిరీధరం, చంద్రగుత్తేతి పఞ్ఞాతం చానక్కో బ్రాహ్మణో తతో" అనుశ్లోక ముండుటచేఁ జెప్పవచ్చును క్షత్త్రియుఁ డని.

"దివ్యావదానం" అను దానిలో, చంద్రగుప్తునికుమారుఁ డగుబిందుసారుఁడు తనరాణులలో నొకతెతో నొకనాఁడు "దేవి! అహం క్షత్త్రియః కథం పలాండుం భక్షయామి" అని యనుటచే క్షత్త్రియుఁడు కానివాని పుత్త్రుడు క్షత్త్రియుఁడు కాఁడు గాన చంద్రగుప్తుఁడు క్షత్త్రియుఁ డని చెప్పవచ్చును.

14 వ శతాబ్దిలోని మైసూరు "Ins cription" లో చంద్రగుప్తుఁడు క్షత్త్రియుఁ డని యున్న దట.

గ్రీక్కులచరిత్రలో సెల్యూకసు చంద్రగుప్తునిచేత నోడింపఁబడి తనకుమార్తెను చంద్రగుప్తున కిచ్చి యతనివలన 500 ఏనుఁగులను దీసికొన్నాఁ డని, అందు చంద్రగుప్తుఁడు క్షత్త్రియుఁ డని వ్రాసిరి.

" Selukas Nicator gave them to Chandra Collas in concluding marriage alliance and received in exchange 500 elephants"

ఈపైవారియుక్తులచే, చంద్రగుప్తుఁడు క్షత్త్రియుఁడై యుండఁగా నాలంబనము లేకుండు టెట్లు?

చాణక్యుఁడు ప్రతిష్ఠలమునందును 'వృషల' యని శూద్రునిగా నిరూపించినాఁ డని యద్భుతవాదులయాశయము. కాని యది పొరపాటు. అది చంద్రగుప్తుని యింకొకపేరు గాని శూద్రబోధకమే కాదు. ఆశబ్దము కేవలశూద్రబోధక మైనచో నట్లు చెప్పవచ్చును. అట్లుగానపుడు చంద్రగుప్తుఁడు శూద్రుఁ డని చెప్పుట యెట్లు? గమనించితిరా వృషలశబ్దమున కేమి యర్థమో? సర్వశబ్దసంబోధినీ (873) వృషలః ౧శూద్రః ౨చంద్రగుప్తః; Sanskrit & English Dictionary (1009) వృషలః 1. A Sudra......6. N. of Chandragupta (particularly used by Chanakya,) వాచస్ప. (4955) వృషల 1.శూద్రే ... 4. చన్ద్రగుప్తేన్నృపేచ. శబ్దకల్పద్రుమములోను మేదినీనిఘంటువులోను నైవిధము గానే యున్నది. ఇట్లీనిఘంటువులు వృషలశబ్దమున కేమియర్థమును బోధించుచున్నవి? కాని వృషల యనునామ మితని కెందువలనవచ్చిన దనిన- చన్ద్రగుప్తుఁడు స్వమతధర్మములఁ బరిత్యజించి బౌద్ధమతమునం దధికాదరణము గలిగి

యుండుట వృషల యనివ్యవహరించి రేమో! "స్వమతధర్మాననుష్ఠాతా వృషలః" అని కదా తెల్పుదురు. చన్ద్రగుప్తుఁడు బౌద్ధమతావలంబి యనువిషయము భవిష్యత్పురాణములో "చంద్రగుప్తః తతః పశ్చాత్పౌరసేనాపతేః సుతామ్, సులూకస్య తథోద్వాహ్యా యావనీం బౌద్ధతత్పరః" అని యున్నది. బౌద్ధులు "క్షత్రియ" యని వ్యవహరించెడివార లఁట. కాఁబట్టి పైకారణములచే చంద్రగుప్తుఁ డాలంబన మగుట వీరరస మంగి కావచ్చును.

సచివాయత్తసిద్ధి యగుటచే చంద్రగుప్తుఁ డుదాసీనుఁడు గా నున్నను హాని లేదు. సచివాయత్తసిద్ధి మొదలగు విషయములు నాయకనిరూపణావసరమున వ్రాయఁబడును.

ప్రతినాయకుఁడుఁగూడ నాలంబన విభావము కావచ్చును, గాన, నిట క్షత్రియుఁ డగుమలయకేతుఁకూడ నాలంబనము కావచ్చు నని కొందఱిమతము. "ఆలంబనం నాయకాదిః" నాయక ప్రతినాయకా" అని యున్నదిగదా?

(2) వీరరసమునకు స్థాయి యగునుత్సాహము మొదటినుండియుఁ జివరవఱకుఁ బరిపుష్టమై యున్నది. "ఉల్లంఘయ న్మమ సముజ్జ్వలతః ప్రతాపం ............ లభతాం వినాశమ్" "శోచన్తో వనతైర్నరాధిప............ పాతితమ్" "కౌలూత శ్చిత్రవర్మా......చిత్రగుప్తః ప్రమార్ష్టు""విక్రాన్తై ర్నయశాలిభిః......పృథక్" "ప్రాకారాన్పరితః............యశః" "శిఖాం మోక్తుం బద్ధామపి............క్రోధదహనమ్" "నిస్త్రింశోయం......సాహసే మాం నియుఙ్క్తే" ఇత్యాది స్థలముల నెన్నిటనో వీరరసము ప్రవ్యక్తముగా నిరూపింపఁబడినది. పరస్పరోద్దేశేన పరస్పరతర్జితా ద్యుద్దీపనవిభావములును, ప్రతీకారస్మరణాద్యనుభావములును సమగ్రముగాఁ జూపట్టుచున్నవి, గాన, వీరమే ప్రధానరసము. అద్భుతము కొంతవఱకుఁ బరిపుష్టమై చను వీరమునకుఁ బ్రధానాంగ మగుట యుక్తతరము.

(3) వ్యాఖ్యాకర్తలును, నుపోద్ఘాతకారులును, వీరమే యంగిరస మని యును, అద్భుతము ప్రధానాంగ మని యును గరుణాదు లంగము లని యును వ్రాసిరి. చూడుఁడు-

(1) కనకలాల్‌శర్మగారి భావబోధినీవ్యాఖ్య"అస్మిన్నాటకే వీరరసోంగీ అతిగహనకౌటిల్య నీతిరూప స్యాద్భుతరసస్య ప్రధానాంగత్వమ్ అన్యేచ కరుణశాన్తాద యోంగరసాః"

(2) ఢుంఢిరాజవ్యాఖ్య—

"వీరోరసః ప్రధానంస్యా న్ముద్రారాక్షసనాటకే, అత్యద్భుతకరీ శాఠ్య నీతి రత్రాంగమిష్యతే"

(3) తారానాథతర్కవాచస్పతిభట్టాచార్య కృతవివృతి- "నాటకంఖ్యాతవృత్తం.........వీరఏవవా.........వీరఏవాంగీ రసః"

(4) M. R Kale Introduction-

"Vira is the chief Rasa of Mudra"

ఢుంఢిరాజు తా "నద్భుతము ప్రధానము ముద్రారాక్షసమున" అని "అద్భుతరసవిలసత్" ఇత్యాదులు చెప్పె నని యద్భుతవాదుల యాశయము. కాని యద్భుతము ప్రధాన మని చెప్పనూహించిన "వీరో రసః ప్రధానం స్యాన్ముద్రారాక్షసనాటకే" మొదలగువాక్యముల వ్రాయఁడేమో ? అది యును గాక పైవాక్యము లద్భుతమున కంగిత్వమును స్థిరపఱుపఁజాలవు కాని యద్భుతరసవిషయక మని మాత్రము చెప్పఁగలవు అందుచేతనే "చతుర్థేంకే కవిరద్భుతతరచాణక్యనీతిం......" మొదలగువానిచే నద్భుతరసవిషయక మని చెప్పవచ్చును.

(4) అద్భుతమే సామాజికులచే ననుభూయమానమగుచున్న దనుటలో సారము లేదు. ఆపాతతః వీరరసప్రధానకమై యున్న నాటకమున నొకయంగముగానున్న యద్భుత మెట్లుగా ననుభూయమాన మగుచున్నదో వింతగా నున్నది. తమవాదమున కేదో యుపష్టంభక మనుకొనిరి గాని సారాసారముల గమనింప లేదు.

(5) దీని నాంధ్రీకరించినవారు వీరప్రధాన మని భావించియే యాంధ్రీకరించిరి. ఇటు లాంధ్రీకరించిన నాటకమునే యిపుడు ప్రదర్శించుచున్నారు. అద్భుతము పరిదృశ్యమాన మగు చున్నను బ్రధానరస మగువీరరసమునకుఁ బ్రధానాంగముగా నుండుటచేత దానికి స్థాయిత్వము లేదు. వీరమే యిట బాగుగాఁ బరిపుష్ట మైనది. అసంమోహాధ్యవసాయ నయవినయ బలపరాక్రమ శక్తిప్రతాపప్రభావాది విభావములచేతను, స్థైర్యశౌర్యత్యాగవైశారద్యాద్యనుభావములచేతను, ధృతిమానగర్వావేగౌగ్ర్యస్మృతిరోమాంచాదిభావములచేత నీనాటకమున నుత్సాహము పరిపుష్టమై యుండుటవలన వీర మంగి యనుట నిర్వివాదము. గ్రంథవిస్తరభీతిచే వాని నిట నిరూపింపలేదు. కొన్ని నాయక నిరూపణసమయమున లిఖింతును. ఆలంకారికు లందఱు "వీరశృంగారయో రేకః ప్రధానం యత్రవర్ణ్యతే, తదేవనాటక" మ్మని వ్రాసి యుండఁగా నానం

దవర్ధనాచార్యులుగారు తాము దృశ్యకావ్యలక్షణమును జెప్పక "ప్రసిద్ధేపి ......మిచ్ఛతా" అని వ్రాసియుండుట చూడఁ బ్రాచీనమతమునకు విరుద్ధము గాఁ జెప్పునభిప్రాయము గాక ప్రాచీనమతానుసారముగ వీరశృంగారములలో నొకదానికే యంగిత్వ మీయవలయు ననునభిప్రాయము గలవార లని చెప్పిన దప్పులేదని కొందఱయాశయము. ఆలంకారికు లందఱు నొకరీతిగాఁ జెప్ప వీరొకరే యిటులఁ జెప్పుటచే యసమంజసముగా నున్న లేకపోయిన గ్రహించుట యుక్తము కాదు. నాగానంద, ప్రబోధచంద్రోదయాదులు వీరరసప్రధానకము లని నిపుణముగా వ్రాసి యుండుటచే నిఁక నీముద్రారాక్షసమునకు సపక్షము లేనందున నిదికూడ వీరప్రధానక మని చెప్పవలయును. గాన నిట వీరమే ప్రధానరసము.

మఱి యొకసంగతి- అద్భుతము వీరజన్యము, వీరము లేనిదే యద్భుత మెప్పుడును జన్మింపదు. అందుచేతనే యాలంకారికు లందఱు "వీరాచ్చైవా ద్భుతోత్పత్తిః" "వీరస్యాపిచ యత్కర్మ సోద్భుతః పరికీర్తితః" అని చెప్పి యున్నారు. అందుచేతనే వీరరసప్రధానకము లగునాటకములలో నద్భుతము కాన్పించుచున్నది. కాన వీరప్రధానక మని చెప్పవచ్చు నని కొందఱు. ఇంతియె గాక యద్భుతమున కంగిత్వ మీయఁగూడదు, భరతముని భావవ్యంజనాధ్యాయమున స్థాయిభావములఁ గూర్చి చెప్పుచు నద్భుతమునకు స్థాయి యగు విస్మయమును వదలుట చూడ నద్భుతభావవ్యంజనము చేయ వీలులేదని కాఁబోలు నట్లు చేసి యుండు నని యనవచ్చును. భావవ్యంజనమున కననుకూల మగు నీస్థాయికి నాట్యమునఁ బ్రధానత్వ మిచ్చుటెట్లు ?

పైకారణములే గాక శరదృతువర్ణనచేయుటచూడ వీరమే యంగి యని తెలియుచున్నది- చూడుఁడు. "సంగ్రామప్రధానేషు వీరరసప్రధానేషు చ వేణీసంహార ధనంజయవిజయాదిషు రూపకేషు శరదృతు రేవోపక్షిప్తః, "సత్పక్షా మధురగిరః-" (వేణీ) "నిష్టంకా పృథివీ"-(ధనం) అని విమర్శకులు వ్రాసిరి. వీరరసప్రధానకము లగునాటకములలో శరదృతువర్ణన చేయవలయు నని కూడ నాలంకారికాశయము- అట్టిశరదృతువర్ణన యీనాటకమున నుండుట పైవానివలె నీనాటకముఁగూడ వీరప్రధానక మని చెప్పవచ్చును.

"ఆకాశం కాశపుష్పచ్ఛవి మభిభవతా.........క్లేశ మైశీశరద్వః" (ముద్రా)-శరదృతువర్ణన చేసెను. "గుణవ త్యుపాయనిలయే.........మ్మత ముపేహి" (ముద్రా)- శరదృతువు గమ్యమాన మగుచున్నది.

కాన పైయుక్తి సమంజస మని తోఁచుచున్నది. అంతియె గాక యద్భుతము ప్రధాన మన్నచో ననుపపత్తి కూడఁ గాన్పించుచున్నది. అద్భుతవాదులు కూడ, చంద్రగుప్తునే నాయకునిగా నంగీకరించుచు, చాణక్యుని విస్మయాలంబనముగాఁ దెల్పుచున్నారు. ఆలంబనము నాయకప్రతినాయకాన్యతరుఁడు కావలయును గదా ? అట్లిచో, చాణక్యుఁ డాలంబన మగుట యెట్లో ? చన్ద్రగుప్తు నాలంబనముగా వా రంగీకరింపరుకదా ?

కాఁబట్టి పైయుక్తులచే నిట వీరమే ప్రధానరస మనియు నద్భుతముప్రధానాంగ మనియుఁ జెప్పితీరవలయును.

ఇఁక నాయకవిషయమునఁ గొంత గమనింతము.

నాయకునివిషయమునఁ జాల విభిన్నాభిప్రాయము లున్నవి. కొందఱు రాక్షసుఁడనియును, మఱికొందఱు? 2. చాణక్యుఁ డనియును, పలువురు 3. చంద్రగుప్తుఁ డనియును బల్కుచున్నారు. అందు మొదటివారి యాశయము:-

(1) ప్రకృతనాటకప్రధానఫలము చంద్రగుప్తరాజ్యలక్ష్మీస్థిరీకరణము. ఆఫలమున కాలంబనము రాక్షసుఁ డైనట్లు చాణక్యాదులు దెల్పియేయున్నారు. మొదటినుండి చివఱవరకు రాక్షసవిషయమే ప్రతిపాద్య మైనది. చాణక్యుఁడు కూడఁ దనకన్న నుత్కృష్టునిగా రాక్షసుని బల్కియున్నాఁడు. భరతవాక్యము కూడ రాక్షసుఁడే చదువుచున్నాఁడు. కాన రాక్షసుఁడు నాయకుఁడు.

కానిప్రధానప్రయోజనము పైని జెప్పిన స్థిరీకరణముగాక రాక్షససంగ్రహణ మగుటను రాక్షసుఁ డిట కరచరణబద్ధుఁడై దాసునివలె చంద్రగుప్తసాచివ్యమున నుండుటను, దాస్య మనుభవించుచున్న రాక్షసుఁడు నాయకుఁ డౌటకు వీలులేదు. కాన పైవాదము పరాస్తము.

చాణక్యుఁడు నాయకుఁ డనువారియభిప్రాయము.

(2) ప్రస్తావనానంతరమున చాణక్యుఁడే ప్రవేశించును. రాక్షససంగ్రహణమే ఫల మని పేరే తెల్పుచున్నది. అట్టి సంగ్రహణము చేసినవాఁడు. చాణక్యుఁడు. మొదటినుండి కొనవఱకుఁ గార్యము జరిపించువాఁడు చాణక్యుఁడే. రాక్షససంగ్రహణానన్తరశిఖాసంహారరూపఫలము చాణక్యునే పొందుచున్నది. ''నయతీతి నాయకః'' అనువ్యుత్పత్తిచేత నాయకత్వలక్షణ మితనియందు ప్రవర్తించును. కాన చాణక్యుఁడే నాయకుఁడు,

కాని యీనాటకమున, చాణక్యుఁడు చంద్రగుప్తునకు మంత్రిగా నుండినట్లు చాణక్యుఁడే "అస్మాసు ఆరోపితరాజ్యతన్త్రః..."వృషలాపేక్షయా శస్త్రం ధారయామి" ఇత్యాదులచేఁ దెల్పియున్నాఁడు. మంత్రిగా నుండి. నాయకవ్యాపారమును సమగ్రముగా జరిపించినంతమాత్రమున మంత్రి నాయకుఁడు కాఁడు. ఏనాటకమునందును మంత్రి నాయకుఁడు గా లేదు. రత్నావళ్యాదులలో యౌగంధరాయణాదులు నాయకులా? ప్రస్తావనానంతరప్రవేశాదులు నాయకత్వనిర్ణాయకములు కావు.

చంద్రగుప్తుఁడు నాయకుఁడు కాఁగూడ దని కొందఱియభిప్రాయము. వారియభిప్రాయ మేమన?

"ప్రఖ్యాతవంశో రాజర్షిః.........నాయకః" అని నాయకలక్షణ ముండుటచే శూద్రుఁడగు చంద్రగుప్తుఁడు నాయకుఁడు కాఁగూడదు. కాని పూర్వమే శూద్రుఁడే కాఁడని నిరూపించినవాక్యములచే నిది గతార్థ మగుటఁ దచ్చర్చతోఁ బని లేదు.

చంద్రగుప్తుఁడు నాయకుఁ డనువారిమతము.

(3) "అధికారః ఫలస్వామ్య మధికారీచ తత్ప్రభుః
తన్నిర్వర్త్యమభివ్యాపి వృత్తం స్యాదాధికారికమ్"

అనులక్షణ ముండుటచే ప్రకృతనాటకఫలభోక్త చంద్రగుప్తుఁడే కాన నతఁడే నాయకుఁడు. చంద్రగుప్తుఁడు ఫలభోక్త యనువిషయములో నెవ్వరికిని విప్రతిపత్తి లేదు. తాను ఫలభోక్త యనువిషయమును చంద్రగుప్తుఁడే "ఆర్యప్రసాద ఏష చంద్రగుప్తే నానుభూయతే" అని తెలిపియున్నాఁడు. "నయతి నాయయతివా నాయకః" అను వ్యుత్పత్తిచే నాయకత్వ ముండవచ్చును. సచివాయత్తసిద్ధు లగువత్సరాజాదులవలె చంద్రగుప్తుఁడు నాయకుఁడు కావచ్చును. చాణక్య ప్రాధాన్య మున్నను సచివుఁడగుటచే చంద్రగుప్తునకు నాయకత్వము చెప్పవచ్చును.

ఈవాదము ప్రబలముగా నుండుటచే దీనింగొంత విమర్శింతము.

ఉత్సాహరహితుఁడు నాయకుఁడు కా వీలు లేదు. అట్టిచో నిరుత్సాహుఁ డగుచంద్రగుప్తుఁడు నాయకుఁడా? యని కొంద ఱనుచున్నారు. కాని నాయకునందే యుత్సాహ ముండనవసరము లేదు.

"క్వచి దాత్మాధీనసిద్ధే ర్నాయక స్యాత్మోత్సాహాత్మకం, క్వచిదమాత్యా

ధీనసిద్ధే స్తదుత్సాహాత్మకం, క్వచి దుభయాధీనసిద్ధే రుభయోత్సాహాత్మకం చేతి ద్రష్టవ్యమ్; అత్రామాత్యగతో ప్యుత్సాహః యాజకవ్యాపారో యజమానస్యేవ ఫలం జనయ తీతి బోద్ధవ్యమ్" (ప్రతా) ఈపైవ్రాతనుబట్టి సచివాయత్తసిద్ధి యగుచంద్రగుప్తునియం దుత్సాహము లేకున్నను నాయకుఁడు కావచ్చును. చంద్రగుప్తుఁడు సచివాయత్తసిద్ధియా? చాణక్యుఁడు "వృషల ఏవ ప్రధానప్రకృతిషు అస్మాసు ఆరోపితరాజ్యతన్త్రః సతత ముదాస్తే" అని సచివాయత్తసిద్ధి గా నిరూపించియున్నాఁడు. చంద్రగుప్తుఁడు "స్వాతంత్రే భ్యో వయం హి పరాఙ్ముఖాః" మొదలగువానిచేఁ దాను సచివాయత్తసిద్ధియై నట్లు తెల్పియున్నాఁడు.

రాక్షసుఁడు "చంద్రగుప్తస్తు దురాత్మా నిత్యం సచివాయత్తసిద్ధౌ... .........స్యాత్" అని సచివాయత్తసిద్ధిగాఁ బల్కియున్నాఁడు.

మలయకేతువుగూడ సచివాయత్తసిద్ధిగాచంద్రగుప్తుని జెప్పియున్నాఁడు.

వైతాలికుల ధనదానసమయమున, పర్వతేశ్వరపారలౌకికవిషయప్రశ్నసమయమున సచివాయత్తత స్పష్టముగా నిరూపింపఁబడినది. కాన చంద్రగుప్తుఁడు సచివాయత్తసిద్ధి యని చెప్పి తీరవలయును. చంద్రగుప్తుఁడు ధీరోదాత్తుఁడా? "మహాసత్త్వో తిగంభీరః క్షమావా నవికత్థనః స్థిరో నిగూఢాహంకారో ధీరోదాత్తో దృఢవ్రతః" అని ధీరోదాత్తలక్షణము.

రాక్షసః "బాల ఏవ హి............న్నృపః" అనువానిచేతను, రాజా "వినైవ యుద్ధా దార్యేణ పరాజితం దుర్జయరిపుకుల మితి లజ్జి తఏవాస్మి మమ హి ఫలయోగ మవాప్య సాయకానాం ............... నప్రతుష్ట్యై" ఇత్యాదులచేఁ దాను యుద్ధసన్నద్ధుఁడైనను యుద్ధమువలన నష్టము సంభవించు ననునూహచే యుద్ధమును మాని నీతియుద్ధముచే చాణక్యుఁడు జయించుటచేతఁ దనకు సిగ్గుగా నున్న దని తెల్పుటచేతను మహాసత్త్వము స్పష్టముగాఁ బ్రతీయమాన మగుచున్నది.

"మనస్వీ దమ్యత్వాత్ స్ఖలతి న చ దుఃఖం వహతి చ" యను కంచుకి వాక్యములచేతను, "దురారాధ్యా హి రాజ్యలక్ష్మీః తీక్ష్ణా దుద్విజతే... .........భృశమ్" అనురాజవాక్యములచేత నతిగంభీరత్వము సూచింపఁబడుచున్నది. గర్వరాహిత్యము కూడ సూచింపఁబడుచున్నది.

క్షమ ప్రతిస్థలమునందును బరిస్ఫుట మగుచునే యున్నది.

"ఆర్యాజ్ఞమైవ మమ లంఘితగౌరవస్య ........................ లజ్జా" "ఆర్యేణ సహాకృతకలహ" ఇత్యాది వాక్యములచే నవికత్థనత్వము గమ్య మగుచున్నది. స్థిరత్వాదులు గమ్యములగుచున్నవి.

"ఆర్యకమలకులాకార ...... ప్రతిపాదయామి" మొదలగువానిచేఁ గృప విశేషముగాఁ గాన్పించుచున్నది. వినయాదిగుణము లుండవలయును గాన నెక్కుడుగాఁ గాన్పించుచున్నవి. ధీరోదాత్తుని కుండవలసినగుణము లన్నియు సమంజసముగా నిరూపింపఁబడుటచేత ధీరోదాత్తుఁడు చంద్రగుప్తుఁడు.

వ్యాఖ్యాకర్తలు నుపోద్ఘాతకారులును గూడ చంద్రగుప్తుఁడే నాయకుఁడని వ్రాసిరి.

1. భావబోధినీవ్యాఖ్య "చంద్రగుప్తో ధీరోదాత్తో నాయకః"
2. డుంఢిరాజవ్యాఖ్య "సచివాయత్తసిద్ధిత్వా త్పౌరుషం స్వ మదర్శయన్ గభీరాత్మా చంద్రగుప్తో ధీరోదాత్తోత్రనాయకః"
3. తారానాథతర్కవాచస్పతిభట్టాచార్యవివృతి - "ధీరోదాత్తో చంద్రగుప్తో నాయకః".
4. కనకలాల్ శర్మగారిసమాలోచనా "చంద్రగుప్తనామా నృపతిర్నాయకః".
5. M. R. Kale Introduction "Vira is the chief Rasa of Mudra-It is of three kinds. Jeemuta Vahana in Nagananda, Rama in Mahaveeracharita, Chandragupta the Hero of this play."

"చంద్రగుప్త Hero చాణక్య Helper of చన్ద్రగుప్త అని చంద్రగుప్తుని నాయకత్వ మంగీకరించిరి. మొదటిశ్లోకమున నాయకసనామముఁ జేర్చుటచేతఁ గవికూడ చంద్రగుప్తునే నాయకునిగా భావించె నని చెప్పవచ్చును.

అక్కడక్కడ చాణక్యుఁడు చంద్రగుప్తునే నాయకునిగా రూపించెను.

ఈపైకారణములచే చంద్రగుప్తుఁడే నాయకుఁ డనియు ను, వీరమే ప్రధానరస మనియును, చెప్పుట నిర్వివాదము. దీనియందలి గుణాగుణముల విమర్శించు బాధ్యత సహృదయు లగువిమర్శకుల దని విన్నవించుచు విరమించుచున్నాఁడను.

# * అలంకారశాస్త్రము.

— సాహిత్యవిద్యాప్రవీణ-బులుసు వేంకటరమణయ్యగారు, కాశీ. —

---

గీర్వాణవాఙ్మయమునందలి తక్కినశాస్త్రములరీతినే యలంకారశాస్త్రముయొక్క యారంభదశను గనుఁగొనుట కష్టము. కాని యెపుడు కావ్యము వెలువడినదో, దానిని జర్చించు నీశాస్త్రముకూడ దానితోడిదే యని నిశ్చయించుట మాత్రము సాహసము కా నేరదు. ఆదికవి యగు వాల్మీకిమునిరచించిన యాదికావ్యమును బరిశీలించినచో నలంకారశాస్త్రసంప్రదాయములు కన్పట్టకపోవు. అందలి-

" రవిసంక్రాంతసౌభాగ్య స్తుషారావృతమండలః
నిఃశ్వాసాంధ ఇవాదర్శ శ్చంద్రమా నప్రకాశతే॥ "

[అరణ్యకాండము. 22-13.]

అనుశ్లోకమున నత్యంతతిరస్కృతావివక్షితవాచ్యధ్వని ' నిఃశ్వాసాంధః ' అనుపదమునఁ గల దని యానందవర్ధనుఁడు తనధ్వన్యాలోకమున విశదీకరించి యున్నాఁడు.

ఇచట నంధశబ్దమునకు గుడ్డిదను నర్థము చెప్పినచో నిఃశ్వాసపదమున నన్వయింపదు. అట్లే మొదటియితిహాస మగుమహాభారతమునఁ గూడ నీ శాస్త్రమర్యాదలు కన్పించును. అందలిశాంతిపర్వమునందలి "గృధ్రగోమాయుసంవాదము" ప్రబంధగతవ్యంగ్యమున కుదాహరణముగ నాలంకారికులచే నంగీకరింపఁబడినది.

ఎపుడు వాఙ్మయము వెలువడినదో యలంకారశాస్త్రముకూడ దానితోడిదే యని చెప్పినం జెప్పవచ్చును. మనకు లభించినగ్రంథములలో మొదటిదగు ఋగ్వేదమున నలంకారశాస్త్రమార్గములు కన్పించుచున్నవి. అందలి,

" అభ్రాతేవ పుంస ఏతి ప్రతీచీ గర్తారుగివ సనయే వనానామ్।
జాయేవ పత్య ఉశతీ సువాసా ఉషా హస్రేవ నిరిణీతే అప్సః॥ "

[1-124-7]

---

* కాశీలో జరిగిన The First All Asia Educational Conference కు నేను జదివిన సంస్కృతవ్యాసము దీనికి మూలము.

"ద్వాసువర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యో అభిచాకశీతి॥"
[1-164-20]

అను మంత్రములలో మొదటిదానియం దుపమాలంకారమును రెండవ దానియం దతిశయోక్తియుఁ గన్పడుచున్నవి. ఇట్లే వ్యతిరేకాద్యలంకారములు కలభాగములు చాలఁ గలవు ఉపనిషత్తులలోఁ గూడ నిట్లే కలవు. అందులకుఁ గఠోపనిషత్తునందలి "ఆత్మానం రథినం విద్ధి శరీరం మన ఏవచ," అనుమొద లగు శ్లోకము లుదాహరణము. అందు రూపకాలంకారము సుస్పష్టము.

ఇట్లాదినుండియు నలంకారశాస్త్రసంప్రదాయములు చూపట్టుచున్నవి. వేదములు సామాన్యముగ స్తోత్రరూపము లగుటచేతను, అం దలంకారము లుండుటచేతను, వేదమునకు శాస్త్రాంతరములతోడి సంబంధముకంటె నలంకారముతోడి సంబంధమే ప్రాథమిక మైన దని యూహింప నవకాశముకలదు.

మీఁదఁజెప్పిన చొప్పున వేదములందుఁగూడ నలంకారసంప్రదాయములు కన్పడుచున్నను, తచ్ఛాస్త్రపారిభాషికపదములు మాత్రము కానరావు. అక్కాతన, నాకాలమున శాస్త్రవిషయికము లగునాలోచనము లున్నను ఆలంకారికులు గాని, వారిగ్రంథములు గాని యపు డున్నట్లు నిశ్చయింపఁ జాలము.

మనకు లభించిన యలంకారగ్రంథములలో నాట్యశాస్త్రము మొదటిది. అంతకుఁ బూర్వ మలంకారగ్రంథము లేవేవి గలవో తెలియదు. కాని వరరుచి ప్రఖ్యాతాలంకారికుఁ డని ప్రతీతికలదు. వేదాంతసూత్రములందలి-

(i) అత ఏవ చోపమా సూర్యకాదివత్, (3-2-18)

(ii) నానుమానిక మప్యేకేషాం, శరీరరూపకవిన్యస్తగృహీతే ర్దర్శయతిచ. (1-4-1)

౨. సూత్రములలో నుపమారూపకములు శబ్దోపాత్తములై యున్నవి. పాణినిముని తనయష్టాధ్యాయియందలి,

(i) ఉపమానాని సామాన్యవచనైః। (2-1-55)

(ii) ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్యాప్రయోగే। (2-1-56)

(iii) తుల్యార్థై రతులోపమాభ్యాం తృతీయాన్యతరస్యామ్। (2-3-72)

అనుసూత్రములం దలంకారపారిభాషికపదములను వారు వాడెడియర్థములందే వాడియున్నాఁడు. యాస్కుని నిరుక్తమునందలి "లుప్తోపమా న్యర్థో

పమా నీత్యాచక్షతే," (3-18) అను మొదలగు వచనంబులంబట్టి యాతఁడలంకారశాస్త్రమును బాగుగ నెఱుంగు నని చెప్ప నవకాశము కలదు. ఇట్లు పాణిని మొదలగు ప్రాచీనమహర్షులచే సూత్రయుగమున నాలంకారికపారిభాషికములు వాడఁబడుటచే నియ్యది మిక్కిలి ప్రాచీనశాస్త్ర మని చెప్పవలసి యున్నది. ఆకాలమున నలంకారగ్రంథములు రచియింపఁబడి యుండవచ్చును. కాని యవి కాలగర్భమున మునింగిపోయి యజ్ఞాతవాసమున నున్నవి.

అలంకారశాస్త్ర మి ట్లతిప్రాచీన మైన దైనను దక్కినశాస్త్రములతోడి సమానాభ్యర్హితత్వమును బొందలేదు, వేదసంరక్షణార్థ మేర్పడినవ్యాకరణాదుల కున్నంతగౌరవము వేదమంత్రాంతర్గతము లగునలంకారములకు మూలమగు నలంకారశాస్త్రమునకు లేకపోవుట కడుం గడు విచారణీయము. వేయేల ? ఆలంకారికులకుఁ గూడఁ దమశాస్త్రమునందు, దానియవసరమును, స్వరూపమును నిరూపింపఁ బట్టుదల, ఆసక్తి యుండిన ట్లగపడదు.

ప్రాచీనుఁ డగుపతంజలిముని తనమహాభాష్యమునఁ బస్పశమున వ్యాకరణశాస్త్రావశ్యకతం గూర్చి చర్చించి సాటిలేని గౌరవము నద్దాన నాపాదింపఁ జేసెను. కాని ప్రథమాలంకారికుఁ డని యనుకొనఁబడు భరతమహర్షి నాట్యశాస్త్రమున నలంకారశాస్త్రవిషయమున నేమి యుఁ బ్రస్తావింపలేదు. మఱియు నాట్యమున కంగముగ నొకకొంత యలంకారాదికమును నిరూపించెం గాని యతనియుద్దేశ్య మలంకారము కానేకాదు. ఐన నతఁడే ప్రథమాలంకారికుఁ డని మనము ప్రాఁకులాడుచున్నాము.

భరతునితర్వాత భామహుఁడే తక్కినవారిలోఁ బ్రథముఁడు. దండిభామహుల పౌర్వాపర్యముం గూర్చి వాదవివాదములు పెచ్చుపెరిఁగియున్నను భామహుఁడే ప్రాచీనుఁ డని చాలమంది సిద్ధాంతీకరించిరి. భామహుఁడు తన గ్రంథమునకుఁ గావ్యాలంకార మని నామ మిడెను. ఇందున్ను గావ్యగుణాలంకారస్వరూపమే వివరింపఁబడెను, కాని, అలంకారశాస్త్రముయొక్క గౌరవము పోషింపఁబడలేదు. ఇందు భామహుని కంటెఁ బ్రాచీనుఁడు మేధావియొకయాలంకారికుఁ డుండినట్లు లిఖింపఁబడినది. ఆతని గ్రంథ మేదో కూడఁ దెలియమి నందేమి విచారింపఁబడెనో గుర్తించుట యసంభవముగ నున్నది.

భామహుని యనంతరమున నీవిషయమున నతని నే యనుసరించిన దండి-వామన-రుద్రటాదులవలన మన కేమి యుం గ్రొత్తవిషయము గోచరింపదు,

కాని యాలంకారికులలో-(విమర్శనమార్గము న్రొక్కినవారలలో) పేరెన్నికఁ గని- ప్రథముఁడే యై ధ్వనిమార్గముం గనిపెట్టిన యానందవర్ధనాచార్యు లీవిషయమునఁ గొంతవఱ కుపకరించును. ధ్వనిప్రస్తావమున నతఁడు "ధ్వనిని దెలిసికొనుటకు సహృదయుఁడే కావలె" నని యు, నసహృదయుల కం దధికారము లే దని యు, వ్యాకరణాదిశాస్త్రములు చదివినమాత్రమున నే యది బోధపడ దని యు, ఆలంకారికులే దానిని గుర్తెఱుంగఁగల రని యుఁ జెప్పి యుదాహరణములతో దాని నుపపాదించెను. ఒకకారికను మాత్ర మిట నుల్లేఖింతును.

"శబ్దార్థశాసనజ్ఞానమాత్రేణైవ న వేద్యతే ।
వేద్యతే స హి కావ్యార్థతత్త్వజ్ఞై రేవ కేవలమ్"॥ ధ్వన్యాలోకః-ఉద్యోతః-

ఇ ట్లొనర్చిన యానందవర్ధనుఁడు కూడఁ దనయలంకారశాస్త్రమునకుఁ బ్రాధాన్యము నొసంగినట్లు కన్పడదు. వైయాకరణులే గొప్పవా రనియు, నొకకొందఱు వారిమార్గము నే యవలంబించి ధ్వనిమార్గము నవలంబించి రని యు

"ప్రథమే హి విద్వాంసో వైయాకరణాః । వ్యాకరణమూలత్వా త్సర్వవిద్యానామ్ । * * అస్తస్త న్మతానుసారిభి రన్యైరపి * * * [ధ్వన్యాలోకః । ఉద్యోతః ]

అని యతఁడే లిఖించి యున్నాఁడు. దీనిం బట్టి యలంకారమునకుఁ బ్రత్యేకముగ నితఁడు శాస్త్రత్వము నంగీకరించినట్లును గనుపింపదు. కాన నానందవర్ధనులు ప్రథమాలంకారికవిమర్శకులే యైనను శాస్త్రత్వవిమర్శనవిషయమున విముఖులై యుండి రని యనుమానింప నవకాశముకలదు. దీనిం బట్టి ప్రాచీనకాలమున నలంకారశాస్త్ర మొకశాస్త్ర మని చాలమంది యంగీకరింపనట్లు తోఁచుచున్నది. మఱియు నాలంకారికులకుఁ గూడ (10 వశతాబ్దపు రాజశేఖరునివఱకును) తమశాస్త్రమునకుఁ గలశాస్త్రత్వమును నిరూపింపఁ బట్టుదలయు లేకుండెను.

కాని కావ్యమీమాంసను వ్రాసినరాజశేఖరుఁడు బాగుగ విమర్శించి యంతకుఁబూర్వ మలంకారమునకు వేదాంగత్వాదికము లేకపోవుటచే, న ట్లొనరకుండుట పాడి గా దని యెంచి "ఉపకారకత్వా దలంకారః సప్తమ మంగమ్ । * * పంచమీ సాహిత్యవిద్యా । * * * సకలవిద్యాస్థానైకా

యతనం పంచదశం కావ్యం విద్యాస్థానమ్"॥ అని స్వతంత్ర మగు మార్గము ననుసరించెను.

రాజశేఖరుఁడు వ్రాసినయీయంశము స్వతంత్ర మైనదగుటచేఁ దదనంతరకాలీనులచే నంగీకరింపఁబడి యుండకపోవచ్చును. కావుననే, తదనంతరకాలీనుఁ డగుమాధవాచార్యుఁడు తనసర్వదర్శనసంగ్రహమునఁ బ్రత్యేకప్రత్యేకముగ శాస్త్రాంతములయొక్క యాశయముల నన్నింటిని బ్రతిపాదించియు నలంకారవిషయము నెత్తుకొననైన లేదు. రసేశ్వరవాదులు రసమునే యీశ్వరుని గా వాదింతురు. ఆలంకారికుల మతమునను రసమే పరబ్రహ్మము. (పరబ్రహ్మసబ్రహ్మచారి.) ఈ రెండుమతములకును మాట యొక్కటియే; కాని రసేశ్వరవాదులరసము వేఱు, ఆలంకారికుల రసము వేఱు. రసేశ్వరవాదులమతమున రసశబ్దమునకుఁ బారద మర్థము. మాధవాచార్యులు రసేశ్వరవాదమును నిరూపించునెడ నైనను, ఆలంకారికులమతమును సూచింపకుండుట విచారణీయము. అలంకారశాస్త్రము వ్యాకరణపరతంత్ర మని యానందవర్ధనమమ్మటాదులగు నాలంకారికులే నుడువుటచే దానికిఁ బ్రత్యేకశాస్త్రత్వము, గౌరవము కలుగలేదని యనుకొనవచ్చును.

కాని యెడనెడ నిది శాస్త్ర మని వాదములు బయలుదేఱినట్లు రాజశేఖరునివచనము తెల్పుచున్నది. ప్రాచీనాలంకారికుఁ డగుదండ్యాచార్యుఁడు తన కావ్యాదర్శమున,

"పూర్వశాస్త్రాణి సంహృత్య ప్రయోగా నుపలభ్య చ
యథాసామర్థ్య మస్మాభిః క్రియతే కావ్యలక్షణమ్॥"

[కావ్యాదర్శము. 1 పరిచ్ఛేదము.]

అని యలంకారము శాస్త్ర మైనట్లే వ్రాసి యున్నాఁడు. విద్యానాథపండితుఁడు కూడ "వక్ష్యే సమ్యగలంకారశాస్త్రసర్వస్వసంగ్రహా" మ్మని తనప్రతాపరుద్రీయమున వచించినాఁడు. అప్పయదీక్షితులును "సవిశేషణేహీతిన్యాయోపన్యాసో వాక్యమీమాంసకానాం శోభతే, నాలంకారమీమాంసకానామ్॥" అని తనచిత్రమీమాంసయం దలంకారము శాస్త్రమే యని యుదాహరించెను.

మఱియు నలంకారము వేదాంగమని కూడ రాజశేఖరుఁడు నిర్వచించి యున్నాఁడని యీవఱకే చెప్పఁబడినది.

న్యాయ్యమునుబట్టి చూచినచో దీనికి వేదాంగత యు, శాస్త్రత యు, దర్శనతయు సరిపడఁగలవు. న్యాయాదికము లగుకొన్ని శాస్త్రములకు వేదాంగత్వము, లేదు. కాని యెట్లు వ్యాకరణము వేదాంగము, శాస్త్రము, దర్శనము నగుచున్నదో యట్లే యలంకారము కూడను.

మనగీర్వాణవాఙ్మయమున సకలశుభదాయకమును, ప్రధానము నగునది వేదము. దానిని రక్షించుకొఱకే వేదాంగము లుపకరించుచున్నవి. శిక్షాదులగుషడంగములు నెట్లు తదర్థావగమమున నుపయోగించునో అలంకారము కూడ నట్లే యుపయోగించును. కావుననే రాజశేఖరుఁడు-

"ఉపకారకత్వా దలంకారః సప్తమమంగమ్. ఋతేచ తత్స్వరూపపరిజ్ఞానా ద్వేదార్థానవగతిః - యథా—

"ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యో అభిచాకశీతి।"[ఋ.1-124

అని సోదాహరణముగ నిర్వచించినాఁడు. కాన నతఁడు స్వతంత్రించిన ను సమంజసముగనుండుట నలంకారశాస్త్రము వేదాంగము కావచ్చును.

ఆయాశాస్త్రమున నాయాశాస్త్రమునకు సంబంధించిన పదార్థాదికము నిర్వచింపఁబడి, ఆయారీతిగ నుండవలె నని శాసించుటను మనము చూచుచున్నాము. వ్యాకరణమునఁ బదవిచారమును, మీమాంసయందు వాక్యవిచారమును, న్యాయమునఁ బ్రమాణవిచారము నున్నట్లే యలంకారమున ధ్వన్యలంకారాదివిచారము కలదు కాన నవి శాస్త్రము లగుచో నలంకారము మాత్రము శాస్త్రము కా దని చెప్పుట కణుమాత్రము నవకాశము లేదు.

వ్యాకరణాదిశాస్త్రములకు దర్శనము లనికూడ వ్యవహారము కలదు. దర్శనములందు, ఏదో యొకరీతిగ బ్రహ్మవిచారము కాని, తత్సంబంధము కాని కొంతవఱకు నిరూపింపఁబడియుండును. న్యాయ్యముగ దర్శనశబ్దము జ్ఞానార్థకము. వ్యాకరణాదులందు తత్తచ్ఛాస్త్రసిద్ధాంతములు జ్ఞాతవ్యములు, అట్లే యలంకారశాస్త్రమునుండి తద్జ్ఞానమును సంపాదింపవచ్చును. కాన నిదియు దర్శనమే యగును.

"అలంకారము దర్శనమే యైనచో బ్రహ్మవిచారముతోడి సంబంధముండవలెను గదా ! అది యిందు లేదే? దీనికి దర్శనత్వ మెట్లు?" అని శంక కలుగవచ్చును. పాణినీయదర్శనమున శబ్దబ్రహ్మ మెట్లో అలంకారదర్శనమున

రసబ్రహ్మము నష్టే యగుటచేత నాశంక కవకాశము లేదు. వారిమతమున శబ్దమే పరబ్రహ్మ. వీరిమతమున రసమే పరబ్రహ్మ. రసముబ్రహ్మ మనుటలోఁ బ్రమాణ మే మందు రేని కనుఁడు.

"రసోవైసః రసం హ్యేవాయం లబ్ధ్వాఽనందీ భవతి!"

[తైత్తిరీయోపనిషత్తు. 2-7-1]

కాన నిది యు దర్శనము కావచ్చును. అలంకారశాస్త్రమును దర్శనమే యని యిప్పటిప్రసిద్ధపండితు లంగీకరించి యున్నారు. ప్రాచీనకాలమున నెటు లున్నను, ఇక్కాలమున నలంకారశాస్త్రమునఁ బ్రత్యేక శిక్షణ మీయఁబడు చున్నది.

కాని వ్యాకరణాదిశాస్త్రముల కెంతటి యవలంబము ను, ఎంతటి వ్యాప్తి యు, గౌరవమును గలవో,ఈయలంకారశాస్త్రమునకు మాత్ర మిప్పటికిని- అట్టి యవలంబనము- ప్రచారము- గౌరవము లేవు. కాన దీనావస్థలో నున్న యీశాస్త్రము నుద్ధరించుభారము పండితులపైఁ బడియున్నది. దీనియుపయోగములు విద్వద్వేద్యములే యగుట విస్తరించి వ్రాయకుంటిని. విద్వద్వరేణ్యు లందఱు నీశాస్త్రమునకు స్వాగతము నొసంగి గౌరవింతురుగాక!



# సింహాచల ప్రదక్షిణయాత్ర.

— కరి నారాయణాచార్యులుగారు. రామతీర్థము —

---

మ. అమలాషాఢమునందుఁ బూర్ణిమను సింహక్ష్మాధరస్వామికిన్
విమలశ్రీకరచందనం బలఁదునుద్వేలోత్సవం బంచుఁ ద
ద్రమణీయాచలముం బ్రదక్షిణ మొనర్పం దీర్ఘయాత్రారతుల్
శ్రమ లెక్కింపక యేగుదెంతురు మహాసంఘోపసంఘంబు లై.

ఉ. వచ్చియుఁ గొంద ఱంతఁ దొలివారము రేయిని దాన మాడి పై
న్మచ్చిక నద్రినిన్ వలగొనం జనుదెంచఁగఁ గొంద ఱంతటం
జెచ్చెర నద్రిపై గుడికిఁ జేరి యటన్ గుడిఁ జుట్టువారుటల్
పెచ్చుగుబత్తితో మొదలువెట్టుదు రందఱు వేకువన్ జనుల్.

చ. మొదలిడి యాత్రికుల్ దమరు పూవుల నూటిపయి న్మ తెన్మిదిం
గుదురుగఁ జేతఁబట్టుక యొకొక్కపరిన్ మరలంగ నొక్కపు
ష్పదళము వైచి కొందఱును బండుల వైచుచు నింకఁ గొందఱున్
ముదముగ నక్షమాలికల పూసలఁ ద్రిప్పుచు నింకఁగొందఱున్
వదలనిభక్తి నాణెముల వైచుచుఁ గొందఱు, నింకఁ గొందఱున్
సదమలవాసనోల్లసితచందనదారుసుఖండికావళిన్
గొదువక వైచుచుం బసుపుఁగొమ్ముల వైచుచుఁ గొందఱున్ ఫల
ప్రదముల స్వప్రదక్షిణములన్ గణియించుచునుంద్రు కోవెలన్.

శా. ప్రత్యూషంబున నర్చకుల్ దమరు శుభ్రస్నాతులై స్వామికిన్
శైత్యామోదలసత్పటీరపరిచర్యాలంకృతుల్ చేసి యుం
బ్రత్యగ్రాంబరసంధృతిం జలిపి పుండ్రం బుంచి కైసేయఁగాఁ
బ్రీత్యాసక్తుల దేవునిం బ్రజలు సేవిం త్రప్పు డెంతేలలిన్.

చ. హరిధరణీధరేశునకు హారిపటీరముఁ బూయఁగా మదిన్
గరుడసురాదికాంగన లగణ్యముదాన వరాహదేవు పై
విరివిగఁ బుష్పవృష్టిఁ గురిపించె ననం దగ యాత్రికాంగనా
కరసరసీజముక్తసుమకమ్రగుళుచ్ఛచయంబుఁ గన్గొనన్.

సీ. "గోవింద" యనుచు దిక్కులు పిక్కటిల్లఁగా నిచ్చమీఱఁగ గేక లిడెడివారు
"వారాహరూపంబు వాఁ"డటంచును బత్తిఁ బాటల మెండుగాఁ బాడువారు
"అప్పన్నతండ్రి!"యటంచును ముదమార వడివడిగాఁ బర్వు లిడెడివారు
"నారి నీ వెన్నవసారి క్రుమ్మరుచుంటి"వనుచు నన్యోన్యము నడుగువారు
వృద్ధు లెవరేని దొందరఁ బృథ్విఁ బడ్డఁ, గెవ్వు మని కేకలిడికొంచు నవ్వువారు
నయి హరిగిరిప్రదక్షిణయాత్ర మిగుల
సొంపుమీఱుచునుండును జోద్యముగను.

సీ. ఇరుగెలఁకులనుండు సరసపుంగవులపైఁ జిఱునవ్వుతోఁ జూచు చిగురుఁబోండ్లు
తరుణులపై మిషాంతరమునఁ దమయంత నూరక పడఁబోవు యువజనులును
ఫలములఁ జేపట్టి పరులుత్రోయఁగఁ దూలి పోవుచుఁ జరియించు ముదుసలులును
స్తోత్రపాఠముల నస్తోకదీక్షఁ బఠించి వస్త్రంబులఁ జరించు విప్రజనులు
దేవతాలయసాలప్రదేశమందు, వలగొనునవసరంబున బహువిధముల
సంకులం బాయె యాత్రికజనులకెల్లఁ, జూచువారికి సంభ్రంబు దోఁచునట్లు.

సీ. అంబరావృతవదనాబ్జలై వలగొంచు మందతఁ జనుశూద్రేందుముఖులు
సంధృతకౌశేయసదమలచేలలై వలగొను క్షత్త్రియాబ్జాతముఖులు
కరధృతకదళీకాకమనీయఫలగుచ్ఛలై యేగు గవరకులాంగనలును
భూరిపటచ్ఛన్నముండితశీర్షలై యరుగు బ్రాహ్మణవిధవాంగనలును
గలసి తళతళ మిలమిల గలగలయని, గొలగొలంచుఁ బ్రదక్షిణములనొనర్చు
చుండ రసికాళి కానంద మొదవుచుండెఁ, జూచువారికి సంభ్రంబు దోఁచునట్లు.

ఉ. యాత్రికులెల్ల దేవళము నందుఁ బ్రదక్షిణముల్ పొనర్చుచున్
క్షేత్రపుద్వారముంగడ విశేషముగాఁ బలుపండ్లు నేయఁగా
నాత్రముతోడ వానిఁ గొని యాగమపాఠకులౌ ధరాసురుల్
గాత్రపటంబులం దునిచి కైకొని పోవుదు రిండ్లకున్ వెసన్.

ఉ. పాయనిభక్తి యాత్రికులు పండ్లను డబ్బులనుం గ్రహించి యా
ప్యాయనలీల దేవళముపై విసరంగఁ దదర్థులెల్ల న
న్యాయముమైని వానికయి "నా దిది నా దిది"యంచు నొండొరుల్
ఛీయని దెబ్బలాటలకు డీకొనుచుండ్రు తదుత్సవంబునన్.

సీ. "అమ్మ వద్దని చెప్ప నాలింపనైతి నే నడుగిడలే నం"చు నుడువువారు
'దీనితో మూఁడవ తేప గిరిప్రదక్షిణ మేను జేయుట" యనెడివారు

"నిన్నఁటినుండి నే నిరశనంబుగ నుంటి నాఁకలి మెండాయె"ననెడివారు
"పైవర్షమున కీవు పాప నెత్తుకొని రావలె" నంచు నవ్వుతోఁ బలుకువారు
ద్వాదశక్రోశపరిమితాధ్వావృతోరు, సింహశైలప్రదక్షిణసేవఁ జేయు
నపుడువివిధప్రసంగము లాడుకొనుచు
నెట్టులో మార్గమును దరియింత్రు జనులు.

శా. మింటన్ గొందఱు యాత్రికుల్ గుడిని మ్రొక్కిం జుట్టువాక్కొండకున్
గంటల్ మువ్వలు క్షుద్రఘంటికలు వ్రేఁడం గట్టి చిత్రంబుగా
రెంటంబాదునఁ గొకఁ జుట్టి వృషభశ్రేష్ఠంబుఁ గై సేసి వెన్
వెంటం దానిని గొంచు నేగుదురు తప్పెట్లూని యాటాడుచున్.

శా. సంతానార్థసమాగతప్రజలు కాంక్షం దాము దేవాలయా
భ్యంతర్భాగగతప్రసిద్ధ మగుకప్ప స్తంభముం జేరి యెం
తెంతో సుంకము లిచ్చి దంపతులుగా నింపారఁ దత్ స్తంభమున్
సంతోషంబునఁ గౌఁగిలించుకొని ధన్యస్వాంతులై యొప్పెడిన్.

శా. హేరాళంబుగ నిట్లు యాత్రికులు సింహేలాధరాధీశ్వరున్
సారెన్ దర్శనముం బొనర్చుట యు నంతన్ గంగధారాస్థలిన్
నీరాటం బొనరింపఁ జేయుటకు సన్నిష్టాత్ములై యర్చకుల్
శ్రీరామానుజయోగిపుంగవుని విచ్చేయింపుఁ గావించుటన్.

సీ. ఒకసీమవైష్ణవప్రకరంబు ద్రవిడదివ్యప్రబంధమును శ్రావ్యముగఁ జదువ
నొకక్రేవ క్షితిదేవనికరంబు వేదపారాయణంబును మంజులతఁ బఠింప
నొకవాటి గుణపటుప్రకటభటశ్రేణి ఛత్రచామరపరిచర్యఁ జేయ
నొకచెంత జంత్రవాదకనికురుంబంబు మంగళవాద్యసమ్మదముఁ జూప
హెచ్చుగా వేత్రహస్తులు హెచ్చరికలఁ
దెలుప రామానుజస్వామి దిక్కువిజయ
యాత్రకై యేగుచున్న ప్రయాణమట్లు
తోఁచె సేవించువారిహృత్తోయజముల.

శా. ఆరీతిం దిరుమజ్జనం బచట నైనంతం గరం బర్చకుల్
శ్రీరామానుజవర్యుఁ గోవెలకు విచ్చేయింపుఁ గావించి స
త్కారం బాయనకుం బొనర్చి యటఁ దీర్థంబుం బ్రసాదంబులన్
సారెన్ గోష్ఠుల కీయ వారుఁ గని ధన్యస్వాంతులై యొప్పెడిన్.

# మనుమంచిభట్టు-హయలక్షణవిలాసము.

—టేకుమళ్ళ అచ్యుతరావుగారు, ఎం. ఏ., రాజమహేంద్రవరము—

---

మనుమంచిభట్టారకుఁడు రచించిన హయలక్షణవిలాసము- ఓబలరాయనికొడుకగుకంపరాయనికి సంకితము చేయఁబడినది. ఏతద్గ్రంథములోఁగంపరాయని గుఱించి చేసినవర్ణనములలో సాళువవంశబిరుదము లన్నియుఁ గూర్పఁబడియుండుటచే నీతఁడును సాళువవంశస్థు డని యూహింపఁబడుచున్నది. మీసరగండ, బర్బరబాహో, రాయచౌహత్తమల్ల, ధరణీవరాహ, మోహనమురారి, కఠారిరాయ, కఠారిసాళువ- ఇత్యాదిబిరుదము- లన్నియు సాళువనృసింహరాయలును నాతనిదండనాయకుఁ డగు తుళువనరసరాయలును ధరించినట్లుగా వారియాస్థానకవు లగుపినవీరభద్రుఁడును, నంది మల్లయ్య ఘంటసింగయ్య కవిద్వయమువల్లను మనకుఁ దెలిసియున్నది. కావున నీబిరుదములను ధరించిన కంపరాయఁడు సాళువవంశములోనివాఁ డని యూహింపవచ్చును. ఆతను దండనాయకుఁ డని తెలియుచున్నది, గాని, యెవరియొద్ద దండనాయకుఁడు గా నుండెనో చెప్పుటకు వీలు లేదు. ఓబలకంపా యని పిలువఁబడుటచే నాతను, ఓబలరాయనికొడుకని స్పష్టము. ఆయోబలరాయఁ డెవరికొడుకో, యేకాలపువాఁడో స్పష్టముగాఁ దెలియదు. సాళువవంశములోని సాళువమంగునకు ఓబలుఁ డని యొకయన్న యుండెను. కంపరాయఁ డాయోబలుని పుత్రుఁడేమో యని సందేహము కలుగుచున్నది.

పొదిలిపట్టణపు దండకవిలెంబట్టి సాళువనృసింహరాయలును తెలుఁగు రాయలును నొకకుటుంబములోనివారలే యని తోఁచెడిని. ఆకుటుంబము.లోఁ గూడ నిద్దఱు కంపరాయలు కాన్పించుచున్నారు. వీరి కెవ్వరికిని ఓబలరాయఁడు తండ్రిగా నుండలేదు.

కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమయాంధ్రకవులచరిత్రలో మనుమంచిభట్టుకాలము నిర్ణయము చేయలేక ఓబలకంపరాయ డెవఁడోగుర్తింపలేక యట్టే విడిచిపెట్టిరి.

ఇట్లుండ నీకంపరాయనిగుఱించి మఱికొన్ని చరిత్రాంశము లీగ్రంథమున నాదృష్టికి గోచరించినవి. వానియథార్థసంధర్భమ్ములు విచారణీయము

లు. ఈ గ్రంథమందు కొన్నిచోట్ల- పైఁజేర్కొనినబిరుదములు గాక మఱి కొన్ని బిరుదములు కాన్పించుచున్నవి. చాళుక్యతిలక, సాళువకంప, చాళుక్య చూడామణీ, రాయగండరగాళీ- యనుసంబోధనము లచ్చట చ్చట నున్నవి. కావున సాళువబిరుదములు వహించిన యీకంపనృపాలుఁడు చాళుక్యవంశ ములోనివాఁ డని చెప్పవచ్చును. సాళువనృసింహరాయలవంశస్థులు చాళుక్య వంశజు లని చెప్పికొనినట్లు కాన్పింపదు.

రాయగండరగాళీ యనుబిరుదము సాళువవంశస్థు లెవ్వరును వహించి నట్లు కనుపట్టదు. ఈ బిరుదమును గుఱించి మ. రా. రా. నేలటూరి వెంకట రమణయ్య M. A. P. H. D గారు 1929 సం॥ జూన్ నెల భారతిసంచికలో వ్రాసిన ఆరవీటివంశచరిత్రమం దిట్లు వ్రాసిరి. "కొటికంటి రాఘవుడు (ఆర వీటితాత పిన్నమరాజు కొడుకు) కంపిలిరాజు సైన్యముల జయించి యాతని రాజ్యసప్తాంగముల హరించి 'గండరగూళి' యను బిరుదంబు గొనియె నట. ఆరవీటి వంశరాజులందు గొంద ఱీబిరుదమును ధరించినవారు గలరు. సంగ రాంగణచర్య కంపిలిరాయసప్తాంగ గండరగూళి సద్బిరుదాదిసంగ్రహణోజ్వ లా' యన్నపద్యభాగము వల్ల దెలియుచున్నది."

ఇంతియే గాక మఱియొక చక్కని చరిత్రాంశము నాసూక్ష్మపరిశీలనకుఁ గాన్పించినది. ఈగ్రంథమందలి మూఁడవ యాశ్వాసము మొదటి పద్యమున నిట్లున్నది.

క. శ్రీకరకటాక్ష విజయ, శ్రీకాంతా, కృష్ణరాయ సిద్ధకృపాణా
స్వీకృతఫలసత్వర పర, భీకరభటయూథ కంపపృథ్వీనాథా.

అనఁగా మంగళప్రదమైన కటాక్షము గలవాఁడా, విజయలక్ష్మి వరిం చినవాఁడా, కృష్ణరాయనికి సిద్ధమైన ఖడ్గము ధరించినవాఁడా.........."
యని యర్థ మిచ్చుచున్నది. ఇందు, కృష్ణరాయనికి సిద్ధముగా ఖడ్గమును ధ రించినవాఁడా యనుటచే నీకంపరాయఁడు శ్రీకృష్ణదేవరాయల కాలములో నుండి యాచక్రవర్తి క్రింద సన్నిహితదండనాయకుఁడుగా నుండిన ట్లూహింప వచ్చును. నే నెఱిఁగినంతవఱకు, కృష్ణదేవరాయని సైన్యాధిపతులలో నీయో బలకంపరాయని పేరు కాన్పింప లేదు. చరిత్రాన్వేషణపరాయణు లగుపండి తోత్తము లీవిషయమును నిర్ణయింతురుగాక !

మనుమంచిభట్టారకుఁడు బ్రాహ్మణుఁడు, భైరవాచార్యునిపుత్త్రుఁడు. ఏదే

శస్థుఁడో చెప్పుట కాధారములు లేవు. పేరునుబట్టి బహుశః కర్నూలు గుంటూరుసీమలవాఁ డని యూహింపవచ్చును. కవితాచాతురీధురీణుఁ డని యు, నిఖిలభాషాప్రవీణుఁ డనియు, తాను జెప్పికొనెను. ఈకవి రచించిన హయ లక్షణవిలాసము, అయిదాఱాశ్వాసముల గ్రంథ మైనను ప్రస్తుతము మొదటి మూఁడాశ్వాసములును, నాల్గవయాశ్వాసమునఁ గొంతభాగమువఱకే లభ్య మైనది. కొన్నివ్రాతప్రతులలో, ఆశ్వాసములకు బదులుగా అధికారము లను పేరు కాన్పించుచున్నది.

ఏతద్గ్రంథమందు, అశ్వప్రశంసయు, ఆవర్తలక్షణంబును, దశక్షేత్ర విభాగంబును, గంధలక్షణంబును, పుండ్రలక్షణంబును, నిదానలక్షణంబును, చికిత్సయును, లవణవిధియును, ఉదకవిధియును, ఘాసఖాణప్రకారంబులును, క్రమంబునం జెప్పంబడినవి.

మనుమంచిభట్టారకుఁడు రచించిన గ్రంథభాగ మేగ్రంథమున కనువాదమో చెప్పుటకు వీలు లేదు. ఈగ్రంథమును శాలిహోత్రాది సంస్కృతకవుల యశ్వశాస్త్రములతో సరిచూచి భాషాంతరీకరణవిషయమును నిర్ణయించుటకు నాకాగ్రంథము లెవ్వియుఁ జిక్కుట లేదు. ఈగ్రంథముయొక్క మాతృకను కనిపెట్టి దానికిని దీనికిని గలపోలికలను నిర్ణయించుట యే విమర్శకులైనను జేయఁబూనినయెడల నేతద్గ్రంథవిమర్శనము సమగ్రము కాఁగలదు. *

మనుమంచిభట్టారకుని శైలి చాల రసవంతముగా నుండి కడుహృద్య మైనది. సామాన్యజనులకు రుచిగలుగని పశుశాస్త్రవిషయ మైనను, ఈకవి తనశైలీమాధుర్యముచే మనోరంజకముగాఁ జేయఁగలిగెను. అచ్చటచ్చట చక్కని యుపమాద్యలంకారములు వాడుకచేసియు, ద్రాక్షాఫలగుళుచ్ఛముల వలె మనోజ్ఞ మగు పదజాలము నుపయోగించియు, మృదులకవితాపాకమును మంజులనిక్వాణగతిని మేళవించి యు, హృదయానురంజకముగాఁ జేయఁగలిగెను. నన్నయాదికవులయందువలె సంస్కృతశబ్దజాల మెక్కువగా నున్నను, అన్వ

---

* ఈగ్రంథముతోపాటు మఱియొక గ్రంథభాగము గూడ కలసి యచ్చుపడియున్నది. ఆభాగమును అశ్వశాస్త్రసంబంధ మైనదియే. అది కొంకణపతియగు కన్నరాజున కంకితము చేయఁబడినది. అకన్నరాజు మల్లయామాత్యునకును భీమాంబకును పుత్త్రుఁడు. అతనికి రాయచాహత్తమల్ల యను బిరుదముగలదు. కవియెవరో తెలియదు.

యక్లిష్టత గాని, శబ్దకాఠిన్యము గాని కానంబడవు. కావ్య మంతయు, నింపు సొంపులతోఁ గులుకుచున్నది. ఈక్రిందిపద్యముల మురువంపుహరువుం దిలకింపుఁడు.

శా. వేణుక్రౌంచమృదంగదుందుభిలసద్వేవేద్రనాగోల్లస
ద్వీణావారిద మంజునాదములకున్ వియ్యంబులై యొప్పుని
క్వాణంబుల్ గలవాజి యిచ్చు పతికిం గల్యాణముల్ కంపనా
క్షోణీపాలక సుప్రతాప శుభముల్ స్తోత్రైకపాత్రంబులున్.

ఉ. సారపు నీలమేఘములఛాయలు ఛాయలఁబోవనాడి యం
భోరుహకోమలద్యుతికి బొమ్మల బెట్టి ప్రసన్నమై యంకూ
రరుచిప్రభావములఁ బోర జయించి మనోహరాకృతిన్
వారణ నొప్పుమీఱునది వాజులకెల్ల గుమారమస్మథా.

ఆశ్వికసైన్యబల మధికముగా నుండుటచే నశ్వపతులని పేరొందిన తురుష్క ప్రభువులతోఁ బోరాడుటకు విజయనగరరాజులును, అశ్వదళములను గొని విదేశములనుండి తెప్పించుచు వచ్చిరి. అశ్వముల నెక్కుడుగా నుంచుకొనుటచే అశ్వపరీక్ష యవసర మయ్యెను. కావున సంస్కృతములో నున్న శాలిహోత్రుఁడు మున్నగువారు రచించిన అశ్వశాస్త్రగ్రంథములను దేశభాషలలో భాషాంతరీకరింప నవసర మయ్యెను. కన్నడభాషలో అభినవచంద్రుఁడను బ్రాహ్మణకవి క్రీ॥ వె॥ 1400 సం॥రంలో అశ్వవైద్య మను గ్రంథమును రచించెను. తెనుఁగున మనుమంచనభట్టీయశ్వశాస్త్రమును సులభమైన శైలిని రచించి యాంధ్రదేశీయుల కపార మగు మేలొనరించెను.

చ. అరయఁగ సర్వలక్షణ సమంచితమైన తురంగరత్నమే
నరునిగృహంబునం దొకదినంబున నుం దగురీతి నుండు నా
పరమపవిత్రగేహమునఁ బాయకనిల్చు రమావధూటి శ్రీ
ధరునియురఃస్థలింబలె ముదం బెసలారఁ బ్రసన్నచిత్తయై.

# పాథేయము.

— కవితావినోద- అల్లంసెట్టి అప్పయ్యగారు-పొందూరు. —

---

గీ. వెలవెలంబాఱు రిక్కలు విధునిమ్రోల
విధుఁడు మార్తాండునెదుటను వెల్లఁబాఱు
విద్యచే మూఢభావంబు పెల్లడంగు
జ్ఞానమున విద్యచేఁ గల్గు గర్వ ముడుగు.

గీ. అడవిలోనెల్లచెట్లుండ ననువుపడును, చిన్నితోఁటలోనయ్యవికొన్నియుండు
జ్ఞానిచెంతకుఁబెక్కండ్రుపూనివత్తు,రల్పమతిచెంతఁగొందఱయాశ్రయింత్రు.

గీ. అంగటంగల వివిధఫలాళికంటెఁ, బెరటిచెట్టునఁ గల పండె సురుచిరంబు
గ్రంథములఁగాంచునీతులకంటెస్వయము,గాగ్రహించిననీతికిఁగలదువిలువ.

గీ. అగ్నికొంచెమయైన హెచ్చగును వీవ, నీరుఁ జల్లిన నది యెల్ల నాఱిపోవు
జ్ఞానమదికొంచెమైనఁబ్రోత్సాహవశత,వృద్ధిఁగనునాశమగునదిహేళనమున.

గీ. ఝరులు విస్తృతిఁ జెందు సాగరునిఁ జేరు
కొలఁది, మనుజులు పరమేశుఁ గొలిచి యతని
దరికిఁ జేరు కొలంది, నుదారభావ
కలితసమ్మోదవశతను గ్రాలుచుండ్రు.

గీ. పక్వమైమెత్తఁగానుండిపండు వెలయు, గట్టిదైబిట్టుగానుండుఁగసరుఁగాయ
కరుణచేనొప్పియుండునుఘనవివేకి, కఠినచిత్తుఁడై యవివేకి కలుషుఁడగును.

గీ. గాలివీచినఁ బుడమిపై ధూళి రేఁగు, నయ్యది యడంగు వర్షమావంత పడిన
గర్వమొదవునీశునిఁగూర్చికడఁగుచర్చ,నశ్రుధారలస్వచ్ఛమైయదియడంగు.

# గ్రంథస్వీకారము.

1. ప్రణయచాంచల్యము—ఆంధ్ర ప్రచారిణీగ్రంథమాలలోని ౬౭ వ పుష్పము. గ్రంథకర్త బ్ర॥ శ్రీ తేకుమళ్ల రామచంద్రరావుగారు యం. యే., బి. యల్. క్షమార్పణము అను గ్రంథమును వ్రాసినది వీరే యని పాఠకులు తెలిసికొనియుందురు. ముప్పదియైదు ప్రకరణములు ౨౭౫ పుటలు. ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయములో, పిఠాపురమున దొరకును. వెల రు 1-8-0

---

2. సర్వమధురము—ములుగు పాపయారాధ్యమహాకవి రచించినది. వరంగల్ శైవప్రచారిణీ ముద్రాక్షరశాలలో ముద్రింపఁబడినది. సంశోధకులు బ్రహ్మశ్రీ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారు- ప్రకాశకులు బ్రహ్మశ్రీ ములుగు వీరభద్రశాస్త్రిగారు. పాపయారాధ్యులు సంస్కృతమున కల్యాణచంపువు మొదలగునవి రచించెను. క్రిందఁ దెల్పఁబడు సరసహృదయానురంజనము మొదలగు మిశ్రకావ్యములను బెక్కింటిని విరచించెను. దేవీభాగవతముం దెనిఁగించెను "జగత్ప్రసిద్ధుఁడైన శ్రీరాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయనివారి మహాసంస్థానమున నీయన ప్రధానపండితుఁడు, పరమమిత్రుఁడు, గురుఁడుగా నుండినవాఁడు. ఆ ప్రభువిభావసుండు ౧౭౯౬ సం॥కు సరియగు ధాతువత్సరమున నస్తమించె"నని సంశోధకులు తెల్పియున్నారు, కావునఁ గవికాలము నద్దియే. ఈసర్వమధుర మచ్చతెనుఁగు ప్రబంధము. 520పద్యములను మూఁడువిన్నపములలో నిమిడ్చెను.

క. శ్రీమతి యనురాచూలిం,దామరవిరికంటి కేలుదమ్మిం గొనె నం
 చేమో వింటిమి తెల్పుమి,యామెతగదె డెందమునకు నామెతలంపుల్

క. అనినం బ్రాబలుకుల చి,క్కనుపొందఁగఁ జేయువాని యనుఁ గిట్లనియెన్
 నునుగాలిమేఁతపానుపు, టనువరి ముచ్చటల వినుఁ డటంచు వలపునన్.

అను పద్యములవలనను,

చ. ఇది యపరంజిసొమ్ముపయి నింపుగఁ గెంపులు చెక్కినట్టు లొ
 ప్పిదముగ మింటితెర్వరులఁ బెద్దల నిద్దఱఁ జెప్పు కబ్బమై
 మొదవులపాలతెమ్మెలన ముచ్చటలం గల ముగ్గుపాపయా
 రదు లొనరించు సర్వమధురంబున మూఁడవవిన్నపం బగున్.

అను గద్యప్రత్యామ్నాయపద్యమువలనను గథఁ దెల్పెడును. కవిత్వము మృదువుగను సర్వమధురముగ నున్నది, చూడుఁడు-

చ. ఇదివఱ కేమియయ్యె నిఁక నింతట నేమియుఁ జేయకుందువో
కదయను కొంకుమీఁదఁ గొఱగాదిదె డెందము దెల్పుదాన న
న్నెదఁగదియించి యేలుకొనవేనియుఁ బుట్టువు లెన్నియేని నె
త్తైదఁ దుద కీవె చేర్గడఁగఁ దీర్చెద నోర్చెద మీఁదియాసలన్.

చ. పిలిచినఁ బల్కఁడయ్యెఁ గనువేదురు చెందెఁ జలించె డెందమున్
కొలువెఱుఁగండు మేనిసొబగుం గనఁ డెవ్వరి పంపులేదు లో
వెలిదెలియండు దప్పియును వేసటయుం గడు పంటమానె నా
కలిజడదారిటిట్టు తనుగ్రమ్మిన నగ్గడె ఱేఁడు నంతలో.

జగ్గయ్యపేఁటలోని ప్రకాశకులకు వ్రాయఁగోరెదము. వెల రు ౧.

---

3. సరసహృదయానురంజనము—వరంగలు శైవప్రచారిణీ గ్రంథమాల 7 వ కుసుమము. సంపాదకులు కొడిమేల రాజలింగాచార్యులవారు- ఇది మిశ్రకావ్యము- కథ- కుమారస్వామి వివాహము మొదలగుచరిత్రము- వేయిపద్యములకు మించినగ్రంథము, అయిదాశ్వాసములు. మిశ్రకవిత్వమును హృద్యమైనది- కొన్నిపద్యములు.

మ. తలిదండ్రుల్ సకలార్థవేత్త లని వేదంబు ల్వచించుం గదా
తలపోయం ద్వదధీన నౌదు నను నర్థంబేల భావింపరో
తెలియంబోలు నరైన వల్లభ నినుం దేరాదె మజ్జీవనా
కులత ల్దీరుపరాదె యేల పలువాక్కుల్ కర్మభోగ్యంబగుః.

మ. నెలఁతా నీసహకారవర్తనము రాణించె న్సదా భోగమం
జులతన్ గొమ్మలకున్ ఘటిల్లెఁ గద మెచ్చుల్గా మరుస్కండలో
చ్చలితానుగ్రహముం బొసంగె నిఁక నైశాఖానుకూల్యంబ వై
కలకంఠీ లలితాంక సార్థకత చొక్కంబయ్యె నం చెన్నఁగః.

ఇది జగ్గయ్యపేఁటలోని ములుగు వీరభద్రశాస్త్రిగారియొద్దఁగాని వరంగల్ శైవప్రచారిణీ ముద్రాశాలలోఁగాని దొరకును. వెల రు 1-4-౧

---

4. కృష్ణార్జునసంవాదము—(ద్విపద)గయోపాఖ్యానము. దీనిని రచించిన కవి సంస్కృతప్రబోధచంద్రోదయ నాటకమునకు వ్యాఖ్యానము వ్రాసిన నాదెండ్ల గోపమంత్రి. హైద్రాబాదు రెడ్డివిద్యార్థి వసతిగృహము భాండాగార క్షేమంకరు లగు శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు సంపాదించి ముద్రింపించి ప్రకటించిరి. ముద్రితప్రతిలో లేక పరిషత్పుస్తకభాండాగారమున నున్న 4514 సంఖ్యగల తాళపత్రగ్రంథములో నున్న గ్రంథాదిచరణములు మే మిందు లోకమునకును ద్వితీయముద్రణమున వారు చేర్చుటకును నీక్రింద నిచ్చుచున్నాము.

"కాంతామనోహరాకార విస్ఫూర్తిఁ,గంతుజయంతసంకాశుఁడై తనరి
శ్రీయశోనిత్యుండు శ్రీకృష్ణదేవ,రాయసామ్రాజ్యభారధురంధరుండు
బలవదరాతి భూపతినతపాద, తలుఁడు సాళువతిమ్మదండనాథునకు
లక్ష్మీమహాదేవిలాలితనొప్పు, లక్ష్మమ్మకు జనించి లాలితశ్రీలఁ
బెరిఁగిన తిరుమలాంబికఁ బెండ్లియాడి, నిరుపమప్రాభవనిత్యుఁడై వెలసె
నతనికి ననుజుండు ననుపవర్తనుఁడు, చతురనానాగుణజాలకోవిదుఁడు
భద్రలక్షణ రామభద్రప్రసాద, సద్రాజ్యబహుళదక్షణవిచక్షణుఁడు
సమదశాత్రవరాజసచివమర్మంత్రి, తిమిరసూర్యుండు......
వరగుణాచారవిశ్వంభరాచక్ర, పరిపూర్ణయశుఁడు గోపప్రధానుండు
చండమహీధవ సాళ్వారితిమ్మ, దండాదినాథ సంతతకృపామహిమ
వినుతికెక్కిన కొండవీటిదుర్గంబు, ఘనత నేలుచు సొంపుగా నొక్కనాఁడు
నవరసజ్ఞులును బాంధవులు మాగధులు, కవులును రాజపుంగవులును గొల్వ
వన్నెగాఁగోవిదవర్గంబు......నున్నతశ్రీలఁ బేరోలగం బుండి
మద్వంశ్యకర్తయై మహిమనుతిగన్న, సద్వర్తనుండు విశ్వామిత్రపరాని
యజ్ఞవాటమునఁ బాయని వేల్పుగాన, విజ్ఞానమునఁ జాల వివరించి కొండ
వీటి కాభ్యంతరవిలసిత యజ్ఞ,వాటి కారాఘవేశ్వరునకు వరుసఁ
బ్రాకారగోపురప్రాసాదతతులు, శ్రీకరప్రభలచేఁ జెన్నొంది వెలయఁ
గట్టించి నలుగడఁ గాంతిగాఁ జేసి, మట్టుగా దేదీప్యమానమై వెలయఁ
బూరివ జ్రవైడూర్యపుష్యరాగములఁ, బరఁగంగ సోపానపంక్తులు గట్టి
బలితంపు హేమకుంభంబు లెత్తించి, వెలయంగ నిత్యనైవేద్యంబు కొఱకు
అలఘుతరశ్రీల కాస్పదంబగుచు, నలరెను మైదవోలనుపురోత్తమము

వినుతమహోత్సవవిగ్రహంబులును, బెనుపొందవేక్ష నర్పించి చిత్తమున
దనివోక వాక్ప్రౌఢి జాయగాఁగోరి, వనజాతబాంధవాన్వయవర్ధనునకు
నిరుపమరుచిహారినీలవర్ణునకు, పుద్దండదళితశంకరకార్ముకునకు
బంధురమూర్తికిం బౌలస్త్యదైత్య, గంధదంతావళకంఠీరవునకు
శతముఖప్రముఖనిర్జరనికురుంబ, నతపదాంభోజాతునకులస త్కొండ
పీటికాభ్యంతరవిలసితయజ్ఞ, వాటికారాఘవేశ్వరునకుఁ బరమ
శాంతమానసునకు జానకీపతికి, నెంతయుఁ బ్రీతిగా నేరచియించు
చారుకృష్ణార్జునసంవాదమునకు, నారూఢవృత్తాంత మది యెట్టిదనిన
శ్రీవత్సలాంఛను శ్రీరామచంద్రు, భావంబులోన సద్భక్తిఁదలంచి
మును నైమిశారణ్యమున శౌనకాది, మునులు సూతుని జూచి మురవైరితొల్లి."

అంతమునఁ గొంతభేదముగలదు.

...శౌనకాదిప్రసిద్ధ, మునులకు వేడ్కతో మును విన్నవించె
ఘనపురందరశిలాఘనవర్ణు పేర, సనకాదియోగీంద్రసన్నుతు పేర
...వత్సలు కొండ, పీటికాభ్యంతవిలసితయజ్ఞ
వాటికారాఘవేశ్వరు పేర వెలయ,
భూచక్రమునన్నృపపుంగవసభల, నాచంద్రతారార్కమై.

ఈభాగములో, కొండపీటిలో, తమగోత్రకర్తయైన విశ్వామిత్రుని క్రతు రక్షకుఁడైన "యజ్ఞవాటికారాఘవస్వామియాలయము బాగుచేయించినట్లును, ఆదేవునకు మైదవోలను గ్రామమిచ్చినట్లును మొదలైన చరిత్రము కొంత కనఁబడుచున్నది.

గ్రంథపాతములును దప్పులును బరిషత్పుస్తకమునందును గొన్నిగలవు. ముద్రితప్రతిప్రారంభపత్రమునకును, పరిషత్ప్రతిప్రారంభపత్రమునకును చాలభేదము కన్పట్టుచున్నది. రెండుపాఠములు న్యోకనోట వెలువడినవిగాఁ దోఁచదు. ఈగ్రంథము వెల రు ౦-౬-౦ హైదరాబాదులో శ్రీయుత సురవరము ప్రతాపరెడ్డి బి. ఏ., బి. యల్. గారియొద్ద దొరకును.

---

5 వేదాంతగీతాడిండిమము—శ్రీశంకరభగవత్పాదాచార్యుల సంస్కృతమునకుఁ దెనుఁగు- తూ॥ గోదావరి, గవర్న మెంటు మేడపాడు బోర్డుబాలికాపాఠశాలా ప్రధానోపాధ్యాయులు బ్ర॥ పెండ్యాల నారాయణశర్మగారిచే నాంధ్రీకరింపఁబడినది. 94 గీతపద్యములు. కొన్నిపద్యములు చిత్తగింపుఁడు—

గీ. సత్యమెప్పుడు బ్రహ్మము జగము మిథ్య, జీవుఁడే బ్రహ్మమితరునిఁజెప్పవలదు
దీనిఁ దెలిసిన మనుజుండు తేజరిలుచు, ముక్తినొందుట తథ్యంబు ముద్దుకృష్ణ.
గీ. బ్రహ్మజీవులభేద మబద్ధ మెపుడు, సత్త్వచేతను లేదుసూ జగతి సత్త్వ
లన్నిటికి భేదముండెను ననెడిమతము, ఇలను లేదెంచి చూచిన నీశకృష్ణ.

సంస్కృతపరిచయములేని మోక్షార్థులీపవిత్రగ్రంథము నుపయోగించికొని కృతార్థు లగుదురుగాత. గ్రంథము కవిగారియొద్దనే దొరకును. వెల వేయఁబడి యుండలేదు, గాన, నిది మఱియు వెలలేనిది.

## 6. కథాసుమాంజలి.

తెలుఁగుకథలు- బ్ర॥ శ్రీ చెన్నపురిసేవాసదనములోని తెలుఁగుపండితుండగు ఆకుండి వెంకటశాస్త్రిగారు, పిఠాపురం హైస్కూలులో నుపాధ్యాయులు బ్ర॥ శ్రీ మాచిరాజు సీతాపతిరావుగారు, కురుమెళ్ళ వెంకటరావుగారునను ముగ్గురచే రచియింపఁబడిన 72 పుటలపుస్తకము. చెన్నపురి, శంభుదాసువీథిలోని టి. వి. చెల్లప్పశాస్త్రి అండు సన్సువారు ప్రకటించిరి. ఇందు హుశేషన్, మూఁడుప్రశ్నలు, మీనలాదేవి, యూలిసిస్, కృష్ణకుమారీదేవి, కర్మాదేవి, మనోరమ, భ్రాతృవాత్సల్యము నను నెనిమిదికథలు గలవు. అందందు, వ్రాఁతతప్పులు గలవు. ఐదనుఁడు కొంచమువివేకి- ఉత్తరప్రత్యుత్తరములఁ జఱపుచు, అంగస్పర్శనము, ఆతనికివ్వబోవు నెడ- అఱసున్నలు బండిరాలు నొక్కనియమముగా లేవు. శైలి చాలభాగము సుగమముగనే యున్నది. 33 పేజీలోనుండి కొంత,

"ఒకనాఁడు కృష్ణకుమారి దేవళమున కేగి తనచెలికత్తెలతో సరససల్లాపము లాడుచు గృహమున కేగుచుండ రామసింగు ననుచరవర్గములోని ముగ్గురు దుండగీండ్రు తమముఖము లితరులకుఁ గనఁబడకుండఁగ వికృతవేషములఁ దాల్చి వచ్చి యామె నాకస్మికముగ ముట్టడించి బంధించి వైచిరి. అట్లు బంధించి సమీపమున నున్నయొకపొదలోని కీడ్చివైచిరి." దీని వెల రు 0-4-0 పై చెల్లప్పశాస్త్రి అండు సన్సువారియొద్ద దీనితోపాటు- పాఠశాలలలో నుపయోగపడు పుస్తకములు, వాచకములు, భూగోళములు, కథలు, మొదలగునవి దొరకును. పుస్తకములపట్టికకై వ్రాసి తెప్పించిచూడుఁడు.

## 7. శ్రీవీరేశలింగస్మృతి.

గుంటూరు బ్ర॥ రాయసము వెంకటశివుఁడు ఎం. ఏ. యల్. టి. గారు వ్రాసినది. కీ॥ శే॥ రావుబహద్దరు కందుకూరి వీరేశలింగముపంతులుగారి జీవిత చరిత్రములోని కొన్ని భాగములు. ఇందు 12 ప్రకరణములు గలవు. శ్రీ వేంకటశివుఁడుగారు పంతులుగారితోఁ గల పరిచయమున నపుడపుడు గ్రహించిన వారివిషయము లన్నియు నిందుఁ గూర్చుచువచ్చిరి. వీరేశలింగముపంతులుగారి చరిత్రము జగద్విదితము. గ్రంథముం జదివి తెలిసికొందురని విశేషించి యిందు వ్రాయఁబూనలేదు. వెంకటశివుఁడుగారు పంతులుగారియం దున్న భ్రమప్రమాదాగులను మంచిచెడ్డలను నిందు నిష్పక్షపాతముగ వివరించిరి. దీనివెల 0-8-0 ఇదియేకాక యితరములగు కథాగుచ్ఛము, కమలాక్షి, రాజేశ్వరి, చిత్రకథామంజరి, వ్యాసావళి, హిందూసుందరీమణులచరిత్రము మొదలైనవి గుంటూరులోఁగాని, భీమవరములోఁగాని రాయసము వేంకటశివుఁడుగారి యొద్దను-గుంటూరు, భీమవరము, నరసాపురములలో రాయసము సోదరులయొద్దను దొరకఁగలవు.

---

8. ఆత్మకథ—ద్వితీయసంపుటము ఇందునాలు, ఐదు భాగములు గలవు. మహాత్మగాంధీగారి యాత్మకథకుఁ దెనుఁగు. నాలుగవభాగములో ౪౭ విషయములను, అయిదవభాగములో ౪౩ విషయములును గలవు. ఇది మహాత్ముని యాత్మకథయే గాని, ప్రతిమానవునకును నాత్మజీవనమున కుపయోగపడును. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని యధ్యాత్మవిదులు వేదాంతమనియు నిట్లు పలువురు పలుదెఱంగులఁ దలఁపఁదగియున్నది. శతావధాని బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి యనువాదమును దగినట్లు హృదయంగమముగ నున్నది- శైలికై పూర్ణాహుతి ౩౮౭ పుటలోని కొన్ని బంతులు.

“సత్యముకంటె వేఱుగా పరమేశ్వరుఁ డొకఁ డున్నాఁడని నా కనుభవములేదు. సత్యమున కహింసయే రాజమార్గమని యీ గ్రంథమందలి ప్రతిపుటయుఁ జెప్పఁజాలనిచో నల నా యీ ప్రయత్నమంతయు వ్యర్థమని తలంతును. నా ప్రయత్నమంతయు వ్యర్థమయినను నాసిద్ధాంతము వ్యర్థము కాదు. ఇంతకును నాయహింస సత్యమైనను అపక్వముగనే అపూర్ణముగనే యున్నది. కావున నాకనుఁగొనఁగలిగిన దాసత్యసూర్యునిలో నొకకిరణమే.” ఇది మహాభారతములోని, ఉపవాసవ్రతముకంటె వేఱుతపము లేదు. వ్రతమనఁగా మేని ప్రస్నదనము నివురచేతగాదు, సత్యమునహింసయును గాని” యనియున్నమాటలను దలపించుచున్నది. 388 పుటలమూలమును 46 పుటలు అకారాదిపదాదిసూచియుఁ గల దీని వెల రు 1. ఆంధ్రపత్త్రికాకార్యాలయమున దొరకును.

ప్రళయకాలతాండవలీలఁ బ్రజ్వరిల్లు, ఫాలలోచను నుగ్రరూపంబు వోలె
నంబరంబును దిక్కులు నాక్రమించి, యతిభయంకర మయ్యె నాయంబుదంబు.

వ. ఆలో నమ్మహావాయువు తలక్రిందుగా ద్రేసిన. ౧౦౩

క. కలజను లందఱు నెంతయుఁ, గలకలమున నార్తిఁ బొందఁ గల మవియంగాఁ
గలఁగక సముద్రదత్తుఁడు, పలక యొకటి వట్టి యీఁదెఁ బటుధైర్యమునన్.

క. నను నప్పు డొక్క మీనము, గని మ్రింగుట నల్ల దానిఘనతరకుక్షిం
దను వైకల్యము నొందక, యనపాయత నుండితిం జిరాయువు కలిమిన్. ౧౦౪

శా. నాపుణ్యంబున నొక్క జాలరి వలం దన్మత్స్యముం బట్టి గ
ర్భాపాయం బొనరించి నన్నుఁ గని యత్యాశ్చర్యముం బొంది య
త్యాపన్నత్వముతోను ద న్నడుగఁ దా నద్దీవిపే రత్త్రట
ద్వీపం బన్న విధి న్నుతించి కడుఁ బ్రీతిం బొందు డెందంబుతోన్. ౧౦౫

క. యతిపతి చెప్పిన సత్య, వ్రతుఁ డనువృద్ధుకడ కేగి వానికి నేఁ జె
ప్పితి నాదగు వృత్తాంతం, బతఁ డెంతయుఁ జోద్యపడఁగ నాద్యంతంబున్.

క. నామాటలు విని దాశ, గ్రామణి కనకాఖ్యపురము గల దిల నవఁగా
నేమఱ వినము వినకున్నను, నే మగు వీను మప్పురంబు నెఱుఁగు తెఱంగున్.

ఉ. దీవులవార లెల్లఁ జను దెంతురు బారసి గాఁగ నెల్లి ల
క్ష్మీవిభుఁ గొల్వ నచ్చుటికిఁ జేరువఁ బుష్కరనామసంజ్ఞ మ
ద్దీవికి హేమ పట్టణము నిశ్చయ మద్ది యెఱుంగవచ్చు వే
నీవును నేను నచ్చుటికి నేగుద మంచుఁ బరోపకారతన్. ౧౦౬

క. నను నాదీవికిఁ దోడ్కొని, వననిధినడుమ నరుగ నొక వటముసమీపం
బున నోడ దైవవశమున, ఘనమగుసుడిఁ బడిన నేను గంపింపంగన్. ౧౧౦

గీ. చలన మొందక యవ్వటశాఖఁబట్టి, వేగ మెక్కి కలము సుడి వెడలఁదెచ్చి
నిన్ను నెక్కించుకొనియెద నన్న నట్ల, యతిరయంబున నెక్కితి నక్కుజంబు.

క. సుడి పెంపర వడి ముంపఁగ, వెడలింపఁగరాక దాశవిభుఁడు వివశుఁడై
జడనిధిఁ గలంబుతోడన, పొడవడఁగెను నాదుమనము పురపురఁబొక్కన్.

వ. ఆలోన లో నార్తిం బొంది యు ట్లంటిని. ౧౧౩

మ. చెలులం గానక కానలోఁ దిరుగఁగాఁ జేమాయల స్థానినుల్
వలలం బెట్టిన నిక్కువంబు లనుచు న్వాంఛారతి న్వచ్చి యా
పలుపాటు ల్వడి పీనిఁ జేరి యితఁడుం బాపంబు దైవంబుచేఁ
బొలియంగా నిటు దిక్కుమాలుదు నె యంభోరాశిమధ్యంబునన్. ౧౧౪

క. తరుణుల వరించి కనియెద, ధరణీశ్వరు ననినయూస దైవము చెఱచెన్
మరణము శరణని యంతః, కరణంబున నిశ్చయింపఁగా నట్టియెడన్. ౧౧౫

వ. ఆక్రోశదనర నాకాశవాణి యిట్లనియె యక్షుం డొక్కరుం డొక్కమహా మునిశాపంబున నిచ్చట నీవృక్షంబై నిలిచె నీవు దొలంగిపోయిన శాప మోక్షంబు నొందెడు నీవు మరణోద్యోగంబు మాని నేఁ డీతరువున వసియింపు మెల్లి కనకపురంబుఁ గనియెద వనిన నద్భుతం బంది యదియుం జూచెదఁగాక యని యున్నంతను. ౧౧౬

క. భూపాల నాఁటిరాత్రి మ, హాపక్షులు గొన్ని వచ్చి యాందలిఘనశా
ఖాపంక్తి నంది యాశ్చ, ర్యాపాదసమున్నతోజ్జ్వలాకారమునన్. ౧౧౭

వ. అట్లుండి యమ్మహావిహంగంబు లెల్ల రేపకడఁ గదలి కనకపురంబునకుం బోద మని తమలో మనుష్యభాషల సంభాషించిన సంతోషించి. ౧౧౮

క. అం దొక్కపక్షిఱెక్కల, సం దల్లనఁ దూఱి నెమ్మి శయనించితి నేఁ
జెంది వసించుట యించుక, యుం దెలియకయుండె దాని కురుతనువగుటన్.

క. వేవినఁ గద లెఱుఁగుచు నే, నీవికొని వసింపఁ బక్షు లెల్లను జనఁగా
నావిహగము చని కనకపు, రీవృక్షమునందు నిలువఁ బ్రియమెసలారన్.

క. ఆపులుఁగుఱేనిఱెక్కల, లోపల మెలపార వెడలి లోచనపర్వం
బై పూర్ణగరిమఁ దనరెడు, నాపురముం జొచ్చి వీథినరిగెడు వేళన్. ౧౨౧

క. మేడపయినుండి కనుఁగొని, వేడుక యెసలార నొక్కనెలఁది వనుపఁగాఁ
బ్రోడచెలి వచ్చి నన్నుం, దోడుకొనుచు నరిగె నవ్వధూమణికడకున్.

వ. అప్పుడు. ౧౨౩

సీ. జిగిదొలఁకాడెడు చిగురాకుఁగెమ్మోవి పగడంపుఁదీఁగెలబాగుఁ దెగడ
నిడువాలుఁగన్నుల నెఱయుక్రొమ్మించులఁదొలుకారు మెఱుఁగులచెలువు గెలువఁ
జెన్నుదొలంకెడు చిఱునవ్వునెమ్మోము నిండుఁజందురునకు నెఱసు చూప
నునుమించుపచరించు ఘనకుచయుగళంబు కనకకుంభంబుల గారవింపఁ
బలుకనేర్చిన కనకంపుఁ బ్రతిమవోలె, రామయై యొప్పుశృంగారరసమునం
నఖిలమోహనమూర్తియైయతిశయిల్లు, నన్నలినగంధిఁ బోడగంటిఁగన్నులలర.

క. ననుఁ గనుఁగొని యయ్యంగన, యనురాగముఁ గౌతుకంబు నలవడ సంభా
వనము లొనరించి మదిలో, ననురాగము బెరయ నిట్టు లనియె న్నాతోన్

సీ. వీరచూడుఁ డనెడు విద్యాధరుఁడుగాంచె వనితల నలువుర వారిలోన
నగ్రజ చంద్రప్రభాఖ్యమైఁ దనరుచు, నాతోడఁబుట్టిన నలినముఖులు
పద్మరేఖయు శశిప్రభయును సుప్రభయును నను వారల ముని శపింప
భూమిపై జనియించి పుట్టెఱింగినవారు వారలఁ బాసినవగపుచేత
వనమునకు నేగెఁ దపసియైజనకుఁ డిప్పు, డేను జెలియంద్రరాకకు నెదురుచూచు
చున్నదాన మనంబున నొంటుతలఁపు, మానిబోటులతోడఁ గుమారచంద్ర.

క. నరుఁ డొకరుం డాతురుఁడై, నిరుపమవిలసనుఁడు వచ్చి నిన్నును నీసో
దరులను వరించు నని శాంకరి యానతి యిచ్చె నాకుఁ గరుణ దలిర్పన్.

ఉ. అంబిక యానతిచ్చిన సమగ్రవిలాసిని నీవ కాఁగ డెం
దంబున నిశ్చయించి ప్రమదంబు వహించితి నిన్వరింతు నె
య్యంబునఁ గన్యకల్ జనకునాజ్ఞను నాథు వరించు టెందు న
ర్హం బటుగాన తండ్రికిఁ బ్రియం బెసలారఁగఁ జెప్పి వచ్చెదన్. ౧౨౯

క. ఏ మరిగి వచ్చుదాఁకను, నేమంబున నిచట నుండు నిశ్చలమతివై
యీ మేడమీఁది నెలవుల*, కైమఱచియుఁ బోకుమనుచు నరిగెఁ జెలులతోన్.

వ. ఇంతి యరిగిన యనంతరంబ. ౧౩౦

క. ఈమీఁద నెలవుచూడకు, మీ మఱచియు ననుచుఁ జెప్పి మెలఁతుక చనెనం
దేమేమి యుండునో యని, యామీఁదటి నెలవు కేగి యాసీమమునన్.

క. వరరత్నమయముచుంగడుఁ, గర మొప్పెడు నఱలుమూఁడుగని యందొకమం
దిరము కవాటంబు దెఱచి, పరికింపఁగఁ లోన నొక్కపర్యంకమునన్.

వ. ముసుంగిడినరూపంబుఁ గనుంగొని తదావరణంబు దొలఁగించిన. ౧౩౩

సీ. గవిసనవుచ్చిన నవకాంతినొప్పారు వలరాజుకోదండవల్లి యనఁగఁ
జేటిక దెఱచిన బెడఁగుమీఱుచునున్న పూవిల్తు రత్నంపుబొమ్మ యనఁగ
నొఱ వాప నందంద మెఱుఁగులు చల్లెడు పుష్పబాణుని ఖడ్గపుత్రి యనఁగ
నలుక నిద్ద ముసుంగు దొలఁగఁ బుచ్చిన నొప్పు భావజుపట్టపుదేవి† యనఁగ
మెఱసి వెడలంగ వెలుఁగొందు మెఱపుపోలెఁ
ముసుఁగుపుచ్చినఁ దనుదీప్తి ముసుఁగువడఁగఁ
జూడఁ గన్నులపండువై సొబగుమిగులు
కామినీమణిరూపంబు గాననయ్యె. ౧౩౪

---

* నిలుఫుల-అని కలదు. † పట్టనదేవి-మూ.

క. ఆరూపు చూచి మదనవి, కారము మదిఁ దనర నిద్రగదిరినయదే యి
న్నారీమణి నిద్ర దెలిపి, యారయఁగ సుఖాబ్ధి నోలలాడెద ననుచున్ ౧౩౬

గీ. తెలిపి తెలిపి యెట్లుఁ దెలియకయుండిన, నిద్ర గాదు దీర్ఘనిద్ర యనుచు
నట్టు నిట్టు నిట్టి యసమానవిలసనం, బేల కలుగు ననుచుఁ జాల బ్రమసి.

వ, కొంతతడవునకు డెందంబునం దెలివి నొంది యూర్పు లరసి సజీవం బని
నిశ్చయించి యాశ్చరంబు నొంది. ౧౩౭

క. చైతన్యము లేకుండియు, నీతరముం జెన్నుగలిగె నింతితనువునం
జైతన్యము గలిగిన నీ, నాతిచెలువు వొగడవశమె నలువకునైనన్. ౧౩౮

వ. అని యెప్పటి యట్ల చేల గప్పి తొలఁగి వచ్చి యాసంగడినున్న మందిరం
బుఁ బ్రవేశించి ముందటిచందంబు రూపు గనుంగొని ముసుంగువుచ్చిన.

క. చంద్రప్రభఁ గనుపట్టె ను, దంచిత కాంతిని సముజ్జ్వలాకృతితోడన్
సంచారఖేదమున ని,ద్రించిన శారదశశాంక రేఖయుఁ బోలెన్. ౧౪౦

క. తొంగలిఱెప్పలమెఱుఁగులు, తొంగలిగొనుమేను వదనతోయరుహంబున్
శృంగారనిద్రఁగూరె ల,తాంగి యనుచుఁ దలఁచి చాల ననురక్తిమెయిన్.

వ. తెలిపి యెట్లునుం దెలియకున్న మున్నింటి యింతిచందం బగుట యెఱింగి
నివ్వెరఁ గందుచు. ౧౪౨

క. అత్తరుణి రూపురేఖయుఁ, జిత్తమునకుఁ జాల వేడ్క సేయఁగఁదొడఁగెం
జిత్తరువుచందముననుం, బుత్తడిరూపుగతి రత్నపుత్త్రిక పోల్కిన్. ౧౪౩

వ. అని యచ్చెలువచెలు వుగ్గడించి. ౧౪౪

క. ఆవనితకు ముసుఁగిడి చని, యావలిమందిరముఁ జొచ్చి యందును నొకవ
స్త్రావృతరూపము పొడగని, యావరణము వుచ్చి చూడ నాశ్చర్యముగన్.

వ. పరోపకారిభూపాలనందనరూపం బగుట యు నాపోవక కనుంగొని విస్మ
యంబుఁ బొంది యరసి మఃన్ను పొడగన్న యన్నాతులయట్ల యగుటం
దెలిసి యుల్లంబు జల్లన మూర్ఛిల్లి యెంతయుం దడవునకుం గొంత తెలి
విం బొంది. ౧౪౬

శా. ఈవామాక్షి సముద్రముం గడచి యెట్లేతెంచెనో వచ్చెఁబో
చావంగాఁ గత మేమి ఖేచరజనస్థానంబునన్ దీనికై
చావు న్నోవును నొందుపాటువడి బల్చందంబులం జేరితిన్
దైవంబా యిటు లేల చేసితివి తంత్రంబో మరుంజాత్ర మో.* ౧౪౭

* చేశితిది నితంత్రంబ్బొమరుఞ్జంత్రమో- మూ.

అని దైవంబు దూఱి యవ్వామనయన నుద్దేశించి. ౧౪౯
తరుణి నీకుచపర్వతము లెక్కఁగాఁ గోరి దారుణోన్నతపర్వతంబు లెక్కి
మగువ నీముఖచంద్రమండలాకృతిఁ జూడఁ దమకించి బహుమండలములు చూచి
యంగన నిన్ను రాగాబ్ధి ముంపఁ దలంచి యతిదుష్కరం బైనయబ్ధి మునిఁగి
జలజాక్షి నినుఁ జూపువలఁ దగుల్పఁగఁ బూని పలుపాటులను విధివలలఁ దగిలి
కనకపురము గాంచి కడుఁ బ్రమోదము నొంది, నిన్నుఁ జూతు ననుచు నున్నచోట
నేల వచ్చి తిచట కేల యీదశ నొంది, తేల నన్ను నొంచె దిందువదన.
అని విలాపించుచు మదనతాపంబునం గాలుకొనలేక సౌధోపరిభాగంబునం
జరియించుచున్నంత. ౧౫౦
క్షితినాథ మాయతురగం, బతిరయమున మేడ మీఁది కరుదెంచి సము
న్నతఖురమునఁ జిమ్మిన న,ద్భుతముగ నావర్ధమానపురమునఁ బడితిన్.
పడి మూర్ఛనొంది యెంతయుఁ, దడవునకుం దెలివినొంది తత్పుర మగు టే
ర్పడ నెఱిఁగి నాదుపాటులు, గడువ న్మగుటకును వగవఁగా నవ్వేళన్.
కనకపురిఁ గనినవారికిఁ, దనపుత్త్రికఁ గనకరేఖఁ దగుధనములతో
మనుజేంద్రుఁ డొసంగెడు నని, జను లెఱుఁగఁగ నగరవీథిఁ జాటం గంటిన్.
ఆచాటు విని కనకపురి, చూచినరూపంబు రాజసుతగా దనుచు
న్నాచిత్తము కలఁక యుడుగ, వేచని తొంటిగతిఁ బతికి వినిపించుటయున్.
ఆనరపతి పుత్త్రికయును, దానును నొక్కెడన యుండి తగఁ బిలిపింపం
గా నరిగిన ననుఁ గనుఁగొని, యానెలఁతుక తొంటిధూర్తయని పలుకుటయున్
నాఁ డెఱుఁగం గాని నేఁ డెఱింగితిఁ జెలి యత్యగమ్యం బైన యప్పురమున
కరిగి చంద్రప్రభ యనుకాంతఁ బొడగంటి నది తనసోదరు లైన సతులు
మునిశాపమున మర్త్యమును బొంది రని చెప్పి నను వరించెద నని జనకుకడకు
నరిగిన నేను సౌధాగ్రంబునకు నేగి మూఁడుతల్పంబుల మూఁడుయువతి
రూపములఁ గంటి నందొక్కరూపు నీవు, రూపమై యున్న వెరఁగంద నేపు మిగిలి
తురగ మొక్కటి నినుఁ జేరఁ గొరిజఁ జిమ్మఁ, బడితి నిప్పురిలోపలఁ బద్మనయన.
అనినమాటలు విని యాక్షణంబ యమ్మానిని విగతజీవ యైన నాశ్చర్యంబు
నొంది యంతన తెలివొంది యాకనకపురిసౌధాగ్రంబునం గనినమానినీరూ
పంబులు మూఁడును దత్సోదరుల నైజరూపంబులు గానోపు నందు మూఁడవ
ద్రూపం బీయింతిది, దీనిజీవం బచ్చోటి కరిగినది నాకు నిచ్చటం దడయం

బని తే దన్నలువుర వరియింపక కమలాకరమహీవరదర్శనంబును సమ
కూరదు గాన మున్ను చనిన మార్గంబునం జనియెదం దత్తరుణీవరణంబు
దైవనిర్మితం బగుట నాకు నవశ్యంబును హేమపురదర్శనంబు సిద్ధించు ననుచు
నిశ్చయించి వెడలి మున్ను చనిన సముద్రతీరంబున కరిగి యచ్చట. ౧౫౭

క. జలనిధిలోపల నాఁ డట, కల మవిసిన బ్రదికి వచ్చి కడఁజేరిన యా
చేకాని వైశ్యునిం గని, యలరుచు నాక్రమముఁ జెప్ప నాతఁడు ప్రీతిన్.

ఉ. నన్నొక యోడఁబెట్టి జతనంబుగ వారిధిలోనఁ బంచినన్
మున్నిటి దాశనాథుని తనూభవ లున్నెడ కేగి యేను మున్
జన్నవిధంబుఁ దజ్జనకుచన్న తెఱంగును జెప్ప నయ్యె నీ
వన్న పథించి వచ్చి తని*పల్కుచు నెంతయుఁ బాపబుద్ధులై. ౧౫౯

క. చండికి బలిసేయుద మని, చండతఁ బాదములఁ బెద్ద సంకెల యిడినన్
బెండువడి వారిగృహమున, నుండఁగ నవ్వేళ దైవయోగము కతనన్.

ఉ. అన్నవకౌను మించుదొలఁకాడెడు మేనును వల్దచన్నులుం
జెన్ను మొగంబునుం గురులుఁ జిత్తజతూపులఁ బోలుచూపులున్
నన్నలరింప నిందుమతి నాఁ జను దాసనరేంద్రపుత్త్రి నా
యున్ననికేతనంబునకు నొక్కతెయుం జనుదెంచి వేడుకన్. ౧౬౧

చ. జలజదళంబులం జఱచి చంద్రమరీచుల గేలిసేయుచుం
గలువల యొప్పులం దెగడి కారుమెఱుంగుల మించి కామున
మ్ముల చెలువంబు గీడ్పఱిచి ముత్తెపుజల్లులఁ బోలఁజాలు చూ
పుల ననుఁ గప్పి నామది నపూర్వకుతూహల మావహిల్లఁగన్. ౧౬౨

గీ. దాశరాజపుత్త్రి తద్దయు వేడ్కతోఁ, జెలువ మడరుచూపు వలలు విచ్చి
యవ్వి...బ్బులగుటనపుడనాకన్నులం,గలుగఁజేసెఁ దనదుకులవిధంబు.

వ. అట్లు నన్నుం దగులించి తనమనంబున మిగులన్ దిగులొంది. ౧౬౪

క. పర్వినకూరిమిఁ జనవున, గర్వంబున నపుడ నానిగళమూడ్చి గృహం
తర్వర్తు లెఱుంగఁగ గాం, ధర్వవివాహమున నన్నుఁ దగవరియించెన్.

శా. ఆలీలావతితోడి లీలలఁ బ్రియం బారంగ నందుండఁగా
బాలేందుం గలయంధకారము గతిం బ్రద్యోతిదంష్ట్రాంకిత
త్కోలం బొక్కటి వచ్చి తత్పురమునం గోలాహలోదగ్రతం
గ్రాలంగాఁ గని విల్లు గైకొని భుజాగర్వం బఖర్వంబుగన్. ౧౬౬

* వన్నివిధించి వచ్చెనని- మూ.

క. చని కూడముట్టి యుజ్జ్వల, ఘనశరమున నెఱను నొప్పఁగా నేయుటయుం
దనుకొంది పంది యతలం,బునగొందికి నరిగె నొక్కభూవివరమునన్.

క. వెంటనె యతలమునకుఁ జని, యంటఁ దఱిమి జమునిపాలి కనిచి యచటనేఁ
గంటిఁ గొలనిదరి వాలుం, గంటి నొకతె నొంటి మెలఁగఁగా నచ్చోటన్.

ఉ. అన్నగుమోమునుం జిగియు నాతెలిగన్నుల క్రొమ్మెఱుంగు లా
పెన్నెఱివేణి నీలరుచి పెంపును నా బిగిచన్నుదోయి య
త్యున్నతిసొంపు నామృదుతనూజ్జ్వలకాంతియుఁ గాంతలందు ము
న్నెన్నఁడుఁ జూడ నేను జరియించిన భూములలోన భూవరా. ౧౬౯

వ. అమ్మోహనాకారం జేరం జనుటయు నది యిట్లనియె. ౧౭౦

క. ధరణీశ్వరనందన నే, సురరిపుచేఁ బడితి వాఁడు సూకరమై నీ
శరమున నిహతిం బొందెను, వరిఘంపుము నన్ను ననిన వారని వేడ్కన్.

క. అనుపమ మగునా తొయ్యలి, మనసిజభోగములఁ దేల్చి మచ్చికతో నిం
పెనయఁగ నావృత్తాంతము, వినిపించుటయుం బ్రమోదవికసితముఖియై.

సీ. కనకరేఖయు దాశకన్యయు నేను, జంద్రప్రభారమణి సోదరుల మేము
మునిశాపవశమున ముప్పురమును మర్త్యజనిఁ బొందినారము గనకపురముఁ
జూచినమనుజునిం జూచినఁ గనకరేఖకుఁ దొంటి శాపమోక్షంబు గలుగు
వానిఁబొందఁగ దాశవరతనూజకు నాకు మనుజజన్మము మానునని యుఁగలదు
కనకరేఖయుఁ దనమూర్తిఁ గలసెనిన్నుఁ, బొందెఁగావున నటుచనునిందుమతియు*
నేనునరిగెద మాతొంటిమేనికేము, పొందఁగలమింక నిను హేమపురమునందు.

క. ఏ నీమేను దొఱఁగిచనఁ, గా నీవును వీఁక వెడలు గహ్వర మాలో
నానిజదేహము నొంది వి, మానముఁ బుత్తెర రమ్ము మాపురమునకున్.

వ. అని పలికి యాక్షణంబ మే నసలజ్వాలలం దొఱంగి యరుగుటయును నావ
చ్చిన మార్గంబున వెలువడి విమానంబున కెదురుచూచుచున్నంత. ౧౭౫

క. రాజితమణిఘృణు లెసఁగ, న్రాజమరాళములు పూనిన విమానంబుం
దేజోనిధి యొకఁడు ఖచర, రాజాజ్ఞం దెచ్చుటయును బ్రముదం బెసఁగన్.

క. ఆవరయానము నెక్కి న, భోవీథిని వీఁకఁ గనగపురమున కరుగం
గా వీరచూడుఁడు బహుసం, భావనము లొనర్చి యపుడు భావం బలరన్.

* ఇందుమతి బిందుమతి యను రెండు రూపములుం గలవు.

క. శ్రీ నెఱయఁగఁ దనకన్యల, నానలువుర నోలిఁ బరిణయము చేసి లస
చ్ఛీనాంబర మణిభూషణ, నానావిధపంక్తు లిచ్చినం బ్రమదమునన్.

వ. ఆలీలావతులతోడి యభీష్టలీలల విహరించి మిమ్ముఁ గాంచు తెఱంగూహించి

ఉ. మానినుల న్వరించి మఱి మానవనాథునిఁ గాంచె దంచు నా
కానతి యిచ్చె మాని తడయం బనిలేదు విమానమెక్కి యం
భోనిధి మీఁదుగా నరిగి భూస్థలి చూడఁగ నెవ్విధంబునం
గానఁగ నయ్యెనం చతని(?) గ్రక్కున నేగెద నన్ దలంపునన్. ౧౮౦

వ. వచ్చి వచ్చి యిచ్చట దేవరం గాంచి కృతార్థుండనైతి ననిన నందఱుం బ్ర
మోదభరితు లైరి తదనంతరంబ. ౧౮౧

ఉ. భట్టి యుగంధరాదినరపాలకమంత్రిమహాప్రవాహసం
ఘట్టనధీధురంధర వికారవిదూరవిలాసబంధురా
పట్టపటావళీకనకభద్రమదావళభూరిభూషణా
రట్టజవాజిరత్ననికరక్రమ పూజితకాలకంధరా. ౧౮౨

క. శారదనీరదనారద, పారదబిసశారదాబ్జభాసిత్వరియశః
పూరఘనసారపూరిత, సారసగర్భాండభాండ సదవనశౌండా. ౧౮౩

మందారదామము. సంగీతసాహిత్య సారస్యలోలా,శృంగారలక్ష్మీవశీకారలీలా
అంగాధిపౌదార్యహారిప్రదానా, అంగీకృతశ్రీమదాదిప్రధానా. ౧౮౪

గద్యము:—ఇది శ్రీమద్వెన్నెలకంటి సూరనామాత్యపుత్ర హారితసగోత్రపవి
త్రసుకవిజనవిధేయ అన్నయ నామధేయప్రణీతం బైన షోడశకుమార
చరిత్రంబునందు షష్ఠాశ్వాసము.

శ్రీహయగ్రీవాయనమః

# ఆంధ్రశబ్దచింతామణి.

---

## పీఠిక.

ఉ. శ్రీకరశాఖ మై ద్విజనిషేవిత మై సుమనఃప్రజీవనం
బై కలధౌతసుందరమహోచ్ఛద మై సుమసారవత్ప్రతి
ప్రాకట మై ప్రశస్తపదపల్లవ మై యలరారునాశ్రితా
నీకఫలప్రదంబు హరినిర్జరశాఖి సమాశ్రయించెదన్. 1

సీ. చిన్నిచెందొవవిందు కన్నె గేదఁగిరేకు దోఁపిన యందంపుఁదుఱుముతోడ
సరసదూర్వాదళాంకురగుచ్ఛకచ్ఛాయ లీను నిద్దంపునెమ్మేనితోడఁ
గరుణారసమరందభరసంభృతమ్ము లై తనరు నేత్రారవిందములతోడఁ
గాలాహిక్రియ నభక్తజనంబులకు భయోత్పాదియౌ నభయహస్తంబుతోడ
హృదయమునఁ గానుపించి యభీప్సితప్రబంధశబ్దార్థవిజ్ఞానభవ్యభక్తి
యొసఁగుఁ గావుతఁ దల్లి భక్తౌఘదురితలావి దక్షిణకాళికాదేవి నాకు. 2

వ. అని యిష్టదేవతాప్రార్థనంబు చేసి మున్నొక్కనాఁడు విద్యానగరిలో నచిం
త్యకారణోపాగమ స్నేహసాహచర్యం డగుశివయోగివర్యుచే దేవచో
దనం బ(రి)ప్రాప్త మైన యంధ్రశబ్దచింతామణిగ్రంథంబు లోకోపకారార్థం
బుగాఁ డీక గావింపంగోరి నెమ్మనంబున. 3

ఉ. ఏమిమహాద్భుతం బది హరీహరి యెక్కడియంధ్రశబ్దచిం
తామణిఫక్కి యెక్కడిమతంగనగంబు యుగాదిసంభవం
బై మని చన్న నన్ననమహాకవి యెవ్వఁడు సిద్ధుఁ డెవ్వఁ డా
హా మదగణ్యపుణ్యసముదగ్రతఁ జేకుఱెఁ గాదె యిన్నియున్. 4

మ. ఇలఁ బ్రజ్ఞాధికు లౌకవుల్ మునుపు లేరే వారు వ్యాఖ్యానక
ర్తలు గానోపరె పెక్కువత్సరము లంతర్భూత మైయున్న యీ
తెలుఁగువ్యాకరణంబు నా కొసఁగెఁ బ్రీతిం డీక గావింపు మం
చలసిద్ధుండు మదిష్టదేవత విరూపాక్షుండు నిక్కంబుగన్. 5

వ. అని గణించి లోకోపకారసుకృతకీర్తిలాభవితర్కంబునం బ్రహర్షించి యాంధ్ర
వ్యాకరణభాష్యనిబంధనోత్సుకుండ నై యం దాది నస్మచ్చరిత్ర మభి
వర్ణించెద. 6

సీ. స్థిరకీర్తి యెలకూచి తిప్పనార్యుఁడు గాంచె శుచిశీలు వల్లభసోమయాజి
నతనికిఁ దిప్పన్న యజ్ఞన్న యు ననంగ సుచరిత్రు లిద్దఱు సుతులు పుట్టి
రాతిప్పనకు భైరవన్న నన్నయ నాఁగ నలఘు లిద్దఱు తనూజులు జనించి
రాభైరవునకు నొజ్జరతిర్మలయ్య రామనయుఁ జిట్టపయు సూరనయుఁ గల్గి
రాతిరుమలేంద్రుఁ డళియరామావనీశ,దత్త యెడవిల్లిముఖ్యసద్గ్రామహేమ
చామరచ్ఛత్రపల్యంకికామణీవి,భూషఁ దైవెదుషీస్ఫూర్తిఁ బొలుపుమించె.

ఉ. అత్యనఘుండు రామఘనుఁ డాత్మజులం గనియెన్ శుచిత్వసాం
తత్యగభీరు భైరవుని నాగన నప్పన రామధీమణిన్
ధృత్యమరాద్రి భైరవమనీషికిఁ గల్గిరి సత్కుమారు లా
దిత్యుఁడు కృష్ణసత్కవి సుధీజనవందితుఁ డబ్బనార్యుఁడున్. ౯

గీ. పాకనాఁటిసకలపండితకవిజనా,చార్యుఁ డైనకృష్ణయార్యవర్యు
నకును లక్ష్మమాంబికకు నేను నాదిత్య, కవియుఁ గల్గితిమి జగన్నుతులము.

సీ. భాష్యాదిబహుశాస్త్రపరిచయోదాత్తుఁడఁ గౌముదీనాటకకావ్యకవిని
భాషావివరణాఖ్యభవ్యశాస్త్రకరుండ బాహటస్థాననిబంధనుండఁ
జంద్రాపరిణయాదిసత్కృతిస్రష్టను దీప్రవామనపురాణప్రబంధ
భ్రామరీగీతప్రబంధౌఘకర్తను దక్షిణకాళికాతంత్రచణుఁడఁ
బ్రకటరాఘవయాదవపాండవీయ,నామకశ్లేషకవితాప్రణాముకుండ
ననఘ కౌండిన్యగోత్రుండ నఖిలసుకవి,తాస్వతంత్రుండ బహుకళాధరుఁడ నేను.

వ. ఆంధ్రశబ్దచింతామణి తెలిఁగించెద నిది తొల్లి సకలకవితాప్రవర్తకుండగు
శబ్దశాసనుండు సకలకవిహితంబుగా యథోచితసూత్రగర్భితంబులగునార్యా
వృత్తంబులఁ బంచపరిచ్ఛేదకంబుగా సమకట్టె నేను నానేర్పుకొలందిఁ
దత్సూత్రవిభాగంబును దత్ప్రమేయవివరణంబును దదుదాహరణస్వరూపం
బులును నంధ్రమయగద్యపద్యంబుల నేర్పరించి నాయాత్మదేవతయగు సం
బాదేవికర్పించువాఁడఁ దదుపక్రమం బెట్టి దనిన. 11

# సంజ్ఞాపరిచ్ఛేదము.

విశ్వశ్రేయః కావ్యం త దదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ
సా వాగ్యా రసవృత్తి స్సార్థో హి రసో యథాతథం*కవిభిః. ౧

ఈయార్య నాలుగు సూత్రములు- ప్రథమసూత్రమున కర్థ మే దన్న- కావ్యం కవియొక్కకర్మము, ప్రబంధము. ఓయి! కవికర్మము హాసవిలాసాదికమును- అది యుఁ గావ్యమటోయి యంటేఁ గాదు- ఏకర్మముచేతఁ గర్తకుఁ గవి యను వ్యవహార మానో యది కావ్యము- వాచకత్వవాచకత్వములవలెనే యిదియును అట్టికావ్యము- విశ్వశ్రేయః- సర్వధర్మములలో శ్రేష్ఠము. "నా నృషిః కురుతే కావ్యం" అన్నాఁడు గనుకను "యశేర్నృష్టిః కవేర్వచః" అన్నాఁడు గనుకను, పవిత్ర మనుట. "మహర్షివీర్యైః ప్రవిభావనాత్మసాత్కృతామరో కృత్రిమశక్తియుక్తిమార్గాః, సమర్థనాస్థాఖిలదేహినాం భవేత్కవిః పుసీతేచ గిరా విపాప్మనా" అనెడిన్యాయమున విద్వత్కృత మైన కావ్యము సర్వోత్కృష్టము. అది యెట్లువలె నంటేని- ఇష్టాపూర్తములలోపలను, పూర్తవిశేషమైన కావ్యము సర్వపాపహరము గనుకను నిత్యకీర్తికరము గనుకను "కీర్తిం స్వర్గఫలాం ప్రాహు రాసంసారం విపశ్చితః"- అని యు, "మహాకీర్త్యా" అనియు మొదలైన శ్రుతిస్మృతిపురాణేతిహాసములచేతఁ గీర్తి ప్రతిపాదింపఁబడును గనుకను "ఏకశ్శబ్ద స్సమ్యగ్జ్ఞాతః సుష్ఠుప్రయుక్తః స్వర్గే లోకే కామధుగ్భవతి" అని యు- "ఉపదిశతి హితార్థాన్ ప్రేయసీసమ్మితా యా శమయతి దురితౌఘం మంగళం చాతనోతి, అభిముఖయతి దేవాన్ సత్కృతిః కీర్తిహేతు ర్నయతి ధన మశేషా నంకితాంశ్చ ప్రబన్ధాన్" అనియు- "తటాకం ధననిక్షేపం ద్విజస్థాపన మేవచ, వనం శివాలయః కావ్యం నందనశ్చ సదానృణామ్, ముక్తిదా స్సప్తసన్తానా మహాపాతకినా మపి తారయన్తిచ దుర్గేభ్యః పిత్రా నుభయవంశజాన్" అని యు- "మహానదీప్రవిష్టాని రథ్యామ్బూనీవ పావనాః, కావ్యేష్వక్షీతనామాన స్సేవ్యన్తే మానవై ర్నరాః" అని యు, అనేక శ్రుతిస్మృతిపురాణేతిహాసవచనాదులచేత వర్ణింపఁబడ్డది గనుకను వ్యాసాదులు ప్రవర్తించిన విశిష్టాచారము గనుకను, కావ్యము సర్వోత్కృష్టము. త దదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ- తత్ = ఆకావ్యము, అదోషౌ=అపార్థాదిదోషరహితములును, పరిష్కృతౌ చ=గుణాలంకారయుక్తములు, నైన, వాగర్థౌ=వాగర్థములును, రెండువిశేషణము లేమోయి

* యథాయథః- పా.

యంటే- క. ''దీకొని సురాసురేంద్రులు। కాకఘూకములకరణి... ...భీకర రణంబు సలిపిరి" అనువాక్యములు గుణాలంకారయుక్తములయినఁ గాని దోష సహితములు గనుక కావ్యము గాదు.

క. ప్రాతఃస్నానము చేయుదు, రాతతమతి సంధ్య వార్చి యౌపాసనముఁ
సీతాపతిపూజయు సం,ప్రీతి నొనర్తురు పురిఁ ధరిత్రీదివిజుల్.

అనువాక్యము, అదోష మైనను గాని గుణాలంకారయుక్తము గాదు, గనుక కావ్యము గాదు. సాయాగ్యా రసవృత్తిః- యా=ఏదైననేమి, రసవృత్తిః= విభావాదిరూపములచేత రసమునకు ఆశ్రయమై యుండునో, సా=అది, వాక్= శబ్ద మనఁబడును. సాధ్యోహి రసో యథాతథం కవిభిః- శబ్ద మనఁగా రసాశ్ర య మైనది గనుక,యథాతథం=ఏరూపముననైనను, కవిభిః=కవులచేతను,రసః= రసము, సాధ్యోహి=సాధ్యముచేయఁ దగ్గది. ఏయేరూపముననైన ననంగాను సంస్కృతకావ్యములే కావలె ననవలదు సకలజనవేద్య రసము లైన భాషాకా వ్యములును బాపహరములే, అని ప్రథమసూత్రమునకు ఐకమత్యము కల్పించు కొనునది. కవిభిః=కవీశ్వరులచేతను, సాధ్యోహి=సాధింపఁదగినదిగదా, "కవిభి స్సాధ్యః" అని విధిరూపప్రత్యయయోగ మున్నది గనుక యథోచితలక్షణ కవికల్పితకావ్య మే పవిత్ర మనుట.

"సత్కులీన శ్శుచి ర్దక్షశ్ఛన్దోవ్యాకరణాదివిత్ ।
ప్రశాన్త స్సుభగాకారో వైవజ్ఞ శ్చ కవి ర్భవేత్ "

అన్నాఁడు గనుక, యీలక్షణములు గలకవి పవిత్రుఁడు. అతఁడే, శుచిః కవిః. "కవిగ్ం సమ్రాజం" మొదలైన శ్రుతివాక్యులచేతను పవిత్రుఁ డని చెప్పం బడును. తత్కావ్యమును బవిత్ర మే యనుట. ఓయి! కల్పనాసమర్థుం డైననే చాలును,

"విభావకో భావితవస్తువర్ణనః ప్రభుః పురాణాగమశాస్త్రలోకదృక్ ।
కవిఃప్రశస్తో జ్జ్వలవాక్ప్రయోగవిత్ప్రమోదమాప్నోతిపరత్రచేహచ"

అని వాక్ప్రయోగదక్షుఁడు, ఉభయలోకపూజ్యుఁడుగాను చెప్పంబ డును. కులీనత్వాదిగుణము లేవోయి యంటేని-

"న శూద్రస్య వచో గ్రాహ్యం శునోచ్ఛిష్టం హవి ర్యథా" అని మొద లైన నిషేధము లున్నవి గనుక కులీనత్వాది గుణములుగల లక్షణవంతుఁడే కవి యని తెలియునది. ఓయి! రసస్థితి యుండిన భాషాకావ్యము లైనను

బవిత్రములే యౌటివి. విదేశభాషలు స్మృతినిషేధములు మ్లేచ్ఛనములుఁగనుక శ్రుతినిషిద్ధములును-అవి యెట్లు పవిత్రములు? అంటే-

స్వస్థానవేష భాషాభిమతాస్సంతో రసప్రలుబ్ధధియః
లోకే బహుమన్యన్తే వైకృతకావ్యాని చాన్య దపహాయ.

స్వస్థాన=స్వదేశమండలి, వేషభాషా=వేషభాషలయందు- అభిమతాః=అభిమానము గల, సన్తః=పెద్దలు, రసప్రలుబ్ధధియః= రసప్రలుబ్ధ మైన బుద్ధిగలవారై, లోకే=లోకమందు, వైకృతకావ్యానిచ=దేశభాషాకావ్యములను, బహుమన్యన్తే=బహుమానింతురు. మ్లేచ్ఛనములు శ్రుతిగర్హితములైనం గాని, అవివిడిచినవ్యవహారహానియౌచున్నదిగనుక యపరిహార్యము. అందులో రసవత్కావ్యములైన రసబలముచేత భగవత్పరములు జ్ఞానకరములును సత్పురుషపరములును ధర్మప్రవృత్తిపరములును నగుచున్నవి, గనుక, బలవదిష్టానుబంధములై యున్నవి. బలవదిష్టానుబంధము లయిన యెడల నిషిద్ధములు సహా గ్రాహ్యములు. అది యెట్లంటేని- క్రత్వర్థము గవాదిస్పర్శగ్రహము, ధర్మార్థము కౌటసాక్ష్యాదికము- తీర్థయాత్రార్థము కీకటాదిప్రవేశము మొదలైనవి గ్రాహ్యము లౌచున్నవి. కౌటసాక్ష్యాదికమువలెనె భాషాస్వీకారము కేవలము గర్హితము కాదు. గర్హితమైనయెడల ప్రాకృతాదిదేశభాషామిశ్రములైన రూపకకావ్యములు యుగయుగములపెద్ద లేలస్వీకరించెదరు. అటుగాన,

"దేశభాషాపురాణాని రచితానిచ మానుషైః,
శ్రుత్వా కావ్యేతిహాసాంశ్చ భయమాప్నోతి మానవః"

అను వచనములకుఁ దాత్పర్యము వేఱే యున్నది. స్వదేశవ్యతిరిక్త దేశభాషానిబద్ధము లైన రామాయణ, భారత, భాగవతాదులు జప్యబుద్ధిచేత నాచరింపవల దనుట. అనంతరసూత్రముచేత, ఈయర్థమే చెప్పుచున్నాఁడు. అన్య దపహాయ= ఇతరభాషాకావ్యాదికము విడిచి, అపరిస్ఫుటార్థము లైన యితరభాషలవలన ఫలము లేదు. పరిస్ఫుటార్థరసము లైన స్వదేశభాషాకావ్యములవలన పురుషార్థము కలదు. కనుక, ఆంధ్రులకు, ఆంధ్రభాషాకావ్యములు గ్రాహ్యములు. కావ్యానిచ అని చకారప్రయోగమువలనఁ బదపదార్థవిచారణనిపుణులు సంస్కృతకావ్యముల నాచరింతు రనుట. ఇట్లన్నందుచేత సంస్కృతమందు అధికారానుభావములు లేని స్త్రీశూద్రద్విజాదులకైన నిదే యావశ్యక మనుట.

---

సిద్ధి ర్లోకాద్దృశ్యా లోకోఽనన్యాదృశ శ్చ నిత్య శ్చ
సంస్కారార్థో నియమోఽనియమాద్గ్రామ్యం హి యత్త్వపభ్రంశః. ౨

ఇవి నాలుగుసూత్రములు. సిద్ధిః=ఆంధ్రభాషాసిద్ధి, లోకాత్=లోకవ్యవహారమువలన, దృశ్యా=చూడఁదగినది. వ్యవహారసిద్ధ మనుట. లోకః=లోకవ్యవహారము, అనన్యాదృశశ్చ=భిన్నప్రకారమైనది కానిది యు, నిత్యశ్చ=నిత్యమైనదియు. ఎప్పటికి భాషాకవిత్వములును గలవే యనుట. నియమః=లక్షణము, సంస్కారార్థః=సంస్కారముకొఱకు, సలక్షణమైనదిసంస్కారవంత మనుట. అనియమాత్=లక్షణము లేనందుచేత, గ్రామ్యం హి=గ్రామ్య మగును. యత్తు=గ్రామ్య మనునదేదో, అపభ్రంశః=అదే, అపభ్రంశ మనిపించుకొనును. అపభ్రంశ యోగ్యము గాదు గనుక తద్వివేకముకొఱకు, ఈశాస్త్రమునఁ బ్రవర్తింపవలె ననుట. లక్షణము పట్టినది యగ్రామ్యమును, లక్షణము లేనిది గ్రామ్యము నైనందు కుదాహరణములు.

క. హరిముఖసురపాలులకున్, భరియింపఁగరానివేల్పు పరమేశమనో
హరహంససరముసంతత, కరుణ శుభా లొసఁగు శైలకన్యా మాకున్.

ఈపద్యములో సురపాలులకు, సరము, శుభాలు, శైలకన్యా, యనెడివి యుక్తలక్షణములు గాకున్నవి, కాఁగా గ్రామ్యములు. ఇవి సలక్షణము లైన సౌమ్యములు-

క. హరిముఖసురపాలురకుం, బరికింపఁగరానివెలుఁగు పరమేశమనో
హరహంససరసి సంతత,కరుణ శుభము లొసఁగు శైలకన్యకమాకున్-.

గ్రామ్యసౌమ్యభేదము లిట్టిలాగే తెలిసికొనునది.

---

ఆద్యప్రకృతిః ప్రకృతి శ్చాద్యే త్వేషా తయో ర్వికృతిః
కేవలత యానుసర్ప త్యుభేచ యేయం యథాతథం భాషా. 3

ఇది యేకసూత్రము. ఆద్యే=సంస్కృతప్రాకృతభాషలు, ఆద్యప్రకృతిః=ఆద్య ప్రకృతియు ను, ప్రకృతిశ్చ=ప్రకృతియు ను, అనిపించుకొనును. ఏషాతు=ఈయాంధ్రభాషయైన, తయోః=ఆరెంటికి, వికృతిః=వికృతి యనిపించుకొనును. యా=ఏదైననేమి, ఇయంభాషా=ఈయాంధ్రభాష, యథాతథం=యథేచ్ఛముగాను, ఉభేచ=ఆరెంటిని, కేవలతయా=ప్రత్యేకరూపముచేతను, అనుసర్పతి= అనుసరించును. దీనితాత్పర్యము- కొన్ని తెలుఁగుమాటలు సంస్కృతము

నకే ప్రత్యేకముగాఁ దద్భవతత్సమము లౌను, కొన్ని ప్రాకృతమునకే ప్రత్యేకముగాఁ దద్భవతత్సమము లౌను-అది యెట్లంటేని- సముద్రమునకు సంద్రము, చంద్రునకు చందురుఁడు, మొదలైనవి ప్రాకృతమును మించి మొదలిసంస్కృతమునకే తద్భవము లైనవి. ప్రాకృతమున కైన-సముద్దము, చందుఁడు, అని రావలయును. కృష్ణుఁడు మొదలైనవి సంస్కృతమునకే తత్సమము లైనవి. ఇంక లక్ష్మికి లచ్చి, ఖడ్గమునకు కగ్గము, మొదలైనవి సంస్కృతమును ముట్టక ప్రాకృతమునకే తద్భవములైనవి. సిరి, మట్టి, పొలి మొదలైనవి ప్రాకృతమునకే తత్సమములు. ఈలాగుననే ప్రాకృతభేదములైన సౌరసేన్యాదిభాషలకును ప్రత్యేక ప్రత్యేకములుగాఁ దద్భవతత్సమము లౌను. సూక్తికి సుద్ది, ద్యూతమునకు జూదము, సౌరసేనికే తద్భవములు. యక్షులు జక్కులు, మాగధీతద్భవము. గుణము గొనము, పైశాచీతద్భవము. రాజకులము రాచకొలము, చూలికా తద్భవము. స్నిగ్ధము నిద్దము, మూక మూఁగ, అపభ్రంశతద్భవములు. ఈలాగునఁ దత్సమములును దెలిసికొనునది.

---

ఆద్యాయాః పఞ్చాశద్వర్ణాః ప్రకృతేస్తు తే దశోనాస్యుః
షట్త్రింశ దత్ర తే న్యేచానుప్రవిశంతి శబ్దయోగవశాత్. ౬

ఇది రెండుసూత్రములు. ఆద్యాయాః=సంస్కృతభాషకు, పంచాశద్వర్ణాః=ఏఁబది యక్షరములు, ప్రకృతేస్తు= ప్రాకృతమునకైన, దశోనాః=పది తక్కువగాఁ గల, తే=ఆయేఁబదియు, స్యుః=అగును. ఋ ౠ ఌ ౡ ఐ ఔ ఙ ఞ శ షలు, ఈపదియక్షరములు లే వనుట. అత్ర=యీతెనుఁగునందు, షట్త్రింశత్=ముప్పదియాఱక్షరములు గాని, మఱిలేవు. తే అన్యేచ=తక్కిన కడమవియు, శబ్దయోగవశాత్=తత్సమములతోడి యోగమువలనను, అనుప్రవిశంతి=ప్రవేశించును. షణ్ముఖుఁడు, శరీరము, ఇత్యాదిస్థలముల నవి తెలిసికొనునది.

---

ద్వివిధాదిదుదేతోచోవక్రతపా చాష్యనుస్వారౌ చ
కగ చజయుగ టడణ తదన పబమ యరలవసహాళంతు హల్వర్గః ౭

ఇది యేకసూత్రము. అచః=అచ్చులు, ద్వివిధ=లఘుదీర్ఘరూపములైన, అత్=అకారములును, ఇత్=ఇకారములును, ఉత్=ఉకారములును, ఏత్=ఏకారములును, ఓత్=ఓకారములును, తెలుఁగున ఏకారౌకారములకు హ్రస్వ

ముగిలవా గనుక అవియును ద్వివిధములు. వక్రతపరాచ=ఐఔలును, అనుస్వా రా=పూర్ణఖండానుస్వారములును, అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః ఈపద్నాలుగును అచ్చులు. క గ చ జ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ ళ, ఈ యిరువదియు హల్లు లనఁబడును. తెలుఁగున దంత్యములు తాలవ్యములు నని చజలు రెండువిధములు.

---

సిద్ధ స్సాధ్య శ్చానుస్వారః పూర్ణార్ధభేదతో ద్వివిధః
హ్రస్వా త్పూర్ణో౽పి భవే ద్దీర్ఘాచ్చే త్ఖణ్డఏవ సజ్ఞేయః. ౬

ఇది రెండుసూత్రములు. సిద్ధః=సిద్ధము ను, సాధ్యశ్చ=సాధ్యము ను, అయిన, అనుస్వారః=సున్న, పూర్ణార్ధభేదతః=పూర్ణమును ఖణ్డమును అనుభేదముచేత ను, ద్వివిధః=రెండువిధము లై యుండును, శబ్దముతోఁ గూడనే పుట్టినసున్న సిద్ధము- అందలము, బొందలము. ఇవి సిద్ధానుస్వారములు. నకారముచెడి సున్నైనవెల్ల సాధ్యానుస్వారములు-అలరుందావి, తలిరుందీవె, ఇవి సాధ్యానుస్వారములు. హ్రస్వాత్=లఘ్వక్షరముకంటెఁ బరమైన, ఖణ్డః=అర్ధబిందువు, పూర్ణో౽పి=నెరబిందువును, భవేత్=అవును, దీర్ఘాచ్చేత్=దీర్ఘాక్షరముకంటెఁ బరమైనదైన, ఖణ్డఏవ=అర్ధబిందువే కాని నెరబిందువు గా దని, జ్ఞేయః=తెలియునది. దీనివ్యవహార మెట్లంటే, పడఁతి అనునది యర్ధబిందువు లఘ్వక్షరము మీఁద నున్నది గనుక పడంతి యను నెరబిందువు నౌను. ముద్దుఁగన్నియ, అనునదిసాధ్యానుస్వారమును లఘ్వక్షరము పరమును గనుక, ఆలాగు ననే ముద్దుంగన్నియ యను నెరబిందువును ఔను. సర్వత్ర యిట్లే తెలియునది. దీర్ఘపరములైన, వీఁక, వాఁక, కాఁక, అని యర్ధబిందువులే యవుం గాని నెర బిందువులు గావు.

---

లఘవో౽లఘవశ్చేతి ద్వేధా స్తస్థా న్విదన్తి శాస్తారః
అన్యే౽న్యవ్యాకరణస్పష్టా రస్త్వత్ర గృహ్యతే ద్వివిధః. ౭

ఇది యేకసూత్రము. శాస్తారః=శాస్త్రకర్తలు, లఘవః=లఘూచ్చారణములును, అలఘవశ్చ=ఇతి, అలఘూచ్చారణములును, అని, ద్వేధా=రెండు విధములుగాను, అస్తస్థాన్=యరలవలను, విదన్తి=తలంతురు. అన్యే=యలవ లుమూఁడును, అన్యవ్యాకరణ=ఇతరవ్యాకరణములయందు, స్పష్టాః=స్ఫుటములు, రస్తు=రవర్ణము, అత్ర=యీతెనుఁగువ్యాకరణమందు, ద్వివిధః=రెండు

# శతకసముచ్చయము

ద్వితీయభాగము.

---

## ౧. రామకృష్ణమూర్తిశతకము.

— ఆటవెలఁదులు —

*　　*　　*　　*　　*　　*　　*

అద్దమందునున్న యాత్మతోఁ బోరాడఁ, జిన్నిబాలు నిందసేయఁదగునె
జ్ఞానిననుచు నీవు జనులదూషింపకు, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౧
నామరూపసహితనానాప్రపంచంబు, శ్రోత్రనేత్రములకుఁ జూపుదానిఁ
జూచుచున్న నీవె చూడంగ బ్రహ్మంబు, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౨
పాలలోననుండి బైటఁదీసినవెన్న, పాలఁ గలిసిపోదు పాలనున్న
జ్ఞాని కలసిపోఁడు సంసారముననున్న, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౩
ఉప్పుఁగల్లుఁజూడ గొప్పవారాశిలోఁ, గలసిపోయి మరలఁ గానరాదు
బ్రహ్మమందు నీప్రపంచ మావిధమయ్యె, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౪
దురదమంటయుఁగల కురుపువంటిదిచుమీ, సుఖముదుఃఖమొందు స్థూలతనువు
ఔషధంబువంటి దాత్మయోగం బది, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౫
జలధినున్న చేఁప జలమునకై యటుఁ, దిరుగఁబోనె యన్యదేశములకుఁ
దన్నునిండుకొన్న తత్త్వంబు వెదకెదు, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౬
భూమియందెపుట్టి భూమియందెపెరిఁగి, భూమియందె యణఁగు భూరుహములు
ఆత్మయందు జగము లావిధంబుగ నాయె, రామ. ౭
లింగదేహమనెడు పొంగుజ్వరంబున, సంధివలెను మాయ జగతిఁ బుట్టె
దానికౌషధంబు తగురాజయోగంబు, రామ. ౮
ఆత్మఁదెలియనట్టి యాచార్యుఁదెలిసిన, ఫలముదప్పిపోను బ్రహ్మకైన
నూరుపేరులేక యుండంగవలసెరా, రామ. ౯
నిన్ననేఁడుఁబుట్టి నిక్కుచు నీల్గుచు, నున్నవారె యెందు నున్నవారు
ఋుందుఁ బిన్నపెద్ద లెవ్వరు చెప్పుమా, రామ. ౧౦
పందిరూపు గొనుచుఁ బాతాళమునకేగి, శివునిపాదములకుఁ జేరఁడాయె
నట్టివిష్ణుఁ డేమి యధికుండు చెప్పుమా, రామ. ౧౧

దేవుఁ డనుచు బ్రహ్మదేవునిఁ జెప్పకు, దేవుఁడైన వామదేవుచేతి
దెబ్బచేత శిరసు దెగి యిలఁ బడెనేమి, రామ. ౧౨
శివుఁడు దేవుఁ డనుచుఁ జెప్పకు నాతోడ, శివుఁడు దేవుఁడైన సిగ్గులేక
పాఱిపోవనేల భస్మాసురునిభీతి, రామ. ౧౩
బ్రహ్మదేవునితల బ్రద్దలైపోను శం, కరునియిల్లు వల్లకాడుగాను
వీరువేల్పులనుచు వెఱ్ఱులపుట్టిరా, రామ. ౧౪
దేహమందునున్న దేవునిగానక, దేవులాడనేల దేశమెల్ల
యెండమావులందు నిండేఱు భ్రమలేల, రామ. ౧౫
గురుఁడుబ్రహ్మమఱియుగురుఁడు విష్ణుండును, గురుఁడెత్రిపురదైత్యహరుఁడుసుమ్మి
గురుఁడు కేవలంబు పరమాత్మగానమ్ము, రామ. ౧౬
గురువులనఁగ నెవరొ గురునిదేరూపంబొ, గురుని జాతునంచుఁ గోరువాఁడు
శ్రీగురుప్రసాదసిద్ధికిఁ బాత్రుఁడు, రామ. ౧౭
గురువుగురువనెదరు గురువెక్కడున్నాఁడు, ఆత్మదెలుపువాఁడె యాదిగురువు
ఆత్మదెలియఁగానె యాగుర్వతానాయె, రామ. ౧౮
మాయమాయ యనఁగ మాయెక్కడున్నది, మనసుతనకుఁ బెద్దమాయగాక
మనసుగెలిచినట్టి మనుజుండె దేవుండు, రామ. ౧౯
దేవుఁ డనగ వేఱె దేశాంతరంబున, వెదకఁబోవఁ గలఁడె వెఱ్ఱిగాని
వెదకువాఁడు నెవఁడొ వివరించి చూడరా, రామ. ౨౦
విశ్వమునకులోన వెలుపల నెడలేక, యున్నవాఁడు దేవుఁ డన్నవాఁడు
వానిఁ జూడఁబోయి వాఁడె వాఁడాయెరా, రామ. ౨౧
నూకగింజగానలేకను గాడిద, పుట్టెఁ డూఁక కలయ బొక్కినట్లు
సారమెఱుఁగలేని శాస్త్రపాఠములేల, రామ. ౨౨
చక్రధారు లనఁగ శైవమతస్థులు, నేమొకాని మఱి సహింపలేరు
చక్రధారిగాని జనుఁ డొక్కఁడును లేఁడు, రామ. ౨౩
లింగధారు లనఁగ వెంగలి వైష్ణవు, లొప్పలేరు నిజము చెప్పలేరు
లింగధారిగాక లేఁడ యెవ్వాఁడును, రామ. ౨౪
మాయగాని యిదియు మంత్రంబులనుబోవ, గ్రహము తేలుపాముగాదు సుమ్మి
బ్రహ్మవిద్యలేని పరువులింకేటికి, రామ. ౨౫
నీచఘనము లనక నిను దిగంబరుఁ జేసి, బట్ట బైల విసరి పాఱవైచె

గుణవిహీనుఁ డితఁడు గురు నీకనుంచకు, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౨౬

గొప్పవాఁడు నొకఁడు కొద్దివాఁ డొకఁడని, తోఁచకున్నవాఁడు దొడ్డవాఁడు
చావుఁ బుట్టుకయును సమము లందఱకును, రామ. ౨౭

తన్నుఁ గన్నయట్టి తల్లిదండ్రుల జన్మ, మెఱుఁగలేఁడు మీఁద నే మెఱుంగుఁ
బూర్వకథలు చెప్పి పోకిళ్లుపోనేల, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౨౮

బ్రహ్మ మిది యటంచుఁ బట్టి చూపించిన, జ్ఞానికానివాఁడు కాన లేఁడు
అంధుఁడైనవాఁడు నాదిత్యుఁ గాంచునా, రామ. ౨౯

లేనివస్తువందు లేనట్లు దెలిసిన, యపుడె యున్న దున్నయట్లు దెలియు
గల యబద్ధ మనుట కాదె జాగరణంబు, రామకృష్ణమూర్తి. ౩౦

తాను ముక్తినొందఁ దనతోఁ బ్రపంచంబు, ముక్తి నొంద దనుట యుక్తిగాదు
నిదుర చెదరినపుడు చెదరవే కలలన్ని, రామ. ౩౧

దేశకాలము లఁట దేహేంద్రియము లఁట, పుట్టి పెరిఁగి చచ్చిపోవుట లఁట
కడువిచిత్ర మిట్టి కలఁ జూచి నమ్మకు, రామ. ౩౨

ఉన్నబరువు మోయనోపనివారలు, దానికన్న బరువు దాల్పనేల
ముక్తిగోరి శాస్త్రములు నేర్వగానేల, రామ. ౩౩

బొంకననుచు వ్రతముఁబూనిన యాదొడ్డ, ధర్మరాజు వ్రతము దప్పిపోవె
నింక నేమి వ్రతము లీనరాధములకు, రామ. ౩౪

విష్ణులోక మనుచు వేఱుగాఁ జెప్పుట, విష్ణువైరబుద్ధి వైష్ణవులకు
విష్ణుమయముగాదె విశ్వంబు సకలంబు, రామ. ౩౫

విష్ణుగీతమైన వేదాంతవాక్యంబు, విననివాని దేమి విష్ణుభక్తి
భర్తమాట వినని పడఁతి పతివ్రతా, రామ. ౩౬

పరమగురుని ప్రేమ భక్తివైరాగ్యముల్, కలుగువారియందుఁ గలిగి యుండు
పాలుగుడుచుచున్న పడఁతులు పతికేల, రామ. ౩౭

మోహబంధనంబు మొదటికే తెగకున్న, దేహబంధనమ్ము తెగదుసుమ్ము
సిగ్గువదలిపోక చీరలు వదలవు, రామ. ౩౮

బ్రహ్మకైనఁగాని ప్రారబ్ధకర్మంబు, తప్పిపోవ దెంత తన్నుకొన్నఁ
దన్నివృత్తికొఱకుఁ దాత్పర్యము లవేల, రామ. ౩౯

దేహ మనెడు దొడ్డదేవాలయమునందు, దేవుఁ డొకఁడు గలఁడు జీవుఁ డనఁగ
జ్ఞానపుష్పమాలఁ బూని పూజింపుము, రామ. ౪౦

దేహమందె కలఁడు దేవుండనెడువాఁడు, దేహమందె యునికిఁ దెలియఁబోఁడు
అఖిలదేహములకు నాధార మాతఁడు, రామ. ౪౧
చదువు చదువవచ్చుఁ జదువునం దర్థంబు, తప్పకుండ విప్పి చెప్పవచ్చు
భావ మెఱుఁగువాఁడు బ్రహ్మవిద్వాంసుండు, రామ. ౪౨
క్షేత్రతీర్థములకు సేవింపఁబోవద్దు, శిలలఁ జూచి పూజ సేయవద్దు
నిన్ను నీవె తెలిసి నిజమైన గతినొందు, రామ. ౪౩
తల్లిదండ్రిపుత్రదారాదికంబును, గల దటంచుఁ జాలగర్వపడకు
దోమ్మైనఁ గలదు దొడ్డభాగ్యమెగాదు, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౪౪
పుస్తకంబు కాలిపోయిన దానిలో, గ్రంథమింత యైనఁ గాలిపోదు
తనువులెన్నిచనినఁ దాఁ జావఁ డెపుడును, రామకృష్ణ. ౪౫
వేదవిదులు కోరివిడిచిన స్వర్గాది, ఫలమునందు నీకు భ్రాంతియేల
మక్కువేల పుట్టెఁ గ్రక్కిన కూటికి, రామకృష్ణ. ౪౬
స్వర్గనరకహేతుసకలకర్మాటవిఁ, బరమయోగవహ్నిపాలుచేసి
విశ్వమంత గెలిచి వెలుఁగు బ్రహ్మంబవై, రామకృష్ణ. ౪౭
ఫలము గల దటంచు భ్రాంతిచేఁ గర్మంబు, లాచరించుటెల్ల నీచవృత్తి
ఆజ్యధారచుమ్మ యజ్ఞానవహ్నికి, రామకృష్ణ. ౪౮
జననమరణరూపసంసారదుఃఖంబు, తెలివిపుట్టినపుడె తీఱిపోదె
స్వప్నమందుఁ గన్న సంకటంబులువోలె, రామ. ౪౯
వత్సరములు విద్య వర్ణాశ్రమాదులు, గలుగువాఁడు పెద్దగాఁడు సుమ్మి
యున్నవస్తువెఱిఁగి యున్నవాఁడే పెద్ద, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౫౦
ఆత్మ నెవ్వఁడెఱుఁగు నతఁడె బ్రహ్మణ్యుండు,ఆత్మ నెవ్వఁడెఱుఁగఁ డతఁడుమాల
యిట్లు వర్ణములకు నేర్పాటు చూడుమా, రామ. ౫౧
ఆత్మ నెఱుఁగకున్న నాబ్రహ్మతోనైనఁ, జెలిమిసేయఁబోవ సిగ్గుగాదె
సత్య మెఱిఁగియున్న చండాలుసేవింపు, రామకృ. ౫౨
నామరూపములను నానావిధంబుల, నున్నఁగాని జీవుఁ డొక్కరూపు
పశువు వేఱుగాని పా లొక్కరూపంబు, రామ. ౫౩
ఒక్కయవయవంబె యొప్పునే దేహమై, యన్నియవయవంబు లగుటఁగాని
ప్రాణు లన్ని గూడఁ బరమాణురూపంబు, రామ. ౫౪
తెలివిలేనివాని బలిమిని దెప్పించి, దివ్యమోక్షపదవి దెలుపుటెల్ల

సరిగఁ జెవిటియొద్ద శంఖ మూఁదినయట్లు, రామకృష్ణమూర్తిరమ్యకీర్తి. ౫౫

గతి యెఱుంగలేక కైలాసవైకుంఠ, లోకములకుఁ బోవ లోలుఁ డగుచు
మతములందుఁ బుట్టి మతిచెడితిరుగును, రామ. ౫౬

బ్రహ్మవిష్ణుశివులు పతులంట లోకంబు, పుట్టి పెరిఁగి చచ్చిపోవుటకును
గార్యమందు నెవఁడుఁ గానంగరాఁడేమి, రామ. ౫౭

నదిని దిరుగుచున్న నావపైవానికి, నొడ్డుమీఁద నున్నయూరు దిరుగు
అట్లు మనసు భ్రాంతి నఖిలవిభ్రాంతులు, రామ. ౫౮

భూమినున్న జలము భూమిగుణంబులఁ, బొందినట్లు మనసుపొందుచేత
మనసుధర్మమెల్ల మానదు తనకును, రామ. ౫౯

కట్టఁబట్టవలెనె కట్టుచు విప్పుచు, నట్టితనువులందుఁ గట్టువడక
యెప్పటట్లె నీవు నొప్పుగా వెలుఁగుమా, రామ. ౬౦

పరఁగు సూక్ష్మతనువు ప్రాణమనోబుద్ధి, దశవిధేంద్రియాన్వితంబు గాఁగ
నందుఁ గలయు జీవుఁ డందురు నిన్నును, రామ. ౬౧

స్థూలసూక్ష్మదేహమూల మజ్ఞానంబు, కారణాంగ మనఁగఁ గల దదొకటి
దానిఁ ద్రుంపవలయు జ్ఞానసాధకముగ, రామకృ. ౬౨

నిన్ను మఱచి మున్ను నీవైనయట్ల యా, నిన్ను మఱచి మఱియు నీవు గమ్ము
నీవు నీవు గాఁగ నిఖిలంబు నీవౌదు, రామ. ౬౩

జ్ఞాని యనఁగఁ బ్రభువు జ్ఞాన మాతనిసొమ్ము, సొమ్ముపెట్టె లాగమమ్ము లెల్ల
మొరయఁ జదువువారు మోఁతకూలీ లయా, రామ. ౬౪

రాజుభార్యతోడ రమియించుచున్నను, నదియు బైటఁ బెట్టు హానిగాదె
బ్రహ్మవేత్త ననుచుఁ బరులకుఁ జెప్పకు, రామ. ౬౫

ఇనుపపుల్లఁబట్టి యెండుతాటాకుపై, వ్రాసి నోసి నోటఁ గూసినట్టి
చదువు నమ్మఁబోకు సద్గతి దొరకదు, రామ. ౬౬

అన్యశూన్యపదము నందుచు దంపతుల్, సిగ్గుతోడ విడిచి చీరలెల్ల
రతిసుఖంబుగొన్నగతినుండు శివయోగి, రామ. ౬౭

పెండ్లియాడనిమ్ము పెండ్లాముఁదానును, నొక్కచోట వేఱె యుండనిమ్ము
కన్నదానిపొట్టకడుపువత్తుటకోరి, రామ. ౬౮

చిన్ననాఁటనుండి చేసినకర్మంబు, గురునికప్పగించు కోర్కి లేక
గురుని కరుణలేక దొరకదు మోక్షము, రామ. ౬౯

## రామకృష్ణమూర్తిశతకము.

కలుగువాఁడు నొకఁడు కలుగనివాఁ డొక, డింతెకాని వేఱె యేమిలేదు

యిట్టితెలివికంటె నెట్టిదో మోక్షంబు, రామ. ౭౦

ఏమిచేతఁగాని యీనరు లొకవేళ, వైరు లనుచు వదలవద్దుసుమ్ము

శౌర్యమున్నఁ జంపు శత్రుషడ్వర్గము, రామ. ౭౧

సూర్యుఁ డున్నఁగాని చూడరు జగములు, కన్ను లున్నఁగాని కాన రతని

కన్ను లుండు టెట్లు ఘనబుద్ధి లయ మయ్యె, రామ. ౭౨

పాంచభౌతికాఖ్యభవనంబులోపల, నిన్ను మఱచి నీవు నిదురవోవ

నిన్ను లేపువాఁడు సన్నుతాచార్యుండు, రామ. ౭౩

నిదురపోతి నంచు నెదుటివానికిఁ జెప్ప, నిదురపోవనట్లు నిజముగాదె

బ్రహ్మ మైనవాఁడు పరులకుఁ జెప్పునా, రామ. ౭౪

నీవు గలుగుకొఱకు నేనును గలుగుట, నేను గలుగుకొఱకుఁ దాను గలిగె

తానుతానుగాఁగఁ దనకెవ్వరును లేరు, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౭౫

మోహజలధి నీఁదె ముక్తుఁడై శివయోగి, దేహమందునుండి తెలియరాఁడు

పరఁగుకాయలోనియురిడిప్రకారంబు, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౭౬

అసంపూర్ణము.

(ఈశతకము శ్రీయుత సత్యవోలు రాధామాధవరావుగా రిచ్చినది.)

శ్రీరస్తు.

# ౨. అగస్త్యేశ్వరశతకము.

శా. శ్రీమత్పర్వతపుత్రి కాహృదయ రాజీవాళి హస్త్యుల్లస
స్తోమధ్వాంతనితాంత హేళి బుధసందోహాదిరాణ్మౌళి ని
త్యామర్త్యాలయవాహినీభువనభంగాభోగచూళీకళా
స్వామీ సత్పెడనాభిధానశివపూర్వస్త్యాద్యగస్త్యేశ్వరా. ౧

శా. ఆకాశంబు నిరావకాశ మదియేకా కేశపాశంబుగాఁ
గాకైవల్యపదంబునొందిన చిదాకాశప్రకాశత్వదా
నీకాశప్రతిభాస్వరూప మిల వర్ణింపంగ శక్యంబె స
త్ప్రాకారా పెడనాభిధానశివపూర్వస్త్యాద్యగస్త్యేశ్వరా. ౨

మ. తలలుం గన్నులు నాల్కలుం గలిసి మొత్తం బైదునే లున్నతిం
గల శేషాహి భవన్మహామహిమ సాకల్యంబుగా నెన్న గా
సిలి కాలంబడి వ్రేలుచుండఁగ నొరు ల్చింతింపఁగా నెంతవా
రలు ని న్నో పెడనాభిధానశివపూర్వస్త్యాద్యగస్త్యేశ్వరా. 3

మ. భవదుద్యత్కరుణాకటాక్షభవసంపద్వీక్షణాలబ్ధమ
త్కవితాలంకృతవృత్తపద్యశతసంతానప్రసూనాచ్ఛదా
మవితానం బిడిగైకొనం దగు మహామంత్రార్థసాంగత్యరూ
పవిలాసా పెడనాభిధానశివపూర్వ. ౪

శా. గంధేభాంధకదైత్యదర్పహర దుర్గానాథ దుర్వారగ
ర్వాంధు ల్గానఁగ లేరు నీమహిమ జాత్యంధు లదా పద్మినీ
బంధుం జూడనిమ్మాడ్కిఁ జిత్త మిది నా భాగ్యంబు విద్యావియ
త్పంథానా పెడనాభిధానశివపూర్వ. ౫

శా. శాంతస్వాంతసు                తపటదాశాంతస్వభూసర్వభూ
తాంతర్యామివి నీవయై నిఖిలలోకాళిం గడుం బెంప నేఁ
జింతింప న్మదిఁ గల్మిలేములకు నాసింతు న్భవద్భక్తిమ
త్ప్రాంతంబా పెడనాభిధానశివపూర్వ. ౬

మ. క్షితి నిందూపలరాశి కౌముది శరాకీర్ణంబు గావించుసం
గతి భక్తిం గరఁగించి లో నినుఁ గొనం గానన్వలెంగాక కు
త్సితకృత్యంబున మన్మథుండు సుమరాజిన్ గెల్చనే నిన్ను సు
వ్రతిలీలం బెడనాభిధానశివపూర్వ. ౭

# అగస్త్యేశ్వరశతకము.

.వాణీనాథరథాంగపాణు లరయ న్వాదించుచో జాలపా
క్షోణీరూపములై భవత్పృథుశిరోంఘ్రు ల్సత్స్వరూపంబు క
ల్యాణీసేవ్యమదూర్ధ్వలోకముల పాతాళై రంత చిత్రంబు శ
ర్వాణీశా పెడనాభిధాన శివపూర్వా.

శా. బాలుం డాడెడుకందుకంబుల క్రియన్ బ్రహ్మాండభాండావళిం
గేలం బట్టి తటిల్లతావిధమునై క్రీడించు నీతాండవో
ద్వేలాలోకన మేరికిం గలుగు హాస్తిశ్రేష్ఠము...
ల్పాలౌనా పెడనాభిధానశివపూర్వా.

శా. కాండప్రస్ఫుట కంఠనిస్వనరణత్కాంతిరవోగ్రాకృతిన్
శుండాలంబు లడంపనౌనె ప్రమథస్తోమంబు దక్కంగ బ్ర
హ్మాండావిష్కృతమైన నీప్రళయరౌద్రాకార మీక్షింప నె
వ్వండోపుం బెడనాభిధానశివపూర్వా.

మ. కలదే లోకమువారికిం దలలపైఁ గన్గొన్న శేవెల్గు నీ
తలనేకా డయిన స్సుధాకరధరత్వం బంతకుం జెల్లెనే
కలిగెంగా కది నీకు భక్తు లారు లేకంబాదు రీవెంతలో
వల నున్నం బెడనాభిధాన.

మ. తలపై జాహ్నవి దాపల న్గిరిజ చెంతస్వాంతమై మోహినీ
తిలకం బావెనుకం బ్రశస్తమునిపత్నీజాతము న్నీకుఁ గాం
తల ... ... ... ... ...

శా. శ్రీకంఠస్వపురోపకంఠ సునటు... ...
గీకారార్థవినీలనీలరుచిరాంగీ వేదభాషాంతరం
గీకాంతావరవర్ణినీకృతరథాంగీసర్వసంపద్ధ్వజ
త్ప్రాకారా పెడనాభిదాన.

మ. చెనఁటు ల్నీవఖిలాంతరాత్మ వయి భాసిల్లంగ నిన్గాక త
క్షిన వేల్పుల్ దొరలంచుఁ బొంగెద రశక్తిం గ్రుంగుట ల్గాన ర
ప్పనికై లంజియ క్రొక్కఁడే మగఁడుగా భావించితే దానిజీ
వన మౌనా పెడనాభిదాన.

మ. ఘనకైవల్యనిధానవర్ధిత జగత్కల్యాణ నిన్నాశ్రయిం
చినభక్తాళికి ముక్తిలాభ మరుదే సింగారమా కన్నత
ల్లిం జేరం జననెంచు బిడ్డనికిఁ దల్లీలాపయఃపానజీ
వనసేవ ల్పెడనాభిధాన...

# విషయసూచిక.

మ॥ రా॥ రా॥ శ్రీ॥ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు, రామచంద్రపురము.

,, గొబ్బూరి వేంకటానందరాఘవరావుగారు, బి. ఏ., ఎలమంచిలి.

,, మథిర సుబ్బారావుగారు, ,,

,, అల్లమరాజు రంగశాయికవిగారు, పిఠాపురము.

,, పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు, పిఠాపురము.

,, చర్ల గణపతిశాస్త్రిగారు, పిఠాపురము.

,, చిల్లరిగె శ్రీనివాసరావుపంతులుగారు, కాకినాడ.

,, గోవిందరాజుల హరిశ్చంద్రరావుగారు, ,,

,, జనమంచి శేషాద్రిశర్మగారు, కడప.

,, జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు, కడప.

,, యీయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు, విజయనగరము.

,, గరిమెళ్ళ అప్పయ్యపంతులుగారు, విజయనగరము.

,, బుఱ్ఱా శేషగిరిరావుగారు, ఎం. ఏ., ,,

,, భోగరాజు నారాయణమూర్తిగారు, ,,

,, విద్వాన్ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారు, నరసన్నపేట.

,, పోట్నూరి స్వామిబాబుగారు, ,,

,, కవితావినోద అల్లంసెట్టి అప్పయ్యగారు, పొందూరు.

,, కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారు, సాలూరు.

,, విద్వాన్ గరిమెళ్ళ సోమన్నపంతులుగారు, ఎం.ఏ., యల్. టి., పెద్దాపురము.

,, కేశవరపు కామరాజుగారు, పెద్దాపురము.

,, కోరాడ రామకృష్ణయ్యగారు, ఎం. ఏ., చెన్నపురము.

,, కాళ్ళకూరి గోపాలరావుగారు, చెన్నపురము.

,, శ్రీకవిరాజు వత్సవాయి నీలాద్రిరాజుగారు, తుని.

,, శ్రీరాజా నల్లపరాజు మీర్జా అచ్యుతరామరాజుగారు, తుని.

,, లింగం తమ్మయ్యనాయుడుగారు, ఛత్రపురము.

,, నంబూరి తిరునారాయణస్వామిగారు, బి. ఏ., ఏలూరు.

,, తలిసెట్టి రామారావుగారు, బి. ఏ., బి. ఎల్., పార్వతీపురము.

,, ఏలూరిపాటి రామభద్రచయనులుగారు, తాళ్లపూడి.

మ॥ రా॥ రా॥ శ్రీ॥ గండికోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, నరేంద్రపురము.
,, శ్రీ త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారు, సిద్ధాంతము.
,, కరి వేంకటనరసింహాచార్యులుగారు, సింహాచలము.
,, కొమాండూరి అప్పలాచార్యులుగారు, ,,
,, కరి రామానుజాచార్యులుగారు, చిట్టిగూడూరు.
,, శ్రీ. తి. వ. నారాయణస్వామిగారు, రుసింగి అగ్రహారము.
,, గాది జగన్నాథరావుగారు,
,, ఆశాపత్రికాధిపతులు- శశిభూషణరథోగారు.
,, కొల్లూరి ధర్మారావుగారు.
,, చిత్రావూరి లక్ష్మీనారాయణశాస్త్రిగారు, బి.ఏ., బి. ఎల్.,
,,
,, సరస్వతుల సుబ్బయ్యశాస్త్రిగారు, విశాఖపట్టణము.
,, చింతలపాటి లక్ష్మీనరసింహరాజుగారు, ,,
,, భూపతిరాజు వేంకటపతిరాజుగారు, ,,
,, మంగిపూడి కామయ్యగారు, ఎం.ఏ.,యల్.టి., ప్రిన్సిపాలు ,,
,, యస్. పార్థసారథినాయఁడుగారు, వైస్ ప్రిన్సిపాలుగారు. ,,
,, ఆకెళ్ళ రామమూర్తిపంతులుగారు, బి. ఏ., బి. ఎల్., ,,
,, తెన్నేటి విశ్వనాథముగారు, ఎం. ఏ. బి. ఎల్., ,,
,, గురుజాడ దుర్గాప్రసాదరావుగారు, బి. ఏ., బి. ఎల్., ,,
,, ప్రొఫెసర్ డాక్టరు యస్. రాధాకృష్ణయ్యగారు, వైస్-ఛాన్సలరు ఆంధ్రవిశ్వకళాపరిషత్తు.
,, సి. డి. యస్. సెట్టిగారు. రిజిస్ట్రారుగారు. ,,
,, పి. పార్థసారథి అయ్యంగారు, డిస్ట్రిక్టుమునిసిఫ్. విశాఖపట్టణము
,, డాక్టరు అలఘుసింగరిగారు. ,,
,, సెట్టి లక్ష్మీనరసింహమునాయఁడుగారు, బి. ఏ., ,,
,, నిష్ఠల సుబ్బరాయశాస్త్రిగారు. ,,

మఱియు ననేకులు పౌరులును నన్యస్థలములవారును విచ్చేసి సభనలంకరించిరి. పలువురు రాఁజాలక తంతివార్తలను జాబులను బంపిరి.

ది 23 తేది శనివారము ఉదయమున 8 గంటలకు బ్రహ్మశ్రీ కేతవరపు వేంకటశాస్త్రిగారి ప్రార్థన పద్యములతో సభ ప్రారంభమయ్యెను. మ॥ సెట్టి లక్ష్మీనరసింహము బి. ఏ. గారు స్వాగతపద్యములం జదివిరి. ఆమంత్రణసంఘాధ్యక్షులు బ్రహ్మశ్రీ ప్రభల లక్ష్మీనరసింహముపంతులు బి.ఏ. బి.ఎల్.గారు సంఘపక్షమున నుపన్యసించిరి. పిమ్మట సభాధ్యక్షులు పీఠమునకు విచ్చేసి తమయధ్యక్షోపన్యాసముం గావించిరి. కవితావినోద అల్లంసెట్టి అప్పయ్యగారు పరిషత్ప్రశంస పద్యములను జదివిరి.

శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు మృచ్ఛకటికాకాలనిర్ణయముంగూర్చి కొంత యుపన్యసించిరి. కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారు, ఆంధ్రశబ్దచింతామణి మూలరూపమును గూర్చి వ్యాసముం జదివిరి. విద్వాన్ ఆర్యసోమయాజుల కాశీపతిచయనులుగారు శతకపఠనావశ్యకత యనువ్యాసముం జదివిరి. అంతటితో నాసభ ముగించిరి. మధ్యాహ్నము మూఁడుగంటలకు మరలఁ బ్రారంభింపఁబడినది. అందు నన్నెచోడకుమారసంభవకావ్యవిశేషములను శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగా రుపన్యసించిరి. కోరాడ రామకృష్ణయ్య ఎం. ఏ. గారు, ఆంధ్రభాషాసారస్వతముల యుత్పత్తివికాసములం గూర్చి ప్రసంగించిరి. బులుసు వేంకటరమణయ్యగా రలంకారములం గూర్చి దండివామనుల మతముం దెలిపిరి. జనమంచి శేషాద్రిశర్మగారి యాజ్ఞపై గ్రంథపరిశోధనవ్యాసమును జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు చదివిరి. టేకుమళ్ల అచ్యుతరావు ఎం.ఏ. గారు కృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదాకర్తృత్వము నను వ్యాసముం జదివిరి. రంగనాథరామాయణమును గుఱించిన వ్యాసమును జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు చదివిరి. జమ్ములమడక మాధవరామశర్మగారు గ్రంథరచనాపద్ధతిని గూర్చి యొక్క వ్యాసమును జదివిరి. ఘండికోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఆంధ్రముతోపాటు సంస్కృతమునుగూడఁ జేర్చి పరిషత్తునకు సంస్కృతాంధ్రసాహిత్యపరిషత్తని పేరుపెట్టిన బాగుగా నుండునని దానిం గూర్చి కొంత యుపన్యాసము గావించిరి. తోపల్లె వేంకటరామసిద్ధాంతిగారు మనుచరిత్రముం బొగడుచుఁ దద్విషయకమై కొంతచెప్పిరి. అంతటితో నానాఁటిసభను జాలించిరి.

ది 24 మెయి ఆదివారము, ఉదయమున మొదటఁ గార్యనిర్వాహకసభ జరిగినది. పిమ్మట రమారమి 9 గంటలకు మరలఁ గార్యక్రమము ననుసరించి

పెద్దసభ ప్రారంభింపఁబడినది. కన్నాజోస్యుల సోమనాథముగారు భావకవిత్వ ప్రశంస చేసిరి. “నేను ద్రుత ప్రకృతికమూ కళయూ” యని చర్ల గణపతిశాస్త్రి గారు చర్చించిరి. లక్ష్మీనారాయణసాహూగా రను ఎం.ఏ.(సర్వెంటు ఆఫ్ ఇండియా సంఘములోనివారు) ఇంగ్లీషుభాషలోఁ గళింగదేశజులైన యాంధ్రులు నుత్కళులు నన్యోన్యమైత్రి నుండవలయు నని సోపపత్తికముగ నుపన్యసించిరి. కేతవరపు వేంకటశాస్త్రిగారు భారతములోని ధృతరాష్ట్రపాండురాజుల రాజ్యార్హత వ్యాసకర్తృత్వము ప్రక్షిప్తభాగము లు మున్నగు వానిం దెల్పుచు నుపన్యసించిరి. దానిపై కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారును, కాళ్లకూరి గోపాలరావుగారును, ఏలూరిపాటి రామభద్రచయనులుగారును గొన్నివాక్యములు దెల్పిరి. అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు రాఁజాలక బాపట్లనుండి పంపిన ఉత్తరరామచరితములోని ధర్మవీరరసము అనువ్యాసమును క్రొత్తపల్లి సూర్యరావుగారిచేఁ జదివించిరి. మధ్యాహ్నము- సత్యవోలు రాధామాధవ రావుగారు వసుచరిత్రములోని పెక్కుపద్యములను వీణపై రాగతాళయుక్తముగఁ బల్కించి ప్రబంధగానముం గావించి యానందముం గల్గించిరి. భమిడిపాటి తమ్మయ్యగారు తమయొద్దనున్న జాతకభాగము, ప్రత్యక్షఫలములం జూపునది (తెనుఁగు)కల దనియుచు దానిం బట్టి యనేకులకు ఫలములం జెప్పితి మనియు దానినచ్చువేయించుయత్నము యోజింపుఁ డనియు సభవారికిం దెల్పిరి. గొబ్బూరి వేంకటానందరాఘవరావు బి. ఏ. గారు భారతభాగవతాదులలోని విషయములకు జ్యోతిశ్చక్రముతోడి సంబంధముం జూపుచు నుపన్యసించిరి. ఏలూరిపాటి రామభద్రచయనులుగారు గ్రంథవిమర్శనముంగూర్చి కొంతచెప్పిరి. శ్రీరంగము సోమేశ్వరరావుగారు తాము తెనిఁగించిన లక్ష్మీసహస్రములోని పద్యములం జదివిరి. నేమాని విద్యాభూషణ నరసింహశాస్త్రిగారు తామాంధ్రీకరించిన ఋగ్వేదముం గూర్చి కొంతచెప్పి దానిలోని కొన్నిపద్యములను శ్రీత్రిపురాన వేంకటసూర్యప్రసాదరావుదొరగారిచేఁ జదివించిరి. పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు పరిషత్ప్రశంసం జేసిరి. క.సా.శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారొక్కింత సమయానుగుణముగు వాక్యరచనతో వినోదసంభాషణముం జల్పిరి. అధ్యక్షు లుపసంహారోపన్యాసముం జేసిరి.

రాఁబోవు పరిషత్సభను గంజాముమండలములో జరుపుటకు నేమాని విద్యాభూషణ నరసింహశాస్త్రిగారు తన్మండలపక్షమున నాహ్వానించిరి. శ్రీ

సూర్యప్రసాదరావు దొరగారు స్థలనిర్దేశము ముందుఁ జేయఁబడు నని నుడివిరి. ఆచారప్రకార మనోన్యాభినందనములతో సభ పూర్ణమయినది. కొందఱు కార్యక్రమములోని వ్యాసకర్తలు రాలేదు. వ్యాసములం బంపలేదు. పంపిన వారివ్యాసములు కొన్ని వ్యవధిచాలక చదువఁబడలేదు. క్రమముగాఁ బరిష త్పత్త్రికలోఁ బ్రకటింపఁబడును.

కార్యనిర్వాహకసభలోని తీర్మానములు.

ది 24 మెయి ఆదివారము విశాఖపట్టణములో జరిగిన ఆంధ్రసాహిత్య పరిషత్కార్య నిర్వాహకసంఘమువారి తీర్మానములు.

I. ఆంధ్రసాహిత్యపరిషత్పక్షమున నీదిగువఁ జేర్పఁబడినవారిని జందాలను, విరాళములను సంపాదించుట కుపసంఘముగా నేర్పఱుచుటయైనది.

మ॥రా॥శ్రీ॥ ప్రభల లక్ష్మీనరసింహము పంతులుగారు, బి. ఏ., బి. ఎల్., విశాఖపట్టణము.

,, సెట్టి లక్ష్మీనరసింహమునాయఁడుగారు, బి. ఏ., విశాఖపట్టణము.

,, పిన్నకోట దుర్గారావుసెట్టిగారు, విశాఖపట్టణము.

,, శ్రీత్రిపురాన వేంకటసూర్యప్రసాదరావుదొరగారు, సిద్ధాంతము.

,, నేమాని విద్యాభూషణవేంకటనరసింహశాస్త్రిగారు, బరంపురము

,, శ్రీరాజా మీర్జాపల్లపరాజు అచ్యుతరామరాజుగారు, తుని.

,, పోట్నూరి స్వామిబాబుగారు, నరసన్నపేట.

,, తిత్తి బలరామయ్యనాయఁడుగారు, బారువ.

,, శ్రీకవిరాజ వత్సవాయ వేంకటనీలాద్రిరాజుగారు, తుని.

,, దూర్వాసుల సీతారామమూర్తిపంతులుగారు, చోడవరము.

,, భమిడిపాటి యజ్ఞనారాయణశర్మగారు, మాడుగుల.

,, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు, రామచంద్రపురము.

,, బుద్ధవరపు మహాదేవుఁడుగారు, రామచంద్రపురము.

,, జోస్యుల రామచంద్రరావుగారు, రామచంద్రపురము.

,, కేశవరపు కామరాజుగారు, పెద్దాపురము.

,, కొత్త శేషగిరిరావుగారు, పెద్దాపురము.

,, న్యాపతి సుబ్బారావుపంతులుగారు, బి. ఏ., బి. ఎల్., రాజమహేంద్రవరము.

మ॥ రా॥ శ్రీ॥ కవిసార్వభౌమ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు, రాజమహేంద్రవరం.
,, దువ్వూరి వేంకటేశ్వరులుగారు, అమలాపురము.
,, బాలదారి నారాయణదేవుగారు, రాజమహేంద్రవరము.
,, మల్లాది రామమూర్తిశాస్త్రిగారు, రాజోలు.
,, వాడ్రేవు రామమూర్తిగారు, బి. ఏ. రాజోలు.
,, మిత్తింటి నరసింహమూర్తిగారు, రాజమహేంద్రవరము.
,, శ్రీపాద రామమూర్తిగారు, నరసాపురము.
,, నందుల సుబ్రహ్మణ్యముగారు, పాలకొల్లు.
,, పామర్తి సూర్యప్రకాశశర్మగారు, ,,
,, రెబ్బాప్రెగడ మందేశ్వరశర్మగారు, కొవ్వూరు.
,, ఏలూరిపాటి రామభద్రచయనులుగారు, తాళ్ళపూడి.
,, అనిపెద్ది జగన్నాథశాస్త్రిగారు, కొవ్వూరు.
,, కల్లూరి నరసింహముగారు, తాళ్ళపూడి.
,, ప్రక్కి జగ్గయ్యగారు, పోలవరము.
,, కలవలపల్లి రంగనాథశాస్త్రిగారు, ఏలూరు.
,, కొత్తపల్లి సుందరరామయ్యగారు, ఏలూరు.
,, నాదెళ్ళ మేధాదక్షిణామూర్తిశాస్త్రిగారు, బందరు.
,, ప్రొఫెసరు తొండపి అంజనుగారు. బెజవాడ.
,, ప్రొఫెసరు శేషగిరిగారు, బందరు.
,, కొలిపాక వెంకటప్పారావుగారు. నందిగామ.
,, జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరిగారు, గుంటూరు.

II. ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో నుత్తమవిద్యాపరీక్షలను (బి. ఏ. ఆనర్సు) స్థాపించినందున నాంధ్రవిశ్వకళాపరిషత్తువారి నీసభవా రభినందించుచున్నారు.

III. విశ్వవిద్యాలయములలో నుత్తమాంధ్రపరీక్షల నేర్పాటుచేసి యున్నారు గాన నట్టియుత్తమవిద్యాభ్యాసమునకు వలయుపుస్తకములను బండితులచే ననువాదము చేయించుటకును, రచింపఁజేయుటకును, వాని నీపరిషత్తువారు సంస్కరించుటకును, వలయువానిని బ్రకటించుటకును నిర్ణయింపఁబడియెను.

IV. ఇదివఱకుఁ బ్రకటితములై యున్న పొత్తములలోఁ బెక్కులు దోషసహితములై యున్నందున వానియొక్కసవరణ మీపరిషత్తు నిర్ణయించుటకును, ఈపరిషత్తువారిచేఁ బరిష్కరింపఁబడిన గ్రంథములే పాఠ్యపుస్తకములుగా నుండునట్లు చేయుటకును నిర్ణయించుటయైనది.

V. ఈపరిషత్తువారిచే నామోదింపఁబడిన పుస్తకములే పాఠ్యపుస్తకములుగా నుండునటులు నిర్ణయించుటకు విశ్వవిద్యాలయము:లవారిని పాఠ్యపుస్తకనిర్ణాయకసంఘమువారి నీసభవారు కోరుచున్నారు.

VI. ఆంధ్రభాషాప్రతినిధులుగా నేర్పఱుపఁబడినవారిద్దఱిలో నొక రీపరిషత్తువారిచే నిర్ణయింపఁబడినవారుగా నుండవలయు నని యీసభవారు విశ్వవిద్యాలయమువారిని గోరుచున్నారు.

VII. ప్రాచీనపుస్తకములలోని శృంగారవర్ణనము లశ్లీలము లని భావించుట యుక్తము కాదు కావున నందువిషయమై ప్రభుత్వమువా రెట్టినిబంధనముల మూలమునను నిషేధింపఁగూడ దని యీసభవారు ప్రార్థించుచున్నారు.

VIII. ఆంధ్రమున రచియింపఁబడు పద్యగద్యరూప నానావిధగ్రంథములను నీపరిషత్తువారి పరిశోధనమునకుఁ బంపఁబడవలయుననియు, నట్టివెల్లనుబరిషత్తువారివలన నావిషయమై యేర్పఱుపఁబడినయుపసంఘములచేఁ బరిశీలింపఁబడి పరిషత్తువారిచే నామోదింపఁబడిన పిమ్మట ముద్రింపఁబడవలయుననియు నాపద్ధతియే గ్రంథమునకు గౌరవమును ఆంధ్రవాఙ్మయమునకు మేలును గలుగఁజేయుననియు నీపరిషత్తువారి యభిప్రాయమైయున్నది. కావున నావిషయమై వివిధశాఖలవాఙ్మయాభివృద్ధికొఱకు గ్రంథకర్తల యుపసంఘముల నేర్పఱిచి పరిషదధికారమునకులోనై పనిచేయుటకుఁ దగునుపాయములను శీఘ్రముగ నెఱవేర్చుట కీసభవారు కోరుచున్నారు.

IX. ఇతరభాషాసాహిత్యపరిషత్తులకార్యక్రమములనరసి వలయు ప్రత్యేకసాహిత్యాభివృద్ధులకొఱకుఁ దగుకార్యములనూహించుటకై యఖిలభారతసాహిత్యసమ్మేళనమునకై యత్నముచేయవలయునని యీపరిషత్తువారు కోరుచున్నారు.

X. పైతీర్మానములను విశ్వవిద్యాలయాధికారులకును బ్రభుత్వమువారికిని బంపుటకు అగ్రాసనాధిపతుల కధికార మొసఁగఁ బడినది.

లకును హ్రస్వము లగు నచ్చులకు ను సమకాలము కల్పింపసాహసించినను దత్సమపదములలోని వానికిని గూడ సమకాలతను గల్పింప సాహసించెదరా? మఱియు "సంస్కృతావ్యయములలోనివైన యుపసర్గలు తత్సమములైన విశేష్యవిశేషణధాతువుల మొదటఁజేరి కనఁబడుచుండును గావున వానిని గూడ నుదాహరించెదను. ప్ర॥ ప్రదేశము, సు॥ సుగుణము, దుర్॥ దుర్జనుఁడు." పూర్వవాక్యార్థమున కివి యె ట్లుదాహరణము లగునో ప్రాజ్ఞు లాలోచింతురుగాక. పరకీయదోషాన్వేషణముతోఁ బని లేదు. సంస్కృతవ్యాకరణమున మంచి జ్ఞానము గలవారిసహాయమును గూర్చుకొని వ్యాకరణరచన చేయవలయునుగాని కేవలాంధ్రపండితులు చేయఁదగినపని కా దని నాతలంపు.

విమర్శగ్రంథములు.

ఇదివఱకు నేఁజూచిన కొన్నివిమర్శనగ్రంథములలోఁ గవియొక్క జాతి, కాలము, శాఖ, దేశము, ఈవిధము లగునంశములు కన్పడుచున్నవి. పిమ్మట నందలి దోషముల నిరూపించుటకుఁ జాలఁబ్రయత్నించినట్లు కన్పడుచున్నది. ఈవిమర్శల కుపయోగము లే దని నేను జెప్పను గాని ముఖ్యముగ విమర్శ లీవిధముగ నుండవలయు నని నాయాశయము. బోద్ధలు రసాభిముఖులై గ్రంథములం దిమిడి యున్న సదుపదేశములను గ్రహింపవలయు నను ముఖ్యోద్దేశముతోఁ గవి కావ్యములను వ్రాయును. ఇందలి ప్రధానరస మేది? అంగరసము లెవ్వి? ఆరసము లంగిరసము నెట్లు పోషించినవి? ఇందు విభావాదు లుచితముగ వర్ణితములా? ప్రతివాక్యమును వ్యంగ్యవైభవము గలదై యున్నదా? అలంకారము లాయావ్యంగ్యోపస్కారములుగ నున్నవా? గుణముల రచన రసానుగుణముగ నున్నదా? ఈమొదలగు విమర్శలున్నచోఁ దత్పరస్పరముగ నాగ్రంథమును జదివిన సహృదయుల కానందము గల్గును. ఇట్టి విమర్శల కలంకారశాస్త్రజ్ఞానము ముఖ్యము. ఇట్టి విమర్శలు రసవత్తరములైన ప్రాచీనప్రబంధముల కన్నిటికిని గావలయును. ఆంధ్రభాషకు సంస్కృతభాషాజ్ఞాన మావశ్యకము. ఆంధ్రభాషసంస్కృతభాషాగర్భితమయి యున్నది. నన్నయభాష సంస్కృతపదభూయిష్ఠము. తిక్కనభాష సమసంస్కృతమైయున్నది. ప్రబంధము

లన్నియు సంస్కృతప్రచురములై యున్నవి. అచ్చతెనుఁగు కావ్యములు కొలఁదిగ నున్నను నవి మిగిలినగ్రంథము లంత సుబోధములు గావు. సుబోధముగ నుండునదియె కావ్యము లేనిచోఁ బ్రసాదగుణవిరహిత మై రసస్ఫోరకము కాఁజాలదు. కావున సంస్కృతభాషాజ్ఞానము కూడ నున్ననే రసాస్వాదము కలుగును. తెలుఁగుగ్రంథములలోని సంస్కృతభాషామూలమునఁ గలిగిన సంస్కృతభాషాజ్ఞానము చాలు ననుట లోకవ్యవహారమూలమునఁ గలిగినయాంధ్రభాషాజ్ఞానము ప్రబంధములయందలి రసాస్వాదమునకుఁ జాలు నన్నట్లుండును. కావున స్వతంత్రముగ నాయాభాషలయందు జ్ఞాన మావశ్యకము. అన్నిభాషల కంటెను సంస్కృతభాషకు వ్యాకరణనిర్బంధ మధికము, కావున, వ్యాకరణజ్ఞానపూర్వక సంస్కృతజ్ఞానమును మన మభిలషింపవలయును. ఇప్పటివిద్యాసంవిధానమున సంస్కృతములో వ్యాకరణమును మూలఁద్రోసి కొంచెపుభాషాజ్ఞానమును సహకారముగఁజేసికొని తెలుఁగు నందు ప్రవీణులగుటయేకాక యుభయభాషాప్రవీణులుగూడ నగుచున్నారు. అట్టిజ్ఞానము భాషకు విశేషించి యుపకరించునది కాదు. ఇపుడు (1) శిష్టవ్యావహారికము (2) గౌరవనీయులు (3) దానిసేయులు (4) ప్రాముఖ్యత మొదలగుపదములు నూతనముగ గ్రాంథికము లగుచున్నవి. ఇది భాషకుఁ గళంక మని నాతలంపు. ఇట్టికళంకమును దొలఁగింపఁ బ్రయత్న మత్యావశ్యకము.

మహాశయులారా !

వార్ధకలక్షణము లగుకొన్ని పిచ్చిపిచ్చిమాటలచేతఁ దమయమూల్య మగుసమయమును వ్యర్థముచేసినందుకు నన్ను మన్నింపుఁడు. మొదట నేదయతో నన్నీస్థానమునఁ గూర్చుండఁబెట్టితిరో యట్టిదయతో నాలోపములను క్షమింపుఁడు. ప్రసంగవశమునఁ బరకీయోక్తుల విమర్శించునపుడు నాపలుకులం గొంతపారుష్య మున్నను నది భాషాసేవాభిమానమూలకముగాని వేఱొకవిధముగాదని యెంచి మన్నింపుఁడు. భావికార్యక్రమమును భగవంతుఁ డనుకూలముగ నెఱవేర్చుంగాక.

స్వస్త్యస్తు.

---

# పాఠపరిశీలనము.

—విద్వాన్ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు - చిట్టిగూడూరు—

---

ఆంధ్రవాఙ్మయము తాళపత్రములనుండి ముద్రితగ్రంథరూపమున నవతరించునపు డందలి యాంధ్రభాష నూతనరూపముం దాల్చియున్నది. ఈయవతారమున నెన్నియో పాఠములు తాఱుమాఱగుటచేఁ బలుతావులఁ బ్రాచీనకవుల భావములను గాని, ప్రయోగములవిషయమున నాయాకవుల సమ్మతిని గాని సరిగా గుర్తించుటకు వలను పడకున్నది. ఈయనర్థమున కీకాలపు గ్రంథసంస్కర్తల నిరాతంక మగుస్వతంత్రతయే చాలవఱకు మూల మని యెందఱో విమర్శకు లుద్ఘోషించుచునేయున్నారు. ఆయుద్ఘోషము బధిరశంఖారావ మగుచునే యున్నది. తొలుతఁ దాళపత్రమాతృకలనుండి పుత్రిక లవతరించునపుడే యర్థజ్ఞానశూన్యు లగులేఖకాదుల ప్రమాదములవలనఁ గవుల ప్రయోగము లెన్నియో వ్యత్యస్తములై యనర్థాపాదకము లయినవి. ఇట్టియెడ ముద్రణావసరంబుల సంస్కర్తలు శ్రద్ధఁబూని ప్రాచీనతాళపత్రగ్రంథముల సాకల్యముగఁ బరిశీలించియు, నందలిపాఠభేదముల యథాస్థితంబుగఁజూపియుఁ దత్తన్మూలగ్రంథములను దత్తద్విప్రణీతము లగునితరగ్రంథభాగములను బరిశోధించియు, లేఖకాది ప్రమాదముల సప్రమాణముగ నిర్ణయించి సవరించియుఁ, దమసంస్కారప్రకారము నావశ్యక మగు పట్టులఁ బాఠకలోకమునకుఁ దెలియ వెలువరించియు ని ట్లీయనర్థమును యథావకాశముగఁ దొలఁగించి యుండవలసినది. అట్లుగాక వీరు పరిశోధనములం దుచిత మగుశ్రద్ధఁ బూనకుండుటచే నీయనర్థ మంతరించుటకు మాఱుగా మఱింత యధిక మయినది. ఇఁక దీనికయి చింతిల్లుటకంటెఁ దగిన ప్రతికార మొనర్చుట భాషోపకారకము. ఆప్రతిక్రియ విమర్శకాయత్తము. విమర్శకులు ముద్రితగ్రంథముల నెల్లఁ దాళపత్రాదిమాతృకాసాహాయ్యమునఁ బరిశీలించి వలయుపరిశోధనములు గావించి యందుఁ గవిప్రయుక్తముల సప్రమాణముగ నిరూపించి యిట్టిపరిషత్తులఁ బండితుల యెదుటఁ జర్చించి వానిని బత్రికాముఖమునఁ బ్రకటించినచో మఱుఁగుపడియున్న కవిప్రయోగతత్త్వమును జదువరులకుఁ దెలిపినవా రగుదురు. పరిశోధకులు దీని నుపేక్షింపఁ జన దని నావిన్నపము. ఇట్టిపాఠపరిశీలనసంబద్ధము లగుచర్చలు విమర్శకభూయిష్ఠము లగునీయాంధ్రసాహిత్యపరిషత్సమావేశములందే జరుగకున్నచో మఱి వీనికిఁ దావు లేదు. ఇఁక బ్రకృతాంశమునకు సమీపింతము.

ఆంధ్రసాహిత్యపరిషత్తువారు కొన్నియపూర్వము లగుప్రబంధములను లక్షణగ్రంథములను ముద్రింపించి ప్రకటించియుండిరి. వీరు పయిని నిర్దేశింపఁబడిన సంస్కర్తలవలెఁ గాక, ముద్రణకాలముల కుపలబ్ధమయిన వ్రాఁతప్రతులను సావధానముగఁ బరికించియు, నందు లేఖక ప్రమాదజనితములు గఁదోఁచినవానిని న్యాయ్యదృష్టిని సవరించియుఁ, బాఠభేదము లున్నయెడ వాని నన్యథాకరింపక సాకల్యముగఁ జూపియు, సమన్వయసందేహము గలిగినపట్టుల నేదోయొకరీతిని సవరింపఁ గడంగక "యిత్యాదిసందిగ్ధ మ"ని సుస్పష్టముగ సూచించియు నీరీతిని విమర్శకసమ్మత మగుపద్ధతుల నవలంబించుట గడుం గడుఁ బ్రశంసనీయము. ఇట్లెంతగా శ్రద్ధవహించినను నీగ్రంథముల ముద్రణములందుఁ గొన్నితావులఁ దత్తద్గ్రంథకర్తల యుద్దేశములకు భంగము వాటిల్లినట్లు గానవచ్చెడిని. పరిషత్ప్రకాశితము లగుగ్రంథములు సర్వథా యనవద్యము లయియుండఁదగు ననుకోరికతో నచ్చటచ్చటఁ బాఠములఁ బరిశీలించి నాకభిప్రాయభేద మొదవించిన వానిలోఁ గొన్నిటి నీసమావేశమున సంగ్రహముగ వివరింపఁబూనితిని. ఇదియే యీనావ్యాసమునకు స్వరూపము.

(1) చంపూరామాయణము.

"మ. ధనువంశం బది విష్ణువంశ మగునాథానుష్ఠధౌరేయుచే
మనువంశంబుగతిఁ గుణోన్నతివహింపనోప్పఁచి ..." (ఆ-3—ప. 102.)

ఇందలి ధనువంశం బనునది పీఠిక 13 వ పుటలో లక్షణదుష్టముగ నుదాహరింపఁబడి యున్నది. మఱియు నీపద్యము నొద్ద (50 వ పుట) "ధనుర్వంశ మనుట కిది యపప్రయోగము." అని లిఖింపఁబడియున్నది. పరిశీలింప దీనిని సుశబ్దముగ సంస్కృతశాబ్దికులు సాధించియుండిరి.

భృ, మృ, శీ, తృ, చరి, త్సరి, తని, ధని, మి మస్జిభ్య ఉః.॥ —సిద్ధాంతకౌముది—ఉణాది, ప్రథమపాదము; 7వ సూత్రము.

ఈసూత్రము క్రమముగా, భరుః, మరుః, శయుః, తరుః, చరుః, త్సరుః, తనుః, ధనుః, మయుః, మద్గుః, అనునుకారాంతశబ్దములను సాధించెడిని. ఇట భట్టోజిదీక్షితులు "ధనుః, శస్త్రవిశేషః. ధనుషాచ ధనుం విదుః- ధనురివాజని వక్త్ర ఇతి శ్రీహర్షః" అని సకారాంతముతోపాటుగ నుకారాంతము గూడ నున్నట్లు స్పష్టపఱచిరి. ఇటఁ దత్త్వబోధినిలో "ధనుషా చేత్యాది.- ధనుషా

షజ్యతే- 'శుద్ధవంశజనితోఽపి గుణస్య స్థానతా మనుభవన్నపి శక్రః। క్షిప్తురేన మృజుమాశు సపక్షం సాయకం'ఇతి శ్రీహర్ష శ్లోక శేషః- (నైషధము-5-102)= 'ధను ర్వంశవిశుద్ధోఽపి నిర్గుణః కిం కరిష్యతి' ఇతి ధన్వన్తరిః-ఇహ పూర్వత్రచ ధను రితి ఉకారాన్త స్సకారాన్తో వా బోధ్యః-నచ సకారాన్తధనుశ్శబ్దో నపుంసక ఏవేతి శఙ్క్యమ్- అథాస్త్రియామ్, ధను శ్చాపౌ' ఇత్యమరోక్త్యా తస్యాపి పుంస్త్వాత్" అని ధనుః అనునది సాంతమై పుంలింగముగ నుండుటయు, నుకారాంతమై యుండుటయు నిర్బాధకము అని జ్ఞానేంద్రసరస్వతులు సప్రమాణముగ వివరించి యుండిరి. మఱియు సకారాంతధనుశ్శబ్దమును సాధించిన "అర్తి, పృ, వపి, యజి, తని, ధని, తపిభ్యోనిత్" (ఉణాది- 2 పా- 282 సూ)అను సూత్రమునొద్ద "ధనురస్త్రియామ్- ధను ర్వంశవిశుద్ధో పి నిర్గుణః కింకరిష్యతి- సాన్తస్య ఉదన్తస్యవా రూపమ్"అని దీనియుకారాంతత్వమును దీక్షితులు మరల నుద్ఘాటించియుండిరి. ఇంతియగాక పయినైషధశ్లోకమునకు వ్యాఖ్య వ్రాయుచు మల్లినాథసూరియు "అయం శబ్దః ఉకారాన్తో ప్యస్తి" అని స్పష్టీకరించి యుండెను. ఇదియుఁగాక రాఘవపాండవీయమున "అనుపమదివ్యవిక్రమసమగ్రుఁడు..." (2 ఆ- 56 ప) అను పద్యపు వ్యాఖ్యలో ముద్దరాజు పెదరామధీమణి యు "ధనువును" ఉకారాన్తము 'సోయం ధను రజని వక్రః' అని నైషధమందుఁ బ్రయోగము. అని దీనియుదన్తత్వము నుల్లేఖించియుండెను. 'ధనుః' అనునది సాంతమై యున్నను'సాన్తాదపయః ప్రభృతే ర్లోపః' అను నాంధ్రశబ్దచింతామణిసూత్రముచొప్పున సకారలోపము కలిగి 'ధనువును' అను రూపము నిర్బాధకముగ సిద్ధించుచుండుటంజేసి దీనికయి యుకారాన్తశబ్దపరామర్శ మావశ్యకము గాకున్నను బ్రసంగవశంబున నీవిశేషరూపమును గూడఁ బాఠకులకు బోధింపఁ దలంచి యిట్లీతఁడు పేర్కొనియుండును.

ఇవన్నియు నిటుండ సకారాన్తధనుశ్శబ్దమును బరిగ్రహించినను ధనువంశమను సమాసము సాధువగుట కాంధ్రవ్యాకరణములలోనే నిర్బాధక మగు మార్గ మొండుగలదు. "సాంతంబులతుది సకారంబునకు లోపంబు బహుళంబుగా నగు" (బాల- తత్స. 80 సూ.) నను సూత్రముచే ధనుస్ అనుదాని సకారమునకు లోపము రాఁగా "వువర్ణకేతరవిభక్తిపర మగుచో నుకారాన్తంబులకు బహుళంబుగా గోశబ్దంబునకు నిత్యంబుగా వుగాగమం బగు' (బాల- తత్స- 40 సూ) ననుసూత్రముచే వుగాగమము బహుళముగా విహితమగుటచే ధనువు

వుయొక్క ధనుయొక్క యను రూపద్వయ మేర్పడును. అందు ధనుయొక్క యనుదానితో వంశశబ్దమునకు సాధ్యసమాసము చేసినచో ధనువంశ మనుశబ్దము సిద్ధించును. ఇట్టి వుగాగమ విరహితరూపములు భాషలోఁ బెక్కులు గాననగును.

పయిని జూపినరీతి నుకారాన్తధనుశ్శబ్దము సంస్కృతగ్రంథములలోఁ బ్రయుక్తమై ప్రామాణికసమ్మతమై యుండుటవల్లను, సాంతత్వపక్షమునఁ గూడ నాంధ్రవ్యాకరణములచే నీసమాసము సాధు వగుచుండుటవల్లను ధనువంశం బనునది సర్వథా సాధు వనందగును గాని యపప్రయుక్తం బనియు లక్షణదుష్టం బనియు నిరసింపఁ దగదని నానిశ్చయము.

(2) చంపూరామాయణము.

"చ. సుమతి నృపాలుఁ డేలుపురిఁ జూతమనం జని మువ్వ రాధరా
రమణుసపర్యఁ గైకొని పురందరుఁడే జడదారి నారిపైఁ
దమి గతశోకుఁడై పిదపఁ దాల్చె నజాండభరంబు నట్టి గౌ
తమముని యున్నయాశ్రమపదంబుకుఱంగట త్రోవఁ బోవఁగన్"(3-29)

పరిషద్గ్రంథాలయములోని తాళపత్రమాతృకలోఁగూడ నీపద్యమున 'గతశోకుఁడై' యనియే లిఖింపఁబడియున్నది. ఈసందర్భమున నీగ్రంథమునకు మూలభూతమగుభోజచంపువును బరిశీలింపనందీక్రిందిపద్యములు గాననగును.

అత్రాగమద్గౌతమధర్మదారా ననార్యజుష్టేనపథా మహేన్ద్రః ।
సచక్రుధా నిర్వృషణం వృషాణం భార్యామదృశ్యాం చ ముని శ్చకార॥
ఇత్థం విదితవృత్తాన్తే దేవతానాం గణే తదా ।
పితౄణాం ప్రభవా ల్లేభే మేషస్యవృషణం వృషా॥ (బాల- 146, 149)

ఈశ్లోకములం దహల్యను వలచిన యింద్రుఁడు ముష్కశూన్యుఁ డగునట్లు గౌతమునిచే శప్తుఁ డయి పితృదేవతామహిమచే మరల మేషాండమును బొందినట్లు వాల్మీకిరామాయణప్రసిద్ధ మగుగౌతమశాపవృత్తాంతము సంగ్రహింపఁబడియున్నది. పయిని జూపినతెలుఁగుపద్యమునం దీవృత్తాంతము తిరోహితమయినది.

కవి యీశాపప్రసంగము దిగవిడిచి యుండఁ డనియు, మూలమునందలి 'నిర్వృషణ'మ్మనుదానిని 'గతకోశుఁడై' యని యాంధ్రీకరించియుండు ననియు, లేఖకప్రమాదమున విపరీతార్థప్రద మగువర్ణవ్యత్యయము (కోశు=శోకు)

జరిగియుండుననియు మనమూహించుట న్యాయ్యము గాన "గతకోశుఁడై"య నునది కవిప్రయుక్తముగ నిశ్చయింపఁదగు నని నాయాశయము.

(3) శివరాత్రిమాహాత్మ్యము.

క. "మీకును మీపతియానతి, మాకును మాభర్తయాజ్ఞ మన్నింపఁదగుఁ
వాకావవాక్యములవెడ, వాకాట్లంబల్బజంబు వలవదు సేయఁ" (4ఆ-70ప)

ఇటఁ బరిషద్గ్రంథాలయమునందలి తాళపత్రమాతృకలోఁ గూడ 'వాకావవాక్యముల' యనియే యగపడుచున్నది. ఈపద మర్థశూన్య మై యుండుటవలన దీనికడఁబ్రశ్నార్థకచిహ్నము(?) ముద్రిత మయినది. పయిపదము లేఖకప్రమాదపతిత మగుటకు సందియము లేదు.

మహాభాష్యము పస్పశాహ్నికమున "మహాన్ శబ్దస్య ప్రయోగవిషయః—సప్తద్వీపా వసుమతీ, త్రయో లోకాః, చత్వారో వేదాః, సాఙ్గాస్సరహస్యాః, బహుధా భిన్నా ఏకశత మధ్వర్యుశాఖాః, సహస్రవర్త్మా సామవేదః, ఏకవింశతిధా బాహ్వృచ్యమ్, నవధా థర్వణో వేదః, వాకోవాక్య మితిహాసః పురాణం వైద్యక మి త్యేతావాన్ శబ్దస్య ప్రయోగవిషయః- ఏతావన్తం శబ్దస్య ప్రయోగవిషయ మననునిశమ్య సన్త్యప్రయుక్తాఇతి వచనం కేవలం సాహసమాత్ర మేవ'' అని శబ్దప్రయోగ విషయనిరూపణ సందర్భమునఁ బతంజలి భగవానులు వాకోవాక్యపదమును వ్యవహరించి యుండిరి. "వాకోవాక్యశబ్దేన ఉక్తిప్రత్యుక్తిరూపో గ్రన్థ ఉచ్యతే, యథా; కింస్విదావపనం మహత్? భూమి రావపనం మహత్" అని కైయటోపాధ్యాయులు దీనియర్థమును వివరించియుండిరి, దీనిం బట్టి వాకోవాక్యము లనఁ బ్రశ్నోత్తర రూపము లగు గ్రంథములని తెలియుచున్నది.

శివరాత్రిమాహాత్మ్యమున సుకుమారుఁడు మరణించినసందర్భమున నాతఁడు నీచాతినీచము లగుమహాపాతకము లసంఖ్యాకముగ నొనర్చినవాఁడగుటచే యమలోకమున కీడ్చుకొని పోవ యమదూతలును, నాఁకశివరాత్రిసమయంబున నాగేశ్వరశంభుసన్నిధిని యాదృచ్ఛికంబుగ జాగరణంబు చేసి యుంటచేఁ గైలాసంబునకుఁ దోడ్కొనిపోవ శివదూతలును నాతనికడకేఁగి పరస్పరము గలహింతురు. ఇప్పట్టున నాయుభయపక్షములకును సుదీర్ఘముగఁ బ్రశ్నోత్తరములు ను వాదప్రతివాదములు ను నడచినపిమ్మట నీప్రకృతపద్యము గలదు. ఈసందర్భమున నుక్తిప్రత్యుక్తు లను నర్థ మొంతయుఁ బొసఁగియుండుట

వల్లను, (శ్రీ)నాథమహాకవి కృతులయం దనేకస్థలముల శాస్త్రవ్యవహారగాథ ము లగుపదములు వెలయు చుండుటవల్లను, "పన్నగపతిసార్వభౌమభాషితమ హాభాష్యవిద్యాసముభ్యాసబలము" మ న్నగువాక్యములచే నాతనికి మహా భాష్య ప్రయోగములు సుపరిచితము లని యూహింపఁ దగి యుండుటవల్లను నిట "వాకోవాక్యమ్ముల వెడ, వాకాట్లన్" అనుపాఠము గవిప్రయుక్తముగనిర్ణ యింపదగు నని నాతలంపు. ఈ ప్రయోగమును బ్రమాణముగఁ గొని యీపదమును సూర్యరాయాంధ్రనిఘంటువునఁ జేర్చుట సమంజస మని యు నాయాశయము.

(4) శివరాత్రిమాహాత్మ్యము.

"ఎఱుఁగునే పీడకన్నును నెండకన్నుఁ, జెలఁగి పూఁచు నేకర్మవంచిన లతాంగి
మెట్టిక్లేశంబులకునైన నీడఁబోదు, తనమనంబున నిగ్రుచుసంతానకాంక్ష."

(2. ఆ. 39 ప.) ఇందలి 'వంచిన' యనుపాఠమే తాళపత్త్రమాతృకలోఁ గూడఁ గాన వచ్చెడిని.

ఎన్నండును లేశముగ నయినఁ గ్లేశ మెఱుంగని కోమలాంగి యగునా సుశీల పుత్త్రోదయసాధనంబుగ నెవ రేకర్మ నాజ్ఞాపించినను దానఁ గలుగు నెం తటిక్లేశము నయిన సంతానకాంక్షచే గణింపక యాయాకర్మల నుత్సాహంబు తోఁ బూని యాచరించెడిదని పయిపద్యమునకు భావము. ఇందు 'ఏకర్మ వంచిన' యనుచో వకారము నాదేశనిష్పన్నముగ భావింపవలసియుండును.

ఒకమహారాజునకుఁ బ్రధానామాత్యుఁడై రాజ్యభార మంతయుఁ దా నే వహించి యున్న యజ్ఞదత్తునికి భార్య యై మహాభాగ్యశాలిని యగు నీ సుశీల కాజ్ఞాపించువారు సామాన్యులుగా నోపరు. గురుజనులో లేక యం తటి మాన్యులో యై యుండవలయును. అట్టి గురుజనులయాజ్ఞ దనకుఁ గ్లేశ దాయక మయినను వారియెడ గౌరవాతిరేకముచే శిరసావహించి దాని నెఱవేర్చుట వినయవతియు వివేకవతియు నగుసుశీలకు సహజధర్మమై యున్నది. ఇట్లుండ సంతానకాంక్షచే గురుజనాజ్ఞను బాలించిన దనుట సరసముగఁ గాన రాదు. అది కవిహృదయము గానేరదు.

ఎట్టిసామాన్యజనులవల్లనయిన నేకర్మవిషయము వినఁబడినను దాని నెల్ల నాచరించెడి దనుటలో విశేషము గలదు. అట్లు చెప్పిననే సంతానకాంక్షచే ననుహేతువు సార్థక మగును. ఇది యి ట్టుండ శివరాత్రిమాహాత్మ్యములోని

యనేక భాగములకును విశేషించి యీ ప్రకరణమునకును మూల మనఁ దగిన బాణునికాదంబరిలో నీసందర్భమున "యద్యచ్చ కించిత్ కుతశ్చిత్ శుశ్రావ, గర్భతృష్ణయా తత్ర తత్సర్వం చకార న మహాన్త మపి క్లేశ మజీగణత్" అను వాక్యములు గానవచ్చును. వీనింబట్టి గురుజనులవల్లనే గాక యెవ రెవరివలన నేదేది విన్నను దానినెల్ల నాచరించెడి దనియే బాణకవియాశయము విశద మగుచున్నది. కావున నెవ రేని దనులోఁ దాము చెప్పుకొనుచున్నను నాకస్మికముగ విని యాకర్తలలోఁ దన కేది యుపకరించునో యనుతలంపుతోను వానినెల్ల నాచరించెడి దనుటలోని స్వారస్యమును బాటించి శ్రీనాథుఁడు మూలమునందలి 'శుశ్రావ' యనుదాని కనురూపముగ 'వించిన' (వినిచిన యనుదాని రూపాంతరము) యని ప్రయోగించి యుండు ననుట సమంజసము. వినుచు ధాతువునకు వినవచ్చు (వినఁబడు) ననునర్థము కవులవాడుకలోఁ గలదు. "………కడుం జిత్రంబుతో దప్పులన్ వినిచెన్, మానవభాషణం బులు గడున్ విస్పష్టమై వీనులన్" (భోజరాజీయము) మున్నగు ప్రయోగము లరయఁదగును. పయిసందర్భములంబట్టియు, నెవరో చెప్పికొనఁ బరోక్షముగ వినవచ్చిన కర్తల నామె యాచరించెడి దనుటవలన నితరులు పనిఁబూని తెలిపినట్టియు గురుజనాదు లాదేశించినట్టియుఁ గర్తల నామె యాచరించుట కైముతికన్యాయసిద్ధమై సంతానకాంక్షాస్వరూపరహస్యము తేటతెల్లమయి ప్రకృతమున నెంతయు నింపు నాపాదించుచుండుటంబట్టియు నిట 'వించిన' యను పాఠమే శ్రీనాథప్రయుక్తము గాఁబోలు నని నాయుద్దేశము.

(5) కవిజనాశ్రయము.

కోమలీవృత్తము. జననుతకీర్తి నజాయగణంబుల్
　　ఘనంబుగా జభసరకారంబుతో
　　ననుపములై యుభయార్థములందున్
　　బెనంగఁ గోమలి యనుపే రొప్పుగున్." (వృత్తాధి-137 ప.)

భీమకవి వృత్తాధికారాంతమున నర్ధసమవృత్తములను స్వస్థానార్ధసమములు, పరస్థానార్ధసమములు నని రెండుదెఱంగులుగ విభజించి వాని కాఱు దాహారణంబులఁ జూపి యుండెను. అం దిది నాల్గవయుదాహరణము.

ఇప్పట్టున భీమకవి తానావలకు నిర్దేశించినవృత్తముల సమ్మేళనముచే నీయర్ధసమవృత్తము లేర్పడు నని తలంచెనే గాని యనిర్దిష్టపూర్వము లగు

నూతనవృత్తములచే నివి యేర్పడునని తలంచియుండలేదు. ఈనియమము ప్రకృతపద్యముగాక గ్రక్కిన వైయెదులక్ష్యములందును నిందుఁగూడ విషమపాదములందును సుస్పష్టముగ నగపడుచునేయున్నది. ఈలక్ష్యమున సమపాదములమాత్రము ముద్రితపాఠమునుబట్టి పయినియమమునకు భంగము వాటిల్లినది. గ్రంథప్రకాశకులు దీనిని గుర్తించియు సవరింప నాధారము లభింపక "ఇదియు జగతీచ్ఛందస్సులోనిదే. పొరపాటున వ్రాఁతప్రతులలోఁ బరస్థానార్ధసమవృత్తములలో నుదాహరింపఁబడి యుండును. విషమపాదములు తోదకవృత్తమునకుఁ జేరినవి." అని యీపద్యమునొద్ద వ్రాసియుండిరి.

భీమకవినియమము సురక్షిత మగుట కాధారముగ నేదేని పాఠభేదము లభించునో యనుతలంపునఁ బరిషద్గ్రంథాలయమునఁ దాళపత్రమాతృకలఁ బరిశీలింప నందొకదాన నీక్రిందిరీతిని భిన్నపాఠము లభించినది. (ఈప్రతి కవిజనాశ్రయముద్రణానంతరము పరిషత్తునకు సేకరింపఁబడియుండవచ్చును.)

"జననుతకీర్తి నజాయగణంబుల్, ఘనంబుగా జభసజగవ్రజంబుతో
ననుపము లైయుభయార్ధములందుణ్, బెనంగికోమలియనుపేరొండంబడుణ్"

ఈపాఠమున నిందలిసమపాదములు భీమకవిచే నిర్దిష్టపూర్వ మగురుచిరవృత్తమునకు సరిపడియుండుటంజేసి యిదియే కవిప్రయుక్తముగ నిర్ణయింపవలసియున్నది. దీనివిషమపాదములు 12 వ ఛందస్సునకును సమపాదములు 13వ ఛందస్సునకును జేరి యుండుటచే నిది పరస్థానార్ధసమ మని భీమకవి యాశయము. పాఠము భిన్నముగ నున్నను గ్రక్కినవ్రాఁతప్రతులలో నెల్ల నిది పరస్థానార్ధసమములలో నుదాహరింపఁ బడియుండుట గూడ నిదియే కవిప్రయుక్త మనుట కెంతయు సాధక మయి యున్నది. మఱియు భీమకవి స్వస్థానార్ధసమములకు నాల్గిటిని బరస్థానార్ధసమములకు రెంటిని నుదాహరణములఁ జూపెననుటకంటె నొక్కొకజాతికి మూఁడేసియుదాహరణము లొసంగె ననుట యెంతయు సంభావ్యము. ఉచితము. కావునఁ బయిరీతిని ముద్రిత మగు పాఠమును సవరింపవలయు నని నాయభిప్రాయము.

ఈపాఠపరిశీలనమునందలి నాయూహలను బండితులు విమర్శింపవిన్నవించుచు నీసమావేశమునఁ గలవ్యాససంకోచనియమముచే నింతటితోవిరమించుచున్నాఁడను.

---

వ్యాసకర్తగారి యభిప్రాయములను గృతజ్ఞతాపూర్వకముగఁ గైకొని ద్వితీయముద్రణకాలమున విమర్శింతుము. ప. అ.

శ్రీరస్తు.

# ఉత్తరరామచరితనాటకరసవిచారవిమర్శనము.

—( కావ్యతీర్థ రావాడ వేంకటరామశాస్త్రిగారు, బళ్లారి )—

సారస్వతాపణమునందలి గ్రంథరత్నములకు విమర్శనలు సానలవంటివి. మణులు సానకుఁబెట్టి, తరచుకొలఁది నిగ్గుల నెట్లీనుచుండునో యట్లె గ్రంథరత్నములు విమర్శించిన నట్లెల్ల వెలయుచుండును. కావుననే పాశ్చాత్యపండితులు షేక్సుపియర్ మున్నగుమహాకవుల గ్రంథములను ఉత్కృష్టముగ విమర్శించుచుందురు. మనదేశమునం దీవిమర్శించు పద్ధతి మహాకవి శ్రీక్షేమేంద్రుని కాలమునుండి వచ్చుచుండినను పాశ్చాత్యదేశమునందువలెఁ దగినంత యభివృద్ధిని గాంచలేదు. ఇప్పు డిప్పుడు మనపండితులుగూడ నీత్రోవఁ ద్రొక్కుచుండుట శంస్యము శ్రేయస్కరమును. కాని విమర్శకుఁడు మాత్రము ప్రాతపద్ధతుల ను భూషించుటయు, క్రొత్తపద్ధతులని దూషించుటయుఁ జేయక ప్రాచీనార్వాచీనమార్గముల రెంటిని జక్కఁగ నెఱింగి నిష్పక్షపాతమతి యై విషయనిర్ణయ మొనర్ప వలయును. ఈసంగతినే శ్రీకాళిదాసమహాకవి మాళవికాగ్నిమిత్ర నాటకప్రస్తావనావ్యాజమున నిట్లు చాటి చెప్పె. "పురాణ మిత్యేవ న సాధు సర్వం నచాపి కావ్యం నవమి త్యవద్యం, సంతః పరీక్ష్యాన్యతర ద్భజంతే మూఢః పరప్రత్యయనేయబుద్ధిః" అని.

శ్రీయుత జయంతి రామయ్యపంతులుగారు ప్రమోదూతనామసంవత్సర మార్గశిరపుష్యమాసములలో వెలువడిన యాంధ్రసాహిత్యపరిషత్పత్రికలో "ఉత్తరరామచరితనాటకరసవిచారము" అనువ్యాసమును రచించిరి. ఆవ్యాసముపైననే యీవిమర్శనము చేయం గడంగితి. పాఠకమహాశయుల సావధానతఁ బ్రార్థించువాఁడ.

ప్రప్రథమమున శ్రీపంతులవారి ట్లనిరి. "మహాకవిభవభూతిరచితోత్తర రామచరితనాటకములోని ప్రధానరసము కరుణమా విప్రలంభమా యను విచారము కొంతకాలముక్రిందట బయలుదేఱినది. పూర్వలాక్షణికు లేమి, వ్యాఖ్యాత లేమి కరుణరసమే నాటకమునందుఁ బ్రధానరస మని గ్రహించినట్లు కనఁబడుచున్నది. ఇటీవల నాటకములోని ప్రధానరసము చతుర్విధ

విప్రలంభశృంగారములలో నొకటి యగుకరుణవిప్రలంభము గాని కరుణము గా దనువాదమును బయలుదేఱినది. ఈవాదము చేయువారిలో నుత్తరరామ చరితమునకు 'కల' యనువ్యాఖ్యానమును రచించిన శ్రీమదద్దంకి తిరుమల కుమార తాతాచార్యులుగారు ప్రథములు. వీ రీవాదమును 'ఏకోరసః కరుణ ఏవ' ఇత్యాది శ్లోకవ్యాఖ్యానమునఁ బ్రపంచించిరి. కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రులుగా రీమతమునే తాము రచించిన యాంధ్రోత్తరరామ చరితనాటకపీఠికలో విపులముగాఁ జర్చించి సిద్ధాంతీకరించిరి. ఈయర్థమునే సాధించుచు కొంపెల్ల సుబ్బరాయశాస్త్రులుగారు శుక్లసంవత్సర ఆషాఢశ్రావణములలో వెలువడిన భారతిపత్త్రికలో నొకపెద్దవ్యాసముం బ్రకటించినారు. నాకుఁ దెలిసినంతవఱకు నీమతమును బ్రతిపాదించువా రీముగ్గురే" అని. ముగ్గురే యన నేల ? ఉత్తరరామచరితనాటకమునకు ఉత్తరదీపికాఖ్య వ్యాఖ్యను రచించిన శ్రీగురునాథ విద్యానిధిభట్టాచార్యులును, సాహిత్యదర్పణమునకు కుసుమప్రతిమాఖ్య వ్యాఖ్యను రచించినట్టియు శబ్దాచార్య కావ్యతీర్థ మహోపదేశికా ద్యనేకబిరుదాంచితు లగు శ్రీహరిదాససిద్ధాంతవాగీశ భట్టాచార్యులును, ప్రబంధకల్పలతికాఖ్యసాహిత్య గ్రంథవిమర్శకర్త లగు శ్రీయుత రేవతీకాంతభట్టాచార్యులును, వారు వీ రన నేల యించుమించుగా కావ్యనాటకాదులకు నిర్దుష్టము లగుసరసవ్యాఖ్యానముల రచించు సుప్రసిద్ధవంగీయపండితులందఱును గూడ నీకరుణవిప్రలంభమతమును బ్రతిపాదించువారే. కావున బహుదినములుగ నవీనాలంకారికులకు సమ్మతం బగుమతంబ యిది యని శ్రీపంతులువారు తెలిసికొనఁ బ్రార్థితులు.

మఱియు, పంతులవారు తమవ్యాసమును "ఈనవీనమతముయొక్కయుఁ బూర్వమతముయొక్కయు బలాబలముల విమర్శించి యేది నిలువఁదగినదో నిర్ణయింపవలసియున్నది." అని ప్రారంభించి మధ్యలో నుత్తరరామచరిత్రనాటకమునందలియితివృత్తమునకును, శ్రీవాల్మీకిరామాయణమునందలి యితివృత్తమునకును, గలవ్యత్యాసమును నిరూపించి పిదపఁ గేవలకరుణరసమునకును విప్రలంభశృంగారమునకును గలతారతమ్యాదులఁ బ్రాచీనలక్షణానుసారముగఁ బ్రపంచించి చిట్టచివరకు "ఏవిధమునఁ జూచినను సీతాపునస్సమాగమవిషయములో రామునకు సమీహ గాని ప్రత్యాశ గాని యున్న దనుట కాధారమేమి యు లేదు. కావున నీనాటకమునందుఁ బ్రధానరసము కరుణమే" యని

సిద్ధాంతీకరించి ముగించిరి. నాటకేతివృత్తమునకును రామాయణేతివృత్తమునకును గలవ్యత్యాసమును నిరూపించువిషయము గాని కేవలకరుణమునకును విప్రలంభశృంగారమునకును గలతారతమ్యమును విస్తరించువిషయము గాని వివాదగ్రస్తము కానందున నావిషయములఁ దడవికొనక యీనాటకమునందుఁ బ్రధానరసము కరుణమే యనుసిద్ధాంతవాక్యము, దీనికి నుపష్టంభకములుగా నుండు వీరియితరవాక్యములును, విమర్శింపఁదగినవి. కావున నవ్వానినించుక చర్చింతము. వీరిసిద్ధాంతసాధమునకు సీతాపునస్సమాగమవిషయములో రామునకు సమీహా గాని ప్రత్యాశ గాని లేదనుటయే పునాదివంటిది. ఈపునాది యెంతబంధురముగ నున్నదో పరీక్షింతము.

ఇష్టవియోగమువలనఁ బుట్టినదియు, రతితోఁ గూడుకొననిదియుఁ బరిమితము నగుమనోవికారము శోకము. ఇష్టవియోగమువలనఁ బుట్టినదియు, రతితోఁగూడుకొనినదియు నగుమనోవికారము విప్రలంభశృంగారము. నిశ్చయజ్ఞానము లేక జీవితసందేహ మున్నచో రతిశోకముల రెండింటికిఁ బ్రాధాన్య ముండును గావున నారసము కరుణముకంటెను విప్రలంభముకంటెను విలక్షణమైన కరుణవిప్రలంభ మగును. ఇదియే కేవలకరుణ, కేవలవిప్రలంభ, కరుణవిప్రలంభముల స్వరూపము. ఇట్లుండఁగా నిష్టజనవిరహితరామవిలాపసంగతమై యంతర్నాటికామూలమున సీతారాముల పునస్సమాగమసంకలితమగునుత్తరరామచరితనాటకము నామూలచూడముగ నాశ్రయించిన ప్రధానరస మేది యని ప్రశ్నింప- రతియన నిష్టసమాగమాభిలాష కావునఁ దాదృశరతి రామునిశోకానుభవకాలమునందు లేదు గనుక ప్రధానరసము కేవలము కరుణ మని చెప్పుట కాని, పునస్సమాగమముచే నిట రతి యనుభవింపఁబడుచున్నది గాన కేవలవిప్రలంభశృంగార మని వచించుట గాని మిక్కిలి యసమంజసము. ఎందు కందురా- కేవల నరాకారమును, గేవల సింహాకారమును గాకుండ భగవంతుని యొకానొక ధర్మద్వయవిశిష్ట మగువిజాతీయాకృతిని గూర్చి నరుఁడని వ్యవహరించుటకుఁ గాని సింహమని వ్యవహరించుటకుఁ గాని వలనుపడక నరసింహాదిశబ్దములు మాత్రమే తాదృశధర్మద్వయవిశిష్టవిజాతీయభగవద్వ్యక్తి బోధకము లెట్లగునో అట్లే శోక, రతి, స్థాయికవిజాతీయరసాశ్రిత మగునీనాటకమునందలి ప్రధానరసము కేవలకరుణ మనిగాని, కేవలవిప్రలంభ మని గాని వ్యవహరించుటకు వీలుపడక యుభయస్థాయిక

మగు నొకవిజాతీయరస మనియే చెప్పవలయును. ఆవిజాతీయరస మెద్ది యన-పరిశేషాత్ కరుణవిప్రలంభాఖ్య మైనదియే యది యని వచింపక తీరదు. రసచంద్రికాకారునిమతము కూడ నిదియె. ఈరసచంద్రికాకారుని మతమును శ్రీపంతులువారు తమవ్యాసమున నాంధ్రానువాదముతో దృష్టాంతప్రదర్శన పురస్సరముగఁ జక్కఁగ వివరించిరి. కాని కేవలకరుణరసవాదు లగు పంతులవారు, ఈమతమును గూర్చి యొక్కదోషోద్ఘాటన మైనను సలుపరైరి. కాని కరుణవిప్రలంభములు రెండును బ్రధానములే కావున నొకదాని కొకటి యంగము కానేర దనిరి. కరుణవిప్రలంభవాదు లీ రెండింటికిని నుత్తరరామచరితనాటకమునఁ బ్రత్యేకత నంగీకరింపక, ఉభయస్థాయిక మై కరుణ విప్రలంభాఖ్య మగునొక్క రసమునకే ప్రాధాన్య మొప్పుకొనిరి. కావుననే శ్రీయుత రేవతీకాంతభట్టాచార్యులు, స్వకృతకల్పలతికాఖ్యగ్రంథమున నుత్తరరామచరితమును విపులముగ విమర్శించుచు నాయకాది సిద్ధాంతావసరమునఁ జివర కిట్లు నిగమన మొనర్చిరి. "ఈనాటకమునకు నాయకుఁడు రామచంద్రుఁడు. ధీరోదాత్తుఁడు. నాయిక సీతాదేవి స్వకీయ, ముగ్ధ. వీరలే ఆలంబన విభావములు. రమణీయవస్తుదర్శనాదు లుద్దీపన విభావములు. మోహవిలాపాదు లనుభావములు. విషాదాదులు వ్యభిచారిభావములు, రతి స్థాయీభావము, కరుణవిప్రలంభాఖ్య శృంగారరస మంగి, వీరాదు లంగరసములు. రీతి పాంచాలి, గుణము మాధుర్యాఖ్యము. ప్రస్తావన ప్రయోగాతిశయస్వరూపము. అని యిట్లు విప్రలంభవాదులుకూడ నుత్తరరామచరితమునఁ గరుణమునకును విప్రలంభమునకును అంగాంగిభావము నంగీకరింపక యుండఁగా నివి యొకదాని కొకటి యంగము కానేర వని నుడువుచుఁ బంతులవారేల పిష్టపేషణ మొనర్చిరో తెలియకున్నది.

మఱియు, ఆకాశవాణి పలికినపిదప సంగమప్రత్యాశచేత రతి పుట్టినందున నామాకాశవాణీభాషానంతరరసము శృంగార మనియుఁ దత్పూర్వానుభూతరసము కరుణ మనియు వచించు ప్రాచీనులమతమునం దీయస్వారస్యము కూడఁ గలదు. అదేదియన, ఉదాసీనపురుషమరణవిషయమునందు నుదాసీనురాలగు స్త్రీకి శోకము సంభవింపదు కావున నచ్చట మొదట నొకరతి నంగీకరింపవలయును. ఆకాశవాణీశ్రవణానంతర మొకరతి నంగీకరింపవలయును. ఇట్లుభయతః పుట్టుచుండెడు రతులవలన మధ్యవర్తి యగుశోకము, అస్థాయీ

ప్రాయీకృత మగుటచేఁ దన్నిబంధ మగుకరుణ మేయంశమందును బుట్టకపోవు ననునదియే. వెండియుఁ, బూర్వాపరవృత్తాంతాభిజ్ఞు లగు సామాజికులమనస్సులయందు శోకమిశ్రితరతిభావమే స్థాయియై యావిర్భవించును గనుక సర్వాంశమందును కరుణవిప్రలంభాఖ్యమగు నొక్కరసమునకే ప్రాధాన్య మంగీకరింపవలయు. ఈవిషయమునే శ్రీహరిదాససిద్ధాంతభట్టాచార్యులవారు సాహిత్యదర్పణములోని "కిం చాత్ర ఆకాశసరస్వతీభాషానంతరమేవ శృంగారః" అను మూలపఙ్క్తికి వ్యాఖ్యాన మొనర్చుసందర్భమున వివరించుచు, "ఉత్తరరామచరితేపి అనయైవ రీత్యా కరుణవిప్రలంభః ప్రధానరస ఇతి బోద్ధవ్యం" అనిరి.

ఇఁకఁ బంతులవారు సౌలభ్యమునకై విషయమును మూఁడుభాగములుగ విభజించి చర్చించినయంశముల విమర్శింతము. అందులో మొదటియంశ ముభయవాదిసమ్మత మగుటంజేసి దాని నిట వివరింప నక్కఱలేదు. సీత జీవించియున్న దని కాని మృతినొందిన దని కాని నిశ్చయజ్ఞానము గాని దృఢప్రత్యయము గాని రామున కుండెనా లేదా యనునది ద్వితీయాంశము. ఈ యంశమును జర్చించునపుడే పంతులవారు నాటకములోని రామవిలాపవాక్యము లన్నింటిని ఆంధ్రానువాదసహితముగ నుదాహరణముగ నిచ్చి తుట్టతుదకు నేవిధమునఁ జూచినను రామునకు సీతామరణమునందు దృఢప్రత్యయ మున్నదని సహృదయులకుఁ దోఁపకమానదని సెలవిచ్చిరి. రామున కిట్టిదృఢప్రత్యయమే యున్నచో నతఁడు కేవలపామరమానవునివలె నట్లు విలపించియేయుండఁడనుకారణముచే నాటకములోని రామవిలాపవాక్యముల కన్నిటికిని నసాంగత్య మేర్పడును. కనుక సీతామరణమునందు రామునికి దృఢసంభావన యున్నదనియే వచింపవలయుఁగాని దృఢప్రత్యయ మున్న దనరాదు. ఈయభిప్రాయముచేతనే కాంబోలు శ్రీగురునాథవిద్యానిధిభట్టాచార్యులుగారు స్వవిరచితోత్తరరామచరితనాటకపీఠికలో "అత్ర కరుణవిప్రలంభాఖ్య ఏవ రసః ప్రధానం. సీతాయాః శరీరపరిహారస్య దృఢం సంభావనయా వికలీభూతస్య శ్రీరామచంద్రస్య దేవాదికరుణావశాత్ పునః మేలనసంభవాత్" అని యిట్లు స్వాశయమును స్పష్టపఱచి తరువాత "అత్ర అభియుక్తాః లోకాంతరం గతవతీ" ఇత్యనేన నాయకస్య నాయికాయావా మరణస్య సత్యం భూతత్వ వ్యాఖ్యానే ప్రకృతే ప్రవాసాఖ్యో విప్రలంభభేదః నాయకేన నాయికయావా సంభావ్యమానత్వ వ్యాఖ్యానే కరుణవిప్రలంభ ఇతి వదంతి." అని లిఖించిరి. కావున రాము

నకు సీతామరణమందు దృఢప్రత్యయ మున్నదని చెప్పినను, దృఢసంభావన కలదని వచించినను నేదో యొక విప్రలంభభేదమే యగుటచే శుద్ధకరుణరస వాదులగు పంతులవారి కోరిక నెఱవేఱలే దని వ్రాయుటకు మిక్కిలి చింతిల్లు చున్నాఁడ.

పంతులవారు రామునకు సీతాసమాగమప్రత్యాశ యుండెనా లేదా యనుమూఁడవయంశమును విమర్శించుసందర్భమున నిట్లనిరి. "సీత జీవించి యున్న దనునిశ్చయజ్ఞానము గాని సందేహము గాని యొకవేళ రామున కున్న దనుకొన్నను దానిమూలమునఁ బ్రత్యాశ యున్న దని చెప్పనవకాశము లేదు. ఏలన సీత పవిత్రచరిత్ర యని యెఱింగియుండియు లోకు లామెపై నారోపించిన దోషమునుబట్టి లోకానురంజనమే పరమధర్మ మని యెంచి ప్రాణసమానురాలైన యామెను విడిచిపెట్టిన రాముఁడు తిరిగి యాభార్యను దీసికొని వచ్చి యామెతో సంసారము సేయఁదలంచు నని యూహించుట కవకాశము లేదు. అట్టితలం పేమాత్రము రామున కున్నను ధీరోదాత్తుఁడు కాకపోవలసి వచ్చును. అట్టితలంపే రామున కున్నచో నశ్వమేధసంకల్పకాలమునం దామెను దెచ్చుటకై యత్నము చేసియుండును. అట్లుచేయక సీతాప్రతికృతితోఁ గూడి యాగ మొనర్చెను." అని. ప్రత్యాశ యున్నదని చెప్పుట కవకాశమే లేదఁట. సీతామరణ విషయమునందు సంభావన గల రామునకుఁ బ్రత్యాశయుండినను నుండవచ్చు నని యెందు కనఁగూడదు? లోకానురంజనార్థమై యామెను విడిచిపెట్టిన రాముఁడు తిరిగి యామెతో సంసారము చేయకపోవచ్చును గాని సంసారము చేయఁదలంపకుండు టెట్లు? ఇట్టి తలం పున్నమాత్రననే రాముఁడు ధీరోదాత్తుఁడు కాకపోవునఁట. అట్టిరాముఁ డామెకొఱ కంతగా నేలవిలపించెనో, ఇదియాతని ధీరోదాత్తత్వమునకు భంజకము కాదా? మరణమునందు దృఢసంభావన యుండుటచేతనే యాగసంకల్పకాలమునం దామెను దెచ్చుకొనకపోయియుండవచ్చును కావున నిప్పట్టనఁ బంతులవారివాద మాపాతరమణీయ మనకతప్పదు.

మఱియుఁ బంతులవారు వేఱొకవాదము విప్రలంభవాదుల కసమాధేయ మని యెంచి యిట్లు నుడివిరి. మృతినొందినభార్యకుఁ బ్రతికృతి చేయించి యదియే సహధర్మచారిణిగా యజ్ఞ మొనరించుట ధర్మశాస్త్రవిరుద్ధము కావున సువర్ణవికార మగు సీతాప్రతికృతితో నశ్వమేధము చేయఁబూనిన రామునకు

సీతాజీవితత్వనిశ్చయ మున్న దనకతప్పదు. దీనికిఁ బ్రమాణముగా "యస్య భార్యా విదూరస్థా పతితా దూషితాపివా అనిచ్ఛుః ప్రతికూలావా తస్య ప్రతి కృతౌ క్రియా" అనుశ్లోక ముదాహరింపఁబడినది. సీత జీవించియున్న దనుకొన్నను నీధర్మశాస్త్రవాక్యమున కిచ్చటఁ బ్రవృత్తి యెట్లో విప్రలంభవాదులు చెప్పవలసియున్నది.'' అని రామునకు సీతామరణమునందు దృఢప్రత్యయము లేనందున ధర్మశాస్త్రోక్తరీత్యా ఆమెప్రతికృతిని జేయించుటలో నాక్షేపమేమియులేదు. ఇఁక జీవించియుండిన నేల రక్షింపరా దన్నచో లోకానురంజనార్థమై త్యజింపఁబడిన సీత సమీపస్థ యయ్యు దూరస్థయే యగుచున్నది. కావున నిట్లు దూరస్థయైనసీతకుఁ బ్రతికృతి చేయించి రామచంద్రుఁడు ధర్మశాస్త్రసరణిని, జనానురంజనమార్గమును నతిక్రమింపక వర్తించెను. ఇదియే విప్రలంభవాదుల సమాధానము.

ఇట్లు విమర్శించుకొలఁదియుఁ గరుణవిప్రలంభవాదుల వాదమునకు నవ్యాహతశక్తి గల్గుచుండ నుత్తరరామచరితనాటకమునందుఁ బ్రధానరసము కేవలము కరుణ మనివచించుట సాహస మగునో కాదో సహృదయులే నిర్ణయింతురుగాక.

---

# ఆంధ్రవ్యాకరణము. లఘోరణి.

ఎండమూరి వేంకటరమణగారు, బి. ఏ. కాకినాడ.

---

మానవప్రపంచమునఁ బరస్పరభావ వ్యక్తీకరణసాధనము భాష. అట్టి భాష జనస్థలభేదఁబులఁ బట్టి యనంతస్వరూపంబులు దాల్చియున్నది. అందుఁ గొన్ని కేవలవాగ్రూపంబులుగను, గొన్నివాగ్లిఖితరూపంబులుగను విలసిల్లుచున్నవి. రెండవతరగతికిఁ జెందినభాషలలో నాంధ్రభాషయొకటి. ఇదిసంస్కృత ప్రాకృతభాషలనుండి జన్మించి, తమిళాదిదేశభాషలకంటె నవీనమయ్యు "దేశభాషలందుఁ దెనుఁగు లెస్స" యని ప్రాచ్యులచేఁ గీర్తింపఁబడుటయే కాక పాశ్చాత్యులచేఁ గూడ "Italian of the East" అని ప్రసంశ నందినది. ఇట్టిమనభాషనుఁ బ్రథమాచార్యుఁ డగునన్నయభట్టు కాలమునుండి నేఁటి దనుక శబ్దానుశాసనములు రచింపఁబడుచు వచ్చినను నాంధ్రభాషలో నాంధ్రభాషకు సమగ్రమైన వ్యాకరణము లేదని యే చెప్పవచ్చును. ప్రస్తుతము మనవ్యాకర్త లీకొఱఁతఁ దీర్చుటకు బదులు తమ యనన్యశేముషీసంపత్తులను ఫలరహితము లగు వృథావివాదములకు వెచ్చించుట విచారకరము. నన్నయ మొదలు నేఁటిపర్యంతమును గలవ్యాకరణాభివృద్ధిని సూక్ష్మముగఁ దెల్పి, ప్రస్తుతాంధ్రవ్యాకరణప్రపంచమునఁ గలభిన్నమతముల నందందుఁ బొందుపఱిచి తన్నతయాథార్థ్యమును వివరించుటయే ప్రస్తుతవ్యాసోద్దేశము.

వ్యాకరణావశ్యకత:— లిఖితస్వరూపముగలప్రతిభాషయందును 'విశ్వశ్రేయంబు' లగుకావ్యంబులు రాజిల్లుచుండును. తత్కావ్యభాషకెల్ల నియమం బావశ్యకంబు. తన్నియమవివరణమే వ్యాకరణము. కావున ప్రతిజీవద్భాషకును వ్యాకరణం బావశ్యకంబు. నియమాతీతుల మనుకొను నియమవిహీనుల మాట యటుంచి యెల్లబుధలోకమునకును వ్యాకరణం బావశ్యకంబు.

ఆంధ్రశబ్దచింతామణి:—వ్యాకరణశాస్త్రమున నాంధ్రభాషకు నన్నయభట్టు ప్రథమాచార్యుఁడుగను నన్నయార్య రచితాంధ్రశబ్దచింతామణియే తెలుఁగుబాసకుఁ బ్రథమవ్యాకరణముగను గన్పట్టుచున్నది. ఇది సంస్కృత భాషయందు రచియింపఁబడి, యైదుపరిచ్ఛేదములతో నొప్పుచున్నది. ఇందలి సంజ్ఞాపరిచ్ఛేదమున భాషోత్పత్తి,వర్ణనిర్ణయము, పూర్ణార్ధానుస్వారవిషయము,

అంతస్థాక్షరలఘ్వలఘునిర్ణయము, వ్యాకరణపారిభాషికాఖ్యావివరణము, చతుర్విధభాషానిర్వచనమును గలవు. సంధిపరిచ్ఛేదమున నచ్సంధులును, ద్రుతసంధులును, విసర్గామ్రేడితాహామాదిశబ్దసంధులును, గర్మధారయసమాససంధులును మాత్రము సూక్ష్మముగఁ జెప్పినాఁడు. అజన్తపరిచ్ఛేదమున నాంధ్రవిభక్తులును నజన్తసంస్కృతశబ్దాంధ్రీకరణప్రకారమును దెల్పి, యాంధ్రశబ్దములకు లింగవచనవిభక్త్యనుశాసన మొనర్చి హలన్తపరిచ్ఛేదమున గుణవదగుణవచ్ఛబ్దములకును యుష్మదస్మచ్ఛబ్దములకును నాంధ్రరూపవిశేషములను బహ్వేకవచనవిభక్తిప్రత్యయములను దెల్పి, యాంధ్రభాషాపరిదృశ్యమానసమాసములను జేర్కొని వానిని ముగించినాఁడు. క్రియాపరిచ్ఛేదమునం దుపకృతిపరిణతిసంవృతిభేదంబులగు త్రివిధక్రియలవివేకమును, దత్సమక్రియాభూతతద్ధర్మభవిష్యద్వర్తమానార్థకప్రత్యయములను వివరించి, క్రియాబహ్వేకవచనరూపంబులు దెల్పి, క్త్వా, ప్రశ్నా, కర్మణి, వ్యతిరేక ప్రార్థనానంతర్యార్థకరూపముల విధం బెఱింగించి, తత్సమక్రియలకువలెనే దేశ్యక్రియలకుఁ గూడ నత్వాదికార్యము లగు నని తెల్పి, "పర్యాప్తో మస్మతేతు సజ్జైతః" అని సిద్ధాంతీకరించి యాతఁ డీగ్రంథము సమాప్త మొందించెను. ఇది భాషానుశాసనము కాఁగల్గినను కేవలసూత్రప్రాయమును లక్ష్యవిహీనము నగుటచే నాంధ్రభాషాకోవిదునకుఁ దక్క భాషావిద్యార్థి కంతగా నుపకరింపదు.

అథర్వణకారికావళి:--ఆంధ్రశబ్దచింతామణి సమగ్రమైన వ్యాకరణము కా దని యెల్లరకునుఁ దెలిసినవిషయమే. కావునఁ దల్లోపమును నివారింపం బూని యథర్వణాచార్యుఁడు నన్నయభట్టీయమందుఁ జెప్పఁబడని విశేషాంశములను, దనవ్యాకరణమునఁ జేర్చి నాఁటికిఁ గల భాషాస్వరూపమునుఁ బూర్తిగ వివరించెను. అందువలననే యాతఁడు దనకారికల కాదియందు-

"శ్రుతేఽపశబ్దే స్వోక్తౌచ ప్రమాదా త్పాణినిం స్మరేత్
అథవా ఫణినా మీశం చింతయే ద్బహుశో బుధః
ప్రాకృతే షడ్విధేచాపి వాల్మీకిం వా మహేశ్వరం
ధ్యాయే దత్రతు* మామేవ స్మరే త్పండితసత్తమః"

అని చెప్పుటచే నాంధ్రభాషయం దపశబ్దము భ్రాంతివలన వినఁబడి

* ఇచ్చట-తు శబ్దమువలన నన్నయభట్టునుఁ గూడ స్మరింపవలయుననుట. (కవిజనమండనటీక.)

నప్పుడు నన్నయభట్టును దన్నును స్మరింపవలయు నని చెప్పినాఁడు. దీనివలననే యాంధ్రభాషకు నన్నయభట్టు ప్రథమాచార్యుఁ డనియు నథర్వణుఁడు ద్వితీయాచార్యుఁ డనియుఁ బ్రసిద్ధిగలదు. అంతియగాక నన్నయభట్టీయమును దన కారికలచేఁ బూర్తిసేయుటకుఁ గాఁబోలు నథర్వణుఁడు దనకారికలనుగూడ సంజ్ఞాసంధ్యజన్తహలన్తక్రియా పరిచ్ఛేదములుగా విభజించియున్నాఁడు. నన్నయభట్టాంధ్రశబ్దచింతామణియందుఁ దనకంటెఁ బూర్వలాక్షణికుఁ డగుకవి భల్లటునిఁగూర్చి ప్రసంగించినట్లే, యథర్వణుఁడు గూడఁ దనకాలమునాఁటికిఁ బ్రసిద్ధికెక్కిన హరిశృంగారభూషణాదిలాక్షణికులఁ బేర్కొని తన్మతముల నచ్చటచ్చట వివరించియున్నాఁడు. మఱియు నీతఁడు——

"నివారణాయ తస్యైవ ప్రవృత్తి ర్విదుషా మభూత్
తదర్థమేవహి వయం భూయసా ప్రయతామహే"

అని చెప్పుటచే నన్నయాదుల యనుశాసనము లతిక్రమించి నాఁటి కాలమునఁ గొన్ని గ్రామ్యప్రయోగములు దొరలుచుండె ననియు నందువలనఁ దాను, సాధువు లగువిశేషప్రయోగములను వివరించి, భాషను సమగ్రముగా శాసించుటకు నీవ్యాకరణము రచించె ననియుఁ దోఁచుచున్నది. దానంజేసియే తాను మున్నొకవ్యాకరణము (త్రిలింగశబ్దానుశాసనము) రచించినను విశేషప్రయోగములనుఁ దెల్పుటకు దీనిరచించె నని తేటపడుచుండుటచేతను, క్షేమేంద్రాదులగు నితరభాషాలాక్షణికులును నొక్కొక్కలక్షణగ్రంథము రచించి యంతటఁ దృప్తినందక, వేఱె విశేషవిషయములను వివరించి ప్రత్యేకలక్షణగ్రంథంబులు రచించు నాచార ముండుటచేతను, నథర్వణుఁడు త్రిలింగశబ్దానుశాసనము రచించియు మరల నీకారికావళి నేల రచించె నను కీ. శే. కందుకూరి వీరేశలింగముగారి యుక్తి సహేతుకము కాదేమో యని తోఁచుచున్నది. అథర్వణుఁడాంధ్రశబ్దచింతామణిలోనివిశేషములుచాలవ్రాసినను, నచ్చటచ్చట నందులోఁ గలవిషయములను ముచ్చటించియున్నాఁడు. కావున, "నాంధ్రశబ్దచింతామణిలోని లక్షణవిశేషములు మాత్రమే యథర్వణకారికలలో నగపడుచున్న" వను మ॥ రా॥ శ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారివ్రాఁత "ప్రమాదోధీమతామపి'' యన్నట్లు ప్రమాదజనితము కావచ్చును. దీని కుదాహరణముగా, "ఇచ్ఛ విభక్త్యన్తిమస్య" అను నాంధ్రశబ్ద చింతామణిలోని సూత్రమే, యథర్వణుఁడు "జసిచేతయోః తథా తోడవిభక్తౌచ సమాసే కవి

సమ్మతే" యని చెప్పినాఁడు. నన్నయ విడిచినట్టియు, నథర్వణుఁడు పూర్తి గావించినట్టియు విషయముల నొకటి రెండు స్థాలీపులాకన్యాయమునఁ జూపి, యీతని ప్రసక్తి నుండి విరమించెదను. సంధిపరిచ్ఛేదమున నాంధ్రశబ్దచింతామణి లోని "లోపో నమ ఆడకే విసర్గస్య" యను సూత్రమునకు నోత్వాగమము గూడ, గలిపి వికృతివివేకకారుఁడు "నమశ్శబ్దవిసర్గస్య లోప ఓత్వమ పీష్యతే" యని పూర్తిఁ గావించినాఁడు. ఆం ధ్రశబ్దచింతామణిలోని "నవికృతిశబ్దాత్పరత స్సంస్కృతికానాం భవన్తి గసడదవాః" అను సూత్రమును విశేషించి, "వికృతిః పరుషాశ్చ స్యుస్స్యుస్త ఆద్యపదాదిగాః నవో గసదడాస్సేఽపి పరుషాః ప్రథమా హితాత్" అని తాను విపులముగా వెల్లడించినాఁడు.

ఆంధ్రభాషాభూషణము:—ఇది యభినవదండియని పేరుగాంచిన "వివిధ కళానిపుణు" డగు కేతన రచితము. ఆంధ్రభాషకు నాంధ్రభాషలో వ్యాకరణము వ్రాసిన ప్రథమవైయాకరణుఁ డితఁడే. కావున నీతనికృతి యెంతయుఁ బ్రశంసనీయము. "మున్నుఁ దెనుఁగునకు లక్షణ మెన్నఁడు నెవ్వరునుఁ జెప్ప రేఁజెప్పెద" నని చెప్పికొనుటలో నాంధ్రభాషలో మున్నెవ్వరునుఁ జెప్పియుండ లేదనియే కేతన యభిప్రాయ మని తెల్ల మగుచున్నది.

"తత్సమంబునాఁగఁ దద్భవం బన నచ్చ, తెనుఁగునాఁగ మఱియు దేశ్య మనఁగ,
గ్రామ్యభాషనాఁగఁ గల వైదు తెఱఁగులు"

అని చెప్పుటచే నన్నయగారి "తజ్జా సమాచ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి ప్రకృతిద్వయజా తజ్జా తుల్యాతు సమా ప్రవాహినీ దేశ్యా" అనుసూత్రము మాఱి, దేశ్యభాష ద్వివిధముగా వివరింపఁబడెను. దీనికిఁ గారణము నాఁటి కచ్చతెనుఁగుపలుకుల వాడుక యధికమై యుండనోపు. కేతన సంస్కృతభాషాప్రయోగమునందే గాక రచనాప్రణాళికయందుఁ గూడ నన్నయాదుల పద్ధతినుండి భేదము కలిగియున్నాఁడు. ఈఁడు, గాఁడు, ఆడు, అరి, యనుప్రత్యయముల,నమి,యిమి, తన, మను వర్ణకములను, దింట, కంట, యను కృత్తుల నాంధ్రవ్యాకరణమునందు వివరించిన ప్రథమవ్యాకర్త యితఁడే. ఇంతియగాక పెడతలమొదలగు నుదాహరణములతో నవ్యయీభావసమాసము నాంధ్రవ్యాకరణమం దీతఁడే మొదటఁ జేర్చెను. ఈవిషయము నాంధ్రకౌముదీకారుఁడు విశేషముగాఁ జర్చించియున్నాఁడు. మఱియు,

"క. ఇనపై నుండునకారం, బునుపై వాఁడనుపదంబు మొదలివకారం

బును జడ్డనకారం బగుఁ, గనినాఁ డభిమతము లోలిఁ గన్నాఁడనఁగన్"

అనుపద్యమునందు వివరించిన తెలుఁగునఁ గన్నాఁడు, విన్నాఁడు, మొదలగుపదములకు సాధుత్వము నితఁడే మొదట నిరూపించెను. ఇన్నివిధములఁ గేతనయాంధ్రవ్యాకరణలోకమున కమూల్యమైన సాయముం బొనర్చినవాఁ డనుట కేసందియమును లేదు.

కావ్యాలంకారచూడామణి:—విన్నకోట పెద్దనకవికూడఁ దనకావ్యాలంకారచూడామణియందు నాంధ్రవ్యాకరణముంగూర్చియొకయుల్లాసము రచించినాఁడు. ఇది యాంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ బ్రకటింపఁబడినది. ఇదియుఁ గొంచె మించుమించుగ నాంధ్రభాషాభూషణమువలెనే రచింపఁబడి, దానిపైఁ గొన్ని విశేషములను దెల్పుచున్నది.

"క. ధర శ్రీపర్వతకాళే, శ్వరదాక్షారామసంజ్ఞ వఱలు త్రిలింగా
కర మగుట నంధ్రదేశం, బరుదారఁ ద్రిలింగదేశ మనఁ జనుఁ గృతులన్.
గీ. తత్త్రిలింగపదము తద్భవంబగుటచేఁ
దెలుఁగు దేశమనఁగఁ దేటపడియె
వెనుకఁ దెనుఁగుదేశమును నంధ్ర గొంద ఱ
బ్బానపంచగతులఁ బరఁగుచుండు" ననుటచే నాంధ్రదేశ విస్తారమును మొదట నీతఁడే నిర్వచించినట్లు గన్పట్టుచున్నది. తనకాలమునాఁటికి శుద్ధాంధ్రకావ్యములు లేమింజేసి తత్సమమునకు లక్షణముఁజెప్పి 'తద్విహీనకావ్యతతియు లే'ద ని చెప్పెను గాని, తదనంతరలాక్షణికాగ్రగణ్యుఁ డైన కూచిమంచి తిమ్మకవి తనకు నచ్చతెనుఁగునందుఁ గలయభిరుచిని వెల్లడించుచు ననేకగ్రంథములు రచించి, కేవల మచ్చతెనుఁగు బాసతోఁగూడ రసవత్కావ్యములు రచింపవచ్చునని చాటి భావికవులకు మార్గదర్శియయ్యెను. సీసమాలికయం దాంధ్రకౌముది రచించిన వ్యాకర్తకూడ, నైమతమునే యంగీకరించుచున్నాఁడు. తన యలంకారశాస్త్రమునకు సమగ్రతఁ దెచ్చుటకై పెద్దన యీయుల్లాసము రచించుటచేఁ గావ్యపరిభాషకుఁ గావలసినముఖ్యమయిన విషయములను మాత్రమే సూక్ష్మముగ వివరించినను నేఁటివఱకు వివాదాంశము లైన విషయము లొకటిరెం డితఁడు స్పష్టపఱచినాఁడు.

"క. చేరునకారాంతములడు, కారము దెనిఁగించుచోటఁ గఠినాత్ముఁడనన్
దారుణకర్ముఁ డనంగను, మేరుమహాధన్వుఁడనమృతధాముఁడనన్."

అను పద్యమువలన "విశ్వకర్మనికూఁతు విశదలావణ్యసముజ్జ్వలఁజేకొని మూరిబోయి" యను పద్యమున "విశ్వకర్మనికూఁతు" నను శబ్దము సాధువగుచుండఁగా, "విశ్వకర్మకుఁ గూఁతు" నని సవరించుటకుఁ బ్రయత్నించిన గుప్తార్థప్రకాశికాకారుల మత మసూహ్యంబు.

అప్పకవీయము:—వీరియనంతరము వ్యాకరణగ్రంథంబుల వ్రాయఁదలపెట్టినవాఁ డప్పకవి. సంస్కృతమున వాగనుశాసనుఁడు రచించిన సంజ్ఞా, సంధి, తత్సమ, దేశ్య, క్రియాపరిచ్ఛేదములైదునుఁ దెనుఁగున విస్తరించి భాషావర్ణ, వళిప్రాస, పద్య, సంధి, తత్సమ, దేశ్య, క్రియాపరిచ్ఛేదనామముల నెనిమిది యాశ్వాసములుగా, నెలకూచి బాలసరస్వతి సకలభాషామహోపాధ్యాయ ప్రణీతాంధ్రవ్యాఖ్యానగ్రంథం బాధారంబుగాఁ గూర్పఁ దలఁచి యం దైదాశ్వాసములు మాత్రమే రచింపఁగలైను. కాని యాతఁడు రచించిన పంచాశ్వాసంబులగ్రంథంబును నొకఛందోగ్రంథముగాఁ గన్పట్టును గాని యంతగా వ్యాకరణగ్రంథముగాఁ గానరాదు. కాని యాంధ్రీకరించినంతవఱకు నప్పకవి చాలవిపులముగా నర్థనిష్పత్తి చేసి, బహులలక్ష్యము లొసంగి, "సారభాషకు శబ్దశాస్త్రంబు పగిదిఁ దెనుఁగున కావశ్యకం బిది" యను తనమాటఁ జాలవఱకుఁ జెల్లించుకొనెను. మఱియు నీతఁడు తనగ్రంథంబున లఘ్వలఘురేఫ విషయము బహువిపులముగాను, సలక్ష్యముగాను వివరించి—

"అనయో స్సంగతిం యస్తు కరోతి కవితాకృతౌ
అస్య అత్యంత దోషత్వా ద్గుష్టవి స్సహి కథ్యతే"

అను నథర్వణుని మతమును స్థాపించినాఁడు. కాని యప్పకవి యాంధ్రశబ్దచింతామణి నాంధ్రీకరింపఁ బూనియుఁ దద్గదితమైన "ఉద్వద్వస్వారః" యను సూత్రమును మఱచి రేఫశ్లిష్టమున కుదాహరణము నిచ్చుచు—"రేఫశ్లిష్టమునకు నాదిపర్వమునందు,

ఉ. క్షత్రియవంశ్యులై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్రియవైశ్యశూద్రు లనఁగాఁ దగునాలుగుజాతులన్ స్వచా
రిత్రము దప్పకుండఁగఁ బరిక్షితుఁ గాచినయట్లు రామమాం
ధాతృరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె యేయుగంబునన్."

మాంధాతృశబ్దము ఋకారాంతము గనుకఁ దకారముక్రింద నున్నది వట్రుసుడి గాని వ్రారవడి కా" దని తప్పటడుగు వైచినాఁడు. ఇట్టి దోసఁగు లొక

టిరెం డున్నను నాంధ్రభాషాప్రపంచమున నప్పకవి నిరంకుశరాజ్యాధిపత్యమున నేలుచుండుటకుఁ గనుట నిర్వివాదాంశమే. అప్పకవీయ మాంధ్రశబ్దచింతామణికిఁ గేవలాంధ్రీకరణము కాక యొకవిపుల మైనఛందోగ్రంథరాజ మైన నప్పకవి యది తదాంధ్రీకరణ మనుభావము స్ఫుటమగుకొఱకుఁ దద్గ్రంథమునకు నాంధ్రశబ్దచింతామణి యనియే నామకరణము చేసినాఁడు.

సర్వలక్షణసారసంగ్రహము:—అప్పకవితరువాత పేరెన్నికఁగన్న వ్యాకర్త కూచిమంచి తిమ్మకవి. అధునికకవిసార్వభౌముఁ డని పేరుగాంచిన యీతఁడు సర్వలక్షణసారసంగ్రహమను లక్షణగ్రంథమును మూఁడాశ్వాసములుగా రచించెను. ఇదియుఁ గేవలవ్యాకరణవిషయమేగాక యప్పకవీయమునందు వలె ఛందోవిషయముగూడ వివరింపఁబడినది. మఱియు నప్పకవివలెనే యీతఁడును దన నాఁటికిఁ గలగ్రంథముల నెల్లఁ బరిశీలించి మహాకవిప్రయుక్తము లైనకొన్ని శబ్దముల సాధుత్వమును నిరూపించి కేతనాదులు చెప్పని విషయములనుఁ గూడఁ దనగ్రంథమునం దుదాహరించి యున్నాఁడు. అకడ వీకడ నను మాటలకు నాడ, నీడ నను రూపంబులు గ్రాహ్యరూపంబు లని తెల్పుచు మహాభారతాదులనుండి యుదాహరించెను. ఉ. చనియె, గనియె, గొనియె, చనె, గొనె, గనె నని చెప్పఁగూడ దని పల్కిన సూత్నదండిమతమునకు వ్యతిరేకముగా—

క. వనకన్యకయఁట నేనఁట, వనమున గాంధర్వమున వివాహంబఁట నం
దనుఁ"గనె"నఁట మఱచితి నఁట, వినఁగూడునె యిట్టిభంగి విపరీతోక్తుల్.

అని భారతమొదలి యాదిపర్వము* నుండి యుదాహరించి, తద్రూపములు గలవని నిశ్చయించెను. అంతియకాక రేఫఱకారవిషయమునఁ గూడనీతఁ డప్పకవిమతమును విడిచి,

గీ. అరయ గురురేఫ హల్లుతోఁ బెరసినపుడు
ప్రాసముల విశ్రమములు రేఫములతోడఁ
గలిసి యుండును సుకవిపుంగవులకృతుల"

అని వివరించి, మహాకవియగు బమ్మెర పోతన, రేఫఱకారభేద మెఱుఁగఁ డనుట హుళ్ళిక్కి యనియు, నతఁడు"సకలాంధ్రలక్షణచక్రవర్తి"యనియుఁ జాటి చెప్పెను. మఱియు నీతఁడీవిషయమునే పరిశీలించుచు, "నాన్యేషాం వైధర్మ్యం

* ఇది యేభారతాదిపర్వములోను లేదు. పినవీరన్న శృంగారశాకుంతలములోనిది. ప. అ.

లఘ్వలఘూనాం రయోస్తు నిత్యంస్యా” త్తను సూత్రమునకుఁ డీక వ్రాసి, రేఫఱ కారములు కలుపరా దని చెప్పిన యెలకూచి బాలసరస్వతియే చంద్రికాపరిణయమందు, “తెక్కలమాటున న్నను భరించి లభింపుము కీర్తిపుణ్యముల్”
అని తన్నేత్రి నెఱపె నని తెల్పి, యిట్టివలెనె మహాకవులకును రేఫఱ కారములపట్ల పరిశీలన లేకపోయిన” దని నిరూపించెను.

బాలవ్యాకరణము, హరికారికలు:—కూచిమంచి తిమ్మకవి యనంతర మాంధ్రవ్యాకరణ గగనమునకు సూర్యసన్నిభుఁ డగుపరవస్తు చిన్నయసూరినిఁ గూర్చి ప్రసంగింపవలసియున్నది. ఆంధ్రభాషకు నాంధ్రభాషలో వచనమందు వ్యాకరణము వ్రాసి, లోకోపకారి యైన ప్రథమవైయాకరణుఁ డితఁడే. ఈ వ్యాకరణమును రచించుటకుఁ గారణము చదువరుల కాంధ్రవచనరచన సేయుఁ కౌశలము గల్గుటకే యని గ్రంథకర్తయే పీఠికయందుఁ దెల్పియున్నాఁడు. అందువలననే వచనరచనాభిమాని యైనచిన్నయసూరి, తనకుఁ బద్యకావ్యములు రచింపఁగల సామర్థ్య ముండి యు, నాంధ్రవచనభారతికి శిరోమణి యనఁదగిన నీతిచంద్రికను వచనమున రచించి భాషకు వన్నె దెచ్చెను. ఆంధ్రభాషలో నాంధ్రభాషకు సమగ్రమైన వ్యాకరణము లేనిదశలోఁ దల్లోపము చాలవఱకు దీర్పఁగలిగిన యీయన సత్కృతి యెంతయు సత్కృతి నందఁదగియున్నది. ఆంధ్రభాషలో బాలవ్యాకరణమునకుఁ గలప్రాముఖ్యతను దద్విపులవ్యాప్తియే వివరించుచున్నది. ఈతఁడు పూర్వకవులగ్రంథంబు లెల్లఁ బరికించి విమర్శించి, యీవ్యాకరణము వ్రాయుటచే నీయొక్కవ్యాకరణమును జదివినంతమాత్రమునఁ జాలవఱకు నాంధ్రశబ్దలక్షణజ్ఞానము కల్గుచున్నది. ఆధునికుఁ డగుటచేతను మఱి యితరాసంగతహేతువులచేతను సూరిగారియెడ నీసు వహించిన పండితు లీయన కీవ్యాకరణరచనమందు స్వతంత్రత లేదని యుఁ దత్సమకాలికుఁ డగు శిష్టు కృష్ణమూర్తికవిచే రచితము లని వాడుకయందున్న హరికారికల కివి కేవ లాంధ్రీకరణము లనియుఁ బల్కి యీతనికి గ్రంథచౌర్యదోషము నారోపించుటయు నీవ్యాకరణగ్రంథాధిక్యతనే వేనోళ్ళఁ దెల్పుచున్నది. మఱికొందఱు విద్వాంసు లీవ్యాకరణమును బూర్తిగఁ జదువకయో చదివి పరిశీలింపకయో, నిర్దుష్టబాలవ్యాకరణసూత్రములలోఁగొన్నింటియెడ దోషము లారోపించుటకుఁ బ్రయత్నించుచున్నారు. ఈవిషయమాంధ్రభాషానుశాసనము గుఱించి ప్రసంగించునపుడు కొంచె ముదాహరించెదను.

హరికారికల ప్రసక్తి యథర్వణకారికావళికంటె ముందుగాఁ దేవలసియున్నను దాని నిచ్చటఁ దెచ్చుటకుఁ గారణము హరికారికలకును దానికినిఁగల్పింపం బడిన సంబంధమే యని తెల్పుచున్నాను. హరికారికలు శిష్టు కృష్ణమూర్తికవిప్రణీతము లనియు, బాలవ్యాకరణకారుఁడు వానిని గాంచి, దొంగిలి, బాలవ్యాకరణస్వరూపమున నాంధ్రమునఁ బ్రకటించె ననియుఁ బ్రతీతి కలదు. అసత్యమగు చిన్నయసూరిచౌర్యప్రతీతి మాట యటుంచి, హరికారికలు, పరిశీలింపఁగా, శిష్టు కృష్ణమూర్తికవిరచితములు గా వని తేటపడుచున్నది. హరికారిక లథర్వణునికంటెఁ బూర్వుఁడును, నతనిచేఁ బేర్కొనఁబడిన వాఁడు నగు "హరి" యనువానిచే రచింపఁబడినవి. ఈతఁ డథర్వణుని కాలమునాఁటికే ప్రసిద్ధుఁడై యుండనోపు. దానఁజేసి యే యథర్వణుఁడీతనిమతముం బెక్కుమాఱు లుదాహరించియు, దానితోఁ గొన్నియెడల నంగీకరించియు నున్నాఁడు. అథర్వణకారికావళియం దుదాహృతమైన హరిమతమునకు సరియైన సూత్రములు హరికారికలలోఁ గన్పట్టుచుండుటచేఁ బైవిషయము నిర్ధారణ యగుచున్నది. దీనికై యొకటి రెం డుదాహరణము లిచ్చెదను. "గ్రామ్యాపి గ్రాహ్యతాం యాతి య ద్యార్యవ్యవహారభా" క్కను హరికారికనే యథర్వణుఁడు "అప్రయుక్త దోషస్తు నవిరుద్ధో హరేర్మతే" యని వివరించినాఁడు. మఱియు సంధి పరిచ్ఛేదమున "ద్వంద్వే పదోపరిస్థానాం పరుషాణాం భవంత్యమీ" అను హరికారిక మనస్సులో నుంచుకొనియే యథర్వణుఁడు "స్యుర్భిన్నా దేవతస్మాత్తే వినా ద్వంద్వం హరేర్మతే" యని తెల్పినాఁడు. మఱియు వికృతివివేకకారుఁడు- విశేషవిషయవివరణార్థమై వ్రాసిన తనవ్యాకరణమునం దుదాహరించిన విశేషవిషయములు కొన్ని హరికృతవ్యాకరణమునుండియుదాహరించుటచే నీవ్యాకరణము సమగ్రగ్రంథము గానే యుండనోపు. అథర్వణుఁడు పేర్కొనిన హరి, వాక్యపదీయకారుఁ డగుభర్తృహరి యని యొకప్రవాదము గలదు. కాని, సంస్కృతప్రాకృతములందు లేని ద్వంద్వసమాసమందలి గసడదవాదేశమును గూర్చి ప్రసంగించుచు "స్యుర్భిన్నా దేవతస్మాత్తే వినా ద్వంద్వే హరేర్మతే" యని చెప్పుటచే, నీహరి యొకయాంధ్రవ్యాకరణకారుఁ డనియు, వాక్యపదీయకారుఁ డగుభర్తృహరి కాఁడనియు నిశ్చయ మగుచున్నది. శిష్టుకృష్ణమూర్తికవియే యీకారికలను రచించినచో సంస్కృతాంధ్రలాక్షణికుల సాంప్రదాయముల ననుసరించి కృష్ణకారిక లనియే నామకరణము సేయును గాని, హరి

కారిక లని పేరుపెట్టఁడు. అదియుఁగాక, హరికారికల కాద్యంతములందు రెండు చోట్లను దాను వృత్తి వ్రాయుచున్నట్లే చెప్పినాఁడు గాని, తాను వానిని రచించినట్లు చెప్పియుండ లేదు. కావున హరికారికలు శిష్టు కృష్ణమూర్తికవిరచితములు గావని నిర్ధారణ యగుచున్నది. కాని యతఁడు నలుగడలఁ జెదరియున్న తత్సూత్రముల నెల్ల సమకూర్చి, వానికి వృత్తి వ్రాసి 'యాంధ్రభాషాయోషకగణ్యసేవ' యొనర్చినాఁ డనుట కేసందియమును లేదు. నన్నయాదుల గ్రంథములనుండి సహాయము గొన్నటులనే యీహరికృతవ్యాకరణమునుండి కూడఁ గొంతసాయముఁ జిన్నయసూరి పొందినఁ బొందియుండవచ్చును. అంతమాత్రమున నతనిరచనాస్వతంత్రతకేకొఱంతయు నుండఁబోదనుట నిర్వివాదాంశము.

(త్రిలింగలక్షణశేషము) ప్రౌఢవ్యాకరణము:—ఆంధ్రశబ్దచింతామణికి నథర్వణకారికల కెట్టిసంబంధ మున్నదో బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణముల కట్టిసంబంధము గలదు. ఆంధ్రభాషకు ౩౬ వర్ణములను నన్నయాది చిన్నయసూరిపర్యంతము గల నిర్ణయమును మార్చి యేఁబదైదువర్ణము లని యీగ్రంథకర్త తేల్చెను. బాలవ్యాకరణమునందుఁ జెప్పఁబడని విశేషము లిందు వివరింపఁబడినవి. దీని కొకయుదాహరణము:—క్త్వార్థకంబైన యిత్తునకు సంధిలే దను బాలవ్యాకరణసూత్రమును విశేషించి, "ఇప్రత్యయాంతావ్యయంబునకు సంధి చూపట్టెడి" నని సూత్రమును రచించి "చాపము నా కందిమ్మనుఁ"డనుభారతప్రయోగమును నితరప్రయోగములను లక్ష్యముగా నిచ్చెను. ఇంతియకాక పూర్వవ్యాకరణకారులు సెప్పని వాక్యవిషయము వేఱె యొకపరిచ్ఛేదమున నీయన వివరించెను.

ఇంతదనుకఁ బేర్కొనఁబడిన వ్యాకరణములుగాక యింకనుఁ గొన్నిగ్రంథములును, ప్రఖ్యాతివహించిన వ్యాకృతివ్యాఖ్యలును గలవు. కాని విస్తరభీతిచే విడిచితిని. పైవ్యాకరణము లన్నియు సంస్కృతవ్యాకరణము చదువుకొనిన పండితుని జ్ఞానము పరిపూర్తిసేయుటకే యుపకరించును, గాని కేవ లాంధ్రభాషావిద్యార్థికి సంపూర్ణజ్ఞానమును బ్రసాదింపఁ జాలవు. ఏలన:- ఆంధ్రభాషయందు వ్యవహృతము లగు సంస్కృతపదజాలమునందలి సంధుల నొక్కవ్యాకరణమేనియువివరింప లేదు. కావునఁ దద్విషయజ్ఞాన మలవఱుచుకొనుటకుసంస్కృతవ్యాకరణము వేఱె యభ్యసింపవలసియున్నది. కాన, మహానుభావులును,విశ్వశ్రేయఃకాంక్షులు నగు బుధోత్తము లెవరైన నీకొఱఁతఁ దీర్చుట యవసరము.

విఖ్యాతచరితులగు మనప్రస్తుత వైయాకరణు లిట్టిలోపము వారించుటకు మాఱుగఁ గేవల వ్యర్థవివాదములందుఁ దమయనన్యధీవైభవము గోల్పోవుట శోచనీయము. ఆంగ్లపాఠశాలలలో నాంధ్రభాష నభ్యసించు విద్యార్థులనిమిత్తము వ్యాకరణము వ్రాయఁబూనిన సులభవ్యాకరణకారులు కొంతవఱకు సంస్కృత సంధులు వివరించిరి, గాని యది సమగ్రముగా లేదు. చాల నూతనముగా మ॥రా॥శ్రీ॥ మల్లాది సూర్యనారాయణశాస్త్రులుగా రిట్టిలోపమును దీర్చుట కొఱకు శబ్దానుశాసనము గల్పింపఁ బూని, యొకటి రచించిరి. కాని, "యుభయ పక్షములకు మధ్యస్థుఁడనై శబ్దానుశాసన మొనర్చెద" నని చెప్పుచు, 'ఇస్తిని, వచ్చాను, వస్తాఁడు' మొదలగు గ్రామ్యరూపముల కనుశాసనము సేయక, తాముప్రమాణముగాఁ గొన్న 'ప్రయోగమూలం వ్యాకరణ'మ్మను నార్యోక్తి మీఱినటు లొప్పుకొనుచు, నేపక్షమువారికినిఁ జెందక తమకుఁ దోఁచిన విషయములే శిష్టవ్యవహారములుగా గ్రహించి యితరము లపశబ్దములుగా గణించుటచేతను, నితరపరస్పరవైరుధ్యములతోఁ గూడి యుండుటచేతను, నావ్యాకరణ మెంతలోకోపకారియో మీరే గ్రహింపవచ్చును. "చదువరులు సులభముగాఁ జదివికొని యర్థము గ్రహించుటకై తఱచుగా నిందు సంధి పాటింపలే" దని వీరు పీఠికలో వ్రాసిరి. భాషాశబ్దపరిచితు లగుచదువరులకు భాషాలక్షణము సనియమముగా బోధింపఁదలఁచిన లక్షణగ్రంథమందే సంధి పాటింపక పోయినచో సంధి విషయము వీరివ్యాకరణమందు వీ రెవరికొఱకు వ్రాసిరో తెలియదు. లక్షణగ్రంథములయందె లక్షణనియమములనుఁ బాటింపక పోయినచో నితరకృతులందు వానినిఁ బాటింతురేమో! తాము చెప్పిన నియమములు తామే పాటింపక యితరులను దన్నియమములచే ననుశాసింపఁబూనుటయందలి యౌచిత్యము విచిత్రము. ఇతరవ్యాకర్తలసూత్రార్థమునుఁ బూర్తిగాగ్రహింపక వానిని దప్పులుగా వీరు నిరూపింపఁ జూచుచున్నారు. దీని కొకయుదాహరణ మిచ్చెదను.

"చిన్నయసూరి, ప్రథమేతరవిభక్తి శత్రర్థకచువర్ణంబులందున్న యుకారమునకు సంధి వైకల్పికము" అని చెప్పి, నన్నడిగె—నాకొఱకిచ్చె, మొదలయిన వుదాహరించెను. దానికొఱకున్—కున్—అనువానిలోని ఉకారము వలె నన్నులోని ఉకారము విభక్తిసంబంధమైనది కాదు. నాశబ్దమున కాదేశముగా వచ్చినది—నన్ను, దీనిమీఁదివిభక్తి—ను, దీని ఉకారము లోపించి

నపుఃషు నన్నున్—అగును. దీనిలోని ఉకారము ప్రకృతి సంబంధమైన దగుటచేఁ బైసూత్ర మిచ్చుట వర్తింప '' దని శాస్త్రులవారు వ్రాసియున్నారు. పై సూత్రము కేవల చిన్నయసూరికల్పితము కాక, నన్నయభట్టీయమునందే, "అనాదిషు విభక్తిష్వాత్వోవా" యని యు "శత్రర్థే తూతశ్చానోః" యనియుఁ జెప్పఁబడినది. కావున నన్నయభట్టునకుఁగాని దానికి విపులవ్యాఖ్య వ్రాసిన యహోబలపతికిఁగాని నన్నయభట్టీయమునందుఁ జెప్పని విశేషవిషయములను వివరించిన యథర్వణునికిఁ గాని, యితరలాక్షణికులకుఁ గాని, బాలవ్యాకరణము వివరింపని విశేషములు దెల్పు త్రిలింగలక్షణకారునికిఁ గాని స్ఫురింపని విషయము నేఁటికి మనశాస్త్రులవారికి స్ఫురించినది కాఁబోలు. ఐన వీరా విషయము వ్యాఖ్యానమువలన నర్థముసేసికోఁదగిన మార్గ ముండఁగా నది విడిచి, "వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తిః నహి సందేహాదలక్షణ '' మ్మను పరిభాష మఱచి తప్పుమార్గముఁ ద్రొక్కిరి.

ఈయన తనవ్యాకరణములో, నాంధ్రభాషకు వర్ణములు చాల వనును ద్దేశముతోఁ దద్భాష నుచ్చారణయందుఁబ్రపూర్ణమైన భాషగా(Phonetically complete language) నొనర్చుటకు యత్నించి, ఀ, ఫ़, అను రెండక్షరము లధికముగాఁ జేర్చియున్నారు. ప్రపంచమం దేభాషావర్ణములును సర్వశబ్దోచ్చారణానుకూలముగా నుండనేరవు. అట్టిప్రయత్నమునకుఁ బూనుట నక్షత్రగణనమువంటిది. అటులఁగ్రొత్తవర్ణములు సృష్టింపఁ దలఁచినచోఁ బ్లుతాద్యనేకశబ్దోచ్చారణానుకూలముగా నింకనుఁ గ్రొత్తవర్ణము లనంతములుగా సృష్టింపవలసి వచ్చును. కాన తత్ప్రయత్నము ఫలరహితము. అదియుఁగాక యిఱువదియాఱు వర్ణములతోఁ బాశ్చాత్యభాష లన్నియు సరిపెట్టుకొనుచుండ, నేఁబదివర్ణములతో సంస్కృతభాష సరిపెట్టుకొనుచుండ, నేఁబదైదువర్ణములుగల యాంధ్రభాషకు వర్ణలోపము నారోపించు టసంగతము. కావున నిట్టిఫలరహితయత్నములు మాని, మహాపండితు లగు శ్రీ శాస్త్రులవారు లోకోపకారము లగు సత్కృతుల రచించి, భాషోద్ధారకు లయ్యెదరుగాత మని ప్రార్థించుచున్నాను-

గ్రామ్య గ్రాంథిక భాషావివాదము:—ప్రస్తుత మాంధ్రభాషాసర్వతోముఖాభివృద్ధి కవరోధము గలిగించుచున్న దీతీవ్రసమస్యయే. ఈభిన్నమతములచే భాష కొంతవఱకుఁ బా డగుచున్నది. "అపశబ్దప్రయుఞ్జానో రౌరవం నరకం వ్రజే"త్తను పూర్వకవిసాంప్రదాయము నటుంచి, గ్రామ్యభాషను

గావ్యభాషగ నుపయోగించుటలో ననేకబాధకములు గలవు. ఈబాధకములమాట గూడ నటుంచి, యాంగ్లభాషాసంప్రదాయానుసరణమే ప్రధానముగాఁ బెట్టుకొనిన మనయాధునికకవులు ను గ్రామ్యభాషావాదులును నాయాంగ్లభాషయందలి పరిపాటినైన గుర్తించినటులఁ గానరాదు. ఆంగ్లభాషాతత్త్వాధినాథులుగాఁ బరిగణింపఁబడు నే "Master of Arts" అయినను వాడుకభాషఁ గావ్యరచనమందు, వేయేల, యొకవ్యాసరచనమందుఁ గాని ప్రయోగించినఁ దత్పండితలోక మంగీకరించునా? ఆంగ్లదేశమందైన నేయాంగ్లపండితుఁడైన వాడుకభాష కావ్యములం దుపయోగించునా? ఆంధ్రభాషకు మాతృకయైన సంస్కృతభాషయందైన లౌకికవ్యవహారదశలందుఁ బ్రయోగించినమాత్రమున సిద్ధము లగునపశబ్దములు శిష్టసమ్మతములు గానందున శాస్త్రీయములు గావని పతంజలి మహాభాష్యమునందు వ్రాక్రుచ్చెను. ఇటు లే ప్రఖ్యాతభాషయందునను లేని నవ్యవిధమున వాడుకభాష కావ్యభాషగా నొనర్చి భాషాసాంకర్యమునకుఁ దోడ్పడుటలో నౌచిత్య మేమియుఁ గానరాదు. సుప్రసిద్ధ గ్రామ్యభాషావాదు లగు మ॥ రా॥ శ్రీ గి॥ వే॥ రామమూర్తిపంతులుగారు సహితము బాలురపాఠపుస్తకములందు వారికి వాడుకభాష నుగ్గుఁబాలతో నేర్పఁదలఁచి వాడుకరూపములనే యొసఁగుచు, నపుడపుడు గ్రాంథికశబ్దమార్దవలాలసమనస్కులై మైమఱచి, గుడ్డి, మాను, మొదలగువాడుకరూపములకు బదులు గ్రుడ్డి, మ్రాను మొదలగు శుద్ధగ్రాంథికరూపములనే యుదాహరించుటచే వారు గ్రాంథికభాషాధిక్యత నొప్పికొనకయే యొప్పికొనుచున్నారు.

భాషానియమవిహీను లగుగ్రామ్యవాదులమాట విడిచి, గ్రాంథికవాదులలోనే, గ్రాహ్యాగ్రామ్యవాదులు, నగ్రాహ్యాగ్రామ్యవాదులు మొదలుగాఁగల వారిభిన్నమతములు పెక్కు గలవు. "ప్రయోగమూలం వ్యాకరణం" సిద్ధిర్లోకాద్వ్రజ్యా," "ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యాం" బను నిత్యాదివాక్యములకుఁ దమ బుద్ధిచాతుర్యముకొలఁది వ్యాఖ్యానములు సృష్టించి, భాషయందుఁ దమకుఁ దోఁచినయపశబ్దముల నన్నియుఁ జొనుపుటయే ప్రధానోద్దేశముగాఁ గలపండితులప్రయత్నములే దీనికిఁ గారణము. కాని పైవాక్యములందుఁ జెప్పఁబడినట్లు, శిష్టులు, లఘుసిద్ధాంతకౌముదిపాటి జ్ఞానముతో సంస్కృతనాటకముల కేయాంధ్రీకరణములు చదువుకొనియో కృతార్థులయిన

యుభయభాషాప్రవీణులో, కేవలాంగ్లభాషాప్రధానపాఠశాలలలో నభిమాన విషయముగా నాంధ్రము నభ్యసించి, బాలవ్యాకరణముతప్ప నితరవ్యాకరణ నామమేనియు వినియెఱుఁగని యాంగ్లపట్టభద్రులో, చిఱుతప్రాయమునుండియు నేఁగురునొద్దనో యభ్యసించి సంస్కృతభాషాప్రవీణులై యాంధ్రభాష నుడికార మెఱుఁగని పండితప్రకాండులో నిశ్చయించుట కష్టము. అటులగాక నిజముగా నుభయభాషాప్రవీణు లగువా రెవరైన నున్న నట్టివారు లౌకికవ్యాపారములందు గ్రాంథికభాషలో వ్యవహరించుటకు దుస్సాధ్య మగుటకు శ్రీకొక్కొండ వేంకటరత్నముపంతులుగారినిఁ గూర్చి మనము చెప్పుకొను హాస్యోక్తులే సాక్షి. కావున లేనిపోని యపశబ్దములకు సాధుత్వము గల్పించుటకై మనవారు తమపాండిత్యమును వినియోగించుచు, భిన్నమతములు నెలకొల్పి భాషాభివృద్ధికి నిరోధము గల్పించుట తప్పుగాఁ గన్పట్టును.

యథార్థము వచించునపుడు శ్రుతికటువుగా నుండుట సహజము కావున నపుడప్పుడు యథార్థస్థితిని వెల్లడించునపుడు నానుడులయందుఁ గలకఠినత పెద్దలయెడ నవిధేయతగా భ్రమింపక, సత్యవిషయప్రకటనార్థమే యని గ్రహింతురు గాత మని విద్వల్లోకమును బ్రార్థించుచున్నాను. ప్రస్తుతాంధ్రభాషాప్రపంచమున వెలయు పండితోత్తముల యభిప్రాయములకు భిన్నముగా నున్న నాయభిప్రాయములను గూడ సత్యబుద్ధితోఁ బరిశీలించి, శిష్యవాత్సల్యముతోఁ దద్గతయాథార్థ్యమును గుర్తించి, నన్నలరింప వర్తమానబుధవరేణ్యులను బ్రార్థించుచు నింతటితో నీవ్యాసము ముగించుచున్నాను.

---

# శ్రీపచ్చయప్పనృపయశోమండనము.

[కాంచీపురి పచ్చయ్యప్పమొదలియారుగారి సంవత్సరోత్సవసమయములోఁ బలువురుపండితులు రచించినపద్యములను, మొదలియారుగారి ధర్మవిచారణకర్తలలోని శ్రీకోమలేశ్వరపు శ్రీనివాసపిళ్ళెగారియాజ్ఞచొప్పున పచ్చయప్పవిద్యాశాలలో నాంధ్రప్రధానపండితులుగా నుండిన శ్రీపరవస్తు చిన్నయసూరిగారు శ్రీపచ్చయప్పనృపయశోమండన మను పేరితోఁ బ్రకటించుచు నందుఁ జేర్చిన తమపద్యములు.]

మ. గగనంబంటు రసప్రపూర్ణవిలసత్స్కంధంబుల న్మీఱి య
భగసాలంబుగతి న్సితచ్ఛదముల న్భాసిల్లి మేరుక్రియన్
జగదామోదసువర్ణభాస్వరముగా జానొంది పచ్చావనీ
శగుణంబు ల్గణుతించు కోశ మిది యిచ్చ న్మెచ్చు గావించెడిన్. ౧

ఉ. శ్రీవరవర్ణినీమణికిఁ బ్రేమపదంబు బుధోత్కరంబు లెం
తే వినుతింపఁ బెంపగు నహీనమహీభృదుదారమౌళిసం
భావితపాదపద్ముఁడు కృపాపరిపూర్ణుఁడు శ్రీనివాసుఁ డా
ర్యావనుఁ డెప్డుఁ బచ్చపధరాధిపు కీర్తులఁ బ్రోచుఁ గావుతన్. ౨

చ. అనయము భిక్షితాశనమ యౌట దురంతవిషాద భావముం
గొని వసనంబు లేవడికిఁ గుంది నగం బయినట్టి పార్వతీ
శుని ముకుమ్రొవ నన్న మిడి శుద్ధదుకూలసమర్పణంబులం
దనియఁగఁ జేసెఁ బచ్చనరనాథుఁడు కేవలదాతృమాత్రుఁడే. ౩

చ. అనవరతంబు డాసినబుధాళి కభీష్టఫలంబు లిచ్చి భూ
జనులకు మేటి నా నెగడి సన్నుతమంజులతావిలాసముల్
దనరఁగ నాశ్రితాళుల నుదారరసాంబుధిఁ దేల్చుపచ్చపా
వనివిభుదానవైదుషికి వారక మ్రాన్పడు సౌరసాలమున్. ౪

చ. అతులయశోవిశాలుఁడు జితాంతరఘోరవిరోధిజాలుఁ డం
చితసుగుణాలవాలుఁడు విశిష్టవిహాయిత చాతురీ నిరా
కృతదివిజాతసాలుఁడు గిరీశపదాంబుజభక్తిలోలుఁ డా
శ్రితపరిపాలుఁ డార్యనుత శీలుఁడు పచ్చనృపాలుఁ డెన్నఁగన్. ౫

చ. నిరుపమతావకీనకమనీయయశశ్శరదాగమంబునం
బఱపగుకల్మషంబు భువనంబు దొరంగుట యుక్తమే కదా
యరయ ఘనాళి జీవనసమగ్రత గాంచి రహించు టొక్క-టే
ధరణి విచిత్రఫూర సముదారగుణాకర పచ్చభూవరా. ౬

చ. నెఱసె శరత్సమృద్ధి ధరణీస్థలి నెందు మరాళిపాళికిం
బఱపుగ మీఱెఁ గల్వలకుఁ బాండురపక్షము పర్వకాలముం
దెఱపి యొకింత లేక భవదీయయశంబు భృశంబు పేర్మిమై
వఱలఁగఁ బచ్చభూరమణ భవ్యలసద్గుణరత్నభూషణా. ౭

సీ. తనమనోభీష్టప్రదాన శౌండతకుఁ గల్పద్రుమం బాకులపాటు నొందఁ
దన లసద్గంభీరతాగుణస్ఫూర్తికి వాహినీపతి భంగపాటుఁ దొడరఁ
దననిరంతరధీరతామహిమకుఁ గట్లరాయఁడు పాదసంక్రాంతిఁ బెరయఁ
దనసకలాభినంద్యక్షమాలక్ష్మికిఁ బృథ్వీమహాదేవి క్రిందువడఁగ
వఱలు నీధన్యు గుణమాన్యుఁ బరమపుణ్యు
సాధుజనగణ్యుఁ బోలంగ జగతిఁ గలరె
యనుచు నభినుతు లెల్లచో నల్లికొనఁగ
నుల్లసిలుఁ బచ్చపావనీవల్లభుండు. ౮

సీ. ఆశావధూటికా కేశపాశములకు మల్లీమతల్లిసంపత్తి నెఱపి
యామినీకామినీస్వామి వక్షమునకు స్వచ్ఛాంగరాగవిభ్రమ మమర్చి
వారాశిఁ గూరుకు వారిజేక్షణునకు హీరవర్మశ్రీ రహింపఁ జేసి
యామరసామజాతాస్యబింబమునకు ముత్యాల మొగముట్టు మురువుఁ జూపి
డంబు దళుకొత్త నెవనియశంబు విష్టపంబునకు రవణంబు నందంబు మీఱు
నమ్మహాశీలు సుగుణలతాలవాలుఁ, బచ్చపనృపాలు నిలఁ బోలువారు గలరె.

సీ. చందనహిమవారి సమభిషేకంబునఁ దలయేటివెనునాఁచుఁ దలఁగఁ జేసి
కమనీయకస్తూరికాసకుమదచర్చఁ బూదిపూఁతల రొచ్చుఁబోకువెట్టి
హురుముంజిముత్యాలచెరఁగుహారంబట్టుచేఁదోలిచేలపుటేవఁదొలఁగఁద్రోచి
యమృతోపమాన దివ్యాన్నార్పణంబునఁ గంఠగరళకటుకత్వ ముడిపి
హరు మహాదేవు నిత్యసమర్చనాసక్తి, యాకలాపంబులను దనియంగఁ జేయు
మహితబుధలోక జేగీయమానుఁ డైన, పచ్చనృపమౌళి యాశ్రితపద్మహేళి.

చ. అమృతకరుండు తారకము లాదిమనాగము దేవతాగవా
రము తగ నెంతకాలము గరంబు తిరంబుగ నుండు నాతెఱం

గమరఁగ నంతప్రాప్తు నిరపాయతఁ బచ్చనృపాలుకీర్తుల
న్నొమరుగ శ్రీనివాసుఁడు గనుంగొని సత్కృపఁ బ్రోచుఁ గావుతన్. ౧౧

శ్లో. ఏకాంకలాం భువనజాతహతిం దధాన స్సర్వజ్ఞతాం వదకథం లభతే గిరీశః
బహ్వీః కలా భువనజాతహితా దధాన స్సర్వజ్ఞ ఏషఖలుపచ్చపమానవేన్ద్రః.

శ్రీపచ్చయప్పనరనాథ భవత్కరోద్య
ద్దానామ్బువార్ధిజయశోమయపూర్ణచన్ద్రమ్
దృష్ట్వా కలఙ్క మతిలజ్జతయా హిమాంశుః
కార్శ్యం ప్రయాతి బహుళం నదివా చకాస్తి. ౨

గుణాస్య బాధికా వృద్ధిం కృతవా న్పాణినిః పురా
అబాధితగుణా మృద్ధి మకరో త్పచ్చపప్రభుః. ౩

పశ్యాయాతి మహానయం ద్యుసరితః పూరోదిశశ్చాదయం
స్తత్రా స్మద్గజవాజిధేనుతరవో మగ్నాః పునర్నేక్షితాః
ఏవం చారజనం బ్రువాణ మమరస్వామీ హాస స్వక్తి భోః
మాభైషీ ర్నహి (తత్) భవా నయమతః పచ్చప్ప కీర్తేర్మహాః. ౪

ఉ. శ్రీయలమేలుమంగ కుచసీమఁ బయంటఁ దొలంగఁ గాంచి కాం
తా యిటఁ గొండ పై నిరతహర్షమునం దగి గోరువంక లిం
పైయలరారెఁ గంటె యన నారసి సిబ్బితిపూను నెచ్చెలిం
బాయక కౌఁగిలించు హరి పచ్చపకీర్తుల నిచ్చఁ బ్రోచుతన్. ౫

చ. సతత మనంతభోగముల సన్నుతి కెక్కినవాఁడు కల్మి గు
బ్బెత కిరవైనవాఁడు ఘనవిభ్రమమూనిన మేనివాఁడు రా
జితగుణరత్నహారములచేఁ దులకించెడువాఁడు సూరివం
దితుఁ డగు శ్రీనివాసుఁ డిల నిచ్చలుఁ బచ్చపకీర్తిఁ బ్రోవుతన్. ౬

ఉ. శ్రీకనుఁగల్వదోయి వికసిల్ల దరస్మిత చంద్రికావళిన్
లోకతమంబు లెల్లెడల లోఁగఁగఁ జేసి బుధోత్కరంబున
స్తోకరసంబు గొల్పెడు విధుండు మహామహుఁ డిచ్చనిచ్చలుం
జేకొని యుబ్బఁ జేయు నృపశేఖరపచ్చపకీర్తివార్ధులన్. ౭

ఉ. చల్లఁదనంబు లెల్లెడలఁ జల్లెడు మిన్కులవాఁడు గాని తా
నొల్లఁ డొకప్పు నుగ్రగతి యోజ బుధావళిఁ దన్పు చోట రం
జిల్లఁగఁ బేర్చుఁ గాని కొఱఁ జెందఁ డొకప్పుడుఁ బచ్చపక్షమా
వల్లభుఁ డీగుణాకరుని పాటియె రాజొకఁ డివ్వసుంధరన్. ౮

క. భువనభరణనిపుణుం డయి, తవిలి తనుంగొలుచు విప్రతతి కోరుకులె
క్కవగాఁగఁగురియుపచ్చప, ధవుఁడుఘనుఁడుగాఁడెయేవిధంబునఁదలఁపన్,

విధము లై, గృహ్యతే=గ్రహింపఁబడును. దీని తాత్పర్యము, య ర ల వలు నాలుగును ద్వివిధములు. అందులో య వ లకు "హలి సర్వేషాం" అనుసూత్రమునందు, పాణినీయములో లఘువులును, అలఘువులును నని రెండువిధములును సూచితము లయ్యెను. లకారము "లోశః" అనుసూత్రమునందు ప్రాకృత వ్యాకరణములో రెండువిధము లాయెను. పరిశేషించిన రవర్ణము, ఆంధ్రవ్యాకరణములో ద్వివిధ మవునసుట.

---

అద్యః క్రియాసు భూతార్థోద్యోతిత* మాద్యగం వినా సర్వః
యశ్రుతి మార్యా లఘుయం ప్రవదన్తి ప్రాణతః పరం ప్రాణమ్. ౮

ఇది రెండుసూత్రములు. క్రియాసు=క్రియాపదములయందు, భూతార్థోద్యోతితం=భూతార్థములం గనిపించునవి యు, ఆద్యగం=నామాది నుండునవి యు, వినా=వినాగాను, సర్వః=సమస్త మైన, యః=యకారమును, అత్=అకారము. అకార మనఁగాఁ దలకట్టనుట- చనియె, వినియె మొదలైనవి క్రియాభూతార్థస్థితయెకారములు. యెమ్మె, యెప్పుడు, మొద లైనవి నామాది నున్న యెకారములు. ఈరెండును విడిచిపెట్టి కడమ యకారములెల్లఁ దలకట్టుగాఁ దెలియునది. ప్రాణతః=అచ్చుకంటెఁ బరమైన, ప్రాణం=అచ్చును, యశ్రుతిం=యకారముగా వినఁబడుదానిని, లఘుయం=లఘుయకారముగాను, ఆర్యాః=పెద్దలు, ప్రవదన్తి=పలుకుదురు. హరియధికుండు, మాయేలిక, మొదలైనవి లఘుయకారములు.

---

నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్
అర్ధన్య స్తాలవ్యశ్చ ర్వక్రస్యా న్మిథ స్సువర్ణశ్చ. ౯

ఇది మూఁడుసూత్రములు. లఘ్వలఘూనాం=లఘ్వలఘువు లైన, అన్యేషాం=కడమవానికి, వైధర్మ్యం=విరోధము, న=లేదు, రయోస్తు=లఘ్వలఘువులైన రవర్ణములకైన, నిత్యం స్యాత్=నిత్యముగా విరోధము గలదు. విరోధ మనఁగాఁ దమలో యతిప్రాసములు చెల్లకుండుట- ఇటనంగా యవలు ద్వివిధములును దెలుఁగునఁ గల వనుట. అచ్చుమీఁదను అచ్చునకు వచ్చినయకారము లఘుయకారము. ప్రథమాంతముమీఁద, పకారమునకు వచ్చిన యా

---

* భూతార్థద్యోతినం-పా.

దేశవకారము లఘువకారము. లళలు ప్రసిద్ధములేను. వీనికి యథోచితముగా నుదాహరణములు: —

నీళ్లఁ బాలునుగలసిన ట్లెల్లప్రొద్దు, నాయహివిభూషణుఁడు నీవుఁ బాయకుండు
రనుచుఁ జెలికత్తెవలుకహిమాచలాత్మ, భవ ముఖాబ్జంబువంచిసిగ్గువడియుండె.

కొందఱు ద్వివిధములైన వకారములకును, తొల్లి మైత్రి లే దందురు. ఇంక రవర్ణోదాహరణము:—

ఱెక్కలుగలట్టి పెనుబాఁపఱేండ్లవంటి, కఱకుములుకులశుంభునుక్కఱఁగఁ జేసి
పరమకళ్యాణి గిరికులేశ్వరతనూజ, రణవినోదంబు సలిపె నిర్జరులు వొగడ.

దన్త్యాః=దంత్య మైన, చుః=చవర్గము, అత్=అకారము, తాలవ్యాః= తాలవ్య మైన, చుః=చవర్గము, వక్రః=ఎకారము, స్యాత్=అవును, మిథః సవర్ణశ్చ=దంత్యతాలవ్యములు రెండును, దమలోఁదాము, సవర్ణము లవును. చందురుఁడు, చక్కెర, జాడ, జంట మొదలైన దంత్యములు తలక ట్లనుట. చెన్ను, చెల్వ, జెట్టి, జెజ్జి, ఇవి మొదలైన తాలవ్యము లెత్వము లనుట- ఇందుకు దాహరణము: —

చక్కఁదనము లోకజయవైభవము వల,రాచవారువడసి రాచరించి
చెలువ నద్రికన్య సేవించువారికి, జాడఁగన్గొనఁగ నసాధ్యమెద్ది.*

---

ప్రాతిపదికం హి నామ ప్రత్యయ ఇహ వర్ణకః క్రియా ధాతుః
ప్రాణా స్సమాసతోఽచో బిన్దు రనుస్వార ఏజథో వక్రః. ౧౦

ఇవి యాఱుసూత్రములు. ప్రాతిపదికం=శబ్దశాస్త్రప్రసిద్ధ మైన ప్రాతిపదికము, నామ=నామ మనంబడును. ఇహ=ఈయాంధ్రవ్యాకరణమందు, ప్రత్యయః=ప్రత్యయము, వర్ణకః=వర్ణక మనంబడును, ధాతుః=ధాతువు, క్రియా=క్రియ యనంబడును, అచః=అచ్చులు, సమాసతః=సంగ్రహముచేత, ప్రాణాః=ప్రాణము లనంబడును, అనుస్వారః=అనుస్వారము, బిన్దుః=బిందువనంబడును, ఏజ్=ఏఓలు, వక్రః=వక్రము లనంబడును.

---

వక్రతమ ఐజ్ఝలస్స్యు స్సమాసతః ప్రాణినో ద్రుతాఖ్యో నః
కచటతపాః పరుషాఖ్యా గజడదబాస్తు సరళాః స్థిరా ఇతరే. ౧౧

ఇవి యాఱుసూత్రములు. ఐచ్=ఐఔలు రెండును, వక్రతమః=

* గలుఁగుశుభములెల్ల నళుకులేక—పా.

వక్రతమము లనంబడును, హలః=హల్లులు, సమాసతః=సంగ్రహముచేతను, ప్రాణినః=ప్రాణు లనుపేరు గలవి, స్యుః=అవును, నః=నకారము, ద్రుతాఖ్యః=ద్రుత మను పేరుగలది, కచటతపాః=ఈవైదును, పరుషాఖ్యాః=పరుషము లను పేరుగలవి, గజడదబాః=ఈవైదును, సరళాః=సరళము లనంబడును, ఇతరే=పరుషసరళములు పదియు వినాగాను గడమహల్లు లన్నియు, స్థిరాః=స్థిరములనఁబడును.

---

ఇన్ద్రాద్యా అపిచ గణా వళిరాద్య మనన్తరాక్షరం ప్రాసః
న పదా న్యవ్యయ సుప్తిఙ్ క్త్వా తుమునా మనుకృతేస్తి వాక్యంతు. ౧౨

ఇది నాలుగుసూత్రములు. గణాః=గణములు, ఇన్ద్రాద్యాః అపిచ=ఇంద్రచంద్రసూర్యు లనునవియుఁ గలవు, ఆద్యం=మొదటియక్షరము, వళిః=వళి యనంబడును, అనన్తరాక్షరం=రెండవయక్షరము, ప్రాసః= ప్రాస మనంబడును, అవ్యయసుప్తిఙ్క్త్వాతుమునాం=అవ్యయమునకును, సుబంతమునకును, తిఙంతమునకును, క్త్వా ప్రత్యయాంతమునకును, తుమున్ ప్రత్యయాంతమునకును, పదాని=ప్రయోగపదములు, న=లేవు, అనుకృతేతు=అనుకరించు చోటులనైన, వాక్యం=వాక్యము, అస్తి=కలదు. వాక్యశబ్దము పదమునకు నుపలక్షణము. దీనితాత్పర్యము-ప్రాంతః, అంతః, హరిణా, రామేణ, భవతి, అస్తి, కృత్వా, గంతుం, రంతుం, అనుప్రయోగములు తెనుఁగున లేవు. ఇవే యనుకరించి ప్రయోగించినఁ గలవు. అనుకరించుట యనఁగా, పద ముచ్చరించి తుదను "అని" అనుమాట ప్రయోగించునది. సాయం అని, హరిణా అని, కృత్వా అని, అనునవి యనుకారములు. ఈయవ్యయాదులైన యయిదింటికి, ననుకారములచేతఁ బ్రయోగమునకు నుదాహరణము చెప్పుచున్నాఁడు.

శా. మాతస్తే సతతం నమో యనుచు, నంబ త్వాం భజే యంచు, వం
దే తే పాదసరోజ మంచుఁ, బురతః స్థిత్వా మమ త్రాహి యం
చాతంకాన్ కుశలాసి హాస్త మనుచున్, హర్షంబుతోఁ బల్కుచున్
ఖ్యాత(శ్రీ)పురుషార్థము ల్వడసెదం గా నేను గాత్యాయనీ.

---

తిఙ్మధ్య శేషషష్ఠీసుప్స్వర్మప్రవచనీయజవిభక్తీః
కిఙ్చిత్ప్రశంసనాద్భుతసన్తాపయదాతదాకిమేవాంశ్చ. ౧౩
క్త్వాకిలతూష్ణీ మాద్యా నభిదధతి కలా ద్రుతో న యేషాం స్యాత్
అన్యే ద్రుతప్రకృతయో యే స్యు ర్వ్యానుజీవితద్రుతా నిత్యమ్. ౧౪

ఈయార్యాయుగళము రెండుసూత్రములు. తిఙ్మధ్య=తిఙ్మధ్యము ల ను క్రియలుచు- ప్రబలితివి, సంతోషించితివి, ప్రకాశించిరి, సంతోషించితిమి- ఇత్యాదిక్రియలు తిఙ్మధ్య లనిపించుకొనును. శేషషష్ఠీ=యొక్కషష్ఠియు, హరి యొక్క, గిరియొక్క అనుషష్ఠియును, సుస్=వనము, పవనములు, ఇత్యాది ప్రథ మావిభక్తియును, కర్మప్రవచనీయజవిభక్తిః=రాముంగూర్చి, కృష్ణుంగూర్చి, ఇ త్యాదిద్వితీయ యు, కించిత్=ఇంచుకంత, కాసంత, సుంత, మొద లైన కించి దర్థములును, ప్రశంసన= బళి, మజ్జా మొదలైన ప్రశంసార్థములును, అద్భు త=అహో, ఓహో, ఔరా, మొదలైన అద్భుతార్థములును, సన్తాప=అక్కటా, అయ్యో మొద లైన సంతాపార్థములును, యదా తదా=ఎప్పుడు, అప్పుడు, అనెడివియు, కిం=ఏమి యనునదియు, ఏవాంశ్చ =నిన్నే, నన్నే, అను నేవార్థ ములును, క్త్వా=ప్రకాశించి, హరించి, విహరించి, ఇత్యాది క్త్వాప్రత్యయాంత ములును, కిల= చేసె నఁట, అనెడి కిలార్థమును, తూష్ణీం =ఊరక, మిన్నక మొద లైన తూష్ణీమర్థములును, ఆదిశబ్దముచేత, పట్టి యనువిభక్తియు మఱి, సుమ్ము, కద, మొద లైనవియును, కలాః=కళ లని, అభిదధతి=చెప్పుదురు, ఏ షాం=ఏవీని కైన, ద్రుతః=పైనకారము, నస్యాత్ =లేదు. కూర్చిరి కీర్తి, హరియొక్క చరణములు, శివుఁడు కర్త, ఇత్యాది. వించున్నాము, ఘటింపఁగలఁడు, చనఁడు, అనెడివి తిఙ్మధ్యములు గా కున్నను, ప్రథమాసమానములు గనుక సుస్సులోని వే గానే తెలియునది. సుస్ అంటే ప్రాకృతశాస్త్రవ్యవహారమునఁ బ్రథమా విభక్తికిఁ బేరు. ఊరక, చేయక, అనునవి క్త్వా ప్రత్యయార్థము లేను. మఱియుఁ బ్రాఁదెనుఁగున నేమైనా అంటే, ఆదిశబ్దము ఉన్నది గనుక కళాప్రదేశములుగాఁ దెలియునది. అన్యే= ఈచెప్పినవానికంటె నన్య మైనవి యేవి గలవో యవి య న్నియు, ద్రుతప్రకృతయః =ద్రుతప్రకృతు లనంబడును, యే=ఏవై ననేమి, నిత్యం=నిత్యమును, అనుజీవిత=అనువర్తించుచున్న, ద్రుతాః=నకారముగలవి, స్యుః= అవును. సూత్రప్రాప్తులచేత లోపాదులు వచ్చిన వచ్చును గాని పొల్లు నకారముతోఁగూడ నుండున వనుట.

---

తజ్జా సమాచ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి
ప్రకృతిద్వయజా తజ్జా తుల్యాతు సమా ప్రవాహినీ దేశ్యా. ౧౬

ఇది యేకసూత్రము. ఇయం=ఈభాష, తజ్జా=తద్భవము, సమా= తత్సమము, దేశ్యా=దేశ్యము, గ్రామ్యాచ=గ్రామ్యము నని, చతుర్విధా=నాలు గువిధములుగలది, భవతి=అవుచున్నది, ప్రకృతిద్వయజా=సంస్కృతప్రాకృతము

లఁబుట్టిన, తజ్జా=తద్భవము, తుల్యాతు=సంస్కృతప్రాకృతతుల్యమైన, సమా=తత్సమము, ప్రవాహినీ=లోకవ్యవహార(ప్రవాహ)సిద్ధమైనది, దేశ్యా=దేశీయము. "అనియమాద్గ్రామ్యం" అని మొదలఁ జెప్పినాఁడు గనుక వర్ణన్యూనాధికతాన్యాదృశతదుష్టమైనదే గ్రామ్యమని వాగనుశాసనులు తల్లక్షణముం జెప్పిరి.

---

విరళాన్ పేచోషాదికశబ్దాన్ ప్రవ్యాహరంతు* శబ్దజ్ఞాః
ఇహ తు ప్రవ్యాహార్యం సత్కవితసుప్రసిద్ధ మేవ పదమ్. ౧౬

ఇది యేకసూత్రము. శబ్దజ్ఞాః=శాబ్దికులు, విరళాన్=అప్రసిద్ధము లైన, పేచోషాదికశబ్దాన్=పేచ ఊష మొదలైన శబ్దములను, ప్రవ్యాహరంతు=ప్రయోగింతురుగాక, ఇహ తు=ఇందయిన, సత్కవితసుప్రసిద్ధం=కవిసమయసిద్ధమై ప్రసిద్ధమైనటువంటి, పదమేవ=పదమే, ప్రవ్యాహార్యం=ప్రయోగింపందగును. పేచ అనఁగా 'డుపచిష్పాకే' అను ధాతువునకు లిణ్మధ్యమపురుషబహువచనము. ఊష అనునది 'వసనివాసే' అను ధాతులిణ్మధ్యమబహువచనము. ఇవి మొదలైన శబ్దము లప్రయుక్తము లని నిషేధించియును వేదములలోఁ బ్రయోగించియున్నవి గనుక యప్రయుక్తములు గావని మహాభాష్యములో, "అస్త్యప్రయుక్తః" అను వార్తికమునొద్ద భాష్యకారులు, అన్నారు గనుక, అప్రసిద్ధము లైనను సంస్కృతములోనైనఁ బ్రయోగింపవచ్చును గాని యిందప్రసిద్ధములు ప్రయోగింప వలదనుట. ఇట్లన్నందుచేతఁ బ్రయోగసిద్ధ మయినదైన గ్రామ్యమైనను యోగ్యమే యని వాగనుశాసనులు వివక్షించినారు.

---

శా. బ్రహ్మారణ్యకమాండుకాద్యుపనిషత్పద్మాటవీహంస యా
బ్రహ్మస్తంబచరాచరప్రకరయంత్రన్యాసవిక్షేపకా†
జిహ్మాద్భీషణ‡సూత్రధారపిశితాసివ్రాతభీతామరా
బ్రహ్మణ్యాసహమానమానసపరబ్రహ్మస్వరూపాకృతీ.

ఇది శ్రీసకలభాషావాగనుశాసననన్నయభట్టవిరచితాంధ్రశబ్దచింతామణియందు సకలకవితాస్వతంత్రభట్టారక యెలకూచి బాలసరస్వతికవిమహోపాధ్యాయప్రణీతం బైనయాంధ్రశబ్దచింతామణి టీకాగ్రంథమునందుఁ బ్రథమమైన సంజ్ఞాపరిచ్ఛేదము.

---

* ప్రత్యాహార్యం అని రెండు ప్రతులలోను గలదు.

† విక్షేపణా. ‡ జిహ్మక్రీడన. పా.

# సన్ధిపరిచ్ఛేదము.

---

సన్ధి ర్నా చో ప్యనుతో వా తోనాదిషు విభక్తి షూతో వా
నిత్య మనుత్తమపురుషక్రియా స్వితః పరిమితౌ సమస్తానామ్. ౧

ఇది యయిదుసూత్రములు. సన్ధిః న అచః అచి అనుతః- అనుతః=ఉకార వ్యతిరిక్త మైన, అచః=అచ్చునకు,అచి=అచ్చు పరముగుచుండఁగా, సన్ధిః=సంధి, న=లేదు. ఉదా. మేనయత్త, చిన్నియన్న, వన్నెయొల్లె,రోయీవి, మైయొఱపు. ఉకారమునకు సంధి కలదు. ఇంపు + అగు నని యుండిన సంధి, ఇంపగు, సొంపగు; వా అతః- అతః=అకారమునకు, వా=వికల్పమున సంధి వచ్చును. వికల్ప మనఁగా రాను వచ్చును, రాకయు నుండును; అకారమునకుఁ బూర్వసూత్రమున సామాన్యాకారముచేత సంధిరాకపోఁగా వికల్పించినాఁడు. తెన్నయగు, తెన్నగు; ఎల్లయపుడు, ఎల్లపుడు. అనాదిషు విభక్తిషు ఉతః వా- అనాదిషు=ప్రథమావ్యతిరిక్తమైన, విభక్తిషు=విభక్తులయందు, ఉతః=ఉకారమునకు, వా=వికల్పమున సంధి గలదు. మన్నునేలు, మాకొఱకునిచ్చు, నీకునారోగ్యము, కీర్తియందునసురక్తి, ద్రుతప్రకృతులు గనుక నకారము నిలిచినది. మన్నేలు నిత్యాది. ప్రథమయం దైన- హరుఁ డధికుండు, హరిహగు లాద్యులు, సంధివచ్చెను. ద్రుత ప్రకృతి కాదు గనుక నకారము లేదు. నిత్య మనుత్తమపురుష క్రియాసు ఇతః- అనుత్తమపురుష=ఉత్తమపురుషవ్యతిరిక్త మయిన, క్రియాసు=క్రియలయందలి, ఇతః=ఇకారమునకు, నిత్యం=నిత్యముగా సంధి గలదు. చనిరసురులు, ప్రోచిరమరులు. ఉత్తమపురుష కైన, కొలిచితి నంబను, విడిచితి మన్యులను, అన్నది కిమాది గనుక క్రియాగ్రహణమున నంటలేదు. నిత్యం అన్నాఁడు గనుక క్రియాగ్రహణ మనిత్యము. పరిమితౌ సమస్తానాం- పరిమితౌ=పరిమాణార్థము పరమై యుండిన, సమస్తానాం=అన్ని యచ్చులకు సంధి గలదు. బారెండు, పుట్టెండు, తూమెండు, వీసెఁడు, ఇత్యాది.

---

న స్యా త్తద్ధర్మోత శ్చో ర్వా స్యా ద్వర్తమానవిహితస్య
తద్వ త్తదాదిజస్య ప్రాయస్తు స్యా త్కిమాదిక స్యేతః. ౨

ఇది నాలుగు సూత్రములు. తద్ధర్మోతః-తద్ధర్మ=క్రియలయొక్క తద్ధర్మార్థమందలి, ఉతః=ఉకారమునకు, నస్యాత్=సంధిలేదు. రక్షించునంబ, పోషించునీశ్వరి, వర్తమానవిహితస్య=వర్తమానార్థమందు చేయంబడ్డ, చోః=చువర్ణమునకు, వా స్యాత్=వికల్పమున సంధివచ్చును. నగుచిట్లనియె, నగుచు

నిట్లనియె, తదాదిజస్య=తచ్ఛబ్దాద్యర్థములయందుఁ బుట్టిన ఇకారమునకు, తద్వత్ = చూఁకు (చుకారమునకు) వలెనే వికల్పము (సంధి వచ్చును) అదియె వ్వరు; అదెవ్వరు, ఇది యేమి, ఇదేమి; కిమాదికస్య=కిమర్థాదులయొక్క, ఇతస్తు=ఇకారమునకైన, ప్రాయః=తఱచుగా, స్యాత్=సంధికలదు. ఏమమ్మ, ఏమయ్యా, ఏమందు. ప్రాయః అన్నాఁడు, గనుక యేమియమ్మ యనియును గలదు.

---

అపిశబ్దార్థస్యేత. శ్చౌరే రుపధాత్మనశ్చ లు గ్వా స్యాత్
శత్రర్థేతూతశ్చౌనో స్తస్య స్యాచ్చ పూర్ణబిన్దు రపి. ౩

ఇది మూఁడుసూత్రములు. అపిశబ్దార్థస్య ఇతః- అపిశబ్దార్థస్య=అపి యను నుపసర్గార్థపదముయొక్క, ఇతః=ఇకారమునకు, వికల్పమున లోపము వచ్చును, హారునే నంబనే, హారునేని నంబనేని. చౌరే రుపధాత్మనశ్చ లు గ్వా స్యాత్. కొనయక్షరమున కీతలనుండెడిది ఉపధ, ఉపధాత్మనః=ఉపధారూపమైన, రేః= రి అను నక్షరమునకు (రివర్ణసంబంధి యైన యికారమునకు) చౌ=చి యనున క్షరము పర మగుచుండఁగా- లుక్ వా స్యాత్=ఇకారమునకు వికల్పమున లోపము వచ్చును. అమర్చి, అమరిచి. శత్రర్థేతూతశ్చౌనోః- శత్రర్థే=వర్తమానార్థమందు, చౌ = చువర్ణము పరమై యుండినచో, నోః = నుకారముయొక్క, ఉతః=ఉకారమునకు, వికల్పమున లోపము వచ్చును. తస్య=మిగిలిన యానకారమునకు, పూర్ణబిందు రపి=నెఱబిందువును, స్యాత్=అగును. వినుచు, వించు; అనుచు, అంచు. 'బిందు రపి' యని యపిశబ్దము పెట్టినందుచేతఁ గొన్నిచోటుల రాదు. చనుచు, ఎన్నుచు, పూనుచు, ఇత్యాది.

---

శబ్దా త్తచ్ఛబ్దాతః పోశ్చ తదాద్యర్థవాచకే షూతః
ప్రథమావైభక్తికమో ర్బిందుశ్చ మహాన్ పతిక్రియార్థేతు. ౪

శబ్దాత్ తచ్ఛబ్దాతః=శబ్దముమీఁద నుండు తచ్ఛబ్దార్థము యొక్క, అకారమునకు వికల్పమున లోపము వచ్చును. బాఁపనది, కోమటిది. బాఁపనయది, కోమటియది. తదాద్యర్థవాచకేషు=తదా యనెడిమొదలైన శబ్దార్థములు పలికెడువానియందలి, పోః=పు అనునక్షరముయొక్క, ఉతః=ఉకారమునకు, వికల్పమున లోపము వచ్చును, అపుడు, అప్డు; ఇపుడు, ఇపు, ఇత్యాది.

షత్ఌ గతౌ అను ధాత్వర్థము పరమైన- ప్రథమావైభక్తిక=ప్రథమావిభక్తి రూప మైన, మోః= ము అను నక్షరమునకు వికల్పమున లోపము, మహా౯ బిందుశ్చ=లోపము రానిచోట పూర్ణబిందువును- భయపడి, భయంపడి; సంకటపడి, సంకటంపడి. ఇత్యాది.

---

షష్ఠ్యా ఉతో చి ను మ్సేచాద్య స్యామ్రేడితే న్త్యలోపశ్చ
అహమాదీనాం ద్విత్వం లోపో నమఆదికే విసర్గస్య. ౫

ఇది నాలుగు సూత్రములు. షష్ఠ్యాః ఉతః అచి నుమ్ సే-ప్రాకృతశాస్త్రవ్యవహారమున స అనిన సమాసము. సే=సమాసమందు, ఉతః=ఉకారముయొక్క, షష్ఠ్యాః=షష్ఠికి, అచి=అచ్చుపరమై యుండిన, నుమ్=నుమ్ అను నాగమము వచ్చును. ఆగమాదేశాదిలక్షణములు శబ్దశాస్త్రవ్యవహారముననే తెలియునది. "అనుక్త మన్యవత్" అనుప్రాకృతన్యాయమున నుమ్లోని ఉకారమకారములకు శబ్దసూత్రముచేత లోపము చేయునది. రాజునెదుట, పామునెమ్ములు. ఆద్యస్య ఆమ్రేడితే అంత్యలోపశ్చ, ఆమ్రేడిత మనఁగా రెండుమాఱు లుచ్చరింపఁబడు శబ్దము. దానియందు, ఆద్యస్య=మొదటిదానికి, అంత్యలోపః=అంత్యలోప మౌను. అన్నన్న, ఏమేమి, ఓహోహో, ఇత్యాది. అహమాదీనాం=అహం మొదలైనవి, యనుకరించునప్పుడు వాని యంత్యమునకు, ద్విత్వం=ద్విత్వము వచ్చును. సున్నకు ద్విత్వము రానేరదు గనుక మకారము చేసికొనునది. అహమ్మని, కిమ్మని, ఝుమ్మని. లోపః నమ ఆదికే విసర్గస్య, నమ ఆదికే=నమః అనునవి మొదలైనవి యనుకరించునప్పుడు వానియందలి, విసర్గస్య=విసర్గకు, లోపః=లోప మౌను. నమోనమ యని, ధర్మస్సహాయ యని.

---

పరుషా ద్ద్రుతప్రకృతికా త్సరళా స్స్యు స్తద్ద్రుతంచ బిందుస్స్యాత్
అవికారగతే తస్మి న్నపి సరళా ఏవ సన్తి తే పరతః. ౬

ఇది రెండు సూత్రములు. ద్రుతప్రకృతికాత్=ద్రుతప్రకృతిమీఁద నున్న, పరుషాః=కచటతపలు, సరళాః స్యుః=గజడదబ లౌను. తద్ద్రుతంచ=ఆద్రుతప్రకృతియొక్క నకారము, బిందుః స్యాత్=సున్న యౌను. నినుఁదలంతు, ననుఁగావు. హ్రస్వపరము గనుక పూర్ణమును నౌను. నినుందలంతు, ననుంగావు. దీర్ఘపర మైన లేవు, నేఁగొలిచితి, తాఁగొను. తస్మి౯=ఆనకారము, అవికారగతేపి=బింద్వాదిరూపము గాకపోయినను, స్వభావమున నున్ననుగానీ, పరతః=

మ. స్మరజిద్భక్తిరసాంబుపూరితము శ్రీమన్మానసావాలమం
దురహిం స్నిపదపల్లవాంకురము సంతోషంబుతో నిల్పి సు
స్థిరముం జేసిన దాన ముక్తిఫల మర్థిం గాంతు రానేర్పు చూం
పరు లెంచ న్పెడనాభిధానశివపూర్వస్త్వాద్యగస్త్యేశ్వరా. ౧౬

మ. నరులుం గిన్నరులు న్మునీశ్వరులు నానానిర్జరు ల్గాడినం
దిరుగంబాఱునె లోకసంతతియు, సాధింపంగ నానే నిర
క్షరకుక్షింభరు లెందఱైన నొకశాస్త్రజ్ఞుండు వాదించు దు
ర్భరయుక్తిం బెడనాభిధాన. ౧౭

మ. సమయాచార్యుఁడ వీవు శిష్యుఁడ నజస్రం బేను సత్యం బవ
శ్యము నన్గావఁగ దాత వీవరయ యుష్మద్భక్తిభాగ్యంబు ని
త్యముగాఁగన్ భువి మించుఁ దద్యశముచేత న్మించునీమూర్తి త
త్త్వమయంబై పెడనాభిధాన. ౧౮

మ. సరసం బీఘటమందిరంబునను సుజ్ఞానాఖ్యదీపాంకురం
బురులీల న్వెలిఁగింపఁ జేయుట సురవ్యూహప్రధానుండ వై
దొరవై చీఁకటియింట నుంట తగ దెందుం జూడ నీవేపరా
పరమేశా పెడనాభిధాన. ౧౯

మ. నెపమే నీవు జగద్గురుండ వనుచో నేఁ జేయుపాపంబు లే
దెపుడైనం గలదేని జెందు నది ని న్నే శిష్యపాపం గురో
రపియ న్వాగ్గతి నే నిరాఘుఁడ నిర............ధ
ర్మపరుల్ శ్రీపెడనాభిదాన. ౨౦

శా. అంబాబింబఫలాధరేశ్వర శిరస్సాష్టాంగదండప్రణా
మం బే నిప్డొనర్తు నంత కభిరామం బెన్న లేదెందు ని
త్యం బేఁ జేసినతప్పు లన్నిటికి డాయన్రావె సుజ్ఞానదీ
పంబీవే పెడనాభిధాన. ౨౧

మ. మును దారాపతి దక్షశాపహతి నింపుం బెంపుఁ బోనాడి కూ
లిన వానిం దగ నెత్తి నెత్తి నిడి పాలింపంగ నిత్యాశ్రితుం
డను నిర్దోషిని నీదుకాళ్లకడ నైనం జేర్చి రక్షించు టొ
ప్పనిదేనా పెడనాభిధాన. ౨౨

మ. గృహాశల్యంబులు గూల్చి కట్టిన మరుద్గేహంబున న్నీదు వి

గ్రహము న్గావము నుంచి మ్రొక్కులిడువార ల్వెండి నిల్లొడ్డి ప్ర
త్యహము న్నిన్నెడఁగట్టి పూజలిడు వార ల్స్తవ్యాత్ములే లోకధూ
ర్వహ నీ కోపెడనాభిధాన. ౨౩

మ. హరుఁ డన్నన్ హిమవద్ధరాధరమనోహారికుమారీమనో
హరుఁ డన్నం ద్రిజగచ్చరాచరశిరఃప్రాంచచ్చరన్మృత్యుసం
హరుఁ డన్నన్ శంకరుం డనఁగఁ నీవంచున్ భజింతుం బరా
త్పరుఁ డన్నం బెడనాభిధాన. ౨౪

మ. ఒకపూఁటన్నము లేనివానికెటు నోరూరంగ ముమ్మాఱు తిం
టకుఁగా నొక్కటఁ బంచభక్ష్యములు నింటం గల్గు నేవెంట నిం
చుక గల్గించిన నీదయారస మెఱుంచున్ దాన నానావనీ
పకకల్పా పెడనాభిధాన. ౨౫

శా. శ్రీనాథాబ్జభవేంద్రముఖ్యదివిషచ్ఛ్రేణీమహోద్యన్మన
స్థానా మత్తరమండపస్థగితవజ్రస్తూపవిద్యుత్ప్రభా
జ్ఞానాజ్ఞానతమోవిరామ విమలజ్ఞానాత్మవిద్యానవ
ధ్యానాంచత్పెడనాభిధాన. ౨౬

శా. ఏకాలంబు జగత్కుటుంబభరణం బేకాకివై యోర్తు విం
తే కాదా భువనైకమాత యనురక్తి న్సాయమై యున్నచో
నీ కెంతైన భరింపవచ్చు నిది వాణీరాజ్ఞికి న్శక్యమా
వాక్రువ్వం బెడనాభిధాన. ౨౭

శా. లోకానీకములోన దేహియనునాలో నాస్తియన్రాదు ము
న్నీకుం గట్టఁగ బట్టలేదు మఱి నిన్నే నెంత యాచించిన
న్నా కే మీవల దందు కిందొసఁగు నానందింతు నీభక్తియ
న్నైకంబే పెడనాభిధాన. ౨౮

శా. వేదార్థంబుల విందు నీతనుమహద్విఖ్యాతి నిత్యంబుగా
నీఁదంబోయినఁ ద్రావనీళ్లు మఱి లే విందన్నచందంబు ని
న్నాదిం జూడఁగ నేమిలేదు జగదాద్యం బెన్న నీవంచు నే
వాదింతుం బెడనాభిధాన. ౨౯

శా. అన్నా చిత్రము నీదు వైభవము నీవా షడ్గుణైశ్వర్యసం
పన్నాఢ్యుండవు చేఁదుబువ్వ పులితోలైపచీరయుం బూదిమే

స్తన్నా చిచ్చగు నెమ్మెసొమ్ము నినుఁ గన్నం జాలు నీకల్మిమే
ల్వన్నేరా పెడనాభిధాన. ౩౦

శా. అన్నా మున్వలపించె నేర్పొనర నిన్నా పార్వతీదేవి నీ
కన్నం జక్కనివాఁడు లేఁడనుచు నిన్గామించి మోహించి ము
న్నెన్నో నోములు నోఁచి దాన నగమయ్యో న్నీదుమే న్గారసం
పన్నం బై పెడనాభిధాన. ౩౧

మ. అనుమానం బొక యింత లేదు నగమీనై పోతి పీవున్న రూ
పౌనరం జెప్పినఁ బౌరుషంబు నగమై యొప్పారె నీజాడఁ జూ
డ నిజం బాడిన నిష్ఠురంబు వెనువెంట న్వచ్చు నాకేల నీ
పనియింతే పెడనాభిధాన. ౩౨

శా. తల్లిం గానక తండ్రిపేరెఱుఁగ కా తన్వీలలామం బె మే
లిల్లు న్వాకిలి తోడునీడ యని నీకిచ్చింపఁ దచ్ఛక్తి నీ
వెల్ల న్నీ వని లోఁ గనుంగొనియె నింకేమైన సందున్నదే
పల్లెత్తం బెడనాభిధాన. 33

మ. రసన న్నేల నయోక్తు లెంత ప్రియమారం జెప్పినం బల్కకు
న్ననదాస్థాణుఁడ వంటి నిట్లనుట కైనా గానరావైతి విం
తసిధారావ్రత మైన మంచిదనరాదా యిప్పుడే యింత యీ
రసమేలా పెడనాభిధాన. ౩౪

మ. జలగంధాక్షతపత్రపుష్పచయరాజద్ధూపదీపాదులం
గలకాలంబు నినుం భజించి నుతుల న్గావించి మెప్పించి లో
కులు నీయిల్లు గడంగి చూఱగొన నీకు న్సన్నిహ త్రొల్లిగా
వలసెంగా పెడనాభిధాన. ౩౫

శా. నీ వెందున్న సమస్తసంపదలు ముందే వేఁడి కొన్నంతలోఁ
గా వేయిచ్చి గణాధినాథులకొడల్ గైసేసి తద్భూతిచే
నావేశించి తిరింగె దెల్లెడల నీ యౌచిత్యమే యింతగా
రావించెం బెడనాభిధాన. ౩౬

శా. అయ్యయ్యో విష మేల తింటివది నీ కాహార మెట్లయ్యె నా
నయ్యా కుత్తుకబంటి యున్నయది యట్లైన న్భయం బేమి నా
కుయ్యాలింపు సనాతనుండవిఁక నీకుం జేటు రాదెన్న నా

పర్యాసం బెడనాభిధాన శివపూర్వస్త్యాద్యగస్త్యేశ్వరా. ౩౭

మ. క్షమియింపందగు నెన్నఁబూనిన నశక్యం బస్మదీయాపరా
ధము లెన్నైన విడంగ నౌనె నిజసంతానం బదెంతెంత త
ప్పు మదింగూర్చినఁ గన్నతండ్రి మది నీ మోదంబు లోకాహిత
ప్రమదంబా పెడనాభిధా. ౩౮

మ. ధనదప్రాణపదంబు ధీరజనసంతానంబు నీపాదద
ర్శనమైతే నదిగల్గుటే యరిది గాంచం గల్గిన న్లోపమే
లనగుం బెన్నిధిఁగన్న పేద కిఁక నేలా చింతిలం గోరిదీ
రనుతింతుం బెడనాభిధాన. ౩౯

మ. నుతియింపం గడ గానలేరెవరు నిన్నుం ధాత ని న్నీదు వి
శ్రుతరూపంబు గణింపలేక చతురాస్యుం డయ్యె శేషుం డధో
గతిపాలయ్యె శ్రుతు ల్చికాకుపడియె న్గా నీమహత్త్వంబు శా
శ్వత మయ్యెం బెడనాభిధాన. ౪౦

మ. జగతిం బుట్టినదాదిగాఁ గుటిలసంసారాంబుధిం ద్రోచి నె
వ్వగలం దొంగతనంబునం దిరుగు టోర్వంజాలఁ దచ్చౌర్య మో
నిగమాంతర్గత చూడు పట్టుపడితేనిం భక్తిబంధించి నా
పగదీర్తుం బెడనాభిధాన. ౪౧

శా. ఆబాణాసురుఁ డేమిమందిడెనో నీకాయింటివాకింటఁ గా
పై భంట్కత్రనుంట నాయుపమ నాయందున్న నాలోచనా
శాబంధంబున నుందు వీవు దొరవై సత్యంబు సందేహమే
ప్రాఁబల్కు ల్పెడనాభిధాన. ౪౨

మ. కరుణాంతఃకరణంబు నీదనుచు నేఁ గాంక్షింప నిందొక్కతే
సరిగాఁ జూచెద వింతె చాలు నది ముం జత్రాతిరాముద్దుఁగూఁ
తురిసయ్యాటల గట్టిదేటినది యాదుం గట్టిగాదే దయా
వరణంబై పెడనాభిధాన. ౪౩

మ. ప్రమథాధ్యక్ష మహోక్షసైంధవ జగద్బంధో దయాసింధ వేం
దుమణిస్ఫాటికసన్నిభాంగరుచయే తుభ్యం నమో దేవదే
వ మహాదేవ దృఢప్రభావ చిదచిద్వ్యాపార మాంపాహి స
ర్వమనోద్యత్పెడనాభిధాన, ౪౪

మ. అనభిజ్ఞోన్మదభాగ్యగర్వచలనోద్యద్విస్మృతు ల్బాల్యయౌ
వనకౌమారజరాంతకాలముల సంప్రాప్తంబు లిందొక్కవే
ళ నినుం బ్రస్తుతిసేయఁగందు నని యేలా యుందు నందున్న నీ
పని విందు న్బెడనాభిధాన. ౮౫

శా. నానాశాస్త్రపురాణవేదపఠనానందం బదెంతైన వి
జ్ఞానం బన్నది లేక వేఁడిన విశేషం బేమి బోధింప వి
జ్ఞానం బద్దములోనఁ జీకు గనునా చందంబు నన్నెంచు నీ
వానింగాఁ బెడనాభిధాన. ౮౬

శా. జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను నీసంసారమూహింప న
త్యుగ్రం బ్బుట్టు దుఃఖభాజనమునం దుత్సాహముం బొందు భా
వగ్రంధి న్నడలించి ప్రోవు మని నిన్నాబ్క్షించితిన్గాదె మ
… … … … … ౮౭

మ. సిరి దాఁజేరినఁ జేరుఁగాక జనరాశిన్ ధర్మకీర్తిద్వయం
స్థిర మన్పద్ధతి రెండుదప్ప మఱి యేదీ మర్త్యలోకంబునం
దరయన్ శాశ్వత మన్న దింకొకఁడు నీయందమ్యో సర్వం బవాం
తరలీల న్బెడనాభిధాన. ౮౮

శా. శ్రీమంతుండవు భక్తబాంధవుఁడ వుత్కృష్టార్థసీమా మహో
ద్దామా బిడ్డలఁ గన్నతండ్రి వెద నిర్దాక్షిణ్య మిం తేల యో
స్వామీ నీశరణాగతుండ నిఁకనాపైఁగూర్మిరానీ శివా
వామాంగా పెడనాభిధాన. ౮౯

శా. ప్రాలేయాచలకన్యకాప్రియ భవత్పాదారవిందార్చనా
లోలుండై హరి నేత్రపద్మమునఁ దళ్ళుల్చిల్లఁగాఁ బూన్చి త
త్కాలౌచిత్యము దీర్చికాంచెఁ గద నీకారుణ్యముం దా జగ
త్పాలుండై పెడనాభిధాన శివపూర్వస్త్యాద్యగస్త్యేశ్వరా. ౯౦

శా. ఆర్యాలోల మదీయవర్తనము సవ్యంబైనఁ గాకున్న నౌ
దార్యప్రక్రియ కేమి లోపమగు నర్థప్రాణము ల్రెండు నా
చార్యాధీనము లే కదా తుదకు నీసందేహముం దీర్ప దు
ర్వార్యంబా పెడనాభిధాన. ౯౧

శా. ఏ నిన్నమ్మితి నమ్మినందుకు మదీయేష్టార్థసంసిద్ధి నీ

చే నేనాఁటికి నా నిదేమి పనిగాఁ జిత్తంబునం దోఁచె ని
శ్చైనం బ్రాణము లైదు నీకొసఁగి నీయం దైక్యమేఁ గాంతునో
రా నీతి న్బెడనాభిధాన. ౫౨

శా. పూర్వజ్ఞానము లేనివాఁడ నను సంబోధించి వేవేగ మ
ద్గర్వంబంతయుఁ గూల్చి భక్తినిరతుం గావించి రక్షింపవే
సర్వాభీష్టఫలప్రదాత వయి నాస్వామీ కృపాదృష్టిమైఁ
బర్వన్ శ్రీపెడనాభిధాన. ౫౩

శా. నీనామస్మరణంబె పావనముగా నిత్యం బ్రవర్తించు వి
జ్ఞానాత్ముండు కృతార్థుఁ డౌటరుదె దుశ్చారిత్రుఁ డైనం గళా
హీనుం డైనను ముక్తుఁ డౌఁ బరశివా యే త్యక్షరాంతస్సుధా
పానాప్తిం బెడనాభిధాన. ౫౪

శా. నీవొక్కండవు దప్ప నన్నెఱిఁగి మన్నింపంగ వేఱొక్కరుం
డేవంకం గలఁ డయ్యె నాయెడల లేఁ డేవంక నీవింక న
న్గావంగాఁ దగుఁ బంకజాక్షులకు బాంధవ్యంబు నిత్యంబె సం
భావింపం బెడనాభిధాన. ౫౫

శా. నీసౌందర్యముఁ జూచి మోహినియునై నీరేజపత్రేక్షణుం
డేసైరింపక మున్ను మానివనవాటిం గూడె నిన్నన్న పే
రాస ల్బాసటమై నటింప మునిభార్య ల్గూడి సేవించుటే
త్రాసంబా పెడనాభిధాన. ౫౬

శా. కైలాసం బనిశంబుఁ జేరుఁ సుమహాత్మాండంబు నాపాదప
జ్వాలంబుం గెడతోడునీడలయి నీజాడం బ్రవర్తింతు రా
లాలిత్యంబు విచిత్ర మందు నిను నేలాగందు నీకీర్తిఁ గోనన్
జేతానా పెడనాభిధాన. ౫౭

శా. కాదే రోగికి మృత్యుసన్నిహితమై కన్పట్టునావేళ నా
నాదివ్యౌషధమంత్ర తంత్రముల నానాపత్త్రపాహారంబు నా
నాదిప్రాప్తశివాక్షరద్వయి నదే నల్లప్పు డీఁగాంతు నీ
పాదంబు న్బెడనాభిధాన. ౫౮

మ. తనకుం గల్మి గలంతకాల మెపుడున్ దానంబు ధర్మం బటం
చును బుద్ధింతయు లేక తాఁ బొనిన దుర్దారిద్ర్యముం జింత సే

సిననేమా నది శైల మేదినతుదిం జంతింప దీపప్రకో
పనమానా పెడనాభిధాన. ౫౯

మ. మును గావించిన పుణ్యలేశమున నేమో కూడుటే కాని స
ద్వినియోగంబున కందరాని ధన మన్వేషింపనోఁ గాక చో
రనరేంద్రాజ్ఞలచేతఁ దక్కు నెడ నర్థప్రాణికి న్వట్టిక
ల్పన గాదే పెడనాభిధాన. ౬౦

మ......హితకంఠభూషణము రం గుల్మీజి తద్వాల...
గణనం బైనవధూశిరోధి నెడలంగా ధర్మరాహిత్యమై
గుణముంటం దలకొన్న భాగ్యము దొలంగుఁగాక సంధిల్లునా
ఫణిభూషా పెడనాభిధాన. ౬౧

శా. ధర్మం బర్జునభూమిభృత్తిలకమే తద్ధర్మకర్మం బన
త్తార్మవ్యూహనికృంతనం బగుట సాధ్యంబన్న నీ కింతకుఁ
ధర్మంబన్నది యున్నఁ గాచికొను దథ్యం బాద్యదేహప్రభా
వర్మంబే పెడనాభిధాన. ౬౨

మ. అలసన్న్యాసికి లేదు తస్కరభయం బాభీతి సొమ్మున్నవా
రలకే వారిది లేమిగా దది దరిద్రప్రాణులందైన ని
శ్చలమా భక్తిధనంబుకల్మి ధనికు లసత్యం బదే నాపద
ల్వాలగొన్నం బెడనాభిధాన. ౬౩

మ. అతిలోభిం గనుఁగొన్న యాచకజనం బాకాంక్షమై నర్థసం
తతి యార్జించునె దాతలం గనిన పేదల్బంగి నీదర్శనో
న్నతి నింపొందు సమస్తభాగ్యశుభకందం బిందు కెందేది సం
ప్రతిచూడ న్బెడనాభిధాన. ౬౪

శా. శిష్టాచారములేల గ ల్గశుచి కీక్షింపంగ యావజ్జనో
చ్ఛిష్టగ్రాహికిఁ గల్గునెట్లు రుచి భక్షింపంగ నీ రెండుఁ జెం
దష్టైశ్వరసమిద్ధభోగి కిల నీ యాశీర్వచఃప్రాభవా
వ్యష్టిఁ శ్రీపెడదాభిధాన. ౬౫

శా. ఇంటింటం జని వంటకంబు గొనలే కిట్టట్టుగాఁ బెంటలో
కంటం బంటను బట్టి గీరికొని సాయంబైన కాకంబులా
యంటంటం జెయివీచుచు న్నెసఁగు నిత్యాశాశుచిగాహి ని

...టూనా పెడనాభిధాన శివపూర్వస్త్యాద్యగస్త్యేశ్వరా. ౬౬

మ. కలకాలంబు గురూపదేశ విదితజ్ఞానంబులే కాత్మచం
చలమై విస్మృతిఁ జెందునప్పు డెదలో శంకించుమూఢుండు దాఁ
గలుపజ్ఞార్నెలకుక్కబౌవ్వ మనుసంజ్ఞం దెల్వి ముఁదున్నదే
ఫలమింతే పెడనాభిధాన. ౬౭

శా. నీసద్భక్తి విహీనులై తిరుగు దుర్నీతు ల్తుది న్స్తోత్రుల
క్ష్మీసాంగత్యము గాంతురే నిజము గాసిందప్పి చింతిల్లక
భాసిల్లం గలదే యనాథలకు సౌభాగ్యంబు తత్సంగళ
ప్రసంబై పెడనాభిధాన. ౬౮

శా. బాలక్రీడల కెల్లమూల మగు సంభావించి యాడించు నీ
లీలామానుషవిగ్రహంబు విధికేళి న్నిల్పుఁ జాలించినం
గీలూడం బడు జంత్రపుంబ్రతిమమాడ్కిం గ్రాలు నీవేతగుం
బాలింపం బెడనాభిధాన. ౬౯

శా. తోఁడేల్గన్న మృగంబులట్లు మది.........
లాడింపంగ నెఱుంగలేక యము డాయంబోవు మర్త్యాళికిం
జూడం జుట్టము మ్రొక్కదైవము మదిం శోధింప నీకంటె నె
వ్వాఁడీవే పెడనాభిధాన. ౭౦

మ. సకలాధర్మతరంగసంగతము సంసారార్ణవం బందుఁ బాం
దికగా మత్తిలి యున్న చిత్త మనురక్తిం జేసి వైరాగ్యమా
ర్గకళావ్యక్తి నెఱుంగ నీఁగకును సౌగంధ్యంబు సొంపొనె ద
ర్పకభంగా పెడనాభిధాన. ౭౧

శా. ఎందుం దోడయి నిల్చియుండఁ డరి నీవెందున్న నీయందె నా
డెందం బిందుకు సందియంబువల దుండె న్భవ్యత్వత్పాదమిం
పొంద న్మట్టుచు బాసచేసెద నిదే యూహింప నీకాళ్ళకుం
బందం బౌ పెడనాభిధాన. ౭౨

మ. ధరఁ బుట్టింపఁ గరంబుఁ బెంప ననుసంధానంబు గావింప నే
ర్పరివై సర్వ మనుగ్రహింప ననుఁబ్రోవన్నీ కసాధ్యంబె యిం
దరవిందప్రభ చిత్రభానున కనాహ్లాదంబె నాతండ్రి నీ
వరవుండం బెడనాభిధాన. ౭౩

# శతకసముచ్చయము

## ద్వితీయభాగము.

---

## ౧. రామకృష్ణమూర్తిశతకము.

— ఆటవెలఁదులు —

* * * * * * *

అద్దమందునున్న యాత్మతోఁబోరాడఁ, జిన్నిబాలు నిందసేయఁదగునె
జ్ఞానిననుచు నీవు జనులదూషింపకు, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౧

నామరూపసహితనానాప్రపంచంబు, శ్రోత్రనేత్రములకుఁ జూపుదానిఁ
జూచుచున్న నీవె చూడంగ బ్రహ్మంబు, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౨

పాలలోననుండి బైటఁదీసినవెన్న, పాలఁ గలిసిపోదు పాలనున్న
జ్ఞాని కలసిపోఁడు సంసారముననున్న, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౩

ఉప్పుఁగల్లుఁజూడ గొప్పవారాశిలోఁ, గలసిపోయి మరలఁ గానరాదు
బ్రహ్మమందు నీప్రపంచ మావిధమయ్యె, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౪

దురదమంటయుఁగల కురుపువంటిదిచుమీ, సుఖముదుఃఖమొందు స్థూలతనువు
ఔషధంబువంటి దాత్మయోగం బది, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౫

జలధినున్నచేఁప జలమునకై యటుఁ, దిరుగఁబోనె యన్యదేశములకుఁ
దన్నునిండుకొన్న తత్త్వంబు వెదకెదు, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౬

భూమియందెపుట్టి భూమియందెపెరిఁగి, భూమియందె యణఁగు భూరుహములు
ఆత్మయందు జగము లావిధంబుగ నాయె, రామ. ౭

లింగదేహమనెడు పొంగుజ్వరంబున, సంధివలెను మాయ జగతిఁ బుట్టె
దానికౌషధంబు తగురాజయోగంబు, రామ. ౮

ఆత్మఁదెలియనట్టి యాచార్యుఁదెలిసిన, ఫలముదప్పిపోను బ్రహ్మకైన
నూరుపేరులేక యుండంగవలసెరా, రామ. ౯

నిన్ననేఁడుఁబుట్టి నిక్కుచు నీల్గుచు, నున్నవారె యెందునున్నవారు
యుందుఁ బిన్నపెద్ద లెవ్వరు చెప్పుమా, రామ. ౧౦

పందిరూపు గొనుచుఁ బాతాళమునకేగి, శివునిపాదములకుఁ జేరఁడాయె
నట్టివిష్ణుఁ డేమి యధికుండు చెప్పుమా, రామ. ౧౧

దేవుఁ డనుచు బ్రహ్మదేవునిఁ జెప్పకు, దేవుఁడైన వామదేవుచేతి
దెబ్బచేత శిరసు తెగి యిలఁ బడెనేమి, రామ. ౧౨
శివుఁడు దేవుఁ డనుచుఁ జెప్పకు నాతోడ, శివుఁడు దేవుఁడైన సిగ్గులేక
పాఱిపోవనేల భస్మాసురునిభీతి, రామ. ౧౩
బ్రహ్మదేవునితల బ్రద్దలైపోను శం, కరుని యిల్లు వల్లకాడుగాను
వీరు వేల్పులనుచు వెఱ్ఱేలప్పుటెరా, రామ. ౧౪
దేహమందున్న దేవునిగానక, దేవులాడనేల దేశమెల్ల
యొండమావులందు నిండేఱు భ్రమలేల, రామ. ౧౫
గురుఁడు బ్రహ్మమఱియు గురుఁడు విష్ణుండును, గురుఁడె త్రిపురదైత్యహరుఁడు సుమ్మి
గురుఁడు కేవలంబు పరమాత్మ గానమ్ము, రామ. ౧౬
గురువులనఁగ నెవరొ గురుని దేరూపంబొ, గురుని జూతునంచుఁ గోరువాఁడు
శ్రీగురుప్రసాదసిద్ధికిఁ బాత్రుఁడు, రామ. ౧౭
గురువుగురువనెదరు గురువెక్కడున్నాఁడు, ఆత్మదెలుపువాఁడె యాదిగురువు
ఆత్మదెలియఁగానె యాగురువ్వతానాయె, రామ. ౧౮
మాయమాయ యనఁగ మాయెక్కడున్నది, మనసుతనకుఁ బెద్దమాయగాక
మనసుగెలిచినట్టి మనుజుండె దేవుండు, రామ. ౧౯
దేవుఁ డనగ వేఱె దేశాంతరంబున, వెదకఁబోవఁ గలఁడె వెఱ్ఱిగాని
వెదకువాఁడు నెవఁడొ వివరించి చూడరా, రామ. ౨౦
విశ్వమునకులోన వెలుపల నెడలేక, యున్నవాఁడు దేవుఁ డన్నవాఁడు
వానిఁ జూడఁబోయి వాఁడె వాఁడాయెరా, రామ. ౨౧
నూకగింజగానలేకను గాడిద, పుట్టెఁ డూఁక కలయ బొక్కినట్లు
సారమెఱుఁగలేని శాస్త్రపాఠములేల, రామ. ౨౨
చక్రధారు లనఁగ శైవమతస్థులు, నేమొకాని మఱి సహింపలేరు
చక్రధారిగాని జనుఁ డొక్కఁడును లేఁడు, రామ. ౨౩
లింగధారు లనఁగ వెంగలి వైష్ణవు, లొప్పలేరు నిజము చెప్పలేరు
లింగధారిగాక లేఁడ యెవ్వాఁడును, రామ. ౨౪
మాయగాని యిదియు మంత్రంబులనుబోవ, గ్రహము తేలుపాముగాదు సుమ్ము
బ్రహ్మవిద్యలేని పరువులింకేటికి, రామ. ౨౫
నీచఘనము లనక నిను దిగంబరుఁ జేసి, బట్ట బైల విసరి పాఱవైచె

గుణవిహీనుఁ డీతఁడు గురు నీఁకనుంచకు, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౨౬

గొప్పవాఁడు నొకఁడు కొద్దివాఁ డొకఁడని, తోఁచకున్నవాఁడు దొడ్డవాఁడు
చావుఁ బుట్టుకయును సమము లందఱకును, రామ. ౨౭

తన్నుఁ గన్నయట్టి తల్లిదండ్రుల జన్మ, మెఱుఁగ లేఁడు మీఁద నే మెఱుఁగుఁ
బూర్వకథలు చెప్పి శోకిల్లపోనేల, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౨౮

బ్రహ్మ మిది యటంచుఁ బట్టి చూపించిన, జ్ఞానికానివాఁడు కాన లేఁడు
అంధుఁడైనవాఁడు నాదిత్యుఁ గాంచునా, రామ. ౨౯

లేనివస్తువందు లేనట్లు దెలిసిన, యపుడె యున్న దున్నయట్లు దెలియు
గల యబద్ధ మనుట కాదె జాగరణంబు, రామకృష్ణమూర్తి. ౩౦

తాను ముక్తినొందఁ దనతోఁ బ్రపంచంబు, ముక్తి నొంద దనుట యుక్తిగాదు
నిదుర చెదరినపుడు చెదరవే కలలన్ని, రామ. ౩౧

దేశకాలము లఁట దేహేంద్రియము లఁట, పుట్టి పెరిఁగి చచ్చిపోవుట లఁట
కడువిచిత్ర మిట్టి కలఁ జూచి నమ్మకు, రామ. ౩౨

ఉన్న బరువు మోయనోపనివారలు, దానికన్న బరువు దాల్పనేల
ముక్తిగోరి శాస్త్రములు నేర్వగానేల, రామ. ౩౩

బొంకననుచు వ్రతముఁబూనిన యాదొడ్డ, ధర్మరాజు వ్రతము దప్పిపోయె
నింక నేమి వ్రతము లీనరాధములకు, రామ. ౩౪

విష్ణులోక మనుచు వేఱుగాఁ జెప్పుట, విష్ణువైరబుద్ధి వైష్ణవులకు
విష్ణుమయముగాదె విశ్వంబు సకలంబు, రామ. ౩౫

విష్ణుగీతమైన వేదాంతవాక్యంబు, విననివాని దేమి విష్ణుభక్తి
భర్తమాట వినని పడఁతి పతివ్రతా, రామ. ౩౬

పరమగురుని ప్రేమ భక్తివైరాగ్యముల్, కలుగువారియందుఁ గలిగి యుండు
పాలుగుడుచుచున్న పడఁతులు పతికేల, రామ. ౩౭

మోహబంధనంబు మొదటికే తెగకున్న, దేహబంధనమ్ము తెగదుసుమ్ము
సిగ్గువదలిపోక చీరలు వదలవు, రామ. ౩౮

బ్రహ్మకైనఁగాని ప్రారబ్ధకర్మంబు, తప్పిపోవ దెంత తన్నుకొన్నఁ
దన్నివృత్తికొఱకుఁ దాత్పర్యము లవేల, రామ. ౩౯

దేహ మనెడు దొడ్డదేవాలయమునందు, దేవుఁ డొకఁడు గలఁడు జీవుఁ డనఁగ
జ్ఞానపుష్పమాలఁ బూని పూజింపుము, రామ. ౪౦

దేహమందె కలఁడు దేవుండనెడువాఁడు, దేహమందె యునికిఁ దెలియఁబోఁడు
అఖిలదేహములకు నాధార మాతఁడు, రామ. ౪౧
చదువు చదువవచ్చుఁ జదువునం దర్థంబు, తప్పకుండ విప్పి చెప్పవచ్చు
భావ మెఱుఁగువాఁడు బ్రహ్మవిద్వాంసుండు, రామ. ౪౨
క్షేత్రతీర్థములకు సేవింపఁబోవచ్చు, శిలలఁ జూచి పూజ సేయవచ్చు
నిన్ను నీవె తెలిసి నిజమైన గతినొందు, రామ. ౪౩
తల్లిదండ్రిపుత్రదారాదికంబును, గల దటంచుఁ జాలగర్వపడకు
దోమకైనఁ గలదు దొడ్డభాగ్యమెగాదు, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౪౪
పుస్తకంబు కాలిపోయిన దానిలో, గ్రంథమింత యైనఁ గాలిపోదు
తనువులెన్నిచనినఁ దాఁ జావఁ డెపుడును, రామకృష్ణ. ౪౫
వేదవిదులు కోరివిడిచిన స్వర్గాది, ఫలమునందు నీకు భ్రాంతియేల
మక్కు వేల పుట్టెఁ గ్రక్కిన కూటికి, రామకృష్ణ. ౪౬
స్వర్గనరకహేతుసకలకర్మాటవిఁ, బరమయోగవహ్నిపాలుచేసి
విశ్వ మంత గెలిచి వెలుఁగు బ్రహ్మంబ వై, రామకృష్ణ. ౪౭
ఫలము గల దటంచు భ్రాంతిచేఁ గర్మంబు, లాచరించుటెల్ల నీచవృత్తి
ఆజ్యధారచుమ్మి యజ్ఞానవహ్నికి, రామకృష్ణ. ౪౮
జననమరణరూపసంసారదుఃఖంబు, తెలివిపుట్టినపుడె తీఱిపోదె
స్వప్నమందుఁ గన్న సంకటంబులుపోలె, రామ. ౪౯
వత్సరములు విద్య వర్ణాశ్రమాదులు, గలుగువాఁడు పెద్దగాఁడు చుమ్మి
యున్నవస్తువెఱిఁగి యున్నవాఁడే పెద్ద, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౫౦
ఆత్మ నెవ్వఁడెఱుఁగు నతఁడె బ్రహ్మణ్యుండు, ఆత్మ నెవ్వఁడెఱుఁగఁ డతఁడుమాల
యిట్లు వర్ణములకు నేర్పాటు చూడుమా, రామ. ౫౧
ఆత్మనెఱుఁగకున్న నాబ్రహ్మతోనైనఁ, జెలిమిసేయఁబోవ సిగ్గుగాదె
సత్య మెఱిఁగియున్న చండాలుసేవింపు, రామకృ. ౫౨
నామరూపములను నానావిధంబుల, నున్నఁగాని జీవుఁ డొక్కరూపు
పశువు వేఱుగాని పా లొక్కరూపంబు, రామ. ౫౩
ఒక్కయవయవంబె యొప్పునే దేహమై, యన్నియవయవంబు లగుటఁగాని
ప్రాణు లన్ని గూడఁ బరమాణురూపంబు, రామ. ౫౪
తెలివిలేనివాని బలిమిని దెప్పించి, దివ్యమోక్షపదవి దెలుపుటెల్ల

సరిగఁ జెవిటియొద్ద శంఖ మూఁదినయట్లు, రామకృష్ణమూర్తిరమ్యకీర్తి. ౫౫

గతి యెఱుంగలేక కైలాసవైకుంఠ, లోకములకుఁ బోవ లోలుఁ డగుచు
మతములందుఁ బుట్టి మతిచెడితిరుగును, రామ. ౫౬

బ్రహ్మవిష్ణుశివులు పరులంట లోకంబు, పుట్టి పెరిఁగి చచ్చిపోవుటకును
గార్యమందు నెవఁడుఁ గానంగరాఁడేమి, రామ. ౫౭

నదిని దిరుగుచున్న నావపైవానికి, నొడ్డుమీఁద నున్నయూరు దిరుగు
అట్లు మనసు భ్రాంతి నఖిలవిభ్రాంతులు, రామ. ౫౮

భూమినున్న జలము భూమిగుణంబులఁ, బొందినట్లు మనసుపొందుచేత
మనసుధర్మమెల్ల మానదు తనకును, రామ. ౫౯

కట్టఁబట్టవలెనె కట్టుచు విప్పుచు, నట్టితనువులందుఁ గట్టువడక
యెప్పటట్ల నీవు నొప్పుగా వెలుఁగుమా, రామ. ౬౦

పరఁగు సూక్ష్మతనువు ప్రాణమనోబుద్ధి, దశవిధేంద్రియాన్వితంబు గాఁగ
నందుఁ గలయ జీవుఁ డందురు నిన్నును, రామ. ౬౧

స్థూలసూక్ష్మదేహమూల మజ్ఞానంబు, కారణాంగ మనఁగఁ గల దదొకటి
దానిఁ ద్రుంపవలయు జ్ఞానసాధకముగ, రామకృ. ౬౨

నిన్ను మఱచి మున్ను నీవైనయట్ల యా, నిన్ను మఱచి మఱియు నీవు గమ్ము
నీవు నీవు గాఁగ నిఖిలంబు నీవౌదు, రామ. ౬౩

జ్ఞాని యనఁగఁ బ్రభువు జ్ఞాన మాతనిసొమ్ము, సొమ్ముపెట్టె లాగమమ్ము లెల్ల
మొరయఁ జదువువారు మోఁతకూలీ లయా, రామ. ౬౪

రాజుభార్యతోడ రమియించు చున్నను, నదియు బైటఁ బెట్ట హానిగాదె
బ్రహ్మవేత్త ననుచుఁ బరులకుఁ జెప్పకు, రామ. ౬౫

ఇనుపపుల్లఁబట్టి యెండుతాటాకుపై, వ్రాసి నోసి నోటఁ గూసినట్టి
చదువు నమ్మఁబోకు సద్గతి దొరకదు, రామ. ౬౬

అన్యశూన్యపదము నందుచు దంపతుల్, సిగ్గుతోడ విడిచి చీరలెల్ల
రతిసుఖంబుగొన్నగతినుండు శివయోగి, రామ. ౬౭

పెండ్లియాడనిమ్ము పెండ్లాముఁదానును, నొక్కచోటు వేఱె యుండనిమ్ము
కన్నదానిపొట్టకడుపువత్తుటకోరి, రామ. ౬౮

చిన్ననాఁటనుండి చేసినకర్మంబు, గురునికప్పగించు కోర్కిలేక
గురుని కరుణలేక దొరకదు మోక్షము, రామ. ౬౯

కలుగువాఁడు నొకఁడు కలుగనివాఁ డొక, డింతెకాని వేఱె యేమిలేదు
యిట్టితెలివికంటె నెట్టిదో మోక్షంబు, రామ. ౨౦

ఏమిచేతఁగాని యీనరు లొకవేళ, వైరు లనుచు వదలవద్దుసుమ్ము
శౌర్యమున్నఁ జంపు శత్రుషడ్వర్గము, రామ. ౨౧

సూర్యుఁ డున్నఁగాని చూడరు జగములు, కన్ను లున్నఁగాని కానరతని
కన్ను లుండు టెట్లు ఘనబుద్ధి లయ మయ్యె, రామ. ౨౨

పాంచభౌతికాఖ్యభవనంబులోపల, నిన్ను మఱచి నీవు నిదురవోవ
నిన్ను లేపువాఁడు సన్నుతాచార్యుండు, రామ. ౨౩

నిదురపోతి నంచు నెదుటివానికిఁ జెప్పు, నిదురపోవనట్లు నిజముగాదె
బ్రహ్మమైనవాఁడు పరులకుఁ జెప్పునా, రామ. ౨౪

నీవు గలుగుకొఱకు నేనును గలుగుట, నేను గలుగుకొఱకుఁ దాను గలిగె
తానుతానుగాఁగఁ దనకెవ్వరునులేరు, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౨౫

మోహజలధి నీఁది ముక్తుఁడై శివయోగి, దేహమందునుండి తెలియరాఁడు
పరఁగుకాయలోనికురిడిప్రకారంబు, రామకృష్ణమూర్తి రమ్యకీర్తి. ౨౬

అసంపూర్ణము.

(ఈశతకము శ్రీయుత సత్యవోలు రాధామాధవరావుగా రిచ్చినది.)

శ్రీరస్తు.

# ౨. అగస్త్యేశ్వరశతకము.

శా. శ్రీమత్పర్వతపుత్రి కాహృదయ రాజీవాళి దుష్టౌఘ
స్తోమధ్వాంతనితాంత హేళి బుధసందోహాదిరాణ్మౌళి ని
త్యామర్త్యాలయవాహినీభువనభంగాభోగచూళీకళా
స్వామీ సత్పెడనాభిధానశివపూర్వస్త్యాద్యగస్త్యేశ్వరా. ౧
శా. ఆకాశంబు నిరావకాశ మదియేకా కేశపాశంబుగాఁ
గాఁకైవల్యపదంబునొందిన చిదాకాశ ప్రకాశత్వనఘా
నీకాశ ప్రతిభాస్వరూప మిల వర్ణింపంగ శక్యంబె స
త్ప్రాకారా పెడనాభిధానశివపూర్వస్త్యాద్యగస్త్యేశ్వరా. ౨
మ. తలలుం గన్నులు నాల్కలుం గలిసి మొత్తం బైదునే లున్నతిం
గల శేషాహి భవన్మహామహిమ సాకల్యంబుగా నెన్న గా
సిలి కాలంబడి ప్రేలుచుండఁగ నొరు ల్చింతింపఁగా నెంతవా
రలు ని న్నో పెడనాభిధానశివపూర్వస్త్యాద్యగస్త్యేశ్వరా. ౩
మ. భవదుద్యత్కరుణాకటాక్షభవసంపద్వీక్షణాలబ్ధమ
త్కవితాలంకృతవృత్తపద్యశతసంతానప్రసూనాచ్ఛదా
మవితానం బిదిగైకొనం దగు మహామంత్రార్థసాంగత్యరూ
పవిలాసా పెడనాభిధానశివపూర్వ. ౪
శా. గంధేభాంధకదైత్యదర్పహర దుర్గానాథ దుర్వారగ
ర్వాంధు ల్గానఁగ లేరు నీమహిమ జాత్యంధు లసదా పద్మినీ
బంధుం జూడనిమ్మాడ్కిఁ జిత్త మిది నా భాగ్యంబు విద్యావిచ
త్వంథానా పెడనాభిధానశివపూర్వ. ౫
శా. శాంతస్వాంతసు తపటదాశాంతస్వభూసర్వభూ
తాంతర్యామివి నీవనై నిఖిలలోకాళిం గడుం బెంప నేఁ
జింతింప న్మదిఁ గల్మిలేములకు నాసింతు న్భవద్భక్తిమ
త్ప్రాంతంబా పెడనాభిధానశివపూర్వ. ౬
మ. క్షితి నిండూపలరాశి కౌముది శరాకీర్ణంబు గావించుసం
గతి భక్తిం గరఁగించి లో నినుఁ గొనం గానవ్వలెంగాక కు
త్సితకృత్యంబున మన్మథుండు సుమరాజిఁ గెల్చనే నిన్ను స్తు
వతిలీలం బెడనాభిధానశివపూర్వ.

శా. నాకేనాథరథాంగపాళు లరయ న్వాదించుచో జాలపా
ష్టోణేరూపములై భవత్పృథుశిరోంఘ్రు ల్సత్స్వరూపంబు క
ల్యాణీసేవ్యమదూర్ధ్వలోకముల పాలై రంత చిత్రంబు శ
ర్వాణీశా పెడనాభిధాన శివపూర్వా. ౮

శా. బాలుం డాడెడుకందుకంబులక్రియన్ బ్రహ్మాండభాండావళిం
గేలం బట్టి తటిల్లతావిధమునై క్రీడించు నీతాండవో
ద్వేలాలోకన మేరికిం గలుగు హస్తిశ్రేష్ఠము ...
ల్వాలానా పెడనాభిధానశివపూర్వా. ౯

శా. కాండప్రస్ఫుట కంఠనిస్వనరణత్కంఠీరవోగ్రాకృతిన్
శుండాలంబు లడంపనౌనె ప్రమథస్తోమంబు ద్రిక్కంగ బ్ర
హ్మాండావిష్కృతమైన నీ ప్రళయరౌద్రాకార మీక్షింప నె
వ్వండోపుం బెడనాభిధానశివపూర్వా. ౧౦

మ. కలదే లోకమువారికిం దలలపైఁ గన్గొన్న కేవెల్గు నీ
తలనేకా డయిన సుధాకరధరత్వం బంతకుం జెల్లెనే
పర౯ కలిగెంగా కది నీకు భక్తులొరు లేకంబాదు రీవెంతలో
వల నున్నం బెడనాభిధాన. ౧౧

మ. తలపై జాహ్నవి డాపల న్గిరిజ చెంతస్వాంతమై మోహినీ
తిలకం బావెనుకం బ్రశస్తమునిపత్నీజాతము న్నీకుఁ గాం
తల ... ... ... ... ... ౧౨

శా. శ్రీకంఠస్వపురోపకంఠ సునట ... ...
గీకారార్థవినీలనీలరుచిరాంగీ వేదభాషాంతరం
గీకాంతావరవర్ణినీకృతరథాంగీసర్వసంపద్ధ్వజ
త్ప్రాకారా పెడనాభిదాన. ౧౩

మ. చెనఁటు ల్నివఖిలాంతరాత్మ వయి భాసిల్లంగ నిన్గాక త
క్కిన వేల్పుల్ దొరలంచుఁ బొంగెద రశక్తిం గ్రుంగుట ల్గాన ర
వ్వనికై లంజియ క్రొక్కఁడే మగఁడుగా భావించితే దానిజీ
వన మౌనా పెడనాభిదాన. ౧౪

మ. ఘనకైవల్యనిధానవర్ధిత జగత్కల్యాణ నిన్నాశ్రయిం
చినభక్తాళికి ముక్తిలాభ మరుదే సింగారమౌ కన్నత
ల్లిం జేరం జననెంచు బిడ్డనికిఁ దల్లీలాపయఃపానజీ
వనసేవ ల్పెడనాభిధాన... ౧౫

# విషయసూచిక.

# పరిషత్ప్రయోజనములు.



తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసఁగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ బొందుపఱుపఁబడు చున్నవి:—

i తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వాంకష మగునిఘంటు వొకటి రచించి ప్రచురించుట,

ii తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణము రచించి ప్రచురించుట;

iii ఆధునికశాస్త్రగ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట;

iv ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యములైనవానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగుదేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్రమొకటి రచించి ప్రచురించుట;

v సర్వవిషయములనుగుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట;

vi ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బాడితపరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట;

vii తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొకపత్రికను బ్రకటించుట;

viii తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకుఁగాను వార్షికసభల నేర్పాటుచేయుట;

ix తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్రికలను నొసంగుట;

x ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట- ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును; వ్రాఁతప్రతులుగూడ నుండవలయును;

xi తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపచరించు నన్నికార్యములను జేయుట.

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౦. | ప్రజోత్పత్తినామసంవత్సరము శ్రావణభాద్రపదమాసములు. | సంచిక 3.

## ఆమంత్రణసంఘాధ్యక్షోపన్యాసము.

ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికసభ, విశాఖపట్టణము.

ప్రభల లక్ష్మీనరసింహము పంతులుగారు బి. ఏ., బి. ఎల్.

---

మహాజనులారా ! పండితవర్యులారా !

శ్రీవిక్రమదేవవర్మ మహారాజుగారి యాహ్వానమున మా విశాఖపురికి విచ్చేసిన యాంధ్రసాహిత్య పరిషన్మండలివారికి నామంత్రణసంఘమువారియాజ్ఞ ననుసరించి మాహృదయపూర్వక స్వాగతమును నివేదించుచున్నాఁడను. పలుతెఱఁగుల నీపదవికి నేననర్హుఁడ నైనను గారణాంతరములవలనను నాపుణ్యవశముననను నీభాగ్యము నాపాలిటఁ బడినది. కానఁ గర్తవ్యంబు నౌఁదల ధరించితిని. అందుముందుగ శ్రీశ్రీశ్రీ విక్రమదేవవర్మమహారాజుగా రచిరకాలమున స్వకీయమును బిత్రార్జితము నగు శ్రీజయపురసంస్థానమున రాజ్యరమాధురంధరులై పట్టాభిషిక్తులయి ఝూడ్ఖండబాదుషాపదవి నలంకరించి సకలసామ్రాజ్య లక్ష్మీతేజోవిభవాయురారోగ్యైశ్వర్యాభివృద్ధులతో దైనందినప్రవర్ధమానసకలకల్యాణసంపదలతో శాశ్వత విద్వజ్జనపోషణధౌరేయులయి నిజపాండిత్యశేముషీసంపాదితషడ్భాషాచక్రవర్తిపదశోభితు లయి పరాక్రమంబు తమనామంబె ప్రకటింప నాచంద్రార్కము భూచక్రంబేలెడుఁ గావుత మని యీవిద్వత్పరిషద్విప్రజనానుమతిని మదీయాంతరంగికోత్సాహసంభరితాభినం

దనాశీర్వాదముల సవినయముగ సమర్పించుచున్నాఁడను. మఱియు నీసభాకార్యము నిష్ప్రత్యూహపరిసమాప్తిఁజెంది నిరంతరశ్రేయోభివృద్ధితో వర్ధిల్లఁగలందులకు మనసభ కధ్యక్షులుగా నుండ నంగీకరించిన బ్రహ్మశ్రీ మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయ శాస్త్రిగారికిని మాయభివాదనపూర్వకమగు స్వాగతమును విన్నవించు చున్నాఁడను. భీష్మమగు గ్రీష్మమునఁ దీక్ష్ణాతపనిదాఘవేదనలస్సైఁచి మాతృభాషా సాహితీ సేవాకుతూహల చిత్తులరయి చనుదెంచిన తమకందఱకును మాకడలి తరగలనుండి వెడలుసంజ తెమ్మెరలు స్వాగతంబొసంగవలెఁగాని మావలన నగున దొకండును గానరాదు. స్వాయత్తంబగు విత్తంబు మాకడలేదు. ఇయ్యది తమరెఱిఁగిన విషయమే. అయినను భక్తిలోపంబుగామిని, శక్తిలోపంబగుటను, విశాలహృదయులరగు మీరు విన్నఁదనముగ నెన్నుకొన రని యొక్క చిన్నపలుకుఁ బలుక సాహసించితిని.

కులోత్తుంగ చోడదేవుఁడు తనకులదైవత మగు కార్త్తికేయుని పేర నీపురమును నిర్మించెనని యొకయైతిహ్యము కలదు. కాన మానగరమునకు నధిష్ఠానదైవము విశాఖస్వామి—దేవతలకు సేనాని—సుబ్రహ్మణ్యుండు—అగ్రాసనాధిపులపేరాయనదియ,—ఈశ్వరతనయుండు—తారకాసురహంత—విఘ్నేశ్వరునకు సోదరుఁడు—కావున దేవకార్యంబగు నీసభాకార్యంబు నిర్విఘ్నంబుగను జయప్రదంబుగను నిర్వహింపఁబడు ననుటకు సందియంబు లేదు.

ఉపక్రమం బూహించుచు వింతవిశేషంబుల విశదీకరింప విహ్వలమతినై వెఱచి వెనుదీయు నను విచ్చలవిడిగా హెచ్చరించునది న్యాయవివేక మని వేఱుగ వక్కాణింప నవసరము లేదు. అందు మొదటి విశేష మాంధ్రవిశ్వవిద్యాలయమున కీ విశాఖపురి కేంద్రస్థాన మగుట. పెక్కు లిక్కట్లుపడి యెట్టకేలకు నొకచక్కిఁ జిక్కినది. ఇంకఁ బాఁదుకొని కొనలు ప్రాఁకి విస్తరింపఁదగియున్నది ఆంధ్రవిశ్వవిద్యాలయమున నాంధ్రత్వము—రూఢి గాని యౌగికము కాదు సుండీ—వెల్లడిల్లవలసి యున్నది. ఆంధ్రజాతీయాంతరాత్మ పలుతెఱంగులభాసిల్లుచు నైసర్గిక తేజఃపటలమును దిక్కులం బ్రసరింపఁ జేయవలసియున్నది. ఆశయము లెట్లున్నను శాసననిబంధనములచే నుద్బంధితమైయుండు ప్రతిష్ఠాపనమునందు స్వాతంత్ర్యమంతగా వికసింపఁజాలదు. మనపరిషత్తునందు స్వాతంత్ర్యమావిర్భవించి యున్నది. కాన స్వేచ్ఛాచరణపద్ధతులపయి నాంధ్రత్వమును బునరుజ్జీవితంబుగావించి దీపింపఁజేయు బాధ్యత మనవశమం దున్నది. ప్రపంచమునఁ

ప్రాచీనవిశ్వవిద్యాలయములు విద్వజ్జనపరిషత్తులే కాని వేఱొండుగావు. రాను రాను రాజావలంబనమును బడసినవి. దుర్భర రాజ్యాంగసంశోధనలకు లోఁబడిన యెడలను నిర్భీకస్వాతంత్ర్య ప్రవర్ధిత మగు విపులవిద్యాగరిమ విజృంభించుట విస్మయజనకంబు. ప్రాచీనార్యవిద్యాసామ్రాజ్య మిందులకుఁ దార్కాణ మై యున్నది. వర్తమానదేశకాలపరిస్థితుల కనుగుణముగ నున్నతవిద్యాప్రమాణాధకము నవీనవిప్రుల చేతం బడియున్నది. కాలమానం బెట్లుండునో దైవజ్ఞుల కెఱుక. కర్షకుల కయ్యది హర్ష జనకంబు కాదు. అయినను జీమూతములపయి నాస లిడుకొని నిలువక జీవనదంబు లగుజీవనదంబుల సహాయమునఁ గృషిసల్పుట యొప్పును. అట్లయిన వ్యవసాయము సఫలీకృతమగును. స్వశక్తి నూఁతగొని యన్యులపై నాస విడిచి కార్యంబునకుఁ గడఁగుట సర్వదా శ్రేయస్కరంబగును. ఎందేనియుఁ బ్రభుత్వము సహజగుణప్రాభవప్రభవము; కాని యన్యదత్తంబు గానేరదు. విద్యల మర్మంబును వివేకముల ధర్మంబును నిదియే. యదృచ్ఛాలాభంబునఁ బ్రాపించు ప్రభుకటాక్షంబుల కువ్విళు లూఱక ప్రజాశక్తి నాశ్రయించి మాతృభాషాసాహిత్యవిద్యాప్రచారమున నసమాన మగు పూనికతోఁ బనిచేయు నాశయములతో మనపరిషత్తు నెలకొల్పఁబడినది. ఉద్యోగార్హత కల పురుషున కుద్యోగంబు లభించును. వైపరీత్యములమాట వేఱుగ నుండనిండు. సాంఘికాభివృద్ధికి సర్వంకషప్రయోజనములఁ దోడ్పడు విద్యాధురీణులు సర్వరాజ్యములఁ బూజ్యులు గాక తప్పదు. అట్టి విద్యాసంపద గలుగఁ జేయు బాధ్యత రాజ్యమునం దుండును. రాజ్య మట్టి బాధ్యత వహింపని యెడల రాజనీతిబాహ్య మగును. కాని ప్రజలయందు మాత్ర మట్టిబాధ్యత సర్వదా సర్వథా సన్నిధాపిత మై యుండును. కావునఁ బ్రజ లట్టి పూనికను విడువరాదు. విపత్తులకు వెఱవరాదు. విడ్డూరములకు వెనుదీయరాదు. వింతలకు విగ్రహములకు విసిగి వేసరి విసవిసలాడరాదు.

ఇంక సంక్షేపముగఁ గొలఁది కర్తవ్యంబుల నన్వేషింతము. భారతజాతీయనాగరకత విశ్వాదర్శప్రాయమై యున్నది. సనాతనవైదికధర్మము జగద్ధారణహేతువై యున్నది. చతుర్విధపురుషార్థములు చేకుఱుసాధనంబు వైదిక ధర్మమే. ఆర్యు లార్యావర్త మని ప్రసిద్ధిగాంచిన సప్తసింధుదేశమునఁ బ్రభవముగాంచిరి. కాని యన్యదేశములనుండి యాక్రమించి వచ్చిరను నపసిద్ధాంతములు విశ్వాసనీయములుకావు. అట్టి దుర్విదగ్ధకపోలకల్పితప్రజల్పము లాధునికప్రాచ్యపండిత

శేముషీమహిమలవలన ఖండింపఁబడుచున్నవి. దైవదత్తమగు నార్యసభ్యత భారతజాతీయాంతరాత్మప్రతిబింబమై యున్నది. అట్టియార్యధర్మము హిమాచలంబువలె నచలము—సుప్రతిష్ఠితము—దేవతాత్మస్వరూపము—పూర్వాపరవారినిధినిగాహనప్రౌఢము—అన్యుల కలంఘ్యము నజేయమునై యున్నది. మఱియు భారతతపోనిధానము; అనంతపుణ్యనదీప్రభవస్థానము; గౌరీశంకర నిలయము. కాలమాంత్రికుని గారడివలనఁ బ్రపంచమున నూతనవికాసముతో సాంఘికశక్తి యొకటి యభినవసుషమాదీప్తులతో నాకానొక నవోన్మేషరూపమున నావిర్భవించినది; కనుల మిఱుమిట్లు గొనఁజేయుచున్నది. ప్రజాసంఘములు ఘుంఘుమధ్వనులతో ఘూర్ణిల్లుచున్నవి. వింత పరివర్తనములు వేడుక గొల్పుచున్నవి. ఘోరగంభీరావర్తఫేనిల దిక్కూలముద్రుజమహారయనినాదంబులతో సాంఘికశక్తులు మహాప్రవాహములై ప్రవహించుచున్నవి. ఆర్యధర్మమున కీనవోన్మేషము ధూమకేతువుగానోపు నను భీతి కొన్ని పట్లఁ గల్గినను "సంఘే శక్తిః కలౌయుగే" యను నార్యోక్తిని స్మరించువారల కట్టిభీతి గలుగ నేరదు. లోకమున సాంఘికశక్తులును భౌతికశక్తుల వలెనే సృష్టికర్త యుద్దేశము ననుసరించి వాని వలన నియమింపఁ బడిన మూలసూత్రములపై నాధారము గలిగి విజృంభించుచుండును. ప్రకృతియు భౌతికశక్తులును విశృంఖలవృత్తి జరియించున ట్లగపడినను శాశ్వతమూలసూత్రముల ననుసరించియే యుండును. "ధర్మోవిశ్వస్యజగతః ప్రతిష్ఠా" యను శ్రుతివాక్య మెన్నఁటికిని వమ్ము కానేరదు. ఆర్యసంఘము సనాతన ధర్మనిబద్ధమై శాశ్వతశశ్వద్ధర్మసూత్రముల ననుసరించి యున్నది. ఇతరసంఘములవలె ఘుణాక్షరన్యాయమునఁ గాని కాకతాళన్యాయమునఁగాని తాత్కాలికశక్తిసంఘాతపరిఖేలనంబునఁ గాని యేర్పడినది కాదు. కావునఁ గాలవశమున సామయాచారికధర్మములు నూత్నపరివర్తనములఁ జెందినను నైసర్గికశక్తి బలమునఁ దిరుగ సామ్యావస్థను జెంది శోభిల్లఁ గలదు. సాంఘికజీవనమున జీవశక్తు లంతర్నాళములఁ దేజోరూపమునఁ బ్రవహించుచుండును. అట్టి జీవశక్తులయందు భాషాశక్తి ముఖ్యమై యున్నది.

మానవకోటియందు వాగ్దేవత వైఖరీరూపమును ధరించి వివిధగతుల ఖేలనము సల్పుచుండును. పరాపశ్యంతిమధ్యమారూపము లగ్రాహ్యములు. ఆంధ్రవాణికిఁగల సహజ సౌందర్యలావణ్యసౌకుమార్యమంజులమాధురీలలితవిలాసగతిసంపదలు వర్ణనాతీతములు ను సార్వజనీన విశ్వాసశ్లాఘాపాత్రములు నై

యున్నవి. అట్టి యాంధ్రవాణి మన మాతృభాష యగుట మన యదృష్టమే. వాగనుశాసనుఁ డాదిగ నేఁటి వఱకు నాంధ్రవాఙ్మయ మనేకాద్భుతపరిణామవికాసములఁ గాంచినది. వర్తమానమున కినూత్ననాళములఁ బ్రవహించుచు విశేషోన్నతిని జెందుచున్నది. శైశవాద్యవస్థలు గడచి నానావిధస్రగలంకారవిభూషణాదిశోభలఁ బరిఢవిల్లి సంపూర్ణ యౌవనవిలాసంబులఁ బ్రకటించి ప్రణయముం జూపి ప్రణవస్వరూపిణియైన తన విశ్వప్రకాశతేజఃపుంజంబుల దివ్యతేజంబున లోకోత్తర విజ్ఞానంబునకు సోపానంబై యలరారుచున్నది. జాతీయాంతరాత్మ యెల్లయెడలను జాతీయసారస్వతమ్మునఁ బ్రతిఫలించుచుండును. అట్టి యంతరాత్మయొక్క యభివ్యక్తియే వాఙ్మయము. ప్రకృతమున నాగరప్రపంచమున జరుగు ప్రౌఢవ్యవహారసంఘట్టనముల వలన నానాదేశముల విశేషసభ్యతావాఙ్మయము లన్యోన్యదేశభిత్తిసంకుచితములు గాక విశ్వజనీనప్రవృత్తి గలవై లోకకల్యాణసంధాయకములై విశ్వవిశాలదృష్టితోఁ బరఁగుచున్నవి. భిన్నభిన్నజాతుల వ్యక్తిత్వము మానవజాతికి శోభ లిడుచుఁ బ్రకాశించుచున్నది. వ్యక్తిగతతేజము పూర్ణప్రకాశోన్నతిఁ జెందినఁ గాని విశ్వమానవతేజఃపుంజమునఁ గలిసి వెలుఁగొందజాలదు. అట్టి వ్యక్తిగతతేజఃపటలవృద్ధికి సాధనభూతము లగు వివిధవాఙ్మయముల సాహాయ్య మత్యంతావశ్యకమై యున్నది. భాషాతత్త్వపరిజ్ఞానము ముఖ్యము. జాతీయాంతరాత్మయొక్క యాధ్యాత్మిక జీవనమునకు జీవాతుభూత మగునుత్తమవాఙ్మయపరిచయ మవశ్యంభావి యగుచున్నది. నవలలు, నాటకములు, పొడుపుకథలు, పుక్కిటిపురాణములు, గిలిగింతలు, కలగూరగంపలు, వింతలు, విమర్శనములు, మహేంద్రజాలములు, పెక్కులు మనభాషఁ గలవు. భావగీతములు, పట్టరానిపందిళ్లు. లలితగీతములు లక్కలేని సొమ్ములు. దైనిక సాప్తాహిక మాసిక సాంవత్సరిక పత్రికలు వెలలేని పట్టుపుట్టములు. ఇట్టి వెన్నియో కలవు కాని యాంధ్రభాషాదివ్యతత్త్వ పరిపోషణమునకును జాతీయాంతరాత్మవికాసమునకును వలయుసాధనములు మృగ్యములుగ నున్నవి. గ్రామ్య గ్రాంథిక సంవాదముల కొకనమస్కారము. ఎంకిపాటల కొకజోహారు. భావకవిత్వమున కొకప్రణామము. వ్యంగ్యకావ్యములకు వేయిదండములు. నిరంతర వాద ప్రతివాద ఖండన మండనోల్లుంఠనారావభీషణఘోషణార్భటులచే దిక్కరికర్ణరంధ్రముల బధిరీభూతముగ నొనర్చుపండితవర్యులకుఁ బదివేల సాష్టాంగములు. ఇఁకనైన బాహ్యదృష్టుల విడనాడి యంతర్ముఖులయి

యంతరంగపరీక్షచే వినిర్మలాంతఃకరణ ప్రసాదము గలవారలయి జాతీయోన్నతికిఁ దగినకర్జంబులఁ బటిమ చూపుట యుక్త మనితోఁచుచున్నది. మాతృభాష గీతముల రచించి కవీంద్రపదవి గన్నరవీంద్రుఁ దలఁచి, వైజ్ఞానికసంశోధనలవలన నూత్నరహస్యంబులం గనిపెట్టి వానికిఁ దననామం బిడి గౌరవించిన విద్వద్బృందముచే మెప్పు గాంచిన మన రామనుపండితునినిమము స్మరించి, యాత్మకార్యనిర్వహణదీక్షయం దాంధ్రలోకము కటిబద్ధ మగుఁగాక యని వేఁడుకొనుచున్నాఁడను.

భగీరథప్రయత్నమునఁ బడసిన యాంధ్ర విశ్వవిద్యాలయము ప్రజాజీవితమును బునీతముగా నొనర్చుటకు వలయు కుల్యాశాఖల నేర్పఱిచి ఫలప్రదాయినిగాఁ జేయుబాధ్యత యాంధ్రలోకముపైఁ గలదు. అదియు జాహ్నవివలెఁ ద్రిపథగామినిగా నున్నది. ఎట్లన నాంధ్రభాషాపునరుజ్జీవనసంస్కారోపాయాన్వేషపథ మొకటి. ఆంగ్ల వైజ్ఞానికవిద్యాపరిపుష్టపట్టభద్ర స్నాతకవర్గనిర్మాణనియంత్రణయంత్రపరీక్షాపథము మఱియొకటి. ఆంధ్రలోకకూలంకషసాంఘికరాజకీయార్థికాభివృద్ధిసాధకవివిధకళాప్రదాన ప్రణాళికాపథము మూఁడవది. దైవకృపయు, నంతకంటెను గార్యనిర్వాహక పరిషత్తునొక్క కటాక్షము నున్నయెడల నైయాదర్శములు పండవచ్చును. అట్టిభార మంతయు విశ్వవిద్యాలయ మొక్కటియె భరించుటకంటె మనయాంధ్రసాహిత్యపరిషన్మండలి కూడ దానికిఁ దోడ్పాటుగ ననుషంగముగఁ జేయఁ గలకార్యము లెన్నియో కల వని యూహించుచున్నాఁడను. అయినను విశ్వవిద్యాలయమునకును మనపరిషత్తునకును లక్ష్మీకటాక్ష మొకరీతిగనే యున్నది. అందు మన పరిషత్తు జ్యేష్ఠభగిని నాఁదగి యున్నది. కలుములజవరాలు కడకంటిచూపు తలవాకిటిచెలువ యగు తన కోడలిపైఁ బఱపకున్నఁ బనులు కొనసాఁగు టరిది యగును.

ఆంధ్రజనులయాశయములు పండి ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణచిహ్నములు కూడ సమీపమునఁ బొడకట్టుచున్నవి. భారతరాజ్యాంగతత్త్వము గూడ వినూత్నపరిణామముఁ జెంది భావిసుఖోన్నతికిఁ గారణభూతము గా నున్నది. ప్రజాస్వామ్యప్రభుత్వము సంసృష్టరాష్ట్రపద్ధతిని నిర్మింపఁబడి యాంగ్లస్వతంత్ర రాజ్యసమ్మేళనమున నధినివిష్టస్వతంత్రరాజ్యసామ్యస్థితితో నలరార నైయున్నది. సామ్రాజ్యపదము స్వతంత్రరాజ్యసమ్మేళనముగా మాఱుచున్నది. భరతఖండముగూడ నట్టిసంయుక్త రాష్ట్రసమ్మేళనము కాఁదగి యున్నది. భిన్న

భిన్నరాష్ట్రముల ప్రత్యేకనాగరకతావిశేషోన్నతులకు భంగము లేకుండ భార
తజాతీయసభ్యతాగౌరవమునకుఁ దోడ్పడునట్లు రాజ్యాంగనిర్ణయసూత్రములు
పన్నఁబడుచున్నవి. అఖిలభారతరాష్ట్రీయవ్యవహారమునకు ననువగుభాష హిం
దీభాష కాఁదగియున్న దని దేశీయమహాసభవారు నిర్ణయించి, వలయు ప్రయ
త్నముల సాఁగించుచున్నారు. భారతభూమి పైతృకధనమును, నానాభాషలకు
బుట్టినిల్లును నైనతల్లి సంస్కృతమునకు దగ్గఱసంబంధము గలిగినట్టియు, ఉర్దూ
మొదలగు నితరభాషలతోఁగూడ నెయ్యము గలయట్టియు, హిందీభాష కట్టి
పదవి లభించినను మనకుఁ గొదవ యేమియు లేదు. కాని యాసేతుశీతగిరి
పర్యంత మేకభాషాప్రచారవ్యవహారము సాఁగునంతవఱకు వివిధదేశభాషల
ప్రత్యేకాభివృద్ధి సంపూర్ణముగ జరుగవలసి యున్నది. విదేశభాషయందు
విద్యావిధానము నడుచుచుండుటవలన విద్యార్థులకమితశ్రమము కలుగుటయే
కాక విద్య వంధ్యాప్రాయ మగుచున్నది. మాతృభాషయం దున్నతవిద్య గఱ
పఁ బడినయెడల భావోత్కృష్టత గలిగి స్వతంత్రబుద్ధివికాసము జనించును. విద్య
ఫలప్రదాయినియై నాత్మవికాసములఁ జెందును. అట్టి యుత్తమజ్ఞానప్రదము ల
గు గ్రంథరాజములను మాతృభాషయందు రచింపవలయును. చాలభాగ మాం
గ్లమునుండి పరివర్తనము చేయవలసి యున్నది. వివిధభాషా పరిచయము గల
విద్వద్బృంద మీకార్యము నిర్వహింపఁ దగియున్నది. కేవలభాషాసాహిత్యవి
షయిక గ్రంథములు కాక సాంఘిక రాజకీయార్థిక వైజ్ఞానిక విషయములందుఁ
గూడ సర్వప్రాపంచికవిజ్ఞానమును కేంద్రీకృతము గావించి సులభముగ మాతృ
భాషను బోధింపఁ గలయుపాయముల నీసభవారు సాధింప సమర్థత గలవార
యి యున్నారని నాయభిప్రాయ మైయున్నది. ఇతరదేశములయం దిట్టిపరిషత్తు
లు కార్యక్రమము నడుపుచున్నవి. వంగీయసాహిత్య పరిషత్తు, హిందీసాహి
త్యసమ్మేళనము, ఉత్కళసాహిత్యపరిషత్తు, కన్నడసాహిత్యపరిషత్తు మొదలగు
నవి యెన్నియో కలవు. ఇట్టి పరిషత్తులు తమతమస్వకార్యముల నెఱవేర్చుకొ
నుటయే గాక యఖిలభారతకార్యనిర్వహణముకొఱకుఁ గూడఁ దోడ్పడవలసి
యున్నది. సాంఘిక రాజకీయ వైజ్ఞానికార్థికశాస్త్రవిషయములలో నఖిలభారత
వ్యవహారయోగ్యము లగు పారిభాషిక పదనిర్ణయములఁ జేయఁదగి యున్నది.
లేనియెడల నొకరాష్ట్రమందు వాడుక గాంచిన శాస్త్రీయపదములు వేఱొక
రాష్ట్రమునం దుపయోగకరములు గానేరవు. అట్లు కాకుండ నైరోపాదేశ

ముందు సర్వజాతీయ వైజ్ఞానిక విద్వన్మహాసభలు జరుపఁబడుచుండును. అట్టి (Inter National Scientific Congress) సభల నిర్ణయముల ననుసరించి వివిధశాస్త్ర ప్రవృత్తి జరుగుచుండును. అందువలనఁ బాశ్చాత్యనాగరకత గల దేశములం దంతట నేకరీతిగ విజ్ఞానము పెంపుచెంది యున్నది. వైద్యశాస్త్ర మునందుఁ గాని భౌతికశాస్త్రమునందుఁ గాని రసవాద భూగోళ జ్యోతిశ్శాస్త్ర ములయందుఁ గాని యేదేశమున విద్యగఱచినను నితరభాషాపరిచయమాత్ర మున నన్యదేశ పరిశోధనలను బాగుగ గ్రహించి లాభప్రాప్తిఁ జెంద నవకాశ ము కలిగి యున్నది. అట్టి సర్వదేశవ్యవహారోపయోగ మగుపద్ధతిని బండితు లన్నిశాస్త్రములకుఁ దగిన పారిభాషిక వ్యావహారికపదముల నిర్ణయింపవలసి నయావశ్యకత మనకును గలిగి యున్నది. ప్రాచీనసంస్కృతవాఙ్మయపరిచయము పూర్తిగాఁ గలిగి యున్నయెడల నిప్పు డర్థశాస్త్రమునందును రాజకీయవ్యవ హారములయందు ను గాక శిల్పములు, కళలు, వృక్షాయుర్వేదము, ఖనిజ శాస్త్రము, రేఖాగణితము, బీజగణితము, కృషిశాస్త్రము, పశుచికిత్స మొద లగు వివిధశాస్త్రములయందుఁ గూడ నాంగ్లాపేక్ష లేకయే యుత్తమవ్యవహార ము నడుప నలవి యగును. పంచాంగరచనయందుఁ బ్రవీణులగు జ్యోతిష్కులు చేయుగణితములు పాశ్చాత్యజ్యోతిశ్శాస్త్రవేత్తల సంకేతములతో సమన్వయ ముచేసి చూచినయెడల మాటలభేదము తప్పఁ గ్రియలు సరిపోవుచున్నవి. ఇట్ల నేకదృష్టాంతములు కలవు. కావున నిట్టి మహాదుద్యమమునకుఁ గూడ మనపరి షత్తు సంసిద్ధముగావలయు నని నాప్రార్థన యై యున్నది. మఱియు సంస్కృత మునఁ గలవివిధశాస్త్రముల ముందుగ నాంధ్రమున రచియింపవలసియున్నది. హిందీ మొదలగు భాషలలోనే సంస్కృతభాషాపరిజ్ఞానము పూర్తిగఁ బొందఁ గలసాధనములు పెక్కులు కలవు. శ్రీమద్భాగవతరామాయణాదిసర్వోత్కృష్ట గ్రంథములకు స్వతంత్ర హిందీభాష్యములును సుప్రసిద్ధవ్యాఖ్యానముల కను వాదములును బ్రకటింపఁబడి యున్నవి. అట్టిమహత్కార్యము లాంధ్రమున నింక ను యత్నింపఁ బడి యుండ లేదు. సాంఖ్య, న్యాయ, మీమాంస, వైశేషికా దిదర్శనము లన్నియు నాంధ్రభాషయందు రచియింపఁబడవలసియున్నది. ఆయు ర్వేద ధనుర్వేద గాంధర్వవేద నాట్యశాస్త్రాదిగ్రంథములును, సంస్కృతవాఙ్మయ మునఁ గలయష్టాదశవిద్యలు, చతుష్షష్టికళలు, యావదంగములతోఁ దెలుఁ గున వెలువడవలసియున్నది. ఆంగ్లవిజ్ఞాన మంతయు నాంధ్రమున నావిష్కరిం

పవలసి యున్నది. కావున మహనీయులారా! యిట్టి సర్వంకషోద్యమమునకు సమకట్టి కృతకృత్యుల రగువెరవు నరయుం డని వినయపూర్వకముగ వేఁడుకొనుచున్నాఁడను.

మఱియు నాంధ్రదేశమున వేదవిద్య మిక్కిలి ప్రశస్తిం గాంచి యున్నది; నానాఁటి కయ్యది క్షీణదశఁ జెందుచున్నది. వేదవిద్య మనపుణ్యములప్రోవు; ముక్తికిఁ జక్కి; భాగ్యములకు నిక్క; అద్దానిం గోల్పోవుట సర్వస్వమును గోల్పోవుట గాని వేఱొండు కాదు. వైదికవాఙ్మయము పెక్కు తెఱఁగులఁ బరిణమించి యున్నది. కల్పసూత్రములు, శిక్షలు, సంహితలు, గృహ్యాశ్రౌతసూత్రములు, ధర్మసూత్రములు, ప్రయోగగ్రంథములు, వానివాని భాష్యములు మొదలగు ననేకగ్రంథములు ఖిలమగుచున్నవి. అట్టివానిని సేకరించి, సవరించి, ముద్రించి, యాంధ్రీకరించి, ప్రకటించి, వేదరక్షణమును దన్మూలమున జగద్రక్షణమును జేయుట కూడ నొకకర్తవ్యాంశముగఁ బరిగణింప వేఁడుకొనుచున్నాఁడను. ఇప్పటివాఙ్మయస్థితినిబట్టి యాంధ్రమున వెలువడుగ్రంథము లన్నియు నాంధ్రసాహిత్యపరిషన్మండలివారివలన శోధింపఁబడి ప్రకటింపఁబడినయెడల గ్రంథకర్తల కొకగౌరవము ను బరిషత్తున కొకఖ్యాతి యు నాంధ్రలోకమునకు మేలును సమకూఱు నని నాయభిప్రాయమై యున్నది. ఇంగ్లాండుదేశము, ఫరాసుదేశము మొదలుగాఁ గల యితరదేశములయం దిట్టి కార్యనిర్వహణ మీదృక్పరిషత్తులవలన జరుపఁబడుచున్నది. సర్వవిధముల నట్టిసామరస్యమును సహానుభూతిని సాహచర్యము ను సంపాదించుటకుఁ దగిన ప్రయత్నములు జరుగవలసియున్నవి.

పైని వివరింపఁబడినవిషయము లన్నియు నాదర్శములుగా నుండుటయే గాక యాచరణరూపమున నచిరకాలమునఁ బరిణమింపఁగల వని నమ్ముచున్నాఁడను. శ్రీ సూర్యరా యాంధ్రనిఘంటువు శీఘ్రకాలమునఁ బ్రకటింపఁబడి యాంధ్రలోకముయొక్క కొఱఁతను బాపఁగలదు. అందువిషయమై మిక్కిలి జాగరూకతతోఁ బరిశ్రమము చేయఁబడుచున్న దని విని యానందించుచున్నారము. తత్సమపదములకు సంస్కృతనిఘంటువులసాహాయ్య మత్యావశ్యకమైయున్నది. ఆంధ్రదేశమున సంస్కృతభాషయం దసమానపాండితీమహిమ గలిగి సర్వతంత్రస్వతంత్రులై ప్రాచీననిఘంటువులకంటె నెన్నియో విశేషములఁ గూర్చి యొక్క బృహన్నిఘంటువును శబ్దార్థసర్వస్వ మను పేర ఘటియించి కీర్తిశేషు

లయిన శ్రీమహామహోపాధ్యాయ శ్రీపరవస్తు రంగాచార్యస్వాము లయ్యవార్లంగారి నిఘంటు వింకను ముద్రితము గాక యుండుట మనయాంధ్రలోకమున కొకకళంకముగా నున్నది. వారిసంతతివారివలన భద్రముగా నాయమూల్యగ్రంథము కాపాడఁ బడుచున్నది. భాషాపోషకులగు శ్రీ విక్రమదేవవర్మ మహారాజుగారివంటి మహారాజులు శీఘ్రకాలమున నట్టికొఱంతఁ బాయఁ జేయుదురనియు నమ్ముచున్నాఁడను.

ఆర్యులారా! ఇంతదనుక నా వెడఁగునుడువుల నాలించి విసువుచెందక వినినందులకు మ్రొక్కులిడుచున్నాను. కాలము స్వల్పము; కార్యము దొడ్డది; కడఁగువారు మహనీయులు; నేనజ్ఞుఁడను. అయినను సాహసించి తమయాదరణమువలనఁ దమయాంతరంగికకృపాప్రసారసంప్రేరితుఁడనై నాకార్యంబు నెఱవేర్చుకొంటిని. శేషము భవదధీన మయి యున్నది. నాగరప్రపంచమందంతటను నవనవోన్మేషమున నానావిధరూపంబుల విజ్ఞానచంద్రికలు ప్రసరించి సర్వజనాహ్లాదముం జేయుట గాంచి మతిచాపల్యమున నాంధ్రలోకమున నాంధ్రవ్యక్తికూడ వికసించి స్వీయతేజఃప్రభాపటలిచే దిక్కులనాక్రమించి భావిశుభోదర్కమునఁ బ్రోజ్జ్వలగతి భాసిల్లఁ గల దనునాసచే నింతదనుకఁ దమకు శ్రమ కలుగఁ జేసినందులకు క్షమింప వేఁడుకొనుచున్నాఁడను. ఉత్తమకార్యములెన్నఁడును ద్రవ్యలోపమునఁ జెడనేరవు. స్వీయశక్తిచే విఘ్నములఁ బాఱఁదోలి సాఫల్యముఁ జెందుశక్తిని సర్వశక్తుఁడగు భగవంతుఁడు వానియం దిమిడిచియున్నవాఁడు. కావున నఖిలాంధ్రసాహిత్యసంరక్షణోపాయహేతువును, దుస్సహదారిద్ర్యదుష్పీడితనిఖిలజన సంజీవన జీవాతువును, నైహికాముష్మికాది చతుర్విధపురుషార్థధర్మసేతువు నను నగు నీసభాకార్యమున వెనుకంజ వేయక దీక్షితులరయి యఖిలభారతలోక ప్రేమబద్ధదీక్షానిరీక్షితుల రయి, విశ్వకల్యాణానందసంధాయకసూరిజనాపేక్షితుల రయి పనికిం గడంగుఁ డని వేఁడుకొనుచు విరమించుచున్నాఁడను.

ఓం తత్సత్ -

# నేను ద్రుతప్రకృతికమా? కళయా?

— ఉభయభాషాప్రవీణ, ఏ. చల్ల గణపతిశాస్త్రిగారు, పిఠాపురము. —

---

గీ. వందన మొనర్తు వాంఛితార్థప్రదాతకు, నయ్యదెవరికో చెప్పశక్యంబుగాదు
దంపతి కటంచు నాయది తప్పుపదము, దంపతులకంచు నాక్యోక్తనువుకలదు.

అధ్యక్షమహాశయా! పండితాగ్రేసరులారా!

మన యీయాంధ్రవాఙ్మయప్రపంచమును సంగ్రహముగ విభజింపవలయు ననినయెడల రెండువిధములుగ విభజింపవచ్చును. అం దొకటి ద్రుతప్రకృతికములు, రెండు కళలు. మనభాషలో నాలుగుపద్యములను సరిగా వ్రాయవలయు నన్నఁ గళాద్రుతప్రకృతిక స్వరూపమును దెలిసికొని తీఱవలయు నను సంగతి యాంధ్రభాషాకోవిదులకుఁ దెలియనిది కాదు. ఈకళాద్రుతప్రకృతికములలో నంతర్గతము లగు కొన్నివిషయములలో నాంధ్రవైయాకరణులకు మతభేదములు గలవు. ఇప్పుడు బహుకాలమునుండియు వివాదగ్రస్త మగు "నేను" శబ్దమును గూర్చి విచారింపవలసియున్నది. 'నేను' అనుశబ్దము ద్రుతప్రకృతికమా? కళయా? అనుదానిని విమర్శించుటకు ముందు ద్రుతప్రకృతిక మన నెట్టిదో తెలిసికొనవలసియున్నది.

ద్రుతమునకుఁ బ్రకృతియైనది ద్రుతప్రకృతిక మనఁబడును. వాగనుశాసనోపజ్ఞం బగునాంధ్రవ్యాకరణమునందు "ద్రుతాఖ్యో నః" అని సామాన్యముగా నకారము ద్రుత మని చెప్పఁబడినది. దీనినే చిన్నయసూరి "నకారంబు ద్రుతంబు" అని యనువదించి మఱలఁ దమ సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణమున "విభక్త్యాగమచార్థో నుర్ద్రుతః" అని వివరించెను. ప్రౌఢవ్యాకరణకర్త "నకారం బసాధారణంబు ద్రుతంబు" అని సూత్రించి వివరణములోఁ బైచిన్నయసూరి యభిప్రాయమునే బలపఱిచియుండెను. చక్కంగ, కమ్మందేని ఇత్యాదులం దవ్యాప్తి వారణమునకై ప్రత్యేకముగా బిందువును విధించుకొనెను. "ద్రుతాఖ్యో నః" అని సామాన్యముగాఁ జెప్పి వాగనుశాసనులకుఁ దమ యభిప్రాయమందే తాత్పర్య మని నిరూపించి యుండెను. ఆసందర్భమున "నన్నిష్టసఖి" మొదలగు వాక్యములు విచారణీయములే యైనను వానిని విమర్శించుట కిది తావుగాదు.

ఈరీతిగా వాగనుశాసనాదులు ద్రుతస్వరూపమును జెప్పియుండిరి. కాని యది సరియైనది మాత్రము కాఁజాలదు. "గిరివ్రజ మన్పురంబు" "కన్పట్టు"

"మిన్వశౌ" ఇత్యాది బహులక్ష్యములతో సరళాద్యాదేశములు ప్రసక్తించుచుండు టచేతఁ గేవలసర్వనకారంబులును ద్రుతంబు లనుట తగదు. "విభక్త్యాగమచార్థో న ద్రుతిః" అని కాని "నకారం బసాధారణాంబు ద్రుతంబు" అని కాని యంగీకరించినయెడలఁ గన్గవ, చన్గవ, చన్గొండలు, కందోయి, మొద లగువానిలోని ప్రకృత్యవయవనకారమునకు ద్రుతత్వము సిద్ధింపదు గాఁబట్టి సరళాద్యాదేశము లెట్లు సిద్ధించును? పోనీ కన్గవ ఇత్యాదులందు సామాసికవికార మని కాని చిన్నయసూరి సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణములోఁ జెప్పినట్లు "కృతోల్లోప స్తనాదిభ్యః కపానాం తు గబా మతాః" అని కాని, కందోయి అనుచో సామాసికవికార మని కాని కన్నుందోయిలోని లుప్తశేష మని కాని యేదో రీతిగా సమాధానము చెప్పుకొంద మన్నను "కన్దెఱచి, చన్గుడిచి, చన్జేపి" ఇత్యాదిరూపములు కుదురవుగదా "ఎందే డెందము" అనుచో నెందేన్ అను శబ్దములోని నకారము ద్రుతముకాకుండుటచే లోప మెట్లు సిద్ధించును? ప్రయోగములనుబట్టి కొన్నియెడలఁ బ్రకృత్యవయవనకారముకూడ ద్రుతకార్యమును బొందు ననుకొన్నచోఁ గందోయిలోని క్లిష్టతయును "కృతోల్లోప స్తనాదిభ్యః కపానాం తు గబా మతాః" అను ప్రత్యేకవిధియు నక్కఱలేకయే యిష్టరూపములు సిద్ధించును. శబ్దానుశాసనుఁడు సామాన్యముగా "ద్రుతాఖ్యో నః" అని విధించుటలో నుద్దేశ మిదియే కానోపును. కనుకనే "వర్గయుక్సరళములు పరము లగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి" అను సూత్రము క్రింద కన్ + దోయి = కందోయి అని యుదాహరించుట సరిపోవుచున్నది. "సిద్ధి ర్లోకాద్దృశ్యా" అను సూత్రముచొప్పునఁ బ్రయోగములను బట్టియే సందేహనివారణము చేసికొనందగును. "విభక్త్యాగమచార్థో న ద్రుతిః" "నకారం బసాధారణాంబు ద్రుతంబు" ఈ రెండును బ్రపంచార్థ మని తెలియఁదగును. కాని చిన్నయసూరి "కృతోల్లోప స్తనాదిభ్యః కపానాం తు గబా మతాః" అనుచోట వృత్తిలోఁ జన్గొండలు అని వ్రాసి "అస్య ద్రుతత్వాభావా న్నానుస్వారః" అని ప్రకృత్యవయవనకారమునకు ద్రుతత్వమును నిషేధించియున్నాఁడు. కన్దెఱచి, చన్జేపి, ఇత్యాది రూపములు ప్రకృత్యవయవనకారము ద్రుత మనినఁ గాని సిద్ధింపవు, ఎందేని + డెందము అనుచో "అపి శబ్దార్థస్యైతః" అను సూత్రముచే నికారమునకు లోపము రాఁగా ఎందేన్, అనుచోఁ బ్రకృత్యవయవనకారము ద్రుత మనకున్న ఎందేడెందము అనుచో

నకారలోపము సిద్ధింపదు గదా? కావునఁ బ్రకృత్యవయవనకారము ద్రుత మనకతీఱదు. కనుకనే యహోబలపతి నుమాగమస్థలమున మకార మిత్సంజ్ఞక లది కానఁ బ్రకృత్యవయవత్వము సిద్ధింపఁగా ద్రుతప్రకృతికత్వము సిద్ధించుచున్న దని చెప్పియున్నాఁడు. అతివ్యాప్తి ప్రయోగంబులఁ బరి వారించుకొనఁదగును.

ఇంక నన్నయభట్టుమతమున ద్రుత మన నెట్టిదో విచారింతము. ద్రవతీతి ద్రుతః, అనువృత్త్తిచే ననవసరమైనపుడు మఱిగిపోవునది ద్రుత మనందగును. "ద్రుతాఖ్యో నః" అని నన్నయసూత్రము. వ్యాఖ్యాతలు నకారపుపొల్లే ద్రుత మను నుద్దేశముతో నుదాహరణము లిచ్చినట్లు కన్పట్టును. ఉత్వవిశిష్టనకారమే ద్రుత మనునెడల నెందేని + కొందము ఇత్యాదులయం దికారము లోపింపఁగా ఎందేన్ అనుచో నకారపుపొల్లే కాని నువర్ణము లేదు. కాన నిట నకారలోప మెట్లు? ఉత్వవిశిష్ట మనకున్నచో "ఎందే కొందము కందళింప" అను పెద్దనార్యుని ప్రయోగము సిద్ధించుచున్నది. అపిశబ్దార్థ స్త్వేతః" అనుసూత్రవ్యాఖ్యానమున నహోబలపతి "రామునే సీతనేఁ గొలిచెద" అను రూపము సిద్ధించుటకై యీసూత్రము చెప్పఁబడిన దని చెప్పి యీయభిప్రాయమునే తెలుపుచున్నాఁడు. అప్పకవి తఱచుగా ద్రుతమును చెప్పెడిచోటఁ బొల్లుద్రుతంబు, పొల్లనకారంబు అనివాడుచుండును. కాన నప్పకవియభిప్రాయము నిట్లే యున్నది. కాని కొన్నిచోటుల నహోబలపండితుఁడును నప్పకవియును "నుస్వరూపము" కూడ ద్రుత మని సూచించియున్నారు. అథర్వణాచార్యులు "స్వత్వం ద్రుతే షతా బిందు స్సమాసే తు ప్రయోగతః" అని దీనిచే "ను"స్వరూపము కూడ ద్రుత మని చెప్పియున్నాఁడు. "అవికారగతే త్వస్మి న్నపి సరళా ఏవ సంతి తే పరతః" అనుసూత్రవ్యాఖ్యానమున బిందువికారమును బొందకున్నను సరళములు వచ్చు నని చెప్పుచు నహోబలపండితుఁడు స్వత్వరూపము నీయకుండుటచే స్వత్వము ద్రుతరూపము కా దని గోచరించును గాని సూత్రమునకు, స్వత్వరూపము కూడ ద్రుత మగు నన్నయభిప్రాయము గలదు. బింద్వాదివికారమును బొందకున్నను ద్రుతముమీఁద, అనఁగా స్వత్వముమీఁద, నున్న పరుషములకు సరళము లగు నని యర్థమువచ్చును. ఇది యప్పకవికిఁగూడ సమ్మతమే యయినట్లు స్వత్వబిందువుల నుదాహరించి సంశ్లేషము నుదాహరింపకపోవుట స్పష్టపఱుచుచున్నది. కాని సూత్రకారుఁడు బిందులోపములను విధించినట్లు సంశ్లేషము విధింప లేదు. కాని "లుక్సంశ్లేషౌ నాచి" అనుసూత్రముచే ద్రుత

మునకు సంశ్లేషవిధానము జ్ఞాపిత మగుచున్నది. నన్నయమతమున యకారాది పదములు తెలుఁగునఁ గలవుగాన నపుడు యకారము హల్లగుటచేతను, ద్రుత మునకంటెఁ బరమైన యకారము "సర్వత్రాజ్వద్భావో యస్య ద్రుత ప్రకృతికేభ్యః" అనుసూత్రముచే నజ్వద్భావము పొందినను భూతపూర్వహల్త్వముచేతఁగాని యకారశ్రుతిచేతఁగాని దానికి లుక్సంశ్లేషరూపము లుండునేమో యనుసందేహమును వారించుటకై యట్లు నిషేధించియుండెను. బాలసరస్వతి కలిగెన్ యెన్మో, కలిగెయెన్మో, అనురూపములు కాకుండుట యీసూత్రమునకు ఫల మని చెప్పియున్నాఁడు. అచ్చుపర మైనచో సంశ్లేషము రా దనుటచే హల్లు పర మైనచో సంశ్లేష మగు ననువిధి జ్ఞాపిత మగుచున్నది. అది యు ను గాక "ప్రాప్తి పూర్వకోహి నిషేధః" అనునభిజనోక్తిచొప్పున హల్లు పర మైనప్పుడు సంశ్లేష విధానము లేకున్నను అచ్చు పరమగునప్పుడు నిషేధించుట హల్లు పరమగున పుడు సంశ్లేషవిధానముందుఁ బర్యవసించుచున్నది. కాఁబట్టి అవికారగతే అను దానికి బిందుసంశ్లేషరూపవికారమును బొందకున్నను అని కాని, తస్మిన్నపి అనుచో అపిశబ్ద మనుక్తసముచ్చాయక మని కాని జ్ఞాపితసముచ్చాయక మని కాని చెప్పవలయును. దీనినిబట్టి నన్నయకు "ను"స్వరూపముగూడ ద్రుత మను నభిప్రాయము గల దని గ్రహింపఁదగియున్నది. అహోబలపతి యు ను "అత్ర నకారస్య స్వత్వ సంశ్లేషా వుభా వపి సంభవత ఏవ" అని నుడివియున్నాఁడు. మఱియు శబ్దానుశాసనుఁడు కళలను జెప్పునపుడు "త్రిజ్మధ్య శేషషష్ఠీ సు స్త్ర స్త్వ న వచనీయజవిభక్తీః" అని ప్రథమేతరవిభక్తులు ద్రుతప్రకృతికము లని చెప్పి యున్నాఁడు. "కర్మణి ల ను న యో భవే ద్వితీయా తు" అను సూత్రముచే ద్వితీయావిభక్తి ప్రత్యయము "ను" స్వరూప మని కదా తేలుచున్నది. అట్టిచో ద్వితీయావిభక్తి ద్రుతప్రకృతిక మని యన్నవానసుశాసనుని యభిప్రాయము "ను" అనియేగదా. మఱియు "ని" అనునది ద్వితీయావిభక్తి గనుక నే యది ద్రుతప్రకృతిక మగుచున్నది. మధ్యమపురుషభిన్నము లగుధాతువులలో నేకవచనములు ద్రుతప్రకృతికములు "ఉత్వేయు తే వనకారే స్యాతాం మధ్యమో త్తమైకవచనానాం" అనుసూత్రము "వత్తును, వచ్చితిని" ఇత్యాదులందు "ను" స్వరూపమే ప్రత్యయ మని చెప్పుచున్నది. కాఁబట్టి "త్రిజ్మధ్యభిన్నములు ద్రుత ప్రకృతికము లన్ననన్నయ యభిప్రాయము "ను"స్వరూప మనియే గదా. నకారపుపొల్లే ద్రుత మైనచో నివి ద్రుతప్రకృతికము లన్నసంగతి యెట్లు సంబం

ధించును ? నకారపుపొల్లే ద్రుతమని యొప్పుకొనినచో "కవిభల్లటైః క్రియా ణాం నామ్నాం చోపలోప ఇష్యతే హ్యాన్తః" అనుసూత్రముచే "ఉకార"లోప మును తెలిసికొని యప్పుడు ద్రుతమని యనుకొనవలయును. ఆపైని నకారపు పొల్లే ద్రుత మైనచో స్వాస్థ్యమునొందిన ద్రుతకార్యములు చేసిన "రోహిణి యొండె నొండె ను న-సంభతి (భా. విరా. 1-223) మొదలగుభారతప్రయో గము లెట్లు సిద్ధించును ? "ను" అను ప్రకృతిచే "న్" అను వికృతికి గ్రహణ మున్నను "న్" అను వికృతివల్ల "ను" అను ప్రకృతికి గ్రహణము రాదు. "క్వచి ద్వికృతిః ప్రకృతిం గృహ్ణాతి" అను పరిభాషయొకటి కలదు కాని యది వికృతి ప్రకృతిని గ్రహింప దను "గ్రహిజ్యా" సూత్రభాష్యమందు నిరాకరింపఁబడి యుండుటచే నాపరిభాష ప్రమాణము కాఁజాలదు. సంస్కృతవ్యాకరణోక్త మగున్యాయాదికము తెలుఁగునకు ప్రసరింప దని క్లిష్టముగాఁ జెప్పుకొన్నప్పు డైనను "వచ్చుచున్నాను" ఇత్యాదులందు "ను" అనునది ద్రుతప్రకృతిక మెట్ల గును. వత్తున్, వచ్చెన్, ఇత్యాదులలో నుత్వలోపము వచ్చెను గాన నట ద్రుతత్వము సంభవించును గాని వచ్చుచున్నాను ఇత్యాదులందు ఉత్వలోపము సంభవింపదుగదా ? ఉన్నా నిత్యాదులం దుత్వలోపము లే దని ప్రౌఢవ్యాక రణకారుఁడు చెప్పియున్నాఁడు. "వచ్చితిని" అను-చోఁ గవిభల్లటసూత్రము నకుఁ బ్రవృత్తియే లేకుండుటచే నది ద్రుతప్రకృతిక మెట్లగును. విశాలదృష్టి తోఁ బ్రథమోత్తమపురుషైకవచనములకు ద్రుతప్రకృతికత్వము చెప్పిన సూత్ర కారునియభిప్రాయమును సంకుచింపఁజేయుట భావ్యముకాదుగదా ? "వచ్చి తిని" ఇత్యాదులందు "ను" అనునదే ప్రత్యయముగాన నాదేశము స్థానివంటి దగుటచే ద్రుతప్రకృతికత్వము గలిగి "పద్యభేదావసానేతు శ్లిష్టతా నస్య కథ్యతే" అనియు "పద్యావసానే సర్వేషాం స్వత్వం నాప్నోతి సాధుతాం" అని యు, "వాక్యాంతగతపదానాం చ" అని యు మొదలగు సూత్రప్రామా ణ్యమువలన సంశ్లేషరూపములు సిద్ధించును. ద్రుతప్రకృతికత్వము గలిగినతరు వాతనే గదా "వచ్చును" మొదలగువానిలోని చివరియుత్వము లోపముగలు గుట. ఈయభిప్రాయమునే "హలవసానంబులు పరం బగునపుడు ద్రుతంబున కేని ద్రుతస్వరంబున కేని లోపంబు విభాష నగు" అను చిన్నయసూరిసూత్ర ము ప్రకటించున్నది. "ఇంతి యుఁ బతియు ను నెవ్వరొక్కొ (భార. విరా. 2-30) ఇత్యాదులలో ద్రుతముమీఁద మఱల ద్రుతంబు వచ్చినది. నకారపుపొల్లే

ద్రుత మైనయెడల ''పతియు న్ను'' అని గ్రామ్యరూపముగా నుండవలసి వచ్చును. ''ద్రుతా ద్రుతిః క్వచి చ్చాత్ర దృశ్యతే కవిభాషితే'' అని ద్రుతము కంటె ద్రుతము వచ్చు నని చెప్పిన యథర్వణునియభిప్రాయము ''పతియున్ను'' ఇత్యాదిరూపము లుండు నని కాదు గదా. ''మదీయభాషణ మెన్నఁడు న్నేని మోఘంబుగాదు'' అను భారతప్రయోగమును ''నోవా ద్విత్వం క్వచి ద్దీర్ఘం పరప్రాణేన సంగతేః'' అను నథర్వణకారిక కుదాహరించిన యహోబలపతియభిప్రాయ మిదియే యై యున్నది. ద్రుత మన ''ను'' స్వరూపము కూడ నగుటచే తనే ద్వితీయాచార్యుఁడు ''ద్రుతస్య హాలి బిందు స్స్యా చ్ఛిష్టత్వం చ క్వచి త్స్వతా'' అని యు నుద్ఘోషించియున్నాఁడు. అప్పకవి ''చెన్ను, పులిజున్ను, దొరపన్ను'' మొదలగుపదములు ద్రుతప్రకృతికములు కా వని చెప్పి యీయుద్దేశమునే తేటపఱిచెను. కాని యచట ''ద్వితీయావిభక్త్యంతము లగు నిన్ను నన్ను తన్ను శబ్దములు కూడఁ గళ లనుటలో నుద్దేశమేమో తెలియదు. కాఁబట్టి ''ద్రుతాఖ్యో నః'' అను సూత్రమునకు అప్పకవి, యహోబలపతి, మొద లగువారు చెప్పినట్లు ''ను'' స్వరూపముకూడ ద్రుత మని గ్రహించుట యుక్తము. నన్నయసూత్రములకు వార్త్తికము లనఁదగు నథర్వణకారికలు సంప్రదాయముగా ''ను'' స్వరూపముకూడ ద్రుత మని బోధించుచున్నవి.

అర్వాచీనులు కొందఱు ద్రుతస్వత్వముమీఁద సరళాదేశ మెచ్చటను గనుపట్టుట లేదనివక్కాణించుచున్నారు. ఇదిసకలపండితసమ్మతి విరుద్ధమగుసంగతి. వారు భారతాదులలోని ద్రుతస్వత్వముమీఁది సరళాదేశములను దిద్దుదు రనుటలో సందేహమించుకంతయు నుండదు. వారు ప్రాసస్థలములలో సరళాదేశములున్నఁ గాని యంగీకరింపరు. ద్రుతస్వత్వముకంటె ద్రుతకార్యముల నంగీకరించి ద్రుతసంబంధికార్య మగుసరళాదేశము నంగీకరింపకపోవుట యెంతయుచితమో విపశ్చిదగ్రేసరు లూహింతురుగాక. ధారాళముగను హృదయంగమముగను గవిత్వము చెప్పు నేమహాకవి మొదటిపాదమునుండి రెండవపాదములోనికిఁ గాని పాదములలో యతిస్థానముదగ్గఱకుఁ గాని ద్రుతస్వత్వరూపమును లాగుకొని వచ్చి యటఁ బ్రాసానుగుణముగా సరళాదేశము చేయును? ఇట్టియనౌచిత్యమునే ''పద్యావసానే సర్వేషాం స్వత్వం నాప్నోతి సాధుతాం'' అను నథర్వణువచనము సూచించుచున్నది. ఇట్లైనను స్వత్వముమీఁద సరళాదేశము చేసిన ప్రదేశములు లేకపోవు కాని బహువిరళముగా నుండును. ద్రుతస్వత్వముమీఁద

సరళాదేశము రానియందులకుఁ బ్రబలప్రమాణమును జూపవలసినబాధ్యత వారియం దున్నది. ద్రుతస్వత్వముమీఁద సరళాదేశములు వచ్చుటకుఁ గొన్ని ప్రమాణములు ముందు తెలుపుచున్నాను. అప్పకవి "అధికారగతే తస్మిన్నపి సరళా ఏవసంతి తే పరతః" అనుసూత్రమున కుదాహరణములుగా "తం ద్రి షం పునసుగాంతారమున కేగి" "అతివతోడను జేకుటాకుటింట వసి చె" "భామినిని బట్టుకొని పోయి" అని ద్రుతస్వత్వముమీఁద సరళాదేశము వచ్చినరూపము లిచ్చియున్నాఁడు. ఇట దిద్దుటకు వీలున్నను ద్రుతస్వత్వము మీఁద సరళాదేశము వచ్చుట కుదాహరించుటచే దిద్దుట కుచితము. గౌరన హరిశ్చంద్ర ద్విపదలో "నుసుఁదీఁగనాచు తే-నూఁగారుగాఁగ; నెనయు జక్కినలు పాలింపనుగాఁగ" అనుచో ద్రుతస్వత్వముమీఁద సరళాదేశము చేయఁబడినది. పాలింపనుగాఁగ అనుచో సముచ్చయార్థకద్రుతస్వత్వముమీఁద సరళాదేశము చేయకున్నచో "గాఁగ" "గాఁగ" అనువనుప్రాసము తప్పుచున్నది. అనుప్రాసము నియతము కాకపోయినను బైనుదాహరింపఁబడిన రెండుపాదంబులనే కాక పూర్వోత్తరపాదంబులందు "గాఁగ" "గాఁగ" అనియుండ దీనిలో నొక్కదానిలో "కాఁగ" అని దిద్దినచో బ్రక్రమభంగము గలుగును. కావున నిట ద్రుతస్వత్వముమీఁద సరళాదేశము చేయఁబడిన దనియే చెప్పి తీరవలయును. మఱియు నప్పకవీయమున "నగరమునకు మహీంజాత-నుగొనివచ్చె" (అప్ప 5. 126) అనునది "అధికారగతే తస్మి న్నపి సరళా ఏవ సంతి తే పరతః" అనుసూత్రముక్రింద నుదాహరణముగా నీయఁబడినది. ఇట్లు ద్రుతస్వత్వముమీఁద సరళాదేశములు మార్పరానివై కనుపట్టుచుండ ద్రుతస్వత్వముమీఁద సరళాదేశరూపములు ప్రాచీనలక్ష్యలక్షణసమ్మతప్రమాణములు కనుపట్టకున్నవియనుటలో నుద్దేశము తెలియకున్నది.

తాను నేను పదంబులు ద్రుతప్రకృతికము లని చాలమంది పండితుల యభిప్రాయము ను, బాలవ్యాకరణాదిగ్రంథోక్తము ను నగుటచేఁ గళ లను సందేహ మేల కలిగెనో చెప్పవలసియున్నది. "కవదొనలును గాండీవము, నవల నిడంబనుపు ముంద ఆరదము డిగు మే, ను విదప డిగిమెద" (భార.శల్య.2ఆ) అనుభారతపద్యమున నేనుశబ్దముకంటెఁ బరమగు పిదపశబ్దములోని పకారము వకార మైనఁ గాని ప్రాసము సరిపోదు. కాఁబట్టి నేనుశబ్దము కళ యగును. అప్పుడు గసడదవాదేశము వచ్చును గానఁ బ్రాసము సరిపోవును. ద్రుతప్రకృ

తికమే యైనచో నేను విదప నని యుండును. అప్పుడు ప్రాసభంగ మగును. అందువలన నిది కళయా? అని సందేహము గలుగుచున్నది. ఈ "యేనువిదప" అనునది యాంధ్రప్రశంసితలోకంబుడు గలఁచివైచుచున్న ట్టందఱకుఁ దెలిసినదే. దీనివిషయమున నాకుఁ దోఁచినయభిప్రాయమును విన్నవించుకొనుచుంటిని.

సకలభాషానుశాసనుఁ డగునప్పయభట్టారకుఁడు "గసడదవా స్యుః ప్రథమామాత్రా దాత్మాస్మదో ర్విన్నె వైతే" అను సూత్రముచేఁ బ్రథమావిభక్తిమాత్రముకంటెఁ బరములైన పరుషములకు గసడదవలు వచ్చునని చెప్పుచుఁ బ్రథమావిభక్త్యంతము లగు తాను నేను శబ్దంబులకు మాత్రము రావని నిషేధించెను. ఇచట నర్వాచీనులు ద్రుత మనఁగా ద్రుతినిఁ బొందునది యని యన్వర్థనామముగఁ జెప్పుచు ఉకారలోపము గలిగినపుడే నేను శబ్దము ద్రుతప్రకృతిక మనియు, ఉకారలోపము గలుగనపుడు కళ యనియు ఘోషించుచు "ఏనువిదప" అను తిక్కనప్రయోగమును జూపుచున్నారు. నేనింతకుఁ బూర్వము ఉత్వవిశిష్ట మగునకారముకూడ ద్రుత మని నిరూపించియుంటిని. కావున నేను తాను శబ్దంబులందును ఉత్వవిశిష్టము ద్రుత మనుట యుక్తము. నేన్ అనునదియే ద్రుతప్రకృతిక మైనచోఁ బరుషములు పర మగునపు డొక్కయర్థబిందురూపమే ప్రయోజన మని చెప్పవలయును. "దీర్ఘాచ్ఛే త్తః డపవ సజ్ఞేయః" అనుటచేఁ బూర్ణబిందువు రాదు. "వినా ద్వితీయం స్యాదస్మదాత్మనోః స్వం తయోరపి" అను ద్వితీయాచార్యోక్తిచేతను భారతప్రయోగములను బట్టియు సంశ్లేషరూప ముండదు. సరే, స్వత్వముమీఁద సరళాదేశమును వా రంగీకరింపరుగదా. ఒక్కయర్థబిందురూపమునకై సంజ్ఞావిధానము గౌరవము గదా. అంచు ఇత్యాదులందువలె "తస్య స్యాచ్చ పూర్ణబిందు రపి" అని ప్రత్యేకముగాఁ జెప్పినట్లు ఒక్కబిందువును విధించుకొన్నచోఁ బ్రక్రియాలాఘవము గలదు. సరళస్థిరములు పర మగునపుడును ఒక్కలోపమును విధించుకొన్నచో సూత్రలాఘవమే కాక ప్రక్రియాలాఘవముగూడఁ గలదు.

మఱియు వాగనుశాసనుఁడు "వాత్మాస్మదో ర్ద్రుతస్య స్యాల్లుక్" అను సూత్రముచే సరళస్థిరములు పరమగునపుడు నేను తాను శబ్దములద్రుతమునకు లోపము వికల్పముగా వచ్చునని చెప్పియున్నాఁడు. నకారపుపొల్లె ద్రుత మైనచో లోపము వికల్పము కావున 'నేవింటి' ననియే కాక 'నేన్ వింటి' నని

యనిష్టరూపము కావలసివచ్చును. నుస్వరూపమే యిక్కడను ద్రుత మని చెప్పినచో నేవింటిని, నేనువింటి, ననునభీష్టరూపములు నిర్బాధక మగుటయే కాక యనిష్టనివారణము కూడ నగును. ఈసూత్రవ్యాఖ్యానమున నహోబలపతి తానుఘనుఁడు, తాఘనుఁడు, నేనువింటిని, నేవింటి నని యుదాహరించెను. ఈయుదాహరణములు నేను తానుశబ్దములలో నుస్వరూపముకూడ ద్రుత మను నభిప్రాయమునే స్పష్టీకరించుచున్నవి. నకారపుపొల్లు ద్రుత మని యనుకొన్నపుడు తాన్ఘనుఁడు ఇత్యాద్యనిష్టరూపములను శంకించుకొని "యద్వా" అని పక్షాంతరమున సమాధానము చెప్పుచు "లుగ్వాద్రుత ప్రకృతికా త్పరతః పరుషే సరళేచ నస్య స్యాత్" అను సూత్రముచేతనే లోపము గలుగుచుండఁగా మఱల నీసూత్ర మెందుల కని పూర్వపక్షము చేసికొని యీ సూత్రసామర్థ్యమున సంశ్లేషబిందువులు రావని సమాధానము చెప్పి దీనికిఁ బ్రమాణముగా "వినా ద్వితీయం స్యా దస్వదాత్మనో స్స్వంత యో రపి" అని యథర్వణకారికను జూపియున్నాఁడు. కాని యీసందర్భమున "నలోలో శ్చ" అను సూత్రములోని చకారమువలన నేనుశబ్దము యొక్క యుకారమునకు లోపము రాఁగా ద్రుతప్రకృతిక మగును గాన నకారమునకు దీనిచే లోప మగు నని చెప్పెను. ఉకారలోపము వచ్చినపిదప ద్రుతమైనచోఁ బై సూత్రముచే వికల్పముగా లోపమువచ్చును గదా, అపుడు పూర్వోక్తమగు సంశ్లేషబిందురూపము లుండ వను వాక్య మెట్లు సరిపోవును ? కాన నహోబలపతియభిప్రాయ మెద్దియో తెలియదు. అథర్వణుఁడు సంశ్లేషమును నిషేధించుటచేఁ బారిశేషికన్యాయముచే మిగిలిన స్వత్వాదులు రావచ్చును. "దీర్ఘా చ్ఛే త్ఖండ ఏవ స జ్ఞేయః" అను దానిచేఁ బూర్ణబిందు వెట్లును రాదుగదా? ముక్కునూపుమన్నఁ దలచుట్టు త్రిప్పిచూపినట్లు అర్ధబిందులోపములను విధించుటకు మాఱు సంశ్లేషము రాదని చెప్పనా ? మఱియును "వాత్మాస్వదో ద్రుతస్య స్యాల్లుక్" అనుసూత్రములోని "వా" పదము నేనువింటి, నేవింటి, నను స్వత్వలోపరూపములనే కాని "నేన్ వింటి" అనుసంశ్లేషరూపమును జెప్పుటలేదు. నకారపుపొల్లు ద్రుత మని చెప్పినపక్షమున నీసూత్రము సంశ్లేషరూపమును గూడ బోధింపవలసియుండును. నేన్ వింటి ననుసంశ్లేషరూపము సర్వపండితవిరుద్ధ మైనది గదా ! నేన్ అనునదే ద్రుతప్రకృతిక మని యాగ్రహమైనచో నేన్ వింటి ననునవిష్టరూపమును గాని, "వాత్మాస్వదో ద్రుతస్య స్యా ల్లుక్" అనుసూత్రములోని వాపద

మునకు నైయర్థ్యమును గాని యంగీకరించితీరవలయును. ఇంకను నేయపి శబ్దముచేఁ గాని యేచకారముచేఁ గాని వికల్పార్థమును జెప్పుట క్లిష్టముకాని వాశబ్దమునకు స్పష్టముగా వికల్పార్థము చెప్పుటలో బాధలేదు. సరిగదా మఱియొకయేయర్థమును జెప్పుటకు వీలులేదు. కాఁబట్టి యుత్వవిశిష్ట మగు నకారమే ద్రుత మని నేను తాను శబ్దములందుఁ గూడ నంగీకరింపవలెను. కనుకనే తానుఘనుఁడు, తాఘనుఁడు, నేనువింటిని, నేవింటి నని యహోబలపతి యిచ్చినద్రుతలోపోదాహరణములు సరిపడుచున్నవి. నేను అనునదియే ద్రుతప్రకృతికము కాన సూత్రకారునిపదము లన్వర్థము లగును. లేకున్న వాగనుశాసనులసూత్రమునందు నిరర్థకతాదోష మారోపింపవలసియుండును.

ఇంకను నన్నయభట్టీయవ్యాఖ్యాకారులలో నప్పకవి "వాత్మాస్మదో ర్ద్రుతస్య స్యాల్లుక్" అనుదాని నాంధ్రీకరించుచు:—

"క. శ్యామాంగ! నేను దానను, నీమాటలకొనద్రుతంబు-లేగు నిలుచు హా
ల్లామీఁదనుండు నప్పుడు, నేమనుదును నేనుమనుదు-నీకృపననఁగన్"

అనుపద్యములో ద్రుతలోపాభావపక్షమున "నేను మనుదు" నని యుదాహరించి నేను అనుస్వత్వరూపము ద్రుత ప్రకృతిక మని స్పష్టముగా నంగీకరించుచున్నాఁడు. లేనిచో నేన్మనుదు ననిసంశ్లేషరూపమునే యుదాహరించియుండును. మఱియు "వాత్మాస్మదో ర్ద్రుతస్య స్యాల్లుక్" అనుదానియాంధ్రీకరణమున "శుకమునిస్తుత! ద్రుత-ప్రకృతులౌ నేను తా। ననురెండుదక్కంగ" అనుచోట "ద్రుతప్రకృతులౌ" అనువిశేషణముచే ఉకారద్రుతిని బొందిన నేన్ తాన్ అనునవియే ద్రుతప్రకృతు లనియు ద్రుతిని బొందని నేను తా ననునవి ద్రుతప్రకృతులు కావనియు భ్రమింపరాదు. ద్రుతినిబొందకున్నను ద్రుతిస్వభావమును మాత్రము గలిగియున్నచో ద్రుత మనఁబడును. అట్టిద్రుతమునకుఁ బ్రకృతియైనది ద్రుతప్రకృతిక మగును. కనుకనే "నగరమునకు మహీంజాత-నుగొనివచ్చి" అను స్వగ్రంథస్థోదాహరణము కుదురుచున్నది. ద్రుతప్రకృతులౌ అనువిశేషణము నేను తా ననునవి ద్రుతప్రకృతికములు కావుననే ప్రథమావిభక్త్యంతము లయ్యును గసడదవాదేశమును బొందవు, అనుహేతుప్రదర్శనముగా గ్రహించునది. లేక వస్తుస్థితికథన మని యైనను గ్రహించునది. నకారపు పొల్లు ద్రుత మనువారు కూడ "పొల్లద్రుతంబు, పొల్లనకారంబు" అనునప్పకవి వాక్యములలోని పొల్ల అనువిశేణమున క్లిష్టే గదా సమాధానము చెప్పవల

యును. కావున నప్పకవియభిప్రాయమును " నేను తాను " అను స్వత్వరూపములును ద్రుతాంతములేయని తేలుచున్నది.

మఱియు శ్రీకృష్ణభూపాలీయమునఁ జంద్రకకవి "తాఘనుండైన మనుజుండు-తానుదానె। నేఁ జదివి ప్రౌఢనైతిఁ-నేను జెప్పి" అని స్వత్వరూపములనే ద్రుతాంతములనుగా నుదాహరించియున్నాఁడు. ఇట్లు ప్రాచీనలాక్షణికులే కాక యర్వాచీనలాక్షణికులుకూడ నేనుతానుశబ్దములను ద్రుతాంతములుగనే యంగీకరించియున్నారు. చిన్నయసూరి తానునేను శబ్దములకు సంశ్లేషము లేదని తాఁజదివె, తానుజదివె అనియుఁ, ప్రౌఢవ్యాకరణకర్త ప్రత్యయాగమావ్యయాత్మకమై యుత్వవిశిష్ట మగునకారము ద్రుత మని చెప్పి ప్రత్యయాత్మకమైనదానికి "నేను" అనియు నుదాహరించెను. ఇంకఁ బ్రయోగము లెట్లున్నవో పరికింతము. భారతాదిగ్రంథములలో నెల్లయెడలను స్వత్వముమీఁదనే కాక నేనుతానుశబ్దములమీఁదను సరళాదేశములే చేయఁబడినవి. కాని యవి ప్రాసస్థలములం దున్ననే కాని యంగీకరింప రనుట నిశ్చయము. విరాటపర్వములో "క. చనువానిచేయుకార్యం, బున కడ్డము సొచ్చి నేను-పున మెలఁగుచుఁ దా, నును బయిఁబూసికొనుటఁదన। మును మెలఁగిన మెలఁకువకును-ము ప్పగుఁబిద పన్॥ (1-125) అనుపద్యములోఁ దానును అని ద్రుతప్రకృతికముగా వాడఁబడినది. ఇట సముచ్చయము కాదు. పాదపూరణ మని త్రోసివేయుట యుక్తము గాదు. ఇట్లే పాంచాలి కీచకవధానంతరమున నర్జునునితో సంభాషించునపుడు "అట్లుకాక యింత యననేల నీమది తెలుఁగు గొంత యేను-నెఱుఁగకున్న। దానఁగాదు (భార. విరా. 353) అనిచెప్పిన యీపద్యమున ఏను అనునది ద్రుతప్రకృతికముగాఁ బ్రయుక్తము. సముచ్చయము మాత్రము కాదు. మఱియు "ము। దఱి నిను బాహ్లికున్ గురుని-దక్కటివారిని నమ్మి యేనునేడ్తెఱ నని సేయఁ బూనితిఁ గ-డిందిమగంటిమి తోడు సాలదే" (భార. ఉద్యో. 2-294) ఇట సముచ్చయ మని చెప్పఁగలనుపడదు. "అంబవృత్తాంత మరయంగ - నను దినంబుఁ। దగినవారలఁ బుచ్చుచుఁ-దలఁకుచుందు। నేను నదియాదిగాఁ జింత నేపువర్తి। ప్రవర్తియుండియు రాజుల-నుక్కునడఁతు" (భార.ఉద్యో 4 361) ఇట సముచ్చయ మని యెట్లు చెప్పనగును? పైనుదాహరింపఁబడిన భారతప్రయోగములేకాక యితరమహాకవిప్రయోగములును గలవు.

"కం॥ హానుమంతుం డిపు డేమని । వనితారత్నంబుతోడ - వదరునో నేనున్ । వినిమొదఁగా కని యొకమఱుఁ। గున నుండెన్ (రామాయ. 6.146)

ఈపద్యమున నేనున్ అనుచో సముచ్చయము కా దని స్పష్టము. పాదపూరణము గాదు. "వదరునొక్కో నే వినియెద" ననినచోఁ బాదపూరణ మక్కఱ లేకయే సరిపోవుచుండఁ గవి యట్లు పాదపూరణముగాఁ బ్రయోగించియుండఁడు. "ఏనును మునివరుఁ గాంచినయానెలవున కేఁగి (షోడశకుమారచరిత్రము. 4. 96) అని యనంతామాత్యుఁడు ప్రతాంతముగాఁ బ్రయోగించెను. కేవల మీపద్యమును విన్నచో సముచ్చయముగాఁ దోఁచునుగాని యీసందర్భమును గాంచినచో సముచ్చయము గాఁ దోఁపదు. విస్తరమగు ననుభీతిచే నిటఁ దెలుపలేదు. "అగుచుఁ జననితాంతాకులీభవత్ప్రాణవాయువులతో వనరెడు నేను నివ్వార్తఁజెప్ప" (రాఘవ పాండ 4 38) అను రాఘవపాండవీయపద్యమున నేను నివ్వార్త అనుచో వ్యాఖ్యాకారుఁడు ఏను అని వ్రాసి నేను అని యర్థము వ్రాసెను. ఇది ప్రతాంతము కాకున్నచో ఏనున్ అని వ్రాసి నకారము పాదపూరణ మని యనవలయునుగదా, ఇదే రీతిగా వసుచరిత్రమున "ఈమహితాంగుళీయ ము! ర్వీశుఁ డొసంగి ! ఢీలిపె-నేనును వచ్చితి నీక్షణంబునన్" అనుపద్యమునఁ టీకాకర్త నేనును వచ్చితి ననుచోట నేను వచ్చితి నని యర్థము వ్రాసెను. ఇంకఁ బ్రాచీను లగుమహాకవులయొక్క లక్ష్యలక్షణపద్ధతి పరిశీలింపఁగా నేను తాను శబ్దములు ప్రతప్రకృతికము లని స్ఫుటముగాఁ దెలియుచుండ వీటిని గళ లనుట యెంత యుచితమో విమర్శకాగ్రేసరు లూహింతురుగాక.

ఇంక "నేను విదప" ప్రయోగగతి యెట్లో యాలోచింతము. "ఏన విదప" అని గాని మఱియొకరీతిగాఁ గాని దిద్దుట యుక్తము గాదు. కవియుద్దేశ మెద్దియో గ్రహించి సరియగుసమాధాన మూహింపవలయును గాని మనచేతిలోఁ గల మన్నదని మన చిత్తమువచ్చినట్లు దిద్దుట భావ్యముగాదు. వ్రాఁతప్రతులలో ఏను బిదప, ఏను పిదప, అనియును గనిపించుచున్నవని కొందఱు చెప్పుచున్నారు. ఏను వెనుక నని పాఠాంతరమును గలదు. అప్పు డేవిధమైన బాధయును లేదుగదా. ఇంక నప్పకవి సంధిగతప్రాసమున కిచ్చిన యీ"యేనువిదప" అనునుదాహరణమును గుదుర్చవలె నన్నచో నిట్లు చెప్పవలయును. ఏనుబిదప అనియున్నపుడు నిర్బాధముగా నప్పకవి సంధిగతప్రాసోదాహరణము సరిపోవును. "వబయో రభేదః" అని యున్నది గనుకఁ బ్రాసమును సరిపోవును. అప్పకవి వబలకభేదయతి చెప్పి తద్ద్వారా యభేదవర్గయతి చెప్పి వకారమునకును పవర్గునకును యతి సిద్ధింపఁజేసెను. పవలకుఁ బ్రాసము భారతకవుల కిష్టమై

న్నట్లు " అవసరమ్మున నయి వ్యాసుఁ డేతెంచె నంత నుత్తపసి। కపిలగడ్డంబును " అనుపద్యమువలనఁ దెలియుచున్నది. కపిలగడ్డంబు ఇత్యాదికముగా దిద్దినచోఁ దవిసయత్నమున యగుచోఁ బద్యసారస్యము చెడును. కావున నభేదయతి యభేద వర్గయతులవలెనే యభేదప్రాసము నభేదవర్గప్రాసము నంగీకరించినచో నిష్టసిద్ధి యగును. పవప్రాసము నంగీకరించుటలో మూలము బవప్రాసమే గదా, పవప్రాసము నంగీకరించి బవప్రాసము నంగీకరింపకపోవుటలో హేతు వెవ్వియుఁ గానుపింపదు. ద్రావిడభాషలలో వర్గప్రాసము గల దని భాషాశాస్త్రవిదులు చెప్పుచున్నారు. నేను పిదప సమపాతమును విచారింతము. "పచస్కంబెట్టువాఁడనే పాండవులన్ " అనుచోఁ దిక్కనకవి నకారాంతములు నాంతములును గానఁ బ్రథమాంతకార్యము కూడ రావచ్చు ననెను. అది సకలలాక్షణికవిరుద్ధముగాన నుపేక్షణీయము. పెట్టువాఁడనే అనుచో ఏన్ అని విఱుదీయుటలో సారస్యభంగము గల దని సకలపండితులకును విదితమే. ఏతాదృశ ప్రయోగములు చాలమంది మహాకవులు ప్రయోగించియున్నారు. "నేచెల్ల నోయమ్మ - యీ చక్రినన్న। రాచ తేజముగల - రత్నాలపెట్టె " అని హరిశ్చంద్ర ద్విపదలో రెండవభాగమునఁ గలదు. ఇట నేన్ చెల్లను అనుచో నేఁజెల్లనని కావలయును. దిద్దినచోఁ బ్రాసభంగ మగును. దశావతారచరిత్రమున, శ్రీకరమత్స్యకూర్మ ......... అని కకారప్రాసతోఁ బ్రారంభింపఁబడి "ఎంతేకృపఁ బన్నాభసచి-వేశ్వరుఁ గృష్ణసుధీంద్రుఁ బ్రోచుతఱి" (1-ఆ.1) అని ప్రయుక్తము. ఎంతేఁ గృప అని యుండవలయును. అట్లున్నచోఁ బ్రాసభంగ మగును. "కానతగం బొందుట యుక్త మీయుభయమున్ సంతుష్టి నైన్నున్నికిన్" అను భారతప్రయోగమునఁ గూడఁ గానఁ దగ ననియుండవలయును గాని దిద్దినఁ బ్రాసభంగ మగును, కాన=అరణ్యము అని యర్థము చెప్పుట కవిహృదయము కాదు. మఱియుఁ గవిసంజీవనియందు "సీ. అపరాధి నగుదునై-నవదాశ్రితుఁడఁ గావు, న పవిత్రుఁజేయునన్-" అనుచో ఐనన్+పదాశ్రితుఁడ నని ద్రుతాంతముమీఁద సరళాదేశము చేయలేదు. కావునన్+పవిత్రు-ఇటఁగూడ సరళాదేశము చేయలేదు. సరళాదేశము చేసినచోఁ బ్రాసభంగము గలుగును. కావున పవిత్రు అనుచు పవప్రాసముకూడ వాడఁబడెను. మఱియు దానియందే "కృతిని నుమాగమములు దక్కతకారములు" అనుచోఁ దక్కన్ అనునది ద్రుతాంత మైనను సరళాదేశము చేయలేదు. చేసినచోఁ బ్రాసభంగము వెనుకటివలెనే ప్రాప్తించును. ఇట్లే విజయవిలాసములోఁగూడ "కనకంబు వర్షించు- ఘనులమ్రోల నటించి, మెఱయుచోఁ దొలకరి మెఱుపులనఁగ" (1-80) అనుపద్యమున ధనికులపరముగా నొకయర్థమును మేఘముల

పరముగా నొకయర్థమును గవి శ్లేషించియున్నాఁడు. ధనికులపరముగా కన కంబు=బంగారము వర్షించు అనియు, మేఘపరముగా కనన్=చూడఁగా, కంబు=ఉదకమును వర్షించు అనియు నర్థము చెప్పవలయును. మేఘపరమున కనన్ అనునది ద్రుతాంతముగాన సరళాదేశము చేయవలయును. చేసినచో రెండవయర్థము చెడును. ఏనుపిదప అనుచోవలెఁ బైయుదాహరణంబులందును సరళాదేశము కనిపించుట లేదు. పైప్రయోగముల గతి యెట్లో యాలోచింపవలసి యున్నది. నన్నయభట్టీయవ్యాఖ్యాన మగుకవిజనాంజనములో "వికల్పేన ద్రుతే లోపే పరుషాః సరళాః పరే" అని యొకకారిక నుదాహరించి పైయుదాహరణములు గొన్ని చూపఁబడెను. ద్రుతము లోపింపఁగాఁ బరములైన పరుషములు వికల్పముగా సరళము లగు నని దీనియర్థము. ఈకారిక యేకవిచే రచియింపఁబడినదో సరిగాఁ దెలియదు. ఈకారిక యెందున్నదైనను అప్రమాణమైనదని యనుకొందమన్నను పైప్రయోగముల సాధించుట కేదోమార్గముండవలయునుగదా, ఆమార్గ మిదే యని యనుకొందము. ఏనుపిదప అనునది యీరీతిగాఁ గుదురును. పవప్రాసము భారతకవులచేఁ బ్రహత మగుటచే నిదియు నిర్బాధ మగుచున్నది. ఈపక్షమున నప్పకవి సంధిగతప్రాసమున కుదాహరణము నిచ్చుట తప్పని చెప్పనగును. పైకారికలోని వికల్పమును వ్యవస్థితము చేసికొని శ్లేషప్రాసస్థలములందే దానికిఁ బ్రవృత్తి చెప్పుకొనినచో బూర్వోదాహృతసమస్తమహాకవిప్రయోగములకు నైకకంఠ్యము గలుగును. కాఁబట్టి యెన్నివిధముల విమర్శించిచూచినను నేను అనుద్రుతస్వత్వరూపముద్రుతప్రకృతికమనియే చెప్పితీరవలయు నని తోఁచుచున్నది. దీని నిర్ణయానిర్ణయములు పండితులకే వదలుచు నింతటితో విరమించుచున్నాఁడను. పండితులు గుణగ్రాహు లగుదురుగాక యని యు విన్నవించుకొనుచున్నాఁడను. మఱి యున్నొకసంగతి-మనయధ్యక్షులు సెలవిచ్చినట్లు ఆంధ్రభాషకు వ్యాకరణలోపము గలదు. మజ్జనకులును మద్గురువర్యులు నగు బ్రహ్మశ్రీ చర్ల నారాయణశాస్త్రి గారు నన్నయభట్టీయమును అథర్వణకారికావళిని గలిపి తెనిఁగించియున్నారు. దానికిఁ బూర్వలక్ష్యలక్షణగ్రంథపరిశీలనతో నే నొకవివరణము వ్రాయుచుంటిని. ఆంధ్రభాషాయోషామణిమీఁది యభిమానముచే నేదో యొక పువ్వు వేయుటయే కాని మఱి యేమియుఁ గాదు. అట్టి వ్యాకరణము సంపూర్తిగాఁ జెప్పవలయునన్నచో నీయాంధ్ర సాహిత్యపరిషత్తునకే యట్టియధికారము గలదు. కాన నీయాంధ్రమునకుఁ గలిగినలోపమును బండితులు తీర్చెదరుగాక యని ప్రార్థించుచున్నాఁడను.

---

# మృచ్ఛకటీకాలనిర్ణయము.

(శ్రీయుత మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు, విజయనగరము)

---

అంతస్సమస్తజగతాం యదనుప్రవిష్టమాచక్షతే మునిగణోక్తిషు సూత్రమార్యాః।
తం కేళికల్పితరఘూద్వహరూప మాద్యం పంకేరుహాక్షమనిశం శరణం ప్రపద్యే॥
ఆమ్నాయశైలశిఖరైకనికేతనాయ వాల్మీకివాగ్జలనిధిప్రతిబింబితాయ। కాలాంబుదాభవపుషే పురుషోత్తమాయ కస్మైచిదస్తు మమ కార్ముకిణే ప్రణామః.

కొంతకాలమునుండి జగత్ప్రసిద్ధులగు పాశ్చాత్యపండితులు భారతీయపండితులు మృచ్ఛకటీకాలనిర్ణయమును గుఱించి తమతమకొలఁదిఁ జేసినప్రయత్నము లన్నియు యుక్తియుక్తముగా నున్నట్లు కానుపించు నూహలక్రిందఁ బర్యవసించినవి గాని తత్త్వము తేలలేదు. మొదటినుండియు హిందువులు ప్రాచీనగ్రంథముల కాలమును నిర్ణయించుటయందు విశేషాదరము కలవారుకారు, గావున వానిబాహ్యాభ్యంతరసాక్ష్యమునుండి సంగ్రహింపఁబడిన నిస్సారమైన ప్రమేయజాతమునుబట్టి యాలోచింపఁగా నీయంశ మిట్లుండుట సహజమే. (Pischel) పిశ్చల్ పండితుఁ డొకప్పు డీనాటకమును భాసుఁడు వ్రాసిన దని సమర్థించెను. మఱి కొంతకాలమున కితఁ డీయభిప్రాయమును మార్చుకొని కావ్యాదర్శకర్త యగుదండి రచించిన దని వాదింపఁదొడఁగెను. కాని యిది కేవలమపసిద్ధాంతము. ఉద్భటుని కావ్యాలంకారసంగ్రహమునకు, ప్రతిహారేందురాజు వ్రాసిన వ్యాఖ్యానములో "యదాహ, నతిజస్త్యేన ఉపమాన మస్తీతి అతఏవ దండినా "లిమ్పతీవ తమోఽఙ్గాని వర్షతీ వాఞ్జనం నభః। అసత్పురుషసేవేవ దృష్టిర్నిష్ఫలతాం గతా॥ ఇత్యాదే ర్గర్భీకృతాతిశయోత్ప్రేక్షాభేదత్వమేవ ప్రపంచే నాభ్యధాయి। తేన కదా దేవదత్త గ్రామం గమిష్యసి। ఏష గచ్ఛామీ త్యాదా వపి వర్తమాన సామీప్యే వర్తమాన రూపతయా భవిష్యత్కాలస్యాధ్యవసానాత్ అతిశయోక్తి భేదత్వమేవ వాచ్యమ్।" అను వాక్యముయొక్క అర్థ మతనికి సరిగాఁ దెలియలేదు, కావ్యాదర్శము ద్వితీయపరిచ్ఛేదములో 226-234 శ్లోకములలో దండి చెప్పినవాక్యార్థము కూడ పిశ్చల్పండితుఁడు చక్కఁగా గ్రహింపనేరఁడయ్యె. అది యెట్లనఁగా, "లింపతీవ తమోఽఙ్గాని వర్షతీ వాఞ్జనం నభః ఇతీద మపి భూయిష్ఠ ముత్ప్రేక్షాలక్షణాన్వితం॥"

టీక. ఈశ్లోకము మృచ్ఛకటికనాటకములో వర్షావర్ణనప్రకరణమందుఁ జెప్పఁబడినది. అంధకారము శరీరములను బూయుచున్నట్లున్నది. అంతరిక్షము కాటుకను వర్షించుచున్న ట్లున్నది. ఈశ్లోకార్థ ముత్ప్రేక్షాలక్షణముతోఁగూడి యున్నది. ఈశ్లోకమం దచేతన మగుతమస్సుయొక్క వ్యాపనరూప మైన ధర్మము లేపనత్వముగాను, సంపాతరూప మైనధర్మము నభఃకర్తృకాంజనవర్షణ రూపముగాను సంభావింపఁబడినందున రెండుచోటులను విషయోపాదానములేదు.

"మన్యే శంకే ధ్రువం ప్రాయః నూన మిత్యేవమాదిభిః ।
ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దైః'' ... ... ... ...

ఇత్యాది పదప్రయోగమం దుత్ప్రేక్షయనియు, ఇవశబ్దమున్నచో నుపమ యనియుఁ గొందఱమతము. ఆమతమును దండి దూషించుచున్నాఁడు.

"కేషాంచి దుపమాభ్రాంతి రివశ్రుత్యేహ జాయతే ।
నోపమానం తిఙన్తేనే త్యతిక్రమ్యాప్తభాషితమ్ ॥

ఈశ్లోకములో "లింపతీవ, వర్షతీవ'' అనుస్థలములయందు ఇవశబ్ద ముండుటచేఁ గొందఱు "తిఙన్తేన నోపమానం'' అనుప్రామాణికభాషితము ననాదరించి, ఉపమాలంకార మని భ్రాంతిపడిరి. ఉపమానమునకు సిద్ధత్వము సాధ్యత్వము నని రెండు గలవు. ఉపమయం దుపమానమునకు సిద్ధత్వ మావశ్యకము. ఇచ్చట తిఙన్తప్రతిపాద్యము లైన లేపనవర్షణములకు సాధ్యత్వముండుట వలన నిచట నుపమాశంక లేశమును లేదు. ఇందుకుఁ బ్రమాణముగా-

"సిద్ధమేవ సమానార్థ ముపమానం విధీయతే ।
తిఙంతార్థస్తు సాధ్యత్వా దుపమానం నజాయతే" ॥ అని యున్నది.

"ఉపమానోపమేయత్వం తుల్యధర్మవ్యపేక్షయా ।
లింపతే స్తమసశ్చాసౌ ధర్మః కోత్ర సమీక్ష్యతే''

ఒక్కటి యైన సమానధర్మముచేతనే గదా, ఉపమానోపమేయవ్యవహారము కలుగుచున్నది. ఇచ్చట నుపమా నోపమేయములైన లింపతి తమస్సులకు సమానధర్మ మెద్ది ?

"యది లేపనమేవేష్టం లింపతిర్నామ కోఽపరః ।
సఏవ ధర్మో ధర్మీచే త్యనున్మత్తో నభాషతే''

ఇట్టిశ్లోకమం దివపదప్రయోగ ముండుటచేఁ బ్రాచీనాలంకారికులు కొందఱిది యుపమ యని భ్రాంతినొందిరని తెలుపుటకు దండి తనకావ్యాదర్శ

మం దీశ్లోకముల నుదాహరించి యిది యుత్ప్రేక్ష గాని యుపమ కా దని సమర్థించెను. మృచ్ఛకటికలోని "లింపతి" అనుశ్లోకము నుదాహరించిన దండి కూడ నాఱవశతాబ్దముకంటెఁ బ్రాచీనుఁడై యుండఁ డని పీటర్సన్ పండితుఁడు చెప్పెను.

మృచ్ఛకటికలోని ప్రాకృతభాష కాళిదాసు మూఁడునాటకముల ప్రాకృతభాషకంటెఁ బ్రాచీనతరముగాఁ గానవచ్చుచున్నది గావున మృచ్ఛకటికను రచించినశూద్రకుఁడు కాళిదాసునికంటెఁ బూర్వుఁ డని కె. బి. పాఠక్పండితునియభిప్రాయము. మృచ్ఛకటిక 9వ అంకము 33వ శ్లోకము- "అంగారక విరుద్ధస్య ప్రక్షీణస్య బృహస్పతేః। గ్రహోయ మపరః పార్శ్వే ధూమకేతు రివోత్థితః" ॥ కుమారసంభవ 2 సర్గ 32 శ్లోకము—భవల్లబ్ధవరోదీర్ణ స్తారకాఖ్యో మహాసురః। ఉపప్లవాయ లోకానాం ధూమకేతు రివోత్థితః" ॥ ఈరెండు శ్లోకములలోను గొసపాదము యాదృచ్ఛికముగా సంవదించుటవలనఁ బైని చెప్పిన విషయము సంభావనీయ మేమో యని తోఁచుచున్నది. కాని కాళిదాసునివంటి మహాకవి తనకంటెఁ బూర్వుఁడైన మఱియొకకవి వ్రాసిన శ్లోకము ననుకరించె నని తలంచుట మిక్కిలి సాహస మైనపని. సర్వస్వారనామక మగుయజ్ఞమందు శరభంగుని వలెఁ దన్నుఁదాను బలియిచ్చుకొనుట, చౌర్యశాస్త్రమును బ్రకటించిన కనకశక్తి, కుమారకార్తికేయుఁడు, భాస్కరనంది, యోగాచార్యుఁడు మొదలగువారిని జెప్పుట, యౌగంధరాయణుఁ డుదయనుని బంధనమునుండి విడిపించె ననుకథ ననుసంధించుట, ఇంద్రమఖోత్సవము, రత్నషష్ఠ్యుపవాసవ్రతము, చతుర్విధప్రమాణములు, మనుస్మృతి నుదాహరించుట, భరతుని నాట్యశాస్త్రపు పద్ధతుల నుల్లంఘించి రంగస్థలమందుఁ బ్రత్యక్షముగా వధను నిర్దేశించుట, పాయశపిండలక, గర్దభీ, శక్తి మొదలగు ద్యూతపారిభాషికపదములు, వైశికీ, వరండలంబుక మొదలగు వానిని వాడుకచేయుట, బౌద్ధమతాభివృద్ధి, బ్రాహ్మణుఁడు శూద్రస్త్రీని వివాహము చేసికొనుట, మొదలగు నంశము లీనాటకముయొక్క ప్రాచీనతను స్థిరపర్చుచున్నవి. ఈనాటకము క్రీస్తుశకము ప్రథమదశకమందు వ్రాయఁబడిన దనికొందఱభిప్రాయపడుచున్నారు.

అగాధమైన కాలసముద్రమందు మునిఁగియున్న భాసనాటకచక్రమును పైకిఁదీసి ప్రకటించి లోకశ్లాఘాపాత్రులు యశశ్శేషులు నగు టి. గణపతిశాస్త్రిగారికి సంస్కృతభాషాభిమాను లందఱుం గృతజ్ఞులై యుండకతీరదు. భాసుని

నాటకసంగ్రహములో "దరిద్రచారుదత్త" యను నాటక మొకటి యున్నది. అభినవగుప్తుఁడు తాను వ్రాసిననాట్యశాస్త్రవివృతిలో చారుదత్తనాటకమును బేర్కొనియెను భరతనాట్యశాస్త్రములో 19 వ అధ్యాయమందున్న 13 వ శ్లోకమునకు వ్యాఖ్యానము వ్రాయుచు నిట్లు చెప్పుచున్నాఁడు.

"సర్వస్యైవహి కార్యస్య ప్రారబ్ధస్య ఫలార్థినా। ఏతా అనుక్రమేణైవ పంచావస్థా భవంతి హి."

వ్యా. నను మానుషవ్యాపారే నాయకస్య తత్సచివాదేర్వా భవంత్వేతా అవస్థాః ప్రతినాయకే ప్యేవం తత్ర పరమసదుపాయాపేక్షయా యత్తు దైవాయత్తం ఫలం వర్ణ్యతే తత్ర కథమ్ నచ వర్జ్యతాం పురుషకారమాత్రాభిమానినాం దైవమజానానాం చార్వాకాది మతమేయుషాం సః దైవబహుమానవ్యుత్పత్తయే హి పురుషకారో ప్యఫలః తదభావోపి సఫలః ప్రదర్శనీయః అత ఏవ దరిద్రచారుదత్తాది రూపకాణి తద్విషయాణి తస్మాద్దైవాయత్తత్వే కథ మేత దవస్థానపంచకం తత్పరిహర్తు మాహ సర్వస్యైవ హీతి దైవాదాగచ్ఛతోపీత్యర్థః తత్రాపి హి యద్య ప్యభినాయకో నవర్తతే తథాపియత్ర ఫలంభవతి తత్రావశ్య మవస్థాభిర్భావ్యం సఏవచ పరం ఫలేన తదానీమక్షీభవతి యముక్త మధికృత్య ప్రవర్తత ఇతి హి ప్రయోజనలక్షణంపదన్తి.

తిరువాన్కూరులో ముద్రితమైన దరిద్రచారుదత్త కొసగద్యమందు "అవసితమ్" అని యున్నను స్పష్టముగా గ్రంథైకభాగమే గాని పూర్తిగా లేదు. సరస్వతీకంఠాభరణము పంచమపరిచ్ఛేదములో 599-600 శ్లోకములు "మాంస్యః కళత్రవాన్ ముక్తవిభవో గుణవా న్విటః। స యథా। శకార కిం ప్రార్థనయా సామాన్యేనా విశేషేణ వా అకార్యవర్జం మే బ్రూహి కిమభీష్టం కరోమి తే" అని విటుఁడు శకారు నడుగుచున్నాఁడు. ఇది భాసుని చారుదత్తనుండి తీయఁబడిన శ్లోకము. ఇచ్చటసంప్రతించుటకు సమానార్థకములైన మృచ్ఛకటికావాక్యములనిచటఁ జూపించుట యావశ్యకము.

1. పాపం కర్మచ యత్పరైరపి కృతం తత్తస్య సంభావ్యతే.
2. సంవాహకః। స్వగతం। శిక్షితం ఖు పచ్చావక్ఖిదో హ్మ కోహిణామ అప్పణాకిదం పచ్చుఅఆరేణ విణాశేది.
3 నరః ప్రత్యుపకారార్థీ విపత్తౌ లభతే ఫలం
ద్విషతామేవ కాలోస్తు యోఽపాయ్యభవతు తస్యవా.

భాసునిదరిద్రచారుదత్తత్కృతనాటకములవలె "తథా పీడ మస్తు భరత వాక్యమ్" అను వాక్యముతో సమాప్తి నొంద లేదు. చారుదత్తచరిత్రమును బూర్ణముగా వ్రాసినవాఁడు భాసుఁడే యని మన మూహింపవలెను. భాసుని చారుదత్త మొదటి దని యును శూద్రకుఁడు దానిని జూచి తనమృచ్ఛకటికను బూర్తిగా వ్రాసె నని యు మన మూహించుకొనవలెను. భాసునిచారుదత్త పూర్తిగా లభింపలేదు. ఇది మనకుఁ బూర్తిగా లభించినయెడల భాసుని వృత్తాంతము మృచ్ఛకటికాకారునివృత్తాంతము బాగుగాఁ దెలిసికొనుటకు మనము సమర్థులమై యుందుము.

ఈదిగువ వ్రాసిన ధనికుని అవలోకవాక్యములవలన మృచ్ఛకటికా వృత్తాంత మిట్లు నిశ్చయింపఁబడుచున్నది.

1. విప్రాదీనాం శాంతత్వైవ నలాలిత్యం యథా మాలతీమాధవమృచ్ఛకటికాదౌ మాధవచారుదత్తాదిః।
2. యథామఖశతపరిపూతం గోత్రముద్భాసితం యత్।
3. కితవద్యూతకారాది ధూర్తసంకులంతు మృచ్ఛకటికాదివత్సంకీర్ణప్రకరణం।

ఈధనికుఁడు 974-995 సం॥రము లో మాళవదేశము నేలినపరమార ముంజుని యాస్థానపండితుండై యుండెను. ఇతఁడు దశమశతకాంతమందున్న వాఁడు. ఇది మృచ్ఛకటికకుఁ జరమావధి. ప్రథమావధి నిశ్చయించుటసులభముగాదు. వామనుని సూత్రాలంకారవృత్తిలో నీశోధన కుపయోగించు రెండు శ్లోకము లుదాహరింపఁబడి యున్నవి.

1. యాసాం బలిర్భవతి మద్గృహదేహలీనాం
   హంసైశ్చ సారసగణైశ్చ విలుప్తపూర్వః
   తాస్వేవ పూర్వబలిరూఢయవాంకురాసు
   బీజాంజలిః పతతి కీటముఖావలీఢః.
2. ద్యూతం హి నామ పురుషస్యాసింహాసనం రాజ్యమ్.

వీనిలో మొదటిశ్లోకము కొంచెము మార్పుతో మృచ్ఛకటిక ప్రథమాంకమందుఁ గానవచ్చుచున్నది. ఇదియే భాసునిచారుదత్తలోఁ గూడ నున్నదిం రెండవవాక్యము మృచ్ఛకటికద్వితీయాంకములోనిది. భాసుని చారుదత్తలో లేదు. "శూద్రకాది రచితేషు ప్రబంధేష్వస్య భూయాన్ప్రపంచో దృశ్యతే" అను వామనోక్తిని బట్టి యీయంశమును విమర్శింపఁగా శూద్రకుఁ డష్టమశత

కములో కొంతభాగమందుఁ బ్రసిద్ధికెక్కిన గ్రంథకర్తగాఁ గాన వచ్చుచున్నాఁడు. నామనుఁడుదాహరించినశ్లోకములంబట్టి మృచ్ఛకటికను శూద్రకుఁడే వ్రాసి యుండవచ్చు నని నిశ్చయముగాఁ జెప్పఁగలము. వల్లభదేవుని సుభాషితావళిలో నుదారింపఁబడిన,

"త్యాగోహి సర్వవ్యసనానిహంతీ త్యళీక మేత ద్భువిసంప్రతీతం
జాతాని సర్వవ్యసనాని తస్యా స్త్యాగేన మే ముగ్ధవిలోచనాయాః"

అను శ్లోక మొకటి-యీనాటకము తప్ప శూద్రకవిరచితములు మఱియె వ్వియుఁ గానరావు.

ఈవిషయ మింతమట్టుకుఁ జర్చించి యీవిమర్శనమునకుఁ బాణుని కాదంబరీహర్షచరిత్ర లెంతమట్టుకు సహాయము చేయునో యిఁక విచారింతము. బాణుఁడు హర్షచరిత్రావతారికలో "సూత్రధారకృతారంభై ర్నాటకై ర్బహుభూమికైః సపతాకై ర్యశో లేభే భాసో దేవకులై రివ" అని భాసుని శ్లాఘించి శూద్రకుని పే రెత్తలేదు. గుణాఢ్యుఁడు రచించిన బృహత్కథ యే కాదంబరికి మూలగ్రంథ మని విద్వాంసు లందఱు నెఱిఁగినవిషయమే. క్షేమేంద్రుఁడు రచించిన బృహత్కథామంజరి సోమదేవభట్టుని కథాసరిత్సాగరము నని దానికి రెం డనువాదములు కలవు. బాణుఁడు కాదంబరిని వ్రాయుటలో నసలుకథకు నాయకుఁడైన కాంచనపురాధీశుఁ డగు సుమనాసునికి బదులుగా విదిశానాయకుఁడైన శూద్రకుని బెట్టెను. తొల్లి శూద్రకుఁడను నొకరాజు దూతచకోరవంశస్థుల కధిపతి యైన చంద్రకేతు వనువానిని వానిమంత్రిని వధించె నని హర్షచరిత్రములో నున్నది. కాని యీవృత్తాంతము ప్రకృతమున కేమి యు నుపయోగింపదు. కళలయందు, శాస్త్రములయందు బహునిపుణుఁ డనియుఁ జక్రవర్తి యనియు వర్ణింపఁబడిన కాదంబరీనాయకుఁడైన శూద్రకుఁడును మన కుపయోగింపనివాఁడే అతఁడు కవి యని కాని, పుత్త్రవంతుఁ డని కాని మెచ్చుటను జెప్పఁబడియుండలేదు. పురాణోక్తము లైన రాజవంశావళుల నన్నింటిని బరిశీలించిన F G Pargiter శూద్రకుని నెచ్చటను జెప్పలేదు. క్షీరస్వామి అమరవ్యాఖ్యానములో ద్వితీయకాండమందు, చక్రవర్తుల జాబితా నొకదాని నిచ్చెను. "విక్రమాదిత్య స్సాహసాంక శ్శకాంతకః। శూద్రక స్సగ్నిమిత్రో వా హాలస్సాచ్చాతవాహనః ॥" అని యిచట నొక

దొకశూద్రకుఁడు చెప్పఁబడెను. ఎట్లనఁగా;—లోకే రాజపురుష ఇ త్యుక్తే కస్యరాజ్ఞ శూద్రకస్యేతి ప్రశ్నో త్తరయోః రాజపదార్థ విభాగః ॥

దండికావ్యాదర్శమునకు "హృదయంగమ" మనువ్యాఖ్యానము వ్రాసిన గ్రంథకర్త ప్రథమపరిచ్ఛేదము 15 వ శ్లోకవ్యాఖ్యానములో "హర్షశూద్రకోదయనాది సత్పురుషసమాశ్రయమ్" అని వ్రాసియున్నాఁడు. రామిలసోమిలు లుభయులుఁ గలిసి యొకశూద్రకునిచరిత్రమును వ్రాసి రని రాజశేఖరుఁడు చెప్పినట్లు Bhandarkar's Report on the search for Sanskrit Manuscripts 1887–91 లోఁ జెప్పఁబడినది. పూర్వోక్తవాక్యములవలన శూద్రకుఁడను నొకమహారాజు పూర్వముం దున్నట్లు ప్రాచీను లెఱుంగుదురు. ఈవృత్తాంతమును మృచ్ఛకటిక ప్రస్తావనలోఁ గ్రంథకర్తయే చెప్పియున్నాఁడు. "లబ్ధ్వా చాయుశ్శతాబ్దం దశదినసహితం శూద్రకోఽగ్నిం ప్రవిష్టః" అని నూఱుసంవత్సరములుం బదిదినములు బ్రతికి కొన కగ్నిలోఁ దన్నుఁదాను హోమము వేల్చుకొనియె నని యున్నది.

వంగదేశము నేలినరాజులలో శూద్రకుఁ డనునొకరాజు 90 సంవత్సరములు రాజ్యమేలె నని Abdul Fazal వ్రాసిన "ఎయిని అక్బరి" అను గ్రంథమం దున్న దని Col. H. S. Garatt చెప్పియున్నాఁడు. కాని యిదివాస్తవ చరిత్ర మైయుండ నేరదు. ఈనాటక ప్రస్తావనలో శూద్రకుఁడు తన్నుగుఱించి యిట్లు చెప్పకొనెను.

"ద్విరదేంద్రగతి శ్చకోరనేత్రః పరిపూర్ణేందుముఖ స్సువిగ్రహశ్చ ।
ద్విజముఖ్యతమః కవిర్బభూవ ప్రథిత శ్శూద్రక ఇత్యగాధసత్త్వః ॥"

అపిచ। ఋగ్వేదం సామవేదం గణిత మథ కలాం వైశికీం హస్తిశిక్షాం। జ్ఞాత్వా శర్వప్రసాదా ద్వ్యపగతతిమిరే చక్షుషీ చోపలభ్య । రాజానం వీక్ష్య పుత్రం పరమసముదయే నాశ్వమేధేన చేష్ట్వా । లబ్ధ్వా చాయుశ్శతాబ్దం దశదినసహితం శూద్రకోఽగ్నిం ప్రవిష్టః। అపిచ। సమరవ్యసనీ ప్రమాదశూన్యః కకుదం వేదవిదాం తపోధనశ్చ । పరవారణబాహుయుద్ధలుబ్ధః క్షితిపాలః కిల శూద్రకో బభూవ॥ ఇది యంతయు బ్రస్తావనలోఁ జెప్పఁబడిన శూద్రకుని వృత్తాంతము. ప్రస్తావన వ్రాసినగ్రంథకర్త శూద్రకుని వర్ణించుటలో "బభూవ" అని పరోక్షమందు "లిట్" ప్రయోగించెను. ప్రస్తావన వ్రాసినగ్రంథకర్త శూద్రకునికంటెఁ గొంతకాలము ముందు వాఁడై యుండవలెను.

ప్రకృతపు స్థితిలోఁ బూర్వోక్తవృత్తాంతము నంగీకరించుటకు మన కవకాశము లేదు. గుప్తరాజులచే స్థాపింపఁబడిన బ్రాహ్మణశాఖచే నితనియం దింత మట్టు కతిశయ మారోపింపఁబడియుండవచ్చును. రాజతరంగిణి III వ అధ్యాయము 343—

శ్లో॥ సంత్యజ్య విక్రమాదిత్యం సత్త్వోద్రిక్తంచ శూద్రకం।
తాంశ్చ భూపాల పర్యాప్తం ధైర్య మన్యత్ర దుర్లభమ్ ॥

అనియొకశూద్రకునిం జెప్పుచున్నది. ఇందువలన శూద్రకుఁడు విక్రమాదిత్యునికిఁ దరువాతివాఁడని కల్హణుఁడు తలంచినట్లు కానవచ్చుచున్నది ఈ విక్రమాదిత్యుఁ డెవఁడో మనము నిశ్చయముగాఁ జెప్పలేము. మాతృగుప్తుఁడు, రెండవప్రవరసేనుఁడు, భర్తృమెంతుఁడు, విక్రమాదిత్యుఁడు, సమకాలికులని కల్హణుఁడు చెప్పియున్నాఁడు. ఇదిసంస్కృతవాఙ్మయసంప్రదాయమం దంద ఱెఱింగిన విషయమే ఇందువలన శూద్రకుఁడు క్రీస్తుశకము 550-600 లో ప్రాయికముగా నుండవచ్చును. “ లింపతీ వ తమోఽంగాని ” అనుశ్లోకమును విక్రమాదిత్యుఁడు వ్రాసిన దని జల్హణవల్లభదేవులు, విక్రమాదిత్యుఁడు భర్తృమెంఠుఁడు కలిసి వ్రాసిన దని శార్ఙ్గధరుఁడు ప్రతిపాదించిరి. ఈశ్లోకము భాసుని బాలచరిత్రలోను, చారుదత్తలోను గానవచ్చుచున్నది. కావున నీతిపద్యావళులు వ్రాసినవారి నవ్వుపుట్టించు గందరగోళము, Pischel పండితుని భ్రాంతిమూలకము లగునూహాలు మనము మెల్లఁగా దాఁటి పోవచ్చును. హర్షచరిత్రో పోద్ఘాతములో నెందఱో కవులు నెన్నియో గ్రంథములును శ్లాఘింపఁబడినను శూద్రకుని మృచ్ఛకటిక పేరైన నెత్తఁబడలేదు. అ దేమి చిత్రమో బాణుని కాలమున కీగ్రంథ మంత ప్రచురముగా లే దేమో ? పంచతంత్రము రచింపఁబడకమునుపే మృచ్ఛకటిక ప్రసిద్ధిగా నుండెను. మృచ్ఛకటిక 4 వ అంకములోని 14, 15 శ్లోకములు, పంచతంత్ర ప్రథమతంత్రమందు సంగృహీతములై యున్నవి.

“ఏతాహసంతి చ రుదంతి చ విత్తహేతోర్విశ్వాసయంతి పురుషం నతువిశ్వసంతి
తస్మా న్నరేణ కులశీలసమన్వితేన నార్యః శ్మశానకుసుమా ఇవ వర్జనీయాః ॥
“ సముద్రవీచీవ చలస్వభావా స్సంధ్యాభ్రలేఖేవ ముహూర్తరాగాః।
స్త్రియో హృతార్థాః పురుషం నిరర్థం నిష్పీడితాలక్తకవత్త్యజంతి ” ॥

మృచ్ఛకటిక 3 వ అంకములోని 25 వ శ్లోకము- “శంకనీయా హి లోకేఽస్మి న్నిష్ప్రతాపా దరిద్రతా” పంచతంత్ర ప్రథమతంత్రములో 99వ శ్లోకముగాఁ బఠితమైనది.

ఇప్పుడు మన మెఱిఁగినపంచతంత్రము దామోదరగుప్తుని (775 క్రీ-శ) శంభలీమతముకంటెఁ బ్రాచీనతరము కాదు. రుద్రటుని శృంగారతిలకమందలి “పర్యంక స్స్వాస్తరణః”, “సార్థం మనోరథశతై స్తవ ధూర్త కాంతా” అను శ్లోకములు నాల్గవతంత్రములోనికిఁ దేఁబడినవి.

భాసుని చారుదత్తనాటకము సంపూర్ణముగా, ననఁగాఁ బంచమాంకము కొనవఱకు లభించినఁ గాని మృచ్ఛకటికలోని బౌద్ధమతము, అధికరణమందుచారుదత్తునివిచారణ మొదలగునవి మన కేమియుఁ బ్రయోజనకరములు గావు.

---

[పైవ్యాసమున మృచ్ఛకటిక నాటకకర్త యగు శూద్రకునియొక్కయు, నాతని దేశకాలాదులయొక్కయు జర్చ యసంపూర్ణముగ నున్నది. తిరువనంతపురమునఁ బ్రకటింపఁబడిన చారుదత్తమే యభినవగుప్తాదుల గ్రంథములఁ గాననగు దరిద్రచారుదత్తమని యు, నది యసంపూర్ణమని యుఁ బలువు రంగీకరించియున్నారు. మార్గన్ స్టెరన్ చారుదత్త మృచ్ఛకటికాదులయందలి ప్రాకృతభాషను జర్చించి చారుదత్తమే ప్రథమమున రచింపఁబడె నని నిర్ధారణ మొనర్చెను. మఱియు గ్రంథములఁగలఁ యితరవిషయములఁ బరిశీలించినచో నదియే స్థిరపడఁగలదు. తిరువనంతపుర నాటకములు భాసవిరచితము లగునా కావా యనువిషయమునఁ బండితులు భిన్నాభిప్రాయు లయిరి. ‘ప్రథితయశసాం భాససౌమిల్లకాదీనాం’ అని కాళిదాసు స్తుతించియుండుటచే భాసుఁడు కాళిదాసునకు రెండుమూఁడు శతాబ్దము లయినను బూర్వుఁ డనవలయును. తిరువనంతపురనాటకములు భాసవిరచితము లగుచోఁ జారుదత్తాదులు క్రీ. శ. మొదటి రెండుశతాబ్దముల రచియింపఁబడవలయును.

మృచ్ఛకటికకర్త యగు శూద్రకకవి కాళిదాసునకుఁ బూర్వుఁడా యర్వాచీనుఁడా యను విషయ మింకను నిశ్చితము గాదు. పిశ్చెల్ గారిమతము నంగీకరించి మాక్డొనెలు గారును దండియే మృచ్ఛకటికమును రచించె ననియు, నొకవేళఁ దనయేలిక యగు శూద్రకమహారాజు పేర దానిం బ్రకటించి యుండవచ్చు ననియు నూహించుచున్నారు. కార్పెంటరుగారు క్రీ. శ 7, 8 శతాబ్దముల నీగ్రంథము రచింపఁబడె ననిరి. సంస్కృత నాటకచరితమును వ్రాసిన బెరడీలు కీత్ గారు గ్రంథకాలమును సరిగ నిర్ణయింప వీలులే దని నుడువుచుఁ గాళిదాసునకుఁ బూర్వులగు నాటకకర్తలయందు శూద్రకునిఁ జేర్చిరి. వామనుఁడు శూద్రకవిరచితప్రబంధముల నుదాహరించుటచేతను ధనికుని దశరూపకవ్యాఖ్యయందు మృచ్ఛకటిక ముదాహృత మగుటచేతను గ్రంథకాలము సప్తమశతకానంతరము కానేర దనియే చెప్పనగును. కాని కాళిదాసునికి శూద్రకుఁడు ప్రాచీనుఁడా యర్వాచీనుఁడా యనువిషయము దానివలనఁ దేలుటలేదు. కల్హణుని రాజతరంగిణియందు విక్రమాది

త్యశూద్రకులు ధైర్యవంతు లని తెలుపఁబడియున్నది. స్కాందపురాణమున నాతఁ డాంధ్రభృత్యులలో మొదటివాఁ డని యున్నది. దశకుమారచరితము, కాదంబరి, హర్షచరితము, కథాసరిత్సాగరము, బేతాళపంచవింశతి మున్నగు గ్రంథముల శూద్రక ప్రశంస గానవచ్చుచున్నది. అందుననే పలువు రాతని పురాణపురుషునిగ (Legendary Person) భావించుచున్నారు. ఆంధ్రరాజులలోఁ గడపటిరాజులను నిర్జించి చేదిశకమును స్థాపన మొనర్చిన ఈశ్వరసేనునితండ్రి యగు శివదత్తుఁడే శూద్రకుఁ డని యు నాతని కాలము క్రీ. శ మూఁడవశతాబ్ద ప్రారంభ మగు ననియు కోనోగారు చర్చించియున్నారు (Konow). కాళిదాసునకుఁ బూర్వు లగురామిలసౌమిలులు శూద్రకకథ యనుగ్రంథమును రచించిరి. మఱియు, విక్రాంతశూద్రకము, శూద్రకవధ యనుగ్రంథములున్నటులు దెలియుచున్నది. మఱియొకవిషయము- గ్రంథప్రస్తావనను గాంచినచో నది శూద్రకవిరచితముగా దని స్పష్టము. గ్రంథాంతభాగములు నీలకంఠ విరచితము లని కొంద ఱభిప్రాయపడుచున్నారు. ఇంకను బెక్కువిషయములఁ జర్చింపవలసియున్నది.]

---

# విమర్శనసమాధానః

— అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు- కొవ్వూరు —

ఈయేఁటి యాంధ్రసాహిత్యపరిషత్తులోఁ జదివిన సభాపాలకోపన్యాసమున నా తెలుఁగుకావ్యాదర్శము విమర్శింపఁబడినది.

"శ్లిష్ట మస్పృష్టశైథిల్య మల్పప్రాణాక్షరోత్తరం
శిథిలం మాలతీమాలాలోలాలికలిలాయథా."

అనుశ్లోకములోని "యల్పప్రాణాక్షరోత్తరం" అనుపదము శిథిలపదమునకు సంబంధింపఁజేయఁబడినది. అల్పప్రాణాక్షరోత్తర మై యస్పృష్టశైథిల్యమయినవాక్యము శ్లిష్టము అను తెనుఁగు దూషింపఁబడినది.

తరుణవాచస్పతివ్యాఖ్యలో నీయన్వయమే కలదు. జీవానందవిద్యాసాగరునియు, కవితార్కిక నృసింహదేవశాస్త్రి దర్శనాచార్యునియు రెండువ్యాఖ్యలలోను దెనిఁగించినయన్వయమే కలదు. "అల్పప్రాణాక్షరము లెక్కువగాఁ గల" యనునర్థమే వ్యాఖ్యలలోఁ గన్పట్టు. తరుణవాచస్పతికూడ నల్పప్రాణాక్షరమయమనియే వ్రాసినాఁడు.

అల్పప్రాణాక్షరము లెక్కువగా నుండవలె నన్నమహాప్రాణాక్షరములు కొలఁదిగ నైన నుండవలె నని తోఁచును. కానమహాప్రాణాక్షరములు తక్కువగను అల్పప్రాణాక్షరము లెక్కువగను గలది శిథిల మని యర్థము.

ఈలక్షణము "మాలతీమాలాలోలాళికలిలా" అను శైథిల్యలక్ష్యమునఁ బట్టదు. దీనిలో మహాప్రాణాక్షరము లేమియును లేవు.

మఱియు నస్పృష్టశైథిల్యము శ్లేషగుణ మనినఁ మహాప్రాణాక్షరమయవాక్యము శ్లిష్టము కావలెను. "మాలతీదామలఙ్ఘితం భ్రమరైః" అనుశ్లేషలక్ష్యములో మృద్వక్షరములే యెక్కువగ నున్నవి. ఙ్ఘి, భ్ర, అను రెండక్షరములే కఠినములు, శిథిలమునకు లక్ష్య మైన "మాలతీమాలాలోలాలికలిలా" అనులక్ష్యమువలనను "బంధశైథిల్యదోషస్తు దర్శిత స్సర్వకోమలే" అనుదండివచనమునను గేవలమృద్వక్షరవాక్యమే శిథిల మని తోఁచెడిని.

శ్లేషగుణము—సర్వవర్ణములును మృదువు లగు టనెడి శైథిల్యము లేక యల్పప్రాణాక్షరము లెక్కువగా నుండుట. ఇది యాంధ్రీకరించిన యన్వయము. అట్టైన రెండులక్ష్యములలో సరిపోయినది.

‘‘మాలతీమాలాలోలాలికలిలా’’ అను శైథిల్యోదాహరణమున సర్వవర్ణములును గోమలములే. “మాలతీదామలఙ్ఘితం భ్రమరై రితి” అనుచో, అల్పప్రాణాక్షరోత్తరత గలదు. ఙ్ఘి, భ్ర, అను రెండువర్ణములు గాక మిగిలిన వెల్ల మృదువర్ణములే కదా ? ఇట్టియెడ గౌడిని వైదర్భిగా వైదర్భిని గౌడినిగాఁ జదువరులు భ్రమపడుదు రని యధ్యక్షులవారు విచారపడు టెందుకో తెలియఁజాలకున్నాను.

క్రమదీశ్వరుని శ్లేషలక్షణము—“అల్పప్రాణేషు వర్ణేషు విన్యాసోఽవ్యంతరాంతరా । మహాప్రాణస్య చ శ్లేషో యథాయం భ్రమరధ్వనిః । అనుప్రాసధియా గౌడై స్తదిష్టం బంధగౌరవాత్ । వైదర్భైర్మాలతీదామలంఘితం భ్రమరై రితి” అనుచో బంధగౌరవాత్ అనుదానిని బూర్వమున కన్వయించిన వ్యాఖ్యాతలును గలరు. వారు కవితార్కికనృసింహదేవశాస్త్రి, జీవానందవిద్యాసాగరభట్టాచార్యులు, అనువారు. తరుణవాచస్పతి పయికే యన్వయించెను. అనుప్రాసమువలనను బంధగౌరవము కల దని కొంద అనిరి. “గౌడీయై రిష్యతే తత్తు బంధప్రాశస్త్యగౌరవాత్” “గాఢబంధమోజః” అను దాని యుదాహరణమున నుప్రాసప్రవేశము నొనర్చిన కావ్యాలంకారసూత్రవృత్తియాశయము నట్లే కన్పట్టెడిని.

ఆంధ్రీకరించిన యన్వయమున శిథిలమునకు లక్షణము కన్పట్టదు. లక్ష్యముతోడనే దానిని దండిచూపెను. ఇట్లు చూపుట మఱొకచోఁ గలదు. “అర్థవ్యక్తి రనేయత్వం” అని మొదలిడి “మహీమహావరాహేణ లోహితా దుద్ధృతోదధేః ఇతీయత్యేవనిర్దిష్టే నేయత్వ మురగాసృజః.”

అర్థవ్యక్తిలక్షణఘటక మగు నేయత్వమున కిక్కడ లక్షణము లేదు. శ్లేషలక్షణఘటక మగుశిథిలత కక్కడ లక్షణము లేదు. ఇట్టి దండియలవాటు ననుసరించి వ్యాఖ్యాతలు చూపిన యన్వయముతో దెనిఁగించుటలోని యపచార మేమో కనుఁగొనఁ జాలకున్నాను.

తప్పులుదిద్దిన మరల గ్రంథ మగుననుభీతి పెద్దలకుండుట లోకమునకు క్షేమదాయకము కాదు. వ్యాసపీఠము విద్యారణ్యపీఠము మొదలైన విట్లే పలువురిచే గ్రంథములు వ్రాయించుచు సంస్కరించుచు లోకసంగ్రహ మొనర్చి యుండె నని కొంద అందురు. ఎంతగొప్పపండితు లైన నొక్కచేతిమీఁదుగా సర్వగ్రంథసృష్టినిఁ జేయఁజాలరుక దా—

క. శ్రీనెగడుచుండి చతురా, స్యాననవనజవనహంసి యై బహిరంత
స్థానసిత యా సరస్వతి, మానక రమియించుఁగాత మచ్చిత్తమునన్.

ఇందుఁ జిత్తమున హంసి రమియించుట బాధిత మనిరి. ఈక్రింది విట్టి ప్రయోగము లగునో కావో చూడుఁడు.

అహవే జగదుద్దండరాజమండలరాహవే
శ్రీనృసింహమహీపాల స్వస్త్యస్తు తవబాహవే. ౧

రాహువున స్వస్త్యాశంస బాధితము కాదా ?

పాంతు వో జలదశ్యామాః శార్ఙ్గజ్యాఘాతకర్కశాః
త్రైలోక్యమండపస్తంభాః చత్వారో హరిబాహవః. ౨

రక్షణము స్తంభముల బాధితము కాదా ?

అలౌకికమహాలోకప్రకాశితజగత్త్రయః
స్తూయతే దేవసద్వంశముక్తారత్నం నకైర్భవాన్. ౩

ప్రకాశితజగత్త్రయత్వము ముత్యమున బాధితము కాదా ?

విద్వన్మానసహంస !.........సామ్రాజ్యం వరవీరవత్సరశతం వైరిం చ
మున్నైచ్చైఃక్రియాః. ౪

సామ్రాజ్యోచ్చైఃకరణము హంసమున బాధితము కాదా ? మూలము లోని మానసపదము పడినసారస్యము లేకపోలేదు. కావుననే చివర తప్పొప్పుల పట్టికలోఁ జేర్పఁబడినది, యీపద్యముమార్పు.

కాని యీయాంధ్రీకరణమువంటి యేకదేశత్యాగముతోడి యాంధ్రీకరణములు శ్రీనాథాదుల రచనలలో వేనవేలు కలవు.

ఆఘూర్ణితం పక్ష్మల మక్షిపద్మం ప్రాంతద్యుతి శ్వైత్యజితామృతాంశు
అస్యా ఇవా స్యాశ్చలదింద్రనీలగోలామలశ్యామలతారతారమ్.

(అని శ్రీహర్షమహాకవి.)

క. చలదింద్రనీలగోళా, మలకోమలతారతారమండలముల ప
క్ష్మలములు ప్రాంశుశ్వేతం,బులు చపలములౌర మెఱుఁగుఁబోఁడినయనముల్

(అని శ్రీనాథమహాకవి.)

# మంతనము.

శ్రీ. తి. వ. నారాయణస్వామిగారు—రుసింగిఅగ్రహారము.

---

క. మనుచూలిఁ గనిన వినుమను, మనిమనవిని వించు నడవిమ్మన్నిమొన లోఁగిం
జనుగొలువఁ జని సువేలం, బున విడిసెన్ రాముఁ డెదిరి పొడవడఁగింపన్.

శా. గం డేపారఁగ రావణు న్బదివి చ క్కాడంగఁ బేరీసున
న్బంక్తుల్ గోళ్ళఁ గటూరులై యలరు నేర్పన్ దండతో పౌఁజులై
యుండ న్గోల్వఁగ సంభ్రము న్గడచి డాయన్వచ్చె రాముం డటం
చుం డింగి గ్గొనరించు వేగరుల యూసు ల్విన్బె నవ్వీటిలోన్. ౨

శా. ఆమాట ల్విని రక్కసు ల్దములలో నారాట మేపారఁ దా
న్మోమోటమ్ముల నేది పెన్నిటులతో "మున్నాడి కయ్యం బెదేన్
రా మార్కొఁదగ ద"ంచు దెల్పఁదగు మే రన్గేయఁగా నెంచి మేల్
దీమమ్ము న్వడిఁజేరి మంతనము లెం తేఁ జేసి రీతీరునన్. 3

క. రక్కెసలలోన నొకజడ, రక్కసి యిటువల్కు వింటిరా తేనికతల్
వ్రక్కైనని యొరుల విడిముడి, న్కక్కివ్రలె మ్రుచ్చిలింప నోర్తురె గఱువల్? ౪

మ. వలవంతం గొని వింతమానిసిని బ్రోవ న్వచ్చె మన్నీఁడు తో
య్యాలి నంకించిన తుల్వ మే న్వడిగ వ్రయ్యంజేయుపంతానఁ జె
ట్టలనట్టు ల్లనుగొల్వ గట్టు విడిపట్టుం జేసె రాముండు, నెం
జలియా; దయ్యము నెత్తికో ల్దెలియ నొచ్చెం బొనె యెవ్వారికిన్. ౫

స్వాగతము. బేసికంటిదొర విల్గొనితుంటల్, జేసి పిన్నపుడె జెట్టియనంగా
వాసిగన్నపడ వా లగురాముం, డాసి గెల్వఁగలఁడా మనఁతేఁడున్ ౬

ఉ. కొండికనాఁడె రక్కసులఁ గొండొలమందఁగఁ జేసె, దుంపలుం
బండులు మెక్కుకోఁతిగమి బంటులుగా నలనీరువామిపై
గుండులఁ దేలఁజేసి మన కొండపయి న్విడిపట్టుసేసె నీ
దండిమగండు; దయ్య మిఁక దాయయొ నెయ్యుఁడొ చూడఁగల్గెడిన్. ౭

క. మనయేలికఁ గొనికడలిన్,మఁనుముంచినవాలియనెడు ములుచ నెఱుఁగుదే
తనతూపున రాముం డా, తనిఁ జంపె నటన్న తేఁ డతని గెల్చునటే! ౮

తోటకము.

మలమన్నిగము ల్డిడిమూసులునై, బలుగుండులుఁ జెట్టులు వాలుల్నై
పొలదిండుల మొత్తగఁ బోవుకత, ల్పలనే న్మనుగంటె జగమ్ములలోన్. ౯

## నవనందిని.

మలమ్మస్థులు న్బిలుగుమానిసులు జేసిన్, గెలువంగలా రెయని కేరకుఁడు; రాముం
గలన న్దెరల్పఁదగు గామిడికలండే?, వలఁతుల్గదా పెనకువన్దులు వకోఁతుల్. ౧౦
క. విలువగనరానిక్రోఁతులె, తలకించు స్తనల? ననుచుఁ దలఁపఁగఁదగ దీ
విలువగనరానిక్రోతి యొ, తలకించె న్మన్ను నల్ల ద్రావుడుదొరలన్. ౧౧
శా. జంకన్నాట యొడంద నెన్న కొకవెంచం జేసె నీర్యామి నీ
లంకం గ్త్తికి బుత్తిగా నొసఁగె నా లక్ష్మైనచో మాస్త్రరన్
లెంకల్గా గుదెతాల్పుపీటికిని దోలన్ విన్నుమస్కం ఢొకం
డింకం గల్గినకోఁతులెట్టిరొ కదే కుంతీ! తలంకమ్యేమన్. ౧౨
ఉ. కావున నీవజీరుఁ డెసకంబెసలారఁగ మన్నుచూలిపై
వావిరి నగ్గలించు వలవంత నడంచుచు రాముదేవెరిన్
వేవఁగలైనకానుకల వేకొని యాతనియజ్జదోయికిన్
క్రేవల నుంచి వేఁడుకొన జేనికిఁ గీడు తొలంగి లగ్గగున్. ౧౩
గీ. అనిన నొంటికంటియసుర యిట్లను దన, మదినిఁ గల్గుతగులు మాటుపఱిచి
తులువమాసి తగునె తొలివేల్పుమన్నిని, వలన గారవమ్ము వడయ నకట.
క. ఆణియములయేలిక వి; న్నాణులమేల్బంతి మారుననవిల్తుండీ
జాణ యొడకాఁడుగా విరిఁ, బోణీ వడయు టది తొల్లి పున్నెంబె సుమీ! ౧౪
మ. దొర యొందు స్గనరాని దొడ్డదొర యొంతో న్వేక్ష నమ్మానిసిన్
మరుపూముల్కుల కగ్గమై వలచెఁబో మారాడ కాజంత కూ
ర్మిరహింప న్దొలివేల్పురాయు నెనయ న్మైలై చొకాటంపుబం
గరుకు న్దావి యొసంగునట్టులయి యక్కా చెల్మి యింపారదే? ౧౬
మ. పడయ న్గల్గునె లేకిమానిసి తలంప న్గూర్చునంబైన యీ
పుడుకుంజెట్టులఁ బుట్టు క్రొన్ననల కంపుల్ క్రేవల న్బర్వఁగా
దడమా గొజ్జెఁగసేటిపెన్దొరువు చెంత న్మాలరాకట్టుకొ
త్తడము న్జేరి వజీరుతో నెనయు బింతల్మిఉస్తంతొసముల్. ౧౭
పణవము. వేల్పుం జెట్టుల విరినెత్తావుల్, పొత్తై మించఁగఁ బువ్టింటన్మే
ల్గొల్పన్రేనిని గొలువంగా మే, తాల్పు ల్గోరఁగఁదగు నెప్పాటన్.
క. అన వించు రేయి ద్రిమ్మరి, చెనఁటియొకతె వల్చు నిట్లు జెట్టులతలక
ట్టననలరు మనవజీరుం, డనదమొ? మానిసుల నెదిరి యడలఁ గలనులన్.

క. వెలిమెల్లినీడ జగములఁ, గలగుండువడంగనీక కాపాడెడుపెన్
వలఁతి యలఁతిమానిసికో, త్రలకుఁ దలఁకు నన్న గుండుదాటు లురులవే?
చ. తొలిదెసఱేఁడు వేగనులతోఁ గనెడున్ వలచక్కిఱేఁడు ని
చ్చలు గుడెతాల్చెడున్ గడలిసామియు నీరయి జాలువారు లి
బ్బులదొర గిబ్బగొతు చెసఁ బొల్పరి డాగెడు నేవజీరు న
గ్గలికకు బిట్టుగాఁ దలఁకి గండరగండఁ డతం డలంతియే. ౨౧

మందారదామము.

ఏమేటి యానల్వ యింపొందఁగోర్కుల్, నేమమ్మున న్జేకొనె న్సీతుదీరన్
నీమాటి! యామేటి సిగ్గొంద కయ్యం,బీమానుసు ల్లోఁతులే చేయువారల్
అ. కంటున మచ్చరించి కడకంటఁ గనుంగొనునే న్వజీరుఁ డీ
పంటవలంతి బిట్టదరుఁ బయ్యెరయు న్నుడియు స్టలంకు వే
గంటివజీరుదొట్టి కడగఁడ్ల కలందురి లోఁగువార లీ
దంటమె? పేదమానిసులవాడికి స్రుక్కెడు సిగ్గుగల్గెడిన్. ౨౩
ఉ. కొండలపిం డగల్పఁగ మొగుత్తెరువ్రు స్మడువంగ సంద్రమున్
బిండలివండుగాఁ గలఁప వేఁడిమి మించెడు జెట్టితెట్టువల్
దండలఁగొల్వ మానిసుల తాఁకునకు న్బగడొంది తొయ్యలిం
గొండొకనాక రామునకుఁ గూర్పఁదలంపఁగ ఱేఁడు వెఱ్ఱియే. ౨౪
కం. మానిసులదిండి దొరయఁట! మానిసియేత్తెఱకు నడలి మనుచూలిని దా
బానిసనలె రామునకీఁ, బూనఁదివురునంట! యిట్టి పూన్కి కలుగునే?
క. అన నుప్పరిముఖియనంగాఁ, జనున్కొక నెలంత వల్కుఁ జయ్యన ఱేఁడి
మ్మనుచూలి న్విడనాడక, గనఁజాలఁడు కీరితియు సుకమ్ము జగానన్. ౨౬
క. ఎడముడుపయ్యె న్మననం,జుడుదిండికొలంపుమేర సూడులకొలపున్
మడఁతిం దమికొని తనకుం,పుడుకత్తెగ ఱేఁడు నిల్పఁబోవుట కతనన్. ౨౭
ఉ. ఏలిద మయ్యె రక్కసుల యేలిక వాసి జగమ్మునందు తా
నాలరియాచు మానిసుల యన్నువకై వలవంతగూరి యా
పాలసురాలిఁ దెచ్చి పలుబాములకు న్గురియయ్యె నయ్యొ రా
చూలిని పీడకుంపటలు సూచితిరే”! యని లాఁతులెన్నఁగన్. ౨౮
మ. నలువం దొట్టియు వాసిగాంచిన కొలాన న్పుట్టి యాలమ్ములన్
వలతు ల్నివ్వెరగంది మెచ్చఁదగు చేవన్జూపి తెంపర్లకుం

దలక ట్టాపాలదిండి నెప్పరి నెలంత న్గొరి శీమానిసిఁ
కలన న్నాక్షానుకన్నలొచ్చుపని యింక న్గల్గునే యక్కొరా. ౨౯

మ. పాలబోనంపుఁదుటారిక త్తియలు వేల్పుంగుబ్బెత జక్కిరా
తలిరుంబోఁడులుఁ గాఁపతొయ్యలులుఁ జెంతంజేరి యే ప్రొద్దుఁ బ
న్పులకై యేకరమాని మానిసులపూవుంబోఁడి నీరైదుమో
ములఁజేఁడెంచె నటంచు విన్నఁ దమమోము ల్వాంచరే న్సొనుల్. 3౦

ప్రహరణకలిత.

అనుపలుకులు విన్ననువున, వినుచుం దనమనమున నీ తలఁపు లొలయఁగా
వినిచె నొకతె యీ వితనున మనరా, యునిఁ బెగడెద కీయుబుసులు తగునే.

ఉ. దయ్యమటన్న జేఁడనినఁ దంత్రి యటన్న మగండ టన్న నో
తొయ్యలి! నల్వవంగడపుదొడ్డ యితండె యటంచు నెమ్మి నీ
యయ్యనె కొల్చి యుంటి మిపు డంగదరా నెకిమీనిగుండియల్
వ్రయ్యగ డిగ్గనాడి బవరంబులకు న్జనకున్కి నాయమే? 3౨

చ. పుడమి నెసంగు చొక్కమగు పూరియు జేనికె చెందునన్న నా
నుడి యుడివోవ్రనే? యసము నూల్కొన నాణెము లేలునట్టి మా
యొడయఁడు కంటి కింపె నని, యొప్పుగ నిమ్మనుచూలి నాలిఁగాఁ
బడసెనొ కాక యింత కఱవా తెఱవా! తెఱవ ల్వలంతిరిఁ. 33

మ. కల రింక న్మనసాటితొయ్యలులు లంకం బెక్కురాబోటులఁ
బిలువం బంచి తలంపుల న్దెలిపి పై వీలెంచి కయ్యంబులఁ
దలకోరా దని మో మెలంగఁదగు వెంటం గొంచుటో సల్పి సి
ల్గులకు న్దవ్వగుతీరున న్దిరుగుకీలు న్జాడ మేలయ్యెడిఁ. 3౪

మత్తకోకిల.

కయ్యపున్దరియాట నిందెసకంబు మీఱఁగ వేగువా
రొయ్యన న్దిరుగాడుచుండుదు రోలి జేఁడిది విన్నమే
వ్రయ్యఁజేయఁగ నప్పనం బిడు వాదులాడక మిమ్ము మే
మెయ్యెడ న్గనవో యించుక యేర్పరించి తొలంగుఁడీ. 3౫

# మహాభారతవిమర్శ

కేతవరపు వేంకటశాస్త్రిగారు—విశాఖపట్టనము.

---

మహాభారతమును పెక్కండ్రు మహాశయులు విమర్శించినారు. ఆవిమర్శనము లనేకవిధములుగా నున్నవి. అవి సంస్కృతమహాభారతము ననుసరించి యున్న వని చెప్పుటకంటె దానిపరివర్తనముల ననుసరించి వ్రాయఁబడిన వని చెప్పుట మేలు. వారలు చేసినవిమర్శనములు, ఊహాపోహలచే నిర్మితమే కాని నిజముగా భారతకథావిధాన మెట్లు జరిగినదో సరిగాఁ జూచి వ్రాసినవి కావు. నేనొనర్చువిమర్శనము నట్టిదే కాని పద్ధతి వేఱని మనవిచేయుచున్నాఁడను.

ప్రస్తుతము మనము చదువుచున్న మహాభారత మంతయు వ్యాసరచితము కా దనియు, వైశంపాయన కర్తృకము కొంతయు సౌతికృతము కొంతయుఁ గలదని విమర్శకు లనుచున్నారు. అందులకు వీరు చూపినకారణములు నిస్సారములు ను, ఊహాకల్పితములు ను మాత్ర మే కాని యథార్థము లని నిర్ణయింప వీలు లేదు. మహాభారతసంహిత వ్యాసవిరచితమై తచ్ఛిష్యపరంపరచే లోకమున వ్యాప్తి గాంచిన దని చెప్పనొప్పును. వైశంపాయన జనమేజయాదుల ప్రశ్నోత్తరరూపము లగుకొన్నిశ్లోకములు పాఠకుల సులభావగాహనము నిమిత్తము తరువాతివారిచేఁ జేర్పఁబడియుండిన నుండవచ్చును. అంతియే కాని గ్రంథమందలి కొన్నిపర్వములే యితరులచేఁ జేర్పఁబడిన వనుట సముచితము కానేరదు. వ్యాసవిరచితమహాభారతసంహితాశ్లోకసంఖ్య తగ్గుటవలన నమ్మహానుభావునకుఁ గొఱంత వచ్చునేమోయని భయపడి నే నిట్లు వ్రాయలేదు. మహోత్కృష్టము లగుపెక్కుగ్రంథములను రచియించి పేరొందిన వ్యాసభగవానునకు నిది లోప మగునా? కానేరదు. కాని యీవాదము సామాన్యముగా గ్రంథరచనావిధానమునకు విరుద్ధముగా నున్నది. ప్రారబ్ధగ్రంథము సమాప్తి నొందింపకుండ విరమించుట మహాకవిసంప్రదాయము కాదు. దైవవశమున గ్రంథరచనకు విఘ్నము ప్రాప్తించుట వేఱు. వ్యాసకవి కట్టిదైవవశమున విఘ్నముచేకూరిన దని చెప్పలేము. యుద్ధపంచకముతోనే భారతము సమాప్తి చెందరాదా యని కొందఱు ప్రశ్నింపవచ్చును. కాని యట్లన వీలులేదు. భారతకథావిధానమునకుఁ బ్రధాను లగుధర్మరాజాదుల

యుత్తరచరిత్రమునుగూడఁ జేర్చినఁగాని గ్రంథసమాప్తి యెట్లగును? సామాన్యముగా మనము చదివినగ్రంథములం దట్టిపరిసమాప్తి లేదు. అంతియకాక యది కవిసంప్రదాయమును గాదు. కావున మహాభారతమునఁ గలపదునెనిమిదిపర్వములును వ్యాసకృతములే యని నాయభిప్రాయము. గ్రంథమునం దంతటను బూర్వాపరములకు విరుద్ధము లగుపెక్కుభాగములు కలవు గదా గ్రంథకర్త యట్లు చేయునా యని ప్రశ్నింపవచ్చును. నిజముగా మహాబుద్ధిమంతుఁ డగువ్యాసుఁ డట్లు చేయలేదు. తరువాతి కాలమున నవి గ్రంథమునఁ జేర్పఁబడి యుండవచ్చును. ఆప్రక్షిప్తభాగముల నైనను వైశంపాయనుఁడు కాని సూతుఁడుకాని చేర్చియుండరు. ఇంకను దరువాతివారు చేర్చియుందురు. ఆప్రక్షిప్తభాగములవిషయమై కొంచెము చర్చించుట యనవసరముకాదు.

భారతయుద్ధకాలమును గుఱించి పలువురు పలువిధములుగా వ్రాసియున్నారు. భారతయుద్ధము కలియుగారంభమున జరిగిన దని యు నిప్పటికైదువేలవత్సరము లై యుండు నని యుఁ గొందఱు వ్రాసియున్నారు. మఱికొందఱు క్రీ. శ. పూర్వము పదునైదువందల సంవత్సరముల కాలమునాఁడే భారతయుద్ధము జరిగిన దనుచున్నారు. ఇంకొక కొందఱు పదునాల్గువందల వత్సరములే యనుచున్నారు. సంస్కృతభారతమున యవనశబ్దము ప్రయోగింపఁబడిన దనియును, యవనశబ్దము హిందూదేశముపై దాడివెడలి వచ్చిన అలగ్జాండరునకునుఁ దత్పరివారమునకునుఁ జెల్లు ననియు నందుచే భారతరచనాకాలము క్రీస్తుపూర్వము రెండుమూఁడుశతాబ్దముల క్రిందటనై యుండవచ్చు ననియుఁ జెప్పుదురు. ఆలోచింప నిట్టివి కారణాభాసములు కాని సరియగు కారణములు కావు. మనసంస్కృతభాషలో నంతకుఁ బూర్వము యవనశబ్దము లే దని చెప్పఁగలమా! క్రీస్తునకుఁ బూర్వము, ఆఱవశతాబ్దమునాఁటివాఁడు పాణిని యని కొందఱును, పదవశతాబ్దమునాఁటివాఁ డని కొందఱును, జెప్పుచున్నారు. ఆపాణిని "ఇంద్రవరుణ"సూత్రమునందుయవనశబ్దమును జేర్ప లేదా? కావున నెన్నోవందలకుఁ బూర్వము వర్తిల్లినవిషయములను గూర్చి చర్చించి కారణాభాసములచేఁ గాలనిర్ణయ మొనరించుట సరికా దని నాయభిప్రాయము.

ఒకదొరగా రిట్లు వ్రాసియున్నా రనియు, తిలకమహాశయుఁ డట్లు వ్రాసియున్నాఁ డనియు, వైద్యాగా రన్నా రనియుఁ జెప్పినంతమాత్రమునఁ గాలనిర్ణయము సరియైన దని నిర్ణయింపఁగలమా!

ఏమైనను భారతయుద్ధము క్రీస్తుపూర్వ మెన్నో వందల సంవత్సరముల క్రిందట జరిగియుండుట నిశ్చయము. ఆయుద్ధ మైన కొలఁదికాలమునందే వ్యాసుఁడు మహాభారతసంహితను రచించి వేదము సంతచెప్పినట్లు శిష్యులకు నీసంహితను గూడ నేర్పియుండును. అది వారివలన లోకమున వ్యాప్తి గాంచిన దని చెప్పుట కభ్యంతరము లేదు.

చిరకాలమునుండి శిష్యపరంపరగాఁ గంఠస్థములై వచ్చు వేదములును, బురాణసంహితలును, గొంతకాలమునకు వ్రాతప్రతులందుఁ జేర్పఁబడినవి. మన సంస్కృతవాఙ్మయమంతయు లిఖితరూపమై యున్నప్పుడు మన గ్రంథములం దనేకప్రక్షిప్తభాగములు చేర్చుట కవకాశమున్నది ఆకాలమునందే మనభారతసంహితయందు పెక్కులు ప్రక్షిప్తాంశములు చేరియుండు ననినాయభిప్రాయము.

ఆమహాగ్రంథమునందు పూర్వాపరవిరుద్ధభాగములు చేర్చి భారతసంహితను దాఱుమాఱుచేయునంత యవసర మెవ్వరికిఁ గల దని ప్రశ్నింపవచ్చును? ఆవిషయమై కొంచెము చర్చింపవలసియున్నది.

ఆర్షమత మని నామాంతరము గలమనహిందూమతము చిరకాలము నాఁటిది. ఆమతమును ధ్వంసముగావింపఁ బెక్కుమతములవారు యత్నించినట్లు తెలియుచున్నది. అందఱిలోను బెక్కుశతాబ్దములకాలము మనమతముతోఁ బ్రతిఘటించి హోరాహోరిని పోట్లాడినవారు బౌద్ధులు. వారు మనమతమునకు ముఖ్యాధార మగువేదములు పౌరుషేయము లని వాదించి యెంతహేయముగాఁ జూచినారో, వేదోక్తము లగుయజ్ఞయాగాదుల నెంతటిక్రూరకర్మములుగా నాలోచించినారో మహాశయులకు నేను వేఱె చెప్ప నక్కఱలేదు. అంతియే కాదు. బౌద్ధులు మనమతమందు హేయభావము పుట్టించి హిందువులను దమమతములోఁ జేర్చుకొనుటకై చేసినపను లనేకములు మనహిందూమతగ్రంథములు లోపభూయిష్ఠ మైన వని నిరూపించుటకై మనమతమందలి ప్రధానదేవతలను, మతోద్ధారకు లగుగురువులను హీనాతిహీను లగు మానవులకంటె నధము లని తోఁచునట్లు చేసినారు. ఇట్టి నింద్యాంశములగు భాగములను మనగ్రంథములలోఁ జేర్చి రనుటకు సందియము లేదు. వా రంతపని చేయుదురా యని సందియ మంద నవసరము లేదు. వార లట్టివార లని చెప్పుటకు నిదర్శనము లున్నవి.

మొదటిమతాచార్యులు సత్త్వప్రధాను లయి యింద్రియనిగ్రహు లై మహాప్రభావయుతు లై యున్నను, రానురాను కొందఱు కేవలము మతావేశదూషితమనస్కు లై తమపంతము నెగ్గించుకొనుటే ముఖ్యమని యెంచి పలు మోసములు గావించినారు. ఇందుల కొకచరిత్రాంశము గలదు.

బౌద్ధులు తమమతవ్యాప్తికై బర్మాదేశమునకుఁ బోయియుండిరి. అచ్చటి రాజులకును, ప్రజలకును దమయందు నమ్మకము గల్గించుకొనుటకై చెట్లకుఁ గన్నములు చేసి వానియందుఁ గొన్నియుత్తరములు వ్రాసిపెట్టి యాకన్నములుపూడిపోవువఱకును గొంతకాలము వేచియుండి వారిసమక్షమునందే యాచెట్లను పగులఁగొట్టించి యాయుత్తరములు వారికిఁ జూపి యీశ్వరుఁడు చెట్లద్వారమున మనకు మతోపదేశము చేయుచున్నాఁడని చెప్పి వారి నాశ్చర్యచకితులనుగాఁ జేసెడివా రని బర్మాచరిత్ర వలనఁ దెలియుచున్నది.

మతద్వేషములు పెచ్చుపెరిఁగినకొలఁదిని బౌద్ధులేకాక మనహిందువులుకూడ మతవిరుద్ధము లగునంశములను బౌద్ధులని బుద్ధపిటకములలోఁ జేర్చినట్లును, అశోకచక్రవర్తి నానాదేశములనుండి, ఆఱువందలమందిపండితులను రప్పించి తొమ్మిదినెలలకాలము సభ గావించి చైనా, జపాను, సింహళము మొదలగు దేశములనుండి వచ్చినవారిగ్రంథములలోఁ గనఁబడక, కేవలము హిందూదేశమునఁ గలబౌద్ధగ్రంథములలో మాత్రమే యున్న మతవిరుద్ధభాగములను, ప్రక్షిప్తాంశములని వారిమతగ్రంథములనుండి తొలఁగించి శిలాఫలకములపైఁ దన్మతధర్మములను జెక్కించినట్లు నశోకచరిత్రమువలనఁ దెలియవచ్చుచున్నది.

పై యంశముల నాలోచింప మనగ్రంథములలో బౌద్ధులును, బౌద్ధగ్రంథములలో మనవారును వారివారి కనుకూలములును, రెండవవారికిఁ బ్రతికూలములు నగుప్రక్షిప్తభాగములం జేర్చి రనుట నిర్వివాదాంశము.

బౌద్ధమతగ్రంథములను నశోకచక్రవర్తి నిర్దుష్టములుగాఁ గావించినట్లు మనహిందూమతగ్రంథములను బరిశోధించి ప్రక్షిప్తములను నిర్ణయించి వానిని దొలఁగించునట్టి మతాభిమాని పుట్టకపోవుట మనదురదృష్ట మని చెప్పవలసియున్నది. కొంతకాలమునకు మనమతగ్రంథములందు బౌద్ధు లొనర్చు నాక్షేపణము లుండుటచే మనవారు చేయునది లేక వానియందు దేవతామహిమ లారోపించి యెట్లో సమాధానములు చెప్పుకొనవలసినవా రైరి. ప్రాంత

రూపముగా నున్నమతగ్రంథము లన్నియుఁ గొంతకాలమున కచ్చుపడి దేశమందు వ్యాపించి స్థిరపడి పోయినవి. ఆగ్రంథములలోని యంశముల నేమాత్రము మార్చినను మహాప్రత్యవాయము సంభవించు నని కూడ హిందూపండితులు నమ్మసాగిరి.

ఇట్టిమార్పులు మనమతగ్రంథములందుఁ గల్గుట మొన్నమొన్నటివఱకును గూడఁ గల దని నా ప్రత్యక్షానుభవము. శ్రీయుత శ్రీనివాసయోగిగారు శ్రీమదున్నాముసభకువచ్చి, విధవావివాహము వేదసమ్మత మనియు నాయంశము వేదములలోనే యున్న దనియుం జెప్పి యొకసభ గావింపఁగోరిరి. అది విని యచ్చటిపండితమండలి యంతయు నాశ్చర్యముచెందినది. మధ్యాహ్నము సభ. అందు మహామహులగు శాస్త్రపండితులు వేదపండితులును బెక్కువం దలమంది గూర్చుండి యోగిగారికి వార్తపంపఁగా వారు "తలనొప్పిచే బాధితులగుటచే సభకు రాఁజాల మ"ని చెప్పి తమయొద్దనున్న వేదగ్రంథమును పంపించిరి. వారు చూపినభాగమున విధవావివాహవిషయ మున్నది. అందులకుఁ బండితు లాశ్చర్యముచెంది వేదపండితులను బిలిచి యాభాగమును జెప్పఁ డనఁగా వారు పూర్వపుపనస మొదలుపెట్టి యనర్గళముగాఁ జదువఁ దొడఁగిరి. కాని యాపనసలోని కొంతభాగ మెవ్వరికిని రాలేదు. అందుచే నది ప్రక్షిప్తాంశమై యుండవలె నని నిశ్చయించిరి. అంతతో నూరకుండక కాశీపట్టణమునుండి యు, బొంబాయినుండి యు వేదగ్రంథములను దెప్పించి చూడఁగా నాయంశ మాగ్రంథములందుఁగూడ లేకపోయెను. అది యొక్క కలకత్తాప్రతిలోమాత్రమే కలదు. అదియునీశ్వరచంద్ర విద్యాసాగరులు ముద్రింపించిన ప్రతిలోమాత్రమే ? ఆకాలమున విద్యాసాగరుఁడు విధవావివాహప్రచారము చేసినవాఁడు కావున నది తత్కృతమై యుండవలె నని నిర్ణయించిరి.

ఈయంశముల నాలోచింప మనమతగ్రంథములు ప్రక్షిప్తభాగదూషితము లైన వని నానమ్మకము. అట్లు ప్రక్షిప్తదూషితములైన గ్రంథములలో మహాభారత మొకటి.

భారతః పంచమోవేద" యను పండితోక్తిగలదు. భారతము సకలశాస్త్రసమ్మిళిత మనియు మహోత్కృష్ట మైన దనియుఁ జెప్పుట యతిశయోక్తి కాదు, ఆభారతమును ధర్మజ్ఞులు ధర్మశాస్త్ర మని, తత్త్వజ్ఞులు వేదాంత మని

యు నీతివిశారదులు నీతిశాస్త్ర మనియు, కవులు మహాకావ్య మనియు నిట్లు సర్వజనపూజితమైన దనుటకు సందేహము లేదు. ఈమహాగ్రంథమునఁ బ్రక్షిప్తాంశములు పెక్కులుచేర్పఁబడినట్లు విమర్శకు లందఱు నంగీకరించియే యున్నారు. కాని వారికిని నాకును నొకభేదము, వారాభాగములను వైశంపాయనుఁడో సౌతియో చేర్చెనని యందురు. అట్లు చేర్చినవారు హిందూమతద్వేషులైన బౌద్ధులు కాని వైశంపాయనాదులు కారని నామతము.

హిందూమతవిరుద్ధము లగు ప్రక్షిప్తభాగములు భారతమునం దున్నవన్న దృష్టితోనే భారతమును విమర్శింపవలయును గాని యున్న దున్నట్లు విమర్శనార్హము కాదని నాయభిప్రాయము.

మహాజనులారా ! మహాభారతమున నాదిపర్వమునందుఁ బ్రక్షిప్తభాగము లని నాకుఁ దట్టినవానిని గొన్నింటి నుదాహరించుచున్నాను. నాచెప్పినది పూర్వపక్షముగా భావించి యది న్యాయ్య మని తోఁచినచో మేధావంతు లగుపండితు లందఱును సిద్ధాంతమును గావింపవలయు నని నామనవి.

బౌద్ధులు మనహిందూమతమున ముఖ్యులైన వారికి లోపము లంటఁగట్టవలె నని తలంచి హిందూమతబోధకము లగుపెక్కుగ్రంథములను రచించి మతోద్ధారకుఁడును, మతగురువు నగు వ్యాసునియందు లోపము లారోపించుటకు భారతమునఁ గొన్నిభాగములు గల్పించినారు. బౌద్ధకల్పితభాగములు సత్యము లని నమ్మి, వైద్యాపండితుఁడును, పండిత సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మొదలగువారు, ఆభాగమును విమర్శించి వ్యాసుఁడు, సంకరజాతివాఁ డనియు నిషాదుఁ డనియు, చండాలుఁ డనియు వ్రాసినారు. మనచరిత్రకారు లిట్లు వ్రాయుట వలన బౌద్ధుల కోర్కులు సఫలము లైనవి. మనహిందూమతము సర్వోత్కృష్ట మైన దని మనపండితులు వాదించునపుడు బౌద్ధులు పై భారతభాగములను జదివి "ఓహో ! మీమతము చెప్పెడిదేమి ? మీవ్యాసుఁడు నిషాదస్త్రీకిఁ బుట్టినవాఁడు. వాఁడు చండాలుఁడు. వాఁడు మీకు మతగురువైనాఁడు. అతని శిష్యులగు మీరందఱును చండాలురరే" అని మనమతమును, మనమతగురువులను నిందింప సాధనము లేర్పఱచుకొనిరి. గ్రంథస్థము లగునాయా భాగములను జూచి మనపండితులు చేయునది లేక వాని నుపాయాంతరముచే సమర్థింపఁ బ్రయత్నములు చేయఁదొడఁగిరే కాని యది యెంతవఱకు సత్యమో యోజింపరైరి. అందుల కతనియందు దేవతామహిమ నారోపించి వ్యా

సో నారాయణో హరి" అన్నాఁడు, అతఁడు కేవలము భగవంతుఁడే, అతనికి లోపము లేమి?'' అని యెట్లో సమాధానపడి యెదుటివారిని సమాధానపఱుపఁజూచిరికాని మతద్వేషు లీఘోరమును గల్పించి యుందు రని యూహింపత్తైరి. ఒకవేళ వ్యాసుఁ డట్టిచండాలుఁడే యైనచో నాకాలమునఁగాని తరువాతికాలమునఁ గాని సదాచారసంపన్ను లగుమును లాతనిని బహిష్కరించి యుండరా? మనవిమర్శకులే యతనికి పైల సుమంతు జైమిన్యాదులు శిష్యులని యంగీకరించినారు. బ్రాహ్మణజాత్యభిమానవంతు లగువా రతనియొద్ద శిష్యత్వము నంగీకరింతురా? జాతిభేదము లేదని సర్వజాతిసమ్మేళన మిప్పటివారిలోఁ గొందఱంగీకరించినను బూర్వకాలికు లట్టివారు కారుకదా? ఋగ్వేదదశమ మండలములో 42-43-44, సూక్తములు వ్యాసప్రోక్తము లని శ్రీయుత సుబ్రహ్మణ్యశాస్త్రిగా రంగీకరించియున్నారు. వేదమునకు శూద్రులు గూడనర్హులు గారని వాదించు మనపూర్వులు కిరాతుఁ డగువ్యాసుఁడు ఋగ్వేదసూక్తములకుఁ గర్తగా నెట్లంగీకరించియున్నారో? అట్టివ్యాసుని మనవార లిప్పటికి నెట్లు గౌరవించుచున్నారో యోజింపవలసియున్నది. శ్రీసుబ్రహ్మణ్యశాస్త్రిగారు వ్రాసినట్లు వ్యాసుఁడు కిరాతుఁడే యైనచో, అతఁడు విధవలగు నంబాంబాలికలతో సంగమించి గర్భము గావించినవాఁడే యగుచోఁ, గులాభిమానులును, గౌరవాభిలాషులునగు పూర్వులు వ్యాసుని సంఘబహిష్కృతుని జేయకమానరు. అతనియం దింతయును గౌరవ ముంచరు. ఎంత గొప్పవాఁడైనను సరియె యించుక లోపములు గలవాఁడైనచో వాని నాకాలపువారు గాకపోయినఁ దరువాతివా రైనను నగౌరవింపక మానరు. ఇది మానవస్వభావము. ఇట్లుండ నెన్నో వేలవత్సరములనుండియు గౌరవింపఁబడుచున్న వ్యాసున కిట్టి లోపము లుండునా యని మనమాలోచింపవలసియున్నది.

వ్యాసునియవతారఘట్టమును బరిశీలింప నెంతయసందర్భముగా నున్నదో చూడుఁడు. పరాశరుఁడు వసిష్ఠసంతతిలోనివాఁడు. జితేంద్రియుఁడు, మహాతపోధనుఁడు, తీర్థయాత్రాపరుఁడు. ఇతఁడు యమునానదిని దాఁటుచుఁ బడవనడుపుచున్న సత్యవతిని గాంచి కామించి పగటిపూఁటఁ బరులు చూడకుండ నీహారమును గల్పించి యచ్చటనె సంగమించి వ్యాసునిఁ గన్నట్లు భారతమునఁ గలదు. ఆలోచింప నిట్టిసంఘటనము కేవలము స్వభావాతిక్రాంతమనుటకు సందియములేదు. అట్టి జితేంద్రియుఁ డగుపరాశరుఁడు, ఒకప్పు డా

మెయందనురాగము గలవాఁడైనను నగుఁగాక, అంతియకాని ముండలము టాకోరనఁదగినవాఁడు కూడఁ జేయఁజాలని కృత్య మాచరించెనా? నిజముగాఁ బరాశరుఁ డట్టిచంచలుఁడైనచో, నంతటి నీచుఁడైనచో వానిగౌరవమునిలుచునా? మఱియు సంస్కృతమున "పరాశరేణసంయుక్తా సద్యోగర్భం సుసావసా, జజ్ఞేచ యమునాద్వీపే పారాశర్య స్సువీర్యవాన్" అని యున్నది. ఇది యెట్లు సరిపడును? తత్కాలమున గర్భోత్పత్తి యయిన నగుఁ గాక, కాని, తాత్కాలికజన్మ మెట్లు సంభవించును? కావున లోకస్వభావ విరుద్ధ మగునీఘట్టము విశ్వాసార్హము కాదు. ఇది కేవలము హిందూమతద్వేషు లగుబౌద్ధులు కల్పించినది.

మఱి వ్యాసజన్మ మెట్లని ప్రశ్నింపుఁడు. భారతములోఁ బెక్కుభాగములు ప్రక్షిప్తము లనియుఁ, దాఱుమాఱయిన వనియు విమర్శకు లందఱును సమ్మతించిన విషయమే. అందుండి సత్యమును నిర్ణయించుట కష్టసాధ్యము. పెక్కండ్రు పండితులు చేరి హిందూమతసంప్రదాయస్వభావముల ననుసరించి నిర్ణయింపవలెను. నే నొకమార్గమును జూపెదను, అందలి గుణదోషములను బరిశీలించి సిద్ధాంతీకరింపవలసినవారు పండితులు. సంస్కృతమహాభారతమును బరిశీలనదృష్టితో నీవ్యాసావతారఘట్టము, ఉపరిచరవసువు వృత్తాంతములోఁ జెప్ప నవసరము లేదు, ఇది యిక్ష్వాకులకు మార్పఁబడె ననఁగా నుపరిచరుని వీర్యోత్పన్నురాలగు సత్యవతిని బరాశరునితోఁ గూర్చుటకు. కాని, యది సరిగాదు. యమునాద్వీపమునందుఁ బరాశరుఁ డనుమహాముని గలఁడు. అతని తపోమహిమను గుఱించియు గుణగణములను గుఱించియు భారతమునందు వర్ణన గలదు. అట్టిపరాశరునికి సత్యవతి యనుభార్య గలదు. ఆసత్యవతీపరాశరుల వలన వ్యాసుఁ డుదయించెను. పరాశరుని యపత్య మగుటచేఁ బారాశర్యుఁ డనియు, సత్యవతి కుమారుఁ డగుటచే సాత్యవతేయుఁ డని యు, నల్లని దేహచ్ఛాయ గలవాఁ డగుటచేఁ గృష్ణుఁ డనియు, ద్వీపమున జనించినవాఁ డగుటచే ద్వైపాయనుఁ డని యు నామములు గల్గినవి. పరాశరునిభార్య సత్యవతి వేఱు, ఉపరిచరుని కూఁతురగు సత్యవతి వేఱు. లోకములో నామసామ్యుఁ డుండఁ గూడదా! శంతనువంశోద్ధారకురా లగుసత్యవతికి వ్యాసుఁడు పుట్టె నని చెప్పి కథను తాఱుమాఱుచేసినారు. అందలితత్త్వమును గ్రహింప యత్నింపని మన వారికిఁ బూజనీయుఁ డగు వ్యాసభగవానుఁడు, నిషాదుఁడుఁ జండాలుఁడు

నైనాఁడు. ఆవ్యాసమహర్షి మహాతత్త్వవిదుఁ డగుటచే నతఁ డొకవేళ నీకాలము దున్నను, తన్ననవసరముగా నమితముగా నిందించుచున్నవారిపైని దగవులు తెచ్చువాఁడు కాఁడు. అందుచే నతఁ డందఱకును లోకువవాఁడై పోయినాఁడు.

వ్యాసమహర్షి పురాణములను, శాస్త్రములను, బ్రహ్మసూత్రములను మతమునకును, లోకమునకు నుపయోగించువానిని వ్రాసియున్నాఁ డని చిరకాలమునుండి పండితులు చెప్పుచున్నారు. హిందూమతాభివృద్ధికిఁ బ్రధానుఁ డగు వ్యాసున కిట్టికళంక మారోపించి హిందూమతమును, హిందువులను నిందించుటకుఁ దగినయవకాశములను మతద్వేషులు కల్పించుకొన్నారు.

ఇట్లే కుంతి, ద్రౌపది, పాండుఁడు, ధృతరాష్ట్రుఁడు, ధర్మరాజు మొదలగువారియందుఁ గూడ లోపము లారోపించినారు. వానిని గూర్చి ముందు వ్యాసములలో వ్రాసెదను.

వ్యాసావతారఘట్టము నిట్లు సరిచేయుటవలనఁ గొన్నిశ్లోకములు మాత్రమే ప్రక్షిప్తము లనవలసివచ్చుచున్నది. కాని, విశేషభాగము కాదని మనవి చేయుచున్నాను.

శ్రీరస్తు.

# ఆంధ్రసాహిత్య పరిషత్ప్రశంస.

— అల్లముసెట్టి అప్పయ్యగారు, పొందూరు. —

---

గీ. ఈవు జనియించి యబ్దంబు లిరువ దయ్యెఁ, బ్రాభవైతి వరిష్టముల్ వాసిపోయె
నేఁడు నైశాఖపురెనిన్నుఁ జూడఁ గంటి, నాంధ్రసాహిత్యపరిషదంబా! జోహారు.

గీ. పండితాఖండలుల చేత నిండియున్న, నేఁటిసాహిత్యసభ కధినేత యగుచుఁ
దాత సుబ్బరాయమనీషి తనరియుండఁ, బరిషదంబ భవద్భాగ్యపటిమ కాదె.

సీ. ఆంధ్రభాషాభ్యుదయాభివృద్ధికి సదా పూనుయత్నమె పెనుమ్రాను నీకు
హృదయంగమానేకపదభావరచనలే భవ్యశాఖాపరంపరలు నీకుఁ
జర్చాసమాధానసదములోద్వృత్తులే రామణీయకపత్రరాజి నీకుఁ
ప్రస్ఫురద్రసయుక్తపద్యజాలంబులే యామోదమధురఫలాళి నీకుఁ
గాఁగ, సువిశాలకల్పవృక్షంబవగుచు వెలసిమించితి వాంధ్రభూవలయమందు
స్థిరతరోన్నతిఁ గాంచి వర్ధిల్లెదుగాక, భవ్యకవిరాణ్ణిధానంబ! పరిషదంబ!

సీ. శ్రీపీఠికాపురీభూపాలవర్య సత్కృప గల్గియుండ నీ కేమికొదవ
కార్యభారం బూని కాపాడెడు జయంతి రామయార్యుం డుండ నేమికొదవ
యండవాయక మహాపండితోత్తములు నిన్నెలమి నారాధింప నేమికొదవ
పరిపూర్ణభక్తితత్పరులౌచు బహుజనుల్ ప్రేమించుచుండ నీ కేమికొదవ
తీరుతీయములైన నీ తెనుఁగునుడువు, లెంతకాలము పృథివిపై నెసకమెసఁగు
నంతకాలము స్వేచ్ఛమై నతిశయిలెదు, ప్రథితవిద్యాకదంబ! శ్రీపరిషదంబ

సీ. నేలపాలయినట్టి నిఖిలశాసనముల గ్రహియింపఁగా సమకట్టినావు
శిథిలతం గన్న ప్రాచీనపుస్తకముల ముద్రణం బొనరింపఁ బూనినావు
ఆంధ్రవాఙ్మయదీప్తి యస్తమించుటఁ జూచి పలుతెఱంగుల మేలుకొలిపినావు
ఆంధ్రాభ్యుదయమున కగుకార్యముల నెల్లఁ జక్కఁ జేయుచుఁ గృషిసల్పినావు
సకలవిద్వత్ప్రశాసనసంస్తుతిఁ గొని, జరపుచున్నావు సభలు విస్తారముగను
ఏమిలోటగు నీపుత్త్రు లిందఱుండ, భాసురయశోధనాలంబ! పరిషదంబ!

సీ. గ్రాంథికభాషయోగ్యతఁ దెల్పదీక్షమైనొక నిఘంటువుఁ గూర్చుచుండుకొఱకు
గ్రామ్యవాదమ్మును ఖండింపఁ దగినట్టి పత్రికఁ జేపట్టి ప్రబలుకొఱకు

విద్యాధికులకు సద్బిరుద పట్టము లిచ్చి తన్మూలమున ఖ్యాతిఁ దనరుకొఱకుఁ
తెలుఁగువాఙ్మయ మదెంతే యభివృద్ధిని గాంచుభారము నిర్వహించుకొఱకు
జననమందినావు క్ష్మాతలేంద్రులప్రాపుఁ, జెందినావు యశము నందినావు
ధన్యచరిత వీవు తలఁపందగదె నిన్నుఁ, ప్రముఖకవికదంబ! పరిషదంబ! ౬

సీ. ఘనుని వాగనుశాసనుని మెచ్చుకొనినయా రాజమహేంద్రునినాఁటి ప్రతిభ యెల్లఁ
తిక్కనాదులఁ జాల మక్కువంగను మనుమసిద్ధీశ్వరునినాఁటి స్థిరత యెల్ల
శ్రీనాథసుకవిరాట్ఛేఖరులాలించు రెడ్డిభూపులనాఁటి రీతు లెల్ల
అలసాని పెద్దనాదులకు గౌరవమిడ్డ కృష్ణరాయలనాఁటి విభవ మెల్లఁ
గాలవశతను లభియింపఁగలదు నీకు, భవ్యతరకీర్తిడోలికాపటలి నునిచి
మధురగీతలు వాడు సన్మతులు గలరు, భాగ్యశాలిని వయ్యెదు పరిషదంబ·

శా. పారోదారమనీషు లంచితకళాచాతుర్యధుర్యుల్ మహా
ధీరుల్ నీతనయుల్ గదమ్మ! యిఁక నేదీ నీకుఁ గష్టం బహో!
సూరిధ్యేయవు నై యితోధికయశోస్తోకప్రభావాఢ్య వై
భూరిప్రాభవ మొప్పఁగాఁ బరిషదంభోజాక్షి వర్ధిల్లుమా! ౮

గీ. భక్తిపారవశ్యం బగు ప్రణతి నిట్లు, పద్యమాలికలను సమర్పణ మొనర్చి
యాంధ్రసాహిత్యపరిషత్సభాంతరమునఁ, బలికె నల్లము సెట్టియప్పయ్య వేంక.

శ్రీరస్తు

# సంగీతసాహిత్య సమ్మేళనము.

(వీణాదిసంగీతస్వరపరాత్పరస్తుతి)

తోడీరాగము—రూపకతాళము.

— సత్యవోలు రాధామాధవరావుగారు —

సీ. ధానిని ధనిగాగ దానిగాసగదపమరిమరిసదమనీగరిమగాద
నీపాదదాసరి నీధామగనిసాగనీపసాదమగదా నిగమధామ
నీసాని మామానినిగదా గదాధారి పాపారిమదదమపాదప
పాపగాపరినిమాపగదరినిధనిగా గనిమరినీధామ మనిరిగాద
సాగరిసమాగమా! మాని సమ్మదమగ, సదగ పరిపరిపధగసామగాని
మామమామ, మదాపదమాపదగద, సరిగనీపదమదగనిసపదదాస.

టీక. ధాని=ధానములు-అనుకులుకలవాఁడు, ధాని=కుచేలుఁడు, వానిని, ధనిగాగ=ధనవంతుఁడగుటకును, దాని=ఏనుఁగు యొక్క, గాస=దుఃఖమును, గదప=పోఁగొట్టుటకు (గజేంద్రునిరక్షించుటకును) మరిమరి=మిక్కిలి. సదమ=దమయుక్తుఁడా, నీగరిమగాద=నీప్రభావముగాదా! నీపాదదాసరి=నీపాదభక్తుఁడు, నీధామగనిసాగ=నీస్థానమగు వైకుంఠపదము నొందుటకు, నీపసాదమగదా=నీయనుగ్రహమేగదా, నిగమధామ=వేదము నిలయముగాఁగలవాఁడా, నీసానిమామానినిగదా=నీభార్య లక్ష్మీదేవిగదా_గదాధారి, గదయనునాయుధమునుధరించినవాఁడా, పాపారిమదదమ=పాపులగు శత్రువుల మదమణంచువాఁడా, పాదపాథ=పాదములం దుదకముగలవాఁడా, పాపగాపరినిమాపగ=శిశుపాలుని మాపుటచే, దరిని ధనిగాగనిమరి, సమీపముననే మృతిఁబొందినవానిగా నతనిజూచి, మరినీధామమనిరిగాద=మరియునది, నీమహాశక్తి యనిరిగాదా, సాగరిసమాగమా=లక్ష్మీసమాగమముకలవాఁడా, మాని=అభిమానవంతుఁడా! సమ్మదమగ=సంతోషముగా, సదగ=మంచిపర్వతముల విహరించువాఁడా, పరిపరిపధగ=అనేకవిధము లగుమార్గములు గలవాఁడా, సామగాని=సామగానవేత్తలతోఁగూడినవాఁడా, మామమామ=మామకు మామవైనవాఁడా, మదాపదమాపదగదా=మాయాపదలనడంపరాదా, సరిగనీపదమదగని=సరిగానీపాద మదియే ధననిక్షేపము, సపదదాస=పాదభక్తులతోఁగూడి యుండువాఁడా!

— మృదంగవాద్యాదిశబ్దస్తుతి —

సీ. కృతతతోంకృతి, కణాకృతిధుతాబ్ధిదళాంగ తతతిమితమధితోదధికిణాంగ
ధృతకిటిత, హతాహిత, తలాంగధుతతమి, దారితారితకృత్తతాళతతిది
గధిగతదీధితికటధిగతాహత, దధిధిధీధీ క్కృతదరకృతాంత
ధారితారిదరాంగ తద్ధితోదధిభవా, కృతకరఝాంకృతిఝరినృత్తరంగ
తారితభవోదధిహృతాధితత్తదహిత, కృధనితాంతాంతరంగామితధిధుగుదధి
దరదరద ముక్త దిక్కరి తారగిరివి, యత్సరిత్కందరదకుందయశ ముకుంద.

టీక. కృత=చేయఁబడుచున్న, తతోంకృతి=వ్యాప్తమైన, ఓంకృతిగలవాఁడా, కణాకృతి = అణుస్వరూపుఁడా, ధుతాబ్ధిదళాంగ = ఉప్పొంగుచున్న సముద్రమందలి వటపత్త్రమున శయనించు శరీరముగలవాఁడా, తతతిమిత=వ్యాప్తమైన మత్స్యభావము గలవాఁడా. (మత్స్యావతారమా) మధితోదధికిణాంగ=తరచునట్టి సముద్రమున కాయలుగాచిన దేహము గలవాఁడా (కూర్మావతారమా) ధృతకిటిత = ధరించిన వరాహరూపము గలవాఁడా, హతాహిత = శత్రుసంహారకా (నృసింహావతారము) తలాంగ = భూమిపై దేహమును ధరించిన వామనమూర్తి, ధుతతమి=మోహమును, వీడినవాఁడా, దారితారిత = కొట్టఁబడిన శత్రుత్వముగలవాఁడా, (పరశురామావతారమా) కృత్తతాళతతి = నఱికివేయఁబడిన సప్తతాళపత్త్రములు గలయో శ్రీరామావతారమా, దిగధిగతదీధితి=దిక్కులయందు పొందఁబడిన కాంతిగలబలరామావతారమా, కటధిగతాహతదధిధి=అగ్రస్థానమును పొందినట్టియు తీసికొని క్రోలుచున్న పెరుఁగుకుండలు గల శ్రీకృష్ణావతారమా, ధీధిక్కృతదర=బుద్ధిచే తిరస్కరింపఁబడిన భయముగలవాఁడా, స్వబుద్ధిచే సంసారభయమును నశింపఁజేసిన బుద్ధావతారమా, కృతాంత=చేయఁబడిన యంతముగల కలికిస్వరూపా, ధారితారిదరాంగ=ధరించఁబడిన, చక్ర, శంఖములు, గలవాఁడా, త్వద్ధితోదధిభవా=నీకు హితురాలైనమహాలక్ష్మిగలవాఁడా, అకృతకరఝాంకృతి ఝరి=సత్యమైన ఝాంకారముగల ఆకాశగంగగలవాఁడా, నృత్తరంగ=నాట్యము చేయు రంగస్థలముగలవాఁడా, రాసకేళీవినోది! తారితభవోదధి=తరింపఁజేయఁబడిన సంసారసముద్రముగలవాఁడా, హృతాధి=హరింపఁబడిన యాధిగలవాఁడా, మనోవ్యాధు లడంచుమహానీయా! తత్తదహితకృతి=ఆయాశత్రువులందుఁ గోపముగలవాఁడా, నితాంతాంతరంగామితధి=ఎల్లప్పుడు హృదయమునం దమితమైన బుద్ధిగలవాఁడా, ధుగుదధి=పాలసముద్రము, దర=శంఖము, దరద=పాదరసము, ముక్త=ముత్యములు, దిక్కరి=దిగ్గజము, తారగిరి=వెండికొండ, వియత్సరిత్=అకాశగంగ, కంద=మేఘము, రద=దంతములు, కుంద=మల్లెమొగ్గలు, ఇటువంటి, యశ=కీర్తి గలవాఁడా, ముకుందా=పరాత్పరా !

# స్వాగత గీతి.

— సెట్టి లక్ష్మీనరసింహముగారు బి. ఎ., విశాఖపట్టణము. —

---

స్వాగతము, స్వాగతము, మా విశాఖపురికి, ఆంధ్ర సాహిత్యపరిషన్మహాజనులకు
మీకుఁ, దత్పరిషత్సభాలోకనేచ్ఛ, వచ్చియున్నట్టి మీకును స్వాగతంబు!
మొదట విశ్వవిద్యాలయమ్ములు నెలకొనఁ, బిదప సాహిత్యపరిషత్తులౌ వివిధ
విద్యలను బహుధా నభివృద్ధిపఱుచు, నాంధ్రవిశ్వవిద్యాలయం బరుగుదెంచె;
యాంధ్రసాహిత్యపరిషత్తు నరుగుదెంచె, మా విశాఖపురమునకు భావివృద్ధి
కలుగఁ గలదనుటకు సూచకమ్ములనుమ్మ, దాగమన మట్టి మీకెల్ల స్వాగతంబు!
ఆంధ్రభాషాపరిశ్రమయందు వెనుకఁ, బడిన [illegible] యిడను నభిప్రాయము గల
యట్టివారలయ్యు వ్యయప్రయాసములకు, జంకక నరుదెంచితిరి మా విశాఖపురికిఁ
గవులు, పండితుల్ విద్వద్గ్రేసరులు గ్రంథకర్తలు విమర్శకులు, పత్రికాపతులు న
నేకశాస్త్రవేత్తలగు మీరిట్టి దొడ్డ, యతిథులకు మీకిదే మాదు స్వాగతంబు!
మా పురమునకు మిమ్ము నామంత్రణంబు, చేసినట్టి వారీ పురవాసులందు
వాసి గని యాణిముత్తెపుం బూస భంగిఁ, గా వెలుంగు శ్రీవిక్రమదేవవర్మ
గారు; జయపుర రాజ్యరమారమణి స్వ, యంవరవధువు కాఁగలదాయనకిఁక;
మిగులఁగ శుభప్రదంబయ్యె మీదు రాక, యాకతంబున మీకు మా స్వాగతంబు
ఆంధ్రపుస్తకాలయసభ యయ్యెఁ గాక, యుక్తసంవత్సరమున మా యూర మున్న
విజయనగరాధినేతయై వెలసినట్టి, శ్రీమదానందగజపతిక్షితిపమౌళి
లేక పోయెనంచును జింతిలితిమి నాఁడు, ఆంధ్రభోజుఁడా రాజు లేఁడన్న కొఱంత
యాంధ్రవిక్రమాఖ్యాభిధకవ్యుఁడగు సుధీవరుఁడు శ్రీవిక్రమదేవవర్మ
భూవరుండు వాపెను దత్ప్రభుని యతిథుల-రైన మీ కందఱకుఁ దగు స్వాగతంబు!
ఆమహారాజు హృదయంబున ట్టగాధ, మైతనర్చెడి యంబుధియందుఁ గలత
రంగముల జనించి, తదంతరంగమట్టు, లార్ద్రమై మృదువై చల్లనైన యుచటి
తెమ్మెరలు మంచి యగ్నికత్తెరలలోన, నేగుదెంచిన మీకిచ్చు స్వాగతంబు!
అంతె కాని మాదృశులు మీయట్టివారి, కర్హమగు స్వాగతమ్ము నీయంగఁ గలమె
లోటుపాటు లెన్నియొ యుండు లోపములను, గడుపుకొని మేము జరుపని గౌరవంబు
లెల్ల జరిగినయట్లుగానె తలంచి, సాదరమునఁ గైకొన్నుఁడు మా స్వాగతంబు.

# గ్రంథస్వీకారము.

## కళింగదేశచరిత్రము.

ఆంధ్రేతిహాసపరిశోధకమండలివారిచేఁ బ్రకటితము—సంపాదకులు శ్రీయుత రాళ్లబండి సుబ్బారావుగారు, ఎం. ఏ., యల్. టి., రాజమహేంద్రవరము 705 + 110 పుటలు- వెల 7-8-0.

ఈమండలివారిచేఁ బ్రకటింపఁబడిన రాజనరేంద్రపట్టాభిషేకసంచిక పాఠకలోక మెఱింగినదియే. 1926సంవత్సరముననే కళింగవర్ధంతి జరుపుట కేర్పఱుపఁ బడినను, కొన్నికారణములచే 1927 సంవత్సరమున జూను నెలలో ముఖలింగమున జరిగినది. అం దుపన్యసించిన పండితులయొక్క వ్యాసములను, మఱికొన్ని వ్యాసములను గూర్చి సంపాదకు లీగ్రంథమును ముద్రించిరి. కళింగదేశశిల్ప నాగరికతాదుల సూచించు ఛాయాపటము లిందుఁ జేర్పఁబడినవి. గ్రంథానుబంధమునఁ గళింగశాసనములు కొన్ని యాంధ్రానువాదముతోఁ బ్రకటింపఁబడినవి. ఈగ్రంథమును నేఁటికయినను బాఠకలోకమున కందఁ జేసిన మండలివారికిని, ముఖ్యముగ సంపాదకులకు మనము కృతజ్ఞులమై యుండవలయును. సంపాదకులచే నూటయిరువది పుటలలో నుత్తరదేశచరితము వ్రాయఁబడినది. డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారు, పండిత నీలకంఠదాసు, గొడవర్తి రామదాసుగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, కుందూరి ఈశ్వరదత్తుగారు, బుఱ్ఱా శేషగిరిరావుగారు మున్నగు చరిత్రవేత్తలవ్యాసము లిందుఁగలవు. కేవలము చరిత్రాత్మకమయినవే గాక ఆంధ్రవాఙ్మయచరితమున కుపకరించు కళింగాంధ్రకవులు, కళింగదేశ శతక వాఙ్మయము, కళింగశాసనములందలి తెలుఁగుభాష మున్నగువ్యాసములును, ముఖలింగక్షేత్రమాహాత్మ్యమును, సవరలు, కోదులు, కళింగవైశ్యులు, ఓఢ్రులు, మున్నగు మానవచరిత్రాత్మకవ్యాసములును గలవు. కళింగదేశచరిత్ర మింకను సమగ్రముగ నెవ్వరును రచించియుండలేదు. ఇటీవల బెనర్జీగారి యుత్కళచరితమునఁ బ్రథమభాగము ప్రకటింపఁబడినది. పెక్కుశాసనము లింకను బ్రకటింపఁబడుచున్నవి. వానియొక్కయు నిందలివ్యాసములయొక్కయు సహాయమున విపులముగ నాంధ్రమునఁ గళింగదేశచరితమును రచింపవలనుపడును. ఈగ్రంథమునఁ గల వ్యాసములలోఁ గొన్నియొక్క విషయమునే విశదీకరించినను, వ్యాసకర్తల వివిధోద్దేశములచే సహృదయరంజకములు గాకమానవు. ఆంధ్రపరిశోధకమండలివా రిట్టిగ్రంథముల నింకను బ్రకటించి కృతకృత్యు లగుదురుగాక యని తలంచుచున్నాము.

## శ్రీశూన్యలింగశతకము.

ఇది కాకినాడ లోకల్ ఫండ్ సబ్ డివిజన్ కార్యాలయములో నుద్యోగియగు మ. ఓలేటి సుబ్బరాయఁడుగారు రచించినది, శ్రీసీతారామాంజనేయ సంవాద సార సంగ్రహరూపము. ఇందు తారకయోగమున ౧౬ పద్యములును సాంఖ్యయోగమున ౪౮ పద్యములును, అమనస్కయోగమున ౩౫ పద్యములు నుగలవు. ఆటవెలఁదిగీతములు. వెల రు 0-1-0.

1 దినము దినమునందు తేజరిల్లు సుషుప్తి, స్వప్నజన్మమధ్య చావు వెలయు
సుప్తిమృతులయందు శోధింపబ్రహ్మంబె, సుభగపుష్పభృంగ శూన్యలింగ.
2 ఘటముగన్నవాఁడు ఘటసాక్షియనియగ్రు. ఘటము తాను కొకటిగాదు వలప
దేహసాక్షియన్న దేహంబు తానానె, సుభగపుష్పభృంగ శూన్యలింగ.

---

## పతివ్రతాశతకము.

నూజివీడులో శ్రీ మీర్జాపురం ఎస్టేటుగవర్నెసు (రాజభవనము)గా రగు శ్రీ. సౌ. చేబ్రోలు సరస్వతీదేవిగారిచేఁ బూర్వకవిశిఖామణుల గ్రంథముల నుండి సంగ్రహింపఁబడిన పద్యముల సంపుటి. ఇందు, కవిత్రయము, ప్రౌఢకవి మల్లనార్యుఁడు, శ్రీనాథుఁడు, భాస్కరుఁడు, మారన, నంది మల్లయ్య, ఘంట సింగయ్య, పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి, గోపీనాథము వేంకటకవి, మాదయగారి మల్లన్న, పింగళి సూరనామాత్యుఁడు, ననువారిగ్రంథములలోని పద్యములు గలవు. 8 పుటలు టిప్పణి గలదు. పతివ్రతలు చదువందగినది. వెల రు 0-4-0. మ. శ్రీ చేబ్రోలు రాజగోపాలరావుగారియొద్ద 6/143 కొత్తపేట, నూజివీడు వ్రాసినదొరకును.

---

## కవికల్పలత.

శ్రీమాళవేశ్వరప్రధానామాత్య దేవేశ్వరమహాకవి ప్రణీతసంస్కృత మూలమును, బ్ర. శ్రీ. కల్లూరి సుబ్రహ్మణ్యదీక్షితులవారి యాంధ్రవివరణమును గలది. ఇది కవికల్పలతయే. ఇది శబ్దస్తబకము, శ్లేషస్తబకము, కథాస్తబకము, అర్థస్తబకము నని 4 భాగములుగా విభజింపఁబడినది. ప్రతి స్తబకము నను నంతర్భాగములు పెక్కులుగలవు. కవిత్వావశ్యకములగు పదసంఘటనము, భావకల్పనము, రససామగ్రి, వర్ణనావిధానము, శ్లేషాదివివిధాలంకార రచనాభ్యాసము, సాదృశ్యవస్తునిరూపణము, గద్యరచన, చిత్రకవిత్వపద్ధతి, సమస్యా

పూరణము మొదలగు ననేకలక్షణము లిందుఁదెల్పఁబడినవి. బ్ర॥ శ్రీ గరిమెళ్ళ సోమయాజశర్మగారు కోటిపల్లిలో నీకవికల్పలతను గొంతభాగము సంపాదించి యాంధ్రీకరింప మొదలిడి స్వర్గతులు కాఁగాఁ దదసంపూర్ణగ్రంథమును దీసి కొని పూర్ణమాతృకను సంపాదించి పైదీక్షితులుగారు పూర్తిచేసి లోకోప కారమొనర్చి రఁట. ఇందుఁ గవి నేర్చికొనవలసిన యనేకవిషయములుగలవుఁ మచ్చుచూడుఁడు.

స్థిరములు—శ్లో. స్థిరాణ్యాజౌ భట సాధ్వీ ధర్మాధర్మా సతాం మనః
అస్థిరములు—అస్థిరా ణ్యబలా దోలాపాంగ పుత్రావనచంచలాః
స్వామిప్రసా దేభకర్ణ స్వప్న మత్స్య కపిశ్రియః.
మందగాములు—మందగాని శనిజ్ఞాని వృషహంసగజస్త్రియః
శ్లో. రూఢయౌగికమిశ్రాఖ్యా స్త్రిధాశబ్దాః ప్రకీర్తితాః
వ్యుత్పత్తివర్జితా రూఢా శ్శబ్దాఆఖండలాదయః.
యోగో గుణేనక్రియయా సంబంధేన కృతోన్వయా
గుణసాన్య న్నీలపీతాదిర్నీలకంఠాదయస్తతః
సంఖ్యాఅపి గుణాఏవ వై శేషికమతే తతః
పంచేషుషణ్ముఖదశగ్రీవైకదశనాదయః
కవిరూఢిచ్యుతా శ్శబ్దవపు ష్షట్కంధరాదయః.
శ్లేషస్తబకము- రూఢాదికుసుమము.

ఇట్టివానికన్నిఁటికి దీక్షితులుగారు వివరణమును, నవసరమగుతావులఁ బ్రతిపదార్థమును రచించిరి. 336 పుటలు. డెమ్మీ. దీనివెల రు 2-8-0. గోదావరి మండలములోని పోలవరములో ప్రకాశకు లగుబ్ర॥ కల్లూరి వేంకటసుబ్రహ్మణ్య దీక్షితులుగారియొద్ద దొరకును.

---

## ఆశ్చర్యచూడామణి.

శక్తిభద్రకవివిరచితసంస్కృతనాటకమునకు, విజయనగరము, నాట్యభార తీగ్రంథమాలికసంపాదకులగు బ్ర॥ మల్లాది విశ్వనాథకవిరాజుగారి తెనుఁగు-ప డంకములు రామాయణకథ. ఇందలియితివృత్తముసీతాపహారణముమొదలుసీతా స్వీకృతిపర్యంతమును- శక్తిభద్రుఁడు 1100 సంవత్సరముల క్రిందటిదాక్షిణాత్యుఁ డును శ్రీశంకరాచార్యశిష్యుఁడు నఁట. ఉన్మాదవాసవదత్తమను కావ్యమును గూడరచించినవాఁడఁట. ఈసంస్కృతనాటకముఁగ ళాశాలలలోఁబాఠ్యగ్రంథము

గానిర్ణయింపఁబడియున్నది. బాలమనోరమా సంపాదకులు దీనిని సంపాదించిరి. ఆంధ్రీకరించిన యీవిశ్వనాథకవిగారు ప్రకృతమున నాంధ్రలోకమునఁ బ్రసిద్ధులై యుండి నాట్యభారతీ గ్రంథమాలికను నెలకొల్పినవారు. కావున వారింగూర్చి విస్తరించి వ్రాయ నక్కఱ లేదు. ఉభయభాషా ప్రవీణులు, వీరుచితగతి నాంధ్రీకరించియున్నారనుటచాలును. ఈనాటకముపై విపుల మగువిమర్శనమును విశ్వనాథశాస్త్రిగారు ముందుఁ బ్రకటించెద మని తెల్పుచున్నారు. "ఇందలిగుణ మెల్ల శక్తిభద్రకవిది దోషముల స్వామ్యము ఫ్రాక్తిగ నాదే" యని తమయసాధ్యత్యమును బ్రకటించుకొనిరి. వీ రిట్టిసంస్కృతనాటకములం బెక్కింటిం దెనిఁగించి యున్నారని వినుచున్నారము. అవి యన్నియుఁ గ్రమముగ నాట్యభారతీ గ్రంథమాలికలో నాంధ్రలోకము చూడఁగలుగు నుపాయము నాంధ్రభాషాభిమానులోనర్తురుగాక శైలికై రెండుపద్యములు:—

శ్లో. ఏ తేస్వర్గవిభూషణాం విటపినో మన్దాకినీరోధసో
  ధీరం పశ్యతి దేవభర్తరి మహీం నేతుం మయోన్మూలితాః
  ఏష్వాచుమ్బతి రాజహంసమిథునం హేమామ్బుజాన్యేకతో
  దృష్ట్వా పల్లవ మేకతః సకలికం మాద్యన్తి పుంస్కోకిలాః. 5-24

ఉ. నాకవిభూషణంబు లివి నందనవృక్షము లింద్రుఁ డుండ మం
  దాకినియొడ్డునుండి భుజదర్పమునం బెకలించి తెచ్చితిన్
  ఈకడ నంచజంట మొగి హేమసరోజమరంద మానుఁ బుం
  స్కోకిలముల్ చివుళ్లు నవకోరకము ల్గొని చొక్కు నియ్యెడన్.

శ్లో. నయతి నయనే సావజ్ఞం మాం కరోతి కరావృతాం
  శ్రుతి మసహనా శ్రోత్రానన్దం వచో మయి జల్పతి
  విలపతి పురో రామం బద్ధాఞ్జలౌ మయి తిష్ఠతి
  ప్రతిదిన మహం జానే నాస్యాః ప్రసాదనసాధనమ్. 5-26

ఉ. నేఁ గన నన్నవజ్ఞఁ గను; నే శ్రుతిపేయముగా వచించినన్
  దాఁ గరపల్లవంబులను దార్చును వీనుల; నమ్రమూర్తినై
  నేఁ గనుదోయి కట్టెదుట నిల్చినఁ దాఁ బలవించు రామునిన్
  జాగు దినంబు లిట్లెటులఁగఁ జానప్రసాదనసాధనం బెదో.

అచ్చు చక్కగాను నుత్తమమార్గముగా నుండవలయు ననియుఁ బ్రయత్నించిరి గాని పుటలయందు గున నంకె లుండుట మీఁద నంకములు గాని

గ్రంథనామము గాని తెలియకుండ విడుచుట విలక్షణముగాఁ గనఁబడుచున్నది.
దీని వెల రు 1—0—0.

---

## శ్రీనాథకవి.

ఇది శ్రీనాథమహాకవి జీవితము-మ॥ శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు రచించినది. రాజమహేంద్రవరము ఆర్యపుస్తకాలయమువారు ప్రకటించినది. ౮ దధ్యాయములు- వీరభద్రరావుగారు శ్రీనాథమహాకవిజీవితమును, జరిత్రమును బహుపరిశ్రమ చేసి యిందుఁ జేర్చిరి. తగినంత ప్రమాణము లేనిదే యేవిషయమును వ్రాయలేదు. ఇతరులయప్రమాణవాక్యములకుఁ దగురీతిని యుక్తుల చూపియున్నారు. వీరు శ్రీనాథకవి నెట్టివానినిగా నెంచిరో యేవిధముగా నమ్మహాకవిచరిత్రమును వ్రాసిరో యీక్రింది పీఠికలోనివాక్యములను జదివినఁ దెలియఁగలదని వానింగొన్నింటి నిటఁ జూపుచున్నారము.

"వీరేశలింగముగారు ఏవిధమైన ఋజువుభారమును వహింపక గాలికబుర్లను పోగుచేసి యేనూఱు సంవత్సరములకుఁ బూర్వమున నున్నవానివర్తనము తాము ప్రత్యక్షమునఁ దమకన్నులతోఁ జూచినట్లుగా 'స్త్రీలోలుఁడై వయఃకాలమున విచ్చలవిడిగాఁ దిరిగి కాయమును ధననికాయమును జెడఁగొట్టుకొన్న మహాపాపి యని నిందించుటయే గాక యాతనికాలమునాటి యాంధ్రహిందూసంఘము జారత్వమును ప్రతిష్ఠావహమైనదిగను, శ్లాఘ్యమైనది గాను భావించునంతటిదౌర్భాగ్యస్థితియందుండెనే యని యేమో దూషించి నిర్హేతుకముగా ద్వేషబుద్ధిని బూని దురభిమానపూరితములైన యుక్తిరహితదూషణములచేఁ దమ యాంధ్రకవులచరిత్రమున శ్రీనాథకవిజీవితమునంతయు గళంకపఱిచియున్నారు—ఇది యెంత సంతాపకరమైనవిషయము. ఆశాపరుఁడై... తిరిగి దేహమును ధనమును జెడగొట్టుకొని... వృద్ధదశను... దిక్కులేక చచ్చినట్లుగా దెల్పినట్టి వారి వ్రాఁతవైఖరిని జూచినప్పుడు నాకుం గలిగిన పరితాపమునకు మేర లేకుండెను." అని-

ఇట్లు వ్రాసినవీరు శ్రీనాథమహాకవిచరిత్రము నెంతవఱకుఁ బరిశుద్ధముగా వ్రాసియున్నారో యొకరు చెప్పకుండఁ బ్రతిమనుజునకును దెలియవచ్చుటలేదా. అభిప్రాయభేదము లందందుండినంత దానలోపమేమి? చారిత్రికులు దీనినాదరబుద్ధితో గ్రహించి విద్యాధికులు కలాశాలాదులలోఁ బఠనీయముగ నేర్పఱిచి శ్రీనాథునికిఁ గల యపవాదములను బోఁగొట్టి సాధారణులలో శ్రీనాథునిపైఁ

గల పుక్కిటిపురాణముల యవిశ్వాసమును బోఁద్రోలుదురుగాక ! ఇందు 282 పుటలు గలవు- జెష్మాపుస్తకము. రాజమహేంద్రవరము ఆర్యపుస్తకాలయములో దొరకును.

---

శశిరేఖ.

డిటెక్టివునవల-ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల ౨౦ వ పుష్పము. బ్ర॥ శ్రీ నందివాడ కామేశ్వరరావుగారు రచించినది. మూఁడుఖండములు 186 పుటలు. ఇది స్వకపోలకల్పిత మగు డిటెక్టివునవల- ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము, పిఠాపురములో దొరకును.　　　　వెల రు 1-8-0.

---

నానారాజసందర్శనము.

బహురాజసంస్థానములకుఁ దాము చనినప్పుడు సందర్భానుసారముగ శతావధానులు తిరుపతి వేంకటేశ్వరకవులు రచించినది. రెండవముద్రణము. ఇందు, పూర్వార్ధమున 14 విషయములు నుత్తరార్థమున 104 విషయములు గలవు. 226 పుటలు, 1187 పద్యములు. "ఇప్పటి ముద్రణమున మునుపటికన్న రెట్టింపు గ్రంథము పెరిఁగినది. కాని యిప్పుడేని యాయా ప్రస్తావములయందలి పద్యములన్నియు సేకరింపఁబడినవని యనుకొనరాదు. మామా శ్రద్ధాలోపము వలన నెన్నియోపద్యము లంతరించిన" వని బ్ర॥ శ్రీ వేంకటశాస్త్రిగారు పీఠికలోన వ్రాసియున్నారు. వెల పోస్టేజీసహా రు 2-0-0-ఈస్టుగోదావరిజిల్లా కడియములో బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారియొద్దఁ గాని, కాకినాడ, దిగుమర్తివారి వీథిలో తిరుపతిశాస్త్రిగారికుమారులు దివాకర్ల వేంకటావధాని గారియొద్దఁగాని దొరకును. రెండుపద్యములు-

ఉ. కాలపుబల్మిచే నిగమగాథలు పూజ్యములయ్యెఁ బూజ్యమై
మూలనడంగె నాకలలు పూనిపఠించినవారిఁ బట్టినా
సాలఁ గలట్టినాగరకసంఘము నేలియొనర్పఁ జొచ్చె నీ
గాలియు వానయుం బోలియుఁగాక భవత్కృపఁ గృష్ణసత్కవీ. 332

ఉ. నన్నయతిక్కనాదులు సనాతనులుం దదనంతరంబు పె
ద్దన్నయు ముక్కుతిమ్మనయు నాదయి గొందఱు గన్నమాన్యతల్
విన్నవికావె మీరలు స్వవేషము భాషయు నేరికేనియుర్
మన్నన దెచ్చునం చెఱిఁగి మానకుఁ డాంధ్రమునందు భక్తియుర్. 349

---

## యుద్ధకాండము.

శ్రీస్కాందమహాపురాణంబున శంకరసంహితయందలి శివరహస్యఖండంబునందు ద్వితీయభాగము. తృతీయచతుర్థాశ్వాసములు. కోడూరి వేంకటాచలకవి ప్రణీతము. వరంగలు శైవప్రచారిణీగ్రంథమాలలో ౨౫ వ పుష్పము. సంపాదకులు శ్రీకొడిమేల రాజలింగారాధ్యులుగారు- దీని ప్రథమభాగమును గుఱించి పరిషత్పత్త్రిక యీసంవత్సరము రెండవసంచికలోఁ దెలుపఁబడినది. ఈయుద్ధకాండములో రాక్షసవీరాగ్రగణ్యు లయి బ్రహ్మాండముల నేలి దివిజబృందము నంతయు నాపోశనముఁ బట్టిన శూరపద్మసింహవక్త్రతారకాసురుల వృత్తాంతము గలదు. ఈద్వితీయభాగముతో యుద్ధకాండము సంపూర్ణమైనది.

దీని వెల రు 1—4—0.

ఉ. పాయనిమోహబుద్ధి ననపాయనిశాతశిలీముఖోగ్రచా
పాయనివార్యధైర్య నగపాయనిమేషవిభంగ సుప్రతా
పాయనిశాశ్రితస్థితకృపాయనిలోపమవేగ భానుకో
పాయని యేచ్చు ఖేదహృదపాయనిరూఢినిఁ బొందలే కొగిన్.

మ. భువనవ్రాత మితం డజాండసహితంబుగన్ వేగభక్షింపనో
పువిలాసంబున నొక్కనాఁడితఁడు విస్ఫూర్జద్గతిం ద్రవ్వమే
రువాగిన్ దండముగాఁగఁ గేలఁగొని యాయూథిం దదాస్ఫాలనం
బువడిం జేయ ననారతమైన నునిచెం బూర్వప్రకారంబునన్. 3 ఆ. 180

ఓమ్.

శ్రీవ్యాసేశ్వరాయనమః.

# ద్రౌపదీస్వయంవరము.

శ్రీమదాంధ్ర వ్యాసభారతనవనీతమునుండి సంగ్రహితము.

(కీ. శే. ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రిగారు)

---

శా. పాంచాలిం గనుఁగోరికం జనుచు నా పాండుక్షమాభృత్సుతు
ల్పాంచన్నైతుకు లాస్వయంవరమునం బక్వాన్నము ల్దక్షిణ
ల్మించం గైకొనసేగు విప్రులు నతు ల్సేల్పివన ల్సేసి సా
ధించు న్మిసహజుండు ద్రౌపది నోహో దివ్యాకృతు ల్మీ రనన్. ౧

క. చని పాంచాలములం గని, రనఘుఁ బరాశరతనూజు నభ్యాగతు వం
దనము లొనర్చి కథాంత, మ్మున ననుమతిఁ జనిరి ద్రుపదభూవిభుపురమున్.

మ. కనుచుం జక్కనితోఁటలు న్ఘనతటాకమ్ము ల్పురిం గుంభకా
రనిశాంతమ్మున వృత్తివేషముల విప్రశ్రేష్ఠుల న్బోలుచుం
డ నరుల్గానర యేరు వీరల యుదంతంబు న్మహీభర్తయుం
దనయం బార్థున కీయఁ గోర్కి యెపుడుం దాల్చుం దదర్థం బిటుల్. ౩

చ. వెర వొనరించె నీపగిది విల్లొకఁ డెక్కిడరాని దొండ్లకు
న్వరములు మింట యంత్రమును సాయకము ల్వరగించి దానియం
తరమున నేయఁ లక్ష్యము నొనర్చి ధరాపతులార ! యీధను
ర్వర మిడి యెక్కు లక్ష్యవినిపాతి మదీయసుతావరుం డగున్. ౪

మ. అని చాటించినఁ బార్థివు ల్పని వివాహాపేక్ష నేతెంచినం
గన నాయుత్సవ మేగుదెంచిరి మును ల్కర్ణుండు దుర్యోధనుం
డును దుశ్శాసనుఁడు న్వికర్ణుఁడు సహుండు న్ధార్తరాష్ట్రు ల్బలుం
డును గృష్ణుండును సైంధవుండు విరటుండు న్వచ్చి రుత్కంఠితుల్. ౫

క. దొరలేని ద్రుపదభూపతి, సిరి గాంచుచుఁ బాండుసుతులు క్షితిసురులందుం
డిరి ద్రౌపది రంగంబున, కరుదెంచె సమస్తభూషణాలంకృత యై. ౬

గీ. రోహితాశ్వుని దనిపెఁ బురోహితుండు
పరఁగె ధరణీసురుల స్వస్తివాచనములు

నిఖిలమంగళవాదిత్రనిస్వనంబు
నిలిపి గంభీరముగఁ బల్కె నృపసుతుండు. ౭

మ. వినుఁడో భూపతులార! నాప్రతిన యీవిల్లీశరమ్ముల్న భ
మ్మున లక్ష్యమ్మిది యేయ శీలము కులమ్ము న్రూపము న్గల్గిగ
ల్గిన భూపాలసుతుండు నాచెలియలిం గేల్వట్టు సత్యమ్మన
న్మనుజాధీశకుమారు లెల్లరును గృష్ణ న్గోరుచు న్వేడుకన్. ౮

గీ. వేగవచ్చి కోరి విల్లు సజ్యముసేయఁ, గడఁగి చాల డస్సి కనిరి లజ్జ
నివురుఁగప్పియున్న నిప్పుల పోలిక, నెఱుఁగరాని వారి నెఱిఁగెఁ జక్రి. ౯

మ. తెలిపె న్రామునకు న్యుధిష్ఠిరుని వార్తిజ్ఞు మాద్ర్యాత్మజ
న్మల రాముం డలరె న్ననుంగొనుచుఁ గష్ణుం డెత్తివి ల్సజ్యముం
జలిపె న్మల్లులు గూర్చెఁ బాండవులు లక్ష్యమ్ము న్ధరాప్రాప్తముం
దలఁప న్ద్రౌపది సూతుఁ గోర ననిన న్గర్ణుండు గాంచె న్రవిన్. ౧౦

— అర్జునుఁడు మత్స్యయంత్రముఁ గొట్టుట —

సీ. విప్రమధ్యమునుండి విజయుఁ డుత్థితుఁ డయ్యె నింద్రధ్వజసమానునితనిఁ గాంచి
కొందఱుమోదము కొందఱుఖేదము గని రొండొరులతోడ ననిరియిట్లు
జనపతుల్వెట్టఁజాలని యీవిల్లు జన్నిగట్టి కెక్కిడఁజాలునెట్టు
లపహాసపాత్రుల మవుదుము రాజుల కొండెన వారింత ముడుగ మేలు
యత్న, మనఁ గొంద ఱసిరి రాజాపహాస్య
లమును ద్వేష్యులమునుగాము; హిమవదచల
ధీరు డీతఁడు కరికరాకారబాహుఁ
డోపు నీపని కబలుఁ డెట్లుత్సహించు. ౧౧

మధ్యాక్కర:- ఇతఁడు మహోత్సాహయుతుఁడు పృథివీసురుల కశక్యంబు
క్షితి లేదు వాయుభక్షులును స్థిరనియములు బలాధికులు
జితులైరి నృపులు భార్గవుని జెనకి; ద్విజుఁడుత్రావెఁ గడలి
హేతు లిఁదు నందఱు గూడి యితఁ డెక్కువెట్టు విల్లనుడు. ౧౨

చ. అన నగుఁగాక యట్లని రిలామరముఖ్యులు వారిపల్కుల
న్వినుచు ధనుస్సమీపమున వృత్రవిరోధిసుతుండు నిల్చె న
ద్రి ననుకరించుచు న్వరదు దేవు హరు న్బ్రణమిల్లి కృష్ణుని
న్మనమున నిల్పి యప్పు డసమానుఁడు సజ్యముచేసె వ్రేల్మిడిన్. ౧౩

గీ. ఏను బాణములుం బొడిచి యేయఁబడియె, ధరణిఁ లక్ష్యము యంత్రమధ్యమ్మునుండి
మ్రోసె భేరులు దివి భువిఁ బూలు గురిసె, నరిదిజయి పాణ్డుసూఁదలవాసవుండు.

మ. కని వాని ప్రియపూర్వకు సంతసమునం గావింప సౌహార్ద్యము
న్మానలం గూడి తలంచెఁ గృష్ణ విజయుం బుంసింహు నీక్షించి ప్రీ
తిని గొంచుం బెలపూలదండ నడుము న్వేడ్కగాఁ జేరెఁ, జే
కొని కాంత న్ద్విజనిర్యతిభితఁ జనెం గుంతీసుతుం డింటికిన్. ౧౫

— రాజులు ద్రుపదుపైఁ గోపించుట —

మ. అపు డారాజు తనూజ బ్రాహ్మణున కీయం గోరుచుండ న్ద్రుప
న్నృపతు ల్వ్రత్తిరి యొండొరుం గని నృపానీకంబు రావించి, మా
న్యపదం బిచ్చి తృణీకరించి మనల న్బ్రాహ్మణుం డిప్పు క
న్నా నొసర్పం దలఁచె న్ఖలం బితఁడు ద్రోడ్రౌ సుపుష్పాగమున్. ౧౬

క. మనల నధిక్షేపించిన, జనపతి దుష్టాంతరంగుఁ జంపెదము వెసం
దనయునితోఁ దగఁ డితఁడు, మనచే గౌరవముఁ జెంద మహిపతులారా!

సీ. పృథివీశుఁ డితండు; పిలిచి రాజుల నెల్ల నాదరమున మృష్టమన్న మొసఁగి
మనలఁ దలంపఁ డమర్త్యులఁబోలు నీ ధరణీవల్లభులలోఁ దగిన వానిఁ
గనఁడాయె నొక్కొ యీ జనపతి యొక్కని, వరణపాత్రులుగారు ధరణిసురులు
వసుధేశులకు స్వయంవరము వైధము కన్నె, యిది యే నృపునివరియింపకున్న
నగ్గిఁ గెరఁజేసి పోవుద మాత్మరాష్ట్రములకు నిపుఁడు చాపలమున నొనర్చె
నేని యప్రియమిది వధియింపఁ దగఁడు, బ్రాహ్మణార్థమె మనసిరి ప్రాణములును.

సీ. ఈగతి గాకుండ నితరస్వయంవరముల కవజ్ఞాత్రాస మునసటుండఁ
దాఁకిరి ద్రుపదవధముఁగోరి యాయుధపాణులై ద్రుపదుఁడు వారిఁగాంచి
సాధ్వసమున విప్రశరణార్థియయ్యె రోషవశులై మదసామజములవోలెఁ
దారవచ్చు వారి నెదుర్కొని రర్జునభీమసేనులు వజ్రవిగ్రహుండు
భీముఁ డొకచెట్టు చేతులఁ బెల్లగించి, దళవిరహితముగావించి దండిదండ
మువలెఁగొనిదరినుండన్న బుజ్జగించు, సన్నపనిగని, కనియద్భుతాభయముల.

— శ్రీకృష్ణుఁడు పాండవుల నానవాలుపట్టి బలరామునకుఁ దెలుపుట —

చ. విలుఁగొనియుండ నర్జునుఁడు వీరుఁడు కృష్ణుఁడు వారి గాంచుచు
న్బలికె బలు న్మృగేంద్రవృషభప్రతిమానవిలాసగామి వి

ల్బలిమిని బూనుఁ దాలమితిఁ బార్థుఁ డితం డగుఁ జెట్టు లాగి రా
జుల నడఁపం గడంగు బలశోభి మరుత్తనయాన్యుఁ డెం దగున్. ౨౦

చ. ఇతఁడు యుధిష్ఠిరుండు గమలేక్షణుఁ డశ్వితనూభవు లిహా
ప్రతిములు, వీర, లెంతు నిటు, పాండవు లమ్మయు జాతుపాలయ
ప్రతిభయదాహముక్తు లనువార్త వినంబడె నన్న, నన్నయుం
బితృభగినిం దనూజుల నశిష్టతుల న్వని కాంచె మోదమున్. ౨౧

— బ్రాహ్మణులు యుద్ధసన్నద్ధు లగుట —

గీ. బ్రాహ్మణోత్తము లపుడు సాధ్వసపడకుఁడు
మేము గెలిచెద మరుల సమిన్నిపుణుల
మని కమండలువులును గృష్ణాజినములు
విసర నర్జునుఁ డనె హాసమెసఁగ నిట్లు. ౨౨

ఉ. భూసురులార ప్రక్క నిలువుండు కనుంగొను చీరు శత్రుల
న్వేసర కేన యాఁగెదను వేలకొలంది శరమ్ముల, న్నభా
వాసమమంత్రరాజి ననిలాశులఁ బోలె నటంచు గ్వల్గుభా
శాసనమంది నిల్చె మరుదాత్మజుతో గిరిరాజుపోలికన్. ౨౩

క. కని కర్ణాదులఁ బార్థివు,లను సమరోన్ముఖుల గజములచు బ్రతిగజరీ
తిని బెదరక డీకొని ర,ర్జునుఁడు న్భీముండు భూభుజులు వ్వళ్లి రిటుల్. ౨౪

గీ. పరుసములుపోరఁగో కెనపాఱులకును, వధముపాపముగాదని వాసవసుతుఁ
దరశోతనుజుఁడు భీము మద్రపతి శల్యుఁ,డవని సురలను దుర్యోధనాదులెల్ల.

చ. ఎదిరిరి తీక్ష్ణబాణముల నేసెనుకర్ణుని ఫల్గునుండు బ
ల్పదరముల న్వడిం బఱపి వచ్చెఁ జొప్ప చెఱింగెఁ దద్భుజా
మద మొంతలేని దంచు నరుమార్గణము ల్వరలించి యార్చినం
జమురు ప్రశంసనేసె రది సైనికు లెల్లరు కర్ణుఁ డిట్లనెన్. ౨౫

చ. అలరితి మేదినీసురవరా! భవదీయభుజాబలంబుచే
నలయమి నస్త్రశస్త్రజయమ్ముల మూర్తిమదస్త్రవేదమో
బలరిపుఁడో జనార్దనుఁడో భార్గవరాముఁడో సవ్యసాచియో
తలఁతు మహీసురాకృతిని దాలిచి నన్నెదిరించెఁ బోరునన్. ౨౬

— భీమార్జునులు శల్యకర్ణుల నోడించుట —

మ. అనినం బార్థుఁడు సెప్పె నుత్తరము కర్ణా కానునేఁ బార్థుఁడన్
ధనురామ్నాయము రాముఁడు న్హరి ననంతాదేవుఁడ న్నస్త్రవే

దనిరాఘాటబలుండ నిగ్గెలువ బద్ధశ్రద్ధుఁడ, స్నానమూ
నిన నేఁపిఁకుఁడ నంచు నిండు నిలుమా నీవింతసేపేపియున్. ౨౮

గీ. అనిన బ్రాహ్మణు తేజమయ్యస్త్ర యని తలంచి పోరు నోలంగ బలంబు మించు
శల్యభీములు మత్తకుంజరములవలెఁ, బోరి చిటిలఁ బోరు జానులఁ బిసికి ఫులను.

క. వెరుకకు నెమటికిఁ బ్రక్కలకురు నొంకొరు లాగి రాలఁగొట్టిన పగిది
ఘన ఘోషమడరెఁ దలముల, ననిలసుతుండపుడు శల్యుహస్తయుగమునన్.

గీ. పట్టి యెగిచి నేలఁ బడవేయ నగిరి భూ, మిపురు లచ్చెరునడి మెచ్చుకొనమి
నవనిపాలు రెల్ల నడఁగి వృకోదరుఁ, జుట్టుకొనిరి పలికి రిట్లు కూడి. ౩౧

తరులోజ. మేలు వీరెవ్వరో మేదినీసురుల మేటులు తెలియంగ మేలగుననకు
వాలమునం గృష్ణ నర్జునుకంటె నన్యుఁ డెవండో పునారయఁ గెలువఁ
గూలనేయ నెవండు క్షోణిని ప్రపతిఁ గుంతి రెండవకొడుకునకితరుండు
చాలింపఁ దగు విప్రసంభృతి మూఁక జన్నిగట్టుల నెచ్చు సాఁక నేవలయు.

క. వసుదేవసుతుఁడు మారుతి, యసమపరాక్రమము గాంచి యరసి నిజపితృ
ష్వసకుఁ దనూజుల వారి, న్వేసనాఁపెన్నృపుల ధర్మవిజితసతి యనెన్. ౩౩

క. విని కృష్ణుని ప్రియవాక్యము, చని రచ్చెరువడి నృపతులు స్వభవనములకు
న్జనె రంగము బ్రహ్మోత్తర, మెనసిరి పాంచాలి విప్రు లిట్లు నుడువుచున్.

క. రుచుక్తృత్తిధరులు ధరణీ,సురు లలమికొనంగ భీమసుత్రామసుతు
ల్పురనాథనందనాసహ, చరులై వచ్చిరి కులాలసదనమ్మునకున్. ౩౫

— వేళకుఁ గొడుకులు రామిఁ గుంతి చింతించుట —

సీ. అంతకు రాకున్న నాత్మజుల్ పడచిపో భైక్షము సమయము వారితల్లి
బహువిధానర్థము భావించి వగఁజెందె, హాతులైరో ధృతరాష్ట్రసుతులచేత
విజ్ఞాతులై దృఢవిద్వేషు లసురులు ఘోరకష్టములఁ మాయఁ గూల్చిరొక్కొ
యా మహాత్ముఁడు వ్యాసునాకూతమును విపరీతమయ్యెనటంచు జాత మోహ
పృథ వగచుచుండ నపరాహ్ణవేళ జలధ
రావృతుండవు రవిభాతి నవనిదేవ
పరివృతుఁడు కుంభకారభవనముఁ జొచ్చె
నర్జునుఁడు వాయుసుతుఁడుతో నరుగుదేర. ౩౬

గీ. ఆమహానుభావు లమితహర్షమ్మున, నమ్మ! భిక్ష యనిరి యాజ్ఞసేని
నింటనుండి చూడ క్షీరందఱుభుజింపుఁ, డని యెఁ గుంతిపిదపఁ గని వధూటి. ౩౭

గీ. కృష్ణఁ గష్టము నాపలు కెట్టు లో యని, ధర్మశంకిత చేకొని ద్రౌపది శుభ
బుద్ధిమతిఁబల్కె ధర్మజుఁ బుత్త్రి నీయ, నుజులభిక్షను ద్రుపదతనుజఁ దెలిపిన. ౩౮

గీ. ఏను నుచితముగాఁ గూడి యెల్లరు భుజి
యింపుఁ డంటిఁ బరాకున నిట్లు నేఁడు
గాదు నాపలు కన్పృతము కౌరవాగ్ర్య
చెపుమ ధర్మము పాంచాలిఁ జెనక దెల్లు. ౩౯

తరువోజ. అని తల్లియడిగిన;నవనిపుఁడింత, యాకసి యూరెను హర్షముఁ జేయ
ననియె ధనంజయు, నర్జున నీ వుపార్జించితివి, ద్రుపదాధీశపుత్త్రి
ననలుఁ బ్రజ్వలితుని నాచరింపు జల, జాక్షిపాణి గ్రహింపు మరితిమిరార్క
యన నర్జునుం డనె నవనీశ! నన్ను, నన్యాయ్యవర్తనుం డనిపింప కన్న. ౪౦

మానినివృత్తము. కా దిది ధర్మము కౌరవనందన కావలె నాదిని గేస్తుఁడ వీ
వాదృతి మారుతి యాపయి నేను యనూర్ఘ్హత యంతట యెల్లరము
న్నీదయఁ గోరెద మేయది ధర్మము నిశ్చితముం బొనరింపుము క
న్యాదునకు న్హితమారయ నెయ్యది యానతియి మ్మఖిలార్థనిధీ! ౪౧

క. విని యర్జునుసస్నేహవచన మెల్లరు ద్రుపదపుత్త్రి సత్రణయకటా
క్షనిరీక్షణ విశదీకృత, మనసిజపాండిత్యఁ గనిరి మన్మథునాజ్ఞఁ. ౪౨

గీ. బ్రహ్మ నిర్మించెఁ బంచాలరాజదుహితఁ, గన్నుదృష్టి హరాసమ కాంతిరూప
ధర్మసుతుఁడు తదింగితధర్మవేది, తలఁచె ద్వైపాయనోక్త మంతయు మనీషి.

క. మన కందఱ కా లవు నీ, మనుజాధిపదుహిత యనియె మాన్యుఁడు భేద
మ్మునకు భయమ్మున సోదరు,లను ధర్మజుఁ డతనిపలుకుల న్వినితమ్ముల్. ౪౪

గీ. అన్నమాట లరసి యాయర్థమె తలంప, నింపుఁ జెందుచుండఁ గృష్ణుఁ డేగు
దెంచె రాముతోడ గాంచె ఘనుసజాత, శత్త్రుఁ జుట్టు నున్న జ్వాలనిభుల.

గీ. ఎదురు సని ధర్మజాంఘ్రుల కెరఁగి యేకుఁ
గృష్ణుఁడ ననె బలుండు ను నిట్లు సేసె
హర్షమున వారిఁ బాండవు లాదరించి
రత్త యనుగులకును మ్రొక్కి రాయదువులు. ౪౬

గీ. అడిగి కుశలముఁ గృష్ణుఁ బాండ్వాత్మజాగ్ర
జుండు వారుచ్చె, వాసుదేవుండ యిందు

నెఱిఁగితివి గూఢముల స్థలము నెల్ల నెట్టు
లనిన నగి వసుదేవజుఁ డతనిఁ బలికె. ౪౭

గీ. మృగమదము పెట్టెఁ బెట్టిన నెఱుఁగరాదె
కలరు నరు లెవ్వ రీపరాక్రమము సేయఁ
బాండవులుగాక మీ కగ్నిభయము తలఁగ
నెలమి విదుర మంత్రియు నభీష్టసిద్ధు లైరి. ౪౮

గీ. మీ కగును మేలు గూఢము మీరె సంగుఁ
డెరియు వహ్నులపోలిక నెఱుఁగకుందు
రవని పాలురు మిమ్ము మేమఱిగొద మని
సెలవుగొని చనె సవ్యయశ్రీబలుఁ డను. ౪౯

క. వెనుక ధృష్టద్యుమ్నుఁడు, చని భీమార్జునులు చనెడుసమయమ్మున నె
వ్వనికిం గనరాక కులా, లనికేతనమందు డాఁగె దగ్గఱచోటన్. ౫౦

క. సంజ న్భీమార్జునయమ, లంజస్యమునం జరించి యన్నము భైక్షం
బంజలి ఘటించి యన్నకు, నంజలి నివేదించునదనున ద్రుపదసుతన్. ౫౧

మ. పలికె న్గుంతి యొసంగు మన్నము బలి న్భిక్షుఁబు విప్రాళి క
న్యాల కన్నార్థుల కున్నయన్నమున సామోభద్ర పెట్టందగు
స్థలవన్యాళి ద్విధాంగుఁ డీతనికి సాఁబా ల్బలువ్వరే నీవు త
న్పలర న్నెక్కుఁదగు న్నతాంగి యిటుమన్నా! యన్న మోదమ్మునన్. ౫౨

క. ఆరాజపుత్రి మే లగు, నారామసుభాషితమ్ము లాలించి విశం
కారహితమై యొసంగఁగ, నారీతి న్నెసవి రంద ఱాయన్నమ్మున్. ౫౩

గీ. పృథివిఁ బఱచెఁ గుశల మాద్రిపిన్నకొమరుఁ, డత్తమిల్లిరి పఱచి నిజాజినములు
దక్షిణాభిముఖంబుగ దలలు కుంతి, యెదుట వారికిఁ గాళ్ళల నొదిఁగికృష్ణ.

క. పన్నుండెఁ బాండవులతోఁ, డన్నెలఁ బదోపధానిడంబునఁ గుశలం
బెన్నదు మదినే నలమట, నన్నరపుంగవులఁ గాంచ దవమానమునన్. ౫౫

సీ. ఆబిరుదులు పల్కి రందు దడమ్ముల యద్భుతకథలు, దివ్యాస్త్రములయు
రథకరిఖడ్గపరశ్వథములవార్త లవి యన్ని విని ద్రుపదాత్మజుండు
నరపతి కెఱిఁగింప నరిగెను ద్వర రాజు వగచెఁ బాండవులుగ వారివగవఁ
జాలక యడిగె ధృష్టద్యుమ్నునిమహోత్సుఁ డెం దేగె నాకన్నె నెవఁడుగొనియె

హీనకులు వైశ్య శూద్రులే నెనయదు గద
యుంచె నే నెత్తినడుసుకా లోలికి దండ
పడదె ; కాననే నృపతి యగ్రవర్ణుఁడేని
యలఁతి యెడమకా లిడఁడె నాఁతలతనూజ ! ౫౬

— ధృష్టద్యుమ్నుఁడు జేతలవృత్తాంత మెఱిఁగివచ్చి తండ్రికిఁ దెలుపుట —

క. నరవృషుఁ డప్రపార్థనిచేఁ, బణీణీత న్సుతను గాఁచి పరితుష్టుఁడనై
పరితాప మందకుందునె, కురువృషభులు పాండుసుతులకు స్నేమంబే. ౫౭

క. అని యి ట్లడిగిన తండ్రికి, జననాథాత్మజుఁడు పల్కె సంతోసమున
ధనువెక్కు వెట్టి గుఱిగొ, ట్టినతరుణుఁడు విప్రసుతుఁడు కివిం జనియెఁగా. ౫౮

సీ. ఆతనియుత్తరీయముకృష్ణమృగకృత్తి గైకొని వెన్కనెఁ గరిని గరిణి
వలెఁ గృష్ణ వెనుఁజెట్టుఁబట్టి రాజులఁ గొట్టినాతఁడు నతఁడు చంద్రార్కులట్లు
వెలుఁగుచు నగరము వెలికులాలగృహంబుఁ జెందిరి కూర్చుండె శిఖిశిఖవలె
నందు వారల తల్లి యనుకొందు నట్టిరె దరిని గూర్చున్నముగ్గురు ప్రవీరు
లా యిరువురుమ్రొక్కిరామెపాదములకుఁ, గృష్ణ మ్రొక్కమనిరి కెలననందె
యున్నకన్నెఁ దెలిపి సన్నుతు లైచ్చిన,భిక్ష యందఱకును బెట్టెఁ గృష్ణ.

క. తినియెం దానును దర్భా,జినరత్నాస్తృతధరిత్రిఁ జెంది పరుండం
గను వారికాళ్లకడ నుం, డెను గృష్ణ సమయపమోదనినదులు వారల్.

గీ. ఆజవింతమాట లాడిరి ద్విజులకు, సర్వశూద్రులకును నలవడనివి
నిశ్చితఁబు వారు నృపవరేణ్యులు మన, యాసపండెఁ బార్థులభయులంద్రు.

గీ. సజ్యమొనరించెవిల్లు లక్ష్య మ్మదేసె, నాతఁ డన్యోన్యభాషణమట్టి దరయ
వారు గూఢవిహారులుపాండుసుతులు, నిక్కువమ్మనఁబొంగియా నృపతిమాళి.

— ద్రుపదుపురోహితుఁడు వరు కులము దెలియవచ్చుట —

చ. అనిపెఁ బురోధ మిమ్ముఁ దెలియన్వలెఁ బాండుతనూజు లౌదురో
యనుచుఁ బురోహితుండు గొనియాడి యనె న్ద్రుపదుఁడు లక్ష్యభే
దనుఁ గని చెందె మోద మమితమ్ము కులక్రమ మానతిండు శ
త్రునిచయమ స్తమాఁ జదవిభూతము తన్పుఁడు నన్ను మానృపుల్. ౬౩

గీ. పాండురాజు ద్రుపదపార్థివునకుఁ బ్రియ, సఖుఁడు తత్సుతుండు సవ్యసాచి
తనకునల్లుఁడగనదలఁచుమా దొరయన,ననుజపూజితుద్విజునని యెరాజు.

ద్రుతప్రకృతిమీఁదను గూడ, తే=ఆపదములు, సరళా ఏవ సన్తి=సరళములే యైయుండును. అంబను గొలిచెద, శుభముబడసెద.

---

గసడదవా స్స్యుః ప్రథమామాత్రా దాత్త్వాస్తదో ర్వినైవైతే
సవికృతిశబ్దా త్పరత స్సాంస్కృతికానాం భవన్తి గసడదవాః. ౨

ఇది రెండవ సూత్రము. ఆత్త్వాస్తదోః=ఆర్త్యక్, అస్తచ్ఛబ్దములు, వినైవ=వినాగాను, ప్రథమామాత్రాత్=ప్రథమావిభక్తిమీఁద నున్న, ఏతే ఏవ=ఈ పరుషములే, గసడదవాః స్స్యుః=గసడదవ లగును. సిరిగలవాఁడు, దిక్కుగలవాఁడు, దానము సేయును, కీడుఁ జెక్కులఁబోవును, (ఇట్లు దామరతంపర) నిజమున్నదును. ప్రథమామాత్రాత్ అన్నాఁడు గనుక ప్రథమాసమానముమీఁదను వచ్చును. అప్పుడు గనిపించె, ఇప్పుడు దావచ్చె- ఆత్త్వాస్తదర్థములకు లేదు. తాఁజెప్పె, నేఁజదివితి. వికృతిశబ్దాత్=తెలుఁగుమాటకంటె, పరతః=పరమైయుండెడి, సాంస్కృతికానాం=సంస్కృతశబ్దములకు, గసడదవాః=గసడదవలు, న=లేవు. దొర కరుణించె, సిరి చంచలము, మాయయ్య టంకాయుధుఁడు, మీవేల్పు తోయాధిపతి, వీఁడు పావనుఁడు.

---

లుగ్వా ద్రుతప్రకృతికా త్పరత స్సరళే స్థిరే చ నస్య స్యాత్
అలుకి చ సంశ్లేష స్స్యా ద్ద్విత్వం ప్రవదన్తి తం క్వచి త్కేచిత్. ౩

ఇది మూఁడవ సూత్రము. ద్రుతప్రకృతికాత్=ద్రుతప్రకృతిమీఁదను, పరతః=పరమైన, సరళే=గజడదబ లయినను, స్థిరే=యాద్యక్షరము లయినను నుండినయెడల, నస్య=నకారమునకు, లుక్ వా స్యాత్=లోపము వికల్పమున వచ్చును. కొలుతుఁ గదాధరు, కొలుతు గదాధరు. పల్కుదుఁ సత్యము, పల్కుదు సత్యము-ఇత్యాది. అలుకి=లోపము లేనప్పుడు, సంశ్లేషశ్చ=పైయక్షరముతో సంయోగమును, స్యాత్=అవును. చకారప్రయోగమువలన, స్వభావమున నున్నను నుండు ననుట. విడుతుఁ దురితము, విడుతును దురితము. తం=ఆనకారమును, క్వచిత్=సరళస్థిరములు పరమైనప్పుడు కొన్నిచోటుల, కేచిత్=కొందఱు పెద్దలు, ద్విత్వం ప్రవదన్తి=పున్నగాఁ జెప్పుదురు. *మెచ్చెం మాధవుఁడు, నాకుం జనకుఁడు. ఈమతము కేచిత్పక్షము గనుక ప్రయోగమూలము.

---

* మెచ్చెమ్మాధవుఁడు, మెచ్చెన్మాధవుఁడు.

సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః
లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు. ౯

ఇవి మూఁడుసూత్రములు. ద్రుతప్రకృతికేభ్యః=ద్రుతప్రకృతుల మీఁద నుండెడు, యస్య=యకారమునకు, సర్వత్ర=అంతటను, అజ్వత్=అచ్చునకు వలెను, కార్యం=వచ్చెడికార్యము, జ్ఞేయం=తెలియఁదగినది. లుక్సంశ్లేషములు లేవనుట. కలిగె నెమ్మె, సిరికి నెద కలిగెన్యెమ్మె యనుసంశ్లేషము గాని కలిగె యెమ్మె యనులోపము గాని లేదాయెను. ఆద్యగ యకారము గనుక యెత్వము వచ్చినది. ఓయీ యెత్వము రాఁ జెప్పనేల, అజ్వత్కార్యము వచ్చు ననఁ నేల ? ఆదియందు యకారము లేదు, అచ్చే కాని యనినఁ జాలదా యంటేఁ, జాలదు. ప్రయోజనాంతరము*లేకున్నను నుచ్చారణవిరోధ మగుచున్నది, గనుక, యకార మెకారము గానేరదు. లుక్సంశ్లేషౌ=నకారలోపమును, దత్సంశ్లేషమును, అచి=అచ్చు పరమైనపుడు, న=లేవు. భజియింతు నంబను, త్యజియింతు నఘములు. ద్రుతస్య=ద్రుతమునకు, సమాసేషు=సమాసములయందు, సర్వత్ర=అంతటను, లుక్=లోప మగును. విరికల్వ† తెల్లదమ్మి.

---

నుమ్మోచ్చాతః పరుషాణాం గసడదవాస్స్యుః పదాద్ద్వంద్వే
సామానాధికరణ్యే ష్వాదన్తానాం టుగాగమోచి స్యాత్. ౧౦

ఇవి మూఁడుసూత్రములు. నుమ్ చ ఉతః-ఉతః=ఉకారమునకు, నుమ్=సమాసమందు నుమ్ అనునది వచ్చును. శబ్దసూత్రప్రాప్తిని ఉకారమకారములు లోప మగును. అలరుఁజొంపము, చిగురుఁగై దువు. పదాత్=శబ్దముమీఁద నుండెడి, పరుషాణాం=కచటతపలకు, ద్వంద్వే=ద్వంద్వ సమాసమందు, గసడదవాః=గసడదవలు, స్యుః=అవును. అరిగోరులు, కాలుసేతులు, తల్లిదండ్రులు, ఊరువల్లెలు. సామానాధికరణ్యేషు=కర్మధారయసమాసములయందు, అచి=అచ్చు పరమై యుండిన, ఉదన్తానాం=ఉకారాన్తపదములకు, టుగాగమః=టుక్ అనునాగమము, స్యాత్=అగును. “శత్రువ దాదేశః, మిత్రవ దాగమః” అను న్యాయమున నుండెడివి యాదేశాగమములు. టుక్కులో, ఉకారకకారములు శబ్దసూత్రప్రాప్తిని లోప మైన నంత్యమందుఁ బొల్లుటకారము నిల్చును. అలరుటాకులు, కఱకుటమ్ములు, గిలుకుటందెలు, ఇత్యాది.

---

*ప్రయోజనోత్తరము పా. †మోముచందురుఁడు-మూ.

దారాత్కేత ఉదపి రో మోస్తు విభక్త్యేకవచనకే పుంపూ
ప్రథమలు గపి ద్విను ల్వో రిచ్ఛ విభక్త్య స్తిమస్య జే రలిచ. ౧౧

ఇది యైదు సూత్రములు. దారాత్కే=పత్నీ వాచక పదము పర మయిన, అతః=అకారాంతపదములయొక్క యకారమునకు, ఉత్=ఉకారమును వచ్చును, అపి రః=దానిమీఁద రవర్ణమును వచ్చును. సామానాధికరణ్యామె యను వర్తించునది. ధీరురాలు, శూరురాలు. విభక్త్యేకవచనకే=ప్రథమైకవచనమందలి, మోః=ముకారమునకు, పుంపూ=పు అనునది యు, బిందుపూర్వక మైన *ంపు అనునదియు నవును. సరసపుఁబలుకులు,సరసంపుఁబలుకులు. ద్విను ల్వోః-ద్వి=ద్విత్వముగల, ను ల్వోః=ను, లు, అనువానికి, ప్రథమలు గపి=ద్విత్వములలో మొదటిదానికి లోపము నగును. కనుదమ్మి, ములుగంప. విభక్త్య స్తిమస్య=విభక్తులయొక్క తుది అకారమునకు, ఇచ్ఛ=ఇకారమును వచ్చును. నీచేతిప్రోపు, నాతోడివారు, తనవలనిబి కము. జేః=సప్తమికి, అలిచ=అలి యనునాగమమును వచ్చును. నీయందలికరుణ.

---

ఔపవిభక్తికసంజ్ఞావర్ణా ష్టింట్యాదయో భవన్తిహ
రుల్వాదే ర్నామ్నాం స్యు స్తేహి విభక్తౌ సమాసే చ. ౧౨

ఇది యేకసూత్రము. ఇహ=ఈ తెనుఁగు వ్యాకరణమందు, ఔపవిభక్తికసంజ్ఞాః=ఔపవిభక్తికము లను పేరుగల, వర్ణాః=వర్ణములు, టింట్యాదయః=టి, ంటి మొదలైనవి. భవన్తి=అగుచున్నవి. ఆదిశబ్దముచేత- తి, ్రి, మొదలైన వానికి గ్రహణము. తే=అవి, నామ్నాం=శబ్దములయొక్క, రు ల్వాదేః=రు,లు, ఇత్యాదులకు, విభక్తౌ=విభక్తిపరమైనపుడును, సమాసేచ=సమాసమందును, స్యుః=అవును. కొన్నిచోటుల సమాసవిభక్తుల రెంటియందును గూడ వచ్చును. ఏటికి, విభక్తి; ఏటికాల్వ, సమాసము. వింటిచేత, వింటినారి. త్రాడునందు, విభక్తియందు లేదు; త్రాటిచెట్టు, సమాసమునకుఁ గలదు. ఈలాగే తెలియునది. కూటికుండ, అంబటినీళ్ళు, నేతిముంత, మిర్తిచేను, కర్తిమొన. కంటికి, గొడ్డంటిచిప్ప, పామునకు, పాఁపతేఁడు, వేమునకు, వేఁపచెట్టు, ఇత్యాది. ఔపవిభక్తికములు బహుప్రకారములు. విభక్తిసమాసములయందు యథాయోగ్యముగాఁ దెలియునది. రుల్వాదులకే కొన్నింటికి రావు. పైరుజొంపము, కల్లుకుండ,ఎన్నుగంట-ఇత్యాది. ఔపవిభక్తికవర్ణములు గలవెల్ల నౌపవిభక్తికములు.

---

* బిందుయుక్తమైన-

వా త్మాస్మదో ద్రుతస్య స్యాల్లు గ్వాక్యా న్తగతపదానాంచ

నలడాదే రన్తరుత శ్చాన్యేషాం చ ప్రయోగమహితానామ్. ౧౩

ఇది నాలుగు సూత్రములు. ఆత్మా స్మదోః=ఆత్మా స్మ చ్ఛబ్దములయొక్క, ద్రుతస్య=నకారమునకు, లుక్=లోపము, వా స్యాత్=వికల్పమున వచ్చును. తాఘనుఁడు, తానుఘనుఁడు. నేవింటి, నేనువింటి. వాక్యా న్తగతపదానాం చ-వాక్య=సీసపద్యాదుల చరణములు వాక్యములు, వానియొక్క, అన్తగతపదానాంచ=అంత్యశబ్దములయొక్క నకారమునకును లోపము గలదు. అలరె నెత్తావి కేళీవనాగ్రసీమ (నగాగ్రసీమ)- నలడాదేః=నలడ మొదలైన వర్ణములయొక్క, అన్తః=నడిమి, ఉతః=ఉకారమునకు, లోపమౌను. కిన్నె, చిల్లె, గాడ్పు. ఆది శబ్దముచేత రేఫాదులకు నౌను. కార్పోతు, గోర్పలి. ప్రయోగమహితానాం= ప్రయోగపూజ్యములైన, అన్యేషాం=మఱికొన్నింటికిని, ఉకారలోప మగును. నలడాదుల మఱికొన్నియచ్చులకు ననుట- మాన్పి, కల్గి, ఈడ్చి, కప్రము, అబ్రము. ప్రయోగమహితము లన్నందుచేత నుత్వముఁలకును బ్రయోగసిద్ధమై ననే కాని లే దనుట. ఏనుఁగు, అడుగు.

శా. క్లీంకారాక్షరరూపిణీ నతజనక్లేశౌఘపంకావళీ
 పంకేజాతసుహృద్ఘనాతపసదృక్పాదాబ్జ శశ్వన్నిరా
 తంకాత్మార్జిత భోగమోక్షజనకోదంచన్మహామాయకా
 హ్రీంకారాక్షర హేమసౌధచర బ్రహ్మేంద్రాది దేవార్చితా.

గద్యము. ఇది శ్రీసకలభాషావాగనుశాసన నన్నయభట్టవిరచితాంధ్రశబ్దచింతామణియందు సకలకవితాస్వతంత్రభట్టారక యెలకూచి బాలసరస్వతి కవి మహోపాధ్యాయ ప్రణీతంబైన యాంధ్రశబ్దచింతామణిటీకాగ్రంథమునందు ద్వితీయము సంధిపరిచ్ఛేదము.

# అజన్తపరిచ్ఛేదము.

డుముపులవః ప్రథమా స్యాత్కూర్చిలనునయో భవేద్ద్వితీయా తు
తో చేతతోడచేచ తృతీయాయాః కొఱకు కై *చతుర్థ్యాః స్తః. ౧
పట్టివలనకంటె ఇతి పఞ్చమ్యథ లోపలకికుయొక్కా షష్ఠీ
అందిందునాస్తు సప్తమ్యోయీత్యామన్త్రణం చ వికృతౌ స్యాత్. ౨

ఈయార్యాయుగళ మేకసూత్రము. కొందఱిది రెండందురు. డుముపులవః=డు, ము, వు, లు, అనునవి, ప్రథమా=ప్రథమావిభక్తి, స్యాత్=అవును. కూర్చిలనునయః=కూర్చి, ల, ను, ని, అనునవి, ద్వితీయాతు=ద్వితీయావిభక్తికి, భవేత్=అవును. తో చేత తోడ చే చ=తో, చేత, తోడ, చే, అనునవి, తృతీయాయాః=తృతీయావిభక్తికి, స్యాత్=అవును. కొఱకు కై=కొఱకు, కై, అనునవి, చతుర్థ్యాః=చతుర్థీవిభక్తికి, స్తః=అగును. పట్టివలనకంటె ఇతి=పట్టి, వలన, కంటె, అనునవి, పఞ్చమీ=పంచమీవిభక్తి, అథ=ఆవెనుక, లోపలకికుయొక్కాః=లోపల, కి, కు, యొక్క, అనునవి, షష్ఠీ=షష్ఠీవిభక్తి. అందిందునాః=అందు, ఇందు, న, అనునవి, సప్తమీతు=సప్తమీవిభక్తి. వికృతౌ=తెనుఁగునందు, ఓయి ఇతి=ఓయి యనునది, ఆమన్త్రణం=సంబుద్ధి-స్యాత్=అగును.

క. డులుముపులు ప్రథమ. నినుకూ, ర్చిలలు ద్వితీయ-మఱి తోడ చేచేతపదం
బులు దాఁదృతీయ-కై కొఱ,కులు దలఁపఁజతుర్థియనునగును దెనుఁగునకున్.
గీ. పట్టివలనకంటెయనఁగఁబంచమీవి,భక్తి-యగుఁ గికుయొక్కలోపలలుషష్ఠి
జగతిలోనిందునందునసప్తమియగు,నోయియనఁగసంబుద్ధియాంధ్రోక్తులందు.

---

స్త్రీపశుజడాన్వినాన్యే మహదాఖ్యాస్తద్విశేషణాశ్చాపి
మహతోత ఉద్విభక్తౌ మహతస్సోర్డురనితో భవేత్పుంసి. ౩

ఇది మూఁడుసూత్రములు. స్త్రీపశుజడాన్ వినా=స్త్రీవాచకములు, పశువాచకములు, జడవాచకములును వినాగాను, అన్యే=తక్కినవియు, తద్విశేషణాశ్చాపి=వాని విశేషణములును, మహదాఖ్యాః=మహత్తు లనుసంజ్ఞగలవి. మహతః=మహత్సంజ్ఞగలదానికి, విభక్తౌ=విభక్తి పరమైనపుడు, అతః=అకారాంతమునకు, ఉత్=ఉకారమును వచ్చును. అనితః=ఇకారాంతవ్యతిరిక్తమైన, మహతః=మహత్తుయొక్క, సోః=ప్రథమైకవచనమునకు, పుంసి=పుంలింగమందు,

*కొందఱు కై అని, కొందఱు కయి అని పాడిరి.

డుజ్=డుజ్ అనునాదేశము, భవేత్=అగును. సు, ఔ, అమ్ మొదలైనవి శబ్దశాస్త్రవ్యవహారమునఁ బ్రథమా ద్వితీయాది విభక్తులకు సంజ్ఞలుగాఁ జెప్పాచున్నాఁడు, గాని, యిందు లేవు. అది యెట్లంటేని- అర్థవదధాతు రప్రత్యయః ప్రాతిపదికం-ధాతుప్రత్యయవర్జ్య మర్థవచ్ఛబ్దరూపం ప్రాతిపదిక సంజ్ఞం స్యాత్; ధాతుప్రత్యయవర్జ్యము, అర్థవచ్ఛబ్దరూపము, ప్రాతిపదిక సంజ్ఞగలది యగును. భూసత్తాయామ్, డుకృఞ్ కరణే, మొదలైన ధాతువ్రులును, తక్, తఙ్, మొదలైన ప్రత్యయములును గాక, అర్థవంతములైన శబ్దరూపము లెల్లను బ్రాతిపదికము లనఁబడును. ఙ్యాప్ప్రాతిపదికాత్-ఙ్యంతాదాబంతాత్ ప్రాతిపదికాచ్చ పరతః స్వాదిప్రత్యయాః స్యుః- పార్వతీ, గౌరీ మొదలైన ఙీప్రత్యయాంతములమీఁదను, చండికా, అంబికా మొదలైన ఆప్ప్రత్యయాంతములమీఁదను, రాము, కృష్ణ, మొదలయిన ప్రాతిపదికలమీఁదను, సు మొదలయిన యేడు విభక్తుల ప్రత్యయములు ను వచ్చును. అవి యే వంటేని- స్వౌజసమౌట్ ఛష్టాభ్యామ్భిస్ ఙేభ్యామ్భ్యస్ ఙసిభ్యామ్భ్యస్ ఙసోసామ్ ఙ్యోస్సుప్.

| ఏకవచనము. | ద్వివచనము. | బహువచనము. | విభక్తి. |
|---|---|---|---|
| సు | ఔ | జస్ | ఇది ప్రథమావిభక్తి. |
| అమ్ | ఔట్ | శస్ | ఇది ద్వితీయావిభక్తి. |
| టా | భ్యామ్ | భిస్ | ఇది తృతీయావిభక్తి. |
| ఙే | భ్యామ్ | భ్యస్ | ఇది చతుర్థీవిభక్తి. |
| ఙసి | భ్యామ్ | భ్యస్ | ఇది పంచమీవిభక్తి. |
| ఙస్ | ఓస్ | ఆమ్ | ఇది షష్ఠీవిభక్తి. |
| ఙి | ఓస్ | సుప్ | ఇది సప్తమీవిభక్తి. |

ఈయేడింటికిని నేకవచన బహువచన ద్వివచనములైన యీమూఁడేసి ప్రత్యయములును నైన వని తెలియునది. అందులోఁ దెనుఁగునకు ద్వివచనము లేదు గనుక మొదలిది యేకవచనమును, మూఁడవది బహువచనము నని తెలిసికొనఁ దగినది. విభక్తులకు మేము చెప్పిన కందగీతులలోని సంకేతములు తెలిసికొనునది. ఇందుకు శబ్దనిష్పత్తి చేసికొనులక్షణము. మొదట రామశబ్దము చెప్పెదము:-

సంస్కృతము, ఆద్యప్రకృతి గనుక తన్న్యాయముననే ప్రాతిపదికసంజ్ఞను స్వాద్యుత్పత్తిని బుట్టించునది. రామ సు అని యుండెను. అది యాంధ్రశబ్ద

ముగా వివక్షించునప్పుడు రామశబ్దము మహత్తు గనుక, "మహత స్సోర్డుజ్" అనుసూత్రమున సు అను ప్రత్యయమును గొట్టి డుజ్ అనునాదేశము వచ్చును. "అనుక్త మన్యవత్" అను న్యాయము చెప్పితిమి గనుక, హలన్త్యమ్, ఉపదేశే న్త్యం హలిత్స్యాత్, అనుశబ్దసూత్రముచేత డుజ్‌లోని జకార మిత్తయ్యెను. "సానునాసికోచ్చారణాంజిత్" అను ప్రాకృతసూత్రముచేత దాపల నర్ధబిందు యుక్త మాను. "మహతోతఉద్విభక్తౌ" అని యకారమున రుకారము వచ్చును. "రాముఁడు" అని యర్థానుస్వారముతో నిలిచియుండిన "అనునాసికాభావపక్షే అనుస్వార స్స్యాత్" అని పూర్ణబిందువాయెను. కనుక "రాముండు" అని కలదు. హ్రస్వపరము గనుక "రాముఁడు". సర్వత్ర శబ్దనిష్పత్తు లిట్టులే తెలిసికొనునది. స్త్రీపశుజడాదులపట్ల నైన డుజాదులు లేవు. రంభ, వ్యాఘ్రము, వృక్షము. పశుశబ్దము తిర్యగ్జాతుల కెల్ల నుపలక్షణము. అటు గనుక గృధ్రము, కాకము, అనునవియును నమహత్తులు. మహత్తు లైనను జడాదులుగా వివక్షించినఁ గొన్ని యమహత్తు లగును. సముద్రము, మేఘము అజడములుగా వివక్షించితేని సముద్రుఁడు, మేఘుఁడు. తద్విశేషణములును మహత్తులే గనుక, ఘనుఁడైన రాముఁడు. అమహద్విశేషణము లైన నమహత్తులే; ఘన మైనవ్యాఘ్రము. "అనితః" అన్నాఁడు గనుక, రఘుపతి, యదుపతి, యదుచోటుల డుజాదులు లేవు. "పుంసి అన్నాఁడు గనుక దశరథాపత్యము, బ్రహ్మము, అనుచోటుల లేవు.

---

ఆమన్త్రిణసుజసోః స్తః క్రమేణ చా దారదాగమా వన్తే
లుజసో లశసో లాన్తా ల్లాన్తాత్తు రరా తయోః క్రమేణ స్తః. ౨

ఇది మూఁడుసూత్రములు. ఆమన్త్రిణసుజసోః=సంబుద్ధ్యేకవచన బహువచనములకు, అన్తే=అంతమందు, క్రమేణ=క్రమముచేత, అదారదాగమౌ=అత్, ఆరత్, అనునాగమములు, స్తః=అగును. ఏకవచనమునకు, అత్ వచ్చినఁ దకారము పోయెను. సంబుద్ధిప్రత్యయమునకు డుజ్ వచ్చి "రాముఁడు" అని యుండఁగా, అకార మంత్యమందు నిలిచి "రాముఁడ" అని యుండెను. బహువచనమునకు "ఆరత్" వచ్చి తకారము పోయి "రాములు" అనురూపముమీఁద రాములార యని నిల్చెను. అలాన్తాత్=తుద లకారము లేని శబ్దముమీఁద, జసః=ప్రథమా బహువచనమునకు, లు=లు, అనునది, శసః=ద్వితీయాబహువచనమునకు, ల=ల, అనునది యు నగును. రాములు, రాముల,

లాన్తాత్=తుద లకారము గల శబ్దములమీఁద, తయోస్తు=ప్రథమాబహువచన ద్వితీయాబహువచనములకు, క్రమేణ=వరుసచేత, రురౌ=రు,ర, అనునవి, స్తః=అవును. బాలురు, బాలుర; లాన్తాత్ అన్నాఁడు గనుక, ల, అనునది (లకారము) తుదనుండిననే గాని లి, లు, అనునవి తుద నుండిన రురలు లేవు. బుద్ధిశాలులు, దీర్ఘతాలులు.

---

నిరమో మహతాం లుక్చ స్యాత్కర్మప్రవచనీయకే కూర్చిః
మహతో నిలౌ విభక్తౌ టాదౌ వచనద్వయే క్రమేణ స్తః. ౫

ఇది నాలుగు సూత్రములు. మహతాం=మహత్తులయొక్క, అమః=ద్వితీయైకవచనమునకు, నిః=ని అనునది వచ్చును. అమహత్తులమీఁద నైనఁ బరిశిష్టమైన ను అనునది వచ్చు నని తెలిసికొనునది. రాముని, సింహమును. లుక్చ=నినులకు లోపమును వచ్చును. రాము, సింహము, కర్మప్రవచనీయకే=శబ్దశాస్త్రములోఁ జెప్పఁబడిన కర్మప్రవచనీయ మను ద్వితీయాప్రదేశమందు, కూర్చి=కూర్చి యనునది, స్యాత్=అగును. భక్తింగూర్చి జ్ఞానము దొరకెను. ద్వితీయాబహువచనము, రాముల. మహతః=మహత్తునకు, టాదౌ=తృతీయ మొదలైన, విభక్తౌ=విభక్తి పరమైనపుడు, వచనద్వయే=ఏకవచనబహువచనములయందు, క్రమేణ=వరుసను, నిలౌ=ని, ల, అనునాగమములు, స్తః=అగును.

---

టాదివిభక్తౌ నిర్నేత్యేకే నామన్త్రణే డుజిత్యన్యే
టాసశ్చేతో జేపః కైకొఱకూ జపిస ఉచ్యతే వలనః. ౬

ఇది నైదుసూత్రములు. టాదివిభక్తౌ=తృతీయాదివిభక్తులు పరమైయుండిన, నిః=న్యాగమము, న=లేదు, ఇతి=ఇట్లని, ఏకే=కొందఱుపెద్దలనిరి. రాముచేత, రాముకొఱకు, రామువలన, రాముకు, రామునందు. ఆమన్త్రణే=సంబుద్ధియందు, డుజ్=డుజాదేశము, న=లేదు, ఇతి=అని, అన్యే=మఱికొందఱందురు. ఓరామ. అదాగమము సంబుద్ధిగూడినది. టాసః=తృతీయావిభక్తికి, చేతః=చేతాదేశము వచ్చును. మహతో నిలౌ విభక్తౌ టాదౌ, అని నిలలు వచ్చిన, రాముని చేత, రాముల చేత. తృతీయాదౌ, అనక, టాదౌ అని యేకవచనప్రధానముగా నిర్దేశించినాఁడు గనుక యీకార్య మేకవచనములకే యవశ్యము. బహువచనములకును, అమహత్తులకును లాగమము వచ్చు నని జ్ఞాపకము. సింహములచేత, సింహములకొఱకు. నిలలు నైవక్షితవిభక్తులందును వచ్చును. అటుగనుక సమాసముల విభక్తులకు లోపమునైన నవును.

మ. కుడిక న్నంబుజబాంధవుం డెడమక న్నోకాహితుం డగ్గినె
న్నడుమ న్మిక్కిలికన్ను నం దొకట రెంట న్మాట ముచ్చెయ్యులిం
పడర న్నిగ్రహమం దనుగ్రహమునం దైక్యంబు సంధింతు చే
డ్పడు వేళం బెడనాభిధానశివపూర్వస్వాద్యగస్త్యేశ్వరా. ౨౪

మ. కడువేగ౯ గుడిమ్రింగువాని కట లింగం బ్యాక్ష టద్దానె ని
న్నడి లోఁగొన్నమహానుభావునకుఁ గైవల్యంబు ముందెప్పు డం
చడుగంగాఁ బనియేమి తత్క్షణము వశ్యం బౌటయే గాక చొం
ప్పడకున్నే పెడనాభిధానశివపూర్వ- ౨౫

మ. చనుచో నల్లక పట్టితెచ్చి మధురాజ్యక్షీరము ల్వోసి పెం
చినసర్పంబు విషంబు మానని క్రియ౯ శీలంబు లెన్నెన్ని చె
ప్పిన మూఢుండు (నిజంబు) గన్గొనఁడు తద్వృత్తంబు లానైజక
ర్మనిరూఢిం బెడనాభిధానశివ- ౨౬

శా. ధీరోదారగభీరవాఙ్మధుర ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ...గానోపుకా
వేరీవారి మునింగియున్నశిల పృథ్విన్మెత్తనౌనే కృపా
పారీణా పెడనాభిధానశివ- ౨౭

శా. అర్వాచీనవటద్రుమూలఫలవిద్యామూర్తి భాస్వన్నిజా
శీర్వాదస్థిరవర్ధమానమునిరాజీజ్ఞానదీపాంకురా
ఖర్వస్ఫూర్తి సమస్తలోకహితభక్తవ్రాతహృద్వర్తిదృ
క్పర్వా (శ్రీ)పెడనాభిధానశివ- ౨౮

మ. తనువెన్నంటఁ గడంగివచ్చు యముపంతం బంత దూలించి ని
న్ననుఁగుంగౌఁగిలి లోఁగొనం గనిన నిత్యానందుని న్మానినం
దనునిం గాచి పదాహతిం గెడపి తౌ దండాయుధు న్సాధుమా
ర్గనిరోధుం బెడనాభిధాన- ౨౯

మ. కడలిం బుట్టి దివంబు ముట్టి కడిమి న్గన్పట్టి జేజేల ని
క్కడలెల్ల న్విడఁగొట్టి మిట్టిపడు నా కాకోలముంబట్టి నే
రెడుఁబండుం బలెనొత్తి పట్టి విగతార్తిం గ్రోలి తింత్రైన వె
ల్వడసీకం బెడనాభిధానశివ- ౩౦

మ. మదమాతంగబలాంతకారి చటులోన్మాదంబున న్మన్ను ద

న్నెదురుం గానక నీదుకయ్యమునకై యేతేరఁ బోకార్చి నే
ర్పొదవందాల్చి తదాజినంబు కృతకృత్యుం జేసితౌ వానిఁ జే
వదలిర్పం బెడనాభిధానశివ- ౮౧

శా. ఔరా తారకుఁ డల్గి సర్వ మెడసేయం గల్గి పెంజివ్వ కిం
పార న్నిన్ను మగంటిమి న్నగడి నిప్పై వెల్గి చల్లారెఁ దా
నాఱంబోయిన దీపమోన భవదీయంబైన కౌమారశం
పాకోచిం బెడనాభిధాన- ౮౨

మ. సురసంఘాత విఘాతనవ్రతపటిష్ఠుండైన యయ్యంధకా
సురు విధ్వంస మొనర్చి (యంత) దిగధీశు ల్పూర్వసామ్రాజ్యసం
భరణు ల్గా నభయప్రదాత వగుచు న్భాసిల్లితౌ లోక భా
స్వరలీలం బెడనాభిధాన- ౮౩

మ. రథరథ్యద్విరథాంగసారథిధనుర్బాణేషుధిజ్యాళియా
పృథివీవేదరవీందువాక్పతిసురాద్రిశ్రీవధూనాథవా
ర్నిధిభోగీంద్రులుగాఁ బురత్రితయము న్నిర్జించు నీచర్య లు
గ్రధురంబుల్ పెడనాభిధానశివ- ౮౪

శా. గాంగేయాచలచాప నీకొడలు సైగంగన్నఁ గన్పట్టు నీ
లింగాంగిం గనుచో మొఱంగెదవు హాళిం గొంద అజ్ఞాను లే
నుంగుం గన్గొను కుక్కలుం బలెను మన్ను న్మిన్ను నీవెన్నఁగా
వంగానోఁ బెడనాభిధాన- ౮౫

మ. శివనిందాపరులైనవారికిది భాసిల్లంగ దృష్టంబటం
చవలీల న్మఖదీక్షితుం డఘపురాధ్యక్షుండు దక్షుండు ము
న్నవలాలాయుత మైన గొర్రెతలతోడం గుందఁగా నున్న మా
న్యపశంబే పెడనాభిధాన- ౮౬

మ. సుమనస్సుం డొకవేళ నార్జితమనస్తోకంబుగా ముట్టిన
న్విమలజ్ఞానము గోలుపోయి నినుగా వేఱెందుచేపట్టునే
సుమనస్సింధువు నైజ మొందదె విషార్చుల్ గ్రమ్మఱం బుట్టి తం
త్రమఖేశా పెడనాభిధానశివపూ- ౮౭

మ. మలదేహు ల్పదివేలు గూడినను సామ్యం బొందురే నిత్యని
ర్మలచిత్తుం డగు న్భక్తభక్తునికి సామాన్యంబు పో దున్న ము

న్నలరాయించ కనంగుపుల్గులు సమం బౌనయ్య వేఱొండనా
వలదింకం బెడనాభిధానశివపూర్వస్త్యాద్యగస్త్యేశ్వరా. ౮౮

శా. నీలగ్రీవ మహానుభావ త్రిజగన్నిర్మాణపారీణ కా
కోలాహార భుజంగహార నగరాట్కోదండ సంపోషితా
ఖీలాంభోజభవాండభాండ సదరీభృద్వల్లభ స్నేహాకృ
త్పౌలస్త్య పెడనాభిధాన- ౮౯

మ. బగుతుం డొంతయు నాజవంజవ సుఖభ్రాంతిం దగుల్గొన్న నీ
జిగి యజ్ఞానముగాదు వాని యెడ కౌచిత్యంబు గాదేని పై
నిగుడుల్ గప్పిన నిప్పునందు సెకలేనేలేదె నాసామి నీ
వగపేలా పెడనాభిధానశివ- ౯౦

శా. ప్రాదుర్భావ వివేకమర్కటకిశోరన్యాయ మింపొంద మీ
పాదాబ్జంబులనంటి జంటగను తేవన్నా మనఃపుష్ప మా
మోదం బైనది యందుఁ బొందుగఁ జిదాభోగంబు నీకెందు కీ
వాదంబో పెడనాభిధానశివ- ౯౧

శా. పూనన్లేద బిడాల మాత్రశిశువుం బొందానె నాపిల్లలై
తేనేతీయునఁ ద్రిప్పినం దిరుగు నింతేకాని నావల్ల నే
మౌనయ్యా ననుఁ గన్నతండ్రి విలఁ జోద్యంబె మదిన్నీ కుమా
ప్రాణేశా పెడనాభిధానశివపూ. ౯౨

మ. పలుమాఱుం బలుకం బనేమిపుడు నాభాగ్యంబహో దేవ భూ
తల నిత్యోత్సవ నీవు నేననెడి భేదంబూడ్చి నిన్నాటపా
టల ముప్పూఁటలు గొల్చెదన్ భ్రమరకీటన్యాయసంసిద్ధి తా
వలమయ్యెం బెడనాభిధానశివ- ౯౩

మ. ఘటజన్మార్చితపాదపద్మ నిజభక్తిస్వాంతరాజీవ వి
స్ఫుటలీలామణిసద్మ సంహృతజనస్తోమాతిదుర్దాంతహృ
జ్జటిలచ్ఛద్మసమస్తయోగి సుమనస్సంవేద్య విద్యుజ్జటా
పటలీభృత్పెడనాభిధానశివపూ. ౯౪

మ. శ్రవణానందముగా భవన్మహిమ లశ్రాంతంబు నే వింటి నీ
నవహేలాకృతి లోచనోత్సవ ముదగ్రం బైతగం గంటి మ
ద్భవబంధంబు విడంగఁ గొంటి నిను నీ భక్తుండనై మంటి · గా

రవ మబ్బెం బెడనాభిధానశివపూర్వస్థాద్యగస్త్యేశ్వరా. ౯౫

మ. మొదటం దెల్పని గొంత ముందెలియకేమో కొంత భాషించితి
న్నది దూషించితి నిన్ను నేమయినను న్నన్నంచు టర్థాంబు మ్రొ
క్కెద నే దాసరితప్పు దండమున నా కీడెంచి మేలెంచ సం
పదగల్గుం బెడనాభిధానశివ. ౯౬

మ. నతపంతాన భవత్ప్రసాదమునఁ జూర్ణప్రాయమై మత్పురా
కృతదుష్టర్వితాన మంతయుఁ దొలఁగె న్నిత్యలింగార్చనా
రతి సాఫల్యముఁ జెందె నామతిఁ బునర్జన్మం బలభ్యంబు సు
వ్రతినైతిం బెడనాభిధానశివ. ౯౭

శా. నావృత్తాంతము విన్నవించితి సకృత్సన్నంబంత యాలించి తీ
వావంతైనఁ గొఱంత లేదు కడుమే లయ్యె న్నరేకాక నీ
సేవ న్నుస్థిర మైన ముక్తి నను డాసె న్నీవు నుం దోడుగా
రావచ్చుం బెడనాభిధానశివ. ౯౮

శా. ప్రారంభంబుర ని న్నగ్రతీశ్వరునిగా భావించి నేఁ జెప్ప నో
ప్పారం బూనిన నీసుభక్తిశతకం బయ్యెం బ్రపూర్ణంబు చే
తోరూఢిఁ మఱి చిత్తగించి ముదితాత్మం జేయవే సద్ఘృణా
పారీణా ! పెడనాభిధానశివపూ. ౯౯

శా. ఎన్న న్వాక్కుల సన్నుతింతు నను టింతేకాని తత్త్వాళలం
బెన్న న్నీస్తుతి గాదె కాన మఱి నీకే చెల్లు నిందెట్టి త
ప్పున్నన్నన్ను క్షమించి కాచుకొనుముద్యోగంబు దూరీకృతా
పన్నార్తా పెడనాభిధానశివపూర్వస్థాద్యగస్త్యేశ్వరా. ౧౦౦

శా. భావింపన్ జను లెల్ల నీభువి భవద్భవ్యాభిధానాంకితం
బై వాక్చాతురి మీఱి సన్నుతిహితం బాచంద్రతారార్కముల్
... ... ... ... ... ౧౦౧

శా. శ్రీమంతు ల్మతిమంతు లుజ్జ్వలయశశ్శ్రీనాథసీమంతినీ
సామంతుల్ ఘనుఁ బాదురీనగరసంస్థాను ల్సదావృత్తినీ
నామోచ్చారణనిష్ఠఁ జేసి మఱి దీనత్రాణపారీణతా
ప్రాముఖ్యు ల్పెడనాభిధానశివ. ౧౦౨

శా. శ్రీయుం జేయును బాపు నాపదల నుర్వి న్నీమహాప్రార్థనం

బాయుర్వృద్ధి యశస్సమృద్ధి హితవిద్యాబుద్ధిసంశుద్ధి ని
శ్శ్రేయస్సిద్ధి యొసంగుఁగాత నిరతశ్రీరస్తు మత్సంగత
ప్రాయస్తే పెడనాభిధానశివ. ౧౦౩

శా. చిల్లీలాకృతి మల్లికార్జునఇతి శ్రీపండితారాధ్యహృ
త్ఫుల్లాంభోజవిహార భూరివిలసత్పుష్పంధయస్వామివై
మల్లంపల్లి వసించియున్న త్రిజగన్మాన్యుండ వీవంత్రు సం
పల్లీనా పెడనాభిధానశివపూర్వ. ౧౦౪

శా. గంగాభోగవతీభుజంగ భుజగగ్రైవేయకోత్తుంగ సా
రంగాస్వప్నవిపక్షభంగ కరసంప్రాప్తైకసారంగ సా
రంగాంకప్రథితోత్తమాంగ మృదుసారంగీదృగార్యాపరి
ష్వంగాంగా పెడనాభిధానశివపూర్వస్త్వాద్యగస్త్యేశ్వరా. ౧౦౫

మల్లంపల్లి మల్లికార్జునపండితారాధ్యవిరచితము.

సంపూర్ణము.

ఈశతకము

జగ్గయ్యపేటనివాసులు బ్ర॥ ములుగు వీరభద్రశాస్త్రిగారిచ్చినది.

# ౩. మన్నారుకృష్ణశతకము.

పైఁడిపాటి వేంకటనృసింహకవి.

---

## సీసపద్యములు.

### (1) స్తుతిదశకము

శ్రీరుక్మిణీరహఃక్రీడాకళాసత్య సత్యభామామనోజలజమిత్ర
మిత్రవిందాధరామృతపానచాతుర్య తుర్యకాళిందీనదీప్రసంగ
సంగమనిపుణలక్షణలక్షణాధీన ధీనయనాగ్నజితీప్రసాద
సాదరసల్లాపజాంబవతీలోల లోలదృగ్భద్రాముదాలవాల
వాలఖిల్యాదిమునిసంస్తవప్రభావ, భావమున నెంతు నిను విష్టపప్రచారుఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧

పద్మావతీమనఃపంకజసారంగ రంగదంభోధిపర్యంకమోద
మోదకభుక్తాతసాదరసాంగత్య గత్యంతరాభావఖచరరక్ష
రక్షశ్చమూమహారణ్యపావకకీల కీలాలభృత్తుల్యనీలవర్ణ
వర్ణమాలాజవోదీర్ణమంత్రాధార ధారణాయోగమేధావివరద
వరదయామతికుజనధూర్వహమునడువ, నడువవేమఁదకని వేఁడుపుడమి నెంతుఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౨

ప్రకృతికార్యేతరప్రబలనిత్యానంద నందనీకృతశతానందకామ
కామాదివర్గతమోమహితాదిత్య దిత్యపత్యసరోవదీననాగ
నాగలోకవిభుత్వభోగభోగిశయాన యానవేగఖగాధిపానిశాశ్వ
శాశ్వతవసుగుణైశ్వర్యదనామాంక మాంకస్థలలితోత్తమాంగదేవ
దేవకీకుక్షి వెడలి పీతెక్కుపరిగె, పరిగెనని వేఁడురుద్రాదిసురల నెంతుఁ, జారు.

నిఖిలవేదాంతోపనిషదర్థసంభావ్య భావ్యతీతశుభాశుభద్వయజ్ఞ
యజ్ఞపర్యవసానహవ్యవపాహార హారకుండలభూషితాంగబృంద
బృందారకాష్టదిగీశరక్షణదక్ష దక్షాధ్వరాహిత దైవమాన్య
మాన్య స్త్రిభువనసామ్రాజ్యసంపద్భోగ భోగసంభృతపరిస్ఫుటమహీన
హీనమతివత్సబాలుర నెత్తిదాఁచి, దాఁచియుతనైతినని వేఁడుధాత నెంతుఁ, జారు.

విశ్వసృష్టిస్థితివిలయకార్యనిదాన దానకృజ్జనకల్పతరుసమాన
మానసపూజావిధానహృష్టస్వాంత స్వాంతరింద్రియజిదార్యప్రణామ
నామజపావృత్తిసీమవచోవాస వాసనాత్రితయనివారచతుర

చతురంతజాతిసంస్కారపరిష్కార కారణాచార్యయోగప్రసిద్ధ
సిద్ధవందితచాలవర్షించిమరల, మరలఁ దెలిసితినని వేఁడుముఘవుఁ దలఁతుఁ, జారు.
గంగానదీజన్మకారణపదపద్మ పద్మామనోహరావచితిధిషణ
ధిషణమంత్రేతరదితిజభంగవిచిత్ర చిత్రాంశుతేజోవిశేషబీజ
బీజవత్పుషితనానాజీవపరివార వారణేంద్రఘునస్తవప్రియాత్మ
యాత్మకళాలోకనాన్యతుర్యాసన్న సన్నహనాసురసైన్యహారణ
హారనరేంద్రార్చితశ్రీపదారవింద, విందవైతివియని వేఁడువిదురు నెంతుఁ, జారు.
ఉభయపార్శ్వవిభాస్వదుదధికన్యాగోత్ర గోత్రజేశస్తుతఘోరకర్మ
కర్మత్రయీబద్ధకవిమానసాసాధ్య సాధ్యచారణసమర్చాప్రసన్న
సన్నద్ధమధుదైత్యసముపేతసంగ్రామ గ్రామణిగుణశార్ఙ్గనామధర్మ
ధర్మాదిపూరుషార్థప్రదతాత్పర్య పర్యంకకృచ్ఛేషఫణికులేశ
లేశమునునిన్నువివరింప లేకనాఁడు, నాఁడునవ్వుదునని వేఁడునరుని నెంతుఁ, జారు.
సనకాదిమునిమనశ్చరదంఘ్రిరాజీవ జీవతనుత్రయస్థిరనిశాంత
శాంతమానసజనైకాంతదృక్సముదిత ముదితానుసంధానమునివితాన
తానగానచణత్రిదశమానియోగార్హ గార్హపత్యాద్యగ్నిగతవపాద
పాదసంక్రాంతదిక్పతికిరీటస్తోమ సోమసూర్యగ్రహసురుచిరాక్ష
రాక్షసాంతకదివ్యవిగ్రహాఖసూచి, సూచినన్నెంతుననినభీష్మునినుతింతుఁ, జారు.
ప్రతిదినాకాంక్షితపద్మాస్వయంగ్రాహ గ్రాహపీడితగజకష్టశమన
శమననందనరిపుక్షయదిగ్విజయమూల మూలప్రకృతికార్యజాలఖేల
ఖేలాంతరాళస్థలీలాచిదాభాస భాసమానసువర్ణభావుకపట
కపటనాటకకృతోద్గత జగద్వ్యతిరిక్త రిక్తసాధువిపత్సరిత్సుతరణి
తరణినిభనీహితోక్తులవిరిసేఁదమము, తమముఖముగంటిననినయుద్ధవుగణింతుఁ,
జారుతరమందహాస ఘోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౯
శ్రీయాదవాన్వయశ్రేయస్సరోహంస హంసశీతాంశుదివ్యావలోక
లోకేశలీలావివేకకార్యవికల్ప కల్పద్రుసురధేనుకల్పదాన
దానవగణమహీధరమహోగ్రశతార తారాభదధికణాకారకలిత
కలితమస్వాంతముష్కరదర్శనాభావ భావజముఖతనూభవనికాయ
కాయపరిదిగ్ధదుగ్ధప్రకాశమాన, మానసీసేవనిల్వనామానసమునఁ,
జారుతరమందహాస ఘోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౦

## (౨) దాససంగతిదశకము.

వరదేవకీగర్భవారిధిద్విజరాజ ద్విజరాజగమనావతీర్ణ భువన
వసుదేవకంసనే వాతమఃపద్మాప్త పద్మాప్తచేటీకృతపస్సపర్య
కృతయశోదాకుచక్షీరపానాదర నాదరహాస్యానుమోదచిత్త
వర్ధితనందగోవత్సనానాభీర నాభీరణార్త్రిహీణ ప్రసంగ
యాపదుద్ధారననుఁబ్రోవుసాపరాధి, రాధికాగోపన్ముపవధూరత్నజార, చారు
సాఁగి ప్రౌఁక్కెడుదు భీష్మకనందనాలోల నాలోలవృత్తి నెన్నంగఁబోకు
గణుతింతు నినుఁ బాతకస్పర్శనాహీన చాహీనకృత్య మెన్నంగఁబోకు
కీర్తింతు రక్షితకృష్ణార్జునాక్రూర నాక్రూరచేష్ట లెన్నంగఁబోకు
సేవింతుఁ గరధృతగోవర్ధనాచల నాచలచిత్త మెన్నంగఁ బోకు
మిట్టి వ్రాత్యుఁడ నాభాగ్య మేమొకాని, కాని నీసేవ నేఁటికి గలిగె నాకుఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౨
హాయిగాఁ గనవశంబె యుష్మదాస్యంబు దాస్యంబు సేయని తామసులకుఁ
దెలియశక్యమె భవదీయప్రభావంబు భావంబుచలియించు పామరులకు
వినుతింపఁ దరమా నె నేణుభృద్ద్వేషంబు ద్వేషంబుమదినొప్పు ద్రిమ్మరులకుఁ
బ్రాపింపనేర్చునే భవదవలోకంబు లోకంబునడకల ప్రాకృతులకు
ననఘ యీదుర్గుణములచే నలరు జడునిఁ, జెడు నిరర్థకు నను దరిఁజేర్చుటెట్లు
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౩
కృతిచెప్ప మని ప్రల్లరింపనేచాలవా చాలవాచాలకశక్తి గలిగి
నావిన్నపముఁ గూర్మిమై వినఁగోరవా గోరవాకర్ణనకుతుక మెఱిఁగి
యనఘుఁ జేసితి నని యభయ మీఁజేరవా జారవామాత్ములసఖ్య మెఱిఁగి
ననుఁగొల్చి కడతేరినాఁ డని వాడవా వాడవాడల ముచ్చు జాడ లెఱిఁగి
యిట్టిచాతుర్యతుర్యము లెఱిఁగియున్న, యున్నతస్థాననాదైన్యముడుపఁగదవె
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౪
సకళత్రపుత్రవంచకుఁడ మన్మేలుకో మేలుకోయని దయామృదులహృదయ
గతజన్మకర్మపీడితుఁడ నన్నాదుకో నాదుకోరికలిచ్చి నలిననాభ
కన్నతండ్రివిధంబు నన్నుఁ జేపట్టుకో పట్టుకోకలు మొలఁగట్టుశౌరి
పూతచిత్తునిఁజేసి పుణ్యంబు గట్టుకో గట్టుకోమలపాణిఁ గట్టినహరి
సేవకుఁడనంచుఁబలుమాఱుఁ జెప్పుకుందు, కుందునామది దైన్యంబునొందనీకు
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౫

# విషయసూచిక.

# పరిషత్ప్రయోజనములు.



తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధినొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసఁగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ బొందుపఱుపఁబడు చున్నవి:—

i తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వంకష మగునిఘంటు వొకటి రచించి ప్రచురించుట;

ii తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణము రచించి ప్రచురించుట;

iii ఆధునికశాస్త్రగ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట;

iv ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యములైన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగు దేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుట;

v సర్వవిషయములనుగుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట;

vi ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారముచేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట;

vii తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట;

viii తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకుఁగాను వార్షికసభల నేర్పాటుచేయుట;

ix తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్రికలను నొసంగుట;

x ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట-ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును; వ్రాఁతప్రతులుఁగూడ నుండవలయును;

xi తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపచరించు నన్ని కార్యములను జేయుట.

ఆంధ్రసాహిత్య

పరిషత్పత్త్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

| సంపుటము ౨౦. | ప్రజోత్పత్తినామసంవత్సరము ఆశ్వయుజ కార్త్తికమాసములు. | సంచిక ౪. |
| --- | --- | --- |

# కావ్యాలంకారసూత్రవృత్తి.

—కనకదండి గోపాలకృష్ణశాస్త్రిగారు, విజయనగరము—

ఈగ్రంథ మలంకారగ్రంథములలో మిక్కిలి ప్రాచీన మైనది. ప్రామాణిక మైనదియుఁ గూడ నై యున్నది. ప్రాచీనాలంకారగ్రంథములలో సూత్రరూపము గనున్న దిది యొకటియే యని చెప్పవచ్చును. మొత్తముమీఁద నీగ్రంథమును సూత్రము లని, వృత్తి యని రెండువిధములుగ విభజింపవచ్చును. ఇందలిసూత్రములు వ్యాకరణాది సూత్రములవలె నంత క్లిష్టార్థకములుగ లేవు. వృత్తి కూడ నుదాహరణాదులతో విపులతరముగ వ్రాయఁబడి యున్నది. ఇందు, కావ్యమునకు రీతియే యాత్మ యని చెప్పఁబడినది. ఇట్టియీయుభయరూపమగునీగ్రంథమునకు వామనుఁడుకర్త యనిచాలమంది యభిప్రాయపడుచున్నారు.

ఈక్రిందఁ బొందుపఱుపఁబడిన గ్రంథాది శ్లోకమును బరికించి చూడ వామనుఁడు తనసూత్రములకే తాను వృత్తి వ్రాసికొనుచున్నటులఁ దెలియుచున్నది.

శ్లో. ప్రణమ్య పరమంజ్యోతి, ర్వామనేన కవిప్రియా
కావ్యాలంకారసూత్రాణాం, స్వేషాం వృత్తి ర్విధీయతే.

మఱి యుఁ దరువాతియలంకారగ్రంథకర్తలు వ్యాఖ్యాతలునుఁ గూడ సూత్రములయందలి యాశయములను వృత్తియందలి యాశయములను నానావాక్యముల నుదాహరించుచు వివరించి వామనునిమతముగాఁ జెప్పుచున్నారు,

దీనినిఁ బట్టిచూడ వామనుఁడే యుభయరూప మగుగ్రంథమునకు కర్త యని తెలియుచున్నది. కాని సూక్ష్మదృష్టితోఁ బరికించి చూచిన రెండును నేకకర్తృకములుకావని స్పష్టముగఁ దెలియును.

ఇప్పుడు మన కనేకవిధము లగుసూత్రగ్రంథము లుపలభ్యమానములగుచున్నవి. వానిలో సూత్రము లెంత దురవగాహ మైన యర్థము కలవి యై యున్నను సూత్రకారునిచే నిర్మింపఁబడిన వృత్తి మొదలగునవి దేనికిని గనఁబడుటలేదు. అట్టిసూత్రగ్రంథములకు సూత్రకారుని పాఠమున కలవడిన శిష్యులచేఁ గాని యితరులచేఁ గాని వృత్త్యాదులు వ్రాయఁబడినట్లు కనఁబడుచున్నది. ఇట్టితఱి నీసూత్రములకు సూత్రకారుఁడే వృత్తిని వ్రాసికొనె ననుట యుచితముగ నుండదు.

ఒకవేళ సూత్రకారుఁడే తనసూత్రములకుఁ దానే వృత్తి వ్రాసికొనిన ను సూత్రాక్షరములవలన విశదము లగువిషయములను వదలి క్లిష్టము లగు విషయములనే వివరించును. అంతియె కాని సూత్రములవలన సులభముగఁ దెలియు విషయములను దిరిగి ప్రతిపదార్థముచే వివరింపఁడు.

చూడుఁడు ! ఈక్రిందిసూత్రములకు వృత్తి యెటులున్నదో !

సూ:—విశిష్టా పదరచనా రీతిః-1-2-7.

వృత్తి:—విశేషవతీ పదానాం రచనా రీతిః.

సూ:—సా త్రిధా-వైదర్భీ గౌడీ పాంచాలీచ. 1-2-9.

వృత్తి:—సాచేయం రీతి స్త్రిధా వైదర్భీ గౌడీ పాంచాలీ చేతి.

సూ:—శబ్దస్మృతివిరుద్ధ మసాధు-2-1-5.

వృత్తి:—శబ్దస్మృత్యా వ్యాకరణేన విరుద్ధ మసాధు.

ఒక్కొకచోఁ బూర్వము వివరించిన పదమునే తిరిగి వివరించుచుండును. సూత్రకారుఁడే తనసూత్రములకుఁ దాను వృత్తివ్రాసికొనిన నట్లు వివరించునేమో యూహింపుఁడు.

సూ:—శ్రుతివిరసం కష్టం-2-1-6.

వృత్తి:—శ్రుతివిరసం శ్రోత్రకటు కష్టం—

ఇచ్చట వివరించిన విరసశబ్దమును దిరిగి-

సూ:—విరసవిరామం యతిభ్రష్టం-2-2-3.

వృత్తి:—విరసః శ్రుతికటు ర్విరామో యస్మిం స్తత్ విరసవిరామం యతిభ్రష్టం.

అని యీసూత్రవృత్తిలో వివరించుచున్నాఁడు.

ఇంకను సూత్రకారుఁడే వృత్తి వ్రాసికొనియున్నయెడల వృత్తి లేకపోయినను విశదముగఁ దెలియు నీక్రిందిసూత్రమున కింతవివరణమును వ్రాయునేమో సహృదయు లూహింతురుగాక !

సూ:—పృథక్ పదత్వం మాధుర్యం 3-1-21.

బన్ధస్య పృథక్ పదత్వం య త్త న్మాధుర్యం. పృథక్ పదాని యస్య సః పృథక్ పదః తస్య భావః పృథక్పదత్వం.

ఇట్టివృత్తిని బరిశీలింప సూత్రకారకృతము కా దని సహృదయులకుఁ దోఁపకమానదు.

మఱియుఁ గొన్నిప్రతులలో "స్వేషాం వృత్తి ర్విధీయతే" యనుగ్రంథాదిశ్లోకమందు "తేషాం" అని పాఠము గాననగుచున్నది. ఆపాఠమునకుఁగూడఁ గారణ మూహింతము.

వామనుఁడు తానే ప్రసిద్ధములైన యెవరియలంకారసూత్రములకో కవిప్రియ యనువృత్తిని వ్రాయుచున్నటుల "తేషాం" అని ప్రయోగించి సూచించుచున్నాఁడు.

కాని తరువాతి యలంకార గ్రంథకర్తలు వ్యాఖ్యాతలునుఁ గూడఁ దమగ్రంథములలో నీసూత్రములను వృత్తిని గూడ నుదాహరించుచు సూత్రకారునినామము తెలియకపోవుటచేతను వృత్తికారుఁ డగువామనునినామ ముండుటచేతను రెంటికి వామనుఁడే కర్త యని యభిప్రాయపడిరి.

ఈగ్రంథము క్రమముగ లేఖనపరంపరలోనికి దిగినతరువాత వ్రాసికొనువారు పైగ్రంథకర్తల యాశయానుసారముగ వామనుఁడే కర్త యనినిశ్చయించుకొని రెంటికి నేకకర్తృత్వము స్పష్టముగ సూచించునటులు తమప్రతులలో "తేషాం" అనుచోట "స్వేషాం" అని పాఠాంతరమును గల్పించియుందురు. ఇచ్చట శబ్దవినిమయమును జేయుటను సులభముగఁగూడనున్నది. ఇదియే పాఠాంతరమునకుఁ గారణమై యుండవచ్చును.

పైహేతువులనుబట్టి బాగుగఁ బరిశీలించి చూచినచో వామనుఁడే వృత్తికారుఁ డని సూత్రకారునికన్న భిన్నుఁ డని యు స్పష్టముగఁ దెలియుచు

న్నది. కనుక వృత్తికారుఁ డగు వామనుఁడే సూత్రకారుఁ డనుట యెంతమాత్రము నుచితము గాదు.

తుదియధ్యాయములయందలి వ్రాయఁబడిన శబ్దసాధుత్వ ప్రతిపాదకసూత్రములను బరికింప సూత్రకారుఁడు గొప్ప వైయ్యాకరణి వలెఁ గన్పట్టుచున్నాఁడు. ఇట్టి యీసూత్రకారుఁ డేనాఁటివాఁడో యెక్కడ జన్మించెనో నామమేదియో స్పష్టముగఁ దెలిసికొనుటకుఁ దగినప్రమాణములు కానరావు.

కాని వృత్తికారుఁ డగువామనుని, క్రీస్తుతరువాత 850 ప్రాంతమునకుఁ జెందినవాఁ డని యాధునికచరిత్రకారులు నిర్ణయించినారు. దీనిని బట్టియు, వృత్తికారుఁడు తాను వృత్తివ్రాయునాఁటికే యీసూత్రములు ప్రసిద్ధముగ వ్యాపించియున్న వని "తేషాం" అని సూచించుటచేతను, వృత్తివ్రాయునాఁటికిఁ జేరుకూడ (సూత్రకారునిది) తెలియకపోవుటచేతను సూత్రకారుఁడు వామనునికంటె నొకశతాబ్దము తప్పక పూర్వుఁడై యుండవలయును. వామనునికి వృత్తి వ్రాయునాఁటికి నామమే తెలిసియున్న సూత్రకారుని నేల నిర్దేశింపఁడు? మొత్తముమీఁద సూత్రకారుఁడు 750 ప్రాంతమునకు నవీనుఁడు కాఁ డని తోఁచుచున్నది.

# కవిత్వము.

శతావధాని, పిసుపాటి చిదంబరశాస్త్రిగారు, పిఠాపురము.

---

జందెము వ్రేళ్లకు వేసికొని విధి విరామములేక వల్లించుటకు వేదమా! కాదు. వ్యాఖ్యానగ్రంథములతోఁ గూడఁ గంఠపాఠము చేసి యందులో నుండు విషయమునే చర్వితచర్వణముగా నుగ్గడించుచు స్మృతికి రాక కొంచెము వెనుకంజవేయువాని నోడించితి మని చంకలు గొట్టుచు నందులోని విషయములు దృఢముగాఁ గంఠపాఠముచేసి ముఖస్థముగా వెల్లడించువానిని గొప్పపండితుఁ డని మెచ్చుకొనుచు విషయాంతరము నెఱుఁగక తమలోఁ దాము సంతసించుటకు వ్యాకరణమా! కాదు. స్వల్పవిషయమును జెప్పవలసి వచ్చినపుడు కొండవీటి చేఁద్రాడువంటి వాక్యము ను బ్రయోగించువాఁడే నేర్పరి యనియును నెవఁడైనను సరసముగా నన్వయించిన శ్లోకమును దాఱుమాఱుచేసి యన్వయము కుదరలే దని వాదించుచు మాటకుఁ దొంబదితొమ్మిది సంబంధములు కల్పించుచు నూఁకదంపువలె నిష్ప్రయోజనము లగు పదములు వేనవేలుగాఁ గ్రుమ్మరించుటయే పాండిత్య మనుకొని తమకంటె మహాపండితులు లే రని స్వైరసంచారము కావించుటకుఁ దర్కమా! కాదు. వేదములోని కర్మకాండము ననుసరించి ప్రత్యక్షముగా శాస్త్రములచేత ను ననుభవముచేత ను నుగ్గడింపఁబడెడి దేవతలు లే రనియు ను జీవితపర్యంతమును గర్మము లాచరించుచుండుటయే పరమార్థ మని యుఁ జాటించుటకు మీమాంసయా! కాదు. ఉపనిషద్వాక్యముల ననుసరించి బ్రహ్మ మొక్కటే సత్యము, ప్రపంచము మిథ్యయని చెప్పినదానినే మార్గాంతరములచేఁ జెప్పుచుండుటకు వేదాంతమా! కాదు నక్షత్రములు లెక్కపెట్టుటకు జ్యోతిషమా! కాదు. మందులు నూఱుటకు వైద్యమా! కాదు. ఇది కవిత్వము. దీనికిఁ బ్రాక్తనసంస్కారము కారణము.-

శ్లో. శక్తిః కవిత్వబీజంహి ప్రాక్తనీ సంస్క్రియా మతా
యయా వినా న ప్రసరే త్కావ్యం శిక్షావతా మపి.

ప్రాక్తన సంస్కారము లేనిచో నెంత పాటుపడినను నితరవిద్యలవలెఁ గవిత్వము రానేరదు. వృక్షమునకు బీజమువలెఁ గవితావతారమునకుఁ బూర్వజన్మసంస్కారమే కారణము. పూర్వజన్మ సంస్కారప్రబోధము లేకుండఁగనే కొందఱు వ్యుత్పత్తి బలమునఁ గావ్యము రచింపఁ బూనుకొందురు, కాని, వారు చేసెడికావ్యము నీటిమూటవలె హాస్యాస్పదము కాకమానదు.

"వ్యుత్పత్తిగౌరవబలా ద్యది కించి త్తథంచన
ప్రసారితం పరం తచ్చ హాస్య మేవ న సంశయః"

పాండిత్యము సంపాదించి తద్బలమునఁ గ్రిందమీఁదఁ బడి యెట్లేని యే కొంచెమో కవిత్వము చెప్పవచ్చును. అది హాస్యాస్పదమే కాని రక్తికి రానేరదు. మఱియు,

"కవితా వనితా చైవ స్వయ మే వాగతా వరా
బలా దాకృష్యమాణా చే త్సరసా విరసా భవేత్."

దీనివలనఁ గవితావిర్భావమునకుఁ బ్రాక్తనసంస్కారవిశేషము తప్పఁ బాండిత్య మవసరము లే దని కొందఱు భ్రాంతి పడవచ్చును. అది పొరపాటు. పూర్వజన్మసంస్కార మున్నను వ్యుత్పత్తి లేనిచోఁ గవిత్వము బయలుపడ నేరదు. భూమి త్రవ్వనిచో సలిలము బయలుపడునా! ఆవేగము వలన నించుక బయలుపడినను జలసేచనము లేని యంకురమువలె నది క్షీణింపక తప్పదు. అందు వలననే-

"నా కవిత్వ మధర్మాయ మృతయే దండనాయవా
కుకవిత్వం పున స్సాక్షా న్మృతి మాహు ర్మనీషిణః."

కవిత్వము చెప్పకున్నచో దండనముగాని మరణము గాని పాపము గాని రానేరదు. కాని, చేతఁగాని కవిత్వముమాత్రము కవికి మృత్యుదేవతయే యనకతప్పదు.

"పరిబర్హవతీం కర్తుం ప్రతిభాం ప్రతిభానవాన్
సాధీయసింతు వ్యుత్పత్తిం సవిధే సన్నిధాపయేత్."

తగిన వ్యుత్పత్తిని బ్రతిభాసామీప్యమున నుంచినచో నప్పుడు చెలమ త్రవ్వినచో నీరూరినట్లు కవిత్వము ప్రసరించును. అది పదిమందికి నుపయుక్త మగును.

"వ్యుత్పత్తి ర్లోకచారిత్రకావ్యశాస్త్రాద్యవేక్షణమ్
అభ్యాస ఉపదేశేన కావ్యజ్ఞానాంచ సన్మతా."

లోకజ్ఞానమును, కావ్యజ్ఞానమును, వేదశాస్త్రజ్ఞానమును, అభిజ్ఞుల యుపదేశముచేతఁ జేయఁబడు నభ్యాసమును, వ్యుత్పత్తి యనఁబడును. వ్యుత్పత్తి కవిత్వమునకు మిగుల నావశ్యకము. కావున వ్యుత్పత్తిలేని కవిత్వము ప్రకాశమానము కానేరదు. మఱియు—

"చరస్థిరానేకవిధ లోకవృత్తానువర్తినః
కావ్యస్య కారణం లోకజ్ఞానముచ్ఛ్వసితం కవేః"
అజ్ఞాతలోకవృత్తో యః శాస్త్రకావ్యవిదప్యసౌ
ఋశ్యశృంగ ఇవాశేషైః ఘుష్యతే ముగ్ధసంసది.

కవిత్వమునకు లోకజ్ఞానము జీవితము. ఎంతపాండిత్యము కలవాఁడైనను లోకజ్ఞానము లేనిచో ఋశ్యశృంగునివలెఁ బరిహాసాస్పదుఁడగును. కావున, ముఖ్యముగాఁ గవిత్వమునకు లోకజ్ఞానము కావలసియున్నది. లోకజ్ఞానము లేనిచోఁ నంధునకుఁ బదార్థములు కనఁబడనియట్లు కవికి విషయము గోచరింపదు. మఱియును శబ్దసిద్ధికొఱకు వ్యాకరణశాస్త్రమును వృత్తసంశయము లేకుండుటకు ఛందశ్శాస్త్రమును ముఖ్యముగాఁ గవి యగువాఁడు పరిశీలింపవలయును. అది యిది యననేల; ఎల్లవిద్యలమర్యాదయును గవి యగువానికిఁ దెలిసి యుండవలయును.

"న స శబ్దో న తద్వాచ్యం న సా విద్యా న సా కలా
జాయతే యన్న కావ్యాంగ మతో భారో మహాన్ కవేః".

కావ్యాంగము గానిశబ్దమును నర్థమును విద్యయు ను గళయు ను లేదు. కావునఁ గవిత్వము చెప్పెడివానికిఁ గలభారము మఱియొకనికి లేదు. దీనింబట్టి కవిత్వ మనునది సర్వజనసాధారణ మని కాని యన్నివిద్యలతోపాటు నిది యు నొకవిద్య యని కాని యన్నివిద్యలను సాధించినట్లు దీనిని సాధింప వచ్చు నని కాని తలంచుట యాపాతరమణీయము. కవిత్వముం గూర్చి మఱియొకవ్యాసము సవిస్తరముగా వ్రాయ నుంటిని గావున దాని స్వరూపము దిక్ప్రదర్శనముగా నిందుఁ జూపఁబడినది.

# గ్రంథపరిశోధనము.

— జనమంచి శేషాద్రిశర్మగారు, కడప. —

---

శ్లో॥ నిందతు నందతు వా సన్నసూయు రనసూయు రత్ర కిం తేన
యత్సన్మానసగమనాయై వేదం మమతు పాథేయమ్.

మహాశయులారా ! రసికజనశేఖరులారా !

కాలము మానవులమానసముల మార్చివైచును. స్వాతంత్ర్య మాకాలముననే కలదు. అది భగవత్స్వరూప మగుటంజేసి యనర్గళముగఁ బసరించుచుఁ దాఁ జేయఁదగుకార్యమును జేయుచుండును. అంతియకాక యొకప్పుడది యితరులమూలముననును జేయించును. సర్వస్వాతంత్ర్యము లద్దానికిం గలవు కదా. ఒక్కరిని బురికొలిపి గ్రంథమును వ్రాయించును. వేఱొకరిని బ్రోత్సహించి యద్దానిని విమర్శింపఁజేయును. ఈ రెండుశక్తు లొకరికే యుండిన నేమిబాధ యనియో యది యట్లు చేయును. దాన లాభమేమో మన మెఱుంగఁజాలము. కాని యొకఁడు గ్రంథకర్త నని గర్వింపకయుండ వేఱొకరిమూలమున దానిని విమర్శింపఁజేయు ననియు, విమర్శకుఁడు గర్వింపకయుండ గ్రంథమును జేయుశక్తి లేకుండఁజేయు ననియు మన మూహించుట యంత పొరపాటు గాదు. ఇదియే యిందుఁ గలసార మని మాత్రముమనము పలుకరాదు. ఎల్లరను బరిశుద్ధమానసులను జేయుట కాకాల మెంత పాటుపడుచున్నది ? ఈకార్యమున దానికిం గలుగునానంద మెంతయో మన మూహింపఁజాలమనుట నిక్కము.

"నానృషిః కురుతే కావ్య"మ్మను ప్రాక్తనసూక్తి కలదు కదా. మనము నిజముగా ఋషులమే యనుకొనుట కవకాశము కవులకుం గలదు. అది పురోవృద్ధికి బాధక మనియే కాఁబోలు విమర్శకులను గాలరూపుఁ డగుపరమేశ్వరుఁడు కల్పించె నని నే నూహించువాఁడను. లేకున్నఁ బరస్పరద్వేషము లేనివారలకు ద్వేషము కల దని యితరు లనుమానింపఁదగు విమర్శనపద్ధతి పట్టుపడఁ గారణమేమి ? అదృశ్యరూపము లగుతంతువు లీయిరువురనడుమ నుండునట్లు పరస్పరకర్మము చేసియుండవలయును. లేనిచో నొక్కరిగ్రంథమునే విమర్శించి యదియేమో పరమార్థ మనుకొని కాలము దానిక్రింద వ్యయింప గారణమేమి ? దాన నిట్టిపురుషార్థము కల దని యేస్మృతియు నేపురాణము నేయితి

హానమును దెలుపదు. వేదముకూడ నీకు విషయమున మూకత్వమును బూను నని నాయూహ. వేదమునం దించుకంతయుఁ బ్రవేశము లేనినే నిట్లనుట సాహస మ్మని తమ రన్నను—

"సతాంహి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః"

అన్న కాళిదాససూక్తి నా కాధారము. నాయంతఃకరణము శ్రుతిభావ మిట్లే యుండఁగల దని యూహించుచున్నది. కారణము తమరే పరికింపవల యును. అట్టివిమర్శకుఁడు తాఁజేయఁబూను కార్యమున గ్రంథకర్తకు మహో పకార మగు నని భావించుచో నుత్తముఁడే యగును. తనవిమర్శనమును గాంచి గ్రంథకర్త తనదోషముల నెఱింగి వానిని సవరించుకొని నిర్దుష్టముగా గ్రంథ మాచంద్రతారార్కముగా నెగడఁగల దని యానందసాగర నిమగ్నుఁ డయ్యె నేని యట్టి సద్విమర్శకునకుఁ బుణ్యమునకుఁ గొఱంత యేమి? అంతకంటె గ్రం థకర్త కుపకారము చేయఁదగిన దే ముండును? దుర్విమర్శకుఁ డాతఁ డయ్యె నేని దానింగాంచి గ్రంథకర్త విషాదమునొందిన నాపాప మావిమర్శకు నంటక విడువదు. కావుననే కాఁబోలు—

శ్లో॥ యస్యనాస్తి స్వయంప్రజ్ఞా శాస్త్రం తస్య కరోతి కిమ్
లోచనాభ్యాం విహీనస్య దర్పణః కింకరిష్యతి.
మూర్ఖచిహ్నాని షడితి గర్వో దుర్వచనం ముఖే
విరోధీ విషవాదీచ కృత్యాకృత్యం నమన్యతే.
అజ్ఞ స్సుఖమారాధ్య స్సుఖతర మారాధ్యతే విశేషజ్ఞః
జ్ఞానలవదుర్విదగ్ధం బ్రహ్మాపి నరం నరంజయతి.

అని సుభాషితరత్నభాండాగారము హెచ్చరించెడిని.

విమర్శకుఁడు దోషజ్ఞుఁడు కావలయును గాని దోషైకదృక్కు కారాదు. అటులైన నాదోషైకదృక్త్వము తనకే హానిని జేయును. ప్రమాదంపడి యది తనకుం గీర్తిని గల్పించు నని యతఁడు భావించు నేని దేవానాంప్రియులలోఁ జేర్పఁ దగినవాఁడే యగును. దోషజ్ఞతను సద్వినియోగముచేసినచో నయ్యది యితరుల కుపకరించుచు నతనికి మహోపకార మొనర్చును. ఎందఱో యట్టివి మర్శనములను జదువుకొని దోషజ్ఞు లగుదురు. కావుననే పండితప్రశంస యొ నరించుచు—

శ్లో॥ దోషాణాం సూక్తిరత్నానాం వందే బృందం విపశ్చితామ్

యస్మధ్యపతితో నీచః కాచో ప్యుచ్చై ర్గృహీయతే.
ప్రాజ్ఞోహి జల్పతాం పుంసాం శ్రుత్వా వాచ శ్శుభాశుభాః
గుణవ ద్వాక్యమాదత్తే హంసః క్షీరమి వాంభసః॥

అని సుభాషితరత్నభాండాగారము వాకొనియెను. పండితలక్షణము లివ్వి యని యెఱుంగవలయును. చదువుకొనినంతమాత్రమునఁ బండితుఁ డనఁ బడఁ డని, పరశ్రేయస్సహనము, గుణగ్రహణపారీణత, దోషవిముఖత్వము నను నివి కలిగిననే పండితుఁ డగు నని సుభాషితతాత్పర్యము. దోషవిముఖత్వమున నితరులకు లాభమే మని యడుగవచ్చును. దోషముల నెఱింగి గ్రంథమున నుండి వానిని దొలఁగింపఁజేసి కవికి మహోపకార మొనర్పఁ బూను పండితేంద్రునిచర్య వేఱు. అట్టి మహనీయుఁడే కవికి మహోపకారి. అంతటియోపిక లేకయున్న నూరకుండినను నొకయుపకారమే. దోషైకదృక్త్వము మాత్రము స్వాపకారకము. కావున దానిని మానవలయును.

విమర్శకునిదృష్టి దివ్య మనఁదగినది. కవికిం గలయూహలు పరీక్షింపఁగలదు. కవికి లేనియూహలు కూడ నది యున్నట్లు తెలుపఁగలదు. పాఠకులెల్ల నిన్నియూహలు కవికిం గలిగియే యీపద్యము నింతహృద్యముగా రచించె నని తలంతురు.

శ్లో॥ స్థితాః క్షణం పక్ష్మసుతాడితాధరాః పయోధరోత్సేధనిపాతచూర్ణితాః
వళీషు తత్రాస్ఖలితాః ప్రపేదిరే చిరేణ నాభిం ప్రథమోదబిందవః.

అను కాళిదాసోక్తికి వ్యాఖ్యాత లెన్నియో యర్థవిశేషములను గల్పించిరి. పార్వతి తపోనియతిం గూరుచున్నది. ఇప్పట్టున నామె కూరుచున్నపద్ధతి యోగమార్గము ననుసరించి యున్న దనునది ప్రకృతార్థము. "క్షణం తాడితాధరాః పయోధరోత్సేధనిపాతచూర్ణితాః చిరేణ" అను పదములకూర్పువలన నామె పద్మినీజాతిస్త్రీరత్న మని తెలియవచ్చుచున్న దనుట విశేషార్థము. మఱియు సమాధిలక్షణము తెలియవచ్చుచున్న దని యుఁ దేటపడుచున్న దనియు నొకయర్థము. నిజముగా నిన్నియర్థము లుండవలయు నని కవి వ్రాసెనో లేదో తెలియరాదు. కాని వ్యాఖ్యాతలదృష్టి విశేషార్థములం దడవఁజాలెను. ప్రతిపదమున నిట్టిస్వారస్యము కల దనియు నీపదములకూర్పువలన నీవిశేషార్థ ముండితీరవలయు ననియు నిర్ణయించుశక్తి గలదయ్యెను. ఇట్టిదృష్టిగల విమర్శకుఁడు కవి కెట్టిమహోపకారము చేయఁజాలునో చెప్ప శక్యమగునా? అట్టి

విమర్శకునకన్న మేలుకోరినమిత్త్రుఁడు కవి కెవ్వఁడుండును ? కవికి మేలుగోరి యిట్లు విమర్శించి యది మహాపుణ్యకార్య మని సంతసించు సుకృతి మఱియెవ్వఁ డుండును ? అట్టి యుదారబుద్ధి గలవిమర్శకుని గ్రంథకర్త పితృపాదులనుగా భావింపవలయును. అట్లు భావించు గ్రంథకర్తలు, నిట్టిమహోపకారము చేయఁ బూను విమర్శకులు గావలయును. అట్లుగాక-(శ్రీ)యనగౌరినాఁబరఁగు చెల్వకు-అనుపద్యమును విమర్శింపఁ బూని తొలుదొలుత (శ్రీ)శబ్దమును జేర్చినందున నిక్కవి దరిద్రుఁడై పరితపించువాఁ డని తోఁచెడిని. కావున సిరికై కైఁజాఁపుచున్నవాఁ డని యూహింప నగును. గౌరి నాఁబరఁగు అను వాక్యమును (శ్రీ)శబ్దమున కనుబంధముగాఁ జేర్చుటం బట్టి విశేషించి ధనముకోరువాఁ డనియు విశేషార్థ మూహింపఁదగును. అని చేతులు త్రిప్పువిమర్శశేఖరుఁడు కలిగినచో నిఁకఁ గవికిని బాఠకులకును గావలసిన దేమి? ఆదేశమున కేమిటం గొఱంత ? ఇట్టి విమర్శకశేఖరపాషాణములు కలుగుటయే మహాసంపద యని యాదేశపురంధ్రీమణి భావించి మఱియు సంభావించి యానందింపవలయుఁ గాఁబోలు?

కువిమర్శకుఁ డాత్మద్రోహియే యగును; ఎల్లప్పు డాతనిచిత్తము క్రోధాసూయాబాధిత మై పరితపించుచుండును. దానికంటె నాత్మద్రోహి యెవ్వఁడుండును ? అమూల్యమై నిర్మలముగ నుండుమానసము నసూయాపరితాపానలమునఁ గాల్చుట యెట్టిపని ? దానికంటె మించినపాపకార్య మేది ? అరిషడ్వర్గమున మాత్సర్యమే యున్నతస్థానము నాక్రమించినది. దానికి లోఁబడినచో నది కూలఁద్రోయకపోదు. కావుననే విమర్శకుఁ డసూయకు లోఁబడక కడు జాగరూకుఁడై సద్విమర్శకుఁ డనిపించుకొన సర్వవిధములఁ బ్రయత్నింపవలయును. తొలుదొలుత విమర్శకుఁడు గ్రంథమున నౌచిత్యము పోషింపఁబడినదా యని పరికింపవలయును. అది లేనిచో నాయది పదములకూర్పనిపించుకొనును. పాదాలంకారవస్తువులచే హస్త మలంకరింపఁబూనుచో నది యలంకారము కాదుగదా.

ఉచితస్థానవిన్యాసా దలంకృతి రలంకృతిః
ఔచిత్యా దచ్యుతా నిత్యం భవంత్యేవ గుణాగుణాః॥ అని తెల్పి-
అలంకారా స్త్వలంకారా గుణా ఏవ గుణా స్సదా
ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్॥ అని బోధించి

కావ్యస్యాల మలంకారైః కిం మిథ్యాగణితై ర్గుణైః
యస్యజీవిత మౌచిత్యం విచింత్యాపి నదృశ్యతే॥

అనికూడ హితోపదేశము చేసెను. ఇంతియ కాక ఔచిత్య మన నెట్టి దని ప్రశ్నించుకొని-

ఉచితం ప్రాహు రాచార్యా స్సదృశం కిల యస్య యత్
ఉచితస్య చ యో భావ స్తదౌచిత్యం ప్రచక్షతే॥

అని సమాధానము చెప్పెను. ఇట్టి యౌచిత్యము మనపూర్వసత్కవు లెట్లుపోషించిరో యించుక పరికింతము.

ఉ. చిత్తము పొక్కెడుం బురుషసింహుని పాత్రకులాగ్రగణ్యు న
త్యుత్తమరూపు భూరిగుణు నొప్పెడుమెత్తనిమేనివాని నె
ట్లుత్తలపెట్టిరో పలువు రుగ్రమనస్కులు కూడి యక్కటా
యత్తెఱఁగెల్లఁ దేటపడునట్టులు గా వివరించి చెప్పుమా.

పురుషసింహుని పాత్రకులాగ్రగణ్యుని సత్యుత్తమరూపుని భూరిగుణుని ఒప్పెడుమెత్తనిమేనివాని ననుసీయభిమన్యునిగుఱించిన విశేషణములకుఁ దగిన ట్లుగ్రమనస్కులు కూడి, అక్కటా! ఎట్లుత్తలపెట్టిరో యను పదములు ప్రయోగించి మహాకవి కవిబ్రహ్మ తిక్కయజ్వ యౌచిత్యమును జక్కఁగా బోషించెను. ఉగ్రమనస్కులు కూడి-అనువాక్యమును జక్కఁగా బరిశీలించిన నాకొడుకుల లో నొకఁ డైన ననన్యసహాయుఁ డై యాతనిం బొరిపుచ్చంజాలక పోయెనా! అయ్యో! యనుభావము ధృతరాష్ట్రునకుం గల దనునది ధ్వనిరూపమునఁ దెలియనయ్యెడిని, తొలుదొలుతనే, చిత్తము పొక్కెడిఁ అన్నవాక్యము, ఎంతదారుణకర్మము సాగినది? వినుటకే కష్టముగానున్నదే. అని ధృతరాష్ట్రుఁ డూహించె నన్నయాశయము పైదానికిఁ దోడునీడగా నున్నది. అత్తెఱఁ గెల్లఁ దేట పడునట్టులుగా వివరించి చెప్పుమా యన్నపద్యపాదము ధృతరాష్ట్రునకు నర్జున పుత్త్రునిపైఁ గలప్రీతి దనకొడుకుల పౌరుషమును వినుటకుఁ గలకుతూహలమును వెల్లడిచేయుచున్నది. ఈపద్యమునందు "పలువు రుద్ధతి నొక్కటఁ గూడి యక్కటా" అని నావంటివాఁడు చెప్పినట్లే తిక్కయజ్వ చెప్పియున్న వారికిఁ గవిబ్రహ్మ యనుబిరుదము నూడఁగొట్టఁ బ్రయత్నింపవలసినదే. ఇట్లు పదముల కూర్పు మిక్కిలి యౌచిత్యమును బోషించున ట్లుండవలయును.

శ్లో. ఇమాంతు శీలసంపన్నాం ద్రష్టు మర్హతి రాఘవః
　రావణేన ప్రమథితాం ప్రపామివ పిపాసితః॥

అని వాల్మీకి మహాకవి చెప్పెను. ఉత్తమబుద్ధి యు ననితరసాధ్యజ్ఞాన మునుగల హనుమ సీతాదేవింగాంచి యిట్లూహించినట్లు కవి తెలిపెను. ఇందు శీలసంపన్నామ్-అనుపదమును వదలి వేఱొండుపదమును "పద్మపత్రాక్షీమ్, కామినీరత్నమ్" అనులోనగువానిలో దేనిని గాని యునిచి యుండిన నౌచిత్య మెఱుఁగనికవియే యనవలసివచ్చును. "ప్రపామివ పిపాసితః రాఘవః ద్రష్టు మర్హతి'' అని యుపమానము చెప్పుట మఱెంత మెచ్చఁదగియున్నది. సీతాదేవింజూడ రాముని మనస్సు తత్తరపడుచున్న దని తెలుపుట యెంతయో వర్ణింపఁదగియున్నది. పిపాసితునకుఁ బ్రప కనఁబడినచో నెట్లు పరుగిడఁజూచునో యప్పు డద్దానికంటె నేదియు నెక్కుడుగాఁ దోఁపదో యట్లే సాధువర్తనము గల సీతను రావణుఁడు బాధింప నాబాధల ననుభవించుచుఁ దన్నే నమ్మి యున్న సాధ్విని జూడ రాముఁడు తగినవాఁడు. ఇందుఁ గలభావసౌకుమార్యము మానసమున సర్వదా స్మరింపఁదగినదియే.

"మందంమంద ముపేత్య తత్రసదసో మత్పాండుపుత్త్రాంకురాః
　క్వేతి ప్రేమపురః ప్రసారితకరః కుర్వన్ దృఢాలింగనమ్॥ చంపూభారత.

ఇందు "మత్పాండుపుత్త్రాంకురాః క్వేతి దృఢాలింగనమ్ కుర్వన్" అనుచోఁ గలసూక్ష్మభావము పరిశీలించి యానందింపఁదగినదే. పుత్త్రాంకురాః దృఢాలింగనమ్-అని కవి ప్రయోగించెను. అంకురములవంటి చిఱుత ప్రాయముగల కుమారులను దృఢాలింగనము చేసికొని ధృతరాష్ట్రుఁడు గారవించె ననుచో ధృతరాష్ట్రుని భావ మే మని యనంతకవి యూహించెనో స్పష్టపడుచున్నది. ఇట్టిభావపోషణమే యౌచిత్య మనఁబడును.

తే. ఆయురైశ్వర్యకీర్తుల నపహరించుఁ, బరసతీసంగమము ధర్మపదమునందుఁ
బరఁగువారలుపరిహరింపంగఁగనియు, వినియుఁదెలియవెయదిదుర్వివేకమగుట.

అని త్రికల్పుజ్వ. ఇందుసతీశబ్ద మౌచిత్యపరిపోషణాక్షమము. పరవధూసంగమ మనియుండునే నిట్టియౌచిత్యమును బోషింప దనవలయును. మహాత్ము లట్టులేల ప్రయోగింతురు ?

చ. జలధివిలోలవీచివిలసత్తలకాంచిసమంచితావనీ
　తలవహనక్షమం బయినదక్షిణహస్తమునం దదున్నమ

ద్గళదురఘర్మవారికణకమ్రకరాబ్జముపట్టి నూతిలో
వెలువడఁ గోమలిం దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్. నన్నయ.

ఇందు దక్షిణహస్తమునకు "అవనీతలవహనక్షమంబు" అనువిశేషణము చేర్పఁబడినది. అవనీశబ్దమునకు "జలధినీలోలవీచివిలసత్తటకాంచి" అను విశేషణములు చెప్పఁబడినవి. కమ్రకరాబ్జము, కోమలి, అనుపదములం గలస్వారస్యమిటఁ బరీక్ష్యము. ఈపద్యమున వాగనుశాసనుఁడు చక్కఁగా నౌచిత్యమును బోషించి తనసర్వతోముఖపాండిత్యమును వెల్లడించెను. దేవయానికిఁగాఁ గోమలి యనుశబ్దమును నిలిపి కరాబ్జము అని తదర్థపోషణక్షమముగాఁ బలికెను. సెబాస్! ఔచిత్య మన నెట్టిదో యున్న దున్నట్టు లిమ్మహాకవికిఁ దెలియును. ఇట్టు లెన్నియో గ్రంథములనుండి చూపవచ్చును. ఇట్టిభావములను విమర్శకుఁడు పరికించి కనఁబఱుపవలయును. దోషములం దడవి వానిం దెలియఁజెప్పఁదగు పద్ధతిం దెలుపందగును. గుణదోషముల విమర్శించుటయే విమర్శకలక్షణము. కాని యందు గుణప్రకటనము దోషప్రదర్శనము చేయుమార్గములు వేఱు ఒక్కవిధముననే రెండును దెలుపుట రసజ్ఞుల సమ్మతము కాదు.

ఇప్పటికాలమున గ్రంథపరిశోధన మెట్లు సాగుచున్న దనువిషయము నించుక తడవుదము. మున్ను మహారాజాస్థానముల నాశ్రయించి పండితులుఁ, గవులుఁ దమతమశక్తిని గనఁబఱచి లోకోపకారము చేయువారు. ఇప్పుడు నట్టివారుకలరు. వారివలన విశేషించి లోకోపకారము కలుగుచునే యున్నది. వారికంటె మఱికొందఱు ముద్రణాలయముల నాశ్రయించి స్వశక్తులను నానాముఖముల వ్యాపింపఁజేయు చున్నవారు. గ్రంథములకు నుపోద్ఘాతములు వెడలుచున్నవి. గ్రంథపఠనమునఁ గుదురు జ్ఞానమునకంటె నుపోద్ఘాతము పఠించుటచే విశేషించి జ్ఞానము కలుగుచున్నది. అనేకరహస్యవిషయము లెల్లరకుఁ గరతలామలకము లగుచున్నవి. ముద్దులుమూటగట్టుచుఁ బొత్తములు మూల్యము విశేషించియున్నను జూడఁదగినట్లున్నవి. బంగరురంగుగల యక్షరములు ముఖముననే కనఁబడుచు రం డోపామరులారా! రండు, రండు, కొనుఁడు, కొనుఁడు, మమ్ముంచుట కొకదర్పణకవాటపేటికం గొనుఁ డని పిలుచుచున్నవి. విషయము నెఱింగి యానందించుటకన్న గ్రంథమును దాని నుంచునద్దపుఁబెట్టెను జూచిచూచి మహానందము నొందుట వాడుక యగుచున్నది. మూలమూలలం బడియున్న ప్రాచీనాంధ్రగ్రంథములు తరంగములవలె వచ్చుచున్నవి. ఒక్క—

పుస్తకమునే యించుకమార్చి వ్రాయుట యాచారమగుచున్నది. దానిని వ్రాయు మహాత్ముఁ డిట్టిపాఠము లేదనులోపమును దీర్పఁబూనియే తా నీమహాకార్యమునకుం బూనితి నని తొలిపలుకు వ్రాయుటయు నిది చాల మంచికార్యమే యని ప్రశంసించుటయు స్వభావకర్మము లైనవి. విమర్శకులు కానివా రిక్కాలమునఁ దఱచుగాఁ గానరాక యున్నవారు. ఇట్టిలక్షణము లెన్నియో కనంబడుచుండఁగా నాంధ్రభాష మహావృద్ధి నొందుచున్న దని యుఁ బ్రతిదినము క్రొత్తక్రొత్తయలంకారముల నాభాషాజనని యలంకృతాంగి యగుచున్న దనియు వార్తాపత్త్రికాదులు కడుంగడుం గొండాడుట తెలియవచ్చుచున్నది. ఇది నిజమే కాఁబోలు నని పల్లెలయందుండు పవిత్రమానసులు ద్రవ్యము లేకున్న నున్న రెండుమాన్యక్షేత్రము లాఖపెట్టి యా గ్రంథములం దెప్పించుకొనుట యుఁ గనంబడు చున్నది. అవి పత్త్రికావహనాలయమునుండి రాఁగానే మాసిపోవు నేమో యని దానియంద మడంగఁ బై నొక గట్టిపత్రము వేసి స్వనామ ముద్రాయంత్రమున నొకచో ముద్రించి పదిలపఱుచు చుండుట యు ననుభవముననే యున్నది. ఇవన్నియు సాగుచుండఁ గొందఱు ప్రాఁతపుస్తకములను జదివి రసవంతము లగుపద్యములనుఁ గొన్నింటిని నేర్చుకొని యున్నవా రీదివ్యగ్రంథములం గాంచినంతనే మురియుచు నొక్కమా ఱాపొత్తము నిండు, చదివి యిత్తు మని బతిమాలి వా రీగాఁ గైకొని యందందుఁ జదివి పెదవి విఱిచి యయ్యో! యిదేటి యచ్చు! ఇవేలాటి సంస్కరణములు! ఇన్నితప్పు లేపొత్తమునందును గన మైతిమి కదా యని నిట్టూర్పులు పుచ్చువా రుండుట యుఁ గ్రొత్తది కాదు. మఱికొందఱివి యు నొకపాఠభేదము లేమో! వీని కర్థముకూడ నేదో యుండును. మనకుఁ దెలియనంతమాత్రమున నాక్షేపింపరాదు. అని యుపోద్ఘాతమును జదువుకొనుచు నందు "మేమెన్నియో ప్రాఁతప్రతులం బరిశీలించితిమి- పాఠభేదములను గ్రహించితిమి. రసవంతము లగునాపాఠముల నిందుఁ జేర్చితిమి. నీరసపాఠముల నెల్లఁ గ్రిందఁ బొందుపఱిచితిమి. పెక్కుతావులఁ దిరిగితిమి. శాసనములం బరిశీలించితిమి. ఒక్క-యింటిలోఁ బ్రాఁతరాగిరేకు కనఁబడినది. అం దీపాఠము వ్రాయఁబడి యుండెను. ఇట్టి పాట్లు పడి సంపాదించినపాఠములే యి" వని వ్రాయఁబడి యుండుటం గాంచి "ధన్యాస్మః" అని పుస్తకము మూయకయుండ నొకచోఁ బదిలపఱుచువా రుండుట యు మన మెఱుంగుదుము. ఇట్టు లీయాస్థానపండితప్రవరులమూల

మున నెన్నియో యభినవవికారపాఠములు పుస్తకములలో లలి వెలయుచున్నవి. ఇదేమి విపరీత మనువారు లేరు. అట్టలు చూచి యానందింపవలసినదే కాని గ్రంథభాగమును జూచి ప్రమోదింప వలనుపడకున్నది.

“సజ్జపైఁ బఱచిన సాళాతిరేకులు కలయ నిందీవరదళము లయ్యె” అని ముద్రింపఁబడెను. దాని కొక పెద్ద యుపోద్ఘాతము కూడ వ్రాయఁబడియెను. అందు బహుగ్రంథములఁ బరికించి చక్కనిపాఠముల సేకరించి యిందు దాఁచి పెట్టితి మని యు వ్రాయఁబడియెను. ఈపాఠములేమి ? వీనియర్థ మేమి ? అని ప్రశ్నించువారే లేకుండిరి. కొంతకాల మట్లే జరగెను, ఈశ్వరకృపచే నొక పండితోత్తములు మోమోటమి మాని విమర్శింపఁబూని శయ్యాశబ్దమునుండి సెజ్జయనునది కలిగినది, సాళాతిరేకు లనునది యశ్రుతాదృష్టచర మగుపదము. వీనికిది యర్థ మని యేనిఘంటువునందును గానరాదు. సెజ్జకు సజ్జయనుకొనిన భ్రాంతిచేతనే యీసాళాతిరేకులును గల్పింపఁబడినవి. సెజ్జపైఁ బఱచిన చేమంతిరేకులు కలయ నిందీవరదళము లయ్యె, నని యుండవలయును. అని వ్రాయఁగా నపు డేకొందఱో మిన్నువంక దృష్టిసారించి బాగున్నదనఁగల్గిరి. అట్లేతోఁచినట్లు పాఠములు కల్పించువారు కలరు.

పరాశరస్మృతి మూఁడుసారు లొకచోటనే ముద్రింపఁబడినది. రెండవ తడవ ముద్రించునపుడు “నష్టేమృతే ప్రవ్రజితే” యనుశ్లోకమునకు మాధవాచార్యులు వ్యాఖ్యానము వ్రాయుచు “అయం యుగాంతరవిషయః” అని వ్రాసినదానిని సవరించుచు నెవరో యొకమహాత్ముఁడు, “అయం న యుగాంతరవిషయః” అని యొక్క నకారము చేర్చెను. కాని, దానఁ గలుగు ననర్థ మెఱుంగఁజాలఁడయ్యెను. అంతకంటె నావాక్యమునే యెత్తివైచిన బాగుగనుండును. ఆపని చేయక తనపైత్యముగా నకారమును జేర్చెను. అట్లే యిక్కాలపుఁ బండితప్రవరులు తమయిచ్చచొప్పునఁ బాఠభేదములఁ గల్పించుచుండుట క్రొత్తది కాదు. ఒకప్పుడు గ్రంథమునఁ దప్పే యుండిన దానిని మార్చునధికారమును వహించినను గుండలీకరణమున నవీనపాఠ మని తెలిపి యిది బాగుండు నేమో యని వ్రాసినను వ్రాయవచ్చును, గాని, స్వేచ్ఛగాఁ బాఠముల మార్పరాదు. తాళపత్త్రగ్రంథములయందుఁ గొన్నింట మహాభారతమున ద్రోణపర్వమునందుఁ గల “తేఁకువలేక పుత్తెంచిన యప్పాండవజ్యేష్ఠునకుఁ దలవంపు గాఁగ” అన్న పాఠ మెందుఁ గాని ముద్రింపఁబడినదా నాయెఱింగినయంతదనుక లేదు.

"తేఁకువ లేక పుత్తెంచిన యప్పాండవాగ్రజునకుఁ దలవంపు గాఁగ" అనియే కలదు. నీరసపాఠముల నెన్నింటినో క, ఖ, గ, ఘ, జ, చ, ఛ అను సంకేతములతో ముద్రించువా రీపాఠము నేలకైకొనరో తెలియఁజాలకున్నాఁడను.

"శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బర్వెం బక్షులు"

అను నల్లసాని పెద్దన్నగారి పాఠమును దడవక.

"శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బాఱెం బక్షులు" అనియే ముద్రింపఁబడినది. ఒక్కొక్క గ్రంథమును గుఱించి యీవిషయము వ్రాయఁబూనిన స్కాందపురాణ మంతగ్రంథ మగును. స్థాలీపులాకన్యాయమున నిందుఁ గొన్నింటిఁ జూపితిని. స్వేచ్ఛగా నేవో వ్రాంతప్రతులం జూచి తోఁచినట్లు వానిని సంస్కరించుట పాడిగా దనియే నాయీప్రార్థనమునకు ఫలము. మఱి కొన్నిపాఠములం బ్రదర్శింపఁ బూనితిని. ఓపికమై వానిం బలికించి యెట్టిస్వారస్యముకలదో విమర్శింపఁబూనుఁ డని తలయొగ్గి వేఁడువాఁడను.

సీ. "వాఁకలఁబడి నీరు వలియఁ బాఱఁగ మిట్టు లొండొండ వెలసి తృణోత్కరముల
తుదలుపచ్ఛఁదనంబుతోఁ దలసూపంగఁ దీఁగలొయ్యనఁ గొంకుదేఱికొనలు
మొగమెత్త" అని పూర్వముద్రణమునఁ గలపాఠము-

"వాఁకల బడినీరు వలియఁ బాఱఁగ మిట్టు లొండొండ బలసి తృణోత్కరంబు
తుదలునిశ్ఛదనంబుతోఁ దలసూపంగఁ దీఁగలొయ్యనకొంకు దేఱికొనలు
మొగమెత్త" అని నూతనముగా ముద్రింపఁబడినది.

"పచ్ఛఁదనంబుతోఁ" అని పాఠాంతరముగా నైన వ్రాయ లేదు. వాఁగులఁబడి- అనుపాఠాంతరము చేర్పఁబడినది, పైపద్యమును బఠింపుఁడు. తెలుఁగుపదముల పొంకముఁ గనుఁడు. పచ్ఛఁదనంబుతో ననుదానిని దీసివైచి నిశ్ఛదనంబుతో నని ముద్రింపఁబడినది. ఏది యిందు సరసమో యరయుఁడు. ఒండొండ వెలసి=అనఁగా నొకదానివెంట నొకటిగాఁ గనఁబడి యని యర్థము. బలసి- అని యేల సవరింపఁబడినదో, తృణోత్కరములతుదలు-అని యుండఁగా దాని నీడ్చివైచి తృణోత్కరంబు తుద లని చేర్ప నేమి రసమొదవు ననియోతోఁపక యున్నది. ఒయ్యనఁ గొంకుదేఱి=అని యున్నదానిం దొలఁగించి, ఒయ్యన కొంకుదేఱి=అని ముద్రింపఁబడినది. ఒయ్యన అనునది కళగా సాధింపఁబూని కాఁబోలు. ఈపద్యమును సమగ్రముగాఁ జదివినఁ బ్రబంధపరమేశ్వరుని సులలితాంధ్రపదముల పొందిక తేటపడును. మార్పునఁ గలస్వారస్యము నూహిం

పుఁడు. ప్రాఁతవి రెండుపుస్తకములు గలవు. వానిలో నొక్కఁడు కొ॥ అనంతాచార్యులవారిచేఁ బరిష్కరింపఁబడినది.

క. కల యగును గాక యిట్టివి, గలవే నిక్కములు నీవు కడుఁబిఱికి వెదం
దలఁపకయున్నను గలుగుం, బొలఁతీ యేమేని వికృతపుందెఱఁగుకలన్.

అని ప్రాచీనము.

క. కల యగునుగాక యిట్టివి, గలవే నిక్కములు నీవుగడువడి నెద్దం
దలఁపకయున్నను గలుగుం, బొలఁతీ యేమేని వికృతపుందెఱఁగు గలన్.

అని నూత్నముద్రణము.

కడుఁ బిఱికివెదం దలఁపకయున్నను-అన్నపాఠమునఁ గలస్వారస్యము, కడువడి నెద్దన్-అన్నపాఠమునఁ గలస్వారస్యము రసికు లూహింతురుగాక.

ఇట్టినూత్నపాఠము లెన్నియేని చేర్పఁబడినవి. ఈయాస్థానపండితులు చేయుసంస్కారములలో మహామహిమము గలది పరుషములకు గసడదవలసంస్కారమే. వాఁ డిట్లు సెప్పెను. వీఁ డిట్లు సేసెను. ద్వంద్వసమాసమునందును- ఎందేఁ బ్రాసస్థానమునందును జేయఁదగు నీసంస్కారము తుడుము మొదలు దేవతార్చనమువఱ కన్న యట్లు వలనుపడినతావుల నెల్లఁ జేయఁబడుచున్నది. గదసేతంగాని అని మార్చినదానికిని, గదచేతం గాని యన్నపాఠమునకుం గలభేద మేమియు లేకున్నను మొదటిది శ్రుతికటువుగా నున్నది. ఇట్టిసంస్కరణములు చేయకయుండఁ బ్రార్థించుట యందఱకు ధర్మముగ నున్నది. చక్కని పాఠములఁ ద్రోసిపుచ్చి అవకతవక యన్నట్లు పాఠములం గూర్చుట భాషాభివృద్ధికి లక్షణము కాదు. మహాశయు లాంధ్రపరిషత్తుగఁ గూడి ప్రాచీనప్రబంధములం బరిశీలించి చక్కని పాఠముల నేర్పఱచి భాషాగౌరవమును గాపాడవలయు నని ప్రార్థించుచున్నాఁడను. ఈవిషయమునఁ దెలుపఁదగిన విశేషములనేకము లున్నవి. కాని గ్రంథబాహుళ్యభయ మతిశయించుచున్నది. పండితకవివరేణ్యులయెదుట నింతకంటె విన్నవింపఁజాలను. "అతిసర్వత్రవర్జయే" త్తని యున్నది కదా. చక్కఁగఁ బర్యాలోచించి పాఠములను సాధుపద్ధతిని సంస్కరింతు రని మిమ్ము వేఁడుచు నీవిషయమును వదలుచున్నాను. ఇందలి లోపముల మన్నింపఁ బ్రార్థించుచున్నాఁడను.

# ఆంధ్రశబ్దచింతామణిమూలరూపము.

మహాకవి, కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారు—సాలూరు.

---

శ్రీల కాలవాల మగునాంధ్రదేశమును దద్భాషయుఁ దత్ప్రజాలోకమును నాలోచించుచుండు ముహూర్తమే సుముహూర్త మని తలంచుభాగ్య మెరికేఁ గల్గునే? కల్గుఁగాక పూర్వపుణ్యఫలపరిపాకవిశేష మున్నవారికి. ఆంధ్రు లతిప్రాచీనులు. వారిభాష యత్యంత మధురము. అట్టిమధురాంధ్రభాషకుఁ దగువ్యాకరణశాస్త్రము రచించుటయు సామాన్యసాధ్యముగాదు. అట్టి శాస్త్రము నన్నయభట్టీయ మని యనుకొందుము. ఆంధ్రశబ్దచింతామణి యన్న నదియే- ఈగ్రంథమున కనేకనామములు గలవు. శబ్దశాసనీయము, వాగనుశాసనీయము, నన్నయభట్టీయము, ఆంధ్రశబ్దచింతామణి, ప్రక్రియాకౌముది, అను నామములు గలవు. ఇందుఁ బ్రధానముగ నాంధ్రశబ్దచింతామణి యనుపేరే యందఱును జెప్పొందురు. ప్రథమనామ మాంధ్రశబ్దచింతామణి యనునదియే యని యనవలయు. ఆగ్రంథమునం దున్నగద్యలో నాంధ్రశబ్దచింతామణి యని యున్నది.

సరస్వత్యాదు లందఱు నట్లే యాంధ్రశబ్దచింతామణి యని వాడిరి. కాని, 'చాముండికావిలాసమున,

"ఆంధ్రవాక్యానుశాసనం బతిశయిల్లఁ, జేసి లోకోపకారార్థసిద్ధిఁ జేసి
ఘనత రాజనరేంద్రుని కరుణఁ బడసి, నట్టివాఁడను నన్నయభట్ట నేను"

అనుపద్యమువలన "ఆంధ్రశబ్దానుశాసన మనియో 'ఆంధ్రవాగనుశాసన మనియో, ఆంధ్రవాక్యానుశాసన మనియో పేరు గల దని యుఁ జెప్పనొప్పగును. మిగిలినపేళ్ళన్నియు నితరు లుంచినవే యగును. ఇఁక నాంధ్రశబ్దచింతామణి యని చెప్పుకొనవచ్చును.

## — కర్తృవాదము —

సందిగ్ధమైన భారతనన్నయాచార్యకృతవాద మట్లుండఁ జాముండికావిలాసాదికర్త యు నన్నయభట్టని యుంట నీతఁ డాంధ్రశబ్దచింతామణికర్త యని యనవలయును. చాముండికావిలాసకావ్యమున "బుద్ధి బుద్ధీ" త్యాది పదముల ప్రయోగముం బట్టి యీతఁడు దత్తమండలము (రాయలసీమ) వాఁ డని యనవ

లయును. చాముండికయు రాయలసీమ నందవరికుల కిష్టదేవత యగుటఁ బైతలఁపు సాధారణ మనవచ్చును. ఇతఁడే లక్షణసార మనియు నింద్రవిజయ మనియుఁ గొన్నిపుస్తకముల వ్రాసినట్లు చెప్పుదురు. ఈతఁడే భారతనన్నియయని సిద్ధాంతింపవలయును. అంతకు సందేహ మవ్యాహతమే యగును.

ఏది యెట్లైనను భారతనన్నియ యాంధ్రశబ్దచింతామణికర్త యనుట దుర్బలవాదము. విపులముగ భారతిలోఁ బ్రకటింపఁబడును. నన్నయ లిద్దఱా! యనియు శంకింపవలసి యుండును.

నన్నియయయా, నన్నయయయా, అన్నయయయా, అనునామచర్చయు నప్రకృతముగాదు. భారతకర్త నన్నియ, అని శాసనములయందును దత్త్వాలసందర్భముల వాడిననామములయందును, నన్నియ, నన్నె, నన్ని, నన్యదేవ, శబ్దముల వాడుకయందును "నన్నియ" నామము నే నిర్ణయింప నాధారములఁ గాంతుము. నన్ని + అయ్య అనునదియే నన్నయ్య- నన్నయ, లయ్యె నని యనఁదగును. కాని "అన్నయ" కాఁడు. అయినను గొన్నిలక్షణగ్రంథముల అన్నయభట్టని యోజింపఁబడియెను. రంగరాట్ఛందస్సులో "అన్నయభ" ట్టని ప్రయోగింపఁబడెను. కావున అన్నయభట్టే నన్నయభట్టు గా నూహింపఁ బడియన్నయభట్టకృతము లన్నియు నన్నయభట్టకృతము లని యనుకొనిరేమో ? ఏమనుకొన్న ననుకొందురు గాక. కాని భారతనన్నియభట్టారకకృతము చింతామణి యనుట కాధారములు లేవు. మఱియుఁ జింతామణికి శేషభూత మాథర్వణ మనునది యు విశ్వసనీయము గాదు. ఈయాథర్వణుఁడు నుదిక్కనపూర్వుఁ డనిపిలువఁబడు నతఁడు కాఁడేమో యనియే సందేహింపవలసి యుండును. ద్రుతము, తద్ధర్మము, మున్నగు సంజ్ఞ లాంధ్రవాఙ్మయమున నెందును గానము. సరస్వత్యాదుల యనంతర కాలముననే యీద్రుతాదుల ప్రయోగము గనఁబడుచున్నది. కేతన్న యెఱుఁగఁడు. కావ్యాలంకారచూడామణి యెఱుఁగదు. సులక్షణసారమును నెఱుంగదు. ఆంధ్రభాషార్ణవమును నెఱుంగదు. ఆంధ్రభాషాభూషణాదుల మత మందఱు నెఱింగియున్నవారే. ఇఁకఁ గావ్యాదుల మతమును బ్రదర్శించుట విశేషజ్ఞానమున కాధార మేమో యని యాయాస్థలముల నిర్దేశింతును. కళాపూర్ణోదయము, 5వ ఆశ్వా. 54,వ పద్యమున 'ఒనరించున్' అను రూపము భవిష్యదర్థవచనం బని యున్నది. "అగు" అనునది వర్తమానార్థకవిశేషణ మనియే పూర్వులు వాడిరి. ఆంధ్రభాషార్ణవ

మున 'ప్రోతు వనంగఁ జెంపొందు లృట్టు.' ఇట్లనేకులు నన్నియనుండి మొన్న టిదనుక 'నాంతం బని ద్రుత ప్రకృతికిని, భవిష్యత్తని తద్ధర్మంబునకును వాడుకొ నుట యెఱుంగుదురు. వ్యాకరణకర్తలు గాని, కావ్యకర్తలు గాని సంజ్ఞామా త్రము నెఱుంగని స్థితి యుండునా? ఇది యొకవింత.

అథర్వణకారికల కాంధశబ్దచింతామణి జ్ఞానమును దగ్గౌరవమున్నట్లు ను గానము. చింతామణి స్మరణమేని లేని శేషభూతత్వము భూతతత్వమే యగును.

మఱియుఁ జింతామణి చెప్పిన వానినే యథర్వణుఁడును జెప్పెను. గతా ర్థత్వదోష మందుఁ గలదు. కొన్నింటిఁ బ్రదర్శించుచున్నాను.

అథర్వ—నాపభ్రంశత్వ మేవస్యాత్ నియమాభావతస్తుతత్
చింతా—అనియమా ద్గ్రామ్యంహి యత్త్వపభ్రంశః—
అథ—మానాత్త్వాన్నిత్యం
చింతా—పరిమితౌ సమస్తానామ్
అథ—నమశ్శబ్ద విసర్గస్యలోపః
చిం—లోపోనమ ఆసికే విసర్గస్య
అథ—పుంప్వాఖ్యా వాదేశౌ
చిం—మోస్తు విభక్త్యేకవచనకే పుంపూ

ఇత్యాదు లత్యధికములు గలవు. అన్యోన్య శేషశేషిభావ మత్యంతా భావ మనియే చెప్ప నొప్పగును. ఈసందర్భమున బ్ర॥ శ్రీ॥ వఝల చినసీ తారామస్వామిశాస్త్రిగారు చింతామణిలో నున్నసంధిపరిచ్ఛేదములోని 'ఔప విభక్తికసంజ్ఞా వర్ణాః టింట్యాదయో భవన్తిహ-రుల్యాదేర్నామ్నాం స్యుస్తేహి విభక్తౌ సమాసే చ' అనుసూత్రమునకును, నథర్వణములోని 'విభాషయా భవంత్యత్ర భవం త్యుపవిభక్తయః, భవంతి కుత్రచి న్నైవ నిదానం తత్ర సద్వ చః, బహవోఽత్రాంధ్రభాషాయాం, వర్ణా ఔపవిభక్తికాః- ప్రవృత్తి శ్చాప్ర వృత్తిశ్చ వికల్పశ్చ క్వచిద్భవేత్, తద్వివేకః ప్రయోగైకశరణం స్యాద్ధి శబ్దతః" అను కారికకును బదరీబాదరాయణ సంబంధమువంటి సంబంధము "హి శబ్ద తః" అనుటవలనఁ గలదని యనుచున్నారు. కాని, తదన్యోన్య సంబంధమొక్కను గానము. 'నిత్యం ప్రశ్లేషతా బిందు స్సమాసే తు ప్రయోగతః, కేషాంచి ద్వ్యంతశబ్దానాం ఋలౌ స్యాతాం యథోచితం, క్వచి త్త్వాదేశ ఏవస్యాత్ క్వచి

వ్యైవప్రయోగతః, క్వచి త్సత్వం యథాయోగ మన్యచ్చ వ్యవహారతః”

మున్నగు నథర్వణకారికలలో నున్న “తు ప్రయోగతః, ఏవప్రయోగతః, చ వ్యవహారతః” వచనములకుఁ జింతామణిలోని వానికిని నేసంబంధమును లేదు. రచనాధోరణి గాని చింతామణి వివేచనాధోరణీప్రయుక్త“హి, తు, చా” ది, రచనాక్రమము గాదు. మఱియుఁ గొన్ని పతులలోఁ బై ‘హి’ కారపాఠమును లేదు. (చూడు—మహాకవి- 4 నెం) కావున నథర్వణకారికలకు నాంధ్రశబ్దచింతామణికిని నెట్టి పూరణాదిసంబంధమును లేదు.

కారిక లనునవి పూర్వగ్రంథమునకు శేషభూతములుగనే రచింపఁబడవలయు నను పక్షమును దుర్బలమే. ఉన్నవానినే యనువదించుచుఁ గారికలను రచించుటయుఁ గలదు.

అయినను జింతామణి సంగృహీతము లగు సంజ్ఞలను బ్రక్రియలను నెఱింగినయట్లు స్పష్టలింగముగ నథర్వణకారికలలోఁ బ్రమాణములు లభించుచున్న వనుటలో నందఱును నేకాభిప్రాయులే యగుదురు. ఈయభిప్రాయైక్యము చింతామణికి శేషభూత మాథర్వణ మనుసిద్ధాంతమును నిల్పదు. అథర్వణకారికలను ననువదించుచున్న ట్లాంధ్రశబ్దచింతామణి యుఁ గలదు. అట్లహోబలపతి యు నప్పకవిగృహీత చింతామణిపాఠసాధ్యముల నాథర్వణమున ను నిర్వహింతు నని యనెను. ఈశ్లోక మరయుఁడు.

శ్లో॥ అప్పార్యపుస్తకారూఢపాఠభేదా ద్యదుత్థితః
మయా సంగృహ్యతే రూపం తద ప్యాథర్వణోక్తితః॥

సూచికగ నేనును దాదృశసంబధమును బ్రదర్శించుచున్నాను.

అథ—నమశ్శబ్దవిసర్గస్య లోప ఓత్వమ పీష్యతే
పరుషావా స్వరూపేణ ప్రథమాంతోపరిస్థితాః
కాకౌ సంబోధనే చాఽపి హ్యవ్యయే కర్మధారయే
అచేతనార్థకే శబ్దే ఇతి శృంగారభూషణః—

అనుకారికలలో నొక్క “నమశ్శబ్దమునకుఁ జెప్ప ‘రామస్సహాయ, యని యనునప్పుడు కుదురని కారణమున “నమ అదికే విసర్గస్య” అను చింతామణి సూత్రము వివరించుచు సవరించుచున్నది. ఆదిశబ్దమువలన నితరములును గ్రహింపఁబడినవి. మఱియు “గతానుగతికో లోకః” యనునది యు సాధింపఁబడును. అట్లే ‘పరుషావా’ అనునది యు ‘ప్రథమాసూత్రా” దిత్యాది సూత్ర

ముచేత సంగ్రహించి 'ఆత్మాదులయందు నిషేధించు నీధోరణి యరయ నరయ నధర్వణమునకుఁ దరువాతిది చింతామణి యని స్ఫురించుచుండును. ఇట్టిపట్టు లెన్నియేనిఁ గలవు. విస్తరభీతిని విరమింతును. హరిమతము నాధర్వణముగఁ జెప్పు పాఠముండుటను నధర్వణవచనముల నుండు నధికపదత్వమును దొలఁగించి యనేకము లనుక్తవిషయములకు నిర్వచనము సేయుచు నుండుటను జింతామణి యధర్వణానంతరప్రోక్త మనుటయే సుఖము.

— అధర్వణకారికల కాలము —

శృంగారభూషణుఁడు, శ్రీకవి, హరికవి, శ్రీకంఠుఁడు, విష్ణుశర్మ మున్నగుకవులు పేర్కొనఁబడియున్న యధర్వణకారికలలో నన్నయ్య, తిక్కన్న, మున్నగు సుప్రసిద్ధుల నామములు గానరావు. కేతన్న యైన లేఁడు. అతిప్రాచీనమా ? కాదు. ఇఁక నధర్వణహృదయమును గనుఁగొన్నఁ జేలును. ఆపనికి (Psycology of Adharvana's works) నేఁడవకాశములేదు. అయినను నీయధర్వణుఁడు కవిత్రయమువారికిఁ దరువాతివాఁ డని విస్పష్టముగఁ గారికలయాంతరంగిక ప్రమాణమునఁ జెప్పవచ్చును.

శ్లో॥ లఘుద్వ్యక్షరధాతూనా మించుగ్వాపంధిముశ్చ్నతే
యాంతానాం నవికల్పస్స్యాత్ ఇతి త్రికవిసమ్మతేః—

అను నధర్వణకారిక వలనఁ గవిత్రయము నెఱింగిన యధర్వణుఁ డని చెప్పవలయును. "ఎడిన్" అనునది వర్తమానార్థక మని యనుధోరణియుఁ గేతనాదులత్రోవ నున్నది. కవిభల్లటుల నితఁడును స్మరించెను. ఈసందర్భము లన్నియు నాలోచింప నధర్వణుఁడు కవిత్రయానంతరకాలికుఁ డనియుఁ దదనంతరప్రోక్త మాంధ్రశబ్దచింతామణియు నని చెప్పక తప్పదు. చింతామణికర్త యధర్వణు నెఱింగియుఁ బేరెత్తకుంకుట తప్పే. ఈ రెండు గ్రంథములకును మూలభూతము లగు నాంధ్రవ్యాకరణ గ్రంథము లేవియో యుండి యుండు నని యు వానిఁజూచి సంస్కృతీకరించి సమర్థులయి రచించి రనియుఁ జెప్పుట యొప్పు. ఆగ్రంథము లేవి యన 'ఆంధ్రభాషాభూషణము' అలంకారచూడామణి, లక్షణశిరోమణి, మున్నగు గ్రంథము లయియుండును.

ఈయజ్ఞాతకాలముననే ఫక్కికలు లెక్కకు మిక్కిలిగను స్వనామములనో పరనామములనో పుట్టెను. కారిక లన్నపేరును సార్థక మగును. చింతామణి యన్నపేరును నన్వర్థమగును.

చింతామణి—ఇట్టిపేరు సాధారణముగ నాదిగ్రంథమునకుఁ బుట్టదు. కావుననే కొందఱు లేకున్నను నన్నయభట్టీయాది నామములఁ బిలుచుట యుచిత మనుకొనిరి. కాని యది చింతామణి. ఆదిగ్రంథమున కిట్టిపే రుండుట యసంభవము. ఉదాహరణము నెందును గానము.

భూషణము తరువాతఁ జూడామణియును ననంతరము చింతామణులును బయలువెడలుట క్రమమె యైయుంటను జింతామణి యన్నింటికిఁ దరువాతిది యనవచ్చును.

పూర్వగ్రంథానువాదముగలదా ?

| చింతామణి. | ఆంధ్రభాషాభూషణాదులు. |
|---|---|
| ఆద్యప్రకృతిః- | తల్లిసంస్కృతంబెయెల్లభాషలకు |
| ఆద్యాయాః పంచాశద్వర్ణా ఇత్యాది- | ఆదులుస్వరములు-ఇత్యాది-<br>స్వరములు నచ్చులు-ఇత్యాది. |
| తజ్జాసమాచ ఇత్యాది | తత్సమంబునాఁగ-<br>భువిలోఁదత్సమములు ఇత్యాది. |
| నపదాన్యవ్యయసుప్తిఙ్త్వాతుమునామనుకృతేస్తివాక్యంతు | వృత్తేణదతొయ-ఇత్యాది. |
| దీర్ఘాణాం హ్రస్వః | లలి నేకాక్షరపదములు. |
| డా బవిధాత్రాదేః ... ... | హలోతధాతయనఁగ ... ... |
| డుమువులవః ప్రథమా, మహతః అతః,ఉత్, సోర్డుజ్. | డుములుతలమోచిపదముల ... ... |

ఇత్యాదిగ నాంధ్రభాషాభూషణము ను గావ్యాలంకారచూడామణిని మున్నగు తెనుఁగువ్యాకరణముల ననువదించుచు నందందుఁ బ్రతివదించుచు రచింపఁబడినయ ట్లుండు నాంధ్రశబ్దచింతామణికి మూలభూతము లగు గ్రంథములు పైగ్రంథము లని సూక్ష్మదృష్టి నరయఁ దెలియఁగలదు. ఇందు సప్తమియు ననది యథర్వణానువాదమై వ్యాఖ్యానముగ "సపిధివర్తినా మిందు" అనియుం డవచ్చును. మఱియుఁ జింతామణిలోని సూత్రరచనము ను దత్పూర్వో త్తర సందర్భములు ను నాంధ్రభాషాభూషణాదులయం దున్నట్లే కలదు. అథర్వణ మునను గూడ నట్లే కలదు-ఆంధ్రభూషణము 70, 71, 72, 73, 74 పద్యముల వరుసయుఁ దదితరఘట్టముల వరుసయు నందం దేచందమునఁ బొందికపడెనో

యట్లే చింతామణి సూత్రానుక్రమణికయు నుంటఁ బైవాదము సుప్రతిపాదమ గుచున్నది.

చింతామణి స్వరూప మెట్లున్న దనుటయు సందేహాస్పదముగనే యున్నది. పాఠభేదము లా పెక్కులు. క్రమభేదమా యత్యంతము. పరిచ్ఛేదములా భిన్నములు. శ్లోకలక్షణమా పూర్ణసందేహవ్యూహము. ఆర్యావృత్తములా! కా వందురు. ఎన్నియార్యలు? భిన్నాభిప్రాయమే. ప్రతిపాదితవిషయము సమానమా? కాదు. ఇట్లనేకములు సందేహములు నివారింపఁబడవలయును. ఇంత పనిచేసి మొన్నటిదే వ్యాకరణ మన్నను గౌరవహాని రాదు. చింతామణి కర్త వాగనుశాసనబిరుదమున కర్హుఁడు కాకపోఁడు. అట్టి వాగనుశాసనీయము ను వ్యాఖ్యానించుట యుఁ దదఃఫలమే. ఆంధ్రసాహిత్యపరిషత్తులో నున్నయాంధ్రలక్షణ గ్రంథములను దత్తమండలిలో రాయలసీమయున లభించిన లక్షణగ్రంథముల నరసి సమన్వయపఱచినఁ జింతామణిమూలము సుఖముగ గ్రహింపఁ గలుగుదుము. ఒక్క రేకాక యేపదుగు రేని నుండవలయును. వారును నితరుల యభిప్రాయముల నాలోచింపవలయును. బ్ర॥ శ్రీ॥ వఝుల చినసీతారామ స్వామిశాస్త్రిగారివంటి సద్విమర్శకులును గూడ బ్ర॥ శ్రీ॥ పారనంది రామశాస్త్రిగారిని, మున్నగువారిని స్మరింపక వ్రాయుట ధర్మువుగా దేమో యని యనుకొందును. చింతామణిసూత్రముల గుఱించి నేను ను బత్రికలఁ, బరిషత్పత్రికల, సభలలోఁ, బరిషత్తులలో ననేకపర్యాయములుగొన్నియభిప్రాయములఁ దెల్పి యుండితిని. వానినిఁగూడ నగు ననియో కా దనియో తెలుపుచు సమన్వయగ్రంథమును రచించుట మంచిది. అముద్రితాంధ్రగ్రంథచింతామణిమఠముఖము వారును నద్భుతముగఁ బరిశ్రమము గావించి యౌదార్యమున ననేకవిధముల భాషాసేవ గావించి యాంధ్రశబ్దచింతామణి విషయమును గొంచెము విమర్శించియున్నారు. వానినిగూడఁ జూచియే సమన్వయింపవలయును. ఇందుఁ గూర్చి నేను ను బ్రయత్నించుచున్నాఁడను. విరమింపక విసువొందక యింకను దారిద్ర్యము హెచ్చినను బ్రకృతాంధ్రలోకము తోడ్పడకున్నను 'త్యజ కర్మఫలమ్- కురు కర్మసఖే' యను సిద్ధాంతమున నున్ననేను వ్రాఁతప్రతి వ్రాసికొని ప్రకృతికి సమర్పింపక మానను. నారోదన మరణ్యరోదన మనియు ననాగరక మనియు నాలోచింపక విచక్షణులు సమగ్రముగ నాయభిప్రాయముల నరసి యవ్వల నెవ్విధి నన్న నన్ననయే. ఇదే జోహారు.

ఇంకఁ జింతామణి రచనావిధానము సూత్రపద్ధతి యావృత్తమార్గమా యని వివేకింతము.

ఆర్యాదుల నున్నయాంధ్రశబ్దచింతామణిని వృత్తమయ మనక సూత్రమయ మనుటకుఁ గారణ మేమి? అథర్వణకారికల నట్లువాడరే. భాషాభూషణాదుల విషయమును సూత్ర మని యనరే. సంప్రదాయసిద్ధముగ నున్న సూత్రము లను వాడుక వ్యర్థముగ నుండదు. చింతామణి సూత్రములుగనే యుండెను. సూత్రగ్రంథ మైనను బ్రారంభమున నొకశ్లోక ముంచుట నన్నియు శ్లోకము లని భావించి యెవ్వఁడేని శ్లోకనిర్వాహము పూనుకొనెనో కాకయున్నియును సూత్రములుగ నున్నను వాని నార్యాదులకుఁ గూర్చెనో యనిశంకింపవలసివచ్చుటకనేకకారణములు విస్పష్టముగఁ గనుఁగొందుము. కావునఁజింతామణి సూత్రప్రోత మయ్యె ననుటయే యుచితము.

సూత్రగ్రంథము లారంభింపఁబడురీతి న ధాత శబ్దములఁ బ్రారంభింప కున్నను వృద్ధిరాదైజాదులవలె నారంభించి యుండును. అనువృత్తులు నధ్యాహారములు ప్లుతులువిపరిణామములు మున్నగు శాబ్దసంప్రదాయములు, "సానునాసికోచ్చారణం జిత్, నుమ్" ప్రభృతి విధానములును, బరిభాషావత్తయుమున్నగుసందర్భములు ను, "అన్యైన్య్వ్యాకరణాస్పష్టా, ర్స్వత్ర గృహ్యాతే ద్వివిధః" అనుదానియందలి "అత్ర" పదమున కీవ్యాకరణమునం దని యర్థ మగుచుఁ బూర్వవ్యాకరణములఁ బోలి తనవ్యాకరణమును సూత్రపద్ధతి నుండవలయు నని యెంచియుండు ననుట కవకాశము కలుగుటను నల్పాక్షరసందిగ్ధత్వాదిపద్ధతు లాశ్రయించి సంగ్రహపఱుచుచున్నట్లు స్ఫురించుటను, వ్యాఖ్యానతః ప్రతిపత్తి యగుతమని రచించిన వానిధోరణియుండుటను "సంప్రదాయవేద్యా" అని యనుట ను నాంధ్రశబ్దచింతామణి, సూత్రగ్రంథ మని యనవలయును. సరస్వత్యాదులును సూత్రములే యని వాడిరి. నాన్ననసూత్రములని పండితులును సవిమర్శముగ వ్రాసిరి. కావున సూత్రములే.

పాఠభేదములు మున్నగుభేదములును గూడ సూత్రములను బద్యములలోఁ బెట్టుట వలన సంభవించె నని విజ్ఞు లెఱుంగుదురుగాక. ఆసమయమున ఫక్కికలును సూత్రములలో రచింపఁబడెను.

"దారార్థే ఉదపి రేఫస్స్యాత్, దారార్థే ఉదపిరః, వాయిరవు ర్వక్రతమా, వాయ్యవూ వక్రతమా, అయిగవుగాదేశాస్తః.....................

పదమధ్య న, ర, ల, డానా ముతశ్చ, నలడాదే రంతరుతశ్చ, పూర్వప్రయోగ సిద్ధానాం, అన్యేషాం చ ప్రయోగమహితానాం, ప్రథమావైభక్తికమోర్లుక్, పూర్ణోవా పతిక్రియార్థేతు, ప్రథమావైభక్తికమో ర్బిందుర్మహా న్పతిక్రియార్థేషు" ఈమొదలగు పాఠభేదము లరయ సమానసూత్రార్థము వచ్చునట్లును బద్యము గుదురునట్లును సూత్రస్థపదముల ను నర్థము ను భావము ను విడువక వృత్తికర్తలు రచించియుందు రని తోఁచి యుండదా! ఇంకను నిట్టిసుట్టము లనేకములు గలవు. చింతామణి సూత్రగ్రథిత మనియే చెప్పఁదగును.

అట్లే "చతుర్భుజాభిషేకాదిగ్రంథకర్త యు, వసుచరిత్రవ్యాఖ్యాత యునగు సోమనాథ పండితుఁడు (చూడు-మహాకవి-నెం 8 రు) నన్నయభట్టీయ సూత్రములఁ జేర్కొనియెను. కావున నెట్లాసూత్రము లుండె నని నిర్ణయించుటకు నాధారభూతంబు లగునన్యపుస్తకంబులఁ జూచి యుపలబ్ధము లగునీచింతామణిసూత్రములలోని యధికపదములను ద్రోసిపుచ్చి చక్కనిసూత్రరూపము నేర్పడఁజేయ వలయును. ఉదాహరణముగ నీక్రిందఁ జూపుచున్నాను.

క. రులుషడి లంత్యము లైనక్,లులనడఁచి తదంత్యములకుఖుక్త్రగు బహుతక్

అనుదానిఁ జూడఁ జింతామణిలోని "రోళః" అనుసూత్రము నిస్సందేహముగ దొడ్డళాతో నంత మయ్యె నని చెప్పవచ్చును గదా? లక్షణశిరోమణ్యాదులను జూడఁ బాఠసందేహము తీఱఁగలదు.

మఱియుఁ జింతామణిసూత్రములుఁ బాణినీయసూత్రములయట్లు పరిభాషాసంప్రదాయవేద్యము లయి యున్నవి. అహోబలపతి, మున్నగుప్రాచీనులును "బ్రహ్మశ్రీ వఝుల చిన సీతారామశాస్త్రిగారును, ఆకొండి వేంకట శాస్త్రిగారును, ప్రయాగ వేంకటరామశాస్త్రిగారును బరిభాషావేద్య మని యందురు గదా! తార్కాణముగ సూత్రసమన్వయమునఁ (ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక) జూపియున్నాను. సూ॥ వా యిరపుర్వక్రతమా- అనునీసూత్ర మన్వయము గావలయు నన్న నాయొనర్చిన పరిభాషావ్యవస్థ నామోదింపకయున్న నన్వయమే కాదు. అట్టిపరిభాషాపాఠము ముందెఱుఁగవలయును. ఆపాఠము నీక్రిందఁ జూపుట మూలరూప నిరూపణమునకుఁ గడు నుపకారక మని తలంతును.

—॥ ఆంధ్రశబ్దచింతామణిపరిభాష ॥—

సూ॥ ద్వైవిధ్య మాకృత్యా ద్వేధాచ—

ర్త్స్వత్ర గృహ్యతే ద్వివిధ యిత్యాదా చరితార్థః.

సూ॥ యుగాది సంఖ్యాయై—2

చజయుగరయుగలయుగ ఇత్యాదా.

సూ॥ నిరుపపద మాద్యం గీర్వాణం—3

ఆద్యః ప్రకృతి రిత్యాదా—

సూ॥ అనుక్త మన్యతో గ్రాహ్యమ్—4

స్పష్టమేవ—

సూ॥ వైధర్మ్యాది రుచ్చారణాయ—5

నాన్యేషాం వైధర్మ్య మిత్యాదా—

సూ॥ విభక్తిసంశయే విన్యాసక్రమః—6

రోళ ఇత్యాదా—

సూ॥ సంకేతితం ప్రకరణజ్ఞాపకమ్—7

క్వచిద్గకారోవః, ఇత్యాదా—

సూ॥ విధిప్రాప్త్యై సావర్ణ్యమ్—8

కచటతపాః పసషా ఇత్యాదా—

సూ॥ ఉద్దేశితయోక్తానామపి—9

పూర్వసూత్రాత్ సావర్ణ్య మిత్యస్యానువృత్తిః

రోళః, నలడా దిషు—

సూ॥ నానుదేశినాం—సావర్ణ్యానువృత్తిః—10

దారార్థే ఉదపిరః, ఇత్యాదా—

సూ॥ ఉద్దేశానుదేశౌ భిన్నవిభక్తికౌ—11

స్పష్టార్థః—

సూ॥ సిద్ధే కార్యే సిద్ధిస్స్పష్టాయ—12

సుగమః—

సూ॥ సన్నమాసే—13

సూ॥ లుగ్లోపౌ సమాసౌ—14

సూ॥ తద్వృత్తౌ వదర్శనం లోపః—15

సూ॥ లుప్తేన లుప్తం హిలక్షణమ్—16

ప్రత్యయలోపే ప్రత్యయలక్షణ మిత్యాదివ్యావృత్తిః

సూ॥ శబ్దాది రాకృతిగణః—17

సూ॥ సబిందూచ్చారణం జిత్—18

సూ॥ పంచమీపూర్వికా ప్రథమా షష్ఠీ—19

సూ॥ సమస్తబిందుః పూర్ణస్స్యాత్—20

సూ॥ కుత్రచిదేవ వ్యస్తస్య—21

సూ॥ సంశ్లేషోద్రుతస్య నిరిణ్ణాత్వం—22

ఇత్యాది పరిభాషాకల్పనమువలన నర్థవంతము లగుసూత్రముల నన్నయభట్టు వ్రాసె నని యనవచ్చును. కాని యాూర్యావృత్తముల రచించి యుండఁడేమో యని సందేహింపఁదగు నాధారము లనేకములు గలవు. ఆసూత్ర స్వరూపమున నున్నయాంధ్రశబ్దచింతామణి నేను సిద్ధముచేసి యుండితిని. ఆంధ్రపండితులును నాంధ్రులును దోడ్పడి ప్రకటింపఁదలంచిన నల్పటీకాసమేతము గఁ బంపుదును. ఉత్తరప్రత్యుత్తరము లీక్రిందిరీతి నందుటకై వ్రాయుదురుగాక.

మహాకవి కాశీభట్ట కృష్ణరాయశాస్త్రి,
ఆర్షవిద్యాలయము,
సాలూరు- B. N Ry.
Vizagapatam (Dist.)

# దండివామనుల మతము.

— సాహిత్యవిద్యాప్రవీణ, బులుసు వేంకటరమణయ్యగారు. —
(Research Student, Hindu University, Benares)

---

భరతుని నాట్యశాస్త్రమునఁ బ్రసంగవశమున నిర్దేశింపఁబడిన యలంకారాదిక మగుకావ్యసామగ్రికిఁ దక్కినయాలంకారికులు తలకొకరీతిఁ బ్రాధాన్యము నొసంగిరి. అందలంకారములకు భామహుఁడు ప్రాముఖ్యము నొసంగెను. ఉద్భటరుద్రటు లాతనినే యనుసరించిరి. దండి రీతికిఁ బ్రాధాన్యము నొసంగె ననియు, వామనుఁడు దండిమతమునే యనుసరించె ననియుఁ బ్రాచీనాలంకారికులు కొందఱన నధునాతనాలంకారశాస్త్రపరిశోధకు లగు*సుశీలకుమారడే మహాశయులును, పి. వి. కాణే మహాశయులును మఱికొందఱును దమ తమ యలంకారచరిత్రములం దుపవర్ణించియున్నారు.

భామహుని మతమునందువలెనే దండివామనుల మతమునఁ గూడ రసమప్రధానమే. కాని మఱియొక విషయమునఁ గొంచెము వ్యత్యాసము కలదు. భామహుఁ డలంకారములే ప్రధానము లని చెప్పుచు వైదర్భగౌడరీతుల నంగీకరింపక త్రోసిపుచ్చెను. దండి రీతుల కుచితస్థానము నొసంగుచు నలంకారములను ద్రోసిపుచ్చక, అలంకారభేదములను భామహునికంటె నెక్కువగ నిరూపించి రెండధ్యాయములను వానికొఱకే ప్రత్యేకించెను.

కావ్యవిభాగములను జెప్పినపిదప దండి-

"అస్త్యనేకో గిరాం మార్గః సూక్ష్మభేదః పరస్పరమ్।
తత్ర వైదర్భగౌడీయౌ వర్ణ్యేతే ప్రస్ఫుటాన్తరౌ॥" [కావ్యాదర్శము 1- 40]

అని యారెండుమార్గముల స్వరూపమును నిరూపించుచు గౌడమార్గముకంటె వైదర్భమార్గమునకే ప్రాముఖ్యము నొసంగి గౌడరీతిని గొంతవఱకు నిరసించియున్నాఁడు. అతనికావ్యాదర్శమును బాగుగఁ బరిశీలించినచో నీవిషయము విశదము కాఁగలదు. ఇంచుమించుగ నన్ని విషయములందును దండినే యనుసరించిన వామనాచార్యుఁడు కూడ—

"రీతిరాత్మా కావ్యస్య" [కావ్యాలంకారసూత్రములు 1- 2- 6]

---

* 1 S. K. De, History of Sanskrit Poetics i & ii Volumes. P. V. Kane, History of Alankara Literature, [Introduction to his Sahityadarpana Edition]

అని రీతియే కావ్యమున కాత్మ యని చెప్పియున్నాఁడు. దండి చెప్పిన మార్గములును వామనునిరీతులు నొక్కటియే యనవచ్చును. ఇట్లు వీరిమతమున రీతులకుఁ బ్రాధాన్య మొసఁగఁబడిన దని యనుకొన్నను గుణములకుఁ గల ప్రాధాన్య మీయిరువురిమతమున నంగీకరింపక తప్పదు.

దండి వైదర్భగౌడమార్గములను రెండింటిని నిరూపించియున్నను గౌడికంటె వైదర్భికే ప్రాధాన్య మొసంగెను. అట్లు వైదర్భియే ప్రధాన మగుట కందు గుణములుండుటయే కారణ మనియు, గౌడిని నిరసించుట కందు సామాన్యముగ గుణము లుండకపోవుటయే కారణ మనియు,

ఇతి 'వైదర్భమార్గస్య ప్రాణా దశగుణాః స్మృతాః ।
ఏషాం విపర్యయః ప్రాయో దృశ్యతే గౌడవర్త్మని॥' [కావ్యాదర్శము 1- 42]

అతనివచనములే ప్రమాణములు. ఈవిషయమున నతని వివరణమునే కొంచెము చూపెదను.

'శ్లిష్ట మస్పృష్ట శైథిల్య మల్పప్రాణాక్షరోత్తరమ్
శిథిలం మాలతీమాలాలోలాలికలిలా యథా
అనుప్రాసధియా గౌడై స్తదిష్టం బంధగౌరవాత్
వైదర్భై ర్మాలతీదామలంఘితం భ్రమరైరితి॥" [కావ్యాదర్శము 1- 43, 44]

వైదర్భరీతియందుఁ గలపదిగుణములలో శ్లిష్ట [శ్లేష] మొకటి. అందు శైథిల్య ముండదు. అల్పప్రాణాక్షరములు కలిగియుండుటయే శిథిలతకు లక్షణము. 'మాలతీమాలాలోలాలికలిలా" అనునది, యల్పప్రాణాక్షరములు కలిగియుండుటచే గౌడమార్గమున కుదాహరణము. 'మాలతీదామలంఘితం భ్రమరైః' అనునది వైదర్భమార్గమున కుదాహరణము. ఈరీతినే తక్కినవిషయములందును భేదము కాన నగును. కాన దండిగుణములకుఁ బ్రాధాన్యము నొసంగె నని యంగీకరింపవలెను. మఱియు నితఁడు సమాధిగుణముం గూర్చి వ్రాయుచు-

"తదేత త్కావ్యసర్వస్వం సమాధి ర్నామ యోగుణః
కవిసార్థః సమగ్రోఽపి త మేన మధిగచ్ఛతి॥" కావ్యాదర్శము 1- 100]

అని వ్రాయుటచేతను సమాధ్యాదు లగుగుణములకు ముఖ్యత్వ మొసఁగెనని యనవచ్చును.

గుణములకు దండిమతమునఁ గలప్రాధాన్యము వామనునిచే మెఱుఁగు పెట్టఁబడినది గాని యుపేక్షింపఁబడలేదు. భరతుఁడు, దండి, పదిగుణములనే యంగీకరింపఁగా వామనుఁడు పదిశబ్దగుణములను, పదియర్థగుణములను జెప్పి మొత్తమిరువదిగుణముల నంగీకరించెను. కావ్యమునకు గుణములవలననే శోభ కలుగు ననియు, నలంకారము లట్టిశోభకు మెఱుఁగు పెట్టు ననియును వామనుఁడే చెప్పెను.

కావ్యశోభాయాః కర్తారో ధర్మాగుణాః॥
తదతిశయహేతవ స్త్వలంకారాః॥ [కావ్యాలంకారసూత్రములు 111-1-1,2]

'అత్రశ్లోకా—
యువతే రివ రూప మంగ ! కావ్యం స్వదతే శుద్ధగుణం తదప్యతీవ ।
విహితప్రణయం నిరంతరాభిః సదలంకార వికల్పకల్పనాభిః॥
యదిభవతి వచశ్చ్యుతం గుణేభ్యో వపురివ యౌవనవంధ్య మంగనాయాః
అపి జనదయితాని దుర్భగత్వం నియత మలంకరణాని సంశ్రయన్తే॥''

ఈమొదలి శ్లోకములఁబట్టి గుణములకు వామనుఁ డెట్టిస్థానము నొసఁగి యున్నాఁడో తేటపడఁగలదు.

అలంకారసర్వస్వకారుఁడు వామనుని మతమును వ్యక్తపఱుచుచు 'వామనేన తు సాదృశ్యనిబంధనాయా లక్షణాయాః వక్రోక్త్యలంకారత్వంబ్రువతా కశ్చిత్ ధ్వనిభేదోఽలంకారతయై వోక్తః కేవలం గుణవిశిష్టపదరచనాత్మికారీతిః కావ్యాత్మత్వే నోక్తా॥' [అలంకారసూత్రము-త్రివేంద్రముప్రతి పుట 6]

అని వ్రాసి "రీతిరాత్మాకావ్యస్య'' [i—2—6]
"విశిష్టా పదరచనా రీతిః[i—2—7]
"విశేషోగుణాత్మా" [i—2—8]

అనువామనమతము ననుగమించెను. దీనింబట్టిగుణములు లేనివో రీతులకు స్థితియే లేదు. కావుననే సంఘటనాత్మకము లగురీతులందు గుణము లవశ్యముగ నుండితీరవలెను గాన జాతిజాతిమత్తుల కభేదము రీతిని గుణరీతుల కభేదముండు ననియు, కావున రీతిప్రధాన మగుచో గుణముకూడఁ బ్రధానమగుట తప్పదనియుఁ గొందఱియభిప్రాయము. ఆనందవర్ధనాదులమత మిట్యాదియుని యభినవగుప్తులు నిరూపించిరి.

కొందఱు రీతులకును గుణములకును భేదము కలదని వ్రాసినట్లు తోఁచుచున్నది. వాగ్భటుఁడు తనవాగ్భటాలంకారమున-

"సాధుశబ్దార్థసంబంధం గుణాలంకారభూషితమ్
స్ఫుటరీతిరసోపేతం కావ్యం కుర్వీత కీర్తయే॥"

అనియు, జయదేవుఁడు తన చంద్రాలోకమున-

"నిర్దోషా లక్షణవతీ సరీతి ర్గుణభూషితా।
సాలంకారరసానేకవృత్తిర్వా క్కావ్యనామ భాక్॥"

అనియు, విద్యానాథుఁడు ప్రతాపరుద్రీయమున-

"శ్లేషాదయో గుణా స్తత్ర శౌర్యాదయ ఇవ స్థితాః।
ఆత్మోత్కర్షావహా స్తత్ర స్వభావా ఇవ రీతయః।"

అనియు రీతిగుణములభేదమును జెప్పియున్నారు.

ఈ రెండింటికిని భేదమున్నను, లేకున్నను (ఏరీతినయినను) గుణములకుఁ గలప్రాధాన్యమును బ్రతిఘటించుట దుర్ఘటము.

"రీతిరాత్మా కావ్యస్య" అని వామనుఁడు రీతియే కావ్యాత్మ యని చెప్పినను గౌడపాంచాలరీతులను ద్రోసిరాజుచేసి వైదర్భరీతికే ప్రాధాన్య మొసంగెను. అట్లొనర్చుటకుఁ గలకారణము గుణములే యని యతని

"సా త్రిధా- వైదర్భీ- గౌడీ- పాంచాలీ చ।
విదర్భాదిషు దృష్టత్వా త్తత్సమాఖ్యా।
సమగ్రగుణా వైదర్భీ।
ఓజఃకాన్తిమతీ గౌడీయా।
మాధుర్యసౌకుమార్యోపపన్నా పాంచాలీ।
తాసాం పూర్వాగ్రాహ్యా గుణసాకల్యాత్।
నపున రితరే స్తోకగుణత్వాత్॥ [i—2—9—15]

యీపైసూత్రములే విశదముచేయఁగలవు. ఇట్లు వైదర్భికిఁ బ్రాధాన్యము నొసంగుటయే గాక, వైదర్భరీతి నలవఱుచుకొనుటకై ప్రథమప్రయత్నముల రీతిని గూడఁ దక్కినరీతు లుపయోగింప వని యతఁడే యీక్రిందిసూత్రములవలనఁ దెలియపఱుచుచున్నాఁడు.

"తదారోహార్థ మితరాభ్యాస ఇత్యేకే
తచ్చన, అతత్త్వశీలస్య తత్త్వానిష్పత్తేః॥

నఖ్యణసూత్రవానాభ్యాసే త్రసరసూత్ర వైచిత్ర్యలాభః

కావున సమగ్రగుణ యగువైదర్భరీతినే యతఁ డంగీకరించుటచే గుణములు ప్రధానము లని యంగీకరింపవలెను.

13 వశతాబ్దపువాఁ డగు [A. C 1265] సముద్రబంధుఁడు అలంకారసర్వస్వవ్యాఖ్యానమున

"ఇహ విశిష్టౌ శబ్దార్థౌ కావ్యమ్। తయో శ్చ వైశిష్ట్యం ధర్మముఖేన వ్యాపారముఖేన వ్యంగ్యముఖేన వేతి త్రయః పక్షాః। ఆద్యే అలంకారతో గుణతో వేతి ద్వైవిధ్యమ్, ద్వితీయేఽపి భణితి వైచిత్రేణ భోగకృత్త్వేన వేతి ద్వైవిధ్యమ్, ఇతి పంచసు పక్షేష్వాద్య ఉద్భటాదిభి రంగీకృతః। ద్వితీయో వామనేన, తృతీయో వక్రోక్తిజీవితకారేణ, చతుర్థో భట్టనాయకేన, పంచమ ఆనందవర్ధనేన," [పుట 4.]

"రీతి రాత్మా కావ్యస్య, విశిష్టా పదరచనా రీతిః, విశేషో గుణాత్మా" ఇతి వదతా గుణప్రాధాన్య ముక్తం భవతి." [పుట 7.]

అని గుణప్రాధాన్యమునే యంగీకరించెను. కావున దండివామనులమతమున గుణములు ప్రధానము లని వివరించుచు నీచిన్నివ్యాసమును ముగించుచున్నాను.

# ఉత్తరరామచరితలోని ధర్మవీరము.

—అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, కొవ్వూరు—

ఉత్తరరామచరితమున సర్వాంకములలో రామునిశోకము వెల్లడియగుచుండుటంబట్టియు "రామస్య కరుణో రసః" "ఏకోరసః కరుణఏవ" ఇత్యాది వాక్యము లుండుటంబట్టియు "నిరవధి రయంతు ప్రవిలయః" "సానికే గృహశకుంతికా మివ" ఇత్యాదివాక్యములలో స్వభావోక్తి సంప్రదాయము ననుసరించి యక్షరార్థమును గ్రహించుటంబట్టియుఁ గరుణరస మని యెల్లరకుఁ బ్రప్రథమమునఁ దోఁచుచుండును. "పుత్రపూర్ణోత్సంగాం ఆయుష్మతీం ద్రక్ష్యామః" ఇత్యాది ఋషివాక్యము లనృతములు కా వను నమ్మకము గల రామునకు సీత బ్రతికియుండ వచ్చు నను నూహ యు, మృతినిశ్చయము లేమిచేత నుండవచ్చు ననుకొనిన రామునిదుఃఖవాక్యములలోని సీతామరణసంభావన లన్నియు నాప్త

హృదయములకు ననిష్టాశంకాసహజ మనుపరిపాటి ననుసరించి యేర్పడిన వనియుఁ జెప్పుకొని "నష్టా" ఇత్యాది పదములకు నదర్శనాద్యర్థవిశేషములను గ్రహించినచోఁ గరుణవిప్రలంభము కొందఱిపక్షమునను బ్రవాసవిప్రలంభము కొందఱిపక్షమునను భవభూతి యుత్తరరామచరితమునఁ గొంచెము లోఁతునకు దిగి యాలోచించినప్పు డగుచుండును. ఈ రెండుపక్షములవారును దమతమ యభిమతరసములకు గ్రంథములోని సాక్ష్యములను బలాబలనిర్ణయములతోఁ బ్రకటించుకొని యున్నారు.

నాటకములలో శృంగారవీరములే ప్రధానములు కావలె ననుసిద్ధాంతము కథ కుపక్రమోపసంహారములు సరిగ నేర్పడుటకును కథానాయకుని ధర్మయాత్రలోని యుద్యమములును వానిఫలములును నాటకద్రష్టలకు ననుభవముగఁ జూపుటకును నేర్పడి యుండునేమో? పంచసంధిసమన్వయ మా రసములలోవలె రసాంతరములలోఁ గన్పట్టదని తోఁచెడిని. రతిమంతునికిఁ గామపురుషార్థసిద్ధివలెను, ధర్మాద్యుత్సాహవంతులకు ధర్మాదులవలెను శోకభయవిస్మయహాస్యాద్యాక్రాంతులకు శోకాదులవలనసిద్ధించెడి పురుషార్థ ముండదుగదా! కానఁ గరుణరసవాదమున, నాటకోపసంహార రామణీయక హేతువగుకార్యము ఫలసామగ్రితోఁ గన్పట్టకుండుటయు దానిని గూర్చిన యుద్యమములు ప్రతిముఖాదిసంధులలో గగనకుసుమము లగుచుండుటయు దానివలన నాయకుఁడు వ్యసనిగ మాత్రమే కన్పట్టి కార్యసాధకతారూప మయిన పురుషలక్షణమునకు వెలి యగుటయు నాటకవినయాధానమునకు లోపమును వాటిల్లఁజేయుచున్నవి

విప్రలంభశృంగారమునఁ బత్నీప్రాప్తికార్యమును జితకాశి శత్రుఘ్నసమాగమాదులు ఫలములును కావచ్చును. కాని, ప్రతిముఖగర్భవిమర్శసంధులలో ధ్వనించుచుండవలసిన కార్యసాధనప్రయత్నము లవాంతరఫలములతోఁ జెలువారుచు నాటకాంతరములలోవలెఁ గన్పట్టుట లేదు. రాముఁడు సీతాప్రాప్తికై యత్నించుచున్నట్లు మన మేయంకమున నైనఁ జూడలేముగదా!

ఉత్తరరామచరితమున ధర్మవీర మనుకొనినచో నుపక్రమోపసంహారములు సూత్రంపట్టినట్లు కుదురును. పంచసంధిసమన్వయమున కేయభ్యంతరముండదు. స్వాదుపరాఙ్ముఖు లయినవారికైనను ధర్మవ్యుత్పత్తి బలపడును, శృంగారవీరరసములకుఁ బ్రాముఖ్య మున్న దగును. కార్యము ప్రజానురంజనము,

ఫలము పత్నీపుత్రప్రాప్తితోడి జితకాశిశత్రుఘ్నసమాగమము, బీజము ప్రజారంజనోత్సాహము, ప్రధానరసస్థాయీభావమే బీజమగుచుండుట సాగరికానురాగమును బీజ మను ధనికుని మాటకు సరిపోవుచున్నది. ఈబీజమును రామునిలోనిదాని నభివ్యక్త మొనర్చుటకే యస్తావకుని ముఖమున "యుక్తః ప్రజానా మనురంజనే స్యాః" యనుట "యది వా జానకీ మపి ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మే వ్యథా" ఇత్యాదిసందర్భములలో రామునియత్సుక్యమును గన్పట్టు. సీతాత్యాగశత్రుఘ్నప్రేషణాదులు యత్నములు. ప్రతిముఖసంధిని బిందుసమన్వయములో సమకూర్చును. ఇట్లే పంచసంధిసమన్వయ మూహ్యము.

సర్వాంకసంస్పర్శము ధర్మవీరమునకు వాచ్యముగ గన్పట్టదు గాని వ్యంగ్యపద్ధతిని గన్పట్టు. ఎట్లన—ద్వితీయాంకములోని శంబుకవధ రాజధర్మమే బ్రాహ్మణశిశురక్షణమున నగుచున్నది. అగస్త్యోపసదనము ధర్మశ్రవణద్వారమున రాజధర్మమే. తృతీయాంకమున సీతాశోకమే పుష్కలంత లగుచున్నను జిట్టచివరకు, నశ్వమేధసమాపనమునకుం బోవుటకు వాసంతిదగ్గఱ సెలవు దీసికొనునప్పుడు తత్పూర్వవిషాద మంతయుఁ దృణీకృతమై రామునియందు ధర్మోత్సాహప్రతిష్ఠను జేయుచున్నది. "వంశవీర్య ప్రతాపాది వర్ణయిత్వా రిపోరపి" అనురీతి తృతీయాంకశోకప్రసంగము సీతారామానురాగమయమై బాధ్యమై ధర్మవీరమును బోషించు జనకుని "ప్రజాపాలకమాతుః" అను కౌసల్యోపాలంభము ను, రాముని రాజధర్మపరతనే వెల్లడించుచున్నది. చంద్రకేతుసమాగమము రామునిరాజధర్మమైన యశ్వమేధమునే వ్యక్తపఱుచుచున్నది. కుశలవులపౌరుషము "ఆత్మావై పుత్రనామాసి" యనుశ్రుతిసంప్రదాయము ననుసరించి రామునితేజమును వెల్లడించుచున్నది. చివరయంకమునఁ బ్రజలం దఱియనుజ్ఞ వడసియే రాముఁడు సీతనుజేకొనుట ధర్మవీరరసమునకు సామ్రాజ్య మొసఁగుచున్నది—కాన ధర్మవీరరస ముత్తరరామచరితములోని ఘనునంశము ను గూఢసహృదయులు కటాక్షించి, కరుణశృంగారములను వలె విమర్శించుట కిదిసూచన.

# పరవస్తు చిన్నయసూరిగారి జీవితము.

— నారాయణవనము, కూ-వకుళాభరణముగారు —

---

శ్రీమ దుభయవేదాంత ప్రవర్తకాచార్యు లగు శ్రీమాన్ పరవస్తు వేంకటరంగరామానుజాచార్యు లుత్తరదేశస్థులు. వీరు పదునేడవ శతాబ్దపువారు. పరవస్తు మఠమువారి శిష్యులు. పరవస్తు మఠమువార లుత్తరదేశమునుండి వచ్చినపుడు వారితోఁగూడఁ దామును దమదేవేరు లగు శ్రీనివాసాంబగారు, ఆమెకొమార్తయుఁ జెన్నపట్టణమునకు వచ్చి తిరువల్లిక్కేణి రామానుజకూటము వీథియందు బసచేసి యుండిరి. ఇచ్చట ననేకులకు మంత్రమంత్రార్థముల బోధించుచుఁ బంచసంస్కారపరులఁ జేయుచు నుండిరి. ఇటు లుండఁ బ్రతివాది భయంకరము శ్రీనివాసాచార్యులు వీరి ప్రవచనములు విని మిగుల సంతసించి వీరిని శ్రీపెరుంబూదూరునకుఁ దీసికొనిపోయి యచ్చట వసతుల నేర్పఱిచి కోవెలయందు ద్రవిడవేద పారాయణాధ్యాపకులుగా నియమించిరి. అచ్చట ననేక వైశ్యులు శూద్రులు మొదలగువారు చెన్నపట్టణమునుండి విచ్చేసి మంత్రమంత్రార్థములను బంచసంస్కారములను బడయుచుండిరి. వేంకటరంగ రామానుజార్యులు సంస్కృతము, ప్రాకృతము, ద్రావిడము, తెనుఁగు చక్కగ నెఱిఁగినవారు. శ్రీపెరుంబూదూరి యగ్రహారమునందు బాలురకుఁ బాఠములు చెప్పుచుండిరి. నేఁటికిని వీరిగృహము శ్రీపెరుంబూదూరున నున్నది. అయిన నది శిథిలదశయం దున్నది. రామానుజార్యులకుఁ గొమరితయొక్కరు గలరు ఆమె వితంతువు. తనకుఁ బురుషసంతతి లేమిం జేసి రామానుజార్యులు మిగులఁ జింతిలుచుండెను. ఈవిషయమును వారి యాప్తమిత్రులగు ప్రతివాది భయంకరము శ్రీనివాసాచార్యులు వారికిఁ దెలియఁగా వారు శ్రీనివాసాంబ ఋతుస్నాతయైయుండు సమయమునఁ బుత్రకామేష్టి యాగమువలె నొక్క హోమమును జరిపించి యందు శ్రీసూక్తముతోను బురుషసూక్తముతోను నాహుతుల హోమమందు వేల్చి పాయసము నందుఁ గల్పించి తామ్రకుంభమును జక్కగ మించునట్లు శుద్ధపఱిచి యందు జలము పూరించి దానిపై నొక చిఱుచెంబు నుంచి యందు జలమును మామిడిగొత్తులను దర్భకూర్చములను నారికేళము నునిచి కుంభమున నూర్ధ్వపుండ్రంబులఁ జాఁది కర్పూరహారతి నర్పించి శ్రీనివాసాంబను దనముఖబింబము నందుఁ జూచుమన నామె యటులు చేయునపుడు పైభాగమందలి యామ్రపల్లవమునుండి జాఱిపడిన నీటిబొట్టొకటి పుదియబొట్టు కుడిప్రక్కను నల్లని చాయఁ గల్పింపఁగా నీమనోహరవిగ్రహము నామె హృత్కమలంబున లయంబుగొంద యాగపాయసంబు నాదంపతుల కొసంగఁగా నామె గర్భంబు దాల్చె. దశమాసంబులు మోసి A. C. 1806 ప్రభవనామ సంవత్సరంబున రేవతీ చతుర్థపాదంబున నొక్క మగశిశువును బ్రసవించెను.

జాతకర్మ నామకరణాదులు జరిపించి చిన్నయ్య యని పేరిడిరి. ఆశిశువు దినదినాభివర్ధమానుఁడై యల్లారుముద్దుగ మాతాపితల సంతోషపఱుచుచుండెను. మఱియు నాశిశువునకుఁ గుడికంటియందలి నల్లగ్రుడ్డు కొంచెము స్థలము మాఱి యుండెను. ఇది పూర్ణకుంభముయొక్క నల్లని ఛాయ ప్రతిబింబ మని పెక్కుమాఱులు శ్రీనివాసాచార్యులువారు చెప్పుచుండి రఁట. రామానుజార్యులకుఁ జాలకాలమునకుఁ బుత్రుఁడు జనించుటచే మిగుల సంతసించి శిశువును గారాబముగాఁ బెంచుచుండిరి. సుమారు పదునాఱువత్సరముల వఱకుఁ జిన్నయ్యగారికి విద్యయందుఁ జొరవ గలుగలేదు. తల్లితోఁగూడఁ బేరంటములకుఁ బోయి పాటలు పాడుచుండు నఁట. ఇటులుండ నొకనాఁడు వీరిమిత్రులు కంచి రామానుజాచార్యులవారు శ్రీపెరుంబూదూరునకు వచ్చి రామానుజార్యులతోఁ గలసి మాటలాడుచుండఁగాఁ జిన్నయ్య యెచ్చటనో బైట బాలురతో నాడుచుండి లోపలకుఁ బరువెత్తి రాఁగా రామానుజాచార్యులవారు చూచి "యీబాలుఁ డెవఁడు" అని ప్రశ్నింపఁగా విద్యాగంధము లేని తనపుత్రుఁ డని మిగుల సంకోచముతోఁ జెప్పుచు బాలుని బిలిచి యాచార్యులవారికి సాష్టాంగనమస్కారము చేయునట్లు చేసిన వా రాశీర్వదించి బాలునితో "నాయనా మీతండ్రిగారు వృద్ధులు, వారియొద్ద మాబాలురెల్లరుఁ జక్కఁగఁ జదువుకొనిరి. మేమును వారినుండియే యనేక విషయములను గ్రహించితిమి. అట్టివారి కడుపునఁ జదువు లేని తుంటరి జన్మించితివిగా! నీకు బాల్యదశ గడచినదే, నాలుగక్షరములు వచ్చి యుండినఁగదా నీవు మీతండ్రివలె సభాపూజ్యుఁడ వగుదువు. లేనియెడల నీజన్మ మెందుకు. తల్లిదండ్రులకుఁ జెడ్డపేరు గల్పించుటకా నీవు పుట్టినది" యని చీవాట్లు పెట్టఁగా బాలుఁడు సిగ్గుతోఁ దలవంచి దేహము కంపింప నొడలు చెమటలుగాఱఁగాఁ గాలుసేతులు తడఁబడఁ గనులయందు ధారలుగాఁ గన్నీరు గాఱుచుండ డగ్గుత్తికతో "లేదు, ఇఁకముందుఁ జదివెదను" అని చెప్పిన ట్లాచార్యులవారి శలాకలవంటి తీక్ష్ణవాక్యములు బాలునిమనమున నాఁటి బాధింపఁజొచ్చెను.

మఱుచటి దినము చిన్నయ్య తనతండ్రిని జూచి నాయనా నేఁడుమొదలు నేను (బారములు) చదువుకొనియెదను. అక్షరములు నేర్పవలయు నని కోరఁగాఁ బ్రతివాది భయంకరము శ్రీనివాసాచార్యులయొద్దకు రామానుజయ్యగా రొక కమ్మ వ్రాసి బాలునిచేతి కిచ్చి పంపిరి. చిన్నయ్య యాకమ్మ దీసికొని పోయి వారి కీయఁగా బాలుని జూచి నీవు చదువువాఁడవా! నాకు సందేహముగా నున్నదే యనఁగా, లేదు లేదు, నేను జక్కఁగాఁ జదువుకొనెద నని బా

లుఁడు చెప్పినదే, యిఁకయుం దాచార్యులవారు బాలునకు ముందుగ ఓనమాలను వ్రాసి యీయ నాతఁ డట్లనే వ్రాసెను. దానిని జూచి వీఁడు మహా ప్రజ్ఞాశాలి యని గ్రహించి యచ్చులను వ్రాసియిచ్చెను. బాలుఁడు భోజనమునకు వచ్చునంతలో వానిని వ్రాసి చూపెను.

ఆచార్యులవారికి మిగుల సంతసము గలిగి నీవు త్వరలో భుజించి రమ్ము లెమ్ము, పొమ్ము, మిగత విషయములను జెప్పెద ననఁ జిన్నయ్య యింటికిఁ బోయి భుజించి మరలఁ బాఠశాలకు వచ్చెను. ఆచార్యులవారు మిగుల శ్రద్ధతో రామానుజయ్యగారి యందుఁ గల గురుత్వమునకును, చాత్తాద శ్రీవైష్ణవ బ్రాహ్మణులయందుఁ గల శేషశేషిత్వంబునకును దమకుఁ జిన్నయ్యయందుఁ గలిగిన యప్రాకృత వాత్సల్యముచేతను బాలుని గమనించి హల్లులను గుణితమును గణితమును మిగులఁ ద్వరలో నేర్పెను.

పిమ్మట బాలరామాయణము, అమరము, శబ్దములు, ఆంధ్రనామసంగ్రహమును ద్వరలోఁ జిన్నయ్య యేకసంధాగ్రాహి యగుటం జేసి నేర్చుకొనెను. చిన్నయతండ్రిగారు బీదస్థితియం దున్నట్లు తోఁచుచున్నది. ఆచార్యులుగారు రామానుజయ్యగారిని జూచి మీ బాలుఁడు చక్కఁగఁ జదువుచున్నాఁ డని చెప్ప వారికి సందేహముగా నుండి యొకనాఁడు బాలుని బిలిచి తనయంకపీఠమునఁ గూర్చుండఁ బెట్టుకొని పాఠముల నడుగఁగా మిగుల విశదముగా శ్లోకములను బద్యములను నొప్పఁజెప్పెను. అందులకు మిగుల సంతోషించి నాయనా నీకుఁ బుస్తకములు లేవుగదా పాఠముల నెట్లు నొప్పఁజెప్పుచున్నా వని యడుగంగా బాలురయొద్దఁ బుస్తకములను దీసికొని వచ్చి రాత్రులయందు గుడిని వెలుఁగు దీపమునఁ జదివి మరలఁ బగటియందు వారల కిచ్చుచున్నాఁ డ ననఁగాఁ దండ్రి మిగుల విస్మయముఁ బొంది, వీనికి విద్యయందు నక్కఱ పుట్టినది, ఇంకఁ బ్రోత్సహించిన బాగని తలఁచి నాయనా నీకుఁ బుస్తకములు కొని యిచ్చెదను, అనిచెప్పి యాచార్యుల మూలముగా నిచ్చెను. చిన్నయ్య కొద్దిసంవత్సరములలోఁ గావ్యములను ముగించి తండ్రిగారియొద్ద వ్యాకరణముం జదువుటకు మొదలిడియెను. అపుడు చిన్నయ్యగారితండ్రిగారిని "ఈస్టిండియా కంపెనీసుప్రీముకోర్టునందు" న్యాయశాస్త్ర వేత్తగా గాజుల లక్ష్మీనరసింహము శ్రేష్ఠిగారి ప్రోద్బలమున నియమించిరి. చిన్నయ్య తన తండ్రియొద్ద అఱవము, తెనుఁగు, ప్రాకృతగ్రంథములును వ్యాకరణమును జక్కఁగ నేర్చుకొనియెను.

కంచి రామానుజాచార్యులయొద్ద, తర్కము, మీమాంసము, అలంకారమును నేర్చికొనిరి. ఈమధ్య నుత్తరదేశమునుండి వచ్చి నరసింహశ్రేష్ఠిగారి యొద్ద నెలకొని యుండిన రామశాస్త్రులవలన వేదమును వేదార్థమును గ్రహింపఁగాఁ జిన్నయయందు వారికిఁ గలిగిన శిష్యవాత్సల్యముచే నాశాస్త్రులవారు, హయగ్రీవమంత్రము నుపదేశించిరి. చిన్నయగారికి హయగ్రీవమంత్రముసిద్ధియై యుండెను. 1836 సంవత్సరమున వీరి తండ్రి గతించిరి. అప్పుడు వారికి 110 సంవత్సరములు.

చిన్నయ గీర్వాణాంధ్రద్రావిడములందు విశేషప్రజ్ఞ యుండుట చేతను గొంచెముగా నింగ్లీషు తెలిసియుండుటచేతను వేదము వేంకటరమణశాస్త్రులు గమనించుచుఁ దర్కవ్యాకరణములయందుఁ బ్రశ్నించుచు నుండెడివారలు. మఱియుఁ దమ గ్రంథములను జనుప్రటకై సూరిగారికి సహాయ పడుచుచుండెడివారలు. వీ రిరువురు సహపాఠులు. ఇటులఁ గొన్ని దినంబులు గడచెను. వీరికి వీరితల్లిగారికి భోజనవసతులు మిగులఁ గష్టమయ్యెను. ఆప్టర్ మిషన్ బడియందు, కొద్ది వేతనమున నుపాధ్యాయులుగా నుండిరి. వీరి కింగ్లీషునందు, పరిచయ ముండుటచేత నప్పటి పాదరీలు కొందఱు, గొప్పయింగ్లీషు ఉద్యోగస్థులు మి. బ్రౌను మొదలగు వారలు, వీరియొద్దఁ బాఠములు నేర్చికొనుచుండెడివారు. అప్పటి పరీక్షాధికారులు చిన్నయసూరి శిష్యులను బరీక్షింపఁగాఁ దర్క వ్యాకరణ కావ్య పాఠములందును, ఆంధ్రంబునను, ద్రావిడంబునను విశేషప్రజ్ఞగలవారై యుండిరి. సూరిగారి కీపదవి చాల దనియు పచ్చయ్యప్పగారి కాలేజీయందు ప్రధానపండితులుగ నుండునట్లును నొకకమ్మ వ్రాసి శ్రీనివాస పిళ్లెగారికిఁ బంపఁగా వారు మిగుల సంతసించి సూరిగారిని తమబడియందుఁ బ్రధానపండితునిగా నియమించుకొనిరి. కొన్ని సంవత్సరములు పచ్చయప్ప మొదలియారు కాలేజిలో వీరు పనిచేసిరి. 1845, 46, 47, 48 సం॥ వఱకు నచట నుండినట్లు పచ్చయ్యప్పగారి కాలేజీ రిపోర్టు 1847—48 సూచించుచున్నది. వీరు 1844 సం॥న పచ్చయ్యప్ప మొదలియారుగారిపై వ్రాసిన పద్యములు శ్రీపచ్చయ్యప్ప నృపయశోమండనమును గూర్చియు వీరు రచించిన పెక్కు గ్రంథములనుగూర్చియు నీపరిషత్పత్త్రికలయందును బాఠకులుచదివియేయుందురు.

చ. ద్రుపదుఁడు శుల్కదాత కతఁడు న్నుతనంచుఁ బ్రతిజ్ఞఁజేసె మీ
నృపుఁడు కులంబు శీలము గణింపఁడ యెక్కిడి విల్లు లక్ష్యము
న్నిపతితముం బొనర్చె నటు నేర్చు మహాత్ముఁడు గెల్చెఁ గృష్ణ భూ
మిపసముదాయమధ్యమున మేదినినాథుఁడు నేఁసు దీనికిన్. ౬౫

మ. పరితాపంపడఁజెల్ల దీనృపతికి న్వాంఛ ల్ఫలించె న్నను
ష్కర మూవి ల్నగుణంబు దుర్బలునకుం జక్కన్వివర్ధింప నో
ధరణీనిర్జర హీనజాతికి నసత్రజ్ఞాని కిల్లక్ష్యము
న్ధరపైఁ గూల్ప నశక్య మిట్లనుచునుండ న్వచ్చి రాజాజ్ఞచేన్. ౬౬

—పెండ్లివారిని భోజనమునకుఁ బిల్చి వివిధవస్తువుల వర్ణపరీక్ష చేయుట.—

మ. వడి వేఁజొక్కఁడు సిద్ధమన్న మ' తెల్ప న్స్నాత జనార్యర్ద మి
ప్పుడు గృష్ణంగయికొం డొనర్పుఁ డుచితమ్ము ల్వేగ నచ్చోటఁ బు
త్తడినెత్తమ్ముల నబ్బురమ్ములు పరార్థ్యమ్ము ల్రథమ్ము ల్తగు
న్బుడమిం బ్రోచెడువారి క్కెక్కి యివి చెందుండా నృపాగారమున్. ౬౭

క. అనినఁ బురోహితు ముందిడి
కొని యరదము లెక్కియెల్ల కురుసింహులుకుం
తి నృపాత్మజ యొకయరద
మ్మున రాఁ జని రెటుఁగవారి భూపతిగూర్చెన్. ౬౮

సీ. పలువస్తువులుఫలమ్ములుమాల్యములు మేలికవచముల్గాళ్ళుఖడ్గములుత్రాళ్ళు
బీజము ల్గోవులు విండ్లు నమ్ములు పీఠములు సెజ్జలు తురంగములు రథములు
రణకృషిక్రీడాకరణములు కృష్ణతోఁ బృథసొచ్చి పార్షదస్త్రీగృహంబు
మానితయమ్యో విస్మయసంశయమ్ములు విడిచి యుత్పీఠోపవిష్టులైరి
పాండవులు వారి నాజాను బాహులఁ గని
రాజు మంత్రులు మిత్రులు ప్రజలు నలరి
రన్న మవనీశభోజ్యము హైమరజత
పాత్రముల భోజకులు వేషభాసు లిడిరి. ౬౯

గీ. తుష్టి గని వారలందు యథేష్టభుక్తి
గైకొనిరి యొండు విడిచి సాంగ్రామికంబు
కని యదందురు రాజనందనమనీషఁ
జెంది యానందమందుచుఁ జేరి రంత. ౭౦

మ. అవనీనేత యుధిష్ఠిరుం బిలిచి విప్రార్థంబుగావించి గా
రవముం, బల్కె నెఱుంగువార మెటు, మీర ల్రాజులో విప్రులో
సవనాగ్నిప్రభవాదిదృష్టధరణీసంప్రాపులో దివ్యులో
వివరింపం దగు, సంశయాంతమున సంప్రీతాత్మతం గందుమే. ౭౧

క. చెప్పుము తథ్యము నృపులం
దొప్పును సత్యంబు యాగయోగముకంటెం
జెప్పఁ దగు సత్యమాపయిఁ
దప్పక యొనరింతు సముచితవివాహవిధిన్. ౭౨

—( ధర్మరాజువచనమునఁ బాండవు లని నిశ్చయించి ద్రుపదుఁ డర్జునుఁ గూఁతుం బెండ్లాడ గోరుట. )—

సీ. పలికె ధర్మరాజు పాంచాల! వగవకు ఫలియించె నీకోర్కి పాండుసుతుల
మేము నే జ్యేష్ఠుఁడ నీయిరువురు భీమవిజయులు నీసుత వీరు గెలిచి
రుర్వీశ సభఁ గృష్ణయున్నచో నున్నది కుంతి సత్యం బీవు గురువు మాకు
ననఁ బార్షదుఁడు సంమదాతిరేకంబునఁ బలుకఁజాలక సుంత నిలిచి పలికె
భూపనందన జతుగృహముక్తు లైతి
రెట్లు, నా సర్వముం దెల్ప నెఱిఁగి యాఱ
డించె ధర్మతనూజు, నిందించె ధార్త
రాష్ట్రు, రాజ్యము సాధింపఁ బ్రతినఁ జేసె. ౭౩

గీ. పిదపఁ గుంతియుఁ గృష్ణయు భీమవిజయ
నకులసహదేవు లాభవనమ్ము సొచ్చి
రనియె సంతుష్టుఁ డై నృపుఁ డర్జునుండు
నాతనుజ నేఁడె పెండ్లాడిన నగు ముదము. ౭౪

చ. నరపతిఁ బల్కె ధర్మజుఁడు నాకును బెండిలి సేయఁగాఁ దగున్
గరము గ్రహింపు నీవయినఁ గన్నెకు నెవ్వనికిఁ దలంతువో
పరిణయ మాచరింప జరపం దగు నందఱ కౌను రాణి యో
నరవర మాకు నీసుత యనంబడె మున్నిటు మాకుఁ దల్లి చేన్. ౭౫

గీ. నేను మారుతియును బెండ్లిగానివార
మర్జునార్జితరత్న మేమందఱకును
భోజ్య మగు, రత్నసహభోగము వ్రతంబు
పూనితిమి మా ప్రతిన వీడఁ బుట్ట దిచ్చ. ౭౬

గీ. మాకు నందఱకును ధర్మమహిమ. కృష్ణ
యగుఁ గ్రమంబునఁ బాణిగ్రహంబు జరగు
నెల్లరకుఁ నగ్నిసన్నిధి; నిట్టు లనిన
ధర్మజుఁడు, పల్కెఁ బంచాలధరణివిభుఁడు. ౭౭

క. బహుమహిషీపతిభావము
విహితం బొకపురుషునకి; వెలఁది కొకతెకు
న్బహుపురుషవల్లభాత్వము
తుహినాంశుకులాంబునిధివిభూ! విన మెందున్. ౭౮

క. బుద్ధియెటు లోకవేదవి
రుద్ధ మధర్మం బొనర్పఁ బ్రోత్థిత మయ్యె
న్సిద్ధుఁడవు ధర్మవిద్యఁ బ్ర
సిద్ధుఁడు నగునీకు, ననిన, క్షితినాథునితోన్. ౭౯

సీ. పలికె ధర్మసుతుండు పార్థివ ! సూక్ష్మము ధర్మ మెఱుంగము దానిమార్గ
మనుసరింతుము పూర్వు లాశ్రయించిన తెర్వు నావాకు మృషవదేనాఁడుకల్ల
మదియధర్మముఁదగులదు మాజనని యిట్లెపలుకుచున్నది నాదుభావమునిదె
ధర్మమియ్యది వసుధాపతి నిక్కము సంశయింపక యిట్లు జరపు మధిప
యనిన ద్రుపదుఁడు పల్కె ధర్మాత్మజాత !
యీవు మీతల్లి నీసుతుఁ డీరలరసి
కృత్య మెఱిఁగింపుఁ డట్టులు రేపొనర్త
మనియెఁ జనుదెంచె నీశేచ్ఛ వ్యాసమౌని. ౮౦

—( వ్యాసమహాముని, పూర్వచరితలు చెప్పి దివ్యదృష్టియిచ్చి పంచేంద్రుల నిందిరంజూపుట. )—

క. ఎదురు సని మ్రొక్కిరప్పుడు
ముదమునఁ బాండవులు ద్రుపదభూమీపతియు
న్విదితచరిత్రుం గృష్ణు
న్నది నలరుచు సేమ మడిగి మౌనీంద్రుండున్. ౮౧

గీ. కనకపీఠోపవిష్టుఁడై యనుమతింపఁ
గూరుచుండిరి యెల్లరు, క్షోణిరమణుఁ
డడిగె మధురోక్తి నెట్టులిల్లా లొకర్తు
పెక్కుపురుషుల కగుఁ దెల్పవే! మహాత్మ. ౮౨

గీ. ఈవిరుద్ధధర్మ మే వారికెటులు తోఁచు
నో వినంగవలతు నుడువుఁ డొక్కఁ
డొక్కఁ డనినఁబలికె నుర్వీశ్వరుఁ డధర్మ
మిది తలంతునే మునీంద్రచంద్ర. ౮౩

చ. పలువుర కొక్కరామ లగుట బ్రాహ్మణసత్తమ యొందు లేదు, పూ
ర్వులు మహాసీయు లీయ దెవరుం జరియింపర, యెల్లధర్మముం
జలుపఁగలారు పండితులు, సందియ మిందెపుడయ్యె మాకు నేఁ
దలఁప నొనర్ప నీక్రియ, మతంబు వచించె నృపాలపుత్త్రుఁడున్. ౮౪

గీ. చిన్నవానిభార్యఁ బెద్ద సద్వృత్తుఁడు
నెనయునెట్లు విప్రవృషభ! యెఱుఁగఁ
దరమె మాకునిది, యధర్మమో ధర్మమో
నృపతి యేవ్వర కిడ నేరఁడు సుత. ౮౫

మ. అనియె న్ధర్మసుతుండు నాపలుకు సత్యంబే యధర్మమ్మన
న్మనము న్నిల్వదు, నామతం బిది యధర్మం బెట్టునుంగాదు ము
న్మునుల న్గౌతమి యేడ్వుర న్జటిలయు న్మన్యుక్షయావార్క్షి పా
వనులం బదురఁ బెండ్లియాడె, నని చెప్పన్వింటిఁ బౌరాణికుల్. ౮౬

గీ. గురువులెల్లరలో మించు గురువు తల్లి
యామెవచన మలంఘ్యము, యనుభవింపుఁ
డందఱనె నంబ కావున నధికధర్మ
మిది దలంచెద ధర్మవిదీడ్యబోధ. ౮౭

గీ. కుంతియనె ధర్మజుఁడు ధార్మికుండు పలికె
నెట్లు, లిదియట్లె, భయము నాకెంతో యనృత
మునకు నేగతి ననృతవిముక్త నాదు
ముని యనియె, భద్ర! యనృతవిముక్త వగుదు. ౮౮

గీ. ఇది సనాతనధర్మము నెల్లరువినఁ
జెప్ప రమ్మని పాంచాలుఁ జేతఁబట్టి
చొచ్చియంతర్గృహము వ్యాససూరిమహితుఁ
డేకదయితత పెక్కురకెట్లుచితమొ. ౮౯

సీ. మును నైమిశారణ్యమున దేవసత్త్రము నందు యముఁడు దీక్షనంది మనుజు
లందు నొకని నేని మ్రందింపఁ డయ్యె, నాకతము న్మనుష్యమరణహీనత, నరులకు,

బహుళత గలుగ దేవతలు శక్రాదులు వనజసంభవుఁ గాంచి పలికి రిట్లు
భయపడి మనుజుల వలనసుఖాపేక్ష శరణుఁ జెందితి మన స్రష్టపలికె
నమరులకు మర్త్యులవలన ననుచితమ్ము
భయము నరులు నమరులైరి బమ్మ! మావి
శేష మర్థించి యిచటికిఁ జేరితి మన
యముఁడు కృతకృత్యుఁడైన మే లగునుమీకు. ౯౦

క. విని పూర్వజువచనమ్మం
జని సత్రము పట్టు సురలు, జాహ్నవియందుం
గని పుండరీక మచ్చెరు
వున నిలిచిరి శక్రుఁ డేగి పూఁబోఁడిఁ గనెన్. ౯౧

గీ. పావకప్రభ యాయోష వారిగోరి
వగవజలపతితము నేత్రవారికణము
స్వర్ణపంకజ మయ్యె విస్మయముఁ జెంది
శక్రుఁ డడిగెను గతము విషాదమునకు. ౯౨

చ. అనిమిష సరోరుహాక్షి తెలియఁగల విష్వడె యేనేవర్త, రో
దనము నిమిత్త మేదొ చనెద న్మరు రమ్మన వెంబడించి కాం
చెను గిరిరాజశృంగమున స్త్రీయుతుఁ బాచికలాడువాని యా
వనిఁ బలికె న్విమూఢ! గరువంబునఁ గానవు లోకనాయకున్. ౯౩

చ. కినిసినశక్రు నవ్వి తిల కించె నొకించుక దేవి తన్నిరీ
క్షణమునఁ జేష్టఁ దక్కై దివిషత్పతి దేవిని దేవనాంతమం
దనెఁ గొనిరమ్ము వీని వరి కందక పోవుతఁబో త్రమన్నఁ దాఁ
కనె శ్లథగాత్రుఁడై పడిన గర్వము మానుమిఁక న్నగుండనెన్. ౯౪

తరల. అతిబలుండవు నీవు వాసవ! యద్రిశృంగ మిదెత్తు నీ
ప్రతి రవిద్యుతు లింద్రు నల్వురు వజ్రి నాగిరి మెత్తి త
ద్గతుల నన్యుల నాత్మతుల్యులఁ గాంచి దుఃఖితుఁ డయ్యె వీ
రితుల నాకగునో యటంచు వివృత్తలోచనుఁడై రుషన్. ౯౫

మ. అనలాక్షుం డనె యింగుహాం జొరుము దేవాధీశ! మోహమ్మున
న్ననుదూషించితి మున్నన న్విభుఁడు దైన్యాన న్వణంకె న్నగా
శనపత్రం బనిలాహతిం బలె నమస్కారంబుగావించి నేఁ
డినుఁ డీవన్నఁ బ్రహాసభాసి యయి యాదృక్కీలు రీపుట్టునన్. ౯౬

గీ. అనుభవింపరు మిగులునీయట్టివారె
వీరు మీరెల్లమనుజులై పృథివిఁబుట్టి
కృత్యముల దుష్కర్మ్ములగీటడంచి
యరులఁబెక్కండ్రు సురలోకమందఁగలరు. ౯౭

క. సురపతు లనిరి హరా భువి, కరిగెదము యమానిలేంద్రు లశ్వులు మాకు
స్సురులగుత గెల్చినరుల, స్వర దివ్యాస్త్రములఁజేరెదము సురపురమున్. ౯౮

చ. వరములొసంగె శంకరుఁడు వారికి నిందిరఁ బత్నిఁజేసె నీ
శ్వరుఁడు గన న్నారి జ్జనియె వారలతోడనె చక్కఁబర్చె శ్రీ
ధరుఁడదియంత నొల్లరును ధారిణిఁ బుట్టిరి శుక్లకృష్ణము
ల్శిరసిజము ల్దాంచె సరసీరుహనాభుఁడు నప్పమాయచేన్. ౯౯

క. వసుదేవుదేవి దేవకి, యసితోత్పలనేత్ర కృష్ణు నానకదుందు
భ్యఘునాయిక రోహిణిబలు, నసితసితశిరోభవములనందిరిసుతులన్. ౧౦౦

క. ఆయింద్రులైరి పాండవు, లీయింద్రునియంశ మయ్యెఁ గృష్ణుఁడు లక్ష్మీ
తోయజముఖి తద్దేహిని, యామె న్ద్రౌపదిసవాగ్ని నవ్య పొడమునే. ౧౦౧

గీ. చంద్రసూర్యప్రకాశము సంభవించు
రూపమెటులౌవి ప్రసరించుఁ గ్రోశమాత్ర
మన్యకొసఁగెద నీకు దివ్యంపుదృష్టి
గనుము కౌంతేయులను బూర్వతనురుచిరుల. ౧౦౨

క. వ్యాసప్రసాదమున నా, భూసుత్రాముండు గనియెఁ బురుహూతవపు
ర్భాసురుల వారిసుదతి, వ్యాసదృశిఁ దద్వ్రాఁ గాంచి యద్భుతమందెన్. ౧౦౩

క. కని యాయత్యద్భుతము, జ్జననాథుఁడు మోదమంది సత్యవతీనం
దను పదములపయిఁబడియనె, మునియిదినీయందుఁగాదపూర్వమున్నృపతీ.

చ. ఒకమునికన్నె రూపవతి యుం బతిగానక శంభుఁగూర్చి యో
పికఁ దపమాచరింపఁ గడుఁ బ్రీతి నుమారమణుండు తోఁచి కో
రికఁ జెపుమన్న నాఁకొనిన రీతిని సర్వగుణాఢ్యు నిమ్మునా
కొకపతి నంచుఁ బల్కె మఱి యున్నటియు న్నవని యీశుఁ డాదృతిన్. ౧౦౫

చ. అపుమరు భర్తలేవురు శుభా! యన వేఁడుచు దేవుఁ బల్కెనో
భవ ! యొకభర్త నాకగుట పాడి భవద్దయ నన్న నైదుమా
ర్లు పలికి తిమ్ము భర్త నని రూఢిగ నేవురు వేరుపుట్టున
ద్ధవు లనె నయ్యె నీతనుజ తన్వి య దేవురక ల్నాపత్నిగాన్. ౧౦౬

క. జన్నమునఁ బాండుతనుజుల, యున్నతికిం బాడమినట్టి దుశ్శ్రీయగు నా
పున్నెపుఁగని నీసుత యిది, విన్నపిదపఁ జేయుమిష్టవిధి భూపుఁడనెన్. ౧౦౭

గీ. వినక మీపల్కు తలఁచితి వేరుసేయ
విహితము తొలఁగ నెఱిఁగియావిధియెకూడె
దైవబంధము తొలఁగంగఁదరమె పురుష
కృత్యమున కించుకేన్నల మిందులేదు. ౧౦౮

గీ. యతన మొనరించినాఁడవనైకఫలము
కృతి యదేసిద్ధమిటుగోరెఁ గృష్ణ పెక్కు
పతుల హరుఁడిచ్చె దేవుఁడు పరమమెఱుఁగు
శంకరకృతంబునకు మాకుశంక యేల. ౧౦౯

ఉ. ఇచ్చితిఁ గృష్ణఁ బాణిగ్రహియింతురు గావుత వీరు కోవిదు
లెచ్చన నన్యుధిష్ఠిరు నమేయతపోనిధి పల్కె ముందు నీ
విచ్చపలాక్షిఁ బెండ్లియగు మిందుఁడు పుష్యముఁగూడె నేఁడె యో
సచ్చరితా! సపుత్త్రుఁడు రసాపతి గూర్చె సమస్తవస్తువుల్. ౧౧౦

శా. రావించె న్సుతఁ గృష్ణ నాప్లుతఁ గనద్రత్నోజ్జ్వలాంగి, న్ధరా
దేవు ల్మిత్రులు మంత్రులు న్పరిణయర్ధింజూడనేతెంచి రు
ర్వీవాస్తోష్పతి మందిరమ్ము మెఱసె న్విస్తీర్ణ మచ్ఛాంబుజ
శ్రీవిభ్రాజితము న్సితోడుకలితార్చి న్నింగిఁ గ్రీడించుచున్. ౧౧౧

ఉ. పూరుకులప్రదీపులు విభూషితు లుజ్జ్వలకుండలు ల్యువ
ల్చారుతరాంబరు ల్మలయజద్రవచర్చితు లంబుధౌతు లా
చారపరాయణు ల్జ్వలనసంనిభుఁడాత్మపురోధ ధౌమ్యుఁడు
న్ధారిణినాథుగీము ప్రమదంబునఁ జొచ్చిరి మెచ్చ నెల్లరున్. ౧౧౨

— యుధిష్ఠిరాదులు ద్రౌపదిఁ బెండ్లియాడుట. —

క. ఆవేదవేది యాహితుఁ, బావకు మంత్రముల వేల్చి పావకజాతం
బావనిఁ గూర్చె యుధిష్ఠిరు, నావరవధువుల ధృతాగ్రహస్తాంబుజలన్.

క. వలగొలిపి వహ్ని విబుధుఁడు, సెలవిడి వీరునకు వెడలె క్షితిపతిగృహము
న్నలి నీవరుసనె రాజసుతులు పరిణయ మైరి పార్షదునిసుతఁ బ్రణుతన్.

క. ప్రతిదిన ముత్తమరూపా,శ్రితులు కురూద్వహులు విజయశీలు రిదియు న
ద్భుతమయ్యెఁ గన్య యేన,వ్రతయన్వహమిట్లు విబుధతాపసుఁడనియెన్.

చ. పరిణయమైన పార్థులకుఁ బార్షదుఁ డిచ్చె ధనంబు నూఱునూ
అరదముల న్గజమ్ముల హయమ్ముల జోదుల మేలిదాసుల
న్దరుణుల భూషణాంబరగణమ్ముల నింద్రసమాను లాధరా
వరపురిభూరిరత్న మగువం గని చెంది రఖండభోగముల్. ౧౧౬

గీ. వేలుపులకేని వెలవిడె విందులాటఁ, బాండుతనుజులు పాంచాలపార్థివుండు
క్షోణినాథునిరమణులు కుంతిపేరు, కొనుచుఁ దత్పదముల నిడికొనిరి తలల.

క. వినయమున మ్రొక్కె నత్తకు, జననాథతనూజ శీలసౌందర్యవతి
న్ఘనలక్షణఁ గోడలిఁ గూ, ర్మినిటు దీవించెఁ గుంతి కృష్ణ! పతులకున్.

క. హరికిఁ బులోమజ వైశ్వా, నరునకు స్వాహావధూటి నక్షత్రగణే
శ్వరునకు రోహిణి నలునకు, వరగుణ దమయంతి విశ్రవఃపుత్రునకున్.

సీ. భద్ర, వసిష్ఠతపస్వి కరుంధతి నారాయణునకు శ్రీనారి వోలె
నీవగు పేరారణివి బహుసుఖయుత సహధర్మచారిణి చక్కఁబ్రోవు
మతిథుల సాధుల నభ్యాగతుల గురువృద్ధబాలుర నెప్డు విమతవిజయి
దయిత సహాభిషిక్తవు హయమేధమహాక్రతువిప్రదత్తావని వగు
మచలఁగలయెల్లరత్నములందిభద్ర, సుగముగామనునూఱేండ్లఁజూచిసుతులఁ
గన్ననిను నలరెద నింతకంటె మిగుల, సఫల నిశ్చలగుణజాలశాల! బాల!

క. హరి యొసఁగె రత్నభూషాం, బరకంబళకృత్తిశయనభాజనకోటిం
గరితురగరథపదాతుల, మురరిపుఁ డలరంగ ధర్మపుత్రుఁడు గొనియెన్. ౧౨౧

శ్రీరస్తు.

# విచిత్ర చమత్కారరసమంజరి.

—: సత్యవోలు సోమసుందర కవి ప్రణీతము. :—

---

దైవప్రార్థనము - పార్వతీపరమేశ్వరులు.

ఉ. శ్రీకరులు స్సదాశ్రితవశీకరులు స్సకలాకలాపశో
భాకరులు న్దయాకరులు భావుకదాయకనవ్యభవ్యది
వ్యాకృతులు న్మహాత్ములు మహామహిమాన్వితులు న్యశోలతల్
ప్రాకఁ నుమామహేశ్వరులు భద్రగులై మముఁ బ్రోతు రెయ్యెడన్. ౧

గీ. పరమశివుఁడగు నామరూపముల నెవఁడు
మహిమ నేదేవియును సర్వమంగళ యగు
వారి నిర్వుర స్మరియించువారి కెపుడు
సర్వకార్యంబులం దగు జయము శుభము. ౨

—శంకరప్రార్థనము—

క. శరణాగతజనభరణా, భరణా కరుణారసాంబువరుణాలయ నీ
శరణును జేరితిఁ గావున, వర మిడి ననుఁ బ్రోవవా శివా చిరవిభవా. ౩

క. నరుఁడను గానమునను గి,న్నరుఁడను మూఢుఁడను ఖలుఁడ నయహీనుఁడ వా
నరుఁడను గుణముల చేతను, వరమిడి ననుఁ బ్రోవవా శివా చిరవిభవా. ౪

క. పరిపోషితనిజదాసా, కరిచర్మసువాస వదనకమలవికాసా
శరదిందుకుంద భాసా, వరపవరపురాధివాస పరమవిలాసా. ౫

—సకలేశ స్తవము—

క. సుందరకవివరహృదయా, నందకర సురాసురాదినందితవిలస
త్కుందసుమసమశరీరా, యిందుధరా మమ్ముఁ బ్రోవు మిఁక సకలేశా.

—అన్నవర సత్యనారాయణస్వామి—

సీ. శ్రీవిశేషములతోడఁ జెన్నారు పన్నగగిరినున్న వేంకటేశ్వరునికన్న
వరదాఖ్యఁ గాని సర్వవైభవమ్ములతోడఁ గరిగిరినున్న శ్రీకరునికన్న
సిరులతో నిరవొందు సింహాచలస్థితిఁ జేకొన్న యలనారసింహునికన్న
వేంకటాఖ్య వహించి విభవోన్నతిని మించి గరుడాద్రిపైనున్న ఘనునికన్న
శ్రితజనవరప్రదానప్రసిద్ధి సలరి, యుక్కలియుగంబునందు నీ వెక్కుడైతి
యన్నవరరత్నశిఖరిపై నున్నఘనుఁడ, సత్యనారాయణాభిధ నిత్యశుభద.

—కవితాధిక్యత—

సీ. సరసాంధ్రగీర్వాణసరసభాషలు రెండు పరివృద్ధి యగుటకుఁ బాదుకొలిపి
జ్ఞానబీజంబును మానుగా నట నాటి సంగీతరసమును జల్లుచుండి
బహుళసాహిత్యమ న్వృత్తుఁగ ల్గ్రుసుటించి పఠనపాఠము లనుబందిరి నిడి
వరకవితాలతం బ్రాఁకున ట్లొనరింప భూరియశం బనుపూలు పూచి
సరసమాధుర్యమృదుశైలిసంక్రమించు,రమ్యపద్యాళిబీజాక్షరములు వెలయ
భవ్యకావ్యంబులనియెడు ఫలములొసఁగు, ధరణినెల్లెడఁగవితాలతామతల్లి.
ఉ. కావున సంస్కృతాంధ్రములు గ్రమ్మఱ వృద్ధిని జెందునట్లుగా
భావితహూణభాషఁగొను వారల కుంచినపాఠశాలలన్
భావుకలీలతో నిపుడు వానికి వ్యాకరణంబు తోడుగా
నేవిధినైన బాలురకు నిప్పుడు దప్పక చెప్ప టొప్పగున్. ౯
ఉ. ఆతతసర్వశాస్త్రములు నంచితగానము మంచివైద్యమున్
దాతలఖ్యాతి నీతియును ధర్మము నేర్చినవిద్యలన్నియున్
భాతిగ వార లున్నపుడె వన్నెయు వాసియుఁ గాంచి మించుఁ ద
ద్రీతులు వారితోడనె గతించును సత్తవు లెంచి వ్రాయు వి
ఖ్యాతచరిత్రము ల్నిలుచుఁ గానఁ గవిత్వమె శాశ్వతం బగున్. ౧౦

—బాణబాణసుతులు—

సీ. ఏమహాకవిసార్వభౌముఁడు సుకవీంద్రహృదయబాణనిరూఢి నేపుచూపె
నేమహాకవిసార్వభౌముఁడు లోకస్వభావంబు వర్ణించుప్రౌఢిగాంచె
నేమహాకవిసార్వభౌముఁడు కవితచే జగమెల్ల నుచ్ఛిష్టముగ నొనర్చె
నేమహాకవిసార్వభౌముఁ డత్యద్భుతకల్పనాకావ్యసంఘటన మించె
నట్టిప్రతిభావిశేషవిఖ్యాతిసాంద్రు, సరసకీర్తిజితామరసామజేంద్రుఁ
బ్రబలతరశాస్త్రవాదివారణమృగేంద్రు,నిద్ధగుణరుంద్రు బాణకవీంద్రునెంతు.
క. బాణునిసుతుఁ డతులితమృదు, వాణీచాతుర్య కావ్యవాగ్గుంభనచే
జాణయయి వెలసె నహహా, రాణించుతుపాకికిని ఫిరంగి జనించెన్. ౧౨

—అరిశాణఫాల వేంకటాధ్వరి—

చ. కరమరిశాణఫాలకులకంధిమనోజ్ఞశశాంక వేంకటా
ధ్వరివరవాక్సుధారస ముదారత వీనులఁ గ్రోలువారికి
ద్ధర ననిమేషభావ మమృతత్వము నవ్విబుధత్వ మబ్బుచో
సురలు విషానుజామృతముఁ జూఱగ జుఱ్ఱుట కేమి వెఱ్ఱియో. ౧౩

చ. అనిశము మోదముం గువలయంబునకుంగలిగింప లేనిదు
ర్జనము నొందుచుండెడు నిశాపతి దెట్టికలాభివృద్ధి యం
చనిశము మోదముం గువలయంబునకుం గలిగించుచుండె నా
ఘనుఁడగు వేంకటాధ్వరివిగా కవిలోకకలాకలాపముల్. ౧४

—బమ్మెర పోతరాజామాత్యుఁడు—

ఉ. చారుతరోక్తి భక్తివిలసద్గుణయుక్తి కవిత్వమాధురీ
భారపరీతరక్తి గొని భాగవతాఖ్యమహాపురాణముల్
ధీరతఁ దెన్గొనర్చిన సుధీమణి బమ్మెర పోతర్యాట్కవిన్
సారెకు నెమ్మనమ్మునను సన్నుతిచేసి భజింతు నెంతయున్. ౧౫

—రామరాజభూషణుఁడు—

చ. సరసకవిత్వమాధురియుఁ జక్కని శైలియు గీతచాతురీ
గరిమము గాంచి మంచి యమకంబు లలంకృతులొప్ప మెప్పుగా
వరవసురాట్చరిత్రముఁ ప్రబంధముగా రచియించినట్టి నే
ర్పరి యగు రాజభూషణుఁ బ్రభావవిభూషణుఁ బ్రస్తుతించెదన్. ౧౬

—మూర్తికవి—

చ. ఇలనల యాబళేంద్రు నరసేంద్రునిపై సరసాంకితంబుగా
లలితకవిత్వచాతురిని లక్షణలక్ష్యసమన్వితంబుగాఁ
దెలిపె నలంకృతి యావితతిఁ దెల్లమిగా నిటు లాంధ్రభాషచే
బళిబళి భట్టుమూర్తిఁ బ్రతిభారతి భారతి యైన మెచ్చదే. ౧౭

—కూచిమంచి తిమ్మకవి—

చ. జిలిబిలిముద్దుఁబల్కులను జెన్నలరారెడు గద్యపద్యముల్
గులుకఁగఁ దెల్గుకబ్బములు గూర్చి యశంబును గొన్న మిన్నయా
వలఁతిని గూచిమంచికులవర్యుని సత్కవిఁ దిమ్మనార్యునిం
బలుమఱు నామనంబునను భక్తి దలిర్ప నుతింతు నెంతయున్. ౧౮

—సత్యవోలు భగవత్కవి—

చ. సురుచిరసంస్కృతాంధ్ర పరిశోభితసత్కవనప్రశస్తిభ
వ్యరచితరుక్మిణీపరిణయాదికథాదికసత్ప్రబంధసు
స్థిరతరసద్యశోవిశదదేహు మహామహు మత్పితామహున్
వరమతి సత్యవోలు భగవత్కవివర్యు నుతింతు నెంతయున్. ౧౯

—కందుకూరి వీరేశలింగకవి—

గీ. తావి వెదచల్లుమల్లెపూదండలవలె, ముద్దుఁగుల్కెడు పద్దెము ల్గద్దెములును
దెలుఁగుఁగబ్బములనుగూర్చి వెలయు కందు, కూరివీరేశలింగసుధీశు నెంతు.

—దేవులపల్లి సుబ్బరాయకవి—

1907 ఏప్రిల్ ది 5 తేది—

క. అసమానసంస్కృతాంధ్రవి, లసితాలంకారసుగుణలక్షిత వాణీ
ప్రసరదతిమృదులమధురస,రసకవితాసాంద్ర సుబ్బరాయకవీంద్రా. ౨౧

ఉ. భావుకవేళలందున సభాసదులెన్నఁగ రావురామరా
డ్భూవరుసన్నిధానమున మోదము మీఱ శతావధానముల్
వావిరిగా నొనర్చి బహువారము లొందితి వాదరానులన్
దేవులపల్లివంశజ సుధీమణి భారవి సుబ్బరాట్కవీ. ౨౨

—శొంఠి భద్రాద్రిరామశాస్త్రి—

గీ సరసమృదుశైలి నుభయభాషాకవిత్వ,రచన నేకృతిచతురుఁడైరహివహించె
నట్టికవివరు శొంఠి భద్రాద్రిరాము, శాస్త్రి నెద నెంతుఁ గవితను సన్నుతింతు.

—తిరుపతి వేంకటకవులు - శతావధానము—

చ. తిరుపతివేంకటేశ్వరసుధీద్వయి వేంకటజగ్గరాయభూ
వరుని సభాంతరాళమున భవ్యతర ప్రతిభావిశేషవి
స్ఫురితశతావధానమును బూని యొనర్చుతఱిం దదీయభా
స్వరతరశక్తియుక్తులను బన్నగనాయకుఁ డెన్నఁగావలెన్. ౨౪

చ. సరసపుఁ దేటమాటలును జక్కగ ముద్దులుగుల్కుపద్దెముల్
వరుస రచించుచు న్మెలఁకువం జతురంగము నాడుచు న్ప్రసో
త్తరకథ లాశుధారగను గాన మొనర్చుచు వ్యస్తవర్ణసం
కరమును గూర్చి పల్కుచును గ్రన్నన వేఱొకకొన్ని సల్పి రీ
తిరుపతివేంకటేశ్వరులు ధీయుతు లష్టవిధావధానతన్. ౨౫

శా. ఆర్యుల్మెచ్చ శతావధానకృతపద్యాళ్యాత్తసౌరభ్యసం
ధార్యంబై శతపత్త్రరమ్య మగుచుం దాఁజెల్వునస్నీటి యా
సూర్యాలోకముచేత రంజిలుటచే శుంభద్రమాదేవతా
ధుర్యంబైతగె జగ్గరాయనృపతీ తోరంపు నీకొల్వునన్. ౨౬

మ. వితతప్రజ్ఞశతావధానతయు నేవేళ న్సహస్రావధా
నతయుం గల్గిన వీరి చిత్తమున కేనాళీకనామంబులా

శతపత్రంబు సహస్రపత్ర మనుట ల్సందర్భ మౌఁ గాని స
మ్మతమౌ యెల్లెడ మానసాబ్జమను సామాన్యోక్తి చర్చింపఁగన్. ౨౭

సీ. బహుసువర్ణాధిక్యభాస్వరు లయ్యును సీసపంకలనచేఁ జెలువుగాంత్రు
సత్కవీశ్వరు లయ్యు శార్దూలమత్తేభవిక్రీడితములచే వెలయుచుంద్రు
అనిశంబు వీరు సూర్యాఖ్యను గాంచియు సత్ఫలామోదం బొసంగుచుంద్రు
చెలఁగి ద్విరేఫత్వసిద్ధి నొందియు వీరు చంపకస్వీకృతి సల్పుచుంద్రు
ద్విజకులజులయ్యుగీతాప్తిఁదెలుపుచుంద్రు,సుదినకరులయ్యురాజుచేశోభగాంత్రు
సరస తిరుపతివేంకటేశ్వరకవీంద్రు, లరయ వీరిచరిత్ర మహాద్భుతంబు.

—నందిగాన వెంకయ్యగారు—

సీ. అందందనందమౌ కుందబృందమరందబిందువు ల్చిందినచంద మొంద
సారెసారెకు మీఱి చారుసుధారసధారలుజాఱినతీఱు వఱల
సంగతి గలమరుత్సంగతినిజెలంగు గంగాతరంగసంగతి దనర్ప
సుందరమదవన్నిళిందబృందామంద లలితగానానూనకలనఁ జెలఁగ
రమ్యతానామృతంబున రాలుగరఁగఁ, బల్లవులనెల్ల మోదులు పల్లవింప
రంగురక్తుల గానంబు రహినొనర్తు,గాననీసాటివాని జగానఁ గాన
నందిగానము వెంకయ్య నందితార్య. ౨౯

క. భూలోకనారదుఁడ వని, యీలోకము వినుతిసేయ నిటఁ జెల్లితివౌ
లాలితగీతామృతమీ, వేళను నారదసుచర్య వెంకయ్యార్యా. ౩౦

చ. స్వరములతీఱు మూర్ఛనలసౌరు ఘనంబున మీటు నీటు బల్
సరసముగాఁ జెలంగఁగను సంగతులం గడు రంగు రక్తులం
గరమున వీణఁ బూని మృదుగాన మొనర్తువు గాన సార్థమై
పరఁగె భవద్గృహాహ్వయము బాగుగ వేంకయవైణికాగ్రణీ. ౩౧

—తుమురాడ సంగమేశ్వరశాస్త్రి—

క. గానరసాంబుధిలోఁబడి, మానుగ నీఁదంగ లేక మగ్నుల మగుచో
మానితవీణను నావగఁ, బూని తరించితి గదన్న బుధసంగన్నా. ౩౨

చ. అలరెడు గోటుమీటు కడుహాయి నొసంగెడు పాటనీటు మం
జులగతి రాగసంపదలు సొంపుగఁ బెంపగు రంగుతేటు కే
వలముగ రక్తిపుంజముగఁ బల్లవులందు గ్రహించుచోటు ను
జ్జ్వలగతి మించు నీదగు విపంచిక గీత మొసంగె సంగనా. ౩౩

సీ. ఘనరాగపల్లవుల్ గైకొని హాయిగా వీణవాయింపఁ బ్రవీణుఁ డితఁడు
రంగుమీఱఁగ నల్లరా ల్గరఁగఁగ ఫిడేల్ చల్లగా వాయించు జాణయితఁడు
తనరమందరమధ్యతారకంబులఁ గొని గాత్రంబునను బాడు ఘనుఁ డితండు
ఘనమందరంబు పొల్పడలి ఘూర్ణిలఁ జేయు గతిగడా వాయించు చతురుఁ డితఁడు
జలతరంగిణి మూర్ఛింగు సరసగీత, పేటికాదులు వాయింప వీరుఁ డితఁడు
గాన గానమునకు నిట్టివానిఁ గాన, మనెద రీసంగమేశ్వరుఁ గనినబుధులు.

సీ. కేకికేకారవోద్రేకంబు చాటువ్వన హాయిగాఁ గోయిల ల్గూయుపగిదిఁ
గొదమతుమ్మెదగుంపు రొదసేయు పోలికఁ జిలుకలు కిలకిలఁ బలుకుకరణి
భరతపిట్టలదంట బలుకుచుండెడు భాతి కలహంసకూజితములను బోలె
నలువొందవనభూషణములు ప్లవినపోల్కి రమణీయమగు పికారావమట్లు
వినెడువారల వీనులవిందుగాఁగ, వీణవాయించుటకు మంచి జాణఁ డన నె
సంగితివి సంగమేశ్వరశాస్త్రివర్య, యార్యజననుతగానమాధుర్యధుర్య.

—జంగముకోటయ్యగారు—1911.

క. పాటలుపాడెడువారలు, కోటయ్యలుగలరు గాని కోటయ్య కిలన్
సాటి యగువానిఁ గానము, నీటగుగానమున నిజము నిజము మహేంద్రా !

—తంజావూరు, ఘటమువాయించుశాస్త్రిగారు—

సీ. సురలు దానవులు మందరముచేత మథింప ఘూర్ణిల్లుక్షీరాబ్ధిఘోష యనఁగ
భవుని ప్రదోషతాండవమందు వాయింప రంజిల్లు రుంజలరావ మనఁగఁ
గాలాంబుధరపాళి గంభీరరవముతో నురుతరలీలమై నుఱిమె ననఁగ
వాసవు విజయంబు వాసి మీఱఁగఁ దెల్పు మానిత దుందుభిధ్వాన మనఁగ
భవదతుల గానయుతఘటవాదనంబు, గడఁకశర్కరఁ గూర్చుమీఁగడను బోలె
వీనులను గ్రోలువారికి విందొనర్చె, భవ్యగుణధుర్యులగు విప్రవర్యులార.

—పొట్లచెర్ల సీతారామయ్యగారు—1891—

సీ. ఒకసారె ఘనసారభోన్నతిరహి మీఱు మల్లెపూ లెల్లడఁ జల్లినట్లు
లొకసారె మందారమకరందబిందువుల్ చెలువుగా నెల్లెడఁ జిలికినట్లు
లొకసారె ఘనసారశకలాంచితపటీరనీరంబు లెల్లెడ నెఱపినట్లు
లొకసారె చారుతరోర్మిసంగతి మీఱఁ బర్విన గంగాప్రవాహమట్లు
దనరమందరమధ్యమతారకముల, గీతి సల్పితి వెంతయుఁ బ్రీతిమీఱఁ
బొట్లచెర్లకులాంభోధిపూర్ణసోమ, మహితగుణధామ సీతరామయ్యనామ.

—ఆదిభట్ల నారాయణదాసుగారిహరికథ 1896—

సీ. రంభ దాఁ బుంభావరాజితయై వచ్చి లాస్యంబొనర్చులీలలు చెలంగ
భారతి పుంభావభాసురయై వచ్చి గానంబొనర్చు సంగతులు వెలయ
నారదుం డతులశృంగారవేషతవచ్చి హరికీర్తనము చేయు కరణి మెఱయఁ
బ్రహ్లాదుఁ డల విప్రభావంబు గొనివచ్చి శ్రీహరిని భజించు చిన్నె లలర
జగతి నందఱ కమృతం బొసంగవచ్చు, నలజగన్మోహినీకలాకలితగతుల
రమ్యతరవరహరికథా రచనయందు,నలరితి సెబాసు నారాయణాఖ్యదాసు.

—రావు గోవిందరాయణంగారు—

మ. సరసాంధ్రాధికకావ్యగీతకవిత స్సాహిత్యచాతుర్యముల్
కరుణాపూరితమానసత్వమున నన్గాంక్షించి బోధించు స
ద్గురుని న్రావుకులాబ్ధిచంద్రముని శ్రీగోవిందరాయాధిపుం
బరమాసక్తి మెయి న్నుతింతు మది సంభావింతు నేనెంతయున్. ౪౦

—గ్రంథరచనకుఁ గారణము—

క. సరసాంధ్రకావ్యరచనా, పరిపాకవివేక ధీప్రభావత మత్సో
దరుఁడై వెలసిన కామే,శ్వరరాయనికోరి కలర వ్రాసితి నిటులన్. ౪౧

క. తప్పులు వెదకిన దీనం,గుప్పలుగా నుండవచ్చుఁ గూర్మిని సుకవుల్
తప్పక యొప్పొకటియె కని, మెప్పొనరించుట కొనర్తు మెండుగ వినతుల్.

—కవివర్యునినామధేయాదులు—

సీ. ఘనసాహసౌదార్య గాంభీర్యనిధిసోమరాణ్మంత్రి యేకవిరాజుతాత
నయగుణవిద్యా వినయశాలి వేంకటరాయుఁ డేసత్కవిరాజు తండ్రి
సద్గుణసంతానసంతానవల్లియౌ రామాంబ యేకవిరాజుతల్లి
రావు వేంకటజగ్గరాయాహ్వయమహీంతశేంద్రుఁ డేకవిరాజు నేలురాజు
అట్టి శ్రీ సత్యవోలు వంశాబ్ధిచంద్రు, సరససంగీతసాహిత్యసత్త్వవిత్వ
తత్త్వధీసాంద్రు సోమసుందరకవీంద్రు,ననుగుణకదంబ జగదంబమనుచుఁగాత!

—ఒకదానికొకటి యలంకారము—

సీ. గ్రహతారకాదిసంకలితాంబరమునకు మహితుఁడౌ నంబరమణియె భూష
తావు లీనుచు నెప్డు బావిలో విలసిల్లు పద్మంబునకు మధుపంబె భూష
చాతుర్యసహితమౌ సరసవాణికి లోకహితకరం బైనసూనృతమె భూష
రూపరేఖాదుల న్మిఖిమీఱినసతీమణికిఁ బాతివ్రత్యగుణమె భూష

సంతతము సుమతికిసంతసమ్మెభూష,లలితమధుమాసమునకుఁగోకిలమెభూష
నిండుకొనుసభ కలపండితుండె భూష,గుణగణము లన్నిటికి వితరణమెభూష.

—సంగీతసాహిత్యకలావిహీనుఁడు—

గీ. సరససంగీతసాహిత్యవిరహితుండు,కొమ్ములును దోఁకయును లేక త్రిమ్మరియెడు
దొడ్డపసువె యతం డిల గడ్డిదినక,బ్రదుకుటది పసువులమహాభాగ్యవశము.

—నీతిబోధ—

గీ. విత్త మొసగూర్చుచుండెడు విద్య విద్య
జ్ఞాన మొసఁగఁగఁదగునట్టి చదువె చదువు
తలఁచు దీనుల కిడునట్టి ధనమె ధనము
జనుల కుపకారమును జేయు జనుఁడె జనుఁడు. ౪౬

గీ. సజ్జనులు మెచ్చఁదగినట్టి చరిత చరిత, సంతతైకమతాన్వితజనత జనత
పతి ననుసరించి మెలఁగెడు వనిత వనిత,కమలనయనుని వర్ణించుకవిత కవిత.

—ఆశ్రయదోషము—

గీ. నిర్మలాత్మకు లైనను దుర్మలులను
గూడి మాలిన్యమును గయికొందు రిలను
స్వాశ్రయపుదోషమును జెంది స్వచ్ఛమైన
స్ఫటికమణియును మలినతఁ బడయుఁగాదె. ౪౭

—ఆశ్రయవిశేషము—

గీ. స్వల్ప మగువస్తువైననుజగమునందు,స్వాశ్రయవిశేషమునగౌరవాప్తినెనయు
భవ్యనేపాళభూపతివదనలగ్న, మైనబురదను గస్తురి యనరె జనులు. ౪౮

—చేతికఱ్ఱ—

చ. పసుమృగపన్నగాశ్వఘననారినిశాసమయాంధవృద్ధతా
దశలను సారమేయ రిపు దర్పహతి న్నిరతోపకారి వై
విశదయశంబు గాంచఁగ వివేకిజనావళి పాణినొందు నీ
దశగుణరాజిరాజిలెడు దండమ నీకొకదండ మియ్యెడన్. ౫౦

—సమస్యాపూరణము—

(1) "అంధుం డర్ధనిశం గనుంగొనియె నయ్యర్కేందుబింబంబులన్".

శా. గంధేభప్రభుయాన యొర్తు మణులం గల్పించుభూషాద్వయిన్
గంధంబున్ ధరియించి శీర్షతనువుల్ గ్రాల న్రతి న్విప్రుతో
సంధానం బొనరింప దర్శ యనుచు న్సందేహముం జెందు మో
హాంధుం డర్ధనిశం గనుంగొనియె నయ్యర్కేందు బింబంబులన్. ౫౧

రామునిగుణములు, సింహములరౌద్రత, ఙేసః=చతుర్థికి, కైకొఱకూ=కై, కొఱకు-ఇవి వచ్చును. రామునికై, రాములకై, రామునికొఱకు, రాములకొఱకు, కడమవియు నిట్లే తెలియునవి. ఙసిసః=పంచమికి, వలనః=వలన యనునది, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది. రామునివలన, రాములవలన.

---

నః కౌ ఙసః కు రనితాం మందు ఙిప స్సవిధవర్తినాం మిందు

ఇది నాలుగుసూత్రములు. కౌ=కు అను విభక్తిపరమై యుండిన, నః=న, అనునాగమము వచ్చును. ని అనునది రాను. అనితాం=ఇకారాంతవ్యతిరిక్తము లైన నామములయొక్క, ఙసః=షష్ఠికి, కుః=కు అనునది వచ్చును. రామునకు. సామాన్యాకారమున న్యాగమము వచ్చిన నికారాంతరూప మగుచున్నది, కనుక, అనితాం అనుపర్యుదాసచేత కు రాదు. ఙసఃకిశ్చ-అను సూత్రమున, కి వచ్చును, రామునికి. ఆమ్ రూపమునకుఁ గలదు, రాములకు. ఙిపః=సప్తమికి, అందు=అందు, అని వచ్చును. రామునియందు, రాములయందు; న్యాగమము నంగీకరింపనివారిపక్షమున, నుమ్వోచితః, అని నుమ్ము వచ్చిన రామునందు అని కలదు. స్థానబలమునందు, అందు అనియుఁ గలదు. టాస్-మొదలైన విభక్తిసంకేతములు ప్రాకృతశాస్త్రప్రసిద్ధములు. సవిధవర్తినాం=సమీపవర్తులకు, సప్తమ్యంతము-ఇందు=ఇందు అనునది కలదు. ఇందు భుజించె. ఇందు శయనించె.

---

తోడ సహార్థేటాసః పట్టీతి చ పఞ్చమీ గుణే హేతౌ.
కంటెన్యారాదాదే ర్లోపల నిర్ధారణోద్భవా షష్ఠీ
యొక్కచ శేషేషష్ఠీ విషయనిమిత్తాదిజా తథైవా న్యా॥ ౫

ఈవాక్యత్రయ మాఱు సూత్రములు. సహార్థే="సహాయుక్తేప్రధానే" అనుశబ్దసూత్రమున వచ్చు, టాసః=తృతీయకు, తోడ=తోడ యనునది వచ్చును. శిష్యులతోడ వచ్చె. గుణే హేతౌ="విభాషా గుణే స్త్రియాం" అను శబ్దసూత్రమున వచ్చునట్టి-పఞ్చమీ=పంచమికి, పట్టి ఇతి=పట్టి యనునది వచ్చును. గుణముంబట్టి ధన్యుఁడు, జ్ఞానముంబట్టి ముక్తుఁడు. అన్యారాదాదేః="అన్యారాదాదిషు" అను శబ్దసూత్రమున వచ్చెడుపంచమికి, కంటె=కంటె యనునది వచ్చును. రామునికంటె నన్యుఁడు, వనముకంటెఁ జేరువ. నిర్ధారణోద్భవా="యతశ్చ నిర్ధారణం" అనుశబ్దసూత్రమున వచ్చెడు షష్ఠికి, లోపల=లోపల యనునది వచ్చును. దేవతలలోపల గౌరి యధికురాలు. శేషేషష్ఠీ=

శేషార్థమందు వచ్చుషష్ఠికి, య్యొక్క=య్యొక్క యనునది యగును. అంబయ్యొక్క దాసుఁడు. విషయనిమిత్తాదిజా=విషయనిమిత్తాద్యర్థములం బుట్టిన, అన్యా=సప్తమికి, తథైవ=అట్టిలాగుననే యుండును. హరివిషయము, హరినిమిత్తము, ఆదిశబ్దముచేత సతిసప్తమియును వర్తమానార్థ మయియే యుండును. హరిరక్షించుచుండఁగాను.

---

స్యాదమహాతాం విభక్తౌ సోశ్చము తదుపరి పునర్ముబూ ప్రాచామ్
సోర్లు గిత ఉద్బహుత్వే సమ్బుద్ధౌ నాదితాం జసః కిశ్చ. ౯

ఇది యాఱుసూత్రములు. అమహాతాం=అమహత్తులకు, విభక్తౌ=సప్తవిభక్తులును బరమై యున్నప్పుడును, సోః=ప్రథమైకవచనమునకు, ఆదేశమై, ము=ముః అనునది, స్యాత్=అగును. వనము, ప్రథమైకవచనాదేశము. వనములు, వనమును, వనముచేత-ఇత్యాది, తదుపరి=ఆమూమీఁదను, పునః=తిరుగ, ముబూ=ము, బు అనునవి వచ్చును. అని, ప్రాచాం=పూర్వులయొక్క మతము. వనము + ము, అని యుండిన, మొదటి ము, సున్నయై ద్విత్వమాయెను, వనమ్ము; బు, ఉండిన నట్లే వనంబు అని రూప మాయెను. ఇతః=ఇకారాంతముమీఁద నుండెడి, సోః=ప్రథమైకవచనమునకు, లుక్=లోప మగును. హరి, గిరి. బహుత్వే=బహువచనమందు, ఉత్=ఉకారము వచ్చును. హరులు, గిరులు. ఇతాం=ఇకారాంతములకు, సమ్బుద్ధౌ=సంబుద్ధిపరమై యుండిన, అత్=అదాగమము, న=లేదు. ఓహరి, ఓశౌరి. జసః=షష్ఠ్యైకవచనమునకు, కిఃచ=కి, అనునది యాదేశమై వచ్చును. హరికి.

---

టాదా వితో ననిస్స్యా దీదన్తా ఇద్వదేవ కృతహ్రస్వాః
వికృతౌ క్వచిచ్చ లోపో మోర్దీర్ఘ శ్చాత ఆదిమస్య భవేత్. ౧౦

ఇది నాలుగుసూత్రములు. ఇతః=ఇకారాంతమునకు, టాదౌ=తృతీయాదివిభక్తి పరమై యున్న, నిః=న్యాగమము, నస్యాత్=లేదు. హరిచేత, హరివలన. కృతహ్రస్వాః=అనంతరసూత్రముచేత హ్రస్వముం బొందిన, ఈదన్తాః=ఈకారాంతములును, ఇద్వదేవ=ఇకారాంతములవలెనె యుండును. సేనాని, అగ్రణి. వికృతౌ=తెనుఁగునందు, క్వచిత్=ఒక్కొక్క దిక్కున, మోః=మూకు, లోపః=లోప మవును, ఆదిమస్య=ఆమొదటనుండెడు, అతః=అకారమునకును, దీర్ఘశ్చ=దీర్ఘమును వచ్చును. చకారము వలన వికల్ప మనుట, జంపాలు, జొం

సర్వత్రోదోతోర్వ్వ ర్భవతి మువ ద్దుజ్మహత్పదానాం వా
డుజతౌతు నప్లుతస్స్యా త్సమ్బుద్ధా విత్యుతాం విదుః కేచిత్. ౧౧

ఇది మూఁడుసూత్రములు. ఉదోతోః=ఉకారాంత, ఓకారాంతములకు, సర్వత్ర=సప్తవిభక్తులయందును, వుః=వు, అనునది, మువత్=ము, అనుదానివలెనే, భవతి=అగుచున్నది. ప్రథమైకవచనమున కాదేశ మయ్యును గడమచోటుల విభక్తి దాపయి యును వచ్చు ననుట. గురువు, వస్తువు, ధేనువు, గురువులు, గురువులచేత-ఇత్యాది. ఓకారాంతమునకు, గోవు, గోవుచేత. మహత్పదానాంవా డుజ్-మహత్పదానాం=మహత్పదములకు, వా=వికల్పమున, డుజ్=డుజ్జు వచ్చును. విష్ణుఁడు, విష్ణువు, శంభుఁడు, శంభువు. సమ్బుద్ధౌ=సంబుద్ధియందు, ఉతాం=ఉకారాంతములకు, డుజతౌతు—డుజ్=డుజ్జును, అత్=అదాగమమును, న=లేవు, ప్లుతః స్యాత్=అంత్యవర్ణమునకుఁ బ్లుతమువచ్చును. ఇతి=ఇట్లని, కేచిత్=కొందఱు, విదుః=తలంతురు. ఓవిష్ణూ! 3, ఓశంభూ! 3. ఇందుకుఁ బ్రయోగము వాగనుశాసనులు తామే చెప్పినారు. "జరత్కారూమునిశ్రేష్ఠ"-"జరత్కారు ర్జరత్కార్వా" అని వ్యాసులు చెప్పినారు. కనుక, ఉకారాంతములు, ''కేచిత్'' అన్నాఁడు గనుక విష్ణుండ అనియు నుంగలకు.

---

దీర్ఘాణాం హ్రస్వస్స్యా న్నచ దేశ్యపదే నచైకవర్ణేపి
డా బవిధాత్రాదేరు స్తస్యచ వా తావుభౌ రమేశసమౌ. ౧౨

ఇది యొుఱు సూత్రములు. దీర్ఘాణాం=దీర్ఘములకెల్ల, హ్రస్వః-స్యాత్=తెనుఁగున హ్రస్వమవును. అంబ, లక్ష్మి, కరభోరు. దేశ్యపదే=దేశీయపుఁదెనుఁగునందు, న చ=లేదు. నవలా, నేటా, లకోరీ, ఇత్యాది- ఏకవర్ణేపి=ఏకాక్షరతత్సమమందును, నచ=లేదు. శ్రీ, (శ్రీ), స్త్రీ. డాప్, అవిధాత్రాదేః, ఉః=అవిధాత్రా దేః=విధాత్రాదిగణవ్యతిరిక్తమైన, ఉః=ఉకారాంతమునకు,డాప్=డాప్ అనునది యాదేశము వచ్చును. డాప్ లో డకార పకారములు పోఁగా, ఆ- యని శబ్దశాస్త్రన్యాయమున ఋకారమును గొట్టి నిలువఁగా-కర్త, ధాత. తస్యచ=ఆవిధాత్రాదికిని, వా=వికల్పమున, డాప్వచ్చును. విధాత, మాంధాత. తౌ ఉభౌ=ఆడాబంతౌ ఉడాబంతములు, రెండును, రమేశసమౌ=రమాశబ్ద, ఈశశబ్దములవంటి వౌను. విధాత యనిన రమాశబ్దమువంటిది. విధాతృఁడు, ఈశశబ్దమువలెనే యకారాంతమై యుండును.

---

క్వచి దమహతోఽపి డుజ్ స్యా దేకాదే రమహతాంచడౌవున్న
స్త్రీత్వ బహుత్వే సురాదే రసమాసే లుగ్భవే త్కుశాదే ర్మోః. ౧౩

ఇది నాలుగుసూత్రములు. క్వచిత్=ఒక్కొక్కచోట, అమహతోఽపి= అమహత్తునకును, డుజ్ స్యాత్=డుజ్ వచ్చును. పుట్టినొక్కఁడు, వనమొక్కఁడు. ఏకాదేః=ఏకాదిగణమునకును, అమహతాం చ=అమహత్తులకును, డౌ=డుజ్ పరమై యుండిన, ఉత్=ఉకారము, న=లేదు. ఏకాదులు-ఒక్కండు, మెరియండు, సురియండు, పాపండు, ఇత్యాది. కత్తెఱఁడు, కైరఁడు, జన్నఁడు, అశ్వవాచకములు. వీనికన్నిటికిని, క్వచిదమహతోఽపి డుజ్ స్యాత్, అని డుజ్ వచ్చును. సురాదేః=సురాదిగణమునకు, అసమాసే=సమాసముగానియప్పుడు, స్త్రీత్వబహుత్వే=స్త్రీలింగమును బహువచనమును నగును- సురలు. సమాస మైన భూసురుఁడు. సురాదులు ప్రయోగముచేతఁ దెలిసికొనునది. కుశాదేః=కుశాదిగణముయొక్క, మోః=మూకు, లుగ్భవేత్=లోప మగును. కుశ, దర్భ, హంస, దూత, ఇత్యాది.

---

షష్ఠీవిశేషణానాం ప్రథమాస్యా ద్వ్యవహితాశ్చ సర్వేస్యుః
వికృతౌచ స్త్రీలిఙ్గాః స్త్రీలిఙ్గకసర్వనామధేయాస్స్యుః. ౧౪

ఇదిమూఁడుసూత్రములు. షష్ఠీవిశేషణానాం= షష్ఠ్యంతములయొక్క విశేషణములకు, ప్రథమాస్యాత్ = ప్రథమ వచ్చును. "శిష్టవత్సల గౌరి కాత్రితుఁడ నేను". సర్వే= సర్వవిభక్తివిశేషణములును, వ్యవహితాశ్చ =విశేష్యముతో వ్యవధానము గలిగియును (అడ్డముగలిగియును) నుండును.

గీ. ఆశ్రితావన సురల మున్నంబ ప్రోచె, శంకరునిరాణి నర్చింతు శైలసుతను
ఇందువదనకుఁ బ్రణతి సర్వేశ్వరికిని,యాద్యయం దనురక్తిమాయార్యయందు.

స్త్రీలిఙ్గాః= స్త్రీలింగపదములు , వికృతౌచ= తెనుఁగునందును, స్త్రీలిఙ్గకసర్వనామధేయాః= స్త్రీలింగములైనవిశేషణవిశేష్యములుగలవి, స్యుః= అవును. చకారమువలన సంస్కృత స్త్రీలింగపదవిశేషణములు స్త్రీలింగములే యనుట. గౌరి భక్తవత్సల, గట్టురాపట్టి యాపన్నవరద.

---

ఉభయవిధ మమహతీనాం నియత స్త్రీప్రత్యయస్తు సర్వాసామ్
ఇతరత్ర చ ద్వితీయా తస్యాః ప్రథమాచ జడపదానాంస్యాత్. ౧౫

ఇది నాలుగుసూత్రములు. అమహతీనాం= అమహత్తులైన స్త్రీలింగములకు, ఉభయవిధం=పుంలింగ స్త్రీలింగరూపవిశేషణములు రెండును గలవు.

శరచ్చంద్రిక మనోహరము, పుష్పలత మనోహర- సర్వాసాం= స్త్రీవాచకములైన తెనుఁగు సంస్కృతముల కన్నింటికి, విశేషణములకు, స్త్రీప్రత్యయః= జీప్, జీషులు మొదలైన స్త్రీ ప్రత్యయములు, నియతః=ఆవశ్యకము. శరచ్చంద్రిక తాపాహారిణి, మిన్నేరు శివజటాజూటవాసిని, అంబ సకలజగత్కర్త్రి. ద్వితీయా=ద్వితీయావిభక్తి, ఇతరత్రచ=తనచోటఁగాక కడమవిభక్తులచోటను వచ్చును. హేతిని నఱకెను, తృతీయయందు ద్వితీయ. ద్వారక నున్నాఁడు, సప్తమియందు ద్వితీయ. జడపదానాం=జడపదములయొక్క, తస్యాః =ఆద్వితీయకు, ప్రథమాచ= ప్రథమావిభక్తియును, స్యాత్ = అగును. కొండదిగె, రథమ్మెక్కె- చకారమువలన ద్వితీయయు నుండును. వనమునుజేరి.

---

స్త్రోవావౌ రైనావోః స్త్రీవద్గ్లౌ ర్భూదివోస్తు జౌయత్తత్

వాయిరవు ర్వక్రతమా వృద్ద్వన్ద్వేరః క్వచి ద్గకారోవః. ౧౮

ఇది యాఱుసూత్రములు. రైనావోః=రై శబ్ద నౌశబ్దములకుఁ దుదను, అవావౌ=ఓ కారమును, అవయనునదియు (ఓ + అవ, అవావౌ)స్తః=అగును. రో, నావ- గ్లౌః=గ్లౌశబ్దము, స్త్రీవత్ =స్త్రీశబ్దమువంటి దాను, ఏకాక్షరమై నిలుచు ననుట, గ్లౌ. భూదివోస్తు=భూ, దివ్ శబ్దములకు, జౌ=సంస్కృతములో సప్తమ్యేకవచనమందు, యత్ =ఏరూపమో, తత్ =ఆరూపమే యగును, భువి, దివి. వక్రతమా=ఐ, ఔలు, వా=వికల్పమున, అయి రవుః=అయి, అవు, అని యుండును. కైలు, కయిలు; ఔరా, అవురా. ద్వన్ద్వే=ద్వంద్వసమాసమందలి, ఊః=ఋ కారమునకు, క్వచిత్ =కొన్నిచోటుల, రః=రేఫమగును. మాతృపితృభావనను శైలపుత్రిఁ గొలుతు. కొంద ఱీ క్వచిచ్ఛబ్దము నుత్తరమునకే యన్వయించుకొందురు. గః=గకారము, క్వచిత్ =కొన్నిచోటుల, వః=వకారమౌను. ప్రేగులు, ప్రేవులు; తొగలు, తొవలు; పగలు, పవలు; ఇత్యాది.

---

న్వన్తా న్నామ్నః కుజ్నోర్బహువచనే కుత్రచి న్నులోపశ్చ

నలలో ర్బిన్దుయుతో డుర్వా లులయో ర్లుగపి తయోః పరతః. ౧౯

ఇది మూఁడుసూత్రములు. న్వన్తాత్ =నుకారము తుదయందుఁ గల, నామ్నః=శబ్దముమీఁది, నోః=నుకారమునకు, బహువచనే=బహువచనమందు, కుజ్=కుజాదేశ మగును. జకార మిత్తయిపోయిన, జిత్తు గనుక యర్థబిం

డుయుక్తమగును.*కొలను, కొలఁకులు; కెలను, కెలఁకులు, మ్రాను, మ్రాఁకులు; క్వచిత్=కొన్నిటియందు, నులోపశ్చ=నుకారలోపమును నగును. చేను, చేలు; మీను, మీలు. చకారప్రయోగముచేతఁ గొన్నింటికి లోపము లేదు. మేనులు, కొనులు. లులయోః=లు, ల, అనునవి పరమై యుండిన, సలలోః=లకారయుక్తమైనలుకారమునకు, వా=వికల్పమున, బిన్దుయుతః=సున్నతోఁగూడిన, డుః=డుకారము, వచ్చును. తయోః=ఆలులలకు, పరతః=పరమైయుండెడు, ఉల్లుగపి=ఉకారలోపము నగును. విల్లు, అనులకారయుక్తమైనలూకు విండులు, అని వచ్చును. ఉకారలోపమైన, విండ్లు, అని వచ్చును. వికల్పము గనుక విల్లును గలదు. ముండ్లు, ముండ్ల, ముండ్లమ్రాను, "బహువచనే" అనుపదమనువర్తించుచున్నది.

---

నిత్యం దారాదేశ్చ స్యా ల్లో ర్లులయో రురౌచ తత్రస్తః
రోలో డలటా ముదితాం తస్య చవా లుక్సలోలోశ్చ. ౧౮

ఇది నాలుగు సూత్రములు. దారాదేశ్చ=దారాదిగణముయొక్క, లోః=లుకారమునకు, లులయోః=లులలుపరమైయుండిన, నిత్యం=నిత్యముగాను, బహువచనే=బహువచనమునందు, డుః=డు అనునది వచ్చును. (బహువచనడువర్ణకము లనువర్తించుచున్నవి) దారాదు లనఁగా, ఆలు మొదలైన తెనుఁగు శబ్దములు. తత్ర=ఆదారాదులయందలి, లులయోః=లు, ల, యనువానికి, రురౌచ=రు, ర, యనునవియు, స్తః=అవును. ఆండ్రు, జవరాండ్రు, కోడండ్రు, చెల్లెండ్రు; వాండ్రు, వీండ్రు, విలుకాండ్రు, అనుస్థలములడకారము మునుపే యున్నది. దారాదులలోనివి గనుక రురలు వచ్చినవి. రః=ర అనుదానికి, లులలుపరమైయుండిన, లః=ళకారము వచ్చును. గోరు, గోళ్ళు; ఏఱు, ఏళ్ళు; ఉత్తరసూత్రముచేత, ఉకారలోపమైనది. డలటాం=డ, ల, ట, అను నీమూఁటియొక్క, ఉదితాం=ఉకార, ఇకారములకు, తస్యచ=మునుపటిసూత్రమునందుఁజెప్పఁబడిన, రు అనువానియొక్క యుకారమునకు, వా లుక్=వికల్పముగ లోపము వచ్చును. వికల్పము గనుక గోరులు అనియుం గలదు. రః=అని పొల్లు రేఫ చెప్పినాఁడు గనుక, ఉకారలోపము లేనప్పుడు లకారాదేశము రాదు. పాడి, పాళ్లు; త్రాడు, త్రాళ్లు; అంబలి, అంబళ్లు; చాలు, చాళ్లు; చెట్టు, చెట్లు; పెట్టు, పెట్లు; జట్టి, జట్లు; పోటి, పోట్లు; ఇత్యాది. సలః=లకారయుక్తమైన, లోశ్చ=లుకారమునకును, ఉకారలోపమగును. పందిళ్లోసి, అంబళ్లార్చి.

---

* కొలను, కొలంగ్కులు; కెలను, కెలగ్కులు, మ్రాను, మ్రాగ్కులు-పా.

ఔపవిభక్తికలీనా మిల్లు గ్బహుళం తథైవ డు శ్చ స్యాత్
అపి సంయుక్తసమాప్తో భూయోన్తే లుక్ప్రదృశ్యతే నామ్నామ్. ౧౯

ఇది రెండు సూత్రములు. ఔపవిభక్తికలీనాం=ఔపవిభక్తికములయందలి లి యనునక్షరమునకు, ఇల్లుక్, బహుళం=బహుళముగా, ఇకారలోపమగును. తథైవ=అలాగుననే, డుశ్చ=డుకారమును, స్యాత్=అగును. గుద్దలి, ఇకారలోపమై, డుకారము వచ్చి, గుద్దండ్లు, గొడ్డండ్లు, రోకండ్లు, ఇత్యాది బహుళగ్రహణముచేత, పందిలి-ఔపవిభక్తికమైనను రాదు. పెండిలి-ఔపవిభక్తికము కాకున్నను వచ్చెను. పెండ్లిండ్లు. లుః=లుకారము, సంయుక్తసమాప్తః, అపి=నామాంత్యాక్షరములతో సంయుక్తమై ముగిసి పోయియును, నామ్నాం=నామములయొక్క, అన్తే = తుదయందు, భూయః ప్రదృశ్యతే= మరలఁ గనిపించును. ఇండ్లులు, పండ్లులు, పెండ్లులు-ఇత్యాది.

---

కేషాంచి దుదన్తానాం నేతి విభక్తౌ వునో లుక్స్యాత్
ఔపవిభక్తికనామ్నా మత్వంస్యా త్సప్తమీతృతీయార్థే. ౨౦

ఇది రెండుసూత్రములు. కేషాంచిత్=కొన్నియైన, ఉదన్తానాం=ఉకారాంతములకు, నేతి విభక్తౌ=న, అను సప్తమియందు, ఉనః=ఉన్ అనుదానికి, లుక్ స్యాత్=లోప మగును. (మేరున) చోటున, అనుసప్తమ్యంతమందు, టులోని, ఉకారమును న లోనిపొల్లును గూడి, ఉన్ అగును. దానికి లోపమయిన, "చోట"అని నిల్చెను. ఇటులే, ఊర, నడుమ, మీఁద మొదలైన రూపములు. ఔపవిభక్తికనామ్నాం=ఔపవిభక్తికనామములకు, సప్తమీతృతీయార్థే=సప్తమీతృతీయార్థములయందు, అత్వం స్యాత్=అకారము వచ్చును, విల్లు-అనునౌపవిభక్తికనామమునకుసప్తమ్యర్థమందు, అత్వము వచ్చెను గనుక టివర్ణములోనియికార మకారమాయెను-వింట, ఇంట, మింట, కంట,ఇత్యాది.

---

అనుతాం స్త్రియాం సమానాం సర్వస్య స్త్రీసమస్యచ సులోపః
ఏదన్తతాచ నామ్నా మన్యతరస్యా మియాన్తానామ్. ౨౧

ఇది రెండు సూత్రములు. అనుతాం=ఉదంత వ్యతిరిక్తము లైన, సమానాం=తత్సమములకు, స్త్రియాం=స్త్రీలింగమందును, సర్వస్యచ=ఉదంతములు సహాగా సమస్తమైన, స్త్రీసమస్య చ=స్త్రీసమశబ్దములకును, సులోపః=ప్రథ

మైకవచనలోప మౌను. అంబాశబ్దమున కీసూత్రమున నేకవచనలోప మై "దీర్ఘాణాం హ్రస్వః స్యాత్" అని హ్రస్వము వచ్చిన, అంబ యని నిల్చెను. ఇట్లే గౌరి, వాణి మొదలైనవి. అనుతాం, అన్నాఁడు గనుక, ఉకారాంతములకు లేదు. భీరువు, చంచువు. వు అనువర్ణకము వచ్చునని మునుపే చెప్పినారము. గోడ, మేడ మొదలైనవి స్త్రీసమములు. ఇయాన్తానాం=ఇయయనునది తుదగాఁగల, నామ్నాం=నామములయొక్క తుదకు, అన్యతరస్యాం=వికల్పమున, ఏదన్తతా చ=ఏకారాంతత్వమును, అగును. గద్దియ, గద్దె-సురియ, సురె-ఇత్యాది. నామాఁత్యత్వము గ్రహించుకొని, ముత్తెము, ముత్తియము; విడెము, విడియము-ఇత్యాదులయందును జెప్పుకొనునది.

---

వికృతౌ సర్వేశబ్దాః క్లీబసమాః స్త్రీసమాశ్చ నాన్యేస్యుః
క్లీబసమా అమహాద్వత్ స్త్రీవత్స్యుః స్త్రీసమా స్సమాస్తు సమాః. ౨౨

ఇది నాలుగుసూత్రములు. వికృతౌ=తెనుఁగునందు, సర్వేశబ్దాః=దేశ్యశబ్దము లన్నియు, క్లీబసమాః=నపుంసకసమములు ను, స్త్రీసమాశ్చ=స్త్రీసమములును గాని- అన్యే=పుంసమములు, నస్యుః=లేవు. క్లీబసమాః=నపుంసకసమములు, అమహాద్వత్=అమహత్తులైన తత్సమములవంటివి యగును. "ము రమహతాం" అని ము వచ్చు ననుట. అందము, చందము, గుఱ్ఱము, పల్లము-ఇత్యాది. స్త్రీసమాః=స్త్రీసమములు, స్త్రీవత్=స్త్రీలింగ తత్సమములవంటివి, స్యుః=అవును. హ్రస్వవిభక్తిలోపము లగు ననుట- గోడ, మేడ, మోవి, బావి. చామ, మోరు, పుల్లె, పల్లె, ఎల్ల-ఇత్యాది. సమాస్తు=తత్సమములు, సమాః=యథాపూర్వ సమములై యుండును. రాముఁడు, సీత, రఘుకులము.

శా. కర్ణాంతాయతచారునేత్ర కమలాకర్పూరకూర్చత్రపా
వర్ణ శ్రీకర మంత్రసాదిత విభాస్వద్రూప చిద్రూప సౌ
వర్ణోదంచిత మంచ బిందు మయ దీవ్యద్దివ్య సింహాసనాం
తర్ణిష్పంద విహార *హారకలికోద్యత్కాంచికాభూషణా.

గద్యము-ఇది శ్రీసకలభాషావాగనుశాసననన్నయభట్టవిరచితాంధ్రశబ్దచింతామణియందు సకలకవితాస్వతంత్రభట్టారక యెలకూచి బాలసరస్వతి కవిమహోపాధ్యాయప్రణీతంబైన టీకాగ్రంథంబునం దజంతపరిచ్ఛేదము.

---

* పద్మకలికా—పా.

పాలింప లేఁడయా ప్రభువెందు నీకన్న నీకన్నబిడ్డని వీఁక నెన్న
పతితుండు లేఁడయా పరికింప నాకన్న నాకన్నమహినొప్పు నరులలోనఁ
బడుచున్నపాటు లెప్పుడుఁ జెల్పనా విన్న నావిన్నఁదన మింకఁ బోవఁజూడు
గతినీవె లేరికఁ గడతేర్పునాయన్న నాయన్నమాటల న్యాయ మెఱిఁగి
యిది నిజం బని కరుణ నన్నేలితేని, ఘనియఖిధంబు నీకథలాన లేనె,చారు॥
వినిపింతునిదె నాకవిత్వంబు తాళరా తాళరాగైక్యనృత్యప్రమోద
నీవె దైవము నాకు నీపదమానరా మానరా జాగు రామానుజన్న
నాకింత కెన్నిజన్మంబులో యెంచరా యంచరాయనిసాదిఁ గాంచినహరి
ప్రబలతాపత్రయబాధల కోపరా కోపరాగస్వాంతకుజనదూర
యరసియిఁకనైన నామొఱ నాలకింపు, కింపురుషయక్షగంధర్వకృతసపర్య-
సిద్ధింపనేర్చునే శ్రేయోనిశాంతంబు శాంతంబు నావంటిచపలమతికి
సమకూడనేర్చునే సంపన్నిదానంబు దానంబు నావంటి హీనగతికిఁ
జేకూరనేర్చునే చింతావియోగంబు యోగంబు నావంటి భోగరతికిఁ
బొసఁగంగనేర్చునే భూతహితత్త్వంబు తత్త్వంబు నావంటి దైన్యకృతికిఁ
గాన నిటువంటి పతితుఁడనైన నాకు,నాకుజాతునికట్ల నీనామమబ్బెఁ, జా.
నీపార్శ్వముల రుక్మిణీసత్యభామలు భామల్లసితముఖులై వసింప
నీయోష్ఠమునఁ గరాన్విత వేణుకాండంబు కాడంబునించురాగమున నొప్ప
నీశయద్వయిని మానితశంఖచక్రముల్ చక్రము ల్వేలయు తేజమునఁ దనర
నీమేన నిర్మలహేమాభవాసంబు వాసంబు దీపించు వన్నెనలర
నుదుటఁగస్తూరితిలకంబువొదలమించు,మించునీమూర్తిఁగాంచిసేవించువాఁడఁ-
భూషీకృతామ్నాయభాషణాచరణము ల్చరణముల్వ్యత్యస్త సరణి నిలిపి
యశ్రాంతసంతోషితాభీరవంశంబు వంశంబు మోవిపై వఱలఁజేసి
వర్షావసరచర ద్వారిదాబర్హంబు బర్హంబు మౌళి నేర్పడ ఘటించి
దితిభూభయంకర దేవతాసుముఖంబు సుముఖంబు నోరగా సొంపొనర్చి
నట్టి నీదివ్యమగు తేజ మసువియోగ, యోగవేళఁ గనంబడు నొక్కొనాకుఁ
జారుతరమందహాసపోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౨౦

## — (3) పితృమాతృదశకము. —

మొదలనె బ్రహ్మాంబు పదునాల్గుభువనము ల్భువనము ల్బెంకిగాఁ బూనెఁ గుక్షి
నంతనే విభుఁడాద్యుఁడై మహదాదుల దాదులఁగా స్వతంత్రత విధించె

ఠీవి నేమేధావి జీవపార్శ్వస్థుఁడై స్వస్థుఁడై వటపత్రశాయి యయ్యెఁ
జెలఁగి యేదేవుండు సృష్టిసంధాతను ధాతను నాభిపద్మమునఁ గాంచె
నట్టినిను దేవకీపిచండమందు దేవ, దేవ నవమాసములు మోచి తిరుగుటరిది
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౨౧

శంఖచక్రగదాసిసాధనోత్కరములు కరములు నాలుగు పరిఢవిల్ల
ధృతకిరీటాధరీకృత భాస్వమస్తంబు మస్తంబు నిస్తులమహిమ నొప్ప
లలితరేఖాభాసిలక్షణాస్పదములు పదములు పల్లవప్రభల నలరఁ
బూర్ణప్రతీకస్థభూషానికాయంబు కాయంబు దివ్యమంగళతఁ దనర
నెసఁగునిటువంటినినుఁ బుట్టింటఁ గన్న, కన్నతలిదండ్రులెంతసంపన్నులొక్కొ.

ప్రచలితహేమాద్రిపక్షావిశేషుఁడై శేషుఁడై పూనె నేజిశజడార్తి
విధినిశివేళ నుదధిఁ బాఱి మత్స్యమై మత్స్యమై త్రిప్పె నేమహితకీర్తి
తరువంగఁ గ్రుంగు మంథానాద్రిఁ గూర్మమై కూర్మమైమోచె నేధర్మవర్తి
యతలస్థమహిఁ దిరస్కృతసోమఘృష్టియై ఘృష్టియై యెత్తె నేస్పష్టమూర్తి
యట్టినినుఁ గాంచువసుదేవుఁడతిరయమున, యమునదాఁటివ్రేపల్లెకునరుగుటరిది

ముందఱ నిడుకొని ముదుకనేర్పరిపాటి పరిపాటి తైలంబు శిరమునంటి
యూరుపులందిడి యుదకశీకరములఁ గరములు సున్నితోఁ గలయ బులిమి
మృదులోష్ణధూతహరిద్రకృజ్జలముల జలముల దోయిట జలకమార్చి
కడువేగముగ మేనితడిని బయ్యెదనంట నెదనంటఁ జేర్చి పెంపొదవనొత్తి
కుత్తుకకు డాయఁ జేతుల నెత్తిపట్టి, పట్టివని ముద్దుగొను తల్లి భాగ్యమే మొ-

నిటలస్థలిని జుక్క ఘటియించుఁ గావునఁ గావునఁ బోరిడి కలఁగు వేళ
బొమలక్రిందను రేఖ నమరించు భసితంబు భసితంబు కడు దుల్పి పడెడువేళ
నొకచెక్కిటను రక్ష నుంచు నంజనముచే జనముచేకొని ముద్దుగొనెడువేళ
మొలత్రాట నింగువ ముడిచిన ముడివెట్టు ముడివెట్టిపురుడంటి బడలువేళ
నందసతియిట్లునినులోచనములఁ గాంచి, కాంచినవధూటికధికంబుగాఁగఁ బెంచె-

ప్రక్కలో నిడుకొని పలుమాఱు జోకొట్టి జోకొట్టి పుణుకుచు జోలపాడుఁ
బోరుపెట్టిన భుజంబునఁ జేర్చి చిచ్చోసి చిచ్చోసి యని వ్రేళ్ళఁ జిచ్చుకొట్టు
హాయిరేయనుచు నుయ్యాలనుంచి లాలించి లాలించి మెల్లమెల్లనఁ గదల్చు
బూచివచ్చెనటంచు బుసపెట్టి బెదరించి బెదరించి మీఁగాళ్ళఁ బెట్టియూఁచు
నిన్ను నిన్నివిధంబుల నిద్రఁబుచ్చి, బుచ్చిశిశువంచుఁ దల్లిపాలిచ్చు లేపి, చా.

పనిమాలి కేవలార్భకుఁడనఁ జనుబాలుఁ జనుబాలు గుడుపవే సమయమెఱిఁగి
వినఁజాలఁ బ్రొద్దెక్కె ననుచు నీవెన్నఁగా వెన్నఁగాచిన నేతి నన్నమిడవె
లీల నుయ్యెలఁ బవ్వళించి పెంపొందఁగాఁ బొందుగా నిఁక నిద్రపుచ్చఁదగదె
తడవాయె నిద్రించి తాళఁ డాఁకలికి నో కలికి నేర్పున మేలుకొలుపఁగదవె
యనుచు నందుండు నీతల్లి ననుచు టప్పు,టప్పటికి నిన్నుఁ గాంచు మోహమునఁ గాదె-
ననురాని రేక నెన్నుదుటిపై నలకల నలకలాపాగ్రణియై మెలంగ
నురమునఁ బచ్చల నొప్పి యొప్పు లెగోరు పులిగోరు పతకంబు పొంకమలర
నడుమున మణివితానపు మొలఁగంటల గంటల మొలనూలు గల్లురనఁగఁ
దళతళ దివ్యరత్న ప్రభావలయము ల్వలయముల్ హస్తాగ్రములఁ జెలంగఁ
దనరు నీజానుయానంబు తల్లి చూచుఁ, జూచుకంబులఁ బాలిచ్చి చొక్కుఁగాదె-
కుడువ రాచను బువ్వ గడియలోనుడుకు నే నుడుకు నేర్పున నూఁదియిడుదు ననుచు
మీఁగడ పెరుఁగుతో మెసవు మోగిరము వేగిరము వేడుక శుభాకృతియటంచుఁ
జెచ్చెర భక్షింపు చేకొని యీ వెన్న యీ వెన్న నేల నన్నెప్పు డనుచుఁ
ద్రాగరా నునుపంచదారతో నీపాలు నీపాలు సుమ్మి లేఁబాప యనుచు
నిత్యమును జిన్నపాయపు నిన్న భూత, భూతదయ గల్గుజనయిత్రి బుజ్జగించుఁ-
శింశుమారస్థ దివ్యాంశు విగ్రహముల గ్రహములఁ దారల రాశికములఁ
బూర్వదిక్పాలాదిపుటభేదనంబుల నంబులఁ దనరు సప్తార్ణవముల
భూజలాగ్ని మరున్నభోభూతగణముల గణముల దిశల నాకాశచరుల
నతలాద్యధోలోకగత ఫణిస్వాముల స్వాముల జంగమస్థావరముల
మృత్తుఁ గనుమంచు నీవు నోరెత్తఁ గాంచెఁ, గాంచనాంశుక జనని నీగర్భమందుఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౩౦

—(4) బాలదశకము. —

నరుల కిందలిజీవనంబులు భంగముల్ భంగము జీవనప్రతతియందుఁ
జరము లిందలి గోవృషస్త్రీసురత్నముల్ రత్నము ల్గన నచరంబు లందు
నమృతాప్తికిందు ననాయాసమథనంబు మథనంబు లమృతసంప్రాప్తికందు
నిందవస్థలమూఁట నందాత్మచర్యలు చర్యలు రెండవస్థల నెయ్యందు
ననికదా వార్ధిఁదొఱఁగి బాల్యమునఁ బాడి, పాఁడిపంటలుగల్గు వ్రేపల్లెనుంట
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౩౧

త్తైస్తిక్తప్రసూతజ్జని సారెనుఁ సారెనుఁ దొలువ్రొల్తఁ జప్పరించి
పిదపఁ దజ్జనయిత్రి పృథుకుచాసారంబు సారంబుగలతనుస్తన్యమాని [వి
యుభయసంధ్యలయందునుగ్గునామదముతో మదముతోఁ జనుబ్రాలుపిసుకఁ ద్రా
తూర్ణదూరీకృతాజీర్ణవికారంబు కారంబు వారసంగతిని గ్రోలి
యలరితివిగాదె తచ్ఛైశవానుభవము, భవముగలవారలకుఁగదా ప్రాప్తమగుట-
నులుకకంకటిఁ బొత్తియలఁ గూర్చునెమ్మది నెమ్మది వటపలాశమ్ముఁ దలఁప
వెస నెడఁజనుబ్రాలుగుడుచుచుఁ దానుడురుచినుడురుచిక్రతువహాహుతిదలంప
వాభీరజనమనోహరణమానవలీల నవలీల లసి విభువ్యక్తి దలఁప
వధిగతదధిభాండ మథనస్వనంబున నంబువర్షోగ్రి రావంబు దలఁప
వంబహతిభక్తిచే నలోపంబునందు, నందుసంపత్తి గనుటనిన్నొందె మఱపు-
వరకుంతలాళిభాస్వన్ముఖపద్మచేఁ బద్మచేఁ గడు నొత్తఁబడిన వెవ్వి
పావనకృత్తుంగభంగత్వగంగకు గంగకుభవజనకంబు లెవ్వి
యచలితయోగియోగానుసంధానప్రధానప్రచారంబు లైన వెవ్వి
సకలవర్ణాశ్రమాచార విశ్రుతులందు శ్రుతులందు నృత్యాంబు ద్రొక్కె నెవ్వి
యిట్టి నీపాదములు నందునింట బెదరి
బెదరికని తప్పటడుగులు వెట్టుటరిది, చారు. ౩౪
అమ్మ పాలిప్ప డిమ్మని ఘటాంచలముఁ జంచలము చెందఁగఁ బట్టుసమయమందు
నమ్మ వెన్నయొసఁగు మనిమంథదండంబు దండంబునిడి పట్టుతఱిని మఱియు
నవ్వపెట్టవె బువ్వ యని లీల వ్రేలిచే వ్రేలుచేకొని పట్టువేళయందు
నప్పచ్చిదే తల్లి యని శుభాకరములు కరము లడ్డమువట్టు కాలమందు
నిట్టినీశైశవక్రీడలింతియెన్ని, యెన్నినునులున్న మానినీయిష్టమొసఁగుఁ,జారు.
సతతభక్షితమఘాహుతిసరసాన్నంబు సన్నంబుగాఁ దిన సరణిమొసవ
సర్వవేదాకృతి శర్కరపలుకులు పలుకులు గడుముద్దుగులుకఁ బలుకఁ
బ్రాణ్యంతరనుగత పాదపల్లవముల లవములగతి వీథి లగువు లెత్త
శ్రుతిరవాకర్ణనశ్రుతివల్లవార్తల వార్తల సార్థక్యవ్యక్తి వినఁగ
నేర్చుకొను టద్భుతము గాదె నీవు మంద
నుందచర్యలఁ బ్రాకృతుమ్మాడ్కి మెలఁగి, చారు. ౩౬
ఆత్మాలయము దాఁటునంతకు నడుగున నడుగు నవీనకుహకతనిడుచు
నవలివీథికిఁ బోవునంతకుఁ బదమెత్తి పదమెత్తితిన్నగాఁ బాడుకొనుచు

నరసి నేస్తులఁ గూడునంతకు నల్లన నల్లనఁ గనువారి నడిగికొనుచు
నచటఁ బెరుగ్గుద్ది యూ నంతకు గొబ్బున గొబ్బునఁ గసరి కేగో యటంచు
నాటలకు వేఁట వెడలి ఘేయనుచునంత,నంతభూ ర్తశిఖామణి వైతివౌర,చారు.
విన్న రా మనమాటలాడఁగఁబోవలెఁ బో వలెవాటెంకఁ బూసఁగదోయి
తల్లులు గనికొట్టఁ దలఁతురు మనముల మనములఁ గోపంబు మాన రెపుడు
వెన్న దొంగిలి తెత్తు విను మన కిరువుర కిరువు రఘోదరం బీదినంబు
ఆటల కధికుల మయ్యు యీమ దలో మందలోల్లాత్మడింభకులకన్న
ననుచు నమ్మించి సకలగుణాభిరాము
రాముఁ దోడ్కొని రాజమార్గంబుసారవె, చారు. ౩౮
సంహిత విని వచోర్ఘురిఁ బదక్రమముల క్రమములఁ దప్పక ఘనను చెప్పి
సాము చూచి ప్రయోగసంహార మనువుల మనువుల స్మృతిరీతిమహిమ లెన్ని
క్రయవిక్రయస్థితు ల్గని యాదివృద్ధుల వృద్ధులగతి వివరించి మించి
పనుల నన్నిటిఁ గాంచి బహువిధోపాయము ల్పాయముల్గల వారిఫణితిఁ దెలిపి
ప్రబలు నిను ముఖబాహూరుపాదజన్మ
జన్మబాలురు గని నిల్వఁజాల రెదుటఁ, జారు. ౩౯
గళదచ్ఛదధిపయఃకణ మై వశీకర శీకరకణము నిరాకరించి
లవరజస్సహితావయవ మై విభూతిద భూతిదనర్చు శంభుని నెదిర్చి
చలదలకాస్య మై జలదపోతాంజనతాంజనగిరి శృంగ మపహసించి
నవనీతదిగ్ధమై పవిభవాభాసిత భాసితహరినీల మోసరించి
భువనమోహనమగునీదుబుడుతమూర్తి, మూర్తిమంతంబుఁజూపినాయార్తినుడుపు
చారుతరమందహాస ఘోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౪౦

## (5) చోరత్వదశకము.

ఉదయాది నేధనాఢ్యుల నైనఁ జిక్కని చిక్కని పెరుఁగు వాసింప జుట్టి
ప్రొద్దు జామైన నేపుణ్యుల కందని కందని వెన్న నింపొంద మెక్కి
మధ్యాహ్న వేళ నెమ్మది నట్టుగట్టిన గట్టినయంపు మీఁగడలు మెసవి
యపరాహ్ణమున నెట్టనై తడవారిన వారినంటని పాలు వడిగఁ ద్రావి
ప్రతిదినం బిట్టిచోరకర్మప్రసిద్ధి, సిద్ధపడసితి వే మంద నుద్ధరింపఁ
జారుతరమందహాస ఘోలూరి వాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౪౧

ఉట్టిఁగట్టిన వెన్న నొడిసియుచు నందక నందకధర కుండనడుము పొడిచి
పులుసైనదధి ద్రావఁగలఁగుచు గదిపంచ గది పంచదార నే కలయఁబోసి
కాఁగుభాండములమీఁగడ లంట లావణి లావరి ధరవానిఁ బోవ నడిచి
కళకళఁబొరలు దుగ్ధములానఁదటిగాక దరి కాఁక చన మధు వరసి నించి
శార్ఙ్గి నీవిట్టులనుభవించ వెయసాధ్య,సాధ్యకర్తుఁడవై బాల్యసమయమందుఁ, జా.
సమయ మెఱింగి వే చప్పుడు గాకుండఁ గాఁగుండలోఁ బాలు గఱచి త్రావి
పనులకై యొకబోఁటి చనుచోట నంతలో నంతలోలత వెన్న లరసి వ్రేక్కి
త్రచ్చుకవ్వము నిల్పి వచ్చుకాంతను గాంచి తనుకాంచిరవుఁడవైదధిని జుఱ్ఱి
పొరుగున కొకవ్రేత మెరవడి చన్నంతఁ జన్నంతమీఁగడఁ జాల మెసవి
గండిదొంగలకగ్రేసరుండవైన,వైనతేయాశ్వనాకర్మవసువుగొనుము, చారు.
చెలులు వ్రేఁకటి నడశిశువులకాఁగిన కాఁగినపాలార్చి కాని కొనవు
ఎటు చలింపనిఱాతి కెట్టిబా గట్టిది గట్టిది పెరుఁ గైనఁ గాని కొనవు
మిగులఁ గాఁగినపాలమీఁదఁ బాఁగనిపించు గనిపించుమీఁగడఁగానికొనవు
పెనుగానుచల్లలో మునుఁగక పైనిగ్గు పైనిగ్గు గల వెన్నగాని కొనవు
కోరుకులఁ జోరు లిటు దీర్చుకొనఁగఁగలరె
కలరె నీవంటి కన్నదొంగలు ధరిత్రిఁ, జారు. ౪౪
అంబతోఁ జెప్పెద ననుసారసాక్షిని సాక్షినిదోడ్తొని చను మటంచు
మరలి వచ్చిన నిన్ను మర్దింతు ననుబోఁటి ననుబోటి నీకుఁ జిక్కునెయటంచు
నిరుగువా రెఱుఁగఁ గు య్యిడు మచ్చెకంటిని గఁటిని నీపాడికలిమి ననుచు
నిన్నేమియనఁజాలనన్నకాంచనగాత్రిఁజనఁగాత్రివారంబుగొనక యనుచుఁ
దొడరి నీవిట్లు వ్రేతలతోడ మంద,మందలింపవె చోరకర్మముల వేళఁ, జారు.
తెంపరి గాకున్న సంపత్తి పెరుఁగునే పెరుఁగు నేఁటి కొసంగు పృథునితంబ
చెనఁటికిఁ బాఁడివృద్ధినిఁ బొందునా పాలు నాపాలు గావింపు నాగయాన
నింపురచ్చలలోన నీహిత వెన్ననా వెన్న నావశము గావింపు తగుణి
తిట్టె నన్నదలింపఁ బట్టకు మీఁగడె మీఁగడ గొనువాఁడ మీననయన
యని వ్రజస్త్రీల నర్థించి నెనరుగలుగఁ
గలుగని యుపాయముల మంద నలరితౌర, చారు. ౪౫
గోవత్సరావసంకులగృహాంతరములఁ దరములు గడచుపద్ధతులఁ జూచి
దంపతీకలహాప్రకంపితాలయముల లయములఁ గనని లౌల్యమునఁ జొచ్చి

బాలవృద్ధార్భటిభయదమందిరములఁ దిరము లఘువ్యక్తి నరసిచొచ్చి
వ్యాకీర్ణనిత్యోత్సవశ్రీబవంతుల వంతుల నెన్నుచు వరుసఁజొచ్చి
యట్టిసందడివేళల నాడి పాడి,పాఁడి సకలంబుగొని కొల్లలాడితౌర, చారు.

దొరకొమ్మకై యుండి దొంగిల నేటికే నేటికేవలులమే నీకు మేము
ఫూని యేమిడలేము వానికోర్కుల మేలు కులమేలువాని కీగుణము గలదె
రట్టుచేయఁగనందఱము కాని వారమా వార మాఱడిచేయవలెనెయెపుడుఁ
గలఁచి హవ్యముల నెంగిలి చేయఁబాడియే పాఁడియేమర్యాద ప్రబలునింక
ననుచువ్రేతలు దెలుపనీయంబవారి, వారివారించు నేరని వాఁడవంచుఁ,జారు.

నిలయంబులనుజొచ్చు నేర్పుదొంగలయందుఁగలయందు నెన్నఁడుఁగానమనుచు
ననుపమాతృప్తిసర్వాదనామునియందు మునియందుఁజెప్పఁగావినమటంచు
సంచారచపలంబుశంపార్భకములందుఁ గములందు నేనాఁడుఁగనమనుచుఁ
మిథ్యావచోభవామృతము తేనెలయందు నెలయందు నేభంగిఁగలుగదనుచుఁ
బలుకు వ్రేతల యిండ్లలోఁ బాఁడిమరల
మరలఁ జెలరేఁగి కొనవె డింభకులఁ దనుప, జారు. ౪౯

వెన్నలు దినఁ గాంచి వేవే కవాటంబు వాటంబుగాఁ జిల్కు వైచి యోర్తు
పెరుఁగు జుర్రఁగఁ గని బిరబిర బరువెత్తి పరువెత్తి చెప్పఁగాఁ బఱచి యోర్తు
మీఁగడఁ జెచ్చెర మెసవు రీతిని జూచి తిని చూచి మఱగినాఁ డనుచునోర్తు
పాలు ద్రావఁగ నోర్వఁ భరమై విలోకించి లోకించిదనుకంప లేక యోర్తు
తల్లి కెఱిఁగి పనిను బోటఁద్రాటఁగట్టి,గట్టిపని సేయదే చోరకర్మవేళఁ
జారుతర మందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౫౦

(6) జారత్వదశకము.

విలసిత కుందకుట్మలసుందరరదముల్ రదముల ముద్దిడఁ బెదవి నొక్కి
విస్ఫురత్తరముల విజితలికుచములఁ గుచముల జంకకుఁ గొనినఁ బట్టి
తొడలపై నిడుకొన్న వడిసాభిమానంబు... ... ... ... ... ... ...
యెమట నిల్చిన మీఁది కెగసి లోనలుగఁగా నలుగఁ గాఢాలింగనం బొనర్చి
బాలుఁడని చేరు చెలులపై భ్రాంతిపడుచుఁ, బడుచుఁదనమున నీరీతిఁ బ్రబలితౌర
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ.

గోవ్రులఁ గని భీతిగొనువానిగతి వేగ గతివేగమున వచ్చి కౌఁగిలించి
యేల దాఁచెదు పైఁట నిచ్ఛ్వాసఫలముల ఫలముల నని కుచంబుల గ్రహించి

బిబ మొంగిలి చేయఁ బిన్నవు గావింపు గావింపు మిదియని మోవిగఱచి
నీవిపీడ బిగింప నెత్తు నీమనుమని మనుమని... ....... ......
లేని నెపములనిట్లుగల్పించికొన్నసరి, కొసరివ్రేతలమానంబుగొంటివౌర, చారు.
తల్లిదండించె నింతకుఁ గన్నెఱంగుదు రంగుదుకూలాంతరమున రమణి
నిదుర వచ్చెడి శయనింతు నంచలములోఁ జలము లో నెడలింపు చంద్రవదన
పతివచ్చునంతకుఁ బవళించి చనువాఁడ చనువాఁడవారిదే ఘనము కలికి
యిలు సేరలేనె పెన్నిరుల నొక్కడ నేఁడు కడనేఁడుగడ నేనె కంబుకంఠి
యనుచు నీరీతి సమయోక్తు లాడు దరసి
యరసి వ్రజమెల్ల జారశేఖరుఁడవగుచుఁ, జారు. ౧౩
పతి యూరలేఁడని పతినినేఁ గలుగంగఁ గలఁగంగ నేటికే జలజగంధి
దొడ్డికిఁ జనిననాథుఁడు వచ్చునంతకు నంతకు నేఁ జాలనా లతాంగి
యలిగి పోయినమనోహరుని బిల్వఁగనేల పగ నేలలేనె నిన్నిగురుఁబోఁడి
వరుఁడు దూఱుట నన్యతరుణి గామించునే మించునే నీమాటచంచలాక్షి
చఁ‌ుపబాలుఁడనాసురసప్రబంధ, బంధముల నేరునిపల్లి ప్రబలితౌర, చా.
లలితరుగ్వ్రజిత పల్లవిత తాపింఛంబుఁ బింఛంబు నొఁదల బిగియఁ జుట్టి
మృదులనాదసుధాఝురీ నిరర్గళమున గళమున వనమాలికలు ధరించి
రంగుబంగరుపాలు చెంగులు వారఁగా వారగా మెపలెవాటు వైచి
జనితామృతాధరం బనుపవడంబున డంబున వేణుకాండంబు నిలిపి
గాన మొనరింప విని తాళమాన మెంచి
యెంచి వ్రేతలు నిన్ను మోహించి రౌర, చారు. ౧౪
గోపికల్ గ్రుంకుచుఁ గొలనిలో నుండఁగా నుండగాఁ జీరల నొడిసికొనుచుఁ
దీరభూజము నెక్కి తెగడుసుందరులను దరులను జేరఁగాఁ దలఁచికొనుచు
నలయించునిన్ను మాయాత్మలాకులముగాఁగులముగాదన దెయిఁకొఱఁతనుచు
దిరుగ మాకిప్పు డంబరముల నొప్పింపు నొప్పింపవలదు నమ్మెప్పుడనుచు
హస్తములు మోడ్చి మ్రొక్కు రామాభిమాన
మానములుగాచి పటములు మరలనిడవె, చారు. ౧౬
నవరాగమకరంద విపులపంకాసార కాసారముల జలకంబులాడి
కు కుమాదిసరాగశంకితచిత్తాంశు చిత్తాంశుకముల నచ్చికధరించి

# విషయసూచిక.

# పరిషత్ప్రయోజనములు.



తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసఁగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ బొందుపఱుపఁబడు చున్నవి:—

i తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వంకష మగునిఘంటు వొకటి రచించి ప్రచురించుట;

ii తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణము రచించి ప్రచురించుట;

iii ఆధునికశాస్త్రగ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట;

iv ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యములైన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగు దేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుట;

v సర్వవిషయములనుగుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట;

vi ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారముచేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట;

vii తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట;

viii తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకుఁగాను వార్షికసభల నేర్పాటుచేయుట;

ix తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్రికలను నొసంగుట;

x ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట-ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును; వ్రాఁతప్రతులుగూడ నుండవలయును;

xi తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపకరించు నన్ని కార్యములను జేయుట.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక.

కాకినాడ

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

| సంపుటము ౨౦. | ప్రజోత్పత్తినామసంవత్సరము మార్గశిరపుష్యమాసములు. | సంచిక ౫. |
|---|---|---|


## భాసరూపకములు.


—:పిలకా గణపతిగారు—విజయనగరము:—


---

సంస్కృతవాఙ్మయమునఁ గాళిదాసమహాకవితోఁ దులఁదూఁగఁజాలిన మహాకవు లెందఱో భారతవర్షమున నుద్భవించిరి. కాని యట్టివారిలోఁ గొందఱిగ్రంథములుమాత్రమే మన కుపలభ్యము లగుచున్నవి, మిగిలినవారిలోఁ గొందఱినామములుమాత్రమే మన కిపుడు లభించుచున్నవి. సౌమిల్లకుఁడు కవిపుత్త్రుఁడు నిట్టివారు. 1912 వ సంవత్సరమున మహామహోపాధ్యాయ త. గణపతిశాస్త్త్రిగారు భాసరూపకములు ప్రకటింపకపూర్వ మీభాసునిగూర్చి కేవలనామమాత్రమే గాని యేమియుఁ దెలియ దనియే చెప్పవచ్చును. మ.త. గణపతిశాస్త్త్రిగారు శ్రమపడి కొన్నిమాతృకలు సంపాదించి తత్సహాయమున 1 స్వప్నవాసవదత్తము. 2 ప్రతిజ్ఞాయౌగంధరాయణము. 3 ప్రతిమానాటకము. 4. అభిషేకనాటకము. 5. బాలచరితము. 6. పంచరాత్త్రము. 7. ఊరుభంగము. 8. కర్ణభారము. 9. దూతఘటోత్కచము. 10. దూతవాక్యము. 11. మధ్యమవ్యాయోగము. 12. అవిమారకము. 13. చారుదత్తము నను 13 నాటకములు ప్రకటించిరి. అప్పటినుండియుఁ బ్రపంచమునకు భాసనాటకపఠనాభాగ్యము కలిగెను.

భాసమహాకవికాలమును గూర్చియుఁ దద్రూపకములను గూర్చియు భారతీయపాశ్చాత్యపండితులలో ననేకాభిప్రాయభేదము లున్నవి. వానిలో

మూఁడు వాదములు ముఖ్యము లనవచ్చును- మొదటిది భాసనాటకచక్రోద్ధారకులగు మ. త. గణపతిశాస్త్రిగారిది. రెండవది కీతుపండితునివాదము. మూఁడవది కృష్ణపిశారటిగారివాదము. మ. త. గణపతిశాస్త్రిగారు భాసుఁడు క్రీ. పూ. 5 వశతాబ్దములోనివాఁ డనిరి. కీతుపండితుఁ డించుమించుగ క్రీ. శ. 3 వ శతాబ్దములోనివాఁ డనెను. కృష్ణపిశారటిగారుమాత్రము భాససిద్ధాంతమును విశ్వసింపక, యీనాటకము లేవియు భాసునివి కావనియుఁ గేరళదేశీయు లగునటులు ప్రసిద్ధరూపకములనుండి సుందరభాగము లేర్చి కూర్చిన గ్రంథము లనియు, నిట్టి యీరూపకములకూర్పు క్రీ. శ. 7వ శతాబ్దమున జరిగియుండవచ్చు ననియు నభిప్రాయపడిరి. ముం దొక్కొక్కరియభిప్రాయము వ్రాసి తరువాత రూపకముల గూర్చి వ్రాసెదను.

వీరిలో మ. త. గణపతిశాస్త్రిగారివాద మిట్లు సంక్షిప్తము చేయవచ్చును. కాళిదాసమహాకవి మాళవికాగ్నిమిత్త్ర ప్రస్తావమున—"ప్రథితయశసాం భాస, సౌమిల్లక, కవిపుత్త్రాదీనాం ప్రబంధా నతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య క్రియాయాం కథం బహుమానః" అని భాసరూపకములను బ్రస్తావించి యున్నాఁడు. రాజశేఖరుఁడు గూడఁ దనసూక్తిముక్తావళియందు-

భాసనాటకచక్రేపి చ్ఛేకైః క్షిప్తే పరీక్షితుమ్
స్వప్నవాసవదత్తస్య దాహకోభూ న్నపావకః.

అని భాసమహాకవి స్వప్నవాసవదత్తమును బ్రస్తుతించెను. మఱియు బాణకవి తనహర్షచరితమున—

సూత్రధారకృతారంభై ర్నాటకై ర్బహుభూమికైః
సపతాకై ర్యశో లేభే భాసో దేవకులై రివ.

అని భాసనాటకములను సంస్తుతించెను. ఇంకను జాలమంది భాసుని స్మరించిరి. కావునఁ గాళిదాసమహాకవిచేఁ గూడ గొప్ప రూపకకర్తగ నుతింపంబడినట్టియుఁ బ్రథితయశస్కుఁ డగుభాసుఁడను నొకమహాకవి యుండె నని యు నాతఁడు స్వప్నవాసవదత్తాద్యనేకరూపకములను వ్రాసె ననియు, వానిలో స్వప్నవాసవదత్త మత్యంతరమణీయ మైన దని యుఁ బయికాళిదాసాదుల స్తోత్రములవలన నిశ్చయింపవచ్చును. కావున, ప్రస్తుతము మనకు దొరకినస్వప్నవాసవదత్తము భాసునిదే యనుకొనవచ్చును. మిగిలిన పండ్రెండు రూపకములుగూడ శైలిలోను నార్ష ప్రయోగములలోను, సహజమాధుర్యమునను భరతవాక్యమున

ను స్థాపనలందును స్వల్పభేదములతో సమానముగ నున్నవి. కావున నివికూడ భాసునివే యని నిశ్చయింపవచ్చును. ఇంతియె కాక క్రీ. పూ. 4 వశతాబ్దమున నున్నచాణక్యుని యర్థశాస్త్రమున— (10 అధి. 3 అధ్యా.)

నవంశరావంసలిలైఃసుపూర్ణం సుసంస్కృతం దర్భకృతోత్తరీయం,
తత్తస్య మాభూ న్నరకంచ గచ్ఛే ద్యో భర్తృపిండస్య కృతే నయుధ్యేత్

అను ప్రతిజ్ఞాయౌగంధరాయణశ్లోకము నుదాహరించెను. ఈశ్లోకమునకుఁ బూర్వమున నున్న "అపి హ శ్లోకౌ భవతః" అనువాక్యముచే నర్థశాస్త్రకర్త యీశ్లోక మన్య గ్రంథమునుండి యుదాహరించుచున్నాఁడని సుస్పష్టముగఁ దెలియుచునేయున్నది. మఱియు భాసునియార్ష ప్రయోగములనుబట్టి చూచిన నివి యన్నియుఁ జాలవఱ కపాణినీయము లగుటచే నాతఁడు పాణినికంటెఁ గూడఁ బ్రాచీనుఁ డని తలంపవచ్చును. ఇట్లు పాణినికంటెను నర్థశాస్త్రముకంటెను బ్రాచీనుఁ డగుటవలన భాసుఁడు క్రీ. పూ. 5వ శతాబ్దమున నుండవచ్చును. ఇంతియకాక జయానకునిచే రచియింపఁబడిన పృథ్వీరాజచరితమును వ్యాఖ్యానముచేయుచు జోనరాజు (క్రీ. శ. 1500) ప్రథమాధ్యాయమందలి మూఁడవశ్లోకవ్యాఖ్యానమున—

అత్ర సాధనమాహ— సోగ్నిరపి భాసమునేః కావ్యం విష్ణుధర్మాన్ ముఖాత్ త్యక్తవాన్ నాదహదిత్యర్థః" అని వ్రాయుచున్నాఁడు- కావున నాతనికి మునిత్వము సిద్ధమైనది. కావున భాసుఁ డించుమించుగ, క్రీ. పూ. 5 లేక 6 వ శతాబ్దమువనుండె నని యు నాతఁడు వ్రాసిన స్వప్నవాసవదత్తాదిరూపకములే ప్రకటితరూపకము లనియు సునిశ్చితము.

ఇఁక, కీత్పండితుని యభిప్రాయ మరయుదము. ఆతఁ డీ గ్రంథము లన్నియు భాసుని వనుటలో మ. త. గణపతిశాస్త్రిగారితో నేకీభవించెను. కాని భాసుని కాలమువిషయములో నాయనతో నేకీభవింప లేదు. కీత్పండితుని యభిప్రాయ మిది—"భాసునిప్రాకృతములు కాళిదాసప్రాకృతములకంటెఁ బ్రాచీనత్వమును సూచించుచున్నవి. కాని యశ్వఘోషుని ప్రాకృతములకంటె నవీనములే. మఱియు భాసునిప్రతిజ్ఞాయౌగంధరాయణమందలి (1-8).

"కాష్ఠా దగ్ని ర్జాయతే మథ్యమానాత్
భూమి స్తోయం ఖన్యమానా దదాతి
సోత్సాహానాం నా స్త్యసాధ్యం నరాణాం
మార్గారబ్ధాః సర్వయత్నాః ఫలంతి.

అనుసీశ్లోక మశ్వఘోషుని బుద్ధచరితమందలి—

"కాష్ఠంహి మథ్నన్ లభతే హుతాశం
భూమిం ఖనన్ విందతి చాపి తోయమ్
నిర్బ్యాధినః కించన నాస్త్యసాధ్యం
న్యాయేన యుక్తం చ కృతంచ సర్వమ్.

అనుశ్లోకము ననుసరించుచున్న దనుట స్పష్టము. కావున నశ్వఘోషుని కంటె భాసుఁడు నవీనుఁడు కావలయును. భాసుం డించుమించుగ క్రీ. శ. 3 వ శతాబ్దమున నుండవచ్చును. ఇంతియకాక యతనిరూపకములఁ గొన్నిభరతవాక్యములవలన భాసునికిఁ బోషకుఁడుగ నున్న మహారాజు శత్రువులకుఁ జిక్కి తిరిగి తనరాజ్యమును సంపాదించె నని తెలియుచున్నది. ఈపరిస్థితు లన్ని యుక్షత్రపరు దసింహునిపరిపాలనముతో సరిపోవుచున్నవి. క్షత్రపరు దసింహుఁడు క్రీ. శ. 181 నుండి 188 వఱకును దరువాత మరల క్రీ. శ. 191 నుండి 196 పర్యంతమును రాజ్యముచేసెను. భాసుఁడు తత్కాలమువాఁడు కావలయును. కీత్పండితుని వాక్యము లీదిగువ నిచ్చెదను.

In the Avimaraka, the Abhishakanataka and the Pratijnayougandharayana that the king should after destroying his rule the whole earth, while in the Svapnavasavadatta, Dutavakya, Balacharitra the wish is for universal rule. This suggests that for a time the king reigned in peace. The enemies arose and disturbed his power; finally he again won the upper hand, and his friends could without absurdity pray for his attaining imperial rank. This would agree with the history of the Kshatrapa Rudra Sinha who held from A. D. 181-8 and again A.D. 191-6 the high rank of Mahakshatrapa and whose name may be hinted at in the use of term Rajasinha"—Sanskrit Drama 94.

మ. త. గణపతిశాస్త్రిగారు మాత్రము- భరతవాక్యములయందలి రాజసింహాదిపదములు రాజవిశేషమును సూచించుట లేదు కావున నీవాక్యములవలన భాసునిపోషకుఁ డగుమహారా జెవరో నిశ్చయముగఁ జెప్పుటకు వీలు లేదని యభిప్రాయపడిరి.

ఇఁకఁ గృష్ణపిశారటిగారియభిప్రాయ మరయుదము. వారివాదము నిట్లు సంగ్రహింపవచ్చును. ప్రస్తుతము మన కుపలభ్యమాన మగుస్వప్నవాసవదత్తము ప్రసిద్ధభాసకృత స్వప్నవాసవదత్తము కాదు. ధ్వన్యాలోకలోచనమున నుదాహరించిన —"స్వంచితపక్ష్మకవాటం నయనద్వారం స్వరూపతడనేన,

ఉద్ఘాట్య సా ప్రవిష్టా హృదయం మే నృపతనూజా” అను నీశ్లోకము ప్రకృత స్వప్నవాసవదత్తములో లేకుండుటచే నిది యొక వేఱురూపకము. మఱియు నమరవ్యాఖ్య యగునమరటీకాసర్వస్వమున “శృంగారవీరకరుణాద్భుత” అను శ్లోకవ్యాఖ్యానసందర్భమున ధర్మార్థకామశృంగారముల కుదాహరణము లిచ్చుచుఁ దత్కర్త యీ వాక్యములను వ్రాసెను.

> ఆద్యో యథా—నందయంత్యాం బ్రాహ్మణభోజనమ్. ద్వితీయః-స్వదిశమాత్మసాత్కర్తు ముదయనస్య పద్మావతీపరిణయోఽర్థశృంగారః. తృతీయః-స్వప్నవాసవదత్తే తస్యైవ వాసవదత్తాపరిణయః కామశృంగారః.

ప్రకృతరూపకమున పద్మావతీపరిణయ మొకటియె యున్నది కాని వాసవదత్తాపరిణయము లేదు. కావున, ప్రకృతనాటకము ప్రాచీననాటకము కాదు. మఱియు. “సూత్రధారకృతారంభై ర్నాటకై ర్బహుభూమికైః సపతాకైర్యశో లేభే భాసో దేవకులైరివ” అను నీశ్లోకమునఁ జెప్పఁబడిన “సూత్రధారకృతారంభత్వము” కేవల మొకభాసరూపకములకే గాక కేరళదేశీయ రూపకములగు సుభద్రాధనంజయాది రూపకములయందును, కేరళలిపి నున్న శాకుంతలాది నాటకములందును గూడ మొట్టమొదట నున్నది. మఱియు “ఏవమార్యమిశ్రాన్ విజ్ఞాపయామి కిం ను ఖలు మయి విజ్ఞాపనవ్యగ్రే శబ్ద ఇవ శ్రూయతే అంగ పశ్యామి” ఇత్యాది స్థాపనావాక్యములు గూడఁ గేవలము భాసరూపకములయందే కాక శక్తిభద్రవిరచిత మగునాశ్చర్యచూడామణి యను నాటకమునఁ గూడ నున్నది. ఇతి “ప్రస్తావనా” అనుటకు బదులుగ “ఇతి స్థాపనా” యని వ్రాయుట పైనాటకమందును మిగిలిన కేరళదేశీయరూపకములందును గూడ నున్నది. ఇంతియ కాక భాసుని చారుదత్తమునకును మృచ్ఛకటికమునకును జాల దగ్గఱసంబంధ మగపడుచున్నది. వీరిలో నెవరో యొక రితరుల గ్రంథము జూచియే తమ గ్రంథము దప్పక వ్రాసియుండవలయును. మృచ్ఛకటికము సంపూర్ణముగ నున్నది. భాసునిచారుదత్తము సమగ్రముగ నున్నది. భాసచారుదత్తమందలి సంవాహకాదిపాత్రములకుఁ బ్రయోజన మేమియు లేదు. చారుదత్తము గూడఁ జాల నసంపూర్ణముగ నున్నది.

కావున మృచ్ఛకటకమును జూచియే చారుదత్తము వ్రాయఁబడెను, గాని, చారుదత్తమును జూచి మృచ్ఛకటికము వ్రాయఁబడ లేదు. మఱియుఁ

ప్రతిమానాటకమందలి యిక్ష్వాకువంశక్రమ మేపురాణమందలి వంశక్రమముతోడను సరిపోవుచుండుటలేదు, కాని, కాళిదాసుని రఘువంశమందలి వంశక్రమముతో సరిపోవుచున్నది. కావున నీనాటకకర్త కాళిదాసకావ్యమును జూచియే తనరూపకమును వ్రాసియుండవలయును. ఇంతియకాక, ప్రతిమానాటకమున భరతుఁ డజునకు నమస్కరించుచు "నమోస్తు శ్లాఘనీయ పశ్చాత్తాపాయ" అనును. ఈపశ్చాత్తాప మెక్కడిది ? ఇది కాళిదాసమహాకవి యజవిలాపమును జూచియే యీకవి యిట్లు వ్రాసె ననుట స్పష్టము.

ఇంతియ కాక కేరళదేశమున "చక్కయారు" లనునొక కుశీలవజాతి యున్నది. వీరు పూర్వమునుండియుఁ బ్రాచీనరూపకములనుండి కొన్ని భాగముల నుద్ధరించి తమయిచ్చవచ్చినటుల మార్చి ప్రదర్శించు నాచార మున్నది. అది యిప్పటికిని జరుగుచున్నది. వా రిప్పటికిని మంత్రాంకమును (ప్రతిజ్ఞాయౌగంధరాయణమందలి యొకయంకము) స్వప్నాంకము (స్వప్నవాసవదత్తమందలి యొకయంకము) దూతవాక్యము, దూతఘటోత్కచము, వాలికథాంకము (అభిషేకనాటకమందలి ద్వికల్యాణసౌగంధికము) మొదలగురూపకము లాడుచున్నారు. వివిధగ్రంథములయందలి శ్లోకములేర్చి కూర్చి ప్రబంధము లనుపేరుతో గానముచేయుచుందురు. వానివలెనే యీ 13 రూపకములును చక్కయారులు చేసిన వట్టికూర్పులేగాని భాసనాటకములు కావు. ఇట్టికూర్పు 7 లేక 8 వ శతాబ్దమున జరిగియుండవచ్చును. శైలినిగూర్చియు, పాణినీయప్రయోగములను గూర్చియుఁ జెప్పవలసిన దేమియు లేదు. ఇట్టిప్రయోగములు పాణినీయజ్ఞానము లేకపోవుటచే నీనటులు చేసినవే. ఈరూపకములయందలి శ్లోకము లన్నియుఁ జాలవఱకు రామాయణములోని వగుటచే సహజముగ రామాయణాదులకున్న యార్షప్రయోగములే వీనికిని సంప్రాప్తించినవి. కావున శైలినిబట్టి ప్రాచీనత్వమును స్థిరపఱుచుటకు వీలులేదు. ఇవి వట్టికూర్పులు కావుననే యీరూపకస్థాపనలందు కవినామనిర్దేశము లేదు. ప్రాకృతములు గూడ, ప్రాచీనములు కావు వీనితో సమాన మగుప్రాకృతములు శక్తిభద్రాదుల రూపకములలోఁ గూడ నున్నవి. కావున నివి యన్నియు వట్టికూర్పులు గాని భాసరూపకములు కావు."

వీరివాదము పైకి సారవంతముగఁ గన్పట్టినను దత్త్వార్థ మాలోచించిన నిస్సార మని తేలును.

మొదట వీరు ప్రకృతస్వప్నవాసవదత్తము ప్రాచీనస్వప్నవాసవదత్తముకా దనిరి. పోనిండు వారివాదమే యంగీకరింతము. అపు డొకటియే కథాభాగమును నామధేయమును గలిగిన రెండురూపకము లుండుటకుఁ గారణమేమి? అప్లెచ్చట ను లేదు. కనుకనే రామాయణము మూలకథగాఁ గలిగిన యనర్ఘరాఘవము మహావీరచరితము మొదలగురూపకములందు నాకు భేదము గపడుచున్నది. టీకాసర్వస్వమునకును బ్రకృతస్వప్నవాసవదత్తమునకును విరోధము లేదు. వాసవదత్తాపరిణయముకూడ నిందు సూచింపఁబడినది. కేవలము వివాహము లేకపోయినంతమాత్రమున మఱియొక స్వప్నవాసవదత్త ముండ నవసరము లేదు. అదియును గాక మహాకవి కాళిదాసు రచించిన ప్రసిద్ధనాటక మగునభిజ్ఞానశాకుంతలమునందే విస్తారమగు పాఠభేదము లున్నవి. ఒకపాఠములో నున్న 5, 6 శ్లోకము లిం కొకపాఠములో లేవు. కథాభాగములోనే కొంతమా ర్పున్నది. ఇట్టి పరిస్థితులలో నెన్ని యోశతాబ్దములకుఁ బూర్వము రచింపఁబడిన స్వప్నవాసవదత్తమువ లేఖకప్రమాదములవలన రెండు మూఁడు శ్లోకములు లేకపోవచ్చును. అంతమాత్రమున నిది భాసస్వప్నవాసవదత్తముకాదనుట సాహసము. ఇదిగాక భోజుని శృంగారప్రకాశికలో స్వప్నవాసవదత్తమందలి పంచమాంకకథ యభివర్ణితమైయున్నది. అది యట్లే ప్రకృతరూపకమున నున్నది- వామనుని కావ్యాలంకారసూత్రవృత్తిలో నుదాహరింపఁబడిన-

> ''శరచ్ఛాయా భ్రగారేణ వాతావిద్ధేనభామిని
> కాశపుష్పలవేనేదం సాస్రుపాతం ముఖంకృతమ్.

అనుశ్లోకము ప్రకృతరూపకమున నున్నది. వామనుఁడు ప్రసిద్ధిననుసరించి కవినామనిర్దేశ మొనర్పలేదు. వారు చూపించినశ్లోకము లుండుటకుఁ గూడవీ లున్నది. కావున నీస్వప్నవాసవదత్తము ప్రాచీనస్వప్నవాసవదత్తమె యని నిశ్చయింపవచ్చును.

ఇఁకఁ గేరళదేశీయరూపకములు గూడ భాసరూపకములను బోలియుండుటకుం గారణ మరయుదము. శక్తిభద్రాదులరూపకములలో భాసస్థాపనలవంటి స్థాపన లుండుటకుఁ గారణము కేవల మనుకరణమే. తమకంటెఁ బ్రసిద్ధుఁ డగుమహాకవిపోకడల నితరు లనుసరించుటలో నాశ్చర్య మేమి యులేదు.

ఇఁకఁ జారుదత్తవిషయము. నిశ్చయముగ మృచ్ఛకటికము చారుదత్త

ముపై నాధారపడియున్నది. సాహిత్యదర్పణము నదరిద్రచారుదత్త స్మరణ మున్నది. అది మనచారుదత్తమయి యుండవచ్చును. వాడుకలో "దరిద్ర"శబ్దము విడిచి యుందురు. చారుదత్తమును సూక్ష్మముగఁ బరిశీలించినచో మృచ్ఛకటికమే యనుకరణ మని బోధపడఁగలదు. ఇంకను జారుదత్తమృచ్ఛకటికములఁగూర్చి ముందు వ్యాసములలోఁ జర్చించెదను.

ప్రతిమానాటకము రఘువంశానుకరణ మనుటలో హేతువులు దృఢముగ లేవు. కాళిదాసమహాకవి రఘువంశములో వర్ణించిన రాజవంశము విష్ణుపురాణములో నున్న దని దక్షిణావర్తనాథుఁడు రఘువంశవ్యాఖ్యానమునఁ జెప్పుచున్నాఁడు. కాళిదాసుని రఘువంశమున కేయితిహాసము మూలముగ నున్నదో యాయితిహాసమునే భాసుఁడు మూలముగ స్వీకరించి యుండవచ్చును. ఇట్లనుకొనుటలో వైరుధ్య మేమియు లేదు.

ఇఁక నీరూపకము లన్నియు వట్టికూర్పు లనువాద మెంత సమంజసముగ నున్నదో పరికింతము. సహృదయాదిరూపకములను బరిశీలించినచో నివి వట్టి కూర్పు లనలేరు. చారిత్రికదృష్టితోఁ బరిశీలింపక కేవల సహృదయ దృష్టితోఁ జూచినను స్వప్నవాసవదత్తమందలి యాత్కృష్ట్యము సహృదయుల కవగత మగును. సంస్కృత భాషాభిజ్ఞు లొకసారియైన నారూపకమును జదివితీరవలయును! అది య టుండనిండు. ఈనాటకములందుయందు భిన్నభిన్నకవుల శ్లోకములు గూడఁ గానవచ్చుటలేదు! రూపకములలోఁ బ్రాచీనత్వము ప్రస్ఫుటముగ నున్నది. ఇట్టిచో వీనిని వట్టికూర్పులన నెట్లు సాహసించిరో తెలియకుండ నున్నది. స్వప్నవాసవదత్తములో నొక యంకమును, అభిషేకనాటకములో నొకయంకము నని యిట్లు వేర్వేరంకముల నాడునాచారమే గాని పుస్తకములఁ గూర్చు నాచారము లే దని వా రిచ్చిన పుస్తకములపట్టికవలననే తెలియుచున్నది. కావున నివి కేవలము చక్కయారులు కూర్చినకూర్పులు గావు. గ్రంథములోఁ గవినామనిర్దేశము లేకపోవుటకుఁ గారణ మప్పటిరోజులలో గవినామము నిర్దేశించునాచారము లేకపోవుటయే. ఒకవిషయము మాత్ర మెవరును గాదనఁజాలరు. రూపకములు చాలఁ బ్రాచీనము లగుటచే ననేక లేఖకప్రమాదములకు లోనయి యుండవచ్చును. తత్కారణమున నొకటిరెండుశ్లోకములు ప్రకృతరూపకములలో లేకపోవచ్చును. స్వల్పము కథాభాగముకూడ మాఱి యుండవచ్చును.

మఱియు, మ. త. గణపతిశాస్త్రిగారు మొదలగు భారతీయవిద్వాంసులచేతను- కీతు, వింటర్‌నిడ్జి మొదలగు పాశ్చాత్యపండితులచేతను నధికము లగుమన్ననలం బడసినవి. ఇంక, కీత్పండితుని యభిప్రాయ మాలోచింతము. ఈతం డీరూపకముల యాప్తార్థ్య మంగీకరించెను గాని యశ్వఘోషుని కంటె భాసుండు నవీనుం డని యాతని యభిప్రాయము, కాని, "కాష్ఠాదగ్ని ర్జాయతే మథ్యమానాత్ । భూమి స్తోయం ఖన్యమానా దదాతి । సోత్సాహానాం నాస్త్యసాధ్యం నరాణాం మార్గారబ్ధాః సర్వయత్నాః ఫలంతి॥ అను శ్లోకమే ప్రాచీనత్వమును సూచించుచున్న దని సహృదయులకు విదితముకాకపోదు.

ప్రాకృతములనుబట్టి కూడం బ్రాచీనత్వనవీనత్వములను నిర్ణయించుటకు వీలులేదు. అనుకరణమువలనం గూడ నిట్టివి సంభవింపవచ్చును. మొన్నమొన్నవ్రాసిన యొకకవికూడం గాళిదాసప్రాకృతములతో సమాన మగుప్రాకృతములను వాడవచ్చును. మిగిలినకారణముల వలనం బ్రాచీనత్వము స్థిరపడినచోం బ్రాకృతములు తత్సహకారు లగును. అంతియె కాని కేవలప్రాకృతములం బట్టి కాలనిర్ణయము చేయవీలులేదు. కావున, ప్రాకృతవాదముచే నశ్వఘోషుండు ప్రాచీనుం డనుటకు వీలులేదు.

నిశ్చితముగ భాసునికాలము నిర్ణయించు సాధనము లింతవఱకు లభింపలేదు. కావునం బ్రస్తుతపరిస్థితులలో భాసుండు కాళిదాసునికంటెను నశ్వఘోషునికంటెను బ్రాచీనుం డని నిశ్చయింపవచ్చును. మ. త. గణపతిశాస్త్రిగారు చెప్పినట్లంతప్రాచీనుండు గాకపోయినను క్రీ. పూ. 2 వ శతాబ్దప్రాంతమున నుండవచ్చును. పాణినీయమునకు విరుద్ధము లగుప్రయోగము లున్నంతమాత్రాన పాణినీయముకంటెం బ్రాచీనుండు కానక్కఱలేదు. మునిశబ్దము నవీనులకుం గూడ నున్నది. భరతముని యే మన కుదాహరణము- అర్థశాస్త్రముకూడ నిశ్చయముగ క్రీ. పూ. 4 వశతాబ్దములోని దనుకొనుటకు వీలులేదు. కావున క్రీ. పూ. 2 వశతాబ్దమే యుచితముగ నున్నది- పైవాదములచే మన మిది నిశ్చయింపవచ్చును. 1. భాసమహాకవి స్వప్నవాసవదత్తము వ్రాయుట. 2 ప్రకృతరూపకమును బ్రాచీనరూపకమును న్నొకటియేయగుట. 3. శైలినిబట్టి మిగిలిన రూపకములుగూడ భాసకృతము లనుట. భాసుం డశ్వఘోషకాళిదాసులకంటెం బ్రాచీనుండగుట. ఈరూపకములు కేవలము కేరళదేశమందే లభించుటచే నొకవేళ భాసుండు కేరళదేశీయుం డేమో యనిసందియము గలుగుచున్నది. కాని యాతనిగ్రంథములం దుత్తరదేశపరిచయమే యెక్కుడుగం గానవచ్చుచున్నది. ఏది యెట్లున్నను నింతరమణీయభాసనాటకపఠనాభాగ్యము గలిగించినందులకు మహామహోపాధ్యాయ త. గణపతిశాస్త్రిగారు వందనీయులు. మిగిలినభాగమున రూపకములం గూర్చి వ్రాసెదను.

# రంగనాథరామాయణము—రంగనాథుఁడు.

—జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు—కడప—

---

శ్లో. దంభం నోద్వహతే ననిందతి పరాన్ నోభాషతే నిష్ఠురం
ప్రోక్తం కేనచిదప్రియంచ సహతే క్రోధంచనాలంబతే।
జ్ఞాత్వా శాస్త్రమపి ప్రభూత మనిశం సంతిష్ఠతే మూకవ
ద్దోషాంశ్ఛాదయతే గుణాన్ వితనుతే చాష్టౌగుణాః పండితే॥

మహనీయులారా! సత్యాన్వేషణతత్పరులారా!

రంగనాథరామాయణము నెఱుంగనివా రాంధ్రులలో నుండరని నావిశ్వాసము. చిరకాలముక్రింద రచింపఁబడినను క్రొత్తగా రచింపఁబడిన గ్రంథమువలె రంగనాథరామాయణము నెల్లవారును బఠింతురు. 'ద్విపదకావ్యంబు ముదిలంజ దిడ్డిగంత, యియ్యనేరనిరండ నాగ్లేకరాశి' యని వేణుగోపాలశతకంబునఁ జెప్పినపగిది నీరంగనాథరామాయణము నీసడించువారు లేరు. ఆమహనీయునిపుణ్య మెట్టిదో యెఱుంగఁజాలను. రంగనాథరామాయణమున ననేకభాగములు లోపించి యుండఁగాఁ దాళపత్రగ్రంథములను బరిశీలించి కొన్నియేండ్లకుఁ బూర్వమున సన్మిత్రవర్యు లగు కావ్యస్మృతితీర్థాభినవాంధ్రవాల్మీకిబిరుదాంకితు లయిన బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు సంస్కరించి యుండిరి. సంస్కృతాంధ్రాదిగ్రంథోద్ధారకు లగు మ॥ రా॥ రా॥ శ్రీ వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రులుగా రద్దానిని బ్రకటించిరి. అందు నింకను గొంతగ్రంథభాగము చేర్పవలసినట్లు మఱికొన్నిపుస్తకములలోఁ గలదని శ్రీశర్మగా రవకాశ మున్నపు డద్దానిం బరిశీలించుచున్నవారు. వారికడ నున్నపుస్తకములలోఁ గొన్నింటిలోఁ గొన్ని కీటకచ్ఛటాభక్షితము లైనవి. శ్రీకృష్ణావతారతత్త్వమును వ్రాయుచు నాకార్యమును మానిరి. రెండువత్సరములక్రిందట మ॥ రా॥ రా॥ శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు రంగనాథరామాయణమును సంస్కరింప వారిని బురికొల్పిరి. తత్త్వమును బూర్తిచేసి యాకార్యమునకుఁ గడంగుదుమని శ్రీశర్మగారు తెలిపిరి.

రంగనాథరామాయణమును రెండుమూఁడుసారులు పఠించితిని. గ్రంథకర్త యెవ్వరనువిషయము నించుక తెలియఁదగు నని తోఁచెను. నాయోపినంతవట్టుఁ బరికించితిని. తోఁచినవిషయము నిందు వ్రాయుచున్నాఁడను. ఇదియే

సిద్ధాంత మని వాదింపఁబూనను. ఇందే దేమాత్రమే సారముండినఁ బరిగ్రహింపుఁడు. లేదేని వదలుఁడు. నేను బెద్దవిమర్శకుఁడనుగాను. నన్నెవ్వరును బ్రతిపక్షుమునిగా గ్రహింపరా దని మాత్రము విన్నవింతును.

రంగనాథునికాలాదుల నిపుడు చర్చింప నక్కఱలేదు. కవిజీవితములే వానిని జర్చించినవి. రంగనాథుఁ డెవఁ డనియే యిపుడు చర్చింపఁదగినవిషయము. కోన బుద్ధారెడ్డి గ్రంథకర్త యని ప్రతికాండాంతమున నుండఁగా రంగనాథుఁడు కవియను ప్రతీతి యేల కలిగెను. అనువిషయము నూరక త్రోసిపుచ్చరాదు. రంగనాథుఁ డనుపేరుగల వ్యక్తియే లేదా? ఆతనికిని బుద్ధారెడ్డికిని సంబంధమే లేదా? అను నీరెండువిషయములును బరిశీలింపఁదగినవి. గ్రంథమును దిలకించినపు డీసంశయమున కవకాశమే లేదని తోఁచును. లోకప్రతీతిం బరికించిన రంగనాథుఁ డనుమహాకవి కలఁడనియే తోఁచును. ఇందు రెండువాదములు గలవు. కోన బుద్ధారెడ్డియే గ్రంథకర్త. పండరిపురి వెంచేసిన దేవుని పేర గ్రంథమును రచించెను. కావున రంగనాథరామాయణ మనుపేరు వచ్చినది. అంతియ కాని రంగనాథుఁడు లేనేలేఁడు. బుద్ధారెడ్డి యాస్థానకవి యని కల్పించుట యసంగతము. అనునది యొకవాదము. రంగనాథుఁడు బుద్ధారెడ్డియాస్థానమున నుండి తనపేరున రామాయణమును బ్రభువతంసుఁడు వ్రాసినట్లు వ్రాసెను. అనునది యొకవాదము. ఈరెండువాదములకును దగు కారణములు కలవు. ఇందేది న్యాయమార్గము ననుసరించును? అనునదియే ప్రకృతవిషయము. ఏవాదమునం దైనను గొన్నియుక్తులచే సాధింపఁదగు విషయము లుండకపోవు. ఆయూహలనే ప్రధానముచేసికొని తన పట్టినపట్టును సాధింపఁ బూనుట యంత సరసము గా దని నాయాశయము. ఏవాదమునైనఁ గొందఱు మెచ్చుకొనువా రుండకపోరు. రంగనాథుఁ డనుకవియే లేకున్న నొకపేరు గల్పించి యాతని యాస్థానపండితుఁ డని నిర్ణయించి యాతని కొక యింటిపేరు వెలిచేటివా రని సృజించి యెంతకాలమునుండియో మహనీయు లాతని స్తుతులలోఁ బరిగణించి వినుతించి తత్కవిత్వమును బొగడుచుండుట తెలివితక్కువచేతనే కాని వేఱుకా దనవలయును. అట్లే యందున్న శాసనములుకూడ నట్లే కల్పింపఁబడినవి కొన్ని కల వనవచ్చును. శాసనములఁ బరీక్షించుటలోఁ దమయాయుస్సును ధారవోసిన పెద్దలుకూడఁ గొన్నిశాసనములు సర్వాసంగతములుగా నున్న వనిరి. గణపతిదేవుని కాలనిర్ణయమున నీవిషయము కను

పట్టును. ఒక్క శాసనము తప్పుగానున్నదని యొప్పుకొననప్పుడు శాసనములనే నమ్మి విషయమును సిద్ధాంతముచేయవలదనియుఁ దేటపడును.

ఒక్క ప్రభువును గుఱించిన శాసనములలో నీమహానీయుఁడు కవిత్వము చెప్పుచున్నవాఁడని వ్రాయఁబడుచో నది సర్వాసంగత మనవలయును. దీనిచేఁ బ్రభువులు కవిత చెప్పఁజాల రని కాదు. శాసనములలో నే నీకవిత్వము చెప్పితి నని కవి గాని ప్రభువు కాని వ్రాసికొనుట సంగత మగునా ? మహోదాత యని, ప్రతాపాదిత్యుఁ డని, కవివర్యుఁ డని, ప్రజారంజకుఁ డని మఱియు నిట్టి విశేషణములు చేర్చవచ్చును. కాని యీ గ్రంథము వ్రాసినది నేనే కాని మా యాస్థానపండితుఁడు కాఁడు. అని యొకశాసన మున్నచో నెవఁడో దేవానాంప్రియుఁడు కల్పించె ననవలయుఁ గాని వేఱుకాదు. కోన బుద్ధారెడ్డి లేఁడ ని కాని, సత్ప్రభువరేణ్యుఁడు, పండితుఁడు, కాఁ డని కాని, పండితస్తుతిపాత్రుఁడు కాలే దని కాని యెవ్వరును జెప్పలేదు పండరపురిదేవునిపేర నీగ్రంథము వ్రాయఁబడినది కాన రంగనాథరామాయణ మనుపేరు కల్గిన దనుట సాధువాదము కాదు. పాండురంగఁడు, విఠల్ పాండురంగఁడు, అనుపేరులు ప్రసిద్ధములు కాని రంగనాథుఁ డనుపేరు ప్రసిద్ధము కాదు. పాండురంగరామాయణ మని కాని విఠల్ రామాయణ మని కాని యుండినచో నాయుక్తి బాగు గనుండును. శ్రీరంగనాథునకే రంగనాథుఁ డనుపేరు విఖ్యాతము. ఎందేని యొకచోట రంగనాథుఁ డని పాండురంగనికిఁ బేరు వాడఁబడినను నది ప్రమాణముకాదు. రంగనాథుఁ డనుపేరు పండరిపురనాథునకుఁ జెల్ల దని నాయూహ కాదు. శివునకుఁ గూడఁ జెల్లవచ్చును. లోకప్రఖ్యాతవిషయ మిది యని మాత్రము తెలిపితిని.

"అని యాంధ్రభాష భాషాధీశవిభుఁడు, వినుతవాక్యాగమవిమలమానసుఁడు, పాలితాచారుఁ డపారధీశరధి, భూలోకనిధి కోన బుద్ధభూవిభుఁడు, తమతండ్రి విఠల ధరణీశుపేర."

అని కాండాంతములఁ గానఁబడును. సుహృదయు లీవాక్యములఁ బరిశీలింపఁగలరు వినుతవాక్యాగమవిపులమానసుఁడు, పాలితాచారుఁడు, భూలోకనిధి, అనునీవిశేషణము లితరులచేఁ జెప్పఁబడినవే యని ధృఢపడుచును. బహువచనము మాత్రము కాదు. సామాన్యదృష్టిం బరిశీలించిన నీవాక్యములు వారియుండు మక్కువ యెక్కువ గల యొకరిచే వ్రాయఁబడినవియే కాని వేఱు

కా వని స్పష్టపడును. అంతియ కాదు. గ్రంథాదియం దిట్లున్నది.

“బహుపురాణజ్ఞులు బహుశాస్త్రవిదులు,
బహుకావ్యనాటకప్రౌఢమానసులు
హితులు మంత్రులు పురోహితులు నాశ్రితులు
సుతులు రాజులు బహుశ్రుతులును గొల్వ
దీపించి భూలోకదేవేంద్రుపగిది, నేపారి యున్నచో నింపుసొంపొంద,
రసికులు భారతరామాయణాది, రసగోష్ఠిఁ జెల్లింప రసికశేఖరులు,
రామకథాసుధారసరక్తుఁ డగుచు, నామహాసభలోన నందఱఁ జూచి,
రమణమైఁ దెనుఁగున రామాయణంబు, క్రమ మొప్పఁ జెప్పెడి ఘనకావ్యశక్తి
గల కవులెవ్వారు గల రన్ననుచుఁ, దలపోయ విఠలధరణీపాలునకు,
నున్నతమూర్తికి నురుయశోనిధికి, విన్నవించిరి వేడ్క విబుధులు గడఁగి,
నీ తనూజన్ముండు నిపుణమానసుఁడు, ధూతకల్మషుఁడు బంధురనీతియుతుఁడు,
సర్వజ్ఞుఁ డనఘుండు చతురవర్తనుఁడు, సర్వపురాణవిచారతత్పరుఁడు,
కమనీయబహుకళాగమవిచక్షణుఁడు, సుమనీషిపోషణోత్సుకసుఖోన్నతుఁడు
కవిసార్వభౌముండు కవికల్పతరువు, కవిలోకభోజుండు కవిపురందరుఁడు
ప్రత్యర్థిరాజన్యబలవజ్రపాణి, ప్రత్యర్థినృపదావపావకోజ్జ్వలుఁడు,
భీకరఖడ్గబింబితస్వర్గమర్త్య-లోకానురక్త త్రిలోకదుర్దముఁడు,
వరసాధుజలజాతవనజాతహితుఁడు, పురుషచింతామణి బుద్ధభూవిభుఁడు
నీకతిభక్తుండు నిఖిలశబ్దార్థ, పాకజ్ఞుఁ డనఘుండు పాండిత్యధనుఁడు,
మఱియు రామాయణమర్మధర్మజ్ఞుఁ, డెఱుఁగు నాతనిఁ బిల్వ మీకథఁ జెప్ప,
ననిన మజ్జనకుం డుదాత్తవర్తనుఁడు, ననునర్థిఁ బిలిపించి నను గారవించి”

... ... ... ... ... ...

తప్పక నాపేరఁ దగనంధ్రభాషఁ, జెప్పి ప్రఖ్యాతంబు చేయింపుమర్థి-అని ప్రభువతంసుఁడు విఠలరాజు పేరోలగంబున నుండి తెనుఁగున రామాయణము ను నూర్పఁగలవా రెవ్వరేఁ గలరా యని తలపోసెను. తత్సభాసీనులగు పండితేంద్రులు త్రికాలజ్ఞులు గాఁబోలు వారిమనోభావంబు నెఱింగి “నీతనూజన్ముండు” అనునది మొదలు “అతనిఁ బిల్వ మీకథఁ జెప్ప-” అనునంతదనుకఁ గల గ్రంథము ను ద్విపదరూపమునఁ బల్కిరి. కొడుకు తెలివితేటల నంతను చక్కగా నెఱుఁగని యారాజు ప్రీతిచేఁ గొడుకును బిలువంబంచి నాపేర రామాయ

ణము నాంధ్రభాష రచియించి ప్రఖ్యాతిచేయింపు మని యాజ్ఞాపించెను.

మహాశయులారా ! ఈభాగము నించుక విమర్శింతము. ఆనాఁటిసభలో భూపాలునిసుతులు కలరు. తక్కుంగల పండితప్రముఖులును గలరు. కాని బుద్ధరాజు మాత్ర మాదినమున నందులేఁడు. ఆనాఁడే రాజు రామాయణాంధ్రీకరణమును గుఱించి యోజించెను. ఇంగితజ్ఞులుగాన రాజుమనశ్చింతితార్థమును సభ్యులెఱింగిరి. అంతియగాక ముందు బుద్ధరాజు ద్విపదకావ్యముగా రామాయణము నాంధ్రీకరించు ననియు నెఱింగిరి. అందుఁ గూరుచున్నవా రెల్లరును ద్విపదరూపమునఁ గవిత్వము చెప్పఁగలవారుగనే యుండిరి. తమ్ముంగాంచి ప్రభుశిరోమణి యిట్లూహించె నని క్షణమాత్రమున నెఱింగిరి. ఇందుఁ గల యొక్కొక్క విషయ మొకదాని కొకటి విరుద్ధముగ నున్నది. “సీతనూజన్ముండు నిపుణమానసుఁడు.” అను మొదలుగాఁ గల గ్రంథమునఁ గలవిశేషణములఁ బరికింప నివి యాబుద్ధభూవిభుఁడు చెప్పుకొన్నవి కా వనియు, నాతేనియందుఁ బ్రీతిగల యొక్కకవి చెప్పెననియు స్పష్టము. సభలో నున్నవా రెల్ల ద్విపదరూపమున రాజునకుం దెల్పి రనునది సర్వాసంగతమగు విషయము. ఊహింపఁ దగిన దేమనఁగా:- రామాయణమును నూత్నపద్ధతిగా నాంధ్రీకరించిన మే లని బుద్ధరా జూహించెను. తమయాస్థానమునఁ గలవిద్వత్కవి రంగనాథున కాజ్ఞాపించెను. అక్కవి ప్రభువర్యు నాదృతికి మిగుల సంతసించి యారాజు రచించినట్లే కావ్యమును వ్రాసి పితృపాదభక్తుఁ డగునారాజునభీష్టము నెఱింగి వారి తండ్రిపేరఁ గావ్యము నంకితముచేసెను తనకుంగల ప్రభుభక్తి తేటపఱుపఁ జేయుటకై యాప్రభువర్యునకుం గలసకలసద్గుణములను గృతజ్ఞుఁడు కాఁబట్టి సభ్యులు చెప్పినట్లు వ్రాసెను. అని యూహించుటపొరపాటు గాదు. ఇది సరి కాదు. రాజే యిట్లు ద్విపదరూపమునఁ బండితులు చెప్పినట్లు చెప్పె నన్నచో నంతకంటె నీరసము, నసంగతము, ననుచితము నగు వాదము లేదు.

రాజు రచించె నని వాదించుచో, ౧ లోకమున లేనిరంగనాథుని మహాకవులు సృజించిరి. ౨ ఇంటిపేరు కూడఁ గల్పించిరి. ౩ బుద్ధరాజునందుఁ గల యాసున నీమార్గమును నూతనముగ వెదకి యావిద్వత్కవిప్రభువరుని వినుతింపరైరి. ౪ ఇంచుక యైనను లోకజ్ఞాన మీపూర్వకవులకు లేదు. ౫ వీరెల్ల నెద్దినె ననినఁ గొట్టంబునఁ గట్టింపు మనునంతటిమూఢులు. అను నీబహుమానము లెందఱికో మన మీవలసివచ్చును.

“క్రమ మొప్పఁ జెప్పెడి ఘన కావ్యశక్తి, గలకవు లెవ్వారు గల రుర్వి ననుచు”

అను సీసెంపు పాదములను రచించినవా రెవ్వరు? పిఠలరాజా? లేక శాసనములు చెక్కువారా? లేక మూలమూలలఁ బడియున్న శాసనములఁ ద్రవ్వువారా? అని ప్రశ్నించినపుడు- వీ రెవ్వరుఁ గాదు, వే ఱొక్క రనవలయును. అపుడు రంగనాథరామాయణగ్రంథకర్త లెందఱు? అన్న ప్రశ్నము వచ్చును. పెక్కిం డ్రనవలసినదే కాని వేఱుగతి లేదు. కావున నీవాదము సర్వాసహ్యమూల మగుచు. తత్త్వ మే మనఁగా:- లోకమున నే గ్రంథకర్తయైనను దాఁ జేయఁబూనిన గ్రంథమునకుఁ బ్రణాళిక నిర్ణయించుకొని యిష్టదేవతాస్తుతి నొనరించి యవ్వలఁ ద న్నెవరైనఁ బురికొల్పియున్న యెడల వారి మాటలు పద్యగద్యరూపములలో దేసచే నైనను దెలిపి గ్రంథమునకుఁ బ్రారంభించును. ఇదియే సనాతనాచారము. కొందఱు తమకు స్వప్నము వచ్చినట్లు, భగవంతుఁ డందుఁ దోఁచి వత్సా! నాపేరను రచింపఁ బూనిన గ్రంథమును సాగింపు మని యాజ్ఞాపించి క్షణమయినను నుండక యదృశ్యుఁ డైనట్లు తెలుపుదురు. ఆదైవము తనతోఁ బద్యరూపమునఁ జెప్పియున్నట్లు గ్రంథమున నున్నను భగవద్వాక్యము లివి యని గ్రంథకర్తయే వ్రాయును. ఇది యెల్ల రెఱింగినవిషయము కాని క్రొత్తదికాదు. అట్లే రంగనాథరామాయణమునందు నని యెఱుంగఁదగు.

వెలిచేటి రంగనాథకవి ప్రభుసమ్మానితుఁ డయి కృతజ్ఞతం గొని గ్రంథమును రచింపఁబూని ప్రభుసద్గుణముల వేఱుమార్గమున వర్ణింప వలనుపడమి నితరులచేఁ జెప్పించెను. ఇన్ని విశేషణములు ప్రభువే గ్రంథకర్త యైనఁ జేర్చి యుండఁడు. “మేము” “మాకు” అను మొదలగు బహువచనములు ప్రభువులు సన్న్యాసులు జగత్కుటుంబులు గాన నుపయోగింతురు. అది యాత్మస్తుతి కాదన్న నంగీకరింపవలసినదే. ఆత్మస్తుతి నెందఱో చేసికొన లేదా? యను ప్రశ్నమునకు సమాధాన మీయవలసియున్నది. ఆముక్తమాల్యదయందు

“సీ. పలికి తుత్ప్రేక్షోపమల జాతి పెంపెక్క రసికులౌనన మదాలసచరిత్ర
భావధ్వనివ్యంగ్యసేవధిగాఁగఁ జెప్పితివి సత్యావధూప్రీణనంబు
శ్రుతిపురాణోపసంహితలేర్చి కూర్చితి సకలకథాసారసంగ్రహంబు
శ్రోత్రఘుచ్ఛటలు విచ్చుగ రచించితి సూక్తినైపుణి జ్ఞానచింతామణికృతి

తే. మఱి యు రసమంజరీముఖ్యమధురకావ్య
రచన మెప్పించి కొంటి గీర్వాణభాష
నంధ్రభాష యహధ్యంబె యందు న్కొక్క
కృతి విన్నిర్మింపు మింక మాకుఁ బ్రియముగాఁగ"

అని కలదు. ఈపద్యముం జూపి యిది యాత్మస్తుతి కాదా యన్నచో వారి క్కొక్కనమస్కారమే సమాధానము. తనకుం గలశక్తి నేదేని యొకరూపమునఁ జెప్పుకొనుట యలవాటే యనవలయును. కాశీఖండమునందు,

"సీ. వచియింతు వేములవాడభీమునభంగి నుద్దండలీల న్కొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టుమార్గంబున నుభయవాక్ప్రౌఢి న్కొక్కొక్కమాటు
వాక్రుత్తు తిక్కయజ్వప్రకారము రసాభ్యుచితబంధముగ న్కొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధపరమేశ్వరునితేవ సూక్తివైచిత్రి న్కొక్కొక్కమాటు
తే. నైషధాదిమహాప్రబంధములు పెక్కు, చెప్పినాఁడవు మాకు వాశ్రితుఁడవనఘ
యిపుడు చెప్పఁదొడంగిన యీప్రబంధ, మంకితము చేయు వీరభద్రయ్యపేర.
శా. ఈక్షోణి న్నినుఁబోలు సత్కవులు లేరీమేటికాలంబునన్
దాక్షారామచళుక్యభీమవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయగంధసారఘుసృణద్వైరాజ్యభారంబున
ధ్యక్షించుం గవిసార్వభౌమ! భవదీయప్రౌఢసాహిత్యముల్."

అను శ్రీనాథోక్తి యాత్మస్తుతి కాదా యన్నసమాధానమే మీవలయు నో విజ్ఞు లూహింతురుగాక! ఇట్టివే రంగనాథరామాయణమునఁ గలయాత్మస్తుతు లన్నను నూరకుండుటయే సముచితకార్యమని తలంచువాఁడను.

శ్లో. యేనామ కేచి దిహనః ప్రథయం త్యవజ్ఞాం
జానంతి తే కమపి తాన్ ప్రతి నైష యత్నః!
ఉత్పత్స్యతేఽస్తి మమకోఽపి సమానధర్మా
కాలోహ్యయం నిరవధి ర్విపులాచపృథ్వీ- అనిభవభూతియు-
దిగంతరలుఠత్కీర్తి రనంతకవికుంజరః।
ప్రాణైస్తుల్యాంసరస్వత్యాః ప్రాణైషీ చ్ఛంపుభారతమ్.

అని యనంతకవియుఁ జెప్పుకొనలేదా యని యడిగిన సమాధాన మేమి? మహాశయులారా! యించుక యోజింపుఁడు తనకుఁ గలశక్తిని దెలుపు కొనకుండుట మహాత్ముల పద్ధతియే యైనను గవుల యాచారమును బట్టి

చూచిన నది యాత్మస్తుతి కాదనవలయును. ఇట్టిస్తుతికి రంగనాథరామాయణమునఁ గల "ధూతకల్మషుఁడు బంధురనీతియుతుఁడు" లోనగు వాక్యములచే గుంభితమగు స్థలమునఁ గల స్తవమునకు హస్తిమశకన్యాయము గలదనియు, నట్టివాక్యముల విద్వత్ప్రభువతఁడు చెప్పియుండఁ డనియుఁ జెప్పుటయే తగినసమాధానము. కొందఱు సుద్ది లేని ప్రతినున్నట్లు కల్పించి సత్యాన్వేషణము చేయువారివలె నటింతురు. కాని మహాకవి యగు రంగనాథు నణఁగఁ ద్రొక్కుట యుక్తమేతరకార్య మనియు, మహాకవు లెంతకాలమునుండియో యెన్ని విధములనో రంగనాథునిఁ బ్రామాణికులలోఁ జేర్చినుతించు టవివేకమునఁ గాదనియు, మన కున్నంతమాత్రము విజ్ఞానము వారికి నుండుననియు "సతి కుడ్యే చిత్రలేఖన"మ్మనున్యాయము వారు నెఱుఁగుదురనియు, నొక్కరు గాకున్న నొకరైనను బుద్ధారెడ్డిగారిని గవులలోఁ బరిగణింపకయుండునంత యసూయ పూర్వకవులకు లేదనియు శ్రీకృష్ణదేవరాయని రామరాజభూషణునిఁ బొగడినవారీవిద్వత్ప్రభువు ను నుతింప కుండుటకుఁ దగినకారణము రంగనాథకవికర్తృకమీరామాయణ మనుటయే యనియు గ్రహించి లేనికారణములఁ గల్పింపఁ బూనకుందురనియుఁ బ్రార్థించువాఁడను. ఎన్నియో విషయములు పరిశీలించినట్టియు, యశఃకాయు లైనట్టియు, మ. రా. రా. శ్రీ కందుకూరు వీరేశలింగముపంతులుగారు, వంగూరు సుబ్బారావుగారును నిట్లే యభిప్రాయముల నొసఁగిరి. పండితకవు లై చక్కని విమర్శకు లైన బ్రహ్మశ్రీ నాగపూఁడి కుప్పుస్వామయ్యగారు రచించినరంగనాథరామాయణపీఠికం గనుంగొనుఁడు. ఎల్లరును రంగనాథుఁడే రామాయణమును రచించినట్లు గ నేకగ్రీవము గ నంగీకరించియున్నారు. ఆముక్తమాల్యద నల్లసాని పెద్దనగారు రచించి రనుప్రవాదము సకారణముగనే వ్యాపించినను శ్రీకృష్ణదేవరాయలను బూర్వకవులలోఁ బెక్కండ్రు వినుతించిరి. అట్టిప్రవాదమే గలయీబుద్ధారెడ్డి నేలపరశ్రేయస్సహనముగల పండితకవులు పూర్వకవిస్తుతిలోఁ జేర్పలేదో. మఱి యే గ్రంథములు రచింపని రంగనాథు నేలవినుతించిరో యాఱువేలనియోగిబ్రాహ్మణులలోఁ జేర్చి వెలిచేటివారను నింటిపేరు కూడఁ గల్పించిరో యూహింపశక్యము గాకున్నది. ఎందఱినో ప్రాచీనకవిరాట్టుల నవివేకు లనుటకంటె మన కావిషయము నిర్ణయించునంతటివివేకము లేదని తలంచుచో నొక్కలోపమును రాదు. కావున మహనీయు లగుకవిపుంగవుల యుక్తాయుక్తవివేకశూన్యులనుగాఁ జేయ సాహసింపరాదు. ఇదియె నేఁ జేయు ప్రార్థనము.

కొన్ని శాసనములఁబట్టి నన్నయభట్టు తిక్కనసోమయాజియు నించుమించుగా నేకకాలమువా రని చెప్పవచ్చు నని యొకవాదము రాఁగా నందుఁ గొన్ని శాసనములు కల్పితములు కావచ్చు ననియు రాజులపాలనమును గుఱించిన గ్రంథముల ననుసరించి సిద్ధాంతముచేయఁ దగు ననియుఁ బ్రతివాదము వచ్చెను. తుద కదియే న్యాయానురూప మనియుం దేలెను. శాసనములు కూడఁ గొన్ని పరస్పరవిరుద్ధములుగనే కనంబడును. అటులని వానిం ద్రోసిపుచ్చం దగునని నాయాశయముకాదు. వానిం బ్రధానముగాఁ గొన్నను గేవలశాసనములంబట్టియే యొకరిచరిత్రము వ్రాయ నను వ్రుపడదు. ప్రాచీనకవుల గ్రంథములనుబట్టియు వ్రాయవలసియుండును. జనప్రవాదములు తాఱుమాఱుగ నున్న నందుండియుఁ గొంతవిషయము గ్రహింపఁదగియుండును. ఇన్నివిధములఁ బరిశీలించినను విషయము వేఱొకవిధమున సిద్ధాంతము చేయఁదగినట్లు కారణములు కనఁబడుచుండును. ఎల్లరు నేకవాక్యముగా వచించువిషయము ప్రాయికముగా నుండదు. కోనబుద్ధారెడ్డి వ్రాసెనను విషయమును గూర్చి శాసనములు వెదకనక్కఱలేదు. రామాయణమునందే కలదు. రంగనాథుఁడు వ్రాసినట్లు గ్రంథమునఁ గలవిషయమును బట్టి చెప్పవచ్చు నను నదియే పర్యాలోచింపఁదగినది. 'బుద్ధారెడ్డి రామాయణమును ద్విపదకావ్యముగా రచించెను. అంతియకాని రంగనాథుఁడు కాఁడు.' అని శాసనమున్నచో దాని ప్రమాణత్వ మపుడు విమర్శింపఁదగినది. లేక కోనబుద్ధారెడ్డి విద్యాసంపన్నుఁడు- అను మొదలగువిషయము లున్న నవియు గ్రంథముననే కలవు. ఎవ్వఁడేని బుద్ధారెడ్డి లేఁడని పలికిన నివిగో శాసనము లని నెత్తినఁ బెట్టుకొని పోయి వానిని సభాభవనమున దింపి చూడుఁడీ ఘనమతులారా యనవచ్చును. అంతటిమాట యెవ్వఁడు ననఁబూనలేదు. రంగనాథుఁడు లేఁడు. ఆపేరు బుద్ధారెడ్డికే కలదు, అని శాసనము కనఁబడినపుడు చూచుకొందము. అపుడు విమర్శకాగ్రేసరులు సిద్ధాంతము చేయఁబూనఁగలరు.

ఇఁకఁ బ్రాచీనకవులలో రంగనాథకవిని వినుతించినవారిపద్యములఁ గొన్నింటిని స్థాలీపులాకన్యాయమునఁ గనఁబఱుతును.

అనంతామాత్యుఁడు భోజరాజీయమున—

ఉ. నన్నయభట్టుఁ దిక్కకవినాయకు భాస్కరు రంగనాథుఁ జే
రెన్నికకెక్కినట్టి యమరేశ్వరు నెఱ్ఱయమంత్రి నాదిగాఁ

జన్న కవీంద్రులన్ నవరసస్ఫుటవాణు లనంగ ధాత్రిలో
నున్నకవీంద్రులం దలఁతు నుల్ల మెలర్పఁగ వాగ్విభూతికిన్.
వెన్నెలకంటి సూరన్న విష్ణుపురాణమునందు—

ఉ. మున్నిటి కాళిదాసకవిముఖ్యులకుం బ్రణమిల్లి వారిలో
నెన్నికగాఁ బ్రబంధపరమేశ్వరుఁ దిక్కనసోమయాజులన్
నన్నయభట్టు భాస్కరుని నాచనసోముని రంగనాథునిన్
వెన్నెలకంటి సూర్యుఁ బదివేల విధంబులఁ బ్రస్తుతించెదన్.
కూచిమంచి తిమ్మకవి సర్పపురమాహాత్మ్యమునందు—

ఉ. నామది నెప్పుడుం దలఁతు నన్నయఁ దిక్కన నెఱ్ఱప్రెగ్గడన్
భీమకవీంద్రు భాస్కరుని వీరకవీంద్రుని రంగనాథునిన్
సోమునిఁ బోతసత్కవిని సువ్రతులై బహుళాంధ్రకావ్యముల్
నేమ మెలర్పఁ జెప్పి యవని న్నుతిగన్న మహానుభావులన్.
మఱియు రసికజనమనోభిరామమునందు—

తే. సతతలోకేశ్వర ప్రపూజితనితాంత, రాజమాన ప్రభావుని రంగనాథు
మఱియు నాంధ్రకవిత్వనిర్మాణకుశలు, లగు మహాకవివర్యుల నభినుతింతు.
రాజలింగకవి కూర్మపురాణంబునందు—

సీ. నన్నయభట్టుఁ దిక్కన్నను నెఱ్ఱయకవిని భీమయను భాస్కరునిఁ బోత
రాజును శ్రీనాథు రామలింగయ్యను రంగనాథుని రామలింగకవిని.
ముదిగొండ ధూర్జటిశిష్యుఁ డగునూతనకవి సూరయ్య తనసకలజనాభి
రామమను ధనాభిరామ గ్రంథమునందు-

చ. అలఘుని శబ్దశాసనపదాంకితుఁ దిక్కనసోమయాజి ని
శ్చలమతిశంభుదాసు బుధసన్నుతు నాచనసోమనార్యుఁ జె
న్నలరిన చిమ్మపూఁడి యమరాధిపు భాస్కరు రంగనాథునిన్
దలఁతు నపూర్వచిత్రకవితామహనీయసముగ్రచిత్తులన్.
కుమ్మర మొల్ల రామాయణమునందు- సీసపద్యములోని గీతము.
స్తుతగుణోద్దాము నాచనసోము భీము, నవ్యమంజులవాగ్ధుర్యు నన్నపార్యు
రసికుఁడైనట్టి శ్రీనాథు రంగనాథుఁ, దిక్కకవిరాజు భోజునుతించి మించి.
అయ్యలరాజు నారాయణామాత్యుఁడు హంసవింశతియందు-

ఉ. నన్నయభట్టు భీమకవినాథునిఁ దిక్కనసోమయాజిఁ బె
ద్దన్నను ముక్కుతిమ్మసచివాగ్రణి బమ్మెరపోతరాజు గా

రన్నను రంగనాథుని మహామహులం బిల్లలమఱ్ఱి వీరభ
ద్రు న్నుతియింతు నాంధ్రకవిరుద్రుల సత్కరుణాసముద్రులన్.

కస్తురిరంగకవి ఆనందరంగరాట్ఛందంబున—

సీ. ఆదిమసుకవి భీమనకు దండముపెట్టి యన్నయభట్టుకు నతి మ్రొక్కి
యమరం దిక్కనసోమయాజికిం గేల్మోడ్చి కవిరాక్షసునకు జోకం బ్రణమిల్లి
యలసాని పెద్దన కంజలిగావించి శ్రీనాథునకు రెండుచేతులెత్తి
రంగనాథునకు సాష్టాంగంబు గావించి యలభాస్కరునకు జోహారుచేసి...

కోవెల గోపరాజు రంగనాథుని నియోగికవులలోం జేర్చి తనసింహాసన ద్వాత్రింశిక యను గ్రంథమున-

చ. అనఘు హుళక్కిభాస్కరు మహామతిం బిల్లలమఱ్ఱి పెద్దిరా
జును బినవీరరాజుం గవిసోముని దిక్కనసోమయాజిం గే
తనకవి రంగనాథు నుచితజ్ఞుని నెఱ్ఱన నాచిరాజు సో
మన నమరేశ్వరుం దలంతు మల్లుల చంద్రుల సత్కవీంద్రులన్.

అప్పప్పకవి శశిరేఖాపరిణయంబునందు-

తే. ఆత్మం గంకంటిపాపరాజాఖ్యుంగొలిచి, రంగనాథునిం గరుణాంతరంగుం దలంచి
యెఱ్ఱప్రగ్గడ మదిలోన నెంచియెంచి, వందన మొనర్తుం గవిరాజబృందమునకు.

మహాశయులారా ! ఇంచుమించుగా నైదువందల సంవత్సరములనుండి మహాకవులు రంగనాథుని మహాకవులలో నెట్లుపరిగణించి వినుతించిరో తేటపడియెంగదా? ఇంక నిట్టిస్తుతు లెన్నియేని చూపవచ్చు. ఈస్తుతి నెల్ల నంధపరంపరాప్రాప్తమగు సుద్దియనియే భావింపందగునా? లేక యిందు సత్యముండు నని భావింపందగునా ? యోజింపుండు. ఐదువందలవత్సరముల క్రిందట నున్నవారు కూడ బుద్ధారెడ్డిపైం గినుకంబూని యాశ్రితసురతరువను ప్రఖ్యాతిం బాఱందోలి కృతఘ్నులై వివేకశూన్యులై యిట్టియకార్యమును జేయసాహసించిరని చెప్పుటకు నాకు నోరాడకున్నయది. శాసనములలో రంగనాథరామాయణ మను పేర ద్విపదకావ్యమును గోనబుద్ధారెడ్డి రచించెనని యున్న నదియును నంధత్వమున కుదాహరణమనియే నేనూహింతునని విన్నవింతును. ప్రాచీనకవివరేణ్యులయందు నాకుం గల ప్రపత్తియే నన్నిట్లువ్రాయం బురికొల్పెనో యెఱుంగంజాలను. ఒక్కపక్షము సాధించి దానినుండి యేదో లాభమునో ప్రఖ్యాతినో పడయనెంచిన వాండను గానని హృదయపూర్వకముగా విన్నవించుచున్న వాండను. రంగనాథమహాకవి నప్పకవీంద్రుం డాదిగాం గల ఛందశ్శాస్త్రకర్తలు ప్రామాణి

క్తోత్తమునిగా భావించిరి. వారి నవివేకులనుగాఁ జేయ మొండిపట్టు పట్టరా దనియుఁ బ్రార్థించువాఁడను. శాసనముల నీఘనకార్యనిర్వాహణమునకై ప్రయత్నించి పడరాని బాములం బడవలదనియు విమర్శకశేఖరులం దలయొగ్గి వేఁడువాఁడను.

ఇంకొక్క మనవి:—నాయీయాశయమే సిద్ధాంతముకాదు. తమవంటి పెద్ద లెల్ల దేనిని సిద్ధాంతముచేసిన దానినే వేదవాక్య మని యంగీకరించువాఁడను. ఇక్కాలమునఁ గ్రొత్తమార్గ మొక్కదానిని వెదకి దాని నెట్లో సిద్ధాంతముచేసి తమయపూర్వపాండిత్యమును వెల్లడింపఁజేయఁ బ్రయత్నించువారందందుఁ బొడసూపుచున్నవారు. కుతర్కములచే నేదియు సిద్ధాంతము కాఁజాలదు. ఐన నది చాలకాలము నిలువదు. మహామతులు తత్త్వజ్ఞు లుండకపోరు. ఒక్కొక్కవిషయము మథించి మథించి సారముఁ దేల్చుమహాత్ములు పుట్టకపోరు. ఈవాదమునందుఁ గల తత్త్వసారము నిది యని తేల్చి నావంటియల్పమతుల నానందింపఁజేయు భారము వారిశీర్షముపై నున్నది. వాదిదౌర్బల్యమున వాదము వీఁగిపోవును. కాని వాదము మఱియొకప్పుడు విజయము నొందఁగలదు. వేదమూలము లగు మతసిద్ధాంతములే తాఱుమాఱగుచున్నప్పు డిట్టివాని మాట యిట నేటికి? వాదమును జక్కఁగా నడుపఁ జాలిన శక్తి నాకు లేకపోవచ్చును. ఈవాదమున నేదేని సత్యముగల దని తమచిత్తములకుఁ దోఁచునేని దానినివృద్ధినొందింపుఁడు. అసత్యమూలమే యి దగునేని యీయపఖ్యాతి నాకు లేదు. ప్రాచీనసత్కవులపైఁ బడఁగలదు. ఇంతకంటె విశేషించి విన్నవింపఁజాలను. తాటియాకులప్రతులఁ బరిశీలించి చక్కఁగా సంస్కరించువారు మాయూరఁగలరు. వా రచిరకాలముననే మరల నీరంగనాథరామాయణమును ముద్రింపఁగలరు. అట్టివా రెందఱుండినను వారీనావాదమును దిలకించి సత్యాన్వేషణమున మహాదృతిం గాంచి పరిశీలింతురుగాక! ప్రాచీనమహాకవులకుం గలజ్ఞానమిట్టి దని తెల్పి యెల్లర నానందపరవశులనో వ్యథాసాగరనిమగ్నులనో యొనరింతురుగాక! రంగనాథుఁడు మాకులపూర్వుఁడు కాఁడు. ఏదేశవాసుఁడో తెలియ లేదు. ఆతనిదే యీకవిత్వమని సిద్ధాంతముచేసినచో నాకు వచ్చుప్రతిష్ఠ యేదియో యూహించుభారము తమయందే యునిచితిని. రంగనాథునిపాండిత్యము, కవితాప్రాశస్త్యము మున్నగునవి యెల్లవారికి విదితమే కావున నిట విన్నవింపఁదలఁప లేదు. ఇంతకంటె నెక్కుడువిన్నవింపఁ జాలను. ఎవ్వరుఁగాని నాయందుఁ గినుకఁ బూనరాదని యంజలిఘటించి వేఁడుచున్నవాఁడను. ప్రాచీనోక్తి సత్యము జయించుఁ గాక?

# శతకపఠనావశ్యకత.

—॥ అయ్యలసోమయాజుల కాశీపతిచయనులుగారు-కిర్లంపూఁడి ॥—

---

ఆంధ్రగ్రంథములలోఁ బురాణములు, ప్రబంధములు, గద్యపద్యగ్రంథములు (చంపూగ్రంథములు) కేవలగద్యకావ్యములు, శతకములు మొదలగునవి వేనవేలు గలవు. అందుఁ గొన్ని భాగవతాత్మకములు, కొన్నిశృంగారరసభరితములు నై యున్నవి. అందు సకలధర్మసమ్మతములైన యష్టాదశపురాణముల నంతగాఁ బఠింపకున్నను బంచమవేద మనఁబరగు భారతమును, భక్తిశృంగారాత్మక మగుభాగవతమును సకలజనాదరణపాత్రమై నీతిబోధకమగు రామాయణమును, మనవారలు తఱచుగాఁ బఠించుచున్నారు. అందలికథలు నాటకరూపముగ మహాకవు లనేకులు పండితపామరజనాహ్లాదకరముగ నుండు నని రచియించిరి. వాని ననేకులు పఠించుటయే గాక నాటకముల కేగి యందలికథలను నీతులను గ్రహించుచున్నారు. ప్రబంధాదుల నచ్చటచ్చటఁ గొందఱు మహానుభావులు పఠించి యందలిరసమును గ్రహించుచున్నారు. కాని సకలజనాదరణపాత్రము లని చెప్పనొప్పు శతకముల నేలకో యాదరింపకున్నారు. కావున శతకముల యుత్పత్తివికాసములు, విశేషములు తెలిసినఁగాని పఠించుటయం దాసక్తి కలుగుటకష్ట మని పండిత వంగూరు సుబ్బారావుగారు కం॥ వీరేశలింగంపంతులువారు వదలినను "శతకకవులచరిత్ర, యను గ్రంథము నాంధ్రలోకమున కర్పించినారు. అట్టిశతకవాఙ్మయమును గూర్చి నాకుఁ దెలిసినంతవఱకుఁ జెప్పంబూనితిని, కావున నోయార్యులారా! యిందలి యొప్పులనే గ్రహించి తప్పులను మన్నింతురుగాక.

శతకములు క్రీస్తుశకము 12 వ శతాబ్దమునకుఁ బూర్వ మున్నట్లు కానరాదు. పండ్రెండవశతాబ్దమునం దున్నట్లు చెప్పఁదగినది వృషాధిపశతక మొక్కటియే గన్పట్టుచున్నది. దీనికిఁ బూర్వము పండితారాధ్యకృతశివమతప్రతిపాదక మగు "శివతత్వసారము'' మను గ్రంథమొక్కటియే శతకస్వభావద్యోతక మగు "శివా" యను మకుటముగలది గాన్పించుచున్నది. ఇంతవఱకు మనకు లభించినశతకములు రెండే గాన్పించుచున్నవి. 13 వ శతాబ్దముననున్న తిక్కన కృష్ణశతక మొండు రచియించె నని పూర్వచరిత్రకారుఁ డనెనుగాని యది యింత

వఱకును లభించియుండలేదు. అప్పకవి తనలక్షణగ్రంథమున(అప్పకవీయమున) లక్ష్యముగా దేవకీనందనశతకమునుండి యొకపద్యము నిచ్చియున్నాఁడు. కావున నాశతకము, అప్పకవికిఁ జాలఁబూర్వ మని వేఱుగాఁ జెప్పనవసరములేదు. ఇంతియేగాక దేవకీనందనశతకమునకుఁ బూర్వ మనేకశతకములు రచియించి నట్లు ఆశతకములోనిదగు నీక్రిందిపద్యము సాక్ష్యమిచ్చుచున్నది.

కొండల్వాటికవీశ్వరుల్ శతకము ల్గూర్పంగ గోటానుకో
ట్లుండన్ నీవును జెప్పఁబూనితి వదేమో యంటివా వింటివా
వండేనేర్పులఁ బెక్కురీతుల రుచుల్వర్తింప వేశాకముల్
చండా నామన వాలకింపు మది కృష్ణా దేవకీనందనా.

16 వ శతాబ్దములోనివారగు కృష్ణరాయలకును, అప్పకవికిని మధ్యకాలమున ననేకశతకములు పుట్టినవి. వజ్రపంజర, మదునందన, గువ్వలచెన్న, బాలగోపాలశతకము మొదలగు శతకములు. రానురాను 17 వ శతాబ్దమునందు శతకవాఙ్మయము మిక్కిలి యభివృద్ధి గాంచినటులు పెక్కునిదర్శనము లగుపడుచున్నవి.

(1) చింతలపల్లి వీరరాఘవకవి తాను వ్రాసిన మధురవాణీవిలాసమునందు "జాములో శతకంబు సంధించి కంకణాదులు గొంటి వలరాయమర్గమునను" అని చెప్పుకొన్నాఁడు.

(2) వీరరాఘవకవి పెదతండ్రి యగు గోపాలకవి తాను వ్రాసిన యార్యాశతకమున నిట్లు వ్రాసియున్నాడు.
"విలసత్పాండితిఁ గల్పనాగతి జగద్విఖ్యాతుఁడై జాములోపల నార్యాశతకంబు"

(3) గణపవరపు వేంకటకవి కఠినప్రాసశతకము, యమకశతకము, కస్తూరిరంగని సాఁబనిఘంటువు సీసశతకముగను జెప్పుట శతకవ్యాప్తినే సూచించుచున్నది.

(4) వైష్ణవభక్తాగ్రగణ్యులగు తాళ్ళపాకవారిశతకరాజములు 15, 16, 17 వ శతాబ్దములలో ననేకములు పుట్టినవి.

(5) కృష్ణార్జునసంవాదనామకగ్రంథకర్త యగు వెలిచేటి వేంకటప్రధాని వ్రాసినవ్రాఁతఁ జూడుఁడు:— "వినయఁబుతోఁ బంచవింశతిశతకము ల్విరచించి హరికి నర్పించినావు"

(6) ఏనుఁగు లక్ష్మణకవి మున్నగువారితో సమకాలికుఁడని చెప్పుచున్న సత్యవోలు జనార్దనామాత్యపుత్త్రుఁడగు భగవత్కవి-

"ధీరత శతశతకంబులుఁ, దారావళులున్ దశావతారావళులున్
చారూదాహరణంబులు, శ్రీరాజితదండకములు చెప్పినవాఁడన్"

అని చెప్పియున్నాఁడు.

వేయేల 17వ శతాబ్దమునకుఁ బిమ్మట శతకములు మితిమించినవి. అందఱును శతకకర్తలే- వృత్తసాధనమునకై ఈశ్వరధ్యానముగూడఁ గలసివచ్చునని "ఏకాక్రియా ద్వ్యర్థకరీ బభూవ" యనునటుల నుభయతారకముగ నుండునని యెంచి యొక్కొకవృత్తములో నొక్కొకశతకము చొప్పున ప్రతికవియుఁ బదులు, వందలు శతకములు వ్రాసినట్లు కన్పట్టుచున్నది. అంతకంతకుఁ జేఁపురుపుల్లశతకములు, సోడాబుడ్డిశతకములు, ఫ్రూటుకూళ్ళమ్మశతకములు వెల్వడినవి. పైకేల ప్రతిగ్రామమునందును లక్షణమెఱిఁగిన వారందఱు నేదో యొకశతకము నైన వ్రాసి యాయూరనున్న దేవున కంకితముఁ జేయుచువచ్చిరి, కావున మనదేశమునందు దేవాలయము లెన్నికలవో శతకము లన్నిటికి ద్విగుణముగ నైనఁ గలవనుట యతిశయోక్తి కాఁజాలదు. పైయంశములఁబట్టి చూడఁగా 17, 18, 19వ శతాబ్దములయందుఁ బుట్టినశతములు గొన్ని లక్షలుండు నని తోఁచుచున్నది. కాని యన్నియుఁ బ్రచారములో లేవు. కాని యట్టికొఱంతను దీర్చుటకు శ్రీ చెలికాని లచ్చారావుగారు దొరకొనిరి. యాంధ్రభాషాభివృద్ధిని గూర్చి దైవమంతమాత్రమును సహింపకపోయెను. పిదప వంగూరుసుబ్బారావుగారు శతకవాఙ్మయసముద్రమున మునిఁగి రమారమి యాఱువందలశతకరత్నముల నేఱినట్లు వారు వ్రాసిన శతకకవులచరిత్రమును బట్టి తెలియుచున్నది. అందులకుఁగాను పైవారి కాంధ్రలోకము వందనసహస్రము లర్పించుఁగాక.

పండితపామరజనాదరణపాత్ర మగుశతకవాఙ్మయము భావగీతముల కతీతమైన యాత్మానందమును గలుఁగఁజేయుచుఁ బురుషార్థమును బడయుటకు సాధనముగ నున్నది. శతకములలోఁ గొన్ని భక్తిదాయకములుగను, గొన్ని నీతిదాయకములుగను, గొన్నిరక్తి, ముక్తిదాయకములుగను గొన్నిలోకజ్ఞానదాయకములుగను నున్నవి. పురుషార్థమునకుఁ బరమావధి యైన మోక్షప్రాప్తి శతకజప్యాయమునఁగలదు. ధనకనకవస్తువాహనాందోళికాదుల నాసించి కవులు ప్రబంధాదులవ్రాసినను తమచరమావస్థలయందుఁ గేవలమోక్షకాములై బాల

బాలికలకు నీతిజ్ఞానాదిదాతలై విరాగులకు మోక్షసాధన మార్గదర్శకులై రాజులకు రాజనీత్యాదిబోధకులై శతకములు వ్రాసిరటులు శతకపఠనమువలనఁ దెల్ల మగుచున్నది. శతకములు సామాన్యముగ భగవదవతారవర్ణనములతో నారంభమై మోక్షాపేక్షతో నంత మొందుచున్నవి. శతకములందు గామసూత్రాత్మకములైన నాయికానాయకుల విరహాసంభోగాది వర్ణనలుగలకథలు, స్త్రీవర్ణనాది వర్ణనములు మందున కైనను గన్పడక కేవలభాగవతాత్మకములైన కథలు, వర్ణనములు గన్పడును. ఈభాగవతవర్ణనములు భావగీతాదివర్ణనముల కతీతమయిన భక్తిరసావేశమును గలుగఁజేయుచున్నవి. భావగీతములు భౌతికానందమును, శతకము లాధ్యాత్మికానందమును గలుగఁజేయుచున్నవి.

అయినను "నిరాశ్రయా నశోభంతే పండితావనితాలతా" యనునటులు శతకముల కాదరణ ముండినగాని యభివృద్ధినొందుటయు నందుండు పద్యరత్నములు వెల్వడుటయు సంభవింపదు. పూర్వపురాజులు, మంత్రులు, ధనాఢ్యులుఁ దమపై శతకములఁ జెప్పించుకొని కవులనుగౌరవించి శతకవాఙ్మయమునం దాదరణముఁజూపెడివా రనుటకు నాదరించెడివారి నామములె మకుటముగాఁగల శతకములు ప్రబలసాక్ష్యములు.

(1) పాపయ్యామంత్రిశతకము. (ప్రతిపద్యముచివరను "పాపయమంత్రి" యనుమకుటముండును.)

(2) పొణుగుపాటి వెంకటమంత్రిశతకము (ప్రతిపద్యముతుదను పొణ్గుపాటి వెంకటమంత్రి" యనుమకుటముండును.)

(3) ఎరుగుడికన్నశతకము. (ప్రతిపద్యముచివరను "ఎరుగుడికన్నా" యనుమకుటమువచ్చుచుండును.)

(4) బుఱ్ఱా వెంకనమంత్రిశతకము. ( ,, ,, ,, )

(5) గువ్వాల చెన్నశతకము. ( ,, ,, ,, )

ఇప్పటి ధనాఢ్యు లట్లుగాక భోగపుమేళముల నాదరించువారైరి. వారేమిశతకములురచియింపఁగలరా! శతకకర్తలు నిరాలంబులై యడుగంటిరిగదా! బ్రాహ్మణులకుబత్తెములు, సానులకు స్వయంపాకములు, ఈయుచున్న కాలము వచ్చినదిగదా! ఇట్టికాలమున శతకము లె ట్లభివృద్ధినొందును. పోనిండు శతకరచన లేకపోవచ్చును. పూర్వులు వ్రాసినవేచాలును. ఆశతకరత్నములఁ బఠింపరాదా! లక్షణకవులు చరిత్రకారులును ఆదరింపనియంత

మాత్రమున నాఁకిఁ గొఱంతవచ్చెనా! శతకకవులు లాక్షణికులు కారందు వలన పాలకురికిసోమన్న బసవపురాణము లాక్షణికమై దానికిఁ బిమ్మట వ్రాసిన "బసవాబసవాబసవా వృషాధిపా" యను చక్కనిమకుటముగల వృషాధిపశతకము వికృతమైన దనవచ్చునా! కవిసంశయవిచ్ఛేదగ్రంథకర్తయు లాక్షణికుఁడును నగు సూరకవి రామలింగేశశతకము గడ్డిత్రొక్కయి యాతనిదగు లక్షణగ్రంథము మేరువయ్యెనా. ధూర్జటికాళహస్తిమాహాత్మ్యము పనికివచ్చి తరువాతఁ బ్రౌఢవయసున వ్రాసిన "శ్రీకాళహస్తీశ్వరా" యనుమకుటముగల కాళహస్తీశ్వరశతకము తక్కువ యయినదా!

వ్యాకరణాదిదోషములు శతకములయం దున్నను "ప్రయోగమూలం వ్యాకరణం" అనుదానిననుసరించి యట్టె వ్యాకరణము రచియింపరాదా పూర్వపువ్యాకరణములే సిద్ధాంతములా, పోనిండు లాక్షణికులాదరింపకున్న మనమేల యాదరింపరాదు. మనమేమి లాక్షణికులమా, చరిత్రకారులమా! మన కందు కావలసినవి నీతులు, లోకజ్ఞానబోధకవాక్యరత్నములు, నానుడులు, చక్కనియుపమానములును.

"గుణదోషౌ బుధో గృహ్ణ న్నిందుక్ష్వేళావివేశ్వరః శిరసా శ్లాఘతే పూర్వం పరం కంఠేనియచ్ఛతి" యనునటుల ఒప్పులనే గ్రహింపరాదా! అయినను హరికథాకాలక్షేపము జరుగుస్థలమునకుఁ బోక దుర్జనగోష్ఠుల కేఁగుట సజ్జనసంఘములతో నొప్పియుండు పురాణపఠనస్థలంబుల పొంత బోక మేళముల వెడలాటల కేఁగుటయు సామాన్యముగాఁ జనులస్వభావము. మేలుఁగోరి చెప్పెడుమాటలు పాటింపక చెడుగుఁగోరి చెప్పెడి మాటలు పాటించుట జనులకు సహజము. అట్టివా రిట్టిశతకముల నెట్లు పఠించెదరు? పఠించినవా రున్న నెట్లు వినెదరు? ఇందేమి కామసూత్రాత్మకములైన నాయికానాయక వర్ణనములుగాని స్త్రీలనఖశిఖాపర్యంతవర్ణనముగానియుండునా? ఇందులకు కేవలవిరుద్ధము లగుభక్తిజ్ఞానవైరాగ్యాదు లుండును. ఇట్టివి లోకమున కెట్లు రుచించును.? ఆరోగ్యహానికరము లగుశర్కరాదులు రుచించినట్లు ఆరోగ్యకరము లగునేరండతైలాదికము రుచించునా? వీరాదరింపకపోయినను, పుస్తకము లున్నయెడల ముందు జనించువారు చదువుదు రేమో యనుకొనుట కట్టి యవకాశము కూడ లేనట్లు కన్పట్టుచున్నది. ఒకభిషగ్వరుఁ డేదియేని యొక మందులోఁ గలిపి నూఱుటకుశతకము కావలెనన్న నేముదాయుం తనముఁ

వ్రాసినను దొరకుట దుర్లభము. ముద్రాయంత్రము లన్నియు నవలా గ్రంథముల నచ్చొత్తుటలోఁ బనిచేయుచున్నవి. పోనీ గ్రంథాలయములకుఁ బోయిచూత మన్న నవలాది గ్రంథములే గన్పడునుగాని శతక మొక్కటియైన దొరకుట కష్టము. పూర్వు లట్టి గ్రంథముల గ్రంథాలయములలో నుంచినను ఈతుక్కెందుకని యాధునికనవనాగరికశిఖామణులు కొందఱు తుక్కుతోపాటు దహన మొనర్చుచున్నారు.

పుస్తకమున కందమా లోపలివిషయమా ప్రధాన మని యోజించు వారు లేరు. పోనీ బడుల కేగు బాలబాలికలపుస్తకములలో నుండునేమో యని చూడ వారిచెంత కుక్క, నక్క, కుస్తరి మొదలగు పాఠములు గలవాచకపుస్తకములు A cat ran. A bird flies. అనుపాఠములు గల యాంగ్లపుస్తకములుఁ దక్క నొక్కశతకమైనను గానరాదు. ఇందు తల్లిదండ్రులలోపమో విద్యాశాఖాధికారుల లోపమో విమర్శకులు విమర్శించెదరుగాక. పూర్వపు బాలబాలికాపాఠశాలలలో విద్యాశాఖాధికారులయాదరణమున గాని, తలిదండ్రుల యాదరణమునఁగాని శిష్టనీతిదాయకములును, లోకజ్ఞానబోధకములును రాజనీత్యాచారవ్యవహారాదిబోధకములును నగు "దాశరథీ కరుణాపయోనిధీ" "సుమతీ'' "వేమా" యనుమకుటములుగల శతకములకప్పు డంతగా బాలుర కర్థము, దెలియకపోయినను, పెద్దవారైనపిదపఁ దెలిసికొందు రను నభిప్రాయముతో బాలబాలికలచే కంఠపాఠ మొనరించెడివారు. ఇంతియెగాక యందుమూలమున బాలురకు ధారణాశక్తి మెండై మిక్కిలి మేధావంతు లగుటకు సాధనముగానుండునని తత్పఠన మావశ్యకముగా నిర్ణయించిరి. ఆధునిక పాఠ్యపుస్తకములకు నాంధ్రాంగ్లములలోఁ బద్యభాగము కూడఁ గొంతయుంచుటకుఁ గారణ మదియేగదా. అట్టిశక్తి పాఠ్యపుస్తకములందలి సైకిలుపద్యముల వలనను రైలుబండిపద్యములవలనను సంభవింపనేరదు. ఆధునికనిమ్నోన్నత పాఠశాలలలో నట్లుగాక నవనాగరికశిఖామణులైన యధికారులు కుక్క, పిల్లి, సోడాబుడ్డి, మొదలగుపాఠములుగలపుస్తకములను పాఠ్యగ్రంథములుగా నియమించి శతకనామమును రూపుమాపుచున్నారు. వారాదరించుటయే గ్రంథమునకు త్రెక్కలువచ్చుట. అట్టిత్రెక్కలు రానిశతకగ్రంథము లెట్లెగురును. ఎందున్న నందే యుండవలెను. పైపాఠములు చదివిన బాలబాలికలకు, పఠన సామర్థ్యమలవడును గాని నీతులు మొదలగునవి యెట్లలవడును? ఉల్లికి మల్లి

వాసన వచ్చునా. పఠనసామర్థ్య మలవడుటకు పత్రికాదులే చాలును. వేఱుగ బహుల కేఁగుట యెందులకు? విద్యాశాఖాధికారులమాట యటుండనిండు. ఎట్టియాక్షేపణయు రాలేదని యనియే యుంచెదరు. బాలబాలికల బాగోగులు జూచికొను బాధ్యత తలిదండ్రులదిగదా. వారే యుపేక్షవహించిన నిఁకఁజూచువా రెవరు? "కంచెయే చేనుమేసిన గలదెదిక్కు" బాలుఁడు గాని బాలిక గాని యింటియొద్ద నేతుక్షుల్లోనో యగ్న్యాహుతిగాక మిగిలినశతకములఁ బఠించుచుండఁగాఁ దండ్రియది విని సంతసించుటకు మాఱుగా, "అది నీకెందుకోయి వెధవపుస్తకము. అల్లా యింగ్లీషుపాఠాలు చదువు. పెండ్లిమాటలకు మీమామగారు వస్తానన్నాఁడు. ఆవేళకు నీవు శతకములు గీతకములు చదువుతూంటే బాగుండదు." అనితిట్టును. బాలిక కూడ శతకమును చదువుచుండఁగా తల్లి విని సంతోషించుటకు మాఱుగా "అమ్మా నీకెందుకమ్మా అవి. నీమొగుఁడు ఇంగ్లీషుచదువుకున్నవాఁడు. అతనితో ఇంగ్లీషుమాట్లాడాలి అంచేత ఇంగ్లీషు ముక్కలు నేర్చుకోమ్మా" యని మందలించును. వారియుద్దేశ మేమైయుండును. వారిపుత్రపుత్రికలు జ్ఞానమును సంపాదించుటకాదు. మెప్పునుసంపాదించుట. ఒకరిమెప్పులతో నేమిపని? మెప్పులు తుదకు ముప్పు తెచ్చునన్నమాటఁ దలఁపరే.

అట్లుగాక తలిదండ్రులు కన్నులు తెఱచియో విద్యాశాఖాధికారుల నిబంధనములలో మార్పుకలిగియో బాలబాలికలకు శతకములనుగాని శతకములలోని పద్యరత్నములఁగాని పఠనగ్రంథములుగా నుంచిన వారల కలవడు జ్ఞాన మమేయ మని చెప్పవచ్చును. బాలికలు దాము పెద్దవారలై యత్తమామలకడను, భర్తలకడను మెలఁగెడి తెఱఁగుఁదెలిపెడి శతకములెన్నియో గలవు. బాలురు దాము పెద్దవారైన పిదప లోకములోని విషయములను దేశాటన మవసరములేకుండఁగనె గుర్తెఱింగెడివిధమును, వస్తుస్వభావాదికమును, దైవధ్యానమును, పరనింద, ఆత్మస్తుతివిముఖత మొదలగుసుగుణములు శతకపఠనమువలన నలవడు నని చెప్పుట యతిశయోక్తికాదు.

కావున బాలబాలికల కనినకనెడు తలిదండ్రు లిఁకనైనను గన్నులు దెఱచి, పోయినకాలము పోయినది; యెంతచింతించినను మరలరాదు, గతజలసేతుబంధనమువంటి దనియెంచి తమసంతానమును పశుసంతానముగాఁ జేయక పాఠశాలలలోఁ జెప్పకున్నను, నింటియొద్ద నేదో యొకసమయమున శతకము

లలోని పద్యరత్నములను బాలబాలికల కర్ణములనుంచి వాగ్భూషణులఁ జేయు దురుగాక. ఇదియే గదా భర్తృహరి తనసుభాషితమున "భూషలుగావుమర్త్యు లకు భూరిమయాంగద తారహారముల్ ... ... ...

... ... ... ... ... ...

... ... ... ... పవిత్రవాణి వా

గ్భూషణమే సుభూషణము ... ... ...

అని చెప్పియున్నాఁడు. ఓ జ్ఞానులారా! మీరుపాడగుటయే కాక మీ బాలబాలికల నేలపాడుచేసెదరు? వినుఁడు. రామాయణ, భాగవత, భారతాద్యనేకగ్రంథసాంతపఠనమునఁగాని యలవడని నీతిజ్ఞానవైరాగ్యాదులు కొన్నిశతకపద్యరత్నములలో బాలబాలికలకు బోధింపవచ్చునే. అశ్లీలమొనర్ప రాదు. వారుమీకు పుత్రపుత్రికలు గాని శత్రులు గారే. శత్రువులట్ల చూచి పూర్తిగా వారలఁ బాడుచేయుచున్నారే. వారు పెరిఁగి పెద్దవారై పదిమం దిలో మాటలాడ నేరరే లేనిమూకతనముఁ దెచ్చిపెట్టుచున్నారు. వారల ద్విపాదపశువులుగ నొనర్చుట యెంతఘోరమో యోజింపుఁడు.

శతక వాఙ్మయార్ణవమునఁ బలురకములగు పద్యరత్నము లున్నవి అందు మచ్చునకుఁ గొన్నిటిని మాత్ర మిట స్థాలీపులాకన్యాయముగఁ జూ పెదను.

భావమునకుఁ బ్రకృతిపరిశీలనమునకుఁ గాసుల పురుషోత్తమకవి తాను వ్రాసిన గోపాలదేవశతకమున నెంతరామణీయకముగా వర్ణించినాఁడో చూడుఁడు.

సీ. భువనత్రయీకసంపూర్ణుఁడ వగునీకు నందకుటీరమా మందిరంబు
పాలమున్నీటిలో నోలలాడెడినీకు మహియశోదాస్తన్యమా బలంబు
పదపద్మమున గంగయుదయమందిననీకు జలకమా గోపికాంజలిజలంబు
హరిరాజభోగపర్యంకంబు గలనీకుఁ దల్పమా రాధికాతరుణియంక
మహహా! వారలభాగ్య మెంతనఁగవచ్చు! భావజవిలాస! హంసలదీవివాస
లలితకృష్ణాబ్ధిసంగమస్థలవిహార! పరమకరుణాస్వభావ! గోపాలదేవ.

బద్దినీతులు, సుమతీశతకము ఆంధ్రలోకమునకు నీతులు నెట్లు బోధి చుచున్నవో వినుఁడు.

క. హీనునకుం బలిమి పరా, ధీనునకు సుఖంబు దుర్మతికి రిపుజయ మ
జ్ఞానికిఁ బరమును నలిగెడి, వానికి నైరణ యసంభవములు బద్దిన్నృపా.

క. నరపతులు మేరఁ దప్పిన, దిర మొప్పగ విధవ యింటఁ దీర్పరి యైనన్
కరణము నైదికుఁ డైనను, మరణాంతక మౌను గాని మానదు సుమతీ.

స్త్రీధర్మములు—“కార్యేషు దాసీ కరణేషు మంత్రీ ........”
అను శ్లోకమునకుఁ దెలుఁగు.

క. పనిసేయు నెడల దాసియు
ననుభవమున రంభ మంత్రి యాలోచనలన్
తనభుక్తి యెడలఁ దల్లి యు
ననఁ దనకులకాంత యుండఁ దగురా సుమతీ. (సుమతీశతకము)

ఇట్టి వనేకపద్యరత్నములు గలవు. వీటిచే పూర్వపు బాలబాలికలు పెద్దలు ధన్యులయిరి. ఇఁకముందుఁ గూడ వారివలెఁ జదివి ధన్యులగుదురు గాక.

వేమనయోగి యాంధ్రలోకమును గూర్చి యెట్లు చెప్పినాఁడో వినుఁడు.

తనదుసవతితోడ (స్త్రీలను గూర్చి)
తనయాయుధముతోడ (శూరులఁ గూర్చి)
అగ్నితోడ———(సామాన్యముగా నందఱిఁ గూర్చి)
పరులయాలితోడ (కామాంధులఁ గూర్చి)
హాస్యమాడు టెల్ల హాని ప్రాణమునకు, విశ్వదాభిరామ వినుర వేమ.

ధూర్జటి మహాకవి తన కాళహస్తీశ్వర శతకమున సంసారబంధము నెంత ముచ్చటగా వర్ణించినాఁడో చూడుఁడు.

శా. ఆలంచు న్మెడఁగట్టి దానికి నపత్యశ్రేణిఁ గల్పించి త
ద్బాలవ్రాతము నిచ్చిపుచ్చుకొను సంబంధంబు గావించి యా
మాలర్మంబున బాంధవం బనెడి ప్రేమం గొందఱిం ద్రిప్పగా
సీలన్ సీల యమర్చినట్లొసఁగితో శ్రీకాళహస్తీశ్వరా.

“రాజు ల్మత్తులు వారిసేవ నరకప్రాయంబు”
“రాజకీటముల నే సేవింపఁగానోప”
“రాజలోకాధమ మశ్రేణీద్వారముఁ దూరఁజేసె దెప్పుడో”
“రా జర్థాతురుఁ డైనచో నెచట ధర్మంబుండు”

అని పైవిధముగాఁ దన కాళహస్తీశ్వరశతకమున రమారమి 15 పద్యములలో రాజాశ్రయమును నిందించి త్యాగరాయలువలె నె 'నిధిచాలాసుఖమా—రామునిసన్నిధి చాలాసుఖమా" అనుభావమును వెల్లడించి యాంధ్రలోకమునకు బోధించినాఁడు.

దైవమే యన్నిటికిని మూల మనునంశమును తాళ్లపాక తిమ్మనార్యుఁడు తన వెంకటేశ్వరశతకమున నెట్లు చెప్పినాఁడో వినుఁడు.

సీ. పెంచంగఁ బెరిఁగెనాపృథ్విపైఁ గొండలు పెట్టిరా యడవుల వివిధగతుల
కాలువల్వెట్టిరా ఘనసముద్రములకు సేతంబులెత్తిరా యేరులకును
మేతలువెట్టిరామృగములకెంద్రైన మరి యీతనేర్పిరా మత్స్యములకు
పెండ్లిండ్లు సేసిరా బెరయఁబక్షులకును బూసిరా వాసన పుష్పములకు
నెవ్వరెవ్వరిఁ బోషించి రెంచిచూడఁ దలఁపనీదైన రక్షకత్వమునఁ గాక
కలితలక్ష్మీశ ... ... ... ... ..."

ఈకవిశేఖరుఁడే రాజ్యధనతృష్ణల నెట్లు నిందించినాఁడో పరిశీలింపుఁడు

సీ. ధరలోన నావులు దమదూడలకునెల్లఁ బెట్టెనా వాములుఁ బ్రియముతోడ
బొక్కలు త్రవ్విచ్చిపోయెనా నక్కలు తమపిల్లలకు నిరంతరమునుండ
దలఁచి దప్పికినీళ్లుఁ ద్రావఁగూనలకును గట్టెనా చెరువులు కప్పలెల్ల
ప్రియముతో రతిసల్పి బిడ్డలగనుమని చెప్పెనా సింహంబు శిశువులకును
వట్టిభ్రమతను తమపుత్రవర్గమునకుఁ । దల్లిదండ్రులు దలఁతురు ధనముఁ
గూర్ప । కలితలక్ష్మీశ ... ... ... ...

చూడుఁడు కవిచౌడప్ప కొందఱి నెట్లు ముద్దుముద్దుగాఁ దిట్టినాఁడో.

క. విద్దెలమేలెఱుఁగని నరుఁ, డెద్దే వరిగడ్డితినెడి పెద్దా పసులం
దెద్దునకుఁ గొంతవివేకము, కద్దప్పా కుందవరపు కవిచౌడప్పా.

మూర్ఖులను దిట్టినాఁడు. ఈపద్యమును వినిన మూర్ఖుఁడు దనమూర్ఖత నెట్లు వాపుకొందునా యను ప్రయత్నముచేయునని చెప్పవచ్చును.

క. తా రాజసభల మెలఁగుట, తా రసికతఁ జెలఁగుటెల్లఁ దన బ్రతుకునకా
పూరే డేలుకుఁదినదా, కారడవులఁ గుందవరపు కవిచౌడప్పా.

స్వార్థపరులను దిట్టినాఁడు. ఈపద్యము వినిన స్వార్థపరుఁడు పరార్థపరుఁడు కాకుండుటవింత !

క. ఇయ్యఁగ నిప్పింపఁగల, యయ్యలకేగాక మీఁద మన్యులకేలా ?
 రొయ్యకు లేదా బారెఁడు, కయ్యమునకుఁ గుందవరపు కవిచౌడప్పా.

తనకు సామర్థ్యముండియు నియ్యక యొకరిచే నిప్పింపక యుండువారిని తిట్టినాఁడు.

క. తగుపాటి కవులకియ్యని, మగముండలమూతిమీఁద మంగలివేలా
 దిగఁగోరఁగఁ దయ్యేమీసము, ఖగరాడ్బల కుందవరపు కవిచౌడప్పా.

ఇది యపాత్రదానం బొనర్చి సంతోషించెడు ధనాఢ్యులఁగూర్చి చెప్పి యున్నాఁడు.

క. ఆడినమాటలు దప్పిన, గాడిదకొడుకంచు దిట్టగా విని మదిలో
 వీఁడా కొడుకని యేడ్చును, గాడిద యును గుందవరపు కవిచౌడప్పా.

ఆడితప్పినవారినిగూర్చి చెప్పియున్నాఁడు.

ముద్దులు మూటకట్టెడి దృష్టాంతములు గలభాస్కరశతక పద్యములలో నొక్కదానిని జూపి గ్రంథవిస్తరభీతిచే నింతతో విరమించుచున్నాను.

చ. వలనుగఁ గానలందుఁ బ్రతివర్షమునం బులి నాలుగైదు పి
 ల్లలఁగను దూడ నొక్కటి నిలఁగను ధేనువు రెండుమూఁడునే
 డుల కటులైన బెబ్బులికుటుంబము లల్పములాయె నాలమం
 దలు కడువృద్ధిఁజెందవె యధర్మము ధర్మము దెల్పభాస్కరా.

# గ్రంథస్వీకారము.

(1) ఉపదేశామృతము:- ప్రథమ భాగము. శ్రీహరనాథఠాకూరుగారిది. బంగాళీ, ఇంగ్లీషు భాషలలోనుండి మ॥ చింతా దీక్షితులుగారు తెనిఁగించిరి. కాకినాడలోని పి. ఆర్. దాసుగారు ప్రకటించిరి. 22 పుటల చిన్న యక్షరముల పీఠికయును, శ్రీకుసుమ హరనాథ్‌గారి పటమును 101 పుటల యుపదేశములును గలవు. శ్రీహరనాథ బాబూగారు శ్రీశ్రీగౌరాంగస్వామిగారి అపరావతారమఁట. దానికిఁ గావలసిన నిదర్శనములు చూపఁబడినవి. ఇందు ప్రకృతిరహస్యము, భాగ్యాతత్త్వము, తల్లిదండ్రులను పెద్దలను ఈశ్వరదృష్టితో చూడడము, సంసారరహస్యము, కర్మఫలము, పాపపుణ్యాలు, ధనతత్త్వము, ఆలోచనా మహత్త్వము ననుభాగములు గలవు. గ్రంథమంతయు వ్యవహారభాషలో నున్నది. ఉపదేశములలోని కొన్ని మాటలు మచ్చు:—

"ఏసముద్రములో రత్నములు, చంద్రుడు, అమృతకలశము పుట్టినవో ఆసముద్రంలోనే భువనములను హరించే హాలాహలముకూడా పుట్టింది. శ్రీమన్నారాయణునివలె రసగ్రహణ పారీణులు కాకపోతే అమృతమూ, లక్ష్మీలభించవు. శివునివంటి సాహసికులకు గరళమే."

ఈ పుస్తకము ప్రకాశకులయొద్ద శ్రీహరనాథతత్త్వ ప్రచారిణీసభ, ఆంధ్రబ్రాంచి, సూర్యారావుపేట, కాకినాడలో దొరకును. వెల రు 0-8-0.

(2) పురాణపతివ్రతలు:—గ్రంథకర్త, సాహిత్యవిద్యాప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారు. ఇందు 1- మొదలు 16 పుటలు సేవ్యాదేవిచరిత్రమును 17 మొదలు 51 పుటలవఱకు సుకళాదేవి చరిత్రమును గలవు. ఏదేవిచరిత్రమేపురాణమునుండి గ్రహింపఁబడినదో తెలియవచ్చుటకు ముందేమియు నుపోద్ఘాతాదులు చేర్పలేదు. సేవ్యాదేవి చరిత్రవంటిదే కొంత సినీమాలలోఁ బ్రదర్శింపఁబడుచున్నది. ఇందలి మాండవ్యుని చరిత్రము భారతములోనున్నది. సేవ్యాదేవి కుష్ఠరోగియైన పతిని వేశ్యాగృహమునకుఁ గొనిపోవుచు శూలప్రాప్తుఁడయిన మాండవ్యుని జీఁకటిలోఁ దగులుట మున్నగునది వాడుకకథలలోఁ గలదు. పురాణవేత్తల కిట్టి వేఘట్టమునఁ గలవో విదితమే. తక్కినవారికిఁ గథయే కావలయును గావున నతివిస్తరమువలదు. కథ లలితపదములతోఁ గూర్పఁబడినది.

"కళింగదేశమునందుఁ జాతుర్వర్ణ్య నిషేవ్య మగు శ్రీపుర మను మహానగర మొండుగలదు. అందు బ్రహ్మవిద్యాధురంధరుఁ డగు వసుదత్తుఁడను బ్రాహ్మణుఁడు నివసించుచుండును. అతనికి సహజసౌందర్యరాశి యగు సుదేవి యను పుత్త్రికయుండెను. ఆమెయందుఁ దలిదండ్రులకే కాక బాంధుగు లందఱికి నమితమగు ప్రేమకలదు...... ..ఆమె చక్కఁదనమున కచ్చెరువడి బంధువులలోని బ్రహ్మచారులందఱు నామెనే వివాహమాడవలెనని సంకల్పించి యుండిరి. అనేక పర్యాయములు కొందఱు "నీకూఁతు నాకే యీవలయు"నని వసుదత్తునే యడిగిరి. కాని యామెయం దెక్కువ మక్కువగల తండ్రి యామె తోడి వియోగమును భరింపఁజాలక పుత్త్రికా వివాహమునకై తొందర పడ లేదు." (28 పుట- సుకళాదేవిచరిత్రములో) దీనివెల రు 0-4-0. ఇదియును బాలకృష్ణ విజయము, బాలహిందూదేశచరిత్రములును, చెన్నపురి నుంగంబాకములోని జయం అండు కంపెనీలో దొరకును.

(3) అళియరామరాయలు:—గ్రంథకర్త చిలుకూరి వీరభద్రరావుగారు. రాజమహేంద్రవరము ఆర్యన్ బుక్కుడిపో, నాళం అప్పలనరసింహముగారు ప్రకటించిరి. ఈనడుమ నాంగ్లభాషలో రివరెండు హెన్రీ హీరాసుదొరగారు "దిఆరవీడు డైనాస్టి ఆఫ్ విజయనగర్" అనుగ్రంథమును బ్రకటించిరి. దాని లోని యారవీటివంశచరిత్రమును,విజయనగరసామ్రాజ్యమునకుఁ బ్రతిస్పర్థులుగ నుండెడు దక్కనుసుల్తానుల దర్బారులలో నుండెడు విమతస్థు లగు చరిత్రకారుల వ్రాఁతలను వారలకు సమకాలికులై యాకాలమున వర్తకమునకై యీదేశమునకు నేతెంచిన పోర్చుగీసు లేఖకుల వ్రాఁతలను క్రైస్తవ మతగురువుల వ్రాఁతలను నెక్కువగా నాధారపఱుచుకొని వ్రాసిరనియును నందు అళియరామ రాయల ననూయతోఁ జూచునట్టి విమతస్థుల మాటలయందు నిర్హేతుకముగా విశ్వాసముంచి పెక్కు దురభిప్రాయములను వెలువరించి యున్నారనియు నాతని యసచ్ఛీలమును చదువరులు గ్రహించునట్లుగా గ్రంథమంతయు వ్రాయఁబడిన దనియు- వాస్తవచరిత్రమును దెలియఁజేయుచు నిష్పక్షపాతముగా వీరభద్రరావుగారు సిద్ధాంత పూర్వపక్షములతో వ్రాసిరి. 247 పుటలు క్రౌను సైజు. 7 ప్రకరణములు.

(4) మేఘదూత:—ఆంధ్ర గ్రంథమాల ౧౬ సంఖ్యగలది. దీపాల పిచ్చయ్యశాస్త్రిగారిచేఁ దెనిఁగింపఁబడినది. శ్రీజయపుర సంస్థానాధీశ్వరులును

విద్వత్కవి ప్రభువులును నగు శ్రీశ్రీశ్రీ రాజా విక్రమదేవవర్మ మహారాజు లుంగారి కంకిత మీయఁబడినది—పూర్వభాగము ౧౧౨ పద్యములలోను ఉత్తరభాగము ౬౫ పద్యములలోను గలదు. కాళిదాసకృతికి శ్లోకమునకుఁ బద్యము గాఁగాక యథేచ్ఛముగా భావము చెడకుండఁ జిన్నపెద్ద పద్యములతో శాస్త్రిగారు రచించిరి.

దీనికి ముందాఱుపుటలు కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారి పరిచయవాక్యములును, శాస్త్రిగారి మూఁడుపుటల తొలిపలుకును నాల్గుపుటల కృతిప్రశంసయు, మూఁడుపుటల కృత్యవతరణికయుఁ గలవు- పిచ్చయ్య శాస్త్రిగారు-

చ. కమ్మని జాను తెల్గునుడికారము జాతియుఁ దోఁప మూలకా
వ్యమ్మునఁ బొల్చు భావము సమస్తము తేట పడంగ శిష్టమా
ర్గమ్మునఁ గూర్పు మార్పు లలరన్ బచరించినచో స్వతంత్ర కా
వ్యమ్మని చెప్పనొప్పి యనువాదము మోదము నిచ్చు హెచ్చుగన్.

అని యిన్నివిధము లిందుఁ గలుగఁ జెప్పిరి. రసికు లారయుదురుగాక.

కథాభాగమున మొదటి కొన్నిపద్యములు.

గీ. జానకీస్నాన పుణ్యోదకానుషంగ
ములు నమేరుసహీరుహాభూషితములు
నైన యలరామగిర్యాశ్రమాంతరములఁ
బురుషుఁ డొక్కరుఁ డొంటిఁ గ్రుమ్మరుచునుండె. ౧

గీ. ఆధియో వ్యాధియో కాని యతని దేహ
యష్టిచాల కృశించి కూలాఱియుండె
నింపెసఁగు గండభాగమ్ము లెండువాఱ
మురువు ముంజేతిబంగారు మురువుజాఱ. ౨

చ. ఒకపరియాతఁ డట్టె యెదియో తలపోయుచుఁ గూరుచుండు, నిం
కొకతఱిఁ గన్నులార్ప కెదియో తిలకించుచు నట్టె నిల్చు, వే
ఱొకమఱి త్రోవ డొంక యన కూరక యట్టిటుఁ గ్రుమ్మరిల్లు, నొ
క్కొకయెడ నేకొలంకు దరినో మెయిసేర్చు నెదో గొణుంగుచున్. ౩

గీ. నడకలోనన యొకవింత నడకనడచుఁ, జూపులోనన యొకవింతచూపుఁ జూచు
నవ్వులోనన యొకవింత నవ్వునవ్వు, నాతఁ డున్మత్తుఁడో, విరహాతురుండొ.

(5) ఆంధ్రధ్వని-ఆంగ్లీకర్త- శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ఆంధ్రగీర్వాణవిద్యాలయము, కొవ్వూరు- వ్యంగ్యములనుగూర్చి రాజానకా నందవర్ధనాచార్యులు రచించిన కారికల కిది తెనుఁగు. ఈచిన్నిపొత్తమును జనువుటచే రసమొప్పునట్లు కవిత్వము చెప్పుటకుఁ గొన్ని విధానములు తెలియఁ గలవు. ఇందు, ధ్వనికలను, వ్యంగ్యభేదములు, వ్యంజకభేదములు, గ్రంథ చౌర్యవిచారణ-అనుభాగములుగలవు. 52 పుటల చిన్నపుస్తకము. వె 0-8-0.

(6) మణిద్వీపము:-కాకినాడలోని శ్రీలలితా గ్రంథమాల ప్రథమసంచిక, సంస్కృతమూలము- ఆంధ్రతాత్పర్యమునుగూడినది. కాకినాడపురవాస్తవ్యులు జమ్మలమడక సూర్యనారాయణశాస్త్రిగారు, దేవీభాగవతమునందలి ద్వాదశ స్కంధములోని 10-11-12 అధ్యాయములలోఁ గల మణిద్వీపవర్ణనమును- వ్యాసకృతానుష్టుప్ఛ్లోకములనుండి పెద్దవృత్తములుగా రచించిరి. ఇందుఁ బ్రధానముగ యోగశాస్త్రము, మంత్రశాస్త్రము, సంగీతశాస్త్రము,మఱియు నితరశాస్త్రముల యనేక సాంప్రదాయములను సయుక్తికముగ వీరు చేర్చిరి. ఇందు మూఁడధ్యాయములును సుమారు రెండువందలశ్లోకములు నుండును. ఇక్కాలమున బహుకారణములచే సంస్కృతభాష నభ్యసింపనివారలకు సుబోధముగా నాభాషలోనివిషయములను దెలుపుటకై యీశాస్త్రిగారు చేయుచున్న కార్యములలో నిది మొదటిది. కాఁబట్టి భాషాభిమానులు వీరికిఁ దోడ్పడెదరుగాక, వీరి సంస్కృతకవిత్వము లలితమై యొప్పుచున్నది. దీని వెలరు 3-0-0. రెండు మచ్చుశ్లోకములు.

1. యేవ్యాళాస్తరుకోటరాంతరగతా నత్తుం కులాయోద్భవా
నారోహంతి ఖగైర్విదారితఫణా వ్యగ్రా లుఠం త్యంజసా
సాధూనామపకార మాకలయితుం నిర్హేతుకం యేరతా
స్తేషాం దర్శనసాం తదేవఘటతే దైవా త్సదా సుందరి! 2-9

2. మన్యుఃకారణ మేనసా మితి యజుర్వంత్రైశ్చ ఘుష్టం పురా
మూఢై ర్నోవిదితం యథైవ శలభా దీపే దహంత్యాత్మనః
శాంతా స్తస్య జయాయ ఘోర నిపినం గత్వా సతీం చాత్మజాం
త్యక్త్వా తీవ్రతపశ్చరంతి కిమహో కిం మే గతిః పావని. 3-20

# తెలుఁగుకావ్యాదర్శము

—జమ్ములమడక మాధవరామశర్మగారు, తాడిపత్రి అగ్రహారము.

---

మాకు గురువర్యులగు బ్ర॥ మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిగారు మొన్నఁటి, విశాఖపట్టణమున జరిగిన యాంధ్రసాహిత్య పరిషద్వార్షికోత్సవమహాసభలో నాధ్యక్ష్యము వహించినపుడు తమ భావగర్భితోపన్యాసమున ననూదితగ్రంథములను విమర్శించుట పాఠకులకుఁ దిరోహితము కాదు. ఆసభలోఁ దమ కావ్యాదర్శము విమర్శింపఁబడుటచు బ్రహ్మశ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు "విమర్శనసమాధానమును" వ్రాసిరి. దాని నే నామూలచూడము చదివితిని. 1929 లో ముద్రింపఁబడిన పుస్తకమున మంగళశ్లోకాంధ్రీకరణపు మార్పు కన్పింపదు. "మచ్చిత్తమునన్" అను దానికి "మదీయమైన యుల్లమునం"దని పాఠాంతర మున్నది కాని దానిపైఁగూడ నధ్యక్షులయాక్షేప ప్రసక్తి యనివార్యమే యగును. "గాత మచ్చిత్తమునన్" అనుదానికి "నాదుమానసమందున్" అను దిద్దుఁబాటు చాలపుస్తకములం దుపలబ్ధమగుట లేదు. అట్టి గ్రంథమునుబట్టి యధ్యక్షులు విమర్శించియుందురు ఆంధ్రీకర్తలు "నాదుమానసమందున్" అనిదిద్దియున్నపు డధ్యక్షులు వారితో నేకీభవింపవచ్చును. మార్పు నంగీకరించినపు డావిషయమై దృష్టాంతములుగ నిచ్చినవానిం గూర్చిప్రకృతమున నంతగఁ బ్రసంగించుట యవసరము కాదు.

శ్లేషలక్షణమును గూర్చిన విమర్శన మిందుఁ బ్రధానవిషయము—ఈవిషయమున శ్రీసుబ్రహ్మణ్యశాస్త్రిగారు తరుణవాచస్పతిటీకలో నాంధ్రీకృతాన్వయమె కలదని వ్రాసిరి. 1910 లో బ్రహ్మవాదిముద్రాక్షరశాలలో ముద్రింపఁబడి Madras Presidency College Pro. M. Rangacharyar గారిచేఁ బ్రకటింపఁబడినపుస్తకమునందుఁ దరుణవాచస్పతివిరచితవ్యాఖ్యాన మిటులనున్నది.

"శ్లేషం తద్విపర్యయంచ లక్షయతిశ్లిష్టమితి" శ్లిష్టం శ్లేషగుణ యుక్తం వాక్యమితి శేషః। అల్పప్రాణాక్షరోత్తరం-అల్పప్రాణాక్షరమయమేవ యద్వాక్యం తశ్ శిథిలం। తథాచవక్ష్యతి "బంధశైథిల్యదోషోహి దర్శితః సర్వకోమలైః" ఇతి తద్విపరీతం శ్లిష్టం। శైథిల్యశ్లేషయో రుదాహరణే మార్గభేదేన దర్శయతి మాలతీమాలేతి మాలతీదామేతిచ."

ఇం దల్పప్రాణాక్షరోత్తర మ్మనునది 'శిథిల' మ్మను దానితో నన్వయింపఁబడినటుల సుస్పష్టము. ఇట్టి యీవ్యాఖ్య శ్లిష్టమ్మనుదానితో 'అల్ప

ప్రాణాక్షరోత్తర' మ్మనుదాని నన్వయించిన యాంధ్రీకర్తల కెట్లు సహకారి యగునో తెలియకున్నది. తరుణవాచస్పతి వ్యాఖ్య యిదియేగాక యన్యమున్నుఁ జూడ వేఁడుకయున్నది. 1890 సం॥ లోఁ బ్రకటింపఁబడిన జీవానందవిద్యాసాగరుని వివృతి వ్యాఖ్య 1925 లోని ముద్రణమునఁ బరివర్ధిత మైనట్లు ప్రకృతవ్యాఖ్యయుఁ బరివర్ధితమయ్యోనేమో తెలియకున్నది. ఈవిషయమున జీవానందవిద్యాసాగరుని వ్యాఖ్య యాంధ్రీకర్తలకు నధ్యక్షులకును బ్రతికూలమె. కాని యా వ్యాఖ్య యుపాదేయము గా దని పరివర్ధితము ప్రవ్యక్తము చేయుచున్నది. మొదటి వ్యాఖ్యను గొంతవఱకుఁ బరివర్ధిత మంగీకరింపక పోయినను దదంగీకృతాన్వయమును స్థిరపఱుచుటకుఁ బ్రయత్నించినటుల కన్పడుచున్నది. ఈపరివర్ధితమె యాంధ్రీకర్తల కాధారము. ఈవ్యాఖ్యాప్రామాణ్యమును గొంతవఱకుఁ బాఠకులు దెలిసికొనవలసిన యవసర ముండుట సందర్భదూరము కానియంశమును నుదాహరింతును. “ మాలతీమాలాలోలాలికలిలా” యను శిథిలోదాహరణమున ననుప్రాసబంధగాఢత యుండుటంబట్టి గౌడు లంగీకరించినటులు వివృతిలో సుస్పష్టలిఖితము. ఈయుదాహరణమున “బంధశైథిల్యదోషోహి దర్శితః సర్వకోమలే” అనుటవలన బంధగాఢత లేనటుల దండిచే సుస్పష్టనిరూపిత మగుచున్నది. ఈకారికలోని బంధశైథిల్యపదమునకు జీవానందుని వ్యాఖ్యయుఁ బరివర్ధితవ్యాఖ్యయు ‘అగాఢత (గాఢత లేకపోవుట) యని వ్రాయుచున్నవి. ఈ రెండువ్యాఖ్యలును “మాలతీమాలాలోలాలికలిలా” యనువాక్యమున బంధగాఢత కల దని యొక స్థలమునను గాఢత లే దని యొకస్థలమునను స్పష్టముగ వ్రాయుచున్నవి. వ్యాఖ్యాత లెట్లువ్రాసినను దండియభిప్రాయమున నిందు గాఢత లే దనియెఱుంగఁగలము. ఇట్టి దండి యభిప్రాయమును బరిశీలించితిమేని,

అనుప్రాసధియా గౌడై స్త దిష్టం బంధగౌరవాత్
వైదర్భై ర్మాలతీదామలంఘితం భ్రమరైరితి ॥

అనుదానిలోని ‘బంధగౌరవా’ త్తనుదానిని “గౌడైస్తదిష్టం’’ అను దానితోఁ నన్వయింప వీలు లేదు.—అల్పప్రాణాక్షరోత్తర’మ్మనుదానిని “శ్లిష్ట’ మ్మను దానితోఁ నన్వయింపఁజేయుటకై దండి కభిప్రేతము కానియపమార్గ మీవ్యాఖ్యలో ననుసరింపఁబడినటుల స్పష్ట మగుచున్నది. కనుక పూర్వాపరసందర్భశూన్యమయిన వ్యాఖ్యాధార మగు నాంధ్రీకృతికిని, వ్యాఖ్యకువచ్చునాక్షేపములు రాక మానవు. భోజరాజు “అల్పప్రాణాక్షరమయ మయినను పదైకతా ప్రతిభాన మున్న బంధగౌరవ ముండు నని తలంచి ‘గాఢీమైరిష్యతే తత్తు బంధప్రాశస్త్యగౌరవాత్ ’’అనివ్రాసి

లీలావిలోలలలనాలలితాలకలాలసః

విలుప్తమాలతీమాలాజలకాలానిలావవుః॥ (సరస్వతీకంఠా 105 పుట)

అని యుదాహరించి "అత్రశైథిల్యదోషేపి బంధప్రాశస్త్యేనగాఢైరాదృతత్వాద్గుణత్వం" అనియు వ్రాసెను. ఇచట,

"అత్ర దంత్యవర్ణమయత్వేన, అల్పప్రాణాక్షరోత్తరతామాపపిపదైకతా ప్రతిభాసానుప్రాసయో రుద్రేకః కాంతిప్రకర్షోవసేయః"

అను వ్యాఖ్యానము శైథిల్యమన, నల్ప ప్రాణాక్షరోత్తరతారూప మని స్పష్టము చేయుచున్నది.

దీనినిబట్టియు "అల్పప్రాణాక్షరోత్తర"మ్మనునది "శిథిల"మ్మనుదానితో నన్వయించునటుల విస్పష్టమగుచుండ, బంధశైథిల్య మల్పప్రాణాక్షరతారూప మని "బంధశైథిల్యదోషస్తు దర్శితః సర్వకోమలే" యనువాక్యముచే నిరూపింపఁ బడుచుండ నాంధ్రీకర్తలు "శ్లిష్ట"మ్మనుదానితో నాపదము నన్వయించుటకు, భోజగ్రంథమును దమవాదోపష్టంభకముగఁ దీసికొనుటకుఁ గారణమూహింపరాకున్నది—మఱియు, "మాలతీమాలాలోలాలికలిలా" యను వాక్యమున బంధశైథిల్య మున్నట్లు దండి యుత్తరగ్రంథమువలన స్పష్టమగుచుండ "బంధగౌరవాత్త"ను దానిని పూర్వమున కన్వయించి "మాలతీమాలా" యనులక్ష్యమున బంధగౌరవ మున్నటులఁ జూపుట, యబాధితము కాదుకదా ? "గాఢైస్త దిష్టం" అనుదానిలో 'అనుప్రాసధియా' యనుదానికివలె "బంధగౌరవాత్" అనుదానికిఁ గూడ హేతుత్వ మిష్ట మయిన 'చకార'ముండి తీఱవలయును. ఇంతియకాక "వైదర్భైః" అనునది 'తదిష్టం' అనుదానితో నన్వయింపవలయును గదా. అన్వయించిన నీవాక్యమధ్యమందు, పూర్వవాక్యములో నన్వయించిన "బంధగౌరవాత్" అను పదము ప్రవిష్ట మగును గాన వాక్యమధ్యమున వాక్యాంతరఘటకపదప్రవేశరూపదోషము వాటిల్లును. వైదర్భైస్త దిష్టం" అనునది హేతుశూన్యమై "కేవలా చ ప్రతిజ్ఞా హి ప్రతిజ్ఞాతం న సాధయే" త్తను న్యాయవిషయము కావలసివచ్చును. 'బంధగౌరవా' త్తను నది యుత్తరాన్వయి యయిన "తదిష్ట" మ్మనునది మధ్యమణిన్యాయమున నుభయవాక్యాన్వయి యగుట కవకాశ మున్నది.—మఱియు, అల్పప్రాణాక్షరోత్తర"మ్మను దానికి, అల్పప్రాణాక్షరమయమని తరుణ వాచస్పతి మొదలగు వ్యాఖ్యాతలు సరస్వతీకంఠాభరణవ్యాఖ్యాతలు నర్థము వ్రాయుచున్నారు. శ్రీసుబ్రహ్మణ్య

శాస్త్రిగారు దీనికి 'అల్పప్రాణాక్షరబహుళ'మని యర్థము వ్రాసి బహుళమనుట చేఁ గొన్ని మహాప్రాణాక్షరము లుండవలయు నని తోఁచును. ఇది శిథిలలక్షణ మైన దీని యుదాహరణమున మహాప్రాణాక్షరములు లేమిచే శిథిలలక్ష్యముగా భావించుట సరి కాదు" అను నాక్షేపము చూపిరి. సర్వకోమలలో శైథిల్యదోషమున్నదని దండి స్పష్టముగఁ జెప్పుచుండ నల్పప్రాణాక్షరమయ మని వ్యాఖ్యాత లనుచుండ నూతనార్థకథనస్వారస్య కల్పనలు పరపక్షవిదళనోపయుక్తము లె యగును గాని స్వపక్షస్థాపకములు కానేరవు. వీరియాంధ్రీకృతి కాధారభూతమగు విద్యాసాగరపరివర్ధితవ్యాఖ్యలలో "అల్పప్రాణాక్షరా శ్చ హ్రస్వస్వరాః వర్గీయా విషమవర్ణాః యరలవా శ్చేతి" అని వ్రాసియున్నందునఁ దదితర దీర్ఘవర్ణములు వీరి బహుళవర్ణ స్వారస్యలభ్యము లగుట గ్రాహ్యములె యగునని యెవ్వరైన సమాధానించుట కవకాశమున్నది.—మఱియు పద్యములోని 'శిథిలత' యనుదానికి "అన్నియుఁ గోమలవర్ణములగుట" యని వీరి లఘువివరణమున్నది. అట్టి శిథిలతను స్పృశింపనిది కొన్ని మహాప్రాణాక్షరములతో ఘటితమై యుండునని యర్థము లభించుచుండ నీయర్థమునె బోధించునట్టి "యల్పప్రాణవర్ణ బహుళమగుచు" నను విశేషణము వ్యర్థము పునరుక్తము నగును. కాన సందర్భశుద్ధి లేని వ్యాఖ్యాధారమున గ్రంథము ను సమర్థించుటకన్న 'చిత్త' పదమును దీసి మానసపద ముంచినటుల నిట్టిపట్లనుగూడ వ్యాఖ్యాసామంజస్యపరిశీలనలవలన యుక్తరమ్యమార్గముల నరసి యనుసరించి పూర్వాపరసందర్భశుద్ధిదూరముకాకుండునట్లు తదనుకూలనిష్కర్షలఁ దేల్చి యనుకూలములగు మార్పులఁ జేయుట సమంజసము, లోకశ్రేయమును. తెలుఁగు కావ్యాదర్శమునఁ గూడ దండ్యాచార్యుని యోగ్యాభిప్రాయమె వ్యక్తము కావలయుట సముచితమని సూచించిన మహామహోపాధ్యాయుల యాశయమును శంకింప నవసర లేశము లేదు.

శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారియెడ నాకు గురుభావ మున్నది. "మానస" మొదలగువానిని మార్చిన శ్రీ శాస్త్రిగారు తత్త్వార్థమును వ్యక్తము చేయు మార్పుల నొనరించుట కనంగీకారమును జూప రను దృఢాభిసంధితోడఁ దత్త్వార్థ విమర్శనకై నేనీవ్యాసమును బూర్వరంగముగ రచియించితిని. కాని వారియెడ గౌరవపు లేమిచేఁ గాదని యోజించి పాఠకభ్రాతలు నన్ను మన్నింతురుగాక.

— కీర్తులు రావువారి కపకీర్తులు నెప్పుడు రావు వారికిన్. —

ఉ. మూర్తినిగొన్న యీవివలెఁ బొల్చుచు నందఱ కన్ని యిచ్చియున్
సార్థివహించి వైరికి రయంబున వెన్నిడకున్కి భారతీ
స్ఫూర్తులరయ్య యాచకులు పొందిన నాస్తి వచింపలేమిచేఁ
గీర్తులు రావువారి కపకీర్తులు నెప్పుడు రావు వారికిన్. ౫౨

— దోమ భవద్గర్భమందుఁ దోఁచెన్ జగముల్ —

క. ఓమాధవ! నవనీతము, చేమెఱసెడు నీదుబొజ్జ చెలఁగి యశోదా
భామిని జలకములార్చుచుఁ, దోమ భవద్గర్భమందుఁ దోఁచెన్ జగముల్.

—దుగ్ధపయోధిమధ్యమున దుమ్మది రేఁగెన దేమిచిత్రమో—

ఉ. ముగ్ధమురారి కూర్మమయి పృష్ఠమునం దిడుమందరాద్రి సా
స్నిగ్ధమతిన్ సురాసురలు చేకొని వాసుకిఁ ద్రాడుఁజేసి సం
దిగ్ధతఁబాసి త్రచ్చుతఱిఁ దీరుగఁ దద్గిరిపైన రాపాడిన్
దుగ్ధపయోధిమధ్యమున దుమ్మది రేఁగెన దేమిచిత్రమో. ౫౪

—కవిరాజనగేంద్రసేను చ్యవనప్రాసము—

క. కవనప్రాస మొనర్చెడు, కవిరాజులకన్న నెన్నఘనుఁ డతఁడయ్యెన్
చ్యవనప్రాస మొనర్చిన, కవిరాజనగేంద్రసేను కలకటపురిలోన్. ౫౫

—ఉపమా—

చ. ఎపుడు గతోపసర్గయగు చెంతయు శ్రీపతి కింపొనర్చుఁ, దా
విపులతరోపసర్గ గొని వేడుకసేయును బండితాళి, కా
యపహృతమాపకారగతి నంబరకేశునకున్ రుచించు, న
య్యుపమ యనేకరూపముల నొంది రహిం దనరారు ధారుణిన్. ౫౬

—ఎద్దుపుండు కాకికి నొప్పియా-మాలకాకి—

చ. గురుతరలీల నాజెముడుఁగొమ్మలు నెమ్మెయి నంటఁదాఁకుటన్
గుఱుతగునట్టి గాయములఁ గుందు వృషప్రవరార్తి నెంచ కా
దరమతిఁ జేరి ముక్కునను దక్కుచు మెక్కెదు మాంసఖండముం
దఱచుగ మాలకాకి! నినుఁ దాఁకి తుపాకినిఁ గొట్ట వట్టమా. ౫౭

—గాడిదకాళ్లుపట్టుకొనుట—

ఉ. భావుకచర్యమీఱఁ దమవాంఛితముల్ సఫలంబుగాఁగఁ గా
ర్యావసరంబులం దలమహాత్ముఁడు గూడను నీచకృత్యముల్

వావిరిగా నొనర్చు వలివాటుఁజెలంగెడుమిత్త్ర! కృష్ణునిన్
దేవకి గాంచునపు వసుదేవుఁడు గాడిదకాళ్ళు పట్టఁడే! ౫౯

—సంతలో వాన మొత్తుట—

ఉ. చప్పున వానమొత్తుతఱి సంతమకాణపుదారులెల్ల వా
రుప్పును, బప్పునుం, బసుపు, నుల్లియు, బెల్లము, నెయ్యి, బియ్యపుం
గుప్పలు నానిపోయె నని కుందఁగ, గొబ్బరబొండ్లముల్ ధరన్
విప్పుచుఁ బొర్లిపొర్లి విలపింతు విదేలర! యోరిపామరా! ౬౦

—తాటిచెట్టుక్రిందఁ బాలుత్రాగినను గల్లేయనుట—

గీ. దుర్జనులు గోష్ఠిసల్పెడుత్రోవఁజనెడు, సజ్జనునిఁగూడజనులుదుర్జనుఁ డటంద్రు
తెలియ గల్లున్నచుండెడుతాడిక్రిందఁ, ద్రావుపాలనుగల్లుగాఁదలఁపకుంద్రె!

—మొద్దునిద్దుర—

ఉ. నీకనుమూసి మొద్దువలె నిద్దురనొందెద వేమి యొద్ద! నీ
మేకొను మాంసఖండమును మెక్కఁగ ముక్కున వ్రక్కలించెడుం
గాకికి నేమిబాధ; వధఁజెందెద వీ వదిగానఁ దెల్విమైఁ
దోఁకవిదుర్చుచున్ వెడలఁదోలితివే నిఁకఁ జాల మేలగున్. ౬౧

—పీతలమంగముగా నున్నదనుట—

చ. ధరఁగల కాయగూరలవిధంబున మంగముఁగట్టఁబూనె దీ
వరుసను సర్వదిక్కులకుఁ బర్వననేగెడు నెల్లపీతలన్
సరగున నేకరాశిగను జల్పఁగ నీతరమౌనె? యిప్పనిన్
దొరకొనఁగూడ దంచు మదిఁదోఁపదు నీ కిపుడైన బోయఁడా! ౬౨

—అంబలిదినువానికి మీసములొత్తువాఁ డొకఁడా?—

చ. అలవడ నొక్కపూఁట నలయంబలిఁ ద్రావుచునుండు నీకుఁ బ్ర
క్కల నివసించి మీసములుఁ గైకొనిపట్టఁగ నిద్దఱుండఁగా
వలెనొ! బళీ! కనుంగొనెడువారలు నవ్వెద రంచు నీమదిం
దలఁపవొ! సిగ్గులేదొ! విదితం బిఁక నీచరితంబు దాంభికా! ౬౩

—కప్పను బట్టినపాము—

చ. గరువముమీఱ నిప్పగిదిఁ గప్పను బట్టితి వెంతొ వేడ్కతోఁ
గఱవు మటన్న నిప్పుడనఁ గప్పకుఁ గోపమువచ్చు వల్దనన్
నెఱపెద వీవు క్రోధమును నేర్పున మీపగదీర్ప నిత్తఱిన్
దరిని నరేంద్రుఁ డుండవలెఁ దక్కినవారు సమర్థులే ఫణీ! ౬౪

—రైలువర్ణన—

సీ. స్వల్పధనంబుతో సర్వదేశంబులుఁ దిరిగిరాఁదగినట్టివెరవు గల్గె
నెన్నినాళ్ళకొ కాని కన్నారఁగనరానిబంధుమిత్రులఁ గాంచుభాగ్య మబ్బె
బాలవృద్ధులకైనఁ బలుమాఱు గంగాది పుణ్యతీర్థములకుఁ బోవఁగల్గె
నెంతదూరంబైన నింతైన శ్రమలేక శీఘ్రకాలములోనఁ జేరఁగల్గె
నహహా! బహువేగఁ జనుచుండి రహివహించు
ధూమశకటం బొనర్చినయామహాత్ము
ప్రతిభఁ గొనియాడుటకు ఫణిపతికి నైనఁ
దరమె! జగదంబ! సద్గుణావరకదంబ! ౬౫

—హుక్కా—

సీ. గమ్ముగమ్మను మంచికమ్మతావుల నీను చారుమారుతము పల్మాఱువీచు
గంభీరమగు నల్లగర్జారవంబునా బుడబుడధ్వానంబుఁ బొల్పుమీఱు
నణుమాత్రమగువహ్నికణములెల్లెడముంచి మించుఁదీవలను భ్రమించుచుండు
వగపైన చీఁకటుల్పర్వన ట్లొనరించి గుప్పుగుప్పునఁబొగల్ గుప్పుచుండు
ఘనతవహియించు నీదుహుక్కాహొరంగు
వార్షికాబ్దంబులీలను బరఁగుఁగాన
నిరత మానందరసమును గురియు నీకు
రావుకులదీప! శ్రీజగ్గరాయభూప! ౬౬

గీ. కోరి సేవించువారికి గుణ మొనర్తు, వాశ్రితావళి కామోద మలరఁగూర్తు
కాన నీసేవ మానరు మానవేంద్రు, లెలమినొక గ్రుక్కనుదిముద మెక్క హుక్క!

—మిరియపుగింజ—

క. కనుఁగవ కతిసూక్ష్మం బగు, తనువు ధరించితివి గాని తగ నిను మునిపం
టను గొఱుక మెఱసెదవు గ్రమ్మిన కారముమీఱఁ జూపి మిరియపుగింజా!

—తెల్లధాన్యము—

ఉ. పోతులచేతఁద్రొక్కఁబడి పొల్పఱఁ బ్రాఁతఱలోవసించి గా
ఢాతపవృత్తినెండఁబడి యంతట రోఁకటిపోట్ల కోర్చి యీ
రీతిఁ బరోపకారమొనరింపఁగ బాధసహించితౌ జగ
న్మాతృపితృప్రదాతృగుణమండనమాన్యమ! తెల్లధాన్యమా! ౬౭

—బంగారము—

చ. ఘనులకు నీచవృత్తులను గల్పనచేయుదు వేమి నీచులన్
గనుఁగొని సర్వపూజ్యులనుగా నొనరింతువు; కల్మి నెంతయుం
గనకమ! నీవుఁగల్గుగుణగౌరవ మెల్లను స్వర్ణకారుఁడే
కనుఁగొనుఁ గాని పామరులు గాంచి గణించి వచింపనేర్తురే! ౨౦

—సువర్ణభూషణము—

చ. ఇలఁ గలరూపహీనులకు నెంతయు రూపము దెత్తు లోపముల్
గలనరులైన గౌరవముఁగాంచ నొనర్తువు నీచునైన స
త్కులునిగఁజేయు దెయ్యెడ నకుంఠితమై రహిమీఱునీమహో
జ్జ్వలగరిమ న్నుతింపఁదగు స్వర్ణమణీమయభూషణావళీ! ౨౧

—వజ్రాయుధము—

క. ఉర్వింబర్వడి పైఁబడు, పర్వతములపక్షబలముఁ బరిమార్చుచుఁ ద
ద్గర్వము సర్వ మణఁచు సు, పర్వాధిపుమానధనమ! వజ్రాయుధమా!

—స్ఫటికపుబొమ్మ—

చ. మొగమునఁ గల్గుసోయగము ముద్దులుగుల్కఁగఁ దళ్కులీనుమై
జిగిబిగి నన్నుమిన్నవలెఁ జెన్నగు నీదగు మ్రోల నెవ్వరే
సొగసుధరించి నిల్తు రలసొంపును నీవు వహింతువౌ భళీ
వగఁగొను నెల్లరాగ మెదఁ బర్వఁగఁ గృత్రిమరత్నపుత్రికా! ౨౩

—పుస్తకము—

ఉ. సారెకు నీమగర్భగత సార మెఱింగి వచింపకుంటిపో
గౌరవముక్ ధరించు నినుగైకొని సంతతముం జరింప సం
స్ఫారి యటంచుఁ బామరులు సన్నుతిసేయఁగ హస్తభూషణా
కారముతోడ మూఢులను గాతువు పుస్తకమా పుటాంకమా! ౨౪

—అగ్గిపుల్ల—

సీ. పొరుగిండ్ల కగ్గికై తిరుగలేకను గుండు పడఁతులెల్లను నిన్నె ప్రస్తుతింత్రు
చుట్టలిమ్మ్యోడఁ గాల్చునట్టివారలు చాల నిరతంబు నిన్నె వర్ణించుచుంద్రు
చేలకాపరులైన పాలేరు లెల్లరు సంతతమును నిన్నె సన్నుతింత్రు
చంటిపిల్లలు గలసతులెల్ల నెలమితో ననిశంబు నినె కొనియాడుచుంద్రు
తలఁచునంతనె యెంతటితమమునైన, విలయమొందించి తేజమైవెలయుచుంటి
విట్టి నిను వినుతింపఁగా నెవ్వఁ డోపు, నంధకారాతిప్రతిమల్ల! యగ్గిపుల్ల!

—ప్రత్తిరాట్నము—

చ. సవినయలీలఁ దూలమును సారెకుఁ గూరిమి మెక్కి క్రక్కఁగాఁ
దవిలి యొసంగువారలును దర్పముమీఱఁగ నొక్కిపట్టి నీ
చెవి నులిపెట్టి త్రిప్పునెడఁ జెప్పఁగశక్యముగానికిర్రుతో
నవిరళలీల మొఱ్ఱలిడి యార్చెద వర్హమె ప్రత్తిరాట్నమా! ౭౬

—కాగితముతోఁ జేసిన గాలిపాము—

చ. తొలుతటిసర్పజన్మమునఁ దోరపువాయువు మేయుచుంట నీ
మలుచటిపుట్టువొందియును మానక గాలినిఁ గోరి ధీరతన్
నిలిచెదు వాయుమార్గమున నిచ్చలు నీ విటు పూర్వవాసనల్
గలుగు నటన్నమాట వృథగా దది వాయుఫణీ! గుణాన్వితా! ౭౭

—వీణ, మిత్రుఁడు—

గీ. మనము దనపయి స్నేహంబు మరలమరల
నెటులు నెఱపెద మటులు దా నమితరాగ
గరిమగొని వీణ సారణికరణి సఖుఁడు
చెలువుఁగైకొని సరళిగాఁ జెలఁగిపలుకు. ౭౮

—ఎలుక, దుర్జనుఁడు—

క. గుణఖండన మొనరించును, గనుఁగొన నెయ్యెడల రంధ్రకల్పన సేయున్
ఘనతరతమమునఁ జను దు, ర్జనుఁ డలమూషకములీలఁ జగతి నలరెడున్.

—కొప్పు, నీచుఁడు—

క. శిరమునధరింపఁబడియును, గరమును స్నేహమునఁ బెంపు గైకొనియును సుం
దరికచభారముకరణిన్, ధర నీచుఁడు తనదుకుటిలతను విడువఁడుగా!

—ముసిఁడిచెట్టు, లోభి—

గీ. ఎల్లసిరులను దా విలసిల్లుచున్న
నొరుల కుపయోగమునకు రాకున్నిఁ జేసి
పూర్ణఫలములు గలయట్టిముసిఁడిచెట్టు
పగిదిఁ బెనులోభి సన్నుతుల్ వడయఁ డెపుడు. ౮౧

—ఎనిమిదవ వన్నెబంగారము, గీటునకు రానిది—

ఉ. చారుతయున్ మృదుత్వమును సారవిశేషము భవ్యతేజమున్
గౌరవముం దళత్త్వళయుఁ గల్గినదాట జనుల్ ప్రియంబుగా

నారయ వాసిమీఱు పదియాఱవవన్నెపసిండితోడ నే
తీరున వన్నెకెక్కెదవు తిన్నగ నెన్నిదివన్నె బంగరూ ! ౮౨

—దీపము—

చ. అలరెడుతావకాశయమునం దొకయించుకయైన స్నేహముం
గలిగినవేళ నీదగుముఖంబున మీఱెడు శోభకున్ సభా
స్థలి నటుగాక నిల్చుతఱిఁ దాల్చెడుదీప్తికి హెచ్చుతగ్గునం
దెలివిని గాంచువారలె మదిం గనుఁగొందురుగాక దీపికా ! ౮౩

—రాత్రి, విభావరీనాయిక, శృంగారరసము—

ఉ. నిక్కము మేన రాజిలుమణీమయభూష లనన్ గ్రహాళి దాఁ
జక్కఁగఁ బొల్చుచుండినను జందనబిందుకదంబమో యనం
దక్కినఋక్షము లుండినను దద్దయు నీ వలరాజురాకచే
మిక్కుటమైన శోభఁ గొని మీఱెదు నారెకు నో విభావరీ! ౮౪

—మంచిగంధము—

ఉ. నిన్నలరాతిపై నునిచి నిచ్చలు మేనబుగంగఁ దీసినన్
మన్ననమీఱ నాసికకు మంచిసుగంధ మొసంగుచుందు బల్
సన్నుతలీల మేనునకుఁ జల్లఁదనంబు రచించుచుందు వౌ
నెన్నికఁగన్న నీసుగుణ మెంచి నుతించెద మంచిగంధమా ! ౮౫

—రాసకేళీవర్ణన—

చ. లలితకలావిలాసముల రాసమునం దగుశౌరివీక్షణా
వళు లళులట్లు గోపికలభవ్యముఖాబ్జములందుఁ గ్రోలుచో
నలహరినాసికాగ్రవిమలాంచితమౌక్తికకాంతిమించి ని
స్తులగతి మీఱె గోపికలచూపులకోపులు చేఁపలో యనన్. ౮౬

—ఒంటెద్దుబండివారలు—

చ. ఇల నలపిన్నపెద్ద లని యెన్నుచు నుండెడు తారతమ్యముల్
వెలయమిఁ జిన్నవారలకు వృద్ధులు దీవనలీయు రేయెడన్
వలనుగ బండివాండ్రు తమబండ్లపయి న్వసియించునట్టివా
రలఁ గని మీరు ముందఱికి రండని కోరుచునుండ్రు శాంకరీ ! ౮౭

—యోగీశ్వరుఁడు—

చ. జడలు ధరించినం గడువెసం గొని పావల నెక్కి త్రొక్కినం
బొడితడిగా నొనర్చి మెయిపూఁతగ భూతినిఁ బూసికొన్న నీ
గుడుగుడిఁ ద్రావుచుండినను గూరిమి జేవుఱుగుడ్డఁ గట్టినన్
నడవడిలోటుఁ జూచిన జనంబులు నవ్వరె యోగిపుంగవా! ౮౮

—అగస్త్యుఁడు—

చ. వననిధిఁజొచ్చి నీవు సుధవంటి జలంబును ద్రావి ఘోరమై
దనరఁగఁ జేసి డించితిగదా జను లెయ్యెడ నంటకుండ నా
ఘను లవి గ్రోలి కాదె! యధికం బగుమాధురి గల్గఁజేసి భూ
జనుల కొసంగి ప్రోచు సరసంబుగఁ గుంభజుఁడా! యపాత్రుఁడా! ౮౯

—పండితగౌరవము—

ఉ. సారవచోచమత్కృతిలసత్కవితాతతగీతసాహితీ
ధీరత రాజశేఖరు నుతించిసుఖించెడి సత్కవీంద్రుఁ డొ
య్యారముమీఱఁ జుట్ట లనయంబును గాల్చిన మోజుదీఱఁ బై
జారుబుదొడ్గినం గుటిలజారుని కైవడి నిందఁ జెందునే? ౯౦

—రావణుఁడు—

చ. చదివితి వెల్లవేదములు శాస్త్రములం బఠియించి తెల్లనం
పదలనుఁ గొంటి వెంతయును బల్మియుఁ గల్మియుఁ గల్గియుండి దు
ర్మదమును బూని యాభువనమాతను సీత హరింపవేని నీ
సదమలవైభవం బెవఁడు సన్నుతిసేయఁడు జాణ! రావణా! ౯౧

—కిరాతకుఁడు—

గీ. లేఁతయగు పచ్చగడ్డినిఁ బ్రీతి మేసి, వేడుకలఁ గ్రీడసలిపెడు లేడిగములఁ
జేరి కనుపట్టి కొట్టెదు మేరమీఱి, పాతకము గొట్టుఁగాత! కిరాత! నిన్ను. ౯౨

—పూజారి, దుష్టమంత్రి—

చ. సరసుని రాజమౌళిఁ గని సన్నుతిసేయఁగఁ గోరి చేరుస
త్పురుషుల కోర్కెఁదీరఁగను మోదముమీఱఁగఁ గన్నులార శ్రీ
కర మగువానిదర్శనము గల్గఁగనీయక మాటుఁజేసె దీ
తెఱఁగున న్కొకసారి తెరదీయుము చాలిఁక! యోశివార్చకా! ౯3

—మేఘుఁడు—

గీ. సతతసన్మార్గచరములౌ చాతకముల, కప్పు లిడుటకు గర్జిల్లు చానసంబు
నల్పుగావించుకొంటఘనత్వమగు నె, యుచితమదిగాదుసుమ్ముప యోధరుండ!

— సర్వభక్షకుఁడు, అగ్నిహోత్రుఁడు —

చ. జడనిచయంబు లెంతయును జన్మముఁజెందఁగ హేతువైతి; వి
వ్వడమి నహేయహేయములు భుక్తి యొనర్తువు; నిన్నుఁగూర్చి వే
ల్చెదు నలహోతృవర్యులకుఁ జేతులుఁ గాల్తువు నీతిమాలి నీ
నడవడి నెంచి చూడ మలినత్వముఁ దాల్చెదు; సర్వభక్షకా ! ౯౫

—వృద్ధుఁడు—

చ. కనుఁగవ కెంతయుం దమముఁ గప్పెను దంతము లూడఁజొచ్చె న
వ్వానికియుఁ బోయెఁ గేశములు వెల్వెలఁబాఱె నడల్ చలించె మో
మునఁ గడుఁ లాలమీఱె నివి పొల్పుగఁ దెల్పెడుఁ బెద్దవౌట నీ
వనిశము దండముం గొనఁగ నర్హుఁడ వైతివి చూడ వృద్ధుఁడా ! ౯౬

—పుష్కరకలికాలము—

చ. కర మలవేదశాస్త్రములు గంగను గల్పఁగ సర్వవర్ణసం
కర మొనరింప నీచులఁ బ్రగల్భులఁజేయఁగ నీతిమాపుము
ష్కరులకు సంపదల్ వెనుప సత్పథమెల్లను బీడుసేయఁ బు
ష్కరకలికాలమా ! యేటకుఁ జయ్యన నెచ్చటనుండివచ్చితే ? ౯౭

—పేక ఆట—

సీ. ముందుగా నొకచోట ముదముగాఁ బేకాట నాడుట కెందఱో గూడిపిదప
నొక్కపైసయుఁ గాని పెక్కుపైసలు గాని పణముగా నిడి యెంతో పంతమలరఁ
గనుసన్నలాదిగాఁ గలదుష్టచేష్టలు నన్సృతవాదంబులు నాడికొనుచుఁ
బెద్దకేకలు వేసి బేస్తులుగొట్టుచు మాత్సర్యములుఁ జెంది మమతఁబొంది
లెంపలనుగొట్టుకొనుచును బెంపుమీఱు, కలహములొనర్చితనువునఘాతసలుపు
కొనుచుఘిర్యాదులనుజేసికొందురహహ! పందెమందెల్లనీరీతిఁ బరఁగుసుమతి !

—కావడికుండలు—

గీ. కడుసమత్వముమీఱ అమీఱకడుపునిండఁ, జేయక వహించుచోఁజాలఁజిందిపడుచు
దొట్రుపాటూని నడకలఁ దూఁగనీరు, గొప్పకడవులకావడికుండలార !

—బండిచక్రములు—

క. సతతమహోన్నతపదవిన్, ధృతిమెలఁగుసుదర్శనమున కెన యగుదురోరో!
వెత నుచ్చనీచములఁ బడి, జతపీడక తిరుగుబండిచక్రములారా! ౧౦౦

—చాయకత్తి—

గీ. వాఁడివహియించి యొఱలోన వఱలుచున్న
నిన్నుఁగొని స్నేహ మెయ్యెడ నెఱపునట్టి
వసుమతీంద్రుఁడు మెచ్చఁ దద్వైరితనువు
గాయములు సేయుదువు మేలు! చాయకత్తి! ౧౦౧

—దుందుభి—

చ. లలితకలధ్వనిన్ విజయలబ్ధియు నిత్యజయప్రసిద్ధియుం
దెలుపుచు నీవు ద్వారముల నిచ్చలు హెచ్చి సమస్తశబ్దముల్
గులుకుచుఁ బల్కుచున్ మిగుల గొప్పగ నొప్పుచు గీతిరీతిచే
వెలయుచు రేఁబవల్ చెవికి విందొనరించుచునుందు దుందుభీ! ౧౦౨

—ధనవంతునకు సజ్జనగోష్ఠి—

క. ధనముఁగలవాఁడు పండిత, జనసంగతి గలిగెనేని సన్నము యశో
ధనము పరతత్త్వధనమున్, జననసఫలతయునుగల్గు సరసకుమారా! ౧౦3

—ఆకాశస్థలి, ఒకనాయిక—

ఉ. చిక్కగ నొక్కరీతిగను జేవెదఁజల్లినలీల నెల్లెడం
బెక్కులుచుక్కలుండినను బేరువహించిన తారలుండినం
జక్కలతేనిరాక నిటు శోభవహించితి వంబరస్థలీ!
నిక్కపుమాట నేనిపుడు నీయెదుట న్వచియింతు నెంతయున్. ౧౦౪

—కుంచెకోల, దేవాలయము తలుపుతాళము—

గీ. రంధ్రమునుగాంచిమించివక్రతవహించి,తిరుగుచుండియొగడియలోదేవళంబు
తలుపు లెడఁజేసి పరమభక్తులకు లోక,గురునిఁజూపెదవేవేళఁ గుంచెకోల!

—ఇసుకతిన్నెలు—

గీ. కనుఁగొన మహోన్నతిని జాలఁ గాంచియున్న
హృదయ మది స్నేహశూన్యత నెనసియుంట
ఫలిత పోటులుండ మిముఁజేరువారిబలిమి
నడకలు హరింతురే! పులినంబులార! ౧౦౬

—ఉప్పుగల్లు—

గీ. గాఢమగురుచులాఱిటఁ రూఢిమీఱి, వన్నెకెక్కితి గావున నిన్నెమున్న
పంక్తిగానిడు భోజనపాత్రములను, మెప్పుగా నెంచి యుంచెద రుప్పుగల్ల!

—ఏతము—

చ. వలనుగ నీవు ము న్నుగుణబద్ధతమై నలరారుచుండియుం
జెలిమి యెలర్పఁ గూపములఁ జేరుటఁ జేసి జడప్రవృత్తిదాఁ
గలిగినదైన చాతురినిఁ గైకొని జీవనముం గ్రహించుచో
మెలఁగెదు నమ్రతం బిదప మీఁదకువత్తువు మీఱి యేతమా! ౧౧౨

చ. వెలయఁగ జీవనగ్రహణవేళ వినమ్రతనొంది యాల నాఁ
దలపయి నెక్కుచుంటఁ దొలుతం దగియుండెనొ లేక యిప్పు ని
చ్చలును జడాశయాధిగతసంగతి నబ్బెనొ! చాలుఁజాలుఁ! గే
వలగుణబద్ధతం గలిగి భాసిలు నీకిది కూడ దేతమా! ౧౧౩

—బ్రహ్మపదార్థవిజ్ఞానము—

గీ. విషయమొకటినుండి విషయాంతరంబునఁ, గలయ నేగుమధ్యకాలమందు
మననరహితమైన మానసంబున కేది, వఱలురూప మదియె బ్రహ్మమండ్రు.

—నోరు—

క. నోరా! వీఁపున కెంతయు, భారము చేకూరునటులు పలుకక యెపుడున్
సారెకుఁ జాటూక్తిసుధా, ధారలు చిలుకంగఁబలుకఁదగు నెయ్యెడలన్.

—బొట్టు, కుచ్చితమంత్రి—

చ. చెలువుగ నిర్ధరించిన భుజింపనివాని భుజించినట్లుగాఁ
దెలిపెదు నిర్వహింపమిని దిండి భుజించినవానినైన నాఁ
కలిగొనియున్నవానివలెఁ గన్పడఁజేయుదు గాన పొట్టకై
వలనగుబొట్ట! నిన్ను ముఖపట్టికఁ బెట్టెద రెట్టివారలున్. ౧౧౪

—పశుదయ—

సీ. జగతియందెల్లెడ సర్వమానవులకు దధిఘృతక్షీరవితతినొసంగి
యెంతయు శ్రమమొంది యెల్లభూములుదున్ని పంటల నభివృద్ధిఁబడయఁజేసి
పండినధాన్యముల్ బర్వుకోరిచి తెచ్చి యిండ్లకుఁ దరిఁజేర్చి యెలమిఁగూర్చి
తీర్థయాత్రలకును దిరుగువారలబండ్లు మోయుచుఁ బలుకష్టములు భరించి

మఱియు నెన్నెన్నొ యుపకృతుల్ మనకొనర్చి
గడ్డిదిని బ్రతికెడు పశుగణము నెడల
బహుకృతజ్ఞత గల్గి విశ్వాసకలన
నెఱపుటయె ముఖ్యధర్మంబు నరులకరయ. ౧౧౩

—అహింస—

సీ. ఏఁడాదిలోన రెండేఁతలనీనుచుఁ బిల్లలనైదాఱుపెట్టుచున్న
మేఁకలెన్నెన్నియో లోకమందెల్లెడ నాకలంబులు దిని యలరుచుండ
వానినన్నిటిఁ జంపి వండుకుదినువారి సంఖ్యకన్నను వానిసంఖ్యతగ్గ
కొదవగా నిప్పుడు గోగణంబును గూడఁ జంపిభక్షించుచు సంతసింత్రు
అయ్యయో! పాపమని యెంచరదియుఁగాక, పాఁడిపంటలు రెంటికిభవ్యహేతు
భూతమగుగోగణంబుపైభూతదయను, జూపకకృతఘ్నులైరూపుమాపుచుంద్రు

—పశుసభలు—

చ. బలిమివహించునట్టి వృషభంబులు దున్నలు గేదె లావులుం
జెలువగు కూరగాయలను జిత్రఫలాదులు నెన్నొవస్తువుల్
పలుగఁ గూర్చుచుం బశుసభల్ రచియింతురె కాని శాస్త్రచ
ర్చలు గలసత్సభల్ సలుపుజాడలఁ జూడఁగ లేదు శాంకరీ! ౧౧౪

—కుక్క, స్తుతి—

క. శునకమ! చంచలగతియగు, కనకము నీతోడిసాటిగనున ఱె మెత్తునకై
వను దిని తనియుచు సతతము, ధనహీనులనైనఁ గొల్తు దగనమ్మికతోఁ.

—కుక్క, నింద—

చ. కులుకుచు గంజిఁద్రావి కడుఁగూరిమి మీఱఁగ దాలిగుంటలో
పల శయనించియున్నతఱి ఫల్గుతనంబును బూననం చెదం
దలఁచెను; లేచి తోఁకను విదల్చి యొడల్ చెవులుం గదల్చి ర
చ్చల నలనీచకృత్యములు సల్పెదు సారెకు సారమేయమా! ౧౧౫

—కోడిపుంజు, స్తుతి—

ఉ. గౌతమపత్నికై వలచుకాలమునందున నీదురూపు దా
ల్చ్యాతిగఁదాల్చి కార్యమును నైకొనుటన్ మదిమెచ్చి దేవతా
నేత స్వకీయవజ్రమును నీకొనఁగూర్చెను గాక! కల్గనే
యాతతలీల నీకుఁ జరణాయుధనామము కుక్కుటాగ్రణీ. ౧౧౬

—కోఁడి, నింద—

క. ఇల ననికి మొఱఁగి చలమఱి, తొలఁగుట మర్యాదకాదు తునుమువలె నరిం
దలకొని లేదా మనమునఁ, గలఁగక చచ్చినను మేలు గద! కుక్కుటమా.

—గాడిద—

చ. నరుల పదాహతిం గొని యణంగి ధరం గడుస్రుక్కియుండ, గం
ధరుఁడు కృపారసం బొసఁగి కాచుట నియ్యెడ మొల్లలెత్తు నీ
గఱికిని మేయుచుంటివిటు; గాడిద! నీవె నశింతుగాని యా
గఱికికి హానిలేదు కలకాల మిలం జిగురించుచుండెడున్. ౧౨౦

—గుడ్లగూబ—

గీ. సర్వలోకములకుఁ గర్మసాక్షి యగుచు, నేత్రసాఫల్య మొసఁగు సన్మిత్రుఁ డాతఁ
డభ్యుదయ మొందఁగని మోదమంద లేమి, ఘోరమగు నీదు పాపమో! గుడ్లగూబ!

—పాలీయనిగోవు—

క. మున్నుగఁ గడుగుం గుడితియు, మిన్నక నలచిట్లు, పొట్టు, మెక్కఁగ నిడినం
జన్నొడిసిపట్టునపుడే, తన్నద వెగఁ జేపుఁ జూపి తాఁపులగొడ్డా! ౧౨౨

—పిల్లి—

ఉ. సారెకు మేరమీఱి కడు సాహసవృత్తిని బుత్తిసేయగాఁ
గోరుచుఁ గోఱలందెఱచి గ్రుక్కను ద్రిప్పుచుఁ బొంచియుండె దా
రా! రహిమీఱు చారుతరరాజగృహాంతరపంజరస్థమా
కీర మదెట్టు లబ్బునికఁ గీడగు నీకిచటన్ బిడాలమా! ౧౨౩

—ఉసిరికపండు—

క. దగనొందినయెడ నినుముం, దుగఁ గొని సేవించి పిదపఁ దోయముఁ ద్రావన్
మిగుల రుచింతువు సుధవలెఁ, దగు నుసిరికపండ! నిన్నుఁ దవిలి భజింతున్.

—పనసపండు—

క. పనసఫలమ! నీతనువది, ఘనతరకంటకిత మగుచుఁ గనుపట్టెడునై
ననుహృదయమెఱిఁగి కైకొను, జనులకు మాధుర్యమిడెదు సరసత మెఱయన్.

—తాటిచెట్టు—

చ. ఫలములు, కాయ, లాకులును, వక్కలు, నారయు, మొంక, గుంజు, తేఁ
గలు మొదలైన విచ్చుచును గల్పలత న్నిరసించిమించు నీ
వెలమిని లేఁతచన్నులను నీడిగవాని కొసంగి కల్లులో
ట్టెలుఁ దలదాల్చుటం గద ఘటించెను ద్రోహము తాళవల్లికా! ౧౨౬

—సంపెంగపువ్వుగుత్తి—

చ. ప్రకటితహేమవర్ణమున వన్నెవహించితి రమ్యసౌరభా
ధికతను గాంచి మించితివి; తెల్విధరించితి వైన మానుగా
సకలలతాంతవాసనలు సారెకు నానుమిళిందరాజ మెం
దుకు నినుఁజెందదో మదినిఁదోఁపదు చంపకసూనవల్లరీ! ౧౨౭

—దుష్టచిత్తము—

చ. నిలుకడలేదు సుంతయును నీతియు సున్న గుణంబు నాస్తి చా
పలమది మెండు; కోరిక లపారము లెన్నఁ; బరాంగనాధనం
బులపయిఁ గాంక్ష హెచ్చు, హరిపూజలటన్న హుళిక్కి; గాఁగ ని
చ్చలుఁ గడుదుర్గుణంబుల వెసందొరకొంటివి దుష్టచిత్తమా. ౧౨౮

—బాల్యావస్థ—

ఉ. ప్రగ్గడలున్నచోట భయభక్తుల నెంతయుఁ గల్గనీయవా
యగ్గియుఁ దుట్టపుర్వులను నంటఁగరాదనుబుద్ధి నీయవా
యొగ్గగుమాటలం బనుల నెన్నియొ పన్నుగఁజేయుచుందువా
సిగ్గెఱుగంగనీయ విటుఁజెన్నుగ నన్నిటఁ జిన్నప్రాయమా! ౧౨౯

—గర్వము—

చ. అనువుగ మావలెం జదువ నర్థముఁజెప్పఁగనేర వెంతయుఁ
ధన మొనఁగూర్చి మావలెను దానముధర్మము సేయలేవు జ
వ్వనమును గల్గి మావలెను బాహుబలంబును జూపలే వటం
చును బయివారిసంగతిని జూడక యాడెద వౌనె గర్వమా! ౧౩౦

—కామము—

ఉ. వావిగణింప వింతయును వర్తనముం బరికింప వెంతయుఁ
వావిరి కీర్తిసంపదలుఁ బాయును దీన నటంచు నెంచ వీ
త్రోవలఁ గీడుమూడునని దూరముగాఁ దలపోయ విట్టిదు
ర్భావమున న్నటించు నినుఁబాయమి క్రోధము డాయుఁ గామమా! ౧౩౧

—మత్సరము—

చ. సిరినిరవొందె, సంతతినిఁజెందెను; బల్మియు నీగి కల్మియుఁ
దొరకొనె రూపవైభవముతోఁ దులఁదూఁగెను సర్వవిద్యలఁ
మెఱసెను వీరిదేమి యని మేరకుమీఱి నసూయనెంతయుఁ
నెఱపెదు వీనిలో నొకటి నీకొనఁగూడునె మత్సరాధమా! ౧౩౨

—శాంతము—

చ. తులువలు గూడి వేడుక నుతుల్ రచియించిన, లీల హేళనో
క్తులుఁ బచరింప మాని యని కొందఱు పామరు లండఁజేరి య
వ్వల నలకచ్చుకొంగుఁగొని బాగుగలాగుచు నుండ నత్తఱిం
దలఁపున కోపమూతనిని దాఁకదు నీకృపచేత శాంతమా ! ౧౩౩

—ధైర్యము—

ఉ. వారక నాకసం బొరగిపైఁబడుచుండుటఁ జూచుచుండియున్
వారిధిమేరమీఱితనవంకకుఁ జేరుట లెంచుచుండియున్
ధారుణి గ్రుంగిపోవు నలదారుణలీలను గాంచుచుండియున్
సారెకు నిశ్చలంబుగను జల్పెదు మానసవృత్తి ధైర్యమా ! ౧౩౪

—ఆశీర్వచనము—

క. ఆధియు వ్యాధియు లేనియు, పాధియు నెమ్మదియుఁ గాంచి యర్థులకోర్కెల్
సాధునఁ బూరించుచు నీ, వీధరణిన్ మనుము చిరము నిర్ధచరిత్రా !

—శ్లోకములు—

యస్యసంభవతి జన్మపత్రికా యాశుభాధికఫలప్రదాయినీ
ప్రోజ్జ్వలం భవతి తస్యజీవితం దీపయుక్తమివ మందిరంనిశి. ౧౩౬
విదుషాంతు ముదేనిజస్వరూపా గరుడాంకస్యముదే గతోపరూపా
గిరిశస్యముదే సదాపరూపా ప్రతిభాతీ త్యుపమైవ నైకరూపా. ౧౩౭
అకారణోజ్జృంభితసత్కృపారసా త్సుధీజనా త్తస్య ముదం నజాయతే
సుధాసుధాంశోరివ యస్యసన్ముఖే విరాజతే వాఙ్మధురా సుశీతలా. ౧౩౮
నారాయణాయ నళినాయతలోచనాయ నాకాధిపప్రముఖనిర్జరసన్నుతాయ
శ్రీమానినీహృదయసారసలోలమత్తభృంగాయ భక్తవరదాయ సదా నమస్తే.

—వావిళ్ళఁధములచే యోగినిబల్కుట—

ఉ. ధారుణి జారిణీభవులు దంపతులైరి విధిన్ సుయోగినీ
భారతిచేత భర్తనది వాసి స్వభర్తకు పాంసులాంబకున్
దీరుగఁ గల్గుపుత్రుఁగని దేవర ! సోదర ! మామ ! యల్లుఁడా !
దారక ! తండ్రి ! పౌత్ర ! యని తానలయోగిని బల్కెఁ దద్దయున్. ౧౪౧

యనుపమానవగ్రహప్రభాభరణమాభరణమాలాగణం బరసి తొడిప
లీలఁ గస్తూరిచే ఫాలభాగములందు గముఃలందుకొనుచుఁ జుక్కలఘటించి
పూతమానసలై గౌరిపూజ గూర్చి,కూర్చి నిన్ను వరింపరే గోపసతులు,చా.

మేఘవర్ణుని జూడవే ఘనసారమా సారమాయాపరిచ్ఛన్నుఁ డతఁడు
గోపరూపకుని గన్గొనవె హింతాళమా తాళ మాతరమె దయాళుఁడతఁడు
కాంచనాంశుకధారిఁ గాంచవే తిలకమా తిలక మాననమునఁ గలుగునతఁడు
ఘనవేణునాదుని గానవే కుందమా కుందమా కనకున్నఁ గుటిలుఁ డతఁడు
మానధనహారియై యెట్లు మమ్మననుచు, ననుచు గోపికలరయ రెనినుభ్రమించి
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౫౮

కోరిచేపట్టెనా గోపకుమారుండు మారుం డనంగుని మూర్తిఁ జనఁడె
పాలించెనా శౌరి ప్రచలితోపవనుండు పవనుండు నలుగడఁ బరువు లిడఁడె
నందనందనుఁ డేలెనా కలకంఠంబు కంఠంబు రాచి గద్గదతఁ బడదె
రక్షించెనా హరి రాకానిశాపతి శాపతిరోహితచ్ఛవిని గనఁడె
యంచుఁ దమలోన నెన్నుచు నధిగమించి,మించి వ్రేతలునిన్ను మోహించిరౌర
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౫౯

వెలఁదులు నీకు వ్రేతలకు నీ విరుగడ విరుగడగాని బంధురత నిలువ
బాలికాకరతాళఘణితిఁ ద్రికాలము ల్కాలముల్మ్రోఁడిటిఁ గనుట దెలుప
భవదభంగభ్రూవిభంగవితానంబు తానంబుఁ బలుకు గాత్రంబు నొలయ
నన్యోన్యకంఠవిన్యస్తహస్తములు తమ్ములు గల మృణాళమ్ము లనఁగ
రాసమండలగతి వేణురావ మలర, మలరహితవృత్తి మధ్యనుండలరితౌర
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౬౦

## (7) గోపాలనదశకము.

దధిభాండమథననాదమున దిగ్గన మేలుగన మేలుకని వత్సగణము విడిచి
ప్రబలుఁడై యలరారు బలరాముతోడనే తోడనే నెనరునఁ గూడి చెలఁగి
జనని గూర్చినపక్వమున కాత్మనలరుచు నలరుచు నెన్నుచుఁ జలిది మెసవి
భువనమోహనరావమునఁ గరంబఱచుచుఁ బఱచుచుఁ గ్రేపులఁ బాయఁ ద్రోలి
బాలకులు తోడరా నీవు పసులఁ గాయఁ,గాయదూత్తమయలరతిగా దెమాదఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౬౧

అపరంజిబంధసూత్రాగ్రంబులాగుచు లాగుచు మట్టిచల్లడము దొడిగి
ధవళప్రభంబైన యవసరాసన్నంపు సన్నంపుజమిలికూసంబుఁ బూని

తలచుట్టురా నీలగళపింఛ మతిపూత మతిపూతశాలు రుమాలుచుట్టి
చులుకనిరత్నకంబళముతో వెలయింపు వెలయింపు కండువా మొల బిగించి
చలిది పెడచేతఁ గుడిచేతఁ జబుకుఁ జెలఁగఁ
జెలఁగునీగోపరూపంబుఁ దలఁచువాఁడఁ
జారుతరమందహాస పోలూరివాస
వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౬౨
బోదునఁ బెరిఁగి యేచీదరమొత్తని మొత్తనిపచ్చిక మేపికొనుచు
నీల నాకర్ణించి లీల నేతేరఁగాఁ దేరగా వనములఁ ద్రిప్పికొనుచు
రిక్క వేయుచు నెచ్చరించి కామించఁగా మించఁగా నీరుద్రావించుకొనుచుఁ
దరులనీడలనుండఁదరలించి మరలఁగా మరలఁగాయుచుఁ బులినరసికొనుచుఁ
జెలఁగిగోవత్సములమందఁజేర్చిమీరు,మీరువాణంబుగలమూర్తిసౌరునెంతుఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౬౩
అరసిగోవత్సబృందాహ్వయోత్తరమెత్తి కరమెత్తి చీరి మూఁపురము లంటి
యత్రొత్తి నిలిచిన హస్తనీరజమున రజము నఖశ్రేణి రాచి త్రోచి
యాఁబోతుగిబ్బల నావుల యదనెన్ని మెదనెన్నిపనులున్న వదలి విడిచి
బెదరఁగాఁ గని పులి భీతినివృత్తికి వృత్తికిఁ దగు పొగవేటు వేసి
కడచి యారీతిఁ గోవత్సగణము నేల, నేలవే యేటికేటికి నినుమడింపఁ, జా.
వానలఁ బెంపొంది వాడక కఱకునఁ గఱుకునఁ దనరారుఘాసచయము
మృదులతరంగకంపితతామరసములై రసములై తగునదీహ్రదగణంబు
వెలితి గన్పడని నీడల వెదచల్లఁగాఁ జల్లగాఁ దనరు వృక్షవ్రజంబు
పడుకవాసిని గనంబడు మెఱుంగుల మెల్లఁ గులమెల్ల నౌననుగోష్ఠవితతి
దనర నేవేళ నాశ్రితవనవసంత, సంతరింపవె గోవత్ససమితి నహాహ,చారు.
ఆవులు సురధేనులట్టు పెంపెక్కుఁగాఁ బెక్కుగా ముప్పొద్దుఁ బిదుకువలన
నలరఁగా శైలంబు లట్టు మూఁపురములఁబురముల వృషభము లొప్పువలన
వెలయఁగాఁ గోడెలు పులులకైవడి నొప్పి వడినొప్పినిడు అంకె వైచువలనఁ
దనరారఁగా సెలతఱుపులు కరులవైఖరుల యొయ్యారంబు గతులవలన
సౌరభవదీయపాలనోదారమహిమ, మహిమదోద్ధతిఁ బ్రబలించెమందపసులఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౬౬
అఖిలచరాచరప్రాణి జీవనముల వనములఁ దటభూమి ననుసరించి
మత్తరోలంబడింభకకదంబాలక పాలకగణముతో బంతిసాగి

వామహస్తములఁ గేవలత మానవరుచి నవరుచి పెరుఁగువంటకముఁ బూని
ముష్టినోరులు ముద్దముద్దకు నూరఁగా నూరుఁగాయల వ్రేళ్ళ నుక్కఁ బట్టి
యప్పశుశ్రేణిఁ గాచినడప్పియార, నారగింపవెసరసఁబులాడుకొనుచుఁ, జా.
ఖగములు ధూమంబు గప్పినఁ గానక గానఁ గలంగుచుఁ గలియఁ దిరుగ
మృగములు ప్రేలైనసెగలవెంబడిఁ బడి బడి బడి మైఁగాల్ప నడలినరుగ
నురగులు బలుమంట లొడియఁగా నాకుల నాకులమున భీతి నరిగి చొరఁగ
లలితవృక్షములు కీలాచయం బేర్చినఁ బేర్చినలతలతోఁ బృథివిఁదొరుఁగ
నడరువనవహ్నిఁ గ్రోలి నెయ్యమునగోప, గోపరిత్రాణమొనరింపవేపరేశ, చా.
ఆజ్ఞానుసరణగోపార్భకరాజితో రాజితోత్ఫుల్లవక్త్రంబుతోడ
గోధూళిధూసరాంకురకుంతలాళితో లాలితోజ్జ్వలనిటలంబుతోడఁ
గలితదండనదండకరతల పాళితోఁ బాలితోదారగోప్రతతితోడఁ
బరిపంథిభంజనప్రఖ్యాతికీర్తితోఁ గీర్తితోరుతరాంగమూర్తితోడ
నస్తమయవేళఁదర్జనాహ్వానశబ్ద, శబ్దముల మందకేగు నీసొగసు నెంతుఁ, జా.
అఖిలవృక్షములు ఝంఝానిలవేగత వేగతశాఖలై విఱిగిపడఁగఁ
జేరిగర్జిల్లుటచే వీడి యాశల యాశలగని చేతనౌఘమేగ
జంతుసంతతి నేత్రసంఘాత మెఱుపుల మెఱుపులచే మిఱుమిట్లుగొనఁగ
వివిధనివాసముల్ వృష్టిసంపాతత పాతతమోజలప్లవము గాఁగ
నడరుపర్జన్యుఁ గని కేల నద్రిఁ బూని, పూనికల గోపగోతతిఁ బ్రోచితౌర
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౭౦

## (8) దుష్టనిగ్రహదశకము.

వచ్చి విషస్తన్య మిచ్చిన ఘాతకి ఘాతకికిశోరకప్రీతిఁ దునిమి
బండిరూపమునఁ బైఁబడిన నీచపలాది చపలాదిగుణులాత్మ జడియఁ ద్రుంచి
నిను జుట్టిపట్టి యెత్తినపవనాకారి నాకారిఖలులు వణంక నడిచి
యలయములూఖలహతి నర్జునాగమముల గమముల నెట్టి పెకల్చి కూల్చి
తౌర నీకిట్టు లపకారులైనవారి, వారిజోదర వధియించి మీఱితౌర
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౭౧
కపటప్రచారంబు గని నందవత్సక వత్సకళేబరవైరిఁ ద్రుంచి
ఘోరాటవీస్థలి గోపశాబకమూర్తి బకమూర్తి నిర్గతప్రాణుఁ జేసి
యెద మృషాసంచార మెఱిఁగి విఘాతాఘ ఘాతాఘదనుజుని దునిమివైచి
కేళిమె సరఁగోపాల శేఖరగతి ఖరగతి నెదిరినఖలు నడంచి

యెడరియీరీతిమాయాప్రలైకలంప,లంపటలోనర్చుఖలులఁగూల్ప వెయిదల్చి
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౭౨

నృత్యంబు ఫణముల నెఱపి ప్రక్కదలించి కదలించి కాళింగు గర్వమణఁచి
కను సన్న చేసి తార్క్ష్యుని మహాబలునిచే బలునిచేతఁ బ్రలంబుఁ గలసఁగూల్చి
కని సుదర్శననామఖచరగర్వాహిని వాహినీతటమున దేహముడిపి
సఖుల మ్రుచ్చిలి మింటఁ జనుశంఖచూడుని చూడునీపాటని కూడిత్రుంచి
వెలయు వే దోర్బలత నక్లిఖలులనైన, నైనవారిని బ్రోచుటకై వధించి, చా.

జనకుని నీట దాఁచిన పాశకరుని కింకరు నకించను బదాక్రాంతుఁ జేసి
కొమ్ములఁ గ్రుమ్మఁ దార్కొను వృషభాసురు భాసురభుజశక్తి బడలుపఱిచి
కినిసి హయాకార కేశినామారాతి మారాతిసుందర నీరుచేసి
బాలురఁ గలసి మాయాలోలగతి నాడుగతి నాఁడు వ్యోమరాక్షసు వధించి
కలనశూరులలోఁ బరాక్రమనిరూఢి, రూఢికెక్కితి వసమానరుచిర తేజ, చా.

గరువంపురజకుని నరిభయాకరమునఁ గరమున నుత్తమాంగంబు చఱచి
యనిలోనఁ ద్రొక్కి వచ్చిన మత్తకుంభిని గుంభిని యమ్రువగాఁ గూల్చివైచి
మల్లయుద్ధమున మత్తిల్లుచాణూరుని నూరుని గ్రహములఁ బోరి చంపి
చేరి ముష్టాముష్టి సీరిచే ముష్టికు ముష్టి కుత్సితహాతి మొక్కచెఱిచి
దృష్టిపథమునఁబడినయీదుష్టతతిని,దతినిబరిమార్చిదోశ్శక్తిఁదనరితౌర, చా.

ఆజన్మశత్రుఁడై యవని న్వైరసుల రక్షసులఁ రట్టడినేలు కంసుఁ జంపి
ముచికుందునేత్రాగ్ని మొనయుటపాయుంబుపాయంబుగాఁ గాలయవనునోర్చి
కూర్పు సత్రాజిత్తుఁ గూల్చి దుస్తరగతి దరగతిఁ జను శతధన్వుఁ ద్రుంచి
యంతఃపురద్రోహు లగుమురనరకుల నరకుల ముష్పంగ వరుసఁగూల్చి
ఖలుల నిట్లువధింపఁగాఁ గ్రమమెసంగ, సంగరముచేసినట్టిదోస్సారధీర, చా.

అనిరుద్ధుఁ జెఱవెట్టి యాజి శంకరశక్తి కరశక్తి గలబాణు గర్వ మడఁచి
తనచిహ్నములు దాల్చు నని సహింపని కానిపని కానిఁబౌండ్రకుఁదునిమివైచి
యాతని కనికిఁ దోడగు కాళికావరు కావరుఁ డని వాని గళము ద్రుంచి
కృత్తినంపిన మదోన్మత్తు సుదక్షిణు దక్షిణాకరహేతి దాడి నోర్చి
యీకరణిదుష్టజనముల నేర్చిపిదప,పిదపకృత్యము వెడలించిపొదలితౌర, చా.

పరిణయం బాది దర్పము జనింపఁగ వట్టి పగవట్టికొనుశిశుపాలుఁ దునిమి
శంకరవరలబ్ధసౌంభకసహితుఁడై సహితుఁడై యెడరినసాల్వుఁ ద్రుంచి

దంతవక్త్రుని మహోద్దామకామోదకి మోదకీలితమనోమూర్తి నడఁచి
కలన నమోఘచక్రముచే విదూరుని దూఱు నీఁక నని త్రుళ్ళడంచి
యట్టిదుర్మార్గవర్తులనరసియోర్చి, యోర్చి ధాత్రికిఁగడుమేలుగూర్చితౌర, చా.
సారె జూదంబాడి సభ నుల్లసము లాత్మసము లాత్మ నలరఁగాఁ జలుపుసుక్కి
బాణునిసేనాధిపతుల మ మ్మనిమూఢు మని మూఁడు కుంభాండకాదిరిపులఁ
బురములఁ దరుల విస్ఫురితేచ్ఛ విహరించు విహరించు దుర్మదద్వివిదకపిని
సతతతపస్సమాశ్రితమహావనులఁ బావనుల బాధించు పల్వలసురారి
బలుని చేనిట్లు శౌర్యసంపన్నకాయ, కాయములవీడఁ జేసినకర్మసాక్షి, చారు.
కుడిచేత ములుకోలఁ గొని వామకరమునఁ గరము నశ్వములపగ్గములఁ బూని
శిరమున ముకుటంబు చెలఁగ రంజన ఘనాంజనఘనాంగముల దుశ్శాలువైచి
రథికుని నదలించి రణమున దరము సుందరముచూపెడు చిఱునవ్వు గలిగి
సన్నద్ధచతురంగసైన్యవికల్పన కల్పసంగతి యపాంగముల నిలిపి
పార్థసారథివై చలపట్టి యాచి, యాచి కురుసేన నళియింపఁ జూచితౌర
చారుతరమందహాస పోలూరివాస, వారితామిత్రతృష్ణ మన్నారుకృష్ణ. ౮౦

(9) శిష్టప్రతిపాలకదశకము.

మును నవమాసము ల్మోచిన దేవకి దేవకీర్ణపదప్రభావ మొంద
నిను దివ్యమూర్తిఁ గాంచిన వసుదేవుని దేవుని నినుఁ జేరు త్రోవ దెలియఁ
జేర్చి పాలిచ్చి పెంచిన యశోదాసతి దాసతీవ్రావాప్తివాన మొలయ
భవదమర్త్యక్రియాప్రాపితానందుని నందుని ముక్తితానకము నెఱుఁగఁ
బూర్వభవపుణ్యపరిపాకభూతిచేతఁ, జేతనప్రాయసుతుఁడవై చేసితౌర
చారుతరమందహాస పోలూరివాస, వారితామిత్రతృష్ణ మన్నారుకృష్ణ. ౮౧
జనకులు వలదన్న వినక సంపదశక్తిఁ బదశక్తిఁ గొందఱు పరువు లిడుచుఁ
దోఁబుట్టు లాఁగినఁ దొలఁగి యావనగతి వనగతిఁ గొందఱు పాడుకొనుచు
విభులు పోకుఁడటన్న విడిచి రాజితమూర్తి జితమూర్తిఁ గొందఱుజతలుగొనుచు
మించి మామల నేమఱించి యాశాంతత శాంతతఁ గొందఱు జాలిగొనుచు
విప్రసతులిట్లు తెచ్చినవిందు మెచ్చి, మెచ్చుచు భుజించి వాంఛితమిచ్చితౌర, చా.
దూరీకృతానిశాతురదుర్జనక్రూరు నక్రూరు బహునిర్మలాత్ముఁ డనుచు
మన్నించి చేరిన మాలికాకారుని గాఁచునీకెన యెట్టి ధీసు లనుచు
నరుగువీథిని నెదురైన వామనగాత్రి మనఁగాఁ ద్రివక్రత మలయఁ జనుచు

మానసస్థితి నుగ్రసేనమహీను నహీనుని గతి నిర్వహింపుఁ డనుచుఁ
బాడమునిశ్రేష్ఠుకకటాక్షమునన శేష, శేషజనులుత్సహింపరక్షించితౌర, చా.
నరకవాసతఁ గ్రాలు సుకృతనూభవులఁ బ్రాభవుల ప్రారబ్ధానుభవము మాన్చి
మాగధపీడిత మధురాజనావలి నావలిద్వారక దీవిఁ జేర్చి
చెడుకాలయవనునిచే ముచికుందుని కుందునిద్దుర మేలుకొలుపఁ జేసి
యూసరవెల్లిమేనూని కూపమునఁ దాపమునందు నృగుని శాపంబు దీర్చి
ప్రోచితివి గాదె నీవంటి పురుషమాళి, మాళిగతపింఛ కల్గునే లీలలందుఁ, జా.
మోహాతిరేకమనోహరాభావత భావతాపాగ్నులపాలు గాక
హితజనాదృతనిత్యకృత్యవిహీనత హీనతమోగుణాపేక్ష లౌదవ
శుద్ధరాజసగతబుద్ధి వియోగత యోగతాపసవృత్తి యుక్తు లౌలయ
మృష్టాన్నమృదుపటాభీష్టవిదూరత దూరతరైశ్వర్యధుని మునుంగ
నరకమాగధులలయించు నిరుపమాన, మానవతులనునృపులనుమనిచితౌర
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. రాగి
కృపణత దత్తదూరీకృతైశ్వర్యుఁడై వర్యుఁడై తగు విప్రవరులలోన
వేదశాస్త్రపురాణ విద్యాప్రసంగుఁడై సంగుఁడై తగుసభాసదులలోన
నప్రార్థితార్థపర్యవసానకాలుఁడై కాలుఁడై తగు సూక్తిఘనులలోన
ధర నహింసాకర్మ ధర్మప్రసిద్ధుఁడై సిద్ధుఁడై తగు బుధశ్రేణిలోన
ననుచు సహపాఠకుఁ గుచేలు నరసి యెన్ని
యెన్నికల మించు సిరు లిచ్చి యేలితౌర
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ.
పతుల మాయాద్యూతగతులనోడించిన డించినమతిఁ బ్రల్లదించు శకుని
చేరి ధమ్మిల్లంబు జితకుశేశయమున శయమున నొడియు దుశ్శాసనుండు
మగ లోడి రిఁక నిష్ఠమగుబలోన్నతివాని నతివా నిరీక్షింపు మనినకర్ణు
నంబరంబు వదల్చు మని పాపయుక్తుల యుక్తులఁ గసరు దుర్యోధనుండు
నట్లుదుష్టచతుష్టయం బడరఁగృష్ణ, కృష్ణయననక్షయపటంబులిచ్చితౌర, చా.
కరుణ ధర్మజు నిజావరజసనాథుఁగా నాథుగా నీవసుంధరకుఁ జేసి
దుర్యోధనాది శత్రులకెల్ల భీముని భీమునిగా నాజిభూమిఁ జేసి
భీష్మాదియోధుల భేదింప విజయుని విజయునిగాఁ బోరువేళఁ జేసి
మార్తుల భంజింప మాద్రికుమారుల మారులఁగాఁ గసి మసఁగఁ జేసి
రేయుఁబవలిట్లుకంటికిఱెప్పగతిని, గతినిజనఁబాండవేయులఁగాచితౌర, చా.

దాసీసుతుం డని తలఁచితివే దాంతు వేదాంతు విదురుని విందు గొనఁగ
నరిపక్షుఁ డంటివే యసువుల నాఁపఁగా నాపగాసుతునికు య్యాలకింపఁ
గుక్షిదుర్గతుఁ డనుకొంటివే చేతనాచేతనాగత పరీక్షిత్తుఁ బ్రోవఁ
గాలంబు నెంచితివే లోకధర్మతాధర్మతాత్పర్యు నుద్ధవుని చెలుప
నిట్టి భక్తపరాధీనవృత్తిచర్య, చర్యమాణసురబ్రహ్మాల్పశక్తు లటర, చా.
తుదముట్టఁడే మహాద్భుతుఁడు లీలాశుకు లాశుకుసూక్తుల ననుసరించి
దరిఁజేరఁడే పురందరనామకీర్తరు విష్ణుచిత్తు నిన్ను వినుతిచేసి
ప్రకృతి వీడ్కొనఁడె నారాయణతీర్థులు తీర్థపాదుని నిన్నుఁ దెలియఁ బలికి
వ్యాజసంసృతి వీడఁడే జయదేవుండు దేవుండ వగునీదుసేవఁ జేసి
భక్తివారంబ యుష్మదుపాస్తిపరులు, పరులు జనులకు వారలఁ బ్రణుతిచేతుఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౯౦

## (10) అవతారదశకము.

అజుఁడు చిన్ముద్రాసమాధివిశిష్టుఁడై శిష్టుఁడై ధ్యానంబు సేయువేళ
సోమకుం డనురాక్షసుండు వేదమ్ములఁ దమ్ములఁదెగడుసూత్రమ్ము లనుచు
మ్రుచ్చిలి ఘోరవార్ధులఁ దిరోహితుఁడైనహితుఁడైనధాతసృష్టిచ్ఛకొఱకుఁ
బ్రబలమీనావతారము నెత్తి లోలకల్లోలకర్దమయుతావాల మరసి
చోరదనుజుని బరిమార్చి శ్రుతిగణంబు, నంబుజపీఠుండున కొసంగి నట్టిదేవ
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౯౧
చెలిమి దేవపలాశనులు మందరాగంబు రాగంబు మించు ధీరతఁ బెకల్చి
కలశవారాశిలో నిలిపి పన్నగపతి నగపతిఁ జుట్టిరా బిగియఁ జుట్టి
విసువక మథియింప నసమాపఘనమైన ఘనమైనకచ్ఛపతనువు నెత్తి
క్రుంగుతద్గిరిమోచి యంగనామూర్తిచే మూర్తిచేతోసుర ల్మను భ్రమింపఁ
జేసియమృతంబుగొనిసుఖస్థితులనమరు, నమరులకుఁ బ్రీతినర్పించినట్టిదేవ, చా.
అవని మ్రుచ్చిలి హిరణ్యాక్షుండు చర్యతాశ్చర్యతారుణ్యదోస్సారుఁ డగుచు
నుదధిలోనఁ జరించుచున్నఁ దత్కృత్యం బకృత్యం బటంచు నాదైత్యవిభుని
లోకభయంకరాలోకనోదారభూదారభూభుజుఁడవై తాఁకి నిలిచి
పోరు పెల్లొనరించి ఘోరసుదర్శన దర్శన ప్రహారణోద్ధతులఁ గూల్చి
పుడమి దక్షిణశృంగాగ్రముననుఁ బెట్టి, బెట్టిదపుసంకటమువాపినట్టిదేవ, చా.
భవదీయచింతనాపరుఁ డంచు నందనునం దనురాగమోహములు వదలి
సర్వగతుం డని చక్రవర్ణించెదు నించెదు సభ నవినీతు లెల్ల

దరిఁ జూపు మని సభా స్తంభంబు నడిచిన నడిచి నభఃక్షమాంతస్థవిభుత
నరసింహమూర్తివై యరుదెంచి క్రమపరాక్రమపరాయణత హిరణ్యకశిపు
నదరి పరిమార్చి కరుణ నయ్యదితిపట్టిఁ,బట్టి ప్రహ్లాదు రక్షించినట్టిదేవ,చా.
అఖిలార్థిజనసంచయాది తేయాగంబు యాగంబు కావ్యసమక్షమునను
గావించుబలినాము దేవారినాథుని నాథునీజన్మబీజాంఘ్రి వైన
నీవు వటుండవై నిలిచి సదస్యులు దస్యులు వినఁ బదత్రయముకొలఁదిఁ
బుడమిని యాచించి భూవిష్ణుపదములఁ బదముల రెండిటఁ బాదమొకటి
శిరమునం దుంచి యతలంబుఁ జేరనదిమి,యదిమివ్రజకిసిరులిచ్చినట్టిదేవ,చా.
జగతి సుదర్శనాంశమున జన్మించిన మించినభుజశక్తి మేటియైన
కార్తవీర్యం డాదిగా మహాభుజుల భూభుజుల భూతవ్రాతములు గలంగఁ
బరశురామాకృతిఁ బరఁగి సంగరములఁ గరముల శిరములఁ జరణసమితి
నిరువదియొకమాఱు నఱకి యంబరమునఁ బరమున కెక్కు సోపానసరణి
నిడి పితృప్రీతి తర్పణ మెత్తి యచల,నచలమతిఁ గశ్యపున కిచ్చినట్టిదేవ,చా.
దశరథాత్మజుఁడవై తపసివాసవనంబు సవనంబుఁ బ్రోచి పాషాణ మబలఁ
గావించి హరువిల్లు ఖండించి జనకుఁడు జనకుఁడై తనరు సీతను వరించి
గురునాజ్ఞ మునివృత్తిఁ దరుణీవియోగివై యోగివైఖరి భానుజాగచరుని
మైత్రి వాలిని ద్రుంచి మారుతిచరితంబు చరితంబుగా విని శరధిగట్టి
యసురులవధించిసతిఁగూడియాశ్రయవని,యవని శ్రీరామమూర్తివైనట్టిదేవ
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౯౭
యదుకులంబునఁ బుట్టి యాభీరమందిర మందిరమందె చౌర్యములఁ దనరి
జారుఁడవై ధేనుసముదయావన కేళి వన కేళి గోపికావస్త్రవితతి
గొనిపూతనాది దుర్జననివారణముల రణముల నరుల దోర్బలము మించి
భక్తులఁ బాలించి బలరామమూర్తిని మూర్తినిమిత్తత మొదలొనర్చి
భీష్మకసుతాదికన్యలఁ బెండ్లియాడి,యాడిపాడుచునీలాద్రి నలరుదేవ,చారు.
తరువరాశ్వత్థప్రదక్షిణై కాంతలఁ గాంతలఁ దొలుదొల్తఁ గౌఁగిలించి
విధివత్సకలితగోవేషివై దానవదానవత్స్వాపామృతంబుఁ ద్రావి
సన్నద్ధరథ మద్రిజామనోహరునకు హరునకు నేర్పగా నాచరించి
యతనితూపున నిల్చి యడరి చూపరులకుఁ బరులకుఁ దల్లడపాటొనర్చి
త్రిపురదైతేయతతిఁ గడతేర్చి యంత, నంతరితబుద్ధరూపుఁడవైనదేవ
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౯౮

శ్రీరస్తు.

# హలన్తపరిచ్ఛేదము.

---

ప్రథమైకవచనతుల్యం సర్వత్ర హలన్త మగుణవత్ప్రభృతి
గుణవద్గణో ద్వితీయైకవచనతుల్యో భవే ద్వికృతౌ. ౧

ఇది రెండుసూత్రములు. అగుణవత్ప్రభృతి=గుణవద్గణవ్యతిరిక్త మైన, హలన్తం=హలన్తశబ్దజాతము, సర్వత=ఈ తెనుఁగున నంతటను, ప్రథమైకవచనతుల్యం=సంస్కృతములోఁ బ్రథమైకవచన మెట్లుండునో యట్లు నిలుచును. ఉదాహరణములు ముందు చెప్పుదుము. వికృతౌ=తెనుఁగునందు, గుణవద్గణః=గుణవత్ప్రభృతి, ద్వితీయైకవచనతుల్యః=సంస్కృతములోని ద్వితీయైకవచనము వంటిది, భవేత్=అవును.

---

ద్విత్వోత్వే సర్వహలాం హ్రస్వా ద్ద్విత్వన్తు దీర్ఘతో బహుళమ్
అగుణవతాం సర్వహలాం సోర్లోపో గుణవతాం డుమూ ప్రాగ్వత్. ౨

ఇది నాలుగుసూత్రములు. హ్రస్వాత్=హ్రస్వముమీఁదనున్నట్టి, సర్వహలాం=సమస్తమైన హలన్తములకును, ద్విత్వోత్వే=దిత్వమును, ఉత్వమును నగును. దీర్ఘతః=దీర్ఘముమీఁద నైనయెడల, ద్విత్వన్తు=ద్విత్వము, బహుళం=బహుళముగా వచ్చును, ఉత్వము రానే వచ్చును. అగుణవతాం=అగుణవత్ప్రభృతులైన, సర్వహలాం=సమస్తమైన హలన్తములకును, సోర్లోపః=ప్రథమైకవచనలోప మగును. గుణవతాం=గుణవద్గణములకు, డుమూ=డు, ము, అనునవి (డుకారముకారములు)-ప్రాగ్వత్=మొదటఁ జెప్పినట్లే వచ్చును. మహత్తులకు, డు, అమహత్తులకు, ము,—హకారాంతపుంలింగమైన అనడుహ్శబ్దము గుణవద్గణములోనిది గనుక, ద్వితీయైకవచనతుల్యమైనయెడల, అనడ్వాహం అని ద్వితీయైకవచనరూపము నిల్చెను. అమహత్తు గనుక, ము, వచ్చిన, అనడ్వాహము. కడమరూపములు, అకారాంతములకువలెనే—అనడ్వాహములు, అనడ్వాహమునందు-ఇత్యాది. ఈలాగే దివ్ శబ్దము, దివము. ఉపానహ్ శబ్దము గుణవద్గణములోనిది గాదు గనుక, ప్రథమైకవచనతుల్యమైన, ఉపానత్ అని యుండెను. తకారము హ్రస్వము గనుక ద్విత్వోత్వములు వచ్చి "ఉపానత్తు" అని యుండెను. యాంతము లేదు. రేఫాంతము పూర్శబ్దము గుణవద్గణము, పురము. ఈ తెనుఁగు లోకవ్యవహారదృశ్యము గనుక గీర్ శబ్దము వ్యవహారము లేదు. అభిధానములవారు యాదవాదులు, అవ్యక్తలింగశబ్ద

ములు నపుంసకలింగశబ్దములుగాఁ జెప్పినారు కనుక, అవ్యక్తలింగ మైన కిం శబ్దము నపుంసకలింగ ప్రథమైకవచనతుల్య మై కిమ్ము అని యుండెను. ప్రశాన్ శబ్దము దీర్ఘపరహల్లు గనుక ద్విత్వము రాదు. ప్రశానుఁడు. మహత్తు గనుక డుజ్ వచ్చెను.

---

ఆత్మన ఇమనన్తానాం డావా*డుస్స్యా త్సదా రాజ్ఞః
సాన్తా దపయః ప్రభృతేః స్లోపో న్యేషాంచ వాలు గన్తస్య. 3

ఇది నాలుగుసూత్రములు. ఆత్మనః=ఆత్మన్శబ్దమునకును, ఇమనన్తానాం=ఇమనిచ్ ప్రత్యయాంతములకును, డావా=డా యను వర్ణకము వికల్పమున వచ్చును. అన్యవన్యాయమున డాలోని డకారము లోప మై మిగిలిన ఆకారము టిలోపము చేసి నిల్చును. హ్రస్వము వచ్చిన, ఆత్మ యనురూప మాయెను. వికల్పము గనుక డా లేనప్పుడు, ఆత్మము. మహత్తుగా వివక్షించి తేని, ఆత్ముఁడు. ఇమనంతములు- మహిమము, మహిమ, గరిమము, గరిమ, ఇత్యాది. రాజ్ఞః=రాజన్ శబ్దమునకు, సదా=నిత్యముగాను, డుస్స్యాత్ =డువర్ణకము వచ్చును. ఇది డా వలెనే వచ్చెనేని రాజు. కకుప్శబ్దము కకుప్పు. అగ్నిమత్ శబ్దము బహుళగ్రహణమున ద్విత్వము లేక అగ్నిమథుఁ డాయెను. వాక్ శబ్దమునకు వాకు, బహుళోక్తివలన వాక్కు-అని యు ను గలదు. త్వక్ త్వక్కు. భవచ్ఛబ్దము లేదు. ధీమచ్ఛబ్దము గుణవర్ణనము- ధీమంతుఁడు, మతిమంతుఁడు, హనూమద్భగవచ్ఛబ్దములు కొందఱమతమున గుణవర్ణనములు గావు, హనుమానుఁడు, భగవానుఁడు. హనుమంతుఁడు, భగవంతుఁడు-అనియుం గలదు. అప్శబ్దమునకు, అప్పులు. దిక్ శబ్దమునకు దిక్కు. విద్వచ్ఛబ్దమునకు విద్వాంసుఁడు. అపయః ప్రభృతేః=పయః ప్రభృతివ్యతిరిక్తమైన, సాన్తాత్ =సకారాంత శబ్దముమీఁద, స్లోపః=సకారలోపము వికల్పమున నగును- తేజము, యశము, మనము, తేజస్సు, యశస్సు, మనస్సు-ఇత్యాది. పయః ప్రభృతికి, సకారలోపము లేదు. పయస్సు వయస్సు, అయస్సు, సరస్సు-ఇత్యాది. అన్యేషాంచ= మఱికొన్ని హలంతములకును, అన్తస్య=అంత్యహల్లునకు, వా లుక్=వికల్పమున లోపము వచ్చును. జగము, జగత్తు. చకారప్రయోగమువలనఁ గొన్నింటి కంత్యాచ్చులకు వర్ణాంతరము వచ్చి యంత్యహల్లోప మవును. పథము.

---

* డుర్భవతి సర్వదారాజ్ఞః.

ప్రాకృతభవసంస్కృతభవసంస్కృతవత్ప్రాకృతభవవికృతిభవాః
వ్యతిరిక్తా భూయాంసో వ్యతిరిక్తా స్సంప్రదాయతో వేద్యాః. ౪
ఈయార్యావృత్తము సంప్రదాయవేద్యము.

---

దేశ్యా దస్మద్యుష్మచ్ఛబ్దా త్సుజసో ర్నుమూ వురూ చస్తః
న్నుమ్మూ హ్రస్వాశ్చాదే రమిశశి చాన్యతరలుక్చ యుక్తస్య. ౫

ఇది రెండుసూత్రములు. దేశ్యాత్ = తెలుఁగులైన, అస్మ ద్యుష్మ చ్ఛబ్దాత్ = అస్మత్ యుష్మత్ శబ్దములమీఁద, సుజసోః = ప్రథమైకవచనబహువచనములకు, యథాక్రమముగా, నుమూ = ను, ము, అనునాదేశములును, వురూ = వు, రు, అనునాదేశములును, స్తః = అగును. యుష్మ దస్మచ్ఛబ్దములకుఁ దత్సమపుఁదెలుఁగు లేదు గనుక "దేశ్యాత్" అని దేశ్యతెలుఁగులే చెప్పుచున్నాఁడు. నా యనుమాట యస్మచ్ఛబ్దము, నీ యనుమాట యుష్మచ్ఛబ్దము, కనుక, అస్మచ్ఛబ్ద ప్రథమైకవచనమునకు ను వచ్చిన, "ప్రథమాయా మే దస్మదః" అను నుత్తరసూత్రప్రాప్తిని 'నేను' అనురూపమాయెను. బహువచనమందు ము వచ్చిన, నుత్తరసూత్రమున మకారము నేత్వమును వచ్చి "మేము". యుష్మచ్ఛబ్దమునకు వు వచ్చిన "నీవు". బహువచనమందు రు వచ్చిన నుత్తరసూత్రమున మకారము వచ్చి, "మీరు". అమి శశి చ = ద్వితీయైకవచనబహువచనములయందు, న్ను, మ్ము = న్ను, మ్ము, అను నాదేశములును, ఆదేః = మొదటియక్షరమునకు, హ్రస్వశ్చ = హ్రస్వమును వచ్చును. యుక్తస్య = సంయుక్తములైన, న్నుమ్ములకు, అన్యతరలుక్చ = ఒకహల్లులోపమును నగును. నిన్ను, నిను; మిమ్ము, మిము; నన్ను, నను; మమ్ము, మము.

---

కిర్నజమః ప్రథమాయా మే దస్మద ఏతయో ర్బహుత్వే మః
హ్రస్వే టాదా నమవాక్ ద్వయవ ద్వచనద్వయేన్యయో రాత్మా. ౬

ఇది నాలుగు సూత్రములు. జమః = షష్ఠికి- "జసః కిశ్చ" అని వచ్చెడు కి యాదేశము లేదు. యుష్మచ్ఛబ్దము, ఇకారాంతము గనుక నీ యనుదానికే యీవిధి. (నీయనుశబ్దమునకే యీనిర్ణయము) ప్రథమాయాం = ప్రథమయందు, అస్మదః = అస్మచ్ఛబ్దమునకు, ఏత్ = ఏత్వము వచ్చును. ఏతయోః = ఈరెండుశబ్దములకును, బహుత్వే = బహువచనములయందు. మః = మకార మగును. నీచేత,

మీ చేత; నీకొఱకు, మీకొఱకు; నీవలన, మీవలన; నీకు, మీకు; నీయందు, మీయందు; నాచేత, మాచేత; నాకు, మాకు- ఇత్యాది. ఆత్మా=ఆత్మన్ శబ్దము, టాదౌ=తృతీయాదివిభక్తులయందు, హ్రస్వే=హ్రస్వ మగుచుండఁగా, నమవాన్=న,మ, యను నాగమములు గలది యౌను. వచనద్వయమునందును వరుసగా ననుట. అన్యయోః=ప్రథమాద్వితీయలయొక్క, వచనద్వయే=ఏకవచన బహువచనములయందు, ద్వయవత్=అస్మద్యుష్మచ్ఛబ్దములు రెంటి వంటిది యు వరుసగా నగును. ఏకవచనమం దస్మచ్ఛబ్దమువంటిదియు, బహువచనమందు యుష్మచ్ఛబ్దము వంటిదియు నగు ననుట. అస్మచ్ఛబ్దప్రథమాద్వితీయైకవచనములకు నున్నులును యుష్మచ్ఛబ్దప్రథమాద్వితీయాబహువచనములకు రుమ్ములును వచ్చును. నుమ్ములయం దాదిహ్రస్వము వచ్చును. తా-ఆత్మన్శబ్దము. తాను, తారు, తన్ను, తమ్ము. తృతీయాదులయందు, హ్రస్వమును నమాగమములును వచ్చిన-తనచేత, తమచేత; తనకు, తమకు-ఇత్యాది.

---

భూయ ఉభయార్థవాచీ యః కశ్చి ద్భవతి నిత్యబహువచనః
తస్య జసో ము శసో లః ప్రాగ్వ త్సర్వం భిసాదికే న్యత్ర. ౭

ఇది యేకసూత్రము. భూయః=ఈయుష్మదస్మచ్ఛబ్దములు గాక- మఱి యొకటి, ఉభయార్థవాచీ=ఆరెంటియర్థమును జెప్పెడి, నిత్యబహువచనః=నిత్యబహువచనమైనది, యః=ఏదైననేమి, కశ్చిత్=ఒకటి, భవతి=కలదు. తస్య=దానియొక్క, జసః=ప్రథమాబహువచనమునకు, ము=ము, అనునాదేశమును, శసః=ద్వితీయాబహువచనమునకు, లః=ల, అనునాదేశమును వచ్చును. భిసాదికే=తృతీయాబహువచనము మొదలయిన, అన్యత్ర=కడమవానియందు, సర్వం=సమస్తమును, ప్రాగ్వత్=యుష్మదస్మచ్ఛబ్దములకు వలెనే యగును. "మన" యనునది యుభయార్థవాచి. దానికి "ము" ఆదులు వచ్చిన, మనము, మనల, మనచేత-ఇత్యాది.

---

కవిభల్లటైః క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే హ్యేషు
ప్రథమైకవచనమాత్రే వికృతౌ నాన్తాదయో౽పి కథ్యన్తే. ౮

ఇది యేకసూత్రము. కవిభల్లటైః=కవిభల్లటులచేత (కవిభల్లటు లనఁగాఁ బురాతనకవులు, వా రొక లక్షణకర్తలు) క్రియాణాం=ధాతువులకు ను, నామ్నాం చ=శబ్దములకు ను, ఉల్లోపః=ఉకారలోపము, ఇష్యతే=ఇచ్ఛయింపఁ

బడుఁగదా (చెప్పినా రనుట) చూతుర్, చూతురు, ఇత్యాది క్రియలయందు, రేఫలమీఁది యుత్వములకును, కన్ను, మన్ను, మిన్ను, మున్ను, ఇత్యాదిశబ్దములయం దుత్వములకును లోపము. ఏషు=ఈలోప ప్రదేశములయందు, వికృతౌ=అచ్చతెనుఁగున, నాన్తాదయోపి=నకారాంతాదిశబ్దములు ను, ప్రథమైకవచనమాత్రే=ప్రథమైకవచనమందే, కథ్యన్తే=చెప్పఁబడును. "కన్నుదెఱచి" యన్నచోట భల్లటునిమతమున, ఉకారలోపమైన నకారాంతమై యుండును. కన్దెఱచి, చన్గుడిచి—రాంతములు, పేర్వాడి, గోర్గోపి. క్రియలకుఁ గ్రియాపరిచ్ఛేదములో స్పష్టము. మెత్తుర్ఘనులు, చూడర్జనులు—ఇత్యాది నాన్తాదయః అని యాదిశబ్దముచేత లాంతములును; కల్ద్రావి, విల్బూని. ప్రథమైకవచనము తప్పిన, ఉకారాంతాది-కన్నులు, కంటిచేత.

---

ఇద మద సేత ద్యత్త చ్ఛబ్దా శ్శబ్దాన్తరాన్వయే బహుళమ్
హ్రస్వం ప్రపద్య దీర్ఘా ద్ద్విత్వ ముపర్యక్షరస్య జనయన్తి. ౯

ఇది యేకసూత్రము. శబ్దాన్తరాన్వయే సతి=మఱియొకశబ్దముతో నన్వయము కలిగి యుండఁగాను, ఇదమ్, అదస్, ఏతద్, యద్, తద్, శబ్దాః=ఈశబ్దముల, దీర్ఘాః=దీర్ఘములు, హ్రస్వం ప్రపద్య=హ్రస్వమును బొంది, ఉపర్యక్షరస్య=ఆశబ్దముయొక్క మొదటి యక్షరమునకు, బహుళమ్=బహుళముగాను, ద్విత్వమ్=ద్విత్వమును, జనయన్తి=పుట్టించును. ఇదం శబ్దము=ఈదేశము, ఇద్దేశము; తద్ శబ్దము-ఆకాలము, అక్కాలము; అదస్, ఏతద్ శబ్దములకు నివియే రూపములు. యచ్ఛబ్దము-ఏదేశము, ఎద్దేశము-బహుళోక్తివలన, ఆరాజు, ఈసేన, యనుచోటులను రాదు. శబ్దాంతరము లేకున్నను- ఏది, ఎద్ది-యనుచోట వచ్చును. ఆ-అజాదిశబ్దముతో నన్వయించినప్పు డాయచ్చును లఘుయకారము చేసికొని దానికి ద్విత్వము చేసికొనునది. అయ్యార్యుఁడు, ఇయ్యుత్తముఁడు.

---

ది స్సాన్య త్సమ్బన్ధార్థే సర్వస్మా ద్యుష్మదస్మదా త్మభ్యః
ద్వితి *వర్ణకో౽ఇఉ స్త్రీవిషయా స్త్వర్థే తనశ్చ వికృతౌ స్యాత్. ౧౦

ఇది నాలుగుసూత్రములు. సర్వస్మాత్=సకలనామములమీఁదను, సమ్బన్ధార్థే=సంబంధార్థమందు, దిః=దివర్ణకము, స్యాత్=అగును. వర్ణక మనంగాఁ బ్రత్యయము. రాజుది, పులిది, బంటుది, మేఁకది- ఇత్యాది. యుష్మదస్మదాత్మభ్యః=ఈమూఁటిమీఁదను, ద్వితివర్ణకః=దు అనువర్ణక మగును. నాదుసొమ్ము.

---

* వర్ణకోయవ స్త్రీవిషయాః- పా.

నీదు లేఁగ, తనదుక్తీర్తి. అ, ఇ, ఉ=ఈమూఁడును, స్త్రీవిషయాః=స్త్రీనామములమీఁద వచ్చు వర్ణకములు- గౌర, గౌరి, గౌరు. స్త్రీవిషయములయందె, తెలుఁగు స్త్రీలింగములమీఁద వచ్చు నని యు ననవచ్చును. ముంత, పడి, తూము-స్త్రీసమములు చేసికొని సులోపముఁ దెచ్చుకొనునది. సర్వత్ర యిష్టే-వికృతౌ=తెనుఁగునందు, త్వార్థే=త్వప్రత్యయార్థమునందు,తనః=తనవర్ణకము, స్యాత్=అగును దొరతనము, దొడ్డతనము.

---

నామ్నః కవర్ణక స్స్యా త్స్వార్థే స్యా దుత్వ మపి పరే తస్మిన్
చు రితి క్రియాపదానాం సర్వేషాం వర్తమానకాలే స్యాత్. ౧౧

ఇవి రెండుసూత్రములు. నామ్నః=నామమునకు, స్వార్థే=స్వార్థమందు, కవర్ణకః=కవర్ణకము, స్యాత్=అగును. తస్మిన్ పరే=అది పరమై యుండిన, ఉత్వ మపి స్యాత్=పూర్వాక్షరమున కుకారమును వచ్చును. పొలఁతి, పొలఁతుక; గొంతు, గొంతుక; నిప్పు, నిప్పుక; మెలఁత, మెలఁతుక-ఇత్యాది. సర్వేషాం=సర్వమైన,క్రియాపదానాం=క్రియలకు, వర్తమానకాలే=వర్తమానార్థకమందు, చురితి=చు అనువర్ణకము, స్యాత్=అగును, ఘటించుచున్నాఁడు, గెలుచుచున్నాఁడు. ఇత్యాది.

---

ప్రతిషేధవాచినాం నిః భూతార్థానాంతు నః క్రియాణాం స్యాత్
కర్త్రాదేః కర్తృత్వం ప్రథమాచ నవర్ణక శ్చ తద్వ త్స్యాత్. ౧౨

ఇది మూఁడుసూత్రములు. ప్రతిషేధవాచినాం=ప్రతిషేధమును జెప్పుచున్న, క్రియాణాం=క్రియలకు, నిః=నివర్ణకము- ఘటింపనివాఁడు, చూడనివాఁడు; భూతార్థానాంతు=భూతార్థములకు, నః=నవర్ణకము, స్యాత్=అగును. కర్త్రాదేః=కర్త్రర్థము మొదలైనవానికి, కర్తృత్వం ప్రథమాచ=కర్త్రర్థకమును ప్రథమయు-నవర్ణకశ్చ=నవర్ణకమును వచ్చును. నీవు నుతించిన రాజు. ఇది కర్త్రర్థకము. నీచేతఁ బొగడఁబడిన రాజనుట. నీచేతనను తృతీయకుఁ బ్రథమవచ్చును. నుతింపఁబడిన యను కర్త్రర్థమునకుఁ గర్తృత్వము వచ్చెను. కర్త్రాదేః అను నాదిశబ్దముచేత, అధికరణార్థములయందు నిట్టిలాగుననే వచ్చును. నే భుజించినచోటు, నీవు గెల్చినవాఁడు. ఇత్యాద్యర్థభేదములు తెలిసికొనునది.

---

షష్ఠీ భవే ద్వితీయాతుల్యా తత్పురష సంస్థితా నామ్నామ్
ఇ దుషోత్తమోత్తమానాం బహువచన ఉషోత్తమేత ఉద్భవతి. ౧౩

(గ్రంథపాతము రెండుప్రతులలోను)... ఇదుపోత్తమోత్తమములు—బలుములు, కలుములు, చెలుములు, ఆయెను. రెండవ యుకారము, ఉద్బహుత్వే యని వచ్చినది. ఇట్టిలాగుననే వెలుములు, మెలుములు మొదలైనవి. ఇది ప్రాయికలక్షణము. అటుగనుక, ఇరులు, విరులు- ఇత్యాదిస్థలములందు లేదు. ప్రాయిక నిత్యలక్షణముల ప్రకారము లిట్టిలాగుననే తెలియునది.

---

అస్మద్యుష్మద్వాచ్యా దేకత్వ ఇతో నివీ పరేషాంతు
ధర్మోత్తమమధ్యమవ ద్బహుషు న మధ్యమవ దుతోచ్చ సర్వేషు. ౧౪

ఇది నాలుగుసూత్రములు. అస్మద్యుష్మద్వాచ్యాత్=అస్మద్యుష్మచ్ఛబ్దములచేత వాచ్యమయిన, ఇతః=ఇకారాంతమునకు, ఏకత్వే=ఏకత్వమందు, నివీ=ని, వి, యనువర్ణకము లవును, నేను గవిని, నీవు పతివి. కవిశబ్ద మస్మద్వాచ్యము, పతిశబ్దము యుష్మద్వాచ్యము. పరేషాంతు=ఇకారాంత వ్యతిరిక్తములకు, ధర్మోత్తమమధ్యమవత్=క్రియలకు ధర్మ మను నర్థమందు వచ్చెడి యుత్తమపురుష మధ్యమపురుషల కేదో యది వచ్చును. ను వు అనువర్ణకము లవు ననుట. నేను భక్తుఁడను, నీవు దేవుఁడవు. బహుషు=బహువచనములయందు, మధ్యమవత్=మధ్యమపురుషవంటివి, న=కావు. ప్రథమోత్తమపురుషలవంటివౌను-ము రు అనువర్ణకము లౌ ననుట. మేము భక్తులము, మీరు దేవతలరు. బహుషు అను బహువచన ప్రయోగమువలన, ఇకారాంతములకు ను బహువచనమందు ము, రు, వర్ణకములు వచ్చును. మేము కవులము, మీరు స్వాములరు. సర్వేషు=ఈచెప్పిన ను, ము, వు, రు, అను నన్నియుఁ బరమై యుండిన, ఉతః=అంత్యమైన ఉకారమునకు, అచ్చ=అకారమును వచ్చును. భక్తుఁడు అను నంత్యోకారమునకు నుమువురులు పరమైనప్పుడు, అకారము వచ్చిన- భక్తుఁడను-భక్తుఁడవు, ఇట్టిలాగే భక్తులము, భక్తులరు-అని యుండును. కవిని అనుచోట ఉకారము లేదు గనుక, అకారము లేదు. కవులము అనుచోట, కవులు అను నుకారమునకు అత్వము వచ్చును. సూత్రములో నస్మచ్ఛబ్దము పూర్వనిర్దిష్ట మైనను గాని వ్యవహారప్రధానము యుష్మచ్ఛబ్దము గనుక ప్రథమపురుషవంటి దాయెను. సర్వేషు అన్నాఁడు గనుక క్రియలయొక్క ఉకారమునకును, అకారము వచ్చును. పొగడుచున్నాఁడను, ప్రోచుచున్నాఁడవు. ఇత్యాది-జవరాలవు, ముద్దరాల వనుచోటను గూడ నిట్టిలాగే అకారము తెలియునది.

---

సర్వవిభక్తి స్సంస్కృతతుల్యా న్యస్యాః క్వచి ద్భవే చ్చాన్యా
ఏకత్వం భేదకగతబహువచనానాంచ దృశ్యతే వికృతౌ. ౧౫

ఇది మూఁడు సూత్రములు. సర్వవిభక్తిః=ప్రథమాది విభక్తు లన్నియు, సంస్కృతతుల్యా=సంస్కృతమం దేయేస్థానమున నేయేవిభక్తి వచ్చునో యటు వలెనే యిందును వచ్చును. పొడవు, కొంచెము, కృష్ణుండు, తూము, ఇత్యాది ప్రాతిపదికార్థములయందుఁ బ్రథమ—హరిఁదలఁచెద, అంబఁగొలిచెద, నిత్యాదిస్థలముల ద్వితీయ—శూలముచేతఁ బొడిచె, సురలచేత నుతింపఁబడియె నిత్యాదికర్తృకరణములఁదృతీయ—ద్విజులకొఱకు దక్షిణ, కవులకొఱకుపాయన మిత్యాది సంప్రదానములఁ జతుర్థి—గిరివలన వెడలెను, కరివలన నెలసెను, ఇత్యాద్యపాదానమునఁబంచమి—దొరకు హితుఁడు, నూటికమ్మెను, ఇత్యాది సంబంధముల షష్ఠి—కంచియం దుండును, కవితయందు నేర్పరి, ఇత్యాద్యధికరణముల సప్తమి—అంబననుఁ బ్రోవవే, అవ్వసిరు లీయవే, ఇత్యాదులసంబుద్ధి. ఇట్లు విభక్తులు తెలియునది. అన్యస్యాః=ఒకవిభక్తి, క్వచిత్=ఒకానొకచోట, అన్యాచ=మఱియొక విభక్తియును, భవేత్=అగును, విప్రులకు దానమిచ్చెను-చతుర్థీస్థలమున షష్ఠి—శిరమున గురుపాదుకలు వహించె- తృతీయాస్థలమున సప్తమి—రాముఁడరణ్యమేగె-అరణ్యమున కనుదానికరణ్యము. షష్ఠీస్థలమునఁ బ్రథమ—సుఖమేగి, కాశినుందురు, తృతీయాస్థలమునఁ బ్రథమ. ఇత్యాదులు ప్రయోగవశమునఁ దెలియునది. వికృతౌ=తెనుఁగునందు, భేదకగతబహువచనానాం=విశేషణములయొక్క బహువచనములకు, ఏకత్వంచ=ఏకవచనమును, దృశ్యతే=కనఁబడును. ఇంపైనప్రియురాండ్రు,ఒప్పైనసిరులు-సొంపైనవిద్యలు.

---

—। ఇతః పరస్సమాసనిర్ణయః ।—

ద్విగుకర్మధారయౌ తత్పురుషద్వన్ద్వౌ బహువ్రీహిః
అన్యే చ కేచి దుపమానోత్తరపదలోపరూపకాఖ్యాద్యాః ౧౬
పరిదృశ్యా ఇహ కార్యా ఔపవిభక్తికవ దన్త విధయశ్చ
లోపశ్చ విభక్త్యాదే శ్శబ్దేషుస్యా త్సమాసకాఙ్గేషు. ౧౭

ఇది యార్యాయుగ్మము. ద్విగుకర్మధారయములు, తత్పురుషద్వంద్వములు, బహువ్రీహి, ఉపమానము, ఉత్తరపదలోపము, రూపకము మొదలైనవి. అన్యేచ=తక్కినవి, కేచిత్=మఱికొన్నిసమాసములును, ఇహ=తెనుఁగునందు,

# విషయసూచిక.

# పరిషత్ప్రయోజనములు.



తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, అవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసఁగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ బొందుపఱుపఁబడు చున్నవి:—

i తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వంకష మగునిఘంటు వొకటి రచించి ప్రచురించుట;

ii తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణము రచించి ప్రచురించుట;

iii ఆధునికశాస్త్రగ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట;

iv ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యములైన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగు దేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుట;

v సర్వవిషయములనుగుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట;

vi ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారముచేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట;

vii తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట;

viii తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకుఁగాను వార్షికసభల నేర్పాటుచేయుట;

ix తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్రికలను నొసంగుట;

x ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట-ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును; వ్రాఁతప్రతులుగూడ నుండవలయును;

xi తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపచరించు నన్ని కార్యములను జేయుట.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

| | | |
|---|---|---|
| సంపుటము ౨౦. | ప్రజోత్పత్తినామసంవత్సరము<br>మాఘఫాల్గునమాసములు. | సంచిక ౬. |


## వామనునిమతమున రీతికే ప్రాధాన్యము


—కనకదండి గోపాలకృష్ణశాస్త్రిగారు-విజయనగరము—


ఇరువదవసంపుటము నాల్గవసంచికలో శ్రీయుత బులుసు వేంకటరమణయ్యగారు "దండివామనులమతము" అను శీర్షికతో నొకవ్యాసమును బ్రకటించిరి. అందు దండి రీతికిఁ బ్రాధాన్య మొసఁగినను గుణములకే ప్రాధాన్య మిచ్చుచున్నాఁ డనియు, వామనుఁడు రీతికిఁ బ్రాధాన్యమిచ్చినను నాతఁడు గుణములకిచ్చినస్థానమును బట్టియు జాతిజాతిమత్తులకభేద మెట్లో యట్లే గుణములకు రీతి యభేద ముండుటచేతను గుణములకే ప్రాధాన్య మిచ్చుచున్నాఁ డనియుఁ, గనుక నిద్దఱమతమునఁగూడ గుణములకే ప్రాధాన్య మనియు" నుడివియున్నారు.

దండివామనులమత మొక్కటియే యనియు, దండిని వామనుఁ డనుసరించె ననియు వాస్తవమైనవిషయము లని ధ్రువముగఁ జెప్పఁగలను. కాని దండి గుణములకే ప్రాధాన్య మిచ్చుచున్నాఁ డనియు, వామనుఁడు రీతికిఁ బ్రాధాన్య మిచ్చినను గుణములకుఁ బ్రాధాన్య మిచ్చినట్లె యనియుఁ, గనుక, నిద్దఱమతమున గుణములకే ప్రాధాన్యము, అనువిషయ మంగీకరించుట కశక్యముగ నున్నది. కనుక, నీక్రింది దండివామనులమత మొక్కటియే యనియు, నిద్దఱుఁగూడ రీతికే ప్రాధాన్య మొసఁగి రనియు గుణములకు నలంకారాదులకంటెఁ బ్రాధాన్య మొసఁగి రనియు నిరూపించుచున్నాఁడను.

దండి తనకావ్యాదర్శమునఁ గావ్యస్వరూపనిరూపణమునఁ గొంద ఱలంకారములకుఁ బ్రాధాన్య మిచ్చి రనియుఁ దాను రీతికే ప్రాధాన్య మిచ్చుచున్నా ననియు నీక్రింది శ్లోకమున స్పష్టపఱచినాఁడు:—

తైశ్శరీరం చ కావ్యానా మలంకారాశ్చ దర్శితాః
శరీరం తావ దిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావలీ.

మఱియు వైదర్భగౌడీయరీతులను రెంటి నుపన్యసించుచు వైదర్భరీతి యందు దశగుణములు సమగ్రముగ నుండునుగాన దీనికి రెంటిలోను నగ్రస్థాన మిచ్చినాఁడు చూడుఁడు:-

అస్త్యనేకో గిరాం మార్గః సూక్ష్మభేదః పరస్పరమ్
తత్ర వైదర్భగౌడీయౌ వర్ణ్యేతే ప్రస్ఫుటాంతరా -1-40.
ఇతి వైదర్భమార్గస్య ప్రాణా దశగుణాః స్మృతాః
ఏషాం విపర్యయః ప్రాయో దృశ్యతే గౌడవర్త్మని-1-42.

ఇచ్చట వైదర్భరీతికి గౌడీయరీతి కన్నఁ బ్రాధాన్యము వచ్చుటకుఁ బది గుణములుకూడ దానియం దుండుటయే కారణము కనుక దండి గుణములకే ప్రాధాన్య మిచ్చిన ట్లని సూచించిరి. కాని దండియాశయ మది గాదు. గుణములనుబట్టి ప్రాధాన్యము వచ్చినను గుణములకుఁ బ్రాధాన్య మనుటకు వీలులేదు, రీతికిఁ బ్రాధాన్య మిచ్చియున్నాఁడు కనుక నింక నలంకారాదులకన్న గుణములకు నగ్రస్థాన మీయఁబడిన దని యాశయము.

తదేత త్కావ్యసర్వస్వం సమాధిర్నామ యోగుణః
కవిసార్థః సమగ్రోపి తమేన మనుగచ్ఛతి.

ఈశ్లోకమున సమాధిగుణము కావ్యసర్వస్వ మని చెప్పినాఁడు గావున సమాధ్యాదిగుణములకుఁ బ్రాధాన్య మిచ్చె నని యనవచ్చు ననిరి. ఇచ్చటఁ గూడ దండి యిచ్చిన ప్రాధాన్య మలంకారాదులకంటెనే గాని రీతులకంటెఁ గా దని తెలియవలయును. మఱియు గుణములలో నెల్ల సమాధిగుణము ప్రధాన మనియు నాతనియాశయము కనుక విచారించి చూచినచో దండిమతమున రీతికే ప్రాధాన్య మనియుఁ దరువాత నలంకారాదుల కన్న గుణములకుఁ బ్రాధాన్య మనియుఁ దోఁచుచున్నది.

రీతి రాత్మా కావ్యస్య 1-1-6. అని వామనుఁడు గూడ రీతికే ప్రాధాన్య మిచ్చుచున్నట్లు చాటుచున్నాఁడు.

భరతుఁడు మొదలగువారు పదిగుణములనే చెప్పుచుండ నీతఁ డిరువది గుణము లని పెంచిచెప్పుటచే వానికిఁబ్రాధాన్యమిచ్చిన ట్లగు నన్న దనిరి. అట్లైనచో నలంకారములకుఁ బ్రాధాన్యము నిచ్చినభామహునికన్న నెన్నో యలంకారము లను బెంచి వ్రాసినవా రలంకారములకుఁ బ్రాధాన్య మిచ్చినవారు కావలసి వత్తురు కాన నది యొకయుక్తిగాఁ దోఁపదు.

కావ్యశోభాయాః కర్తారో ధర్మాగుణాః-3-1-1.

తదతిశయహేతవ స్త్వలంకారాః-3-1-2.

యువతే రివ రూప మంగకావ్యమ్ స్వదతే శుద్ధగుణం తదప్యతీవ ।

విహితప్రణయం నిరంతరాభిః సదలంకారవికల్పకల్పనాభిః॥

యదిభవతి వపుశ్చ్యుతం గుణేభ్యో వపురివ యౌవనవంధ్యమంగనాయాః

అపిజనదయితాని దుర్భగత్వం నియత మలంకరణాని సంశ్రయన్తే॥

పైస్థలములలోఁ జెప్పిన గుణప్రాధాన్య మలంకారాదులకంటె ననియే స్పష్టముగఁ దెలియుచున్నది. అంతియే కాని రీతులకన్నఁ గాదని యీక్రింది సూత్రములవలననే తెలియుచున్నది స్పష్టముగ—

రీతి రాత్మా కావ్యస్య **1-1-6.** విశిష్టా పదరచనా రీతిః **1-1-7.** విశేషో గుణాత్మా **1-1-8.**

మఱియు జాతిజాతిమత్తుల కభేద మటుల రీతులకు గుణములకు నభేద మని కొంద ఱనిరి గాన రీతికిఁ బ్రాధాన్య మిచ్చినవామనుని మతమునఁ బైన్యా యముచే గుణములకుఁ బ్రాధాన్య మిచ్చినట్లే యని యభిప్రాయమును సూచించిరి. కాని జాతిజాతిమత్తులకు నభేదము నెవరిమతమునను బ్రసిద్ధముగఁ గనఁబడదు, గాన, శాస్త్రవిరుద్ధ మని చెప్పుటకు సందేహము లేదు. ఒకవేళ నభేద మున్నదని యొప్పుకొనినను బ్రస్తుతవిషయమున జాతిజాతిమద్భావము నుదాహరణముగ స్వీకరించుటకు వీలులేదు. ఏల యన రెండిటికి సాదృశ్యము లేకపోవుటచేతనే, అవయవావయవు లగుగుణములయొక్క-యురీతులయొక్క-యుఁజర్చలో నవయవావయవులు కాని జాతిజాతిమత్తల నుదాహరణముగ స్వీకరించుట యుక్తముగాదు. అవయవావయవులనే యుదాహరణముగ స్వీకరింపవలయును గనుక నీయుదాహరణమే యిచ్చటఁ బనికిరాదు. కావున వామనునిమతమున రీతికే ప్రాధాన్యము. గుణములకు నలంకారాదులకన్నఁ బ్రాధాన్యము, అంతియె కాని రీతులకన్నమాత్రముగాదు.

ఏతావతా ప్రబంధేనా, దండివామనులమతములలో రీతులకే ప్రాధాన్య మనియు గుణములకు నలంకారాద్యపేక్షయాను ప్రాధాన్య మనియుఁ దేలినది. రీతులకన్నఁ బ్రాధాన్య మెచ్చట నీయఁబడలేదు.

మఱియు నాలంకారికు లనేకులు రీతులకు గుణములకు భేద మున్నట్లు కంఠతః చెప్పుచున్నారు. వాగ్భటాలంకారమున, వాగ్భటుఁడు:—

సాధుశబ్దార్థసంబంధం గుణాలంకారభూషితమ్ ।
స్ఫుటరీతి రసోపేతం కావ్యం కుర్వీత కీర్తయే॥ అనియు,

చంద్రాలోకమున జయదేవుఁడు:—
నిర్దోషా లక్షణవతీ సరీతి ర్గుణభూషితా ।
సాలంకారరసానేకవృత్తి ర్వా క్కావ్యనామభాక్॥ అనియు,

ప్రతాపరుద్రీయమున విద్యానాథుఁడు:—
శ్లేషాదయో గుణా స్తత్ర శౌర్యాదయ ఇవస్థితాః।
ఆత్మోత్కర్షావహా స్తత్ర స్వభావా ఇవ రీతయః॥

అనియు గుణములకు రీతులకు భేద మున్నట్లు చెప్పుచున్నారు.

మఱియు, కావ్య ప్రకాశమున, అష్టమోల్లాసమున, గుణ ప్రకరణమందలి యీక్రిందిపంక్తులను జూచిన స్పష్టముగ రెండిటికి భేద మున్నట్లు గ్రంథకర్త యంగీకరించుచున్నాఁడని తేటపడఁగలదు.

"యదప్యుక్తం కావ్యశోభాయాః కర్తారో ధర్మా గుణాః తదతిశయహేతవ స్త్వలంకారాః, ఇతి తదపి నయుక్తం యతః కింసమస్తై ర్గుణైః కావ్యవ్యవహారః ఉత కతిపయైః యది సమస్తైః తత్కథ మసమస్తగుణా గౌడీపాంచాలీచ రీతిః కావ్య స్యాత్మా".

పైపంక్తులకు వ్యాఖ్యానము చేయుచు వ్యాఖ్యాత * యిట్లు వ్రాయుచున్నాఁడు. "వామనేన హి రీతి రాత్మా కావ్యస్య సాచ పదసంఘటనాత్మికా త్రిధా వైదర్భీగౌడీ పాంచాలీచ సర్వగుణవ్యంజకవర్ణవతీ వైదర్భీ ప్రసాదౌజోవ్యంజకవర్ణవతీ గౌడీ మాధుర్యప్రసాదవదక్షరయుతా పాంచాలీ రీతిధర్మా గుణాః శబ్దార్థోభయరూపం కావ్యం శోభయంతి".

కనుక భేదము స్పష్టమే రెండిటికిని.

* భట్టవామనాచార్యుఁడు. బాలబోధినిటీక 571 పుట, పూనాప్రతి.

సముద్రబంధుఁడు వ్రాసినమాట నేను ద్రోసిపుచ్చలేను గాని చాలమం దికి విరుద్ధముగ నున్న దని మాత్రము చెప్పఁగలను.

జాతిజాతిమత్తుల రీతిని గుణరీతుల కభేద మని, యానందవర్ధనుని యభిప్రా యముగా, నభినవగుప్తులు నిరూపించి రని వ్రాసియున్నారు. కాని యెచ్చటనో మాత్రము దెల్పకపోయిరి. కాని ధ్వన్యభావవాదిమతములను నానందవర్ధనుఁడు వివరించినాఁడు. రెండవమతమునకు వివరణ వ్రాయుచు నభినవగుప్తులు-వారు చెప్పినట్లు నిరూపించిరి, గాని, యది పూర్వపక్షి యాశయము గాని యానంద వర్ధనుని యాశయము గాదని తెలియవలయుచు.

(ఈవిషయమిఁక మీఁదఁ బ్రికటింపఁబడదు- ప. అ.)

---

# కావ్యాలంకారసూత్రకర్త యెవ్వరు ?

—: పిలకా గణపతిగారు — విజయనగరము :—

శ్రీ కనకదండి గోపాలకృష్ణశాస్త్రిగారు వెనుకటిసంచికలో [సంపుటము 20. సంచిక 4.] "కావ్యాలంకారసూత్రవృత్తి" అను శీర్షికతో నొకవ్యాసము ప్రకటించియున్నారు. అందు 'వృత్తి'యే వామనవిరచితము గాని "కావ్యాలంకార సూత్రములు" వామనవిరచితము గాదని యభిప్రాయపడిరి. అందుఁ గొన్ని విప్రతిపత్తు లున్నవి. వాని నీవ్యాసమున విన్నవించుకొనుచున్నాను.

శ్రీ శాస్త్రిగారు "కావ్యాలంకారసూత్రములు" వామనరచితము గావనుటకు ముఖ్యముగ నీ క్రిందిహేతువులు చూపిరి. అవి యివి:-

(1) ఇప్పుడు మన కనేకసూత్రగ్రంథము లుపలభ్యమానము లగుచున్నవి. వానిలో సూత్రము లెంత దురవగాహ మయిన యర్థము కలవి యైనను, సూత్రకారునిచే నిర్మింపఁబడిన వృత్తి మొదలగునవి దేనికిని గనఁబడుటలేదు.

(2) ఒకవేళ సూత్రములకుఁ దానే వృత్తి వ్రాసికొనినను సూత్రాక్షరములవలన విశదము లగువిషయములను వదలి క్లిష్టము లగువిషయములనే వివరించును. అంతియకాని సూత్రములవలన సులభముగఁ దెలియు విషయములను దిరిగి ప్రతిపదార్థముచే వివరింపఁడు.

(3) మొదటిశ్లోకమున "స్వేషాం" అనుటకు బదులు "తేషాం" అనికూడఁ బాఠాంతరము కలదు. దీనినిఁబట్టి వామనుఁ డెవరిసూత్రములకో వృత్తివ్రాయుచున్నాఁ డని యూహింపవచ్చును. తరువాతియాలంకారికులు భ్రాంతిచే వారిరువు రొక్కఁడే యని యనుకొనిరి.

మొదటిహేతువునకు వత్తము. వారు గ్రంథకర్తృకృతవృత్తితోఁ గూడినసూత్రగ్రంథములు లేవనుట కెట్లు సాహసించిరో గాని సంస్కృతవాఙ్మయమున నిట్టి వనేకగ్రంథము లున్నవి. అలంకారగ్రంథములలోనే కొన్ని యిట్టివి గలవు. కావ్యానుశాసనము చూడుఁడు. ఇది. క్రీ. శ. 12వ శతాబ్దపువాఁ డగుహేమచంద్రునిచే రచింపఁబడినది. ఈతఁడు తాను వ్రాసినసూత్రగ్రంథమునకుఁ దానే వృత్తి వ్రాసికొన్నాఁడు. ఇంతియ కాదు. ఆవృత్తికి, వ్యాఖ్యానము కూడఁ దానే వ్రాసికొన్నాఁడు. ఇట్లే వాగ్భటుఁడు కూడఁ దనకావ్యానుశాసనమునకుఁ దానే వ్యాఖ్యానము వ్రాసికొన్నాఁడు. ఇట్టి స్వకృతవృత్తులును స్వకృతవ్యాఖ్యానములును సంస్కృతవాఙ్మయమున నింక ననేకము లున్నవి. వాని నిఁట విస్తరభీతిచే విడిచెదను. దీనినిఁబట్టి వారి మొదటిహేతువు నిరాధార మని తేలినది.

ఇఁక రెండవకారణము విమర్శింతము. ఎవ రైనను వృత్తి గాని వ్యాఖ్యానము గాని గ్రంథమున కంతకును రచింతురు గాని సులభ మగు వానిని విడిచి కష్ట మగువానికే వ్యాఖ్యానముల వ్రాయరు. అట్లని నియమము లేదు, సామాన్యముగ సులభ మగువానికిని స్వల్పముగ వ్యాఖ్యానము చేయుదురు. ఇంకను సులభముగ నున్న "స్పష్టమ్" అని యూరకుండుటయుఁ గలదు. మల్లినాథుఁడు రఘువంశాదులయందు సులభ మగుశ్లోకములకు వ్యాఖ్యానము చేయలేదా? అట్లే సాధారణముగఁ దన గ్రంథమునకు వృత్తి వ్రాయుచు వామనుఁడన్ని సూత్రములకును వృత్తి వ్రాసినాఁడు. సులభముగ నున్నచోటుల నొక్కొక వాక్యముతో సరిపెట్టినాఁడు. కొన్నిచోటుల సోదాహరణముగ సూత్రములు సమన్వయించినాఁడు. చూడుఁడు- కావ్యానుశాసనమునఁ గూడ సూత్రములు సులభముగ నున్నను వృత్తి వ్రాసినాఁడు. 7 వ యధ్యాయములో—

సూ—విఘ్నేష్వచలం స్థైర్యమ్.

వృ—సత్యపి విఘ్న ఉద్యమా దభ్రంశః స్థైర్యమ్.

సూ—క్షోభే ప్యనుల్బణం మాధుర్యమ్.

వృ—మహత్యపి యుద్ధనియుద్ధవ్యాయామాదా క్షోభహేతౌ, అనుల్బణత్వం మధురాచేష్టా మాధుర్యమ్. ఇట్లనేకము లగునుదాహరణము లున్నవి. ఒకవేళ వృత్తికారుఁడు భిన్నుఁడనుకొందము. అట్టియెడ సులభములగు సూత్రముల కాతఁడు మాత్రము వృత్తివ్రాయుటలో నేమి హేతువు లున్నవి?

మూఁడవ హేతువుచూడుఁడు. "తరువాతియాలంకారికు లందఱును సూత్రకారుఁడును, వృత్తికారుఁడును, నొకఁడే యనుచున్నారని" వారే చెప్పిరి. "తేషాం" అనుటచే నెవరిగ్రంథమునకో వామనుఁడు వృత్తివ్రాయుచున్నాఁడని మన మనుకొనవలయు నఁట!! ఇంతమంది యాలంకారికులను భ్రాంతు లనుట యుచితమో, లేక "తేషాం" అను పాఠ మపపాఠ మనుట యుచితమో పాఠకులే నిర్ణయింపఁగలరు. ఇంతియగాక, ప్రాచ్యపాశ్చాత్యపండితులలో నెవరికిని సూత్రములు వామనవిరచితము లనుటలో విప్రతిపత్తి యున్నటులఁ గానరాదు. కావున వీరియీవాదము భ్రాంతిమూలక మని విన్నవించుకొనుచు ముగించెదను.

---

(ఈవిషయము లింక మీఁదఁ బరిమత్పత్రికలోఁ బ్రకటింపము ప. అ.)

# ఉత్తరరామచరితము — రసచర్చ.

ఓలేటి వేంకటసుబ్బారాయశాస్త్రిగారు — విజయనగరము.

---

భవభూతిమహాకవి రచించిన యుత్తరరామచరితములో నంగిరసవిషయమున నిదివఱకే పలువాదములు జరిగినవి. ఆయాప్రమాణానుసారముగ నావిషయము స్థిరీకృతప్రాయమే. ఇటు లుండఁగా (౨౦ సంపుటము. ౪ సంచిక) ఆశ్వయుజకార్తికమాసపు టాంధ్రసాహిత్యపరిషత్పత్రికలో, ఆవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు "ఉత్తరరామచరితమున ధర్మవీరము ప్రధాన మనువాద మంగీకరించిన నుపక్రమోపసంహారములు సూత్రఁపట్టినట్లు కుదురు ననియు, పంచసంధిసమన్వయమున కేయభ్యంతర ముండ దనియు, వాచ్యముగ ధర్మవీరమునకు సర్వాంకసంస్పర్శము లేకున్న వ్యంగ్యపద్ధతిని గన్పట్టు ననియు, నింక నేమేమొ సమన్వయించి చివరను "కాన ధర్మవీరరస ముత్తరరామచరితములోని దనునంశమును గూడ సహృదయులు కటాక్షించి కరుణశృంగారములను వలె విమర్శించుట కిది సూచన"—అని "ఉత్తరరామచరితములోని ధర్మవీరము" అనువ్యాసమున వివరించిరి. ఇటుల వ్రాయుటలో వీరియభిప్రాయ మేమో తెలియకున్నది. తామే యీవాదమును బ్రారంభించితి మనియు, దానిని దదుపజ్ఞముగా గ్రహించి విమర్శించుట యుక్త మనియు వీరియభిప్రాయమా? లేక విరళముగా నున్నవాదమును వివరించితిమి దానిని విమర్శింపవలయు ననియూహయా? ఈవిషయమును గూర్చి కొంతవివరింతును, సత్యమును గ్రహించుబాధ్యత సహృదయవిమర్శకుల దని మనవి.

శ్రీశాస్త్రులుగారు వేదము వేంకటరాయశాస్త్రులవారిని, వారికవితల నెఱిఁగి యుందు రనుకొందును. వేంకటరాయశాస్త్రులుగారు నుత్తరరామచరితమును దెనిఁగించి దానికి నుపోద్ఘాతము సుమారు డెబ్బదిపుటలగ్రంథమును వ్రాసి, అందు భవభూతిజీవితవృత్తాన్తాదుల వ్రాయుచు రసచర్చను సవిమర్శముగా నిరూపించిరి. ఆరసచర్చలో ధర్మవీరమును గూర్చి కూడఁ గొంతవఱకు వ్రాసియున్నారు. ఆభాగము నిట కొంత సంగ్రహముగా నిరూపింతును. దానిని బరికించి యదుపజ్ఞమో సహృదయులు నిర్ణయింపఁగలరు. వేంకటరాయశాస్త్రులవారి ధర్మవీరరసచర్చ:—

ఈనాటకమునందు రసము ధర్మవీర మనియు, నాయకుఁడు ధర్మవీరుఁ డనియు వ్యాఖ్యానించువారుం గలరు. అందులకు వారియుపపాదనములు:—

"ఉత్సాహాత్మా భవేద్వీరః త్రేధా ధర్మాజిదానతః,
నాయకోఽత్ర భవే త్సర్వైః శ్లాఘ్యై రనుగతో గుణైః" ——వాగ్భటః
"ఉత్సాహాత్మా వీర స్సత్రేధా యుద్ధధర్మదానేషు,
విషయేషు భవతి తస్మి న్న[illegible]భో నాయకః ఖ్యాతః" ——రుద్రటః
"దానధర్మయుద్ధభేదా త్త్రేధా వీరః" ——హేమచంద్రః
"వీరశ్చతుర్ధా, దానదయాయుద్ధధర్మై స్తదుపాధేరుత్సాహస్య చతుర్విధత్వాత్" ——రసగంగాధరః.

ఈనాటకమున నాయకునందుధర్మవీరతా సాధకములయిన వాక్యములు:-

ఆముఖములో అపవాద ప్రస్తావము. ప్రథమాంకమున:- అర్మిలినిగాని- పు. ౪ పద్య (౫) కట్టా ! లోకః ఒు ౫ (౮), పుత్తులకునిజ ౮ (౧౫), అకట సీతకు ౧౪ (౩౩) ఏకార్యముచే నైనను (౩౪), ఏ సాధుశుద్ధ (౩౫), నీవలన (౩౬) లోకులకు ౧౫ (౩౭), పిన్నతరి (౩౮), నేరనిముగుదా (౩౯), గోడు గుడువ (౪౦), ఎదను ౧౬ (౪౨).

ద్వితీయాంకమున:-కుడికరము ౨౨ (౧), వెలికి ౨౮ (౯).

తృతీయాంకమున:—ఓయికఠోర ౪౦ (౨౧), చకిత ౪౦ (౨౦) దేవి పాడిడి ౪ (౨౬), సరవి ౪౬ (౩౭), ఎచట (౩౮).

షష్ఠాంకమున:-మొదలనే ౮౧ (౨౪), నిరతిశయుంపు (౨౬) ఆకృతి ౮౨ (౩౧), అనుభావ ౮౩ (౩౪).

సప్తమాంకమున:-మహర్షులు ధర్మములను సాక్షాత్కరించినవారు ౮౪, బాల్యమున ౮౬ (౧౫), త్వాయందెల్లను ౮౭ (౬), కుందు ౮౯ (౧౨).

ఇందు సీతావిరహశోకోద్ధురతా పరములైన వాక్యములు తత్కారణభూత ప్రజారంజనధర్మైకాభినివేశతాత్పర్యకములు నాటకము ఆదిలోనే అపవాదమూలకము. అంతమున నిరపవాదకరణపరము లోకరంజనము. ఆదిలో త్యాగముచేత, అంతమున తత్సమాకలనపూర్వకతత్ప్రతిబోధనముచేత; ఏతదనుసారముగ భరతవాక్యమందు "త్రుంగంజేసి యఘంబు" అనువాక్యము అపవాదనిరసనపూర్వకధర్మనిర్వాహపరముగాను, "శ్రేయముల సందోహంబుఁ బొందించుత న్" అనుట సీతాపునఃప్రాప్తిపరముగాను గ్రాహ్యములు; కడమపద్యంబును అట్లె. ఈమతమున వీరరసమునకు అంగికి కరుణవిప్రలంభము అంగము, ధర్మాభినివేశదార్ఢ్యబోధకము.

సీతాపునస్సంప్రాప్తికై వ్యాఖ్యలయందు చేయఁబడునట్టి బీజాద్యారంభాదిముఖాదిసమన్వయముల నెల్ల నిరపవాదసాధనకై చేయవలయును.

ఈయుక్త్యాదులఁ బరికించి సహృదయులు క్రొత్తవిషయ మేమాత్రమున్నదో గ్రహింపఁగలరు. లక్షణాదిలేఖన మొందులకో వదలివైచిరి. వేంకటరాయశాస్త్రిగారి రీతిని వ్రాసినఁ గొంతబాగు.

విరళముగా నున్నదానిని వివరించుఁగాక. ఐనను కొంగ్రొత్తవిషయములఁ బరిశీలించి దానిని సహృదయులకుఁ దెల్పి విషయనిర్ణయము చేసిన బాగుగాని, ప్రాచీనవిషయములనే చర్చించి నిస్సారదశలోఁ దిరుగ నాదికిఁ జనుచు వివరించుట యంతముఖ్యము కాదేమో ?

ఆంధ్రసాహిత్యపరిషత్తున కమూల్యాలంకరణములఁ జేకూర్చి, కొంగ్రొత్తపూలసరుల నత్యంతమనోహరరీతి నమర్చి నూతన విమర్శనాంబుధి సంభూత సుధామూర్తిని జేసి యున్నతపదవి నధిష్ఠింపఁజేయవలసిన బాధ్యత విమర్శకులదే కాదు. సహృదయులు గూడ నుచితానుచితతత్త్వవిషయ పరిశీలనాసక్తులుఁ గావలయును. సారస్వతపాథోధినుండి నూతనరత్నముల నేర్చి కూర్పవలయును. సర్వము సంపూర్ణ మైనపుడే మాతృభాషాదేవి సంతసింపఁగలదు. కావున, ఓవిచక్షణులారా! మీయమూల్యమగు కాలమును సారస్వతపారావారమథనమునకై వినియోగించి నూతనాలంకరణరత్నముల నాదేవి కర్పింపుఁడు. తాదృశాలంకరణార్పణ చేయ మీకన్న నెవ్వరు సమర్థులు. విచక్షణులదే యీబాధ్యత యంతయు నని సర్వసమ్మతము. యుక్తివాదములలో దిగిన "వాదిదౌర్బల్య మేవ, నతు వాదదౌర్బల్య"మను సంగతి జ్ఞాపకము వచ్చును. యుక్తి కేది లోఁగకుండును? ధర్మవీరమే యని నియమ ముండ నక్కఱలేదు. ఇంకనగును. కానికవిహృదయమేమో తత్సందర్భము వలన సహృదయగమ్యమే. కవి స్వోక్త్యా చెప్పుట చాలవిరుద్ధము గదా? ఎట్లయినను నాయారసపరిపోషకసామగ్రివలన నంగిరస విషయమె కాక యితరము కొంతస్పష్టమై యుండఁగా నవ్యవిషయము చూపలేరా ? కాఁబట్టి పైవిషయాదికము పరిశీలింప పునఃపునః ప్రార్థన. సత్యాసత్యములకై యీవ్రాఁతలు గాని వెగటుపుట్టింపఁ గాదని మనవి.

# ఆంధ్రవ్యాకరణములధోరణీవిమర్శనము.

— ముక్కు సర్వేశ్వరరావుగారు, కృష్ణశాల. —

---

శ్రీ ప్రజోత్పత్తినామసంవత్సర జ్యేష్ఠాషాఢమాసములయందు వెలువడిన "ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక" యందు మ॥రా॥శ్రీ ఎంకమూరి వేంకటరమణ బి.ఏ.గారు, "ఆంధ్రవ్యాకరణములధోరణి" యను వ్యాసమును బ్రకటించిరి. ప్రస్తుతము పూర్వోక్తమగు వ్యాసమునఁ గొన్నియభిప్రాయభేదము లుండుటంజేసి దీని వ్రాయ నారంభించితిని.

శాణము రత్నరాజమునకుఁ దేజఃపుంజసముద్యోతక మెట్లో యట్లే సారస్వతంబునకు సత్యసముద్యోతక మీవిమర్శనమే. అట్టివిమర్శనమును జేయుటకు సర్వంకషం బగు పాండితీవైభవ మున్ననే గాని శ్రీయుత వేంకటరమణగారు సూచించినట్లు "లఘుసిద్ధాంతకౌముదిపాటి జ్ఞానముతో సంస్కృతనాటకముల కేయాంధ్రీకరణంబులు చదువుకొనియో కృతార్థులయిన యుభయభాషాప్రవీణులును, కేవలాంగ్లభాషాప్రధానపాఠశాలలలో నభిమానవిషయముగా నాంధ్రము నభ్యసించి బాలవ్యాకరణము తప్ప నితరవ్యాకరణనామమేనియు విని యెఱుఁగని యాంగ్లపట్టభద్రులును" విమర్శించుట కర్హులు కాఁజాలరు. ఇందతిశయోక్తి యెంతమాత్రమును లేదు. సంస్కృతంబునకుఁ దెనుఁగునకు నెక్కుడు సంబంధ ముండుటంబట్టి రెంటియందును బాండిత్యము గల యుభయభాషాప్రవీణులే విమర్శింప సమర్థులు. వ్యాసకర్తగారు వచించినరీతిగాఁ గేవలులు సిద్ధపడినఁ దప్పటడుగులు వైచుచుందురు. కావున నుభయభాషాప్రవీణు లగుపండితు లాంధ్రవ్యాకరణముల లోకమున కెఱుకపఱుచుట మిగుల శ్రేయస్కరంబు.

౧. "అథర్వణుఁ డాంధ్రశబ్దచింతామణిలోని విశేషములు చాలవ్రాసినను, నచ్చటచ్చట నందులోఁ గలవిషయములకు ముచ్చటించి యున్నాఁడని వ్యాసకర్తగారు వ్రాసిరి.

ఈవాక్యసరణియందుఁ, బూర్వాపరవిరోధ మున్నది. దానంజేసి వారు చెప్పఁదలఁచినదానికి స్వోక్తివిరోధము వాటిల్లును. అందువలన నిచ్చటఁ జిం

తామణిలో లేని యని వ్యాసకర్తగారి యభిప్రాయ మగు మన మూహింపవలయును. ఇట లే యనువర్ణము లేకుండుట ప్రమాదము కావచ్చును.

మఱియుఁ "గావున నాంధ్రశబ్దచింతామణిలోని లక్షణవిశేషములు మాత్రమే యథర్వణకారికలలో నగపడుచున్న" వను మ॥రా॥శ్రీ॥ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారి వ్రాఁత "ప్రమాదో ధీమతామపి" యన్నట్లు ప్రమాదజనితము కావచ్చునని వ్రాసిరి.

కాని శాస్త్రిగారి యథర్వణకారికావళివిమర్శనములో "నాంధ్రశబ్దచింతామణిలో లేని" యనియే యున్నది. వ్యాసకర్తలు వ్రాసినట్లుగా నాంధ్రశబ్దచింతామణిలోని యని లేదు. లోని యనుపాఠము వారి కెచ్చట లభించినదో? కారికావళి విమర్శనములో "లేని" యని యుండఁగా దానిని గమనింపక శాస్త్రిగారి వ్రాఁత ప్రమాదజనిత మనుట న్యాయ్యము కాదు.

౨. చిన్నకోట పెద్దనకృత కావ్యాలంకారచూడామణియందు నేఁటివఱకు వివాదాంశము లైన విషయము లీతఁ డొకటి రెండు స్పష్టపఱిచినాఁ డని యుక. చేరునకారాంతములందు, కారము దెలిఁగించుచోటఁ గఠినాత్మఁ డనన్, దారుణకర్మఁ డనంగను, మేరుమహాధన్వుఁ డన నమృతధాముఁ డనన్". అనుపద్యమువలన "విశ్వకర్మనికూఁతు విశదలావణ్యసముజ్జ్వలఁ జేకొని మూఁడిఁబోయి" యనుపద్యమున "విశ్వకర్మని కూఁతు" ననుశబ్దము సాధువగుచుండఁగా "విశ్వకర్మకుఁ గూఁతు" నని సవరించుటకుఁ బ్రయత్నించిన గుప్తార్థప్రకాశికాకారుల మత మనూహ్య మనియు వ్రాసిరి.

విశ్వకర్మఁ డనురూపము నీతఁడే స్పష్టపఱిచి యుండలేదు. ఆంధ్రశబ్దచింతామణి యథర్వణకారికలచే నీరూపము సాధు వగుచునే యున్నది. కావున నీవిషయ మపూర్వము కానేరదు.

గుప్తార్థప్రకాశికాకారులమత మేల యనూహ్యమో పరిశీలింతము.

బాలవ్యాకరణమునకు విపులవ్యాఖ్య వ్రాసిన గుప్తార్థప్రకాశికాకారులు గుప్తార్థప్రకాశిక మొదటిముద్రణమున "విశ్వకర్మకూఁతు" నని సవరించిన గణభంగము కలుగనేర దని వ్రాసిరి. పైపద్యము సీసపద్యపు పాదమగుటచే వారి సవరణ ప్రకారము పాదమున వర్ణము తక్కువయై ఛందోభంగము కలుగు నని విమర్శకు లాక్షేపించిరి. అత్తఱి వారు విశ్వకర్మకుఁగూఁతు నని ఛందోభంగనివారణార్థమై సవరించిరి. ఆంధ్రశబ్దచింతామణ్యాదులు విశ్వకర్మఁ డను డుజఁ

తద్రూపమును సాధించుచుండఁగాఁ జిన్నయసూరి దుజంతరూపములు తనకు లభింపమినో లభించినవి ప్రామాణికంబులు కావనియో విశ్వకర్త్రాదులకు స్త్రీత్వంబును విధించియుండెను.

కావున నాసూత్రమునకు వ్యాఖ్యను వ్రాయుచుఁ దన్మతానుసారముగ నట్లు సవరించుటలో ననూహ్యాం బెట్టియు నుండఁబోదు. దీనిపై త్రిలింగలక్షణశేషకర్త సూరిగారు విధించిన స్త్రీత్వంబును నిరోధించి నన్నయాదులమతమునే తా ననుసరించి యుండెను. కావున నేఁటివఱకీ ప్రయోగంబు నెడ నున్న వివాదంబును గోచరింపకున్నది.

3. మఱియు నొకసందర్భమునఁ "గాని యప్పకవి చింతామణిని దెనిఁగింపఁబూని తద్గదితమైన "ఉర్ద్వన్ద్వే"యను సూత్రమును మఱచినాఁడనియు మఱచి రేఫశ్లిష్టమున కుదాహరించుచు నాదిపర్వమునందు ఉ. "క్షత్రియవంశ్యులై" యనుపద్యము నాలవపాదమునందు "రామసూం-ధాతృరఘుక్షితీశు" లను స్థలమున- మాంధాతృశబ్దము ఋకారాంతము కనుకఁ దకారము క్రింద నున్నది వట్రసుడిగాని వ్రారపడి కాదని తప్పటడుగు వైచినాఁడనియు వ్రాసిరి. "రామమాంధాతృరఘుక్షితీశు" లనుచోట నేసూత్రముచేతను రేఫాదేశంబు ప్రాప్తించుట లేదు. అట్టియెడఁ దప్పటడుగు వైచినాఁ డను టెట్లు సరిపడును. వ్యాసకర్తగా రుదాహరించిన పైనన్నయచింతామణిలోని సూత్రముచేఁ గాని "ఆనజఃస్యాత్ ఋతోద్వన్ద్వే రేఫః శౌరికవేర్మతే" యనునథర్వణకారికచేఁ గాని "ద్వంద్వంబునందు ఋకారంబునకు రవర్ణంబు విభాషనగు" ననుబాలవ్యాకరణసూత్రంబుచేఁ గాని యేతద్వ్యతిరిక్తములైనయాంధ్రవ్యాకరణముల సూత్రములచేఁ గాని "రామమాంధాతృరఘుక్షితీశు" లను ద్వంద్వసమాసంబునందలి ఋకారంబునకు రేఫంబు రాదు. ఏలయన నీసూత్రముల కన్నిటికి నొక్కటేయర్థము. "మాతాపితరౌ" ఇత్యాదుల సిద్ధసమాసప్రక్రియావస్థయందే ఋకారమునకు "ఆనఙ్ ఋతోద్వన్ద్వే"యను పాణినీయసూత్రముచేఁ బ్రాప్తించెడి యానఙును బాధించి రేఫము వచ్చును. రేఫాదేశంబు వైకల్పికంబుగానఁ బక్షమున ఋకారంబునకుఁ బూర్వోక్తపాణినీయసూత్రముచే నానఙువచ్చును. సంస్కృతమున నీయానఙు వచ్చుటకు విద్యాయోనిసంబంధ ముండవలయు నను నియమము కలదు. కావున నాంధ్రవ్యాకర్తలు విధించిన రేఫంబు గూడ విద్యాయోనిసంబంధ మున్ననాఁడే వచ్చు నని నిశ్చయింపవలసియున్నది. కావున రామమాం

ధాతృరఘుక్షితీశు లను ప్రకృతవిషయంబున విద్యాసంబంధము కాని యోని సంబంధము కాని యున్న దని చెప్ప నెవరు సాహసింపఁగలరు? ఈయంశ మంతయు గుప్తార్థప్రకాశికయందు వివరింపఁబడియున్నది. ఈవిషయమునే మనం బునం దిడికొని యహోబలపండితుఁడు పూర్వము మనవ్యాసకర్తగా రుదాహరించిన ఉ్కన్ద్వేర" యనుసూత్రవ్యాఖ్యలో "క్షత్రియవంశ్యాలై జగతి నిత్యాదిపర్వపద్యే మాంధాతృశబ్దస్య సంయుతాసంయుతప్రాసత్వేన ఋకారాంతత్వమేవ, నస రేఫత్వ" మ్మని వచించియున్నాఁడు. కాన లక్షణవేత్తలే యిట్లు రేఫంబు రా దని చెప్పుచుండఁగా రేఫాదేశంబు నప్పకవి మఱచినాఁ డను టెంత యుక్తియుక్తమో విమర్శకులే యూహింతురుగాక.

తప్పు లుండిన నుండవచ్చును. ప్రమాద మనునది మానవప్రకృతిసహజమే. కావున నప్పకవిపుస్తకమునం దిట్టిదోసంగు లొకటిరెండుకల వని తెల్పిన మనవ్యాసకర్తగారు సర్వలాక్షణికాసమ్మతమైనదోసముల వెలువరించుట యుక్తము కాని దోసము కాని మాంధాతృశబ్దరేఫవిషయమును దప్పనుచుఁ దలంచుట న్యాయ్యము కాదు.

౪. వెండియు:—

హరికారికలు శిష్టు కృష్ణమూర్తికవిప్రణీతము లనియు బాలవ్యాకరణకారుఁడు వానిని గాంచి దొంగిలి బాలవ్యాకరణరూపమున నాంధ్రమునఁ బ్రకటించె ననియుఁ బ్రతీతి కలదు. అసత్యమగు చిన్నయసూరి చౌర్యప్రతీతిమాట యటుంచి హరికారికలు పరిశీలింపఁగా శిష్టు కృష్ణమూర్తికవిప్రణీతములు కావనియుఁ దేటపడుచున్నది. హరికారిక లథర్వణునికంటెఁ బూర్వుఁడును, నథర్వణునిచేఁ బేర్కొనఁబడినవాఁడును నగు ''హరి'' యనువానిచే రచింపఁబడినవి. ఉదా-గ్రామ్యాపి గ్రాహ్యతాం యాతి యద్యార్యవ్యవహారభా'' క్కను హరికారిక నథర్వణుఁడు ''అప్రయుక్తత్వ దోషస్తునవిరుద్ధో హరేర్మతే'' యని వివరించినాఁ డనియు వ్యాసకర్తగారు వ్రాసిరి.

పైయుక్తు లెంతవఱకు హరికారికలు శిష్టు కృష్ణమూర్తి కవిప్రణీతములు కావనుటకు సరిపడునో పరిశీలింతము.

వ్యాసకర్తలు సత్యముకాని సూరిచౌర్యప్రతీతిమాట యటుంచి హరికారికలు పూర్వుఁ డెవఁడో హరి వ్రాసె ననిన సూరిచౌర్య మసత్య మెట్లగును? సూరికిఁజౌర్యమును దొలఁగించుట మాకునుసమ్మతమే. హరికారికలకును సూరి

గ్రంథమునకును నిపుణముగఁ బరికించినచో నేకొలఁది భేదమో యుండును గాని మిగిలిన దంతయు సమానమే. కానఁ బూర్వుఁ డనిన సూరిగారి చౌర్య మసత్యము కాదు. సత్యమే యగును. హరికారికామతమును దెల్పెనని యుదాహరించిన కారికలకర్థము తుల్యము కాదు. హరికారికార్థము:- "పెద్దలు వ్యవహరించినమాట గ్రామ్యంబయినను గ్రహింపఁదగు" ననియు నధర్వణకారికకుఁ "గవులు ప్రయోగింపకపోయినను వ్యాకరణాదూష్యంబు ప్రయోగార్హం"బని యుఁ గావున భేదము స్పష్టమే. దానం జేసి యీ యుక్తి పొసఁగదు.

అధర్వణుఁడు హరిమతమును దెలియఁజేయఁదలఁచినచో నేవ్యాకరణంబులంను లేనిలక్షణవిశేషము లీహరికారికలయం దుండఁగా వానిని విడిచి యుండెను. వానిఁ జూపుచుంటిని. "సర్వత్ర నద్రుతః క్త్వార్థే వ్యతిరేకే తు వా భవేత్, ఉత్తరస్య కొనోర్ధాతోః కం బుధాః కేచి దూచిరే" యని యున్నది. ఈకారికలు చేయకక్క, చేయక, పట్టుక యిట్టివిశేషరూపముల సాధించుచుండఁగా వానిని బరామర్శింపక విడుచుట కేమి హేతువును నిరూపింతురు? ఒకప్పు డిట్టిరూపము లధర్వణునికి సమ్మతములు కా వనినచో నిషేధించియైన నుండవలయుఁ గదా? ఇట్లు లేనిపోని నామములఁ దమసూత్రములయందు నేదియో ఘనతకై పేర్కొనుట మనవారియాచారము. బృహస్పతి, కణ్వుఁడు, శౌరికవి, మున్నగువార లాంధ్రమునకు లక్షణగ్రంథముల వ్రాసి రని చెప్పిన లాక్షణికులు లేరా, వారు వ్రాసినగ్రంథములు లభించునా? కావున నధర్వణు నిచేఁ బేర్కొనఁబడినంతమాత్రమునఁ బూర్వ మొకహరి యుండవలయు నను నిర్బంధము లేదు. అట్లుగాక ప్రాచీనుఁడు హరియొకఁ డున్నను నాతఁడు రచించిన గ్రంథము మన కిపుడు లభించెడి హరి కారికా గ్రంథము కాదు. ఈవిషయమునే కీ॥ శే॥ వీరేశలింగముపంతులుగారు కవులచరిత్రయందు హరికారికలు నవ్యుఁడు వ్రాసినవి కాని పూర్వుఁడు రచించినవి కా వనియు సయుక్తికంబుగ నిరూపించియుండిరి.

వ్యాసకర్తగారు హరికారికల కాద్యంతములయందు రెండుచోటులను వృత్తిని వ్రాయుచుంటి ననియే చెప్పియున్నాఁడు కాని తాను గారికలను వ్రాసినట్లుగాఁ జెప్ప లేదనియు వ్రాసిరి.

"వృత్తిం నాన్ననసూత్రాణాం కృష్ణమూర్తి రిహ కుర్వే" యని వ్రాసిన కవిగారి వ్రాఁతకు నేమి హేతువును నిరూపింతురు? మఱియు నన్నయసూత్ర

ములకుఁ బూరకముగా వృత్తిఁ వ్రాయుచు, 'తనోతి హరికారికావళీం వృత్తిం' మ్మని వృత్తినామధేయమును హరికారికావళి యని వ్రాసియున్నాఁడు. "కృష్ణమూర్తి రిహ కుర్వే''యని వ్రాసిన తరువాత నెవ రైన నాతఁడు వ్రాయ లే దందురా ?

కృష్ణమూర్తికవియే హరికారికల వ్రాసెనని తెలినతరువాత సూరిగారును వీరును సమకాలికు లగుటచే మొదట నెవరు వ్రాసి రనువిషయమున సూరిగారిబాలవ్యాకరణమును జూచి కవిగారు కారికావృత్తిని రచించినట్లు పండితశ్రేష్ఠులచే నిదివఱకు నిరూపింపఁబడుటచే దాని నిచ్చట నిరూపించుట యప్రసక్తమని వ్రాయఁబూన లేదు.

చిన్నయసూరివ్యాకరణమును జూచి హరికారికలు రచింపఁబడుటచే వారు చెప్పఁబూనిన చిన్నయసూరి చౌర్యమును వారించుట కిది యుపమార్గము.

౫. మఱి యు "నథర్వణుఁడు పేర్కొనిన హరి వాక్యపదీయకారుఁ డగు భర్తృహరి యని ప్రవాదము కలదు. కాని సంస్కృతప్రాకృతములందు లేని గసడదవాదేశమును గూర్చి ప్రసంగించుచు "స్యుర్భిన్నాదేవ తస్మాత్తే వినాద్వన్ద్వం హాఽర్మతే"యని చెప్పుటచేసీహరియొక్కయాంధ్రవ్యాకరణకారుఁడు కానివాక్యపదీయకారుఁడు కాఁడని నిశ్చయ మగుచున్న దని వ్రాసియుండిరి.

వాక్యపదీయకారుఁడును నథర్వణునిచేఁ బేర్కొనఁబడిన హరియును నొకఁడు కాఁడనుటకు సంస్కృతమున లేని గసడదవాదేశమును జెప్పినవఁడు గనుక నాహరి భర్తృహరి కానేరఁ డనుయుక్తి సరిపడునా? సంస్కృతమునకుఁ గారికల వ్రాసినను నచ్చట గసడదవాదేశంబు లేదు కావునఁ జెప్ప లేదు. తెనుంగునకు వ్యాకరణంబును వ్రాయునప్పుడు తెనుఁగునకుఁ గల గసడదవాదేశంబును జెప్పఁగూడదా ? సంస్కృతప్రాకృతములయందు వైదుష్యము కల వారికిఁ దెనుఁగుననుండఁగూడదా ? గసడదవాదేశంబును జెప్పుటచేఁగాఁడా?

మఱియుఁ "జిన్నయసూరి ప్రథమేతరవిభక్తిశత్రర్థకచువర్ణంబులం దున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగు" నని చెప్పి— నన్నడిగె-నాకొఱకిచ్చె మొదలయిన వుదాహరించెను. దాని కొఱకున్ - కున్ - అనుదానిలోని యుకారమువలె నన్నులోని యుకారము విభక్తిసంబంధ మైనది కాదు. నాశబ్దమున కాదేశముగా నన్ను వచ్చినది. నన్ను దీనిమీఁది విభక్తి-ను, దీనిలోని

యుకారము ప్రకృతిసంబాధ మగుటచేఁ బైసూత్ర మిచ్చుటఁ బ్రవర్తింప దని యాంధ్ర భాషానుశాసనకర్తలు వ్రాసినట్లుగా వ్యాసకర్తగారు వ్రాసి వారి నాక్షేపించియున్నారు. చూడుఁడు. పైచిన్నయసూరి సూత్రము కేవల మీతని కల్పితము కాక నన్నయభట్టీయమునందే "అనాదిషువిభక్తిషూతో వా"అనియు "శత్రర్థేతూతశ్చానో" యనియు నున్న దని వ్రాసిరి.

కాని సూత్రము చిన్నయసూరికల్పితము కాని నన్నయకల్పితము కాని కావచ్చును. భాషానుశాసనకర్తలయభిప్రాయము సూత్రము నీతఁడే కల్పించెనా ? లేక నన్నయ కల్పించెనా ? యని నూత్రము కాదు. సూత్రములోఁ బొరపాటు కలదని వారి యాక్షేపణకాదు. ఉదాహరణముగా నిచ్చిన నన్ను ను గుఱించి గాని వేఱు కాదు. దానికొఱకు వ్యాసకర్తగారు వారికి స్ఫురింపనిది శాస్త్రిగారికి స్ఫురించిన దని వ్రాసిరి. కాని నన్నులోనిది విభక్తియుకారము కాదని శాస్త్రిగారు వ్రాసినారు. వ్యాసకర్తగారు చింతామణి ప్రక్రియనుబట్టి నన్నులోనిది విభక్తియుకారమని నిరూపించినఁ గార్యసాధక మగును గాని వేఱుగా వ్రాసి విరమించుట కార్యసాధక మగునా ?

అహోబలపండితుఁడు గూడ నీసూత్రమున కుదాహరణముల నిచ్చుచు నన్నేలు నని యుదాహరించెను. అహోబలపండితుఁ డుదాహరించుటవలన నీతఁడు నన్నులోని యుకారము విభక్త్యవయవ మని యెంచినట్లే తోఁచెడిని.

కావున వ్యాసకర్తగారు, నా కాదేశముగా నన్ను రా లేదు. నన్ను లోనిది విభక్తియుకారమే కాని వేఱుకాదని నిరూపించుట యుక్తము.

చిన్నయసూరిగారి సూత్రమునకుఁ జింతామణియందు రెండుసూత్రము లున్నవి. వాని నుదాహరింపఁగోరి వ్యాసకర్తగా రీసూత్రములఁ జింతామణినుండి "అనాదిషు విభక్తిషూతో వా" యని యు "శత్రర్థే తూత శ్చానో" యనియు నిచ్చియున్నారు.

శత్రర్థకచువర్ణంబులం దున్నయుకారమునకు సంధివైకల్పికముగా నగు నను సూత్రైకదేశమునకు "శత్రర్థేతూతశ్చానో" యనుసూత్రము సరిపడు నని యుదాహరించి యుందురు. ఈసూత్రమున కర్థము శత్రర్థకచువర్ణకను పరముగా నున్నపుడు నుయొక్క యుకారమునకు లోపము కల్గు నని దీనియర్థము. పైసూత్రమునకు వారిచ్చిన సూత్రమునకు నర్థ మెంతసరియో విమర్శకు లూహింతురుగాక

చిన్నయసూరి సూత్రమునకుఁ జింతామణిలోని సూత్ర మిది "చోర్వా స్యా ద్వర్తమాన విహితస్య"

కాన వ్యాసకర్తగారు చింతామణ్యాదులమతముల నిరూపింపక పైమాటలతో విరమించుట సాధకము కానేరదు.

ఆంధ్రభాషానుశాసనకర్తలు ఆ. వ యనువర్ణముల రెంటిని గ్రహించి యిదివఱకున్న భాషకు లోపమును గల్పించి రని వ్యాసకర్తగారు వ్రాసిరి.

అభివృద్ధిఁగాంచుటయే జీవభాషకు సహజము. వృద్ధిఁబొందిననాఁడువర్ణములఁ జేర్చుట వెనుకటిభాషకు న్యూనత్వాపాదకము కానేరదు.

ఈనావ్యాస ముఖ్యోద్దేశము వ్యాసకర్తగారి వ్యాసమును ఖండించుట గాదు; తత్త్వజిజ్ఞాసయే యుద్దేశము. చదువరులు దోసంగుల విడనాడి గుణంబులనే గ్రహింతురుగాక యని నావ్యాసమును నింతతో ముగించుచున్నాను.

# కావ్యాలంకారసూత్రవృత్తి విమర్శన.

గంటిమహాపాత్రుని గణపతిశర్మగారు, చిట్టిగూడూరు.

ఈయేటి యాంధ్రసాహిత్యపరిషత్పత్రిక నాల్గవసంచికయం దస్మన్మిత్రు లగు కనకదండి గోపాలకృష్ణశాస్త్రిగారిచేఁ గావ్యాలంకారసూత్రవృత్తి విమర్శింపఁబడినది. అందు వృత్తికారునికన్న సూత్రకారుఁడు భిన్నుఁ డయినట్లు వ్రాసియున్నారు. నేనాసాంత,నిరాధార మని యెంచి తగురీతిని ఖండనవ్రాయుచున్నాను.

"ప్రణమ్య పరమం జ్యోతి ర్వామనేన కవిప్రియా కావ్యాలంకారసూత్రాణాం స్వేషాం వృత్తి ర్విధీయతే" అనుశ్లోకమున "తేషాం" అనుపాఠాన్తరము కల దనియు నట్లు పాఠాన్తర ముండుటచే వామనుఁడు తా నిం కెవ్వరి సూత్రములకో వృత్తి వ్రాసినట్లు తెలియుచున్న దని శాస్త్రిగారు వ్రాసియున్నారు. అది యవిచారమూలము.

వామనుఁడు మొదట సూత్రములను వ్రాసి వానికిఁ గొంతకాలము పోయిన తరువాత వృత్తి వ్రాసియుండవచ్చును. అప్పుడు తాను జేసిన కారికలను, తచ్ఛబ్దముచేఁ బరామర్శించిన నయ్యది విరుద్ధము కానేరదు. తచ్ఛబ్దముచేఁ దనగ్రంథమును బరామర్శించుట ప్రసిద్ధము. ఇఁక "తేషాం" అను పాఠాన్తరమువలన సూత్రకారుఁడు వేఱొకఁడనుట కవకాశము లేదు.

ఇట్లు తచ్ఛబ్దముచేఁ దనసూత్రములనే వామనుఁడు స్వీకరించుచుండ వామనుఁడు సూత్రములను వ్రాయలేదనుట కేవలము పొరపాటు.

"ఒకవేళ సూత్రకారుఁడె తనసూత్రములకుఁ దానే వృత్తి వ్రాసికొనిన సూత్రాక్షరములవలన విశదము లగువిషయములను వదలి క్లిష్టము లగువిషయములనే వివరించును. అంతియె కాని సూత్రములవలన సులభముగఁ దెలియు విషయములను దిరిగి ప్రతిపదార్థము వివరింపఁడు," అని వ్రాసిరి. అట్లు వ్రాయుట కేవలము పొరపాటు, ప్రాచీనులకు సులభముగఁ దెలిసికొనఁదగు సూత్రములకుఁ గాని శ్లోకములకుఁ గాని తిరిగి వివరించుట యలవాటులో నున్నది, చూడుఁడు.

శ్లో॥ వనాంతదేవతా వేణ్యాః పాంథస్త్రీ కాలశృంఖలాః
మారప్రవీరాసిలతా భృంగమాలా శ్చకాశిరే.

కావ్యాలంకారసంగ్రహలఘువృత్తి 1 వర్గ. ఇచ్చట "వనాంతాః వన్యైక

ధేశాః వేణ్యః కేశపాశాః కాలశ్శృంఖలాః అంతకప్రయుక్తాః ఆకర్షణశ్శృంఖలాః”
అని సులభముగఁ దిరిగి వివరింపఁ బడ్డది.

విరళా స్తాదృశో లోకే శీలసౌందర్యసంపదః
విశాః కియత్యో వర్షేఽపి యాస్వేందుః పూర్ణమండలః

కా॥ సంగ్రహాలఘువృత్తి 1 వర్గము.

ఇచ్చట “విరళాఃస్వల్పాః తాదృశః పార్వతీవర్తిన్యః యాః శీలసౌందర్య సంపదః తత్సదృశ్యః శీలం సుస్వభావతా సౌందర్యం లావణ్యం” అని వివరింపఁ బడ్డది.

1 ఉవాచచ యతః క్రోధే
2 పుష్యేంద్రనీలవైడూర్య
3 ఉత్తరోఽపత్యకాయస్య
4 బభూవయస్య పాతాళపాతిన్యాం.”

కా. స. లఘువృత్తి 4 వర్గము.

ఇచ్చట “క్రోడః సూకరః పుష్యో మణివిశేషః గంధమాదనం పర్వత విశేషః స్వర్ణం కార్తస్వరం ఉర్వీం దః పర్వతః సంక్షయః కల్పాన్తః” అని సులభసాధ్య మగుపదములకుఁగూడ నర్థము వివరింపఁబడినది.

“సాఽగ్రిమా శ్రౌత్యార్థీచ భవేద్వాక్యసమాసే తద్ధితే యథా”

కావ్యప్రకాశ 127 సూత్రము.

ఇచ్చట “అగ్రిమాపూర్ణా” అనియు
పరివృత్త్యలంకారోయథా,
పరివృత్తి ర్వినిమయో యోఽర్థానాం స్యాత్సమాసమైః

కావ్యప్రకాశ 172 సూత్రము

ఇచ్చట “పరివృత్తిః అలంకారః” అనియు, సులభముగఁ దెలియువానికిఁ గూడ నర్థము వివరింపఁబడ్డది. ఇంకను-

శ్లో॥ సరస్వతీ స్వాదుతదర్థవస్తు నిష్యందమానా మహతాంకవీనామ్
అలోకసామాన్య మభివ్యనక్తి ప్రతిస్ఫురన్తం ప్రతిభావిశేషమ్”

ధ్వన్యాలోకము ఉద్యోతము 24 పే.

ఇచ్చట “వస్తుతత్త్వం నిష్యందమానా మహతాం కవీనాం సరస్వతీ అలోకసామాన్యం ప్రతిభావిశేషం పరిస్ఫురంత మభివ్యనక్తి, అని వివరింపఁబడినది.

శ్లో॥ యదపి తదపి రమ్యం యత్ర లోకస్యకించిత్
స్ఫురిత మిద మితీయం బుద్ధి రభ్యుంజిహీతే
ధ్వన్యాలోకము 4 ఉద్యోతము 16 శ్లో.

ఇచ్చట:—యదపి తదపిరమ్యం కావ్యశరీరం యల్లోకస్య కించిత్ స్ఫురిత మిద మితీయం బుద్ధి రభ్యుజ్జిహతె. అని వివరించియున్నారు.

ఇట్లుదాహరణములఁ జూపుటకు స్థాలీపులాకన్యాయముగ రెంటిమూటినిఁ జూపితిని గాని సామాన్యముగా నందఱుకవులును దమగ్రంథవివరణము దర్థమును బాలురకు సులభముగఁ దెలియఁజేయుటకుఁ దిరిగి స్పష్టముగ వివరించుచుందురు. ఇట్లు వ్రాయుటచే సూత్రకారుఁడొకఁడు వృత్తికారుఁ డొకఁడని వ్రాయుట పొరపాటు.

శాస్త్రిగారు కొన్నిసూత్రములకు సులభమగు వృత్తులనుఁ జూపిరి. వానిని విమర్శింతము.

(1) విశిష్టాపదరచనారీతిః, 1-2-7 కా. సూత్రవృత్తి-ఇచట "విశిష్టా" అను పదమునకు "విశేషవతీ" అనియు.

(2) శబ్దస్మృతివిరుద్ధ మసాధు 2-1-5 కా. వృత్తి ఇచట 'శబ్దస్మృత్యా వ్యాకరణేన' అనియు వివరించివ్రాయుట విరుద్ధము కానేరదు. శబ్దమునకుఁ బ్రతిపదము వ్రాయుట గ్రంథకర్తల కలవాటు, ఇఁక—

"సాత్రిధా, వైదర్భీ గౌడీ పాంచాలీచ, అనుచోట-

"సాచేయం రీతి స్త్రిధా వైదర్భీ గౌడీయా పాంచాలీచేతి 1-2-9 కా. వృత్తి, యని వివరణ మొదుల కని శాస్త్రిగా రడుగుదురేమో ?

"సా, త్రిధా" అని యే సూత్రము "వైదర్భీగౌడీపాంచాలీచేతి" యనునది పాఠాన్తరము, సాత్రిధా యనుపాఠమె చాలపుస్తకములలోనున్నది. ఈపాఠమే సాంప్రదాయికము,ఇచ్చో "త్రిధా" యని త్రిప్రకారదర్శనకు "వైదర్భీ గౌడీయాపాంచాలీచేతి" యని వివరణవ్రాయుట విరుద్ధము గానేరదు.

"ఒక్కొకచోఁ బూర్వము వివరించిన పదమునే తిరిగి వివరించుచుండును. సూత్రకారుఁడే తనసూత్రములకుఁ దాను వృత్తి వ్రాసికొనిన నట్లు వివరించునేమో యూహింపుఁడు" అని శాస్త్రిగా రొకపదమున కట్లు వివరణఁ జూపి సూత్రకారునికన్న వృత్తికారుఁడు వేఱని చెప్పిరి. శాస్త్రిగా రట్లువ్రాయుటకు నేను విచారించుచున్నాను.

మల్లినాథాదివ్యాఖ్యలయం దొకచో వివరించినపదమే మఱియొకచో వచ్చినఁ దిరిగి వివరణఁ జేయుచున్నారు. వానిని జూపిన గ్రంథ మగు నను భీతిచేఁ జూపలేదు. ఇయ్యది యందఱకును దెలిసియే యుండును.

కాన శాస్త్రిగా రిట్టిహేతువులను జూపుచు, సూత్రకారునికన్న వృత్తికారుఁడు వే ఱొకఁ డని చెప్పుట యెట్లు సంభవించునో యూహింతురుగాత. ఇంతియగాక.

వామనుఁడు ౮ వ శతాబ్దమునాఁటివాఁడనియు నప్పటినుండియు నిక్కాలమువఱ కేకగ్రీవముగ వామనుఁడు సూత్రములను దద్వృత్తులను వ్రాసె నని యందఱు శ్లాఘించుచుండ నీనాఁటికి వీరు వామనుఁడు సూత్రములను వ్రాయ లేదనుటలోఁ దగినప్రమాణములు గానరావు. వామనునకు వ్యాకరణము రాదనుట కెట్టిప్రమాణములు నగపడవు. మఱి 750 సంవత్సరమున సూత్రముల వ్రాసినవా రొకరుండ వానికి వ్యాఖ్యానము వ్రాయుచు వామనుఁడు వానిని బేర్కొనకుండునా ?

సూత్రముల కాద్యన్తము లుండఁ గవిపేరు కాన్పించ దనుట 50 సంవత్సరములలోఁ గవిపేరు శిథిల మయిన దనుట ప్రమాణములు గానేరవు. అట్లు కవిపేరు శిథిలమే యయినచో వృత్తికారుఁ డగువామనుఁడు కవిపేరు శిథిలమయిన సూత్రములకు వ్యాఖ్యానము వ్రాయుచున్నా నని తాను జెప్పుకొనియుండును. అట్లెచ్చటను జెప్పలేదు. ఇంకను 8 వ శతాబ్దాదిని వామనుఁడుండ 50 సంవత్సరముల క్రిందటిపండితుని పేరు, అందును నప్పటికాలమునఁ బెద్దయాలంకారికుని పేరు పుస్తకమున్నను గవిపేరు శిథిల మగుటకును నట్లయినను 50 సంవత్సరములకే తెలియకపోవుటకును దగినదృష్టాన్తములు గాన్పింపవు. కానఁ గావ్యాలంకారసూత్రములను దద్వృత్తిని గూడ వామనుఁడే చేసె ననుట నిశ్చయము. ఇది ప్రాచీనాలంకారికసమ్మతము. సర్వజనానుకూలము. సహృదయసమ్మతము గాన శాస్త్రిగా రిట్టివ్యాసములను వ్రాయుచుఁ బాఠకమహాశయులకు విపరీతబుద్ధిని గలుగఁజేయింపకుండుటకు శాస్త్రిగారినిశతధా— వేఁడుకొనుచు నేనింతటితో విరమించుచున్నాను.

---

# గ్రంథరచనాపద్ధతి.

జమ్ములమడక మాధవరామశర్మగారు—తాటిపర్తి అగ్రహారము.

ప్రబంధముల కాత్మ యగు ధ్వని రామాయణమహాభారతాది ప్రబంధముల నంతట నలక్ష్యక్రమవ్యంగ్యమై ప్రకాశించుట ప్రసిద్ధ మగు విషయమె కాని యది ప్రకాశించుటకు హేతు వెయ్యదియో మన మిపు డెఱుంగవలసి యున్నది. అనఁగా ధ్వని ప్రబంధముల వెలయించురీతిని దెలిసికొనవలయును. కథను బరీక్షించుట, పరీక్షించి యనావశ్యక మగుభాగమును వీడుట, ఆకథను ఫలపర్యంతము నిర్వహించుట, నిర్వహించునపు డంతటను రసవిషయమున జాగరూకత గలిగియుండుట, రసోచితవిభావానుభావముల వర్ణించుట, అలంకారౌచిత్యమును వీడకుండుట యనునివియే ప్రబంధమున నలక్ష్యక్రమవ్యంగ్య ధ్వని ప్రకాశించుట కుపాయములు, వీనిని వివరింతును.

మహాకవి తాను నిర్మింపఁబోవు కావ్యమున కుపాదానముగా నేర్పఱుచు కథాశరీరమును రసవ్యంజకమగునట్లు నిర్మింపవలయును. కావ్యమునకు రసోద్బోధనమె పరమ ప్రయోజన మనుట సర్వసమ్మత మగుసిద్ధాంతముగద. అట్టియెడ నారసోద్బోధనమునకు వీలగునట్లే కథాశరీరమును నిర్మింపవలయుట తప్పనిసరి. కానఁ గథాశరీరమున విభావానుభావసంచారు లుచితభంగి నుండి యందచందములఁ దేవలయును. విభావాద్యౌచిత్యమె రసోద్బోధనసమర్థము- ఇది కథయందు సహజముగ లేకున్నఁ గవి తానే సమకూర్చుకొనవలయును. అనఁగా నొక్కొకయెడ నితిహాసపురాణాదులఁ బ్రసిద్ధ మగుకథయందు విభావాద్యౌచిత్యము లేకున్న దానిని శోధించి యనౌచిత్య భ్రంశమును దీసివైచి యాకథను సమంజసముగా నేర్పఱుపవలయును. ఈవిభావాద్యౌచిత్యము కల్పితకథలోఁ గూడ నవశ్యసంపాద్యము. ఇట్లౌచిత్యసహితముగా నిర్మింపఁబడిన కథాశరీరమున రసవ్యంజకసామగ్రి సుసంపన్నమై యుండును. కవి తాను బ్రతిపాదింపఁదలఁచిన రసభావాదుల ననుసరించియె విభావాద్యౌచిత్యమును గ్రహింపవలయును. శృంగారమును నిరూపింపఁదలఁచినకవి తదనుగుణముగ (శ్రీ)కృష్ణాదుల విభావములుగ స్వీకరించుట యుక్తము కాని భీమసేనాదుల స్వీకరించుట యుచితము గాదు. ఇట్లే వీరరౌద్రాదులు ప్రతిపాద్యములయినపుడు (శ్రీ)రామభీమసేనాదులనె గ్రహింపఁదగును గాని యుత్తరకుమా

రాదుల గ్రహింపఁగూడదు. భరతశాస్త్రమున నీవిషయమును విపులముగ నె ఱుంగఁదగును. ఆశాస్త్రము ననుసరించియె విభావౌచిత్యము నేర్పఱుచు కొనవలయును. ఇఁక భావౌచిత్యమును గూర్చి విచారింతము. ప్రకృత్యౌచి త్యమె భావౌచిత్యము నేర్పఱుచును. ఆప్రకృతి యుత్తమ మధ్య మాధమము లనుమూఁడుతెఱంగులై కాక దివ్యమానుషభేదమున ద్వివిధము. ఈప్రకృతిభే దములను జక్కఁగ గమనించి సాంకర్యము లేకుండ నాయాప్రకృ త్యనుగుణ మగుస్థాయిభావమును నిబంధించిన నౌచిత్యము చేకూరును. అట్లు కాకున్న ననౌచిత్యమున రసము విచ్ఛిన్నమై రమణీయము కాఁజాలదు. కేవలమనుష్య మాత్రవిషయమున దివ్యోత్సాహాదులఁ గాని దివ్యునివిషయమున మనుష్య మాత్రుని యుత్సాహాదులఁ గాని వర్ణించిన నౌచిత్యభ్రంశము గలిగితీరును. అట్లే మనుష్యమాత్రుని వర్ణించుపట్టున సప్తార్ణవలంఘనాద్యమానుషవ్యాపార ములు మిక్కిలియవధానమున వర్ణింపఁబడినను ప్రకృత్యనుగుణములు కానోప మి రసవ్యంజకములు కాఁజాలవు.

మహారాజుల ప్రభావాతిశయవర్ణనము చేయఁగూడదని మాయాశయ ము కాదు. కాని కేవలమానుషప్రకృతి ననుసరించి కథావస్తువును గల్పించు పట్టులందు దేవతోచితవ్యాపారనిబంధనము తగదు. దేవప్రకృతులందె దివ్యౌ చిత్యము శోభించును. కేవలమానుషుల కుచితము గాదు. దివ్యమానుషప్ర కృతి గలనాయకునికథయం దుభయవిధౌచిత్యమును వ్యాపారసంయోజనము చే నేర్పఱుపవచ్చును. పాండవాదిదివ్యమానుషప్రకృతులయం దుభయవిధౌ చిత్యమును యోజించియుండుట ప్రసిద్ధమె- ప్రసిద్ధకథలయం దాయాప్రకృతు ల పూర్వచరిత మితిహాసపురాణాదులయం దెంతగా వర్ణింపఁబడినదో, తావ న్మాత్రము వర్ణించుట చరిత్రానురోధమున వారి కనుగుణముగనె యుండును. సాతవాహనాదులు కేవలమానుషులయినను వారివర్ణనమున, నాకలోకగమ నాదులు లోకసామాన్యము లయినను బృహత్కథాదులందు వారిచరిత మట్లె యుండుటచే, వానివర్ణనమున ననౌచిత్యము లేదు. అట్టిపట్టులఁదు వర్ణన మట్లు లేకున్న నాయకున కనౌచిత్యము నాపాదించును. కవులకావ్యము రసవంతము కావలయునన్న నౌచిత్యమె మూలము, రసము భగ్నమగుట కంతట నౌచిత్య నాశమె హేతువు. కావుననె నాటకమునందుఁ బ్రబంధప్రఖ్యాతేతివృత్తము నె గయికొనవలయు నని యు, ప్రఖ్యాతుఁడు నుదాత్తుఁడు నగు నాయకుఁడె

యవశ్యస్వీకార్యఁ డని యు భరతశాస్త్రము చెప్పుచున్నది. అట్లు గయికొనినచో నాయకుని యౌచిత్యానౌచిత్యములవిషయమునఁ గవి భ్రమప్రమాదములకు లోను గాకుండును. అప్రసిద్ధనాయకున కుత్కర్షను గలిగించుటకై సప్తార్ణవలంఘనాదుల వర్ణించిన నవి సహృదయుల కసంభావ్యములుగ ననృతములుగ దోఁచును గావున రసభంగము వాటిల్లును. కాన శ్రోతలకు స్వరసవాహిని యగు ప్రతీతిభంగము కలుగనంతవఱకె వర్ణించుట యుచితము. ఇట్టిలోకాసామాన్యవ్యాపారములు కల్పితనాయకున కుత్కర్షను దీసికొనిరాఁజాలవు గాన నాటకాదులం దుత్పాద్యవస్తువును గూర్పరాదు.

ఉత్సాహాది స్వభావవర్ణనమున నె యీదివ్యమానుషౌచిత్య పరీక్ష యవసరము గాని రతిశోకాదుల విషయమునఁ గాదు. భారతవర్షమున కుచితమగు నడవడికతోడనె దివ్యులకుఁగూడ రతి వర్ణింపఁదగును. కల్పితేతివృత్తమును వర్ణించినప్పుడు కవి నాయకున కుత్సాహాదులను వర్ణింపక రత్యాదుల వర్ణించినఁ గావ్యము సరసముగానుండును, అని తలంచుట యుక్తముగాదు. ఆరతివర్ణనమునఁగూడ నౌచితి నతిక్రమించినచో దోష మెక్కుడుగా నేర్పడును, ఉత్తమప్రకృతి యగునాయకుని శృంగారమును నధమప్రకృత్యౌచిత్యమున వర్ణించినఁ గవి యుపహాస్యుఁ డగును, అదియుఁ గాక భారతవర్షమునఁ గూడ నొక్కవిధ మగు ప్రకృత్యౌచిత్యము లేదు. భారతవర్షమున నుత్తమనాయకు లగురాజులు మొద లగువారివిషయమున శృంగార మెట్లు వర్ణింపఁబడునో యారీతినె దివ్యులవిషయమునఁ గూడ వర్ణింపఁదగును. ప్రసిద్ధనాటకాదుల నెచటనుగూడ రాజాద్యుత్తమప్రకృతులవిషయమున గ్రామ్యశృంగారము వర్ణింపఁబడలేదు గాన దేవతలవిషయమునఁ గూడ నీయనౌచిత్యమును బరిహరింపవలయును. కొంద ఱీవిషయమున నిట్లు శంకింతురు.

"నాటకాదు లభినయప్రధానములు గాన నభినయము సంభోగశృంగారవిషయమున బ్రసక్తింప దనుట నిర్వివాదము. అందుచే శృంగారవిషయమున నౌచిత్యవిచార మనవసరము." అనుటయు యుక్తముగాదు. సంభోగశృంగారము గన్నులఁజూచుట యసహ్య మయినట్లె చెవుల వినుటయు నసహ్యమె. అందుచే సంభోగశృంగారవిషయమునఁ గేవల మభినయమె కాక కావ్యము నసహ్యమె. కావున నాటకములందుఁ గాని కావ్యములందుఁ గాని యుత్తమప్రకృతు లగురాజాదుల కట్టివారె యగునాయికాదులతోడ గ్రామ్యశృంగారవర్ణన

మనుచితము. అట్టిది మాతాపితరుల సంభోగమువలె మిక్కిలియసహ్యము. ఇట్లె యుత్తమ దేవతలవిషయమునఁగూడ గ్రహింపఁబడును. సంభోగశృంగారమునకు సురతమె కాక పరస్పరప్రేమదర్శనాదిరూపము లగుచాలప్రకారములు గలవు. వాని నుత్తమప్రకృతివిషయమున నేల వర్ణింపరాదు? కాన నుత్సాహమునందువలె రతియందుఁగూడఁ బ్రకృత్యౌచిత్య మావశ్యకము. ఇట్లె విస్మయాదులందుఁగూడ నెఱుఁగునది. ఇట్టిశృంగారవిషయముల మహాకవులుగూడఁ బరిశీలింపక వ్రాసియుండుట లక్ష్యములఁ గన్పట్టుచున్నది. అది దోషమె యయినను, వారిసామర్థ్యవిశేషమున నది భాసించుటలేదు.

అనుభావౌచిత్యము భరతాదిగ్రంథములందుఁ బ్రసిద్ధమె. అయినను గవి భరతాదిశాస్త్రమర్యాదను జక్కగాఁ బరిశీలించుచు మహాకవిప్రబంధముల బాగుగాఁ బర్యాలోచనము చేయుచుఁ దనప్రతిభానుసారముగ నవహితుఁడై విభావాద్యనౌచిత్యమును బ్రయత్నపూర్వకముగాఁ బరిహరింప వలయును. ఔచితీసహితముగ స్వీకరించిన నుత్పాద్యకథ యైనను రసవ్యంజక మగును. ప్రాకృతజనులు రసవంతము లనుకొనువివిధము లగుకథలునితిహాసాదు లెన్ని యేనున్నను విభావాద్యౌచిత్యము గలకథాభాగములనె స్వీకరించుట యుచితము. కవి కల్పితకథయం దత్యంత మవహితుఁడై యుండవలయును. అచటఁ గొంచెపుదోస మున్నను గవి యవ్యుత్పన్నుఁ డనుసంభావన యేర్పడి తీరును.

"ఊహ నుత్పాద్యవస్తువై యొప్పుచుండు
కథశరీరమ్ము రచియించువిధమునందు
రసతరంగమ్ము లంతట నెసఁగి రుచిర
తమముగాఁ దోఁచునట్లు చేతయె విధంబు."

ఈరసవ్యక్తీకరణవిషయమునఁ జక్కగా విభావాద్యౌచిత్యానుసరణమె యంతట నుపాయము. ఈయౌచిత్య మిదివఱకె చూపఁబడినది.

మఱియు సిద్ధరసములను ప్రఖ్యాతినొందిన రామాయణాదుల కథాశ్రయము లగునితిహాసార్థములతోడ స్వేచ్ఛగూర్పరాదు. అనఁగా వానిలో నితివృత్తము నవలంబించి కావ్యనిర్మాణ మొనర్చునపుడు కథవిషయమున మార్పులొనరింపరాదు. ఒక్కొకచో స్వేచ్ఛను గూర్పవలసివచ్చినను నది రసవిరోధి మాత్రము కాఁగూడదు. కాళిదాసు శాకుంతలములో దుర్వాసశ్శాపవిషయమున స్వేచ్ఛనుపయోగించినను మూలప్రసిద్ధ మగుశృంగారవిరోధి గాఁ గూర్ప

లేదుగదా! ఆస్వేచ్ఛ వియోగసంపాదనవ్యాపకముగ శృంగారపరిపోషకము గనె యున్నది. విప్రలంభ మున్నంగాని శృంగారమునకుం బుష్టిలే దనుట యందఱకువిదితమె. ఉత్తరరామచరితమున భవభూతి యొనరించినమార్పు లన్నియుం గరుణరసము నుద్బోధించి విజృంభింపంజేయునవె.

ఇతిహాస మెచ్చట నైన రసాననుగుణముగా నున్న దానిని వీడి యభిమతరసాభివ్యక్తి కనువగు కథ నూహించి యది గూర్పవలయును. పారిజాతాపహరణాదులందు రసానుగుణముగం గల్పన యున్నది గదా! కవి ప్రబంధముల నిర్మించునపుడు సర్వవిధముల రసపరుం డగుట యావశ్యకము. అప్పు డితివృత్తమున రసాననుగుణ మగునేర్పా టున్నచో దాని భంజించియైన స్వాతంత్ర్యముగాం గథాంతరము నేర్పఱుపవలయును. ఇతిహాసములవలననే కథ తెలియును గాన నితివృత్తమాత్రమును మరలు వ్రాసినం బ్రయోజన ముండదు గదా! ప్రబంధము రసవ్యంజకము గావలయునన్న ముఖ్యముగాం జెప్పంబోవు దానిని గమనింపవలయును. ముఖ ప్రతిముఖ గర్భావమర్శనిర్వహణము లనుసంధులనుగాని యుపక్షేపాదిసంధ్యంగములం గాని రత్నావళియందువలె రసవ్యంజనము నభిలషించియె కూర్పవలయును. శాస్త్రమును బాటింపవలయును గదా యని కూర్చుట యుచితము గాదు. వేణీసంహారద్వితీయాంకమునం గవి ప్రతిముఖసంధ్యంగ మగు విలాసమును గూర్చినాండు. భరతమునిమతము ననుసరించుటను మాత్రమె యపేక్షించి యీవిలాసము గూర్చంబడినది. ఇదిప్రకృతమగు వీరరసమున కనుగుణము కాదు గదా! కాన నిట ననౌచిత్యమున రసభంగ మేర్పడుచున్నది.

అవసరము ననుసంచి రసోద్దీపన ప్రశమనము లుండినం బ్రబంధము రసవ్యంజకము కాంగలదు. ఈవిషయమున రత్నావళి యుదాహరణము— మఱియు నారబ్ధవిశ్రాంత మగునంగిరసము ననుసంధించుటయు రసవ్యంజకము. తాపసవత్సరాజ మిందుదృష్టాంతము.

ప్రబంధవిశేషము లగునాటకాదులు రసవ్యంజకములుగ నొనర్పవలయునన్న నీవిషయమును ముఖ్యముగా గమనింపవలయును. అలంకారములం గూర్చుసామర్థ్య మెంతయున్నను గవి వానిని దగునట్లుగనె కూర్పవలయును. ఒక్కొకయెడ నలంకారనిబంధనమున సామర్థ్యము గలకవి యావ్యసనమువలన రసబంధము నుపేక్షించి ప్రబంధము నారంభించును. తదుపదేశమునకై యిట్లు

చెప్పవలసివచ్చినది. అలంకారబంధమునందే దృష్టి నుంచి రసము నపేక్షింపక ప్రబంధముల నిర్మించినకవు లనేకు లున్నారు.

ఉ. తెప్పల జారుతల్పులిసిరింతలువారెడు చూపు గుంచియుం
    ద్రిప్పె తళుక్కునం దెఱచి తిన్ననిమోమునఁ గాయువెన్నెలల్
    ముప్పిరిగొన్న వెంట్రుకలు మూసిన సిగ్గసియాడఁ బ్రీతి నీ
    వప్పరమేశుఁ జూచి తను వర్థము గొంటి పొసంగ నంబికా.

(అంబికాశతకము, రావిపాటి త్రిపురాంతకుఁడు) ఇందు మొదటిపూ పకము రసవ్యంజకము గాదు. ఇఁక నపరిహార్య మగు నిదియొకటి. కవి తాను వర్ణించుదానిని రసోద్బోధనసమర్థముగఁ జేయవలయును. కాకున్న నతనికృ మకుఁ బ్రయోజన ముండదు. తనకావ్యము తా నేరీతి నిర్మించిన రసవ్యంజక మగునో యావిధానమును బాగుగ నెఱుంగవలయును. రసమనునది సామాజి కుల చిత్తవృత్త్యాత్మకము. మనయీ భారతదేశవాసుల కెట్టిసంఘటనము లెట్టి వర్ణనములు రసోద్బోధకము లగునో యెఱుంగవలయును. మనదేశమునందు గ్రంథములను వ్రాయుట యన భారతీయులకె కాని పాశ్చాత్యులకుఁ గాదు. అందును దేశభాషలయందు వ్రాయఁబడుగ్రంథము లాభాషల నెఱుఁగనివారి కుపయోగించునవి కావు. రసికుల కాదరము గలుగునట్లు వర్ణనము లున్న నె గ్రంథములు రసవ్యంజకములు కాఁగలవు. కాని యవివాహితు లగుస్త్రీపురు షు లిద్దఱు నాయంకాలమున సముద్రతీరమున సంచరించి రని, యుద్యాన విహారము సలిపి రని, యేకాంతమున సంలపించి రని వర్ణించిన నవి భారతీయు లకు రసోద్బోధనసమర్థములు కాఁజాలక వెగటును బుట్టించుటయ గాక వై ముఖ్యమును గలిగించును. అట్టివర్ణనలు పాశ్చాత్యదేశవాసవాసనావాసితాంతః కరణులకు రుచించుఁగాక ! పవిత్రభారతవాసులకుఁ గాదు. అందుచే మన గ్రంథములు మనకనుగుణముగ నుండుటకే కవి ప్రయత్నింపవలయును.

ఇట్టిరచనావిధానముల నింకను సరసహృదయలోకము సముచితముగ నాలోచించి కావ్యరచనకుఁ దొడంగిన నారచన సర్వసమాదరణీయమగును.

# కడుపుతీపు.

పి. అన్నాజీశర్మగారు.

---

క. నెఱిషోడశవర్షాయుః, పరిమాణు మృకండుతనయు బ్రతికించి, యముం
గరువంబణంచిన శంభుని, స్థిరకరుణన్నేను "కడుపుతీ"పనియొంటిన్.

మృకండుఁడు:—

శా. గౌరీనాథునిగూర్చి ఘోరతపముం గావించి నిన్గాంచి నా
కారుణ్యాబ్ధి విధించె నీ వాఁగి మనంగా షోడశాబ్దంబు లే!
యారీతిం బదునేనువర్షములప్రాయంబిప్డు డాటన్ వివ
ద్వారాశిన్ దరిగానలేమి విలపింపన్ హేతువౌ పుత్రకా! ౧

శా. ఖద్యోతాశ్వములన్ రయోద్ధతుల వెక్కంబెక్కు నీసంపదల్
విద్యుత్తుల్యము లింతఁగాఁగనె సమాప్తిన్ షోడశాబ్దమ్ము లా
రాధ్యుండౌ హరునాన, యింకిటను మాప్రారబ్ధ మెట్లున్నదో?
విద్యానాథకృతాశిషంబు లొగి రీతిం దప్పునో తప్పవో? ౨

ఉ. వచ్చియురానిమాటలను బల్కుచు నంకముఁజేరి నవ్వుచుం
జెచ్చెరగద్దమంటఁ జిఱుచేతులఁ జాఁపుటఁ గాంచి కాలముం
బుచ్చుమనుంటి మీఁదనుకఁ బోవుచునుంటివె? మాదుకడ్పునం
జిచ్చును బెట్టి మాకిఁకను జెనవాఁడవె యో కుమారకా! 3

చ. వనరుహవైరిబింబమున వంకలుదిద్దఁగఁజాలి వాక్సుధల్
పెనఁగొన నెచ్చుతగ్గు లరవీసము గానఁగరానిసత్కళల్
గని చిఱునవ్వువెన్నెలలఁ గాయుచు నస్మదపుత్రశోక మన్
ఘనతమసంబు వాపినముఖేందుఁడు మాకిఁక దూరమయ్యెడున్. ౪

గీ. సంతతిమె దొల్తలేక నిశ్చింతనుండ, వచ్చెఁగా కేరికిని జరాభారమునను
నక్కటా! పుత్రశోకంబు ననుభవింప,నగునె? మరణాంబెకొంతమే లనఁగవచ్చు!

మార్కండేయుఁడు:—

ఉ. వేదవిదుండ విట్టియవివేకము కూడునె దేహధారికిన్
మేదినిఁ జావుఁబుట్టుకయునిక్కము, నైజమెకా! నలాది భూ
మీధవు లెందటేగిరి? సమిద్ధతపోధను లెందటేగి రీ
మాదిరిఁ గంట నీ రిడ సమంజసమా? జనకా! వచింపుమా! ౬

శా. ఏలా చింతిల నింతమాత్రమున కీ ప్లేముప్పొ వాటిల్లె నీ
లీలం బ్రాకృతునట్లు బుట్టగ దివ్యజ్ఞెందం బనేమున్న దా
నాళీకోద్భవుఁ డానతిచ్చినవిధిన్ గౌరీశు నర్చించుచోఁ
గాలుం ద్రోక్షుఁడు గాఁడు సర్వసురసంఘుం బేని నన్దాఁకునే ? ౭

శా. చా వెవ్వారికి దాఁటరానిదికదా చర్చింప నేవేళనో
జీవంబు ల్వ్వడలు న్నిజంబు గిరిజాసీమంతినీచిత్తరా
జీవాలోలమిళిందు నాహరువరశ్రేష్ఠంబునంబుట్టి వా
ద్దేవుంగంటి నిఁకేమికావలయు ముక్తిం గందు నిశ్చింతగన్. ౮

మరుద్వతి:—

చ. మఱిమఱి లెవ్వరేని నిను మచ్చిక ము ద్దిడనీయుమన్న స
మ్మతి మతిలేక నీబదులు మాటలు పల్కినయట్టి నేన యీ
విత మతిధీరచిత్తనయి ప్రేముడి యంతయు వీడి మృత్యుదే
వత కతిథింబలెం బనుపఁ బాల్పడ నాయెఁగదా కుమారకా! ౯

సీ. తమ్మిపూరేకుమొత్తముల కొకట విశాలతఁజూపు లోచనయుగంబు
కొదమఱుమ్మెదపిండు నదలించుముంగురుల్ వ్రాలివిలంబించుఫాలతలము
సంతతపరిహాసచంద్రికల్ ప్రసరించు మండితముఖచంద్రమండలంబు
మృదుమృణాళావళిం గదిమి మోఁకాల్మిఁదికిం జాఱెడివాఱు కేలుదోయి
పల్లవంబులఁ గోమలత్వమున గెలిచి, సాగి చలిచీమఁ ద్రొక్కని చరణయుగము
నక్కటక్కట యెటు మఱపగును నాకు, నెట్లు జీవింతు నింక దిక్కేది బుజుత!

ఉ. నీదుదయాసమృద్ధిని జనించెను మామకగర్భము న్నభో
వీథి సుపుత్త్రశీతకరబింబము గాంచె నజాపితామృతం
బీదట కాలరాహుభుజగేంద్రము దంష్ట్రిలుపాచె నింగఁ బ్రా
పేది మదీయసూను విడిపింపుము నీమకుమారునింబలెన్. ౧౧

ఉ. నీకనిశంబుభక్తుఁడు, మునిస్తవనీయుఁ డనూన సద్గుణా
నీకవిరాజితుండు గరుణింపఁగ జా గిటు సేయనేల దో
షాకరుఁడంచు నెంచినను సమ్మతమే తగనిల్పు నీవు దో
షాకరుఁ దాల్పవే తల నజస్రము నీకివి క్రొత్తలే? ప్రభూ ! ౧౨

మార్కండేయుఁడు:—

శా. శోకింపం బనిలే దిఁకేక్షించినను నెచ్చోఁ దప్పునే చావు నే
మీకుం జెప్పఁగలట్టివాఁడనొకొ? భూమీనిర్జరుల్ దేవతా
నీకశ్రేష్ఠుఁ డసత్యమాడుదురె? క్షోణీచక్రమల్లాక్షి నా
శ్రీకాష్ఠాబ్జులు దప్పినన్ గతులు వేఱే చింత లేలా యిఁకన్? ౧౩

మ. గిరిజానాథ తదార్చనారతున నక్షీణక్షితిన్ శ్యాములా
వరుఁడన్నన్ భయముండ దించుకయు నావాక్యంబు లాలించి సు
స్థిరధైర్యంబు వహింపుఁ డేటికిటు చింతింపంగ నాయాన సుం
దరయన్ సంతతసంకటాత్ములకు ధైర్యంబె శరణ్యం బగున్. ౧౪

నారదుఁడు:—

మ. హరుఁ డార్తావనుఁ డంగజాంతకుఁడు నీహారాద్రిరాట్పుత్రికా
వరుఁ డుర్వీధరకార్ముకుండు కరుణాపాథోధి మృత్యుంజయుం
డురగానీకవిభూషణుండు నుడురాట్సూనావతంసుండు సిం
ధురచర్మాంబరుఁ డంధకారి సురవంద్యుం డెంతయుఁ బాలకా! ౧౫

క. అలిగినచో విధినైనం, దలఁద్రుంచు నిజంబు మీఱ దయదలఁచినచోఁ
దలఁచాల్చు నెపుడు వేడుక,లలరగురుద్రోహినైన నతఁడో పుత్రా.

మ. పురవిధ్వంసిపదారవిందయుగళీపూజావిధానోల్లస
ద్వరమార్తాండమహోగ్రచారుకిరణవ్రాతంబుచేఁ గాక యో
నరనాథోత్తమపుత్ర! నీయముని నన్యాయక్రియాయుక్తి దు
స్తరవిస్తారనితాంతఘోరకలుషధ్వాంతౌఘము ల్వాయునే? ౧౬

మ. బలభిన్మౌళిమణిప్రభావిసరశుంభద్దివ్యపాదద్వయుం
బలవద్వైరినిశాచరాంబుదజగత్ప్రాణున్ ఫణీంద్రాంగదున్
నలినాప్తేందుకృశానులోచను సువర్ణగ్రావకోదండు నిం
గలుషారిం గలుషాత్ముఁ డాతని కెఱుంగన్ శక్యమే బాలకా! ౧౭

ఉ. కావున నీవు మాతృజనకాదులయం దిఁకఁ జింతమాని గౌ
రీవరుఁబోలుదైవ మిల లేఁడని రూఢిగ నమ్మి చేరి యా
పావనగౌతమీతటిని భద్రతపం బొనరింతువేని రా
జీవహితార్భకుండు నినుఁజేరఁ డిఁకేటికి సంశయింపఁగన్. ౧౮

మార్కండేయుఁడు:—

చ. మునులు మహానుభావులు నమోఘవచస్కులు మీర లిట్లు దీ
వన లిడి రంతెగా కటులె వార్ధకుఁడుం బలికెఁ మత్తే నొన
ర్చునది తపంబు సర్వరిపుసూదనుఁడౌ నిటలాక్షుఁ గూర్చి య
య్యనఘుఁడు తేటచూడఁగలఁడే నను డగ్గఱి సంయమీశ్వరా ! ౨౦

నారదుఁడు:—

చ. తప మొనరించు నిన్నుఁ గని తానొక శాసనకర్త పోలికం
దపనతనూజుఁ డెక్కుడుమదంబున నిన్వెరఁగందఁ జేయు బల్
కపటి యతండు లేనియధికారముఁ జూపును గాని నీ వ్యథ
ర్యపడక బుద్ధిఁజెప్పుము మ తాతనితీట వదల్చు నీశుఁడే. ౨౧

శా. ఉద్యోగాంధతఁ గన్నుఁగానక నితాంతోద్రేకుఁడై మత్తుఁడై
ఖద్యోతాత్మజుఁ డొక్కపెట్టున మహాగాంభీర్యముం జూపు నా
మద్యాసక్తుని గాంచి భీతిలెదు సుమ్మా ! పుట్టి మున్నుం జుమా
యాద్యంతంబుల నొక్కచందమున ధైర్యంబూని వర్తింపుమా ! ౨౨

మృకండుఁడు:—

గీ. పలుకువెలఁది మగండును బాడబులును, నిన్నుఁగూటిచి పలికినవన్ని నిక్క
వంబులై మిత్తినుండి కాపాడ మటల, మమ్ముఁజేరి శతాబ్దముల్ మనెదుగాక!

మరుద్వతి:—

సీ. ధైర్యంపులక్ష్మి నీదండ నిల్చునుగాక గుండెతాల్పుఁగని మది చెదరనీక
భానునిశాకరుల్ పాలింత్రుగాక యహర్నిశల్ తాపమ్ము నందనీక
గంగాభవాని నిన్గరుణించుఁగాక శైత్యము పైత్యమంగమం దంటనీక
ధారుణీ దేవి నిన్ దయఁ జూచుఁగాక కోమలశరీరము శ్రమనలయనీక
యాశ్రితావనపరుఁ డాగమాంతచరుఁడు
హిమధరాధరజావరుఁ డిందుధరుఁడు
హరుఁడు రక్షించుఁ గాక దీర్ఘాయు వొసఁగి
నిన్ను; నేను బతివ్రతనేని గుఱ్ఱ !!! ౨౩

# విన్నపము.

ఘండికోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, నరేంద్రపురము.

(విశాఖపట్టణములోఁ బరిషత్సభలోఁ జదివినది.)

---

పూర్వము మనయాంధ్రదేశమున శ్రీకృష్ణరాయాది విద్వత్ప్రభువుల చేతను పోతనామాత్యాది కవిపుంగవులచేతను బోషింపఁబడి సులలితపదగుణాలంకారభూషిత యై ప్రకాశించుచు నీమధ్యకాలంబున దుర్దైవముచే నట్టి విద్వత్ప్రభువులు లేమిం జేసి కొంతవఱకుఁ గృశించియున్న యాంధ్రభాషాయోషను మరల మనయాంధ్రలోకము, ఆంధ్రసాహిత్యపరిషదాదిసాధనములచేఁ బరిపుష్టాంగినిగాఁ జేయుట కుద్యమించుట యత్యంతము శ్లాఘనీయము. ఇట్లే తత్తద్దేశములలోఁ దత్తద్భాషాంగనల యభివృద్ధికై తత్తద్దేశీయు లందఱును దగుప్రయత్నములను జల్పుచుండి రనువిషయము మహాశయు లందఱకును విదితమే. సత్కవివదనారవిందనిస్సృతయగు వాగ్దేవత సర్వభాషలలోను సమరసయే కాని యాంధ్రవాణిమాత్రము విశేషముగా సర్వాంగసుందరి యని చెప్పక తప్పదు. ఈమె కుండు సర్వాంగసౌందర్యమునకుఁ గారణము సకలలోకైకసంసేవ్య యగుగీర్వాణవాణితో నత్యంతపరిచయము కలిగియుండుటయే. ప్రాయశః సరసకవివరులని సుప్రసిద్ధినొందిన ప్రాచీనాంధ్రకవిపుంగవుల గద్యపద్యాత్మిక యగుకవితాకన్య గీర్వాణవాణీసాహచర్యముచేతనే సకలజనమనోహారిణి యగుచున్నది. ఇంచుక సంస్కృతభాషాపరిచయము కలిగియో కలుగకయో కేవలాంధ్రభాషాజ్ఞానమాత్రమే కలిగియున్న కొందఱగు నాధునికులచే రచియింపఁబడిన యాంధ్రగ్రంథములఁజూచినచోఁ బాఠకమహాశయులకు సర్వమును విదితము కాఁగలదు. కాన సంస్కృతభాష సకలదేశభాషలకును జనని యై యున్నది. ఏతత్ఖండమందలి దేశభాషలకే కాక పాశ్చాత్యదేశభాషలకుఁ గూడ నిదియే మాతృదేవత యని సర్వజ్ఞుండగు వేదవ్యాసమహర్షి భవిష్యపురాణంబున, "ఫాల్గునా త్ఫిబ్రవర్యభూత్" ఇత్యాదిశ్లోకములచే నిరూపించెను. ఏభాషాబాలికకు సర్వధా జననీసాహచర్య ముండునో యట్టిబాలిక పరిపుష్టాంగియై సర్వజనకమనీయయై యుండుట సుప్రసిద్ధముకదా? అట్టితఱి సర్వదేశములలో సర్వభాషాపోషకమండలము లుద్భవించుచున్నవి కాని మాతృభాషాపోషక మండలము లెచ్చటను గానరావు. ఉత్తశమున నుత్తశసాహిత్యపరిషత్తు,

ఉత్తరదేశమున హిందీసాహిత్యసమ్మేళనము, ద్రవిడదేశమున ద్రవిడసాహిత్యసమ్మేళనము. ఇట్లే సకలదేశములలోను సకలభాషాసాహిత్యసమ్మేళనము లున్నవి కాని, యేభాష సకలదేశభాషలకు నాలవాలమో యేభాషలో మన కవశ్యకర్తవ్యము లగు సంధ్యావందనాద్యశ్వమేధాంతసకలశ్రౌతస్మార్తకర్మలు మహర్షులచేఁ బ్రతిపాదింపఁబడెనో సకలధర్మబ్రహ్మబోధకమై సర్వప్రమాణశిరోమణి యగువేదమే వాగ్రూపమైనదో శిల్పనీత్యాచారవ్యవహారాది సకలవిషయబోధకము లగుస్మృతీతిహాసపురాణతంత్రాగమకావ్యాదు లే భాషలో విలసిల్లుచున్నవో, యట్టిసంస్కృతభాషను బ్రధానముగాఁ బోషించుసంఘము లత్యంత విరళము లైనవి. కాన నోపండితశిరోమణులారా! ఈయాంధ్రసాహిత్యపరిషత్తునందు సంస్కృతసాహిత్యమునకుఁ గూడఁ గొంతయవకాశము నిచ్చి యీ పరిషత్తులో దానినిఁ గూడ నొకప్రధానశాఖగా నెంచి యాంధ్రభాషాభివృద్ధికై యెట్లు విమర్శనములు వ్యాసములు గ్రంథరచనములు భాషాంతరీకరణములు మొదలగునవి చేయుచుందురో యట్లే సంస్కృతభాషలోఁగూడ వ్యాసవిమర్శనగ్రంథరచన భాషాంతరీకరణాదులం జేయించుచు నీసంఘమునకు "సంస్కృత" అనుపదమునుఁ గూడ నామాదియందుఁ జేర్చి యుభయభాషలు వృద్ధి నొందుకార్యముల నెఱవేర్చుచుండుట కీపరిషత్తును సవినయముగాఁ బ్రార్థించుచున్నాఁడను.

అట్లు జరిగించినచో నీపరిషత్తు సకలభాషాసాహిత్యపరిషత్తులలో నగ్రస్థానము నలంకరింపఁగలదు. మఱియు నీపరిషత్తునకును నాంధ్రవిశ్వవిద్యాలయాధికారులకునుఁ గొంతసంబంధ ముండును, గాన, నాంధ్రదేశమునందున్న సకలవిద్యాలయములలోను హిందూమతధర్మబోధకము లగుగ్రంథములను పాఠ్యగ్రంథములనుగా నియమించుట కీసభవారు ప్రయత్నింపఁ బ్రార్థితులు. కలికాలవశమున నాధునికవిద్యార్థులకుఁ బాశ్చాత్యమతవ్యామోహ మధికమయి స్వమత మేదియో స్వధర్మము లేవియో యెఱుఁగక స్వమతధర్మముల విడనాడి కాలేకాలే ధర్మతత్పరు లేమైన ధర్మముల బోధించినను వానిని బరిగణింపక కుయుక్తులచే వానిని ఖండించుచు నైహికాముష్మికసుఖదూరులగు ననేకుల నిక్కాలమున మనము చూచుచున్నారము. ఇందులకుఁ గారణము స్వమతధర్మజ్ఞానాభావమే, కాన నోమహాశయులారా? ఎంతవిజ్ఞానమును సంపాదించినను దానిఫల మైహికాముష్మికసుఖముల కొఱకుఁగదా? అది లేనిచో నీవి

జ్ఞానమున కేమిప్రయోజనము ? కాన నట్టి యైహికాముష్మికసుఖజనకమగు విజ్ఞానము లోకమున కెట్లు లభించునో యట్టికార్యోపాయముల నాలోచించి పట్టణములలోఁ బల్లెలలో నుండుపాఠశాలలలో స్వమతధర్మబోధకము లగుగ్రంథముల నవశ్యపఠనీయములనుగా విద్యాశాఖాధికారులద్వారా నియమింపఁ జేయుట యీయాంధ్రసాహిత్యపరిషత్తునకు ముఖ్యకర్తవ్యమై యున్నది. అట్లు చేయించినచో హిందూమతధర్మముల నిలిపి యాధునికులను మహామోహాంధకారమునుండి యుద్ధరించిన మహాపుణ్యముఁ బొందఁగలరు. మఱియు నీతిమతబోధకములగు నాపాత్యగ్రంథములు సంస్కృతభాషనుండి యాంధ్రీకరింపఁబడినవియును, కేవలసంస్కృతవాఙ్మయములును గూడ నయియుండవలయును. అందువలన నీసంఘమువా రత్యంతదీక్షతో సంస్కృతమున నుండునీతిమతగ్రంథముల నాంధ్రీకరింపఁజేయుట కుపక్రమింపఁ బ్రార్థితులు. అట్టి యాంధ్రీకరణాదులకు సంస్కృతసాహితీసంపాదన మత్యావశ్యకము, సంస్కృతభాషాజ్ఞానమధికముగా నుండినంగాని గీర్వాణవాణీభావంబులను జక్కఁగాగ్రహించి గ్రంథముల నాంధ్రీకరించి యాంధ్రలోకమునకు మహోపకారముఁ జేయుట శక్యము కాదు. అనేకతంత్రజ్ఞానముండనిచో వాగ్దేవతాస్వరూపాశయావబోధమత్యంతదుర్ఘట మని ఋగ్వేదమున సరస్వతీసూక్తములో 'ఉతత్వఃపశ్యన్ = సువాసాః' అనుఋక్కు బోధించుచున్నది. కాన సంస్కృతభాషాజ్ఞానము నత్యధికముగా నార్జించిన మనుజుఁడు గ్రంథముల వాస్తవాభిప్రాయములను గ్రహించి యనేకగ్రంథముల నాంధ్రీకరించి, యాంధ్రలోకమునకు మహోపకారముం జేయఁగలఁడు. కాన నోసభ్యమహోదయులారా ! మన కేగ్రంథ మెప్పుడు పుట్టిననేమి ? ఏకవి యెప్పటివాఁ డైననేమి ? ఇఁకఁ బ్రస్తుతకర్తవ్యాంశము లన్ననో, 'భాష యభివృద్ధి నొందు టెట్లు ? తద్వారా లోకమునకు విజ్ఞాన మెంతవఱకుఁ గలుగుచున్నది ? సంస్కృతభాషలో నున్న యేయేయపూర్వవిషయములు భాషాంతరీకరణమూలముగా లోకమున కవగతము లగుచున్నవి ? దానివలన లోక మెట్టిఫల మనుభవించుచున్నది ?' ఇత్యాదివిషయములను సర్వదా విమర్శించుచు నీయుభయభాషాజ్ఞానద్వారా లోకంబునకు సద్గుణంబు లలవడునట్లు యత్నించుచు దేశము నుద్ధరించుదురు గాక యని జగదేకపండితోత్తంసు లగు నీసభాధ్యక్షులను సకలభాషాపాండిత్యధురీణు లగు నీయాహ్వానసంఘాధ్యక్షులను, ద్రవ్యాదిమూలకముగా నీసంఘమునుఁ బోషించు విద్వత్ప్రి

భువులను, నానా క్లేశములను సహించుచు భాషాసేవఁ జేయుచున్న సకలశా
స్త్రనిష్ణాతులను సహస్రప్రణామ పూర్వకముగాఁ బ్రార్థించుచున్నాఁడను.

శ్రీమద్విక్రమదేవవర్మనృపతి స్సంపోషకో యత్రవా
తాతోపాభిధ సుబ్బరాయ విబుధోత్తంసస్సభాధీశ్వరః
శ్రీలక్ష్మీనరసింహపండిత వరశ్చాహ్వానసంఘాధిపః
సభ్యా స్సర్వకళావిలాసచతురా స్సైషాసభావర్ధతామ్.

స్వస్త్యస్తు.

నిజధర్మముల మాని నిష్ఠావిహీనులై హీనులై యుపకారమెఱుక లేక
భగవద్ధరామరభక్తిఁ దూరులై దూరులై సుకృతికి ద్రోహకలిత
మానసంబుల నభిమానప్రసంగులై సంగులై యనృతవాచాళులైన
కలిమానవులఁ ద్రుంచి కాలావశిష్టుల శిష్టులఁ బ్రోవ విశేషమహిమ
వఱల నసమానమూర్తి వై వారు వేఁడు, వేడుకలనిచ్చి కలికివై వెలయు దేవ
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ ౧౦౦

(11) నీతిదశకము.

గణపతి నుతియింపఁ గల్గు నిర్విఘ్నంబు విఘ్నంబుల కతండు విభుఁడు గాన
గురుని ధ్యానింపఁ జేకూరు సత్కార్యంబు కార్యంబుల కతండు కారణుండు
జనవిభునాజ్ఞచేఁ గొనసాగు ధర్మంబు ధర్మంబుల కతండు దలఁప విభుఁడు
పత్నీసమేతుఁడై పడయు సత్కర్మంబు కర్మంబులకు నధికర్త యగుటఁ
జేరి నిన్నెన్నఁ గల్గు విశేషముక్తి, ముక్తికాంతావినోదసమ్మోది వగుటఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౦౨
వర్ణాశ్రమాచారవాసమే ధర్మమా ధర్మమావర్గప్రధాన మండ్రు
న్యాయభావార్జితంబైనదే యర్థమా యర్థమా రెండవసార్థమండ్రు
ఋతుకాలమునఁ బత్ని నెనయుటే కామమా కామమా మూఁడవనీమమండ్రు
దారీషణాదులఁ దలఁగుటె మోక్షమా మోక్షమా నాలవదీక్షయండ్రు
రీచతుర్విధపురుషార్థసూచకంబు, కంబుభృత్పాణి నీభక్తిఁ గలుగుఁగాదె
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౦౩
కరఁ గన్నతల్లియే పరదైవ మనవచ్చు మనవచ్చు గరుడుని మార్గ మరసి
తండ్రియే సద్గురుతతి మెఱుంగ గనవచ్చుఁ గనవచ్చుఁ బూరునికరణి యశము
తరుణియే పతివిపత్తారక యనవచ్చు నెనవచ్చు బసవాసు నింద్రుతోడ
రమణుఁడే సతికి సర్వస్వ మం చనవచ్చుఁ జనవచ్చు జానకిసరణి దివికి
నిన్ను సర్వోత్తముఁడవంచు నెన్నవచ్చు, వచ్చుగితెలపినవివ్వచ్చుకరణి
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౦౪
తల్లిదండ్రులఁ బ్రోవఁ దలఁచు శాంతనయుండు తనయుండు తగుఁ దులాధారునట్లు
అగ్రజాజ్ఞావర్తి యైనసోదరుఁడు సోదరుఁడు శోభిలు రాముతమ్మునట్లు
వరునెడఁబాయని వదనాంబుజాయత జాయ తనర్చు నచ్ఛాయయట్లు
ఆపద నెడలించు నట్టి సంబంధుండు బంధుండు దగు మద్రభర్త యట్లు

యుష్మదారాధనముగల యురువిశేషి, శేషిదగు భాగవతునట్లు శేషశయన
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౦౫

క్షితి నన్ను మిచ్చి రక్షించు దాతను గన్నఁ దనుఁగన్న తండ్రిగాఁదలఁపవలయుఁ
బాలిచ్చి పెంచిన ప్రజ్ఞామతల్లిని దల్లినిగా నాత్మఁ దలఁపవలయుఁ
గష్టంబు నెడఁ బాపుసునుగ తాకులముతోఁ గులముతోఁ బుట్టగాఁదలఁపవలయు
సన్మార్గమెఱిఁగించు సదయుని దరిఁజేర్చు దరిఁజేర్చు గురునిఁగాఁదలఁపవలయు
భువనభర్తుఁడ వగు నిన్నుఁ బుణ్యదేహి
దేహిపరమంచు విభుఁ డంచుఁ దెలియవలయు
జారుతరమందహాస పోలూరివాస
వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౦౬

కులవృత్తి తప్పక కూర్చుసంపాద్యంబు పాద్యంబు నిడి పెట్టు ప్రాశనంబు
కాయ మస్థిర మని చేయు వ్యాపారంబు పారంబు ముట్టఁగాఁ బలుకుచదువు
లానుపూర్వికకృతంబైనసంబంధంబు బంధంబు వీడిన బలుతపంబు
దీనుల రక్షించు వాని భావిభవంబు విభవంబు గలవాని వితరణంబు
స్వామి భవదంకితంబైన సత్కృతికృతి, కృతినందక సజ్జనవినుతిగాంచుఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౦౭

పరవధూగమనంబు బహుజన్మపముఃయసముదయసుకృతనాశనకరంబు
పరధనహరణంబు చిరకాలసంతతి సంతతిస్ఫుటకీర్తిసంహారంబు
పరజనాన్నాదంబు వరసదాచారప్రచారప్రమేయనివారణంబు
పరదూషణంబు తత్ప్రకృతిసంపాదితాపాదితకర్మ సంపాదనంబు
పరనరాంకితకావ్యంబు బహుళజన్మ, జన్మకృతదివ్యపుణ్యసంచయ హారంబు
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౦౮

ఆత్మార్థమైన సత్యమె కాని వాడనివాఁ డనిమేషభావజ్ఞతుల్యుఁ
డెపుడహింసావృత్తి నెసఁగిన ప్రజ్ఞాని ప్రజ్ఞానిరూఢ తాపససముండు
కటువైన నన్న మీఁగలసత్క్రియాఖ్యాతి యాఖ్యాతిశయ దిలీపాదినిభుఁడు
చనువేళనైన లోఁగనుసంతతధ్యాని తధ్యానితరమనస్తపసిసదృశుఁ
డాపదలనైన హితసపర్యావిభక్తి,భక్తి నినువేఁడువాతండె భాగవతుఁడు,చారు.
చాతృత్వమునకు శాంతము సంక్రమించిన మించినపైఁడి వాసించినట్లు
చదివించుగురువు ప్రాశన మీయఁ గలిగినఁ గలిగిననేయి పాల్గలసినట్లు

పతిభక్తి సౌందర్యవతికిఁ జేకూరినఁ గూడినమణి సానఁదీరినట్లు
సుగుణంబు వ్యవహారశూరునిం బొందినఁ బొందిన పసిఁడి జోడఁ బూనినట్లు
నీదుభజనంబునకుమనోనియతియమర,నమరతతులకుసంతానమబ్బినట్లు
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణమన్నారుకృష్ణ.౧౧౦

జ్ఞానసంప్రాప్తి కాచార్యోపదేశంబు దేశంబు తెన్నేనిఁ దిరిగి కొనిన
జీవనప్రాప్తికి క్షితిపసన్మానంబు మానంబు వదలించు మమత గొనిన
తనసుఖప్రాప్తి కాత్మస్త్రీశీలోలంబు లోలంబు గలిగించు జాలిగొనిన
సుగతిసంప్రాప్తికి సుతుఁడిచ్చుభువనంబు భువనంబుద్రిప్పు లాఘవముగొనిన
భుక్తిముక్తులు గొన భవద్భక్తిగాక,గాక దుస్సంగతిని గొన్నఁగలదె తెలియఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ.౧౧౧

సురుచిరాపస్తంబసూత్రవిప్రాజ్ఞుఁడై ప్రాజ్ఞుఁడై శ్రీపైఁడిపాటికులజుఁ
డై శఠమర్షణయతిగోత్రధర్ముఁడై ధర్ముఁడై సూనృతతపము పెంపు
గనిన లక్ష్మీపతికవిఘనాఘునునకు ఘనునకు సుతుఁడ వేంకటనృసింహ
నామధేయుఁడ భవన్నర్తనచరితంబు చరితంబు నొకసీసశతకకృతిని
జెప్పి యర్పించితి సుధీ విశేషదాని, దాని విని నన్నుఁ గైకొను దైవరాయ
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ.

---

ఇది -బళ్లారిమండలము, హరపనహళ్లిలోని
బ్ర॥ పాలపూఁడి నృసింహశాస్త్రిగారి తాళపత్రగ్రంథమునుండి
సంపాదింపఁబడినది.

# ౪-శ్రీతిరుమలగిరి వేంకటేశ్వరశతకము.

శ్రీమత్తిరుమలనల్లాణ్‌చక్రవర్తి సంపత్కుమార శ్రీనివాసవేంకటాచార్యకవి.

---

(ఏకప్రాసకందములు)

సిరులవలంతిఁ జేర్చిన నీ,యురమున నే నేను నిరత మొనరించెడి భ
క్తిరసప్రార్థనఁ జేర్పుము, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౧

హరి ! పరమాత్మా ! నాదగు, మొర నాలింపుము భరంబె ప్రోచుట నన్నో
పరమకరుణావిలాసా ! తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౨

ధరణీసుతామనోహర ! పరమమునీంద్రార్చితాంఘ్రిపద్మయుగళ ! భా
సురకరుణాసాంద్రా! శ్రీ, తిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా ! 3

సురసిద్ధసాధ్యవిద్యా, ధరకిన్నరయక్షపూజితమనోహరస
చ్చరణారవిందయుగళా ! తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౪

వరణీయకాంతితరణీ ! ధరణీజామానసాబ్జతరణీ ! భూమీ
శ్వరహారనాయకమణీ ! తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౫

నిరుపమగుణధుర్యా ! సా, గరశయనా ! మంగళాంగ ! కరివరదా ! ప్రో
వర మాధవ ! ధరణీధవ ! తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౬

దురితహరణ ! కమలచరణ ! నిరుపమమణిహారి ! యసురనికరవిదారీ !
హరమిత్రా ! నుతిపాత్రా ! తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౭

శరణాగతసంరక్షక, బిరుదాంకితమూర్తి ! భార్గవీమానసపం
కరుహదివాకర ! భాస్వర, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౮

నిరతము నిను సేవించుట, కొఱకై నీకొండ నెక్కి కోరికతో నెం
దఱో వచ్చి మ్రొక్కులిడెదరు, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౯

భర మనక వారిఁ బ్రోచెదు, కరుణాకరమూర్తివౌటఁ గాఠిన్యమునా
తఱి వీడివరము లిత్తువు, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౧౦

కరము ముదంబున వేంకట, గిరిని నధిష్ఠించినావు కృపభక్తాగ్రే
సరులను బ్రోచుచు నుంటివి, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా! ౧౧

గిరిపై నెలకొనుకతనలా, కరము భవచ్చరణభవము గావున భవపా
ఘరహేతుల నొనర్చుచు మము, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౧౨

హరి ! నీకెదురుగఁ గృష్ణా, సరిదంతర మెపుడు నుండఁ జనునని యిట ద్వా
రరహితుఁడ వయి యుంటివి, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౧౩

సురలోకము నీశీర్షము, నరలోకం బౌను నీదు నాభిస్థలి నీ
చరణంబు లధోలోకము, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౧౪

సరసీజాప్తుఁడు, చంద్రుఁడు, నిరతము నపసవ్యసవ్యనేత్రము లహా ! నీ
చరిత మగోచరమయ్యా ! తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౧౫

సురనాథుఁడు వైశ్వానరు, లరయఁగ నీవదనజన్ములఁట మహిఁజూడం
గరువలి ప్రాణోద్భవుఁ డఁట, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౧౬

వరద ! ద్విజరాజవైశ్య, వరకులజులు నీదువదనబాహూర్వంఘ్రుల్
వరుసగ స్థానము గల్గిరి, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౧౭

వరహరి ! సర్వజగముల ను, దరమున నిటికించుకొనిన దంటవు గావా ?
హరసన్నుత ! విభవోన్నత ! తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౧౮

సరివార లేరు లేరీ, ధరలోనం గాన నీపదంబులె నాకున్
శరణంబు లంచు నమ్మితిఁ, దిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౧౯

సిరితోఁ బుట్టువగు మణిన్, ధరించితివి నీగళంబునన్ ముదమున స
త్కరుణాపోషితదీనా ! తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౨౦

దురమున జయింపఁగను నె, వ్వరికిని శక్యంబుగాని వైరిగణములన్
ధరఁ గూల్పవె చక్రమునం, దిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౨౧

అరిభీకరరణరంగా ! పరమేష్ఠినమస్కృతాంఘ్రిపంకజయుగళా !
కరమునఁ జక్రముఁ దాల్చిన, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౨౨

అరిగణమునకైన నీ, పరమపదం బీయఁగల స్వభావముతోడం
బరఁగెడి మంగళమూర్తివి, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౨౩

తరణిసదృశప్రకాశా ! ధరణీజాహృన్నివేశ ! దానవనాశా !
వరకరుణారసపాశా ! తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౨౪

ధరధర్మములన్ విడి నీ, శరణొందిన నఘము వలిచి సంరక్షింపన్
వరద ! ప్రతిజ్ఞం గొంటివి, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౨౫

వరసాధులరక్షింపఁగ, ధరఁ గూల్పఁగ దుష్టతతుల, ధర్మము నిలుపన్
బొరిఁ బుట్టుదు నంటి వహో, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౨౬

గిరులదొరముద్దుఁగూఁతురి, వరుఁడగు ముక్కంటికైన బ్రహ్మకునైనం
దరమే గట్టిగ నినుఁగనఁ, దిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౨౭

గిరిశుఁడు నీ నామముం జే, నిరతము భజియించుచుండ్ విని ర్మలమగున
చ్చరితమ్ము గల్గినాఁడహా, తిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా! ౨౮
గరువముగల రక్కసులను, బరిమాఁజిచి ప్రోవలేదె బ్రహ్మర్షులం
బరమకరుణాత్ముఁడవుటను, దిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా! ౨౯
సురలం జేయవె సంతత, జరామరణరహితులుగను క్ష్మాధర! నాపైఁ
గరుణయు రాదా! చాదా?, తిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా! ౩౦
నిరతము సద్భక్తిని ముని, వరులెందఱో తపముఁజేసి ప్రార్థింపంగాఁ
గరుణం బ్రోతువు వారినిఁ, దిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా! ౩౧
శరనిధిఁజొరి సోమకుసం, హరించి నిగమములఁదెచ్చి యజునకునీవే
గురుఝషరూపధరుఁడవై, తిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా! ౩౨
శరనిధిలోఁ గ్రుంగినమం, దరకుధరము కూర్మరూపధారివగుచు నే
గిరమెత్తి కొనవె వీఁపునఁ, దిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా! ౩౩
కరముబలంబున నసురుఁడు, ధరణినిజుట్టి తనచంకఁ దాఁబెట్టుగొనడం
బరిమార్పవె క్రోడమవై, తిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా! ౩౪
ఉఱిదిన్ హిరణ్యకశిపుని, బరిమార్చితివయ్య స్తంభభవుఁడ వగుచు శ్రీ
నరసింహసంజ్ఞఁ జేకొని, తిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా! ౩౫
కుఱుచవయి యావిరోచను, చిఱుతని బాధించి యాశచీపతికిం ద్రే
మరతిం బట్టముగట్టవె, తిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా! ౩౬
పరశుఘనఘాతములచే, వరుసగ క్షత్రియుల నెల్లఁ బరిమార్చితి వ
ద్దిర! పరశురాముఁడ వనం, దిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా! ౩౭
ధరలో రావణుఁ ద్రుంచియు, సురలను ముదమందఁ జేయుచుఁ బరఁగితే సుం
దర! శ్రీరాముండవనం, దిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా! ౩౮
పరువడి నల్లనిపుట్టము, ధరియించి యదుకులమం దుదయమై నీవుం
బరఁగితి బలరాముఁడునాఁ, దిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా! ౩౯
ధరనధికారము లేక, ధ్వరము చు బుష హింసఁజేయువారిని మాన్పన్
గరిమను బుద్ధుఁడవైతివి, తిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా! ౪౦
కరవాలముఁ జేపట్టుచు, దురితాత్ముల గీటడంపుదువుగా దే భా
సురమైన కల్కిరూపునఁ, దిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా! ౪౧
సరసిజమిత్రువంశమె, పరమపవిత్రం బటంచు భావించుచు నీ
ధరఁ బుట్టితివా ముదమునఁ, దిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా! ౪౨

గిరిరాట్పుత్రీప్రియపతి, శరాసనవిదళనబాహుశక్తి దళితస
ర్వరసాధవమదపటలా! తిరుమలగిరివేంకటేశ! దేవాధీశా! ౪౩
గిరిజాపతివిల్విఱిచియు, ధరణీసుతహస్తమందుఁ దగఁగరముం జే
ర్చిరహిన్ వివాహమాడితి, తిరుమలగిరివేంకటేశ! దేవాధీశా! ౪౪
చరణము తాకిఁ దవ్రులన్, గరితయగుచుఁ బ్రీతినిల్వఁగా లేదే నీ
చరితమ్ము నెన్నశక్యమె, తిరుమలగిరివేంకటేశ! దేవాధీశా! ౪౫
సరగన్ విభీషణునకున్, శరణయితివి నిన్నుఁ బ్రార్థనముసేయన్ సు
స్థిరరాజ్యపద మొసంగితి, తిరుమలగిరివేంకటేశ! దేవాధీశా! ౪౬
సురల కపకార మొనరిం, చురావణాసురునిఁ జంపి స్తుతినందవె భూ
సురవరులచే సురలచేఁ, దిరుమలగిరివేంకటేశ! దేవాధీశా! ౪౭
పరమాత్మా! నాకీయెడ, దురితాత్ములబాధ వేగఁ దొలఁగించుమనం
ద్వరఁ గృష్ణకీవె వలువలు, తిరుమలగిరివేంకటేశ! దేవాధీశా! ౪౮
తరుణులు విలాసముగ వ, స్త్రరహితలై జలకమాడుతఱి నాచీరల్
సరగన్ముచ్చిలి యుంటివి, తిరుమలగిరివేంకటేశ! దేవాధీశా! ౪౯
గరువముగల శిశుపాలునిఁ, బరిమార్పవె రాజసూయపాలనసేయన్
గిరిధర! సత్కృప రారా, తిరుమలగిరివేంకటేశ! దేవాధీశా! ౫౦
సురనాథుగర్వ మడఁపఁగ, గిరినెత్తుచు యాదవులకొగిన్ గోవులకుం
గరమున్ సౌఖ్యముగూర్పవె, తిరుమలగిరివేంకటేశ! దేవాధీశా! ౫౧
నరకాసురుఁ ద్రుంచియు నీ, ధరణీభారంబు మాన్పి తాల్పవె పేరు
న్నరకాంతకుం డటంచును, దిరుమలగిరివేంకటేశ! దేవాధీశా! ౫౨
పెఱవారియిండ్లలోపలఁ, జొరఁబడి వెన్నఁదిన వారుచూచి నినుం ది
ట్ట రయమునఁ బాఱిపోవే, తిరుమలగిరివేంకటేశ! దేవాధీశా! ౫౩
సరసీరుహలోచన! పా, పరహిత సచ్చరిత! దేవ! పాండవవంశో
ద్ధరణా! నినుభజియింతును, దిరుమలగిరివేంకటేశ! దేవాధీశా! ౫౪
కరిరాజును బలముగను మ, కరి పట్టఁగ దానిఁ జంపి కావవె కరినా
తురతం గమలానాథా! తిరుమలగిరివేంకటేశ! దేవాధీశా! ౫౫
వరుస నీనామంబుల, ధరణీస్థలి నొక్కగడియ తగవచియింపన్
మఱుజన్మ లణఁగుఁ గాదా, తిరుమలగిరివేంకటేశ! దేవాధీశా! ౫౬
భరమనక నీదునామము, స్మరియించెడి సుజనతతి నజస్రమునీవున్
సరిగాఁ బ్రోతువు కాదే, తిరుమలగిరివేంకటేశ! దేవాధీశా! ౫౭

కరము బలవంతుఁడైన ని, తరులం గొట్టుటన మిగులఁ దప్పగువారిన్
సరగునఁ గొట్టెద వీవహా, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౫౮
నిరతము నిన్ను నుతింపని, నరుఁడున్ మోక్షమును గోన సమర్థుఁడు కాఁడ
న్నరకమునకుఁ బోవలయును, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౫౯
వరణీయచిత్రములు గల, పురములు శాలలును నిలయములును న్నిర్మిం
తు రవి యశాశ్వతములె కా, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౬౦
ధరలోఁ బుట్టింపఁగ మము, సరిగాఁ బోషింపఁగా వెసం గిట్టింపన్
వరుసను నీవే కర్తవు, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౬౧
ధర సిలుగు గలిగి నపుడే, మొరలిడి నినుగొల్చి పిదప ముదికల్గిననిన్
స్మరియింప రెండు లోకులు, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౬౨
స్మరణవిడి యున్నవారి క, డరుగూర్చి త్వదీయగిరికి లాగుదువు గదా
మరల వెతఁబెట్టి వారలఁ, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౬౩
ధరణీజనులకు నీదౌ, స్మరణ మొనర్చుచుఁ ద్వదీయసన్నిధిఁ జేరం
బరమామోదకరంబగుఁ, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౬౪
హరి ! నిను దర్శింపఁగ నే, ర్పఱిచితి మాకుఁ గనుదోయి వ్యర్థపదార్థాం
తరదృష్టి మానినాఁడను, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౬౫
చరణములు నీదుసన్నిధి, కరుగం గల్పించినాఁడ వటుగాక స్థలే
తరముల కేగుట పాపము, తిరుమలగిరి వేఁకటేశ ! దేవాధీశా! ౬౬
కరయుగము భవత్పూజా, పరతం దనరార నేరుపఱిచితి వ్యూహిం
పరటులు లోకులుమూఢతఁ, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౬౭
వరదా ! నాఘ్రాణము నీ, చరణకమలగతసుమాళి సత్పరిమళమే
దరిఁ జేర్చు నితరమొల్లదు, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౬౮
నిరతము నీనామము నీ, చరితముఁ బఠియించుటే నిజంబుగ జిహ్వా
ధరములు గల్గిన పుణ్యము, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౬౯
పరమాత్మ ! త్వదీయగుణ, స్మరణామృతపానరతి యమరు నెటు సతమున్
ధర భవమున ముంచితి విటు, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౭౦
ధరలో జన్మంబందెడి, వఱకేనా నన్నుఁ గనుట భావ్యంబేనా
తరువాతఁ గనకయుండుట, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౭౧
శిరమునఁ నీచరణంబులఁ, గరములతోఁ బట్టి నేను గరముముదమునన్
భరియింతును గరుణింపుము, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా ! ౭౨

ముచ్చిచ్చు, నలుదెసలు, మొదలయినవి ద్విగుసమాసములు. వానకాలము, పండువెన్నెల, మొదలయినవి కర్మధారయములు. తేఁటిపిల్ల, మల్లెపువ్వు, మొదలైనవి తత్పురుషములు. డాలుడమాములు, కుంచెకాళాంజులు, మొదలయినవి ద్వంద్వములు. అలరువిలుతుఁడు, కఱకంఠుఁడు మొదలయినవి బహువ్రీహులు. మెఱుఁగుఁబోఁడి, మచ్చెకంటి మొదలయినవి యుపమానములు. జవాదిసెట్టి, పచ్చళ్ళబొంపత మొదలైనవి యుత్తరపదలోపములు. మోవిపండు, కేలుదమ్మి మొదలయినవి రూపకములు. ఆదిశబ్దముచేత, తావిమొల్ల, ఉప్పునీళ్లు మొదలైన మతుప్సమాసములును గలవు. అంతవిధయశ్చ=సమాసాంతవిధులును, ఔపవిభక్తికవత్=ఔపవిభక్తికవర్ణముల వంటివి. కార్యాః=చేయఁదగినవి (గ్రహింపవలయును.) అలరువిలుతుఁడు (విల్తుఁడు) అనుచోట-తకారము; నలువ, అనుచోట హ్రస్వము; కఱకంఠుఁడు, అనుచోట ఠవర్ణము; ఇత్యాదులు సమాసాంతవిధు లని తెలిసికొనునది. తెలుఁగున ఠకారము లేకున్నను స్వభావసిద్ధము కాదు గనుక శబ్దయోగము గానె తెలియునది. సమాసకాంగేషు=సమాసము పేరు తెలుఁగున సమాసకము. సమాసకమున కంగములైన,శబ్దేషు=శబ్దములయందు, విభక్త్యాదేః=విభక్తిమొదలైనవానికి, లోపశ్చ=లోపమును, స్యాత్=అగును. వేలుపులయొక్క దొర వేలుపు(ల)దొర. కైదువయొక్కదారి కైదువదారి. ఇట్టులె యన్నిట విభక్తి లోపము చేయునది. విభక్తిలోప మైనను దదాశ్రితములైన నిలలకు లోపములేదు. ఆదిశబ్దముచేత తమ్మివంటి కన్నులు గలది, అనుచోట నుపమానలోపమున, తమ్మికంటి-జవాది యమ్ముసెట్టి జవాదిసెట్టి, గరము కంఠమునందుఁ గలవాఁడు కఱకంఠుఁడు మొదలయిన యుత్తరపదాదిలోపములును గలవు.

---

కేవలవికృతిపదై ర్య స్సమాసకం తం బ్రువన్తి వాక్యజ్ఞాః
సంస్కృతవైకృతశబ్దైర్మిశ్రసమాస స్సఏవ విజ్ఞేయః. ౧౮

ఇది రెండుసూత్రములు. యః=ఏదయిన, కేవలవికృతిపదైః=సంస్కృతపదము లేక తెలుఁగుపదములచేతనే సమసించిన, తం=దానిని, వాక్యజ్ఞాః=వాక్యములను దెలిసిన పెద్దలు, సమాసకం=సమాసక మని, బ్రువన్తి=చెప్పుదురు. నిండుపున్నమ, జాఁబిలివెన్నెలతేట, పేరామనిచిగురుఁ గొమ్మాః వో...

ఇత్యాదులు సమాసకములు. సంస్కృత వైకృత శబ్దైః=సంస్కృతశబ్దములును, తెలుఁగుశబ్దములును గూడినది, మిశ్రసమాసః=మిశ్రసమాస మని, స ఏవ= అదియే, విజ్ఞేయః=తెలియఁదగినది. పద్మాకరపుఁదావిచెలువు; సమాసము వేళ మూఁకు పూవచ్చు నని మునుపే చెప్పినారము గనుక పద్మాకరపు అయినది. సర్వైశ్వర్యలక్ష్మి నెళవు, గట్టిదొరపట్టికామనీయకము—ఇత్యాదులుమిశ్రసమాసములు.

---

సంస్కృతపదేన పరిమిత మాన్ధ్రపదం కర్మధారయో భవతి
స్వస్వవిభక్తివికారై ర్బహవశ్చ యథాతథం సమస్యన్తే. ౧౯

ఇది రెండుసూత్రములు. పరిమితం=స్వల్పమైన, ఆన్ధ్రపదం=తెలుఁగు శబ్దము, సంస్కృతపదేన=సంస్కృతశబ్దముతోఁ గూడి, కర్మధారయో భవతి= కర్మధారయ మౌను. కలికిభుజంగకన్యలు, వేలుపువీరభటవర్గము, బహవశ్చ= అనేకశబ్దములు, యథాతథం=తెనుఁగు సంస్కృతములు, సంస్కృతము తెనుఁగులుఁ గలయఁగూడి, స్వస్వ విభక్తివికారైః=తమతమవిభక్తివికారములతోఁగలసి, సమస్యన్తే=సమసించును. వికారము లనఁగా నౌపవిభక్తికాదులు. నేటిముని రాజు, బ్రహ్మదండపుఁగైదువ, మ్ముక్కంటిగేహినిపుట్టినింటిసంపత్తిపెంపు. ఇత్యాది.

---

శా. ఆమ్నాయప్రతిపాద్యహృద్యమహిమన్యాసాళిశిష్టైకసే
వ్యామ్నాయార్థరతానుభావ్యకులకన్యాభ్యర్చనాఖండిత
ద్యుమ్నాభీప్సితదానదక్షిణజగత్పూజ్యాంఘ్రిపంకేరుహా
నిమ్నావర్తవిశోభినాభితనుమ్మజ్జ్యేజత్కృపావైభవా.

గద్యము—ఇది శ్రీసకలభాషావాగనుశాసన నన్నయభట్ట విరచితాంధ్రశబ్దచింతామణియందు సకలకవితాస్వతంత్రభట్టారక యెలకూచి బాలసరస్వతి కవిమహోపాధ్యాయప్రణీత మైన శబ్దానుశాసనటీకాగ్రంథంబునందుఁ జతుర్థంబైన హలంతపరిచ్ఛేదము.

# క్రియాపరిచ్ఛేదము.

ఉపకృతి పరిణతి సంవృతిభేదా త్త్రివిధా క్రియా* పుషణ్వాదిః
ఉపకృతి రథ భూజ్యాదిః పరిణతి రన్యాతు రఞ్జి వస్యాదిః ౧

ఇది నాలుగుసూత్రములు. ఉపకృతి=ఉపకృతి యని, పరిణతి=పరిణతి యని, సంవృతి=సంవృతి యని, భేదాత్=భేదమువలన, క్రియా=ధాతువు, (క్రియాపదములు) త్రివిధా=మూఁడువిధములు కలది. పుషణ్వాదిః=పుషపుష్టౌ, ణుస్తుతౌ మొదలైనవి, ఉపకృతిః=ఉపకృతి క్రియ లనిపించుకొనును. అథ=అటావల (తరువాత) భూజ్యాదిః=భూసత్తాయాం, జిజయే మొదలయినవి, పరిణతిః=పరిణతిక్రియ లనిపించుకొనును. అన్యాతు=కడమది, సంవృతిక్రియ, రఞ్జివస్యాదిః=రఞ్జరాగే, వసనివాసే మొదలయినవి-అనఁగా-సామాన్యముచేత సకలక్రియాపదములును గొన్నియుపకృతిసంజ్ఞ కలవి, కొన్ని పరిణతిసంజ్ఞకలవి, కొన్ని సంవృతిసంజ్ఞ కలవి యనుట.

---

స్యా దుపకృతిః కృదన్తా సా పరిణతి రయవరన్వితైవ భవేత్
సంవృతి రహతాకారా జ్ఞేయం త్రివిధాసు చ క్రియా స్వేవమ్. ౨

పూర్వార్ధము రెండును నుత్తరార్ధ మొకటియుఁ గూడి మూఁడుసూత్రములు. పూర్వసూత్రములచేత సామాన్యాకారముగాఁ జెప్పినక్రియాస్వరూపముల నీసూత్రములలో విశేషించి చెప్పుచున్నాఁడు. ఉపకృతిః=ఉపకృతిక్రియ, కృదన్తా=క్తిన్, ఘఞ్ మొదలైన కృత్తులతోనే నిల్చియుండునది, స్యాత్=అవును. పోషించు ననిన "పోష" అని ఘఞన్తమయియే నిలుచును. నుతించు ననిన "నుతి" అని క్తిన్నన్తమయియే నిలుచును. విధించు ననిన కిప్రత్యయాన్తము. ఇత్యాది- సా=ఆ, పరిణతిః=పరిణతిక్రియ యనునది, అయవరన్వితైవ=అయ్, అవ్, అర్ అనునంతములతోఁ గూడియుండునదియే, భవేత్=అగును- జయించె-అయ్; ప్రభవించె-అవ్; హరించె-హర్ అని యుండును. సంవృతిః=సంవృతిక్రియ యనునది, అహతాకారా- అహత=చెడకున్న, ఆకారా=ఆకారముగలది. ఉపదేశకాలమం దేదో యా స్వరూపముతోనే యుండును. రంజించె,

---

* త్రివిధాః క్రియాః—అని యొక దానిలో నున్నది. అర్థము ననుగుణముగ బహువచనములోనే యున్నది.

వసించె. త్రివిధాసు చ=మూఁడువిధములయిన, క్రియాసు = క్రియలయందు, ఏవఁ=ఈప్రకారమున, జ్ఞేయం=తెలియఁదగినది.

---

తద్ధర్మవర్తమానాతీతాగామ్యర్థకాః క్రియా జ్ఞేయాః
తత్ర ద్వితీయతుర్యా యా స్తస్తౌ సానుబన్ధకావేవ. 3

ఇది రెండుసూత్రములు. తద్ధర్మవర్తమానాతీతాగామ్యర్థకాః= తద్ధర్మము, వర్తమానము, అతీతము, ఆగామి యనునర్థములు గలవిగా, క్రియాః= క్రియలు, జ్ఞేయాః=తెలియఁదగినవి. తత్ర=ఆనాలుగింటియందు, ద్వితీయ, తుర్యా=రెండవదియు నాలుగవదియు నగు వర్తమానాగామ్యర్థము లనునవి, యా=ఏవో, తౌ=అవి, సానుబన్ధకా వేవ=క్రియాంతరానపాయులే (అనుబంధకములు లేక యుండునవి కావు) స్తః=అవును. అనుబంధక మనఁగా నెట్టిదో చెప్పుచున్నాఁడు.

---

వసతి రనుబన్ధకస్స్యా ద్యత్ర లడర్థో వివక్షితస్తత్ర
అస్తి రనుబన్ధకస్స్యా ద్యత్ర ల్‌ఋడర్థో వివక్షితో ధాతోః. ౪

ఇది రెండుసూత్రములు. యత్ర=ఎందైనను (ఎక్కడ) లడర్థః=వర్తమానార్థకము, వివక్షితః=వివక్షిత మానో (చెప్ప నిచ్ఛయింపఁబడుచున్నదో) తత్ర=అక్కడ, వసతిః=ఉన్న, (వస నివాసే) అను వసధాత్వర్థకము, అనుబన్ధకః స్యాత్=అనుబంధక మౌను, యత్ర=ఎందు, ల్‌ఋడర్థః=భవిష్యదర్థము, వివక్షితః=వివక్షిత మానో, తత్ర=అందు, ధాతోః=క్రియలకు, అస్తి=కల, (అస భువి) అను నసధాత్వర్థము, అనుబన్ధకః స్యాత్=అనుబంధక మౌను. అనఁగా లడర్థసూచక మైన వర్తమానార్థమును జెప్పు క్రియాపదమునకుఁ బయిని "ఉన్న" అను వర్ణకమును ల్‌ఋడర్థసూచక మైన భవిష్యదర్థమును జెప్పు క్రియాపదము పయిని "కల" అను వర్ణకము నుండును.

---

భవతి క్రియాపదానాం త్రివిధానా మించుగాగమో శ్చే
అనుబన్ధప్రార్థనయో స్త్వా వ్యతిరేకాదికేచ చోః ప స్స్యాత్. ౫

ఇది రెండుసూత్రములు. త్రివిధానాం=ఉపకృతి, పరిణతి, సంవృతి యనుమూఁడు విధములైన, క్రియాపదానాం=క్రియాపదములకును, ఇంచుగా

గమః=ఇంచుక్ అనెడి యాగమము, భవతి=అగును. అనఁగా, సకర్మకములు గాని క్రియలకు స్వార్థమున నించుగాగమము వచ్చును, ణిజంతముల మీఁదను వచ్చును. ణేశ్చ=ణిచ్ ప్రత్యయమునకును, ఆదేశరూప మై యగును. త్రివిధములకే యన్నాఁడు గనుక దేశీయక్రియలకు లేదు. చేయు, డాయు-ణిచ్చున నైనయెడల దేశీయక్రియలమీఁదను గూడ వచ్చును. చేయించు, మ్రోయించు. ఇంచుక్ లో కకారము "హాలన్త్యం" అను వ్యాకరణసూత్రముచేత లోపము కాఁగా "ఇంచు" అని యుండెను. "ఆద్యన్తౌ టకితౌ" అను వ్యాకరణసూత్రము చేత నిది కిత్తు గనుక అంత్యావయవ మై వచ్చును. అనుబన్ధప్రార్థనయోః= అనుబంధార్థ ద్వయమందును, ప్రార్థనార్థమందును, వ్యతిరేకాదికేచ=వ్యతిరేకము మొదలైన యర్థములయందును, ణౌ=ణిచ్చునకు వచ్చునది పరమై యుండినను, చోః=ఇంచుగాగమములోని చు అనెడియక్షరమునకు, పఃస్యాత్=పకారము వచ్చును. ఘటింపుచున్నాఁడు, ఘటింపఁగలఁడు-అనుబంధములు. ఘటింపుము, ప్రార్థన. ఘటింపించె-ణిచ్చు. ఘటింపఁడు-వ్యతిరేకము. ఆదిశబ్దముచేత ఘటింపనోపును మొదలైన తుముౙ్ ప్రత్యయార్థములకును పకారము వచ్చును.

* ఈచెప్పినసూత్రములచేతవచ్చిన క్రియారూపము లుదాహరించుచున్నాము:

పుషపుష్టౌ, ణుస్తుతౌ అన్నధాతువుల మీఁదను ఘఞ్ ప్రత్యయమును స్త్రీయాం క్తిన్ ప్రత్యయమును గూర్చిన కృదంతములై యుపకృతిసంజ్ఞలు గలవై, పోష, నుతి, యని యుండిన నాపైని వర్తమానార్థవివక్షగలిగి "భవతిక్రియాపదానా మించుగాగమః" అని యించుగాగమము వచ్చిన, పోషించు అనియుండిన, "చు రితి క్రియాపదానాం" అను నుక్తసూత్రముచేత చు అనువర్ణకము వచ్చి యాపైని "వసతి రనుబన్ధక స్స్యాత్" అనుసూత్రముచేత వసత్యర్థక మైన యాంధ్రపదము "ఉన్న" అని యుండిన "పోషించుచున్నా" అనియుండిన "వ్యతిరేకార్థే లృటిలటి డుజ్ స్యాత్" అను వక్ష్యమాణసూత్రముచేత డుజ్ వచ్చిన, "అనుక్తమన్యవత్" అనున్యాయముచేత, "హాలన్త్యం" అనువ్యాకరణసూత్రముచేత జకార మిత్తైపోయి "సానునాసికోచ్చారణం జిత్" అను ప్రాకృతసూత్రముచేత దాపల నర్ధబిందువు వచ్చిన, పోషించుచున్నాఁడు, అని లడ్రూప ముండును. "అనుబన్ధప్రార్థనయోః" అనుసూత్రముచేత నొకవేళ ననుబంధకము పరమై యుండిన, పకారము వచ్చునన్నాఁడు గనుక, పకారము వచ్చిన, పోషింపుచున్నాఁడు, నుతింపుచున్నాఁడు, అని కలదు. ఈలాగుననే స్తుతింపుచున్నాఁ

డు, ప్రస్తుతింపుచున్నాఁడు, అనుమతింపుచున్నాఁడు, సంతోషింపుచున్నాఁడు, పరితోషింపుచున్నాఁడు- మొదలైన క్రియాపదములు తెలిసికొనునది. ప్రాకృతమునందు "షోస్స" యనుసూత్రముచేత షాకు సాదేశము వచ్చును గనుక సంతోసిల్లుచున్నాఁ డని రూపము వచ్చెను. ఈలాగుననే కేవలాంధ్రములు చూచుకొనునది. లెక్కించుచున్నాఁడు, తేలించుచున్నాఁడు, ఆలించుచున్నాఁడు, తూలించుచున్నాఁడు, మన్నించుచున్నాఁడు, ఆరగించుచున్నాఁడు మొదలైన క్రియాపదములు ప్రయోగవశమువలన గ్రహించుకొనునది.

ఇదిత్తులు, ఈదిత్తులు, ఉదిత్తులు, ఊదిత్తులు నైనధాతువులకును నీలాగుననే క్రియాపదములు ప్రయోగవశమువలనఁ దెలిసికొనునది. 'చడికోపే' 'ఇదితో నుమ్ధాతోః-' అనువ్యాకరణసూత్రముచేత నుమాగమము వచ్చిన, చండింపుచున్నాఁడు, ఖండింపుచున్నాఁడు, తుండింపుచున్నాఁడు, ఆకంపించుచున్నాఁడు, చుంబింపుచున్నాఁడు- మొదలైనవి చూచుకొనునది. ఈదంతములకుఁ బ్రయోగము (?)"టునది సమృద్ధౌ" ధాతువు మీఁదను నందింపుచున్నాఁడు. ఉదిత్తులకుఁ బ్రయోగము—క్రము పాదవిక్షేపే- క్రమించుచున్నాఁడు. శము ఉపరమే- శమించుచున్నాఁడు. భ్రమ చలనే-భ్రమించుచున్నాఁడు. ఊదిత్తులకు:—గుపూరక్షణే-భూసత్తాయాం- గోపించుచున్నాఁడు, అనుభవించుచున్నాఁడు-ఇదిత్తుల కుదాహరణములు:—షద్ల్విశరణగత్యవసాదనేషు—ఆసాదించుచున్నాఁడు, పద్లగతౌ—ఆపాదింపుచున్నాఁడు, సంపాదింపుచున్నాఁడు. ఆదంతములకు: -ష్ఠాగతినివృత్తౌ—ప్రతిష్ఠించుచున్నాఁడు, మ్నా అభ్యాసే—మానింపుచున్నాఁడు. ఈలాగున నజంతధాతువులు చూచుకొనునది.

కేషాంచి దపి ధాతూనా మిల్లుక్స్వార్థే ప్రకీర్త్యతే
కేషాంచి దపి ధాతూనాం రిల్లు క్ప్రికవిసమ్మతేః.

అను నథర్వణవచనమువలనఁ గొన్నిధాతువులమీఁద నిల్లుగాగమము గలదు. ఉదాహరణము:—ప్రణమిల్లుచున్నాఁడు, రంజిల్లుచున్నాఁడు, భాసిల్లుచున్నాఁడు.

కేషాంచిద్దేశ్య శబ్దానా మించు గిల్లుగ పీష్యతే
చు రేవ వర్తమానార్థే కవిభల్లట సమ్మతేః.

అనుఁ దథర్వణవచనములవలనను, ఇంచుగాగమ, ఇల్లుగాగమములుఁ గొన్ని క్రియలకు లేక ధ్యే చుమాత్రమే వచ్చును. ఉదాహరణము. పలుకుచున్నాఁడు,

చూచుచున్నాఁడు, వినుచున్నాఁడు, కనుచున్నాఁడు. అథర్వణాచార్యులును, "అకర్మకేషు తు స్వార్థేంచుకో లోపో విధీయతే" అని యన్నాఁడు గనుక యిం చుగాగమ మకర్మకధాతువులమీఁద రాదు. ఇంక నే మనిన, ఇల్లుగాగమము వచ్చును. భాసిల్లు, ప్రవహిల్లు. "త్రివిధానా మించుగాగమః" అన్నాఁడు గనుక కొన్ని దేశ్యక్రియలమీఁదను, ఇంచుగాగమము రాదు. వచ్చుచున్నాఁడు, కనుచున్నాఁడు, వ్రాయుచున్నాఁడు—ఇత్యాదులు చూచుకొనునది. ఇంక నేమంటేని, ఉపకృతిపరిణతిసంవృతిరూపములయిన సంస్కృతక్రియారూపముల మీఁదనె యించుగాగమము లనుట- కేశ్చ. హేతుమతిచ, అను నుత్తరసూ త్రములచేత హేతుమణ్ణిచ్చులయందు, ఆంధ్రక్రియలయం దైనను గాని యించు గాగమము వచ్చుచున్నది. పొనరె, పొనరించె; ఒనరె, ఒనరించె; అని భూతా ర్థక్రియ లున్నవి గనుక, పోరుచున్నాఁడు, పోరించుచున్నాడు; అమరుచు న్నాఁడు, అమరించుచున్నాఁడు; పొదలుచున్నాఁడు, పొదలించుచున్నాఁడు; ఇగిరించుచున్నాఁడు, ఇగిర్పించుచున్నాఁడు- ఇత్యాదిరూపములు చూచుకొ నునది. పఠింపించుచున్నాఁడు మొదలైనసంస్కృతణిజంతములు నీలాగున నెచూ చుకొనునది. వినిపించుచున్నాఁడు- మొదలయిన తెనుఁగుణిజంతములును నీలా గున నె చూచుకొనునది.

ఇంకఁ బరిణతిక్రియాపదములం జెప్పుచున్నాము:—

"అథ భూజ్యాదిః పరిణతిః"అన్నాఁడుగనుక'భూసత్తాయాం', 'జి జయే' మొదలైన యజంత, హలంతధాతువులకు వర్తమానార్థవివక్ష గలుగుచుండఁ గా, "వర్తమానే లట్" అను వ్యాకరణసూత్రముచేత లట్ప్రత్యయము వచి "కర్తరిశప్" అని శప్ప్రత్యయము వచ్చి, "సార్వధాతుకార్ధధాతుకయోః" అని గుణము వచ్చి "ఏచోయవాయావః" అని అవాదేశము వచ్చిన- "భవ"-అని యుండ, "సా పరిణతి రయవరన్వితైవ భవేత్" అన్నసూత్రముచేత- అవ్ అని యంతము గలది గనుక పరిణతిసంజ్ఞ గలుగుచుండఁగా నుపకృతిధాతువులయం దువలెనే, ఇంచుగాగమము, చువర్ణకము, అనుబంధకము, డుజ్ మొదలయి నవి యన్నియు వచ్చిన- నుపసర్గపూర్వక మైన, ప్రభవించుచున్నాఁడు, ప్రభవిం పుచున్నాఁడు, అనుభవించుచున్నాఁడు- అని రూపము లాయెను. ఈలాగుననె జయింపుచున్నాఁడు, నయింపుచున్నాఁడు, క్షయింపుచున్నాఁడు, స్రవింపుచు న్నాఁడు, ద్రవింపుచున్నాఁడు, ఆశ్రయింపుచున్నాఁడు; సంశ్రయింపుచు న్నా

డు, మొదలైన, అయంత-అవంతములును, అపహరింపుచున్నాఁడు, అలంకరిం పుచున్నాఁడు, సంస్కరింపుచున్నాఁడు, సాక్షాత్కరింపుచున్నాఁడు, మొదలైన అరంతములును బరిణతిక్రియలు.

సంవృతిక్రియలను జెప్పుచున్నాము:—

“అన్యాతు రఞ్జి వస్యాదిః” అన్నాఁడు గనుక, రఞ్జరాగే, వస నివాసే, మొదలైన ధాతువులం బుట్టిన క్రియాపదములు సంవృతిక్రియలు-అదే మంటేని-“సంవృతి రహతాకారా” అన్నాఁడు గనుక యీధాతువుల యకారములు లుప్తములు గాక యుండునవి గనుక, ఈలాగుననే యేయేధాతువులు వికృతిం బొందక స్వరూపముచేతనే యుండునో యాధాతువులం బుట్టిన క్రియ లెల్ల సంవృతిక్రియ లనిపించుకొనును- రఞ్జరాగే, వసనివాసే, అర్థ యాచ్నాయాం, గర్వదర్పే, గణసంఖ్యానే, గుణమన్త్రే, చిత్రలేఖ్యే, నివాసస్థితౌ, రచకృత్యాం, వర్ణస్తుతౌ, లిఖలేఖనే,రాజృదీప్తౌ, భజసేవాయాం, నటగతౌ, దీపిదీప్తౌ, లపభాషణే, ఫలనిష్పత్తౌ, ఇవిమొదలైన ధాతువులమీఁద, నుపకృతిపరిణతిక్రియలకుంబలెనే వర్తమానార్థవివక్షయందు, ఇంచుగాగమమును, చువర్ణకమును, ఉన్నానుబంధకమును,డుజ్ను వచ్చిన, రంజించుచున్నాఁడు, వసించుచున్నాఁడు, అర్థించుచున్నాఁడు, గర్వించుచున్నాఁడు, గణించుచున్నాఁడు, గుణించుచున్నాఁడు, చిత్రించుచున్నాఁడు, నివాసించుచున్నాఁడు, వర్ణించుచున్నాఁడు, లిఖించుచున్నాఁడు, భజించుచున్నాఁడు, రచించుచున్నాఁడు, దీపించుచున్నాఁడు, విలపించుచున్నాఁడు, ఫలించుచున్నాఁడు, ఇటువంటి రూపము లగును. ఈసంవృతిక్రియలయందుఁ గొన్ని ధాతువులకు, ఇల్లు గాగమము వచ్చిన రాజిల్లుచున్నాఁడు, ప్రణమిల్లుచున్నాఁడు, ప్రాపిల్లుచున్నాఁడు-అనికలవు. వికృతిపదములుకొన్ని యీలాగుననె, అంపిల్లుచున్నాఁడు, దురపిల్లుచున్నాఁడు, తారసిల్లుచున్నాఁడు, ఓరసిల్లుచున్నాఁడు మొదలైన శబ్దములు కలవు.

ఈచెప్పిన యుపకృతి పరిణతి సంవృతి క్రియలకు భేద మే మంటేని-ఉపకృతిక్రియలు సకర్మకధాతువులమీఁదనే కాని పుట్టవు. పరిణతిసంవృతిక్రియలు కొన్ని యకర్మక క్రియలమీఁదను వచ్చునని తెలిసికొనునది.

యథా ప్రసిద్ధి ర్ధాతూనాం ప్రయోగస్స్మృతో భవేత్
ఏవోపపదభాజాస్స్యు స్సాధవో భ్వాదయః క్రియాః.

**అను నథర్వణవచనమువలనఁ గొన్ని ధాతువుల కుపపదము లుండిననే**

కాని యాంధ్రమునందుఁ బలుకవు. అది గనుక- కరింపుచున్నాఁడు, భవింపుచున్నాఁడు, మొదలైనవి ప్రయోగింపరాదు. చురాదులమీఁదను నించుగాగమును గలదు, విజ్ఞాపించుచున్నాఁడు, ఆజ్ఞాపించుచున్నాఁడు, సంజ్ఞాపించుచున్నాఁడు. కొన్ని ద్వ్యక్షరకధాతువులమీఁదను, నీలాగుననే రూపములు గలవు. శిష్యుని వేద మధ్యాపించుచున్నాఁడు, రిపుల నాపదఁ బెట్టుచున్నాఁడు, ఆపదఁ బెట్టించుచున్నాఁడు- వికృతియందును- కొడుకుచేతఁ గాటఁ గొడించుచున్నాఁడు- కొన్నిచోటులఁ దృతీయ వచ్చును. శిష్యునిచేత వేదము చదివించుచున్నాఁడు, బంట్లచేత రిపులఁ బాడిపించుచున్నాఁడు. "లఘుద్వ్యక్షరధాతూనా మించుగాద్వ సంధి మశ్నుతే" అని విశేషవచనమువలన లఘు ద్వ్యక్షర ధాతువులమీఁద సంధి వికల్పముగ వచ్చును. హరించె, హరియించె; ధరించు, ధరియించు, భజించు, భజియించు; "యాంతానాం నవికల్పస్స్యా దితి శ్రీకవిసమ్మతేః"అన్న వచనమువలన యకారాంతధాతువులకు సంధి వికల్పము లేదు. నయించు, జయించు, ఇత్యాదికము చూచుకొనునది- "స్త్ర్యర్థే పున ర్దుదీభవతః" అను వక్ష్యమాణసూత్రముచేత దుజ్జు నపనదించి స్త్రీవాచకక్రియలకు ది వచ్చును. నటించుచున్నది, నటియించుచున్నది; "జడానాం చ దుదీ స్యాతా మితి శ్రీకవిసమ్మతేః" అని జడాదులకు దుదు యనునవి వచ్చును. వృక్షము ఫలించుచున్నది. ఫలియించుచున్నది. కుసుమించుచున్నది, ఇగిరింపుచున్నది.

బహుత్వే వర్తమానార్థే రుస్స్యా ద్ద్విత్వే తథైవహి
స్త్రీజడానాం రువీ స్యాతాం ద్విత్వేచాపి తథైవహి.

అను విశేషవచనమువలన, బహువచనములైన- రు వచ్చును. పోషించుచున్నారు, ప్రణుతించుచున్నారు, రంజిల్లుచున్నారు- స్త్రీవాచకములకు నీలాగుననే వచ్చును. లక్ష్మీగౌరీసరస్వతులు రక్షించుచున్నారు. ద్వివచనములకు నీలాగుననే రు వచ్చును. రామలక్ష్మణులు రక్షించుచున్నారు, గౌరీసరస్వతులు పోషించుచున్నారు. తిర్యగ్జడాదులకు వి వచ్చును- వృక్షములు ఫలించుచున్నవి, చలింపుచున్నవి. మధ్యమపురుషమైన- వు, రు- అని క్రిందఁ జెప్పినాఁడు గనుక నావుకారరుకారములే సిప్పకును ధాకును, వచ్చినయెడల, నీవు పోషించుచున్నావు, మీరు పోషింపుచున్నారు. అనివచ్చును. ధస్సునకు నీలాగుననే వచ్చును. రామలక్ష్మణులారా! మీరు పోషించుచున్నారు. ఉత్తమ

పురుషకైనయెడల, “సుజసోర్నుమూ” అని క్రిందఁ జెప్పినాఁడు గనుక, ఆ నుకారము కారములై మిప్పుకును మప్పుకును వచ్చిన, నేను సంతోషించుచున్నాను, మేము ప్రకాశింపుచున్నాము, భాసిల్లుచున్నా మని వచ్చును. వ్యతిరేకాదికే చ చోః ప స్యాన్నత్ “అనిచెప్పినాఁడు గనుక నీచెప్పిన క్రియల కన్నింటికి వ్యతిరేకార్థము వాచ్యమైన- పుకారము వచ్చినప్పుడు “వ్యతిరేకార్థే భావిని చాత్స్యాత్”అను వక్ష్యమాణసూత్రముచేత,అకారము వచ్చిన, ఘటింపఁడు, ఘటింపింపఁడు-ఆదిశబ్దముచేత, ఘటింపలేఁడు, ఘటింపరాఁడు, ఘటింపకున్నాఁడు, ఘటింపవచ్చును, ఘటింపనయ్యె, ఘటింపఁగ- ఇత్యాది తుమున్నర్థములు చూచుకొనునది. “ఎడింశ్చ వర్తమానార్థే ఇంచుక్స్యాపి క్వచి ద్భవేత్” అను విశేషవచనమువలన వర్తమానమునందు నొకవేళ నించుగాగమమును గలదు. పోషించెడిన్, రక్షించెడిన్, పోయెడిన్, వచ్చెడిన్, మున్గెడిన్, తేలెడిన్- ఒకవేళ నిల్లుగాగమమును గలదు. రంజిల్లెడిన్- ఈలాగున వర్తమానార్థమందు, నీచెప్పినమూఁడు విధముల క్రియాపదములు యోజించుకొనునది. ఈచెప్పిన వర్తమానార్థములు ముందరి సూత్రముచేతఁ జెప్పుచున్నాఁడు. బుద్ధిమంతులయినవా రేకవాక్యత చేసికొనునది-ఇంక భవిష్యద్భూతతద్ధర్మక్రియానిరూపణముం జేయుచున్నాఁడు. *

(**ఈపూర్వులమధ్యవిషయము 4095 సంఖ్యప్రతిలో లేదు.)

---

వ్యతిరేకాదౌ భావిని చాత్స్య క్త్వా భూతయోః క్రియాన్తస్యేత్
ప్రథమైకవచనలోప స్తద్ధర్మాతీతయోః క్రియాణాం స్యాత్. ౬

ఇది మూఁడు సూత్రములు. వ్యతిరేకాదౌ= వ్యతిరేకాదులయందును, భావిని=భవిష్యదర్థమందును, అత్, స్యాత్ = క్రియలకు, అకార మగును. ఘటింపఁడు, ఘటింపక- ఆదిశబ్దముచేత ఘటింపఁబడును, ఘటింపలేఁడు. అని కర్త్రాదుల యందును నౌను- ఘటింపఁగలఁడు, భవిష్యదర్థము. క్త్వాభూతయోః= క్త్వా ప్రత్యయమందును భూతార్థమందును, క్రియాన్తస్య= క్రియయొక్క తుదకు, ఇత్ స్యాత్ =ఇకారము వచ్చును. క్త్వాప్రత్యయము, ఘటించి. ఘటించిరి, భూతార్థము. ఏకవచనమున కేత్వము చెప్పుచున్నాఁడు:- క్రియాణాం= క్రియలకు, తద్ధర్మాతీతయోః= తద్ధర్మభూతార్థములయందు, ప్రథమైకవచనలోపః= ప్రథమపురుషైకవచనమునకు లోపము. స్యాత్ =అగును. కను.

విను, ప్రోవు, త్రోవు- ఇటువంటిది తద్ధర్మార్థము, ఘటియించు, ఘటియించె-

[వ్యతిరేకాద్దా భావిని చాత్స్యాత్ - వ్యతిరేకాద్దా=వ్యతిరేకాద్యర్థము లు పరమగుచుండఁగా, భావిని= అస్త్యనుబంధకవత్తైన భవిష్యదర్థము పరమగుచుండఁగాను, క్రియాంతస్య= క్రియాపదములయొక్క యంత్యవర్ణమునకు, అత్ =అకారము, స్యాత్ = అగును. అనఁగా వర్తమానార్థక్రియలకుం బలెనె, ఉపకృతి పరిణతి సంవృతి క్రియలకు మూఁటికిని, ఇంచుగాగమము వచ్చి, కల యను ననుబంధకము వచ్చి, "వ్యతిరేకార్థే లృటి లటి డుజ్ స్యాత్" అను సూత్రముచేత డుజ్జువచ్చి "వ్యతిరేకాద్దా భావినిచాత్స్యాత్"-అనుసూత్రము చేత, చుకారోపరి ఉకారమును గొట్టి అకారము వచ్చిన, పోషించఁగలఁడు, పోషింపఁగలఁడు- వీనికిఁ గళాసంజ్ఞ లేదు. ద్రుతప్రకృతికార్యము వచ్చినఁ బోషింపఁగలఁడు, అనికలదు. ఇల్లుగాగమము వచ్చిన- భాసిల్లఁగలఁడు.

"కేషాంచి ద్దేశ్యశబ్దానా మించుగిల్లు గమేష్యతే" అని యించు గిల్లుగాగమములు, రాకుండిన- చేయఁగలఁడు, వేయఁగలఁడు, పాయఁగలఁడు- అని వచ్చును. వ్యతిరేకార్థములయందు, అకారము వచ్చినందుల కుదాహరణము:- ఘటించఁడు, ఘటింపఁడు. చేయఁడు- ఆదిశబ్దముచేత, చేయవచ్చును, రక్షించఁబోవును- ఇత్యాదికము చూచుకొనునది.

ఉన్ స్యా ద్భవిష్యదర్థేవా బహుత్వేతు దురుర్భవేత్
తిర్యగ్జడాదికర్తృత్వే వాస్యా దున్నితి భల్లటః.

అను విశేషవచనము వలన, "ఉన్ను" వచ్చిన- పోషించున్, భజనసేయున్, పోషించుదురు, భజనసేయుదురు, అని కలదు. స్థావర తిర్యక్కులఁ జెప్పిన- వృక్షములు ఫలించఁగలవు, సింహములు రాఁగలవు, వృక్షములు ఫలించున్, సింహములు గర్జించున్- అనియును వచ్చును. వీనికి సూత్రప్రాప్తులు ముందరఁ జెప్పెదము. క్త్వాభూతయోః క్రియా న్తస్యేత్ - క్త్వా= క్త్వాప్రత్యయముయొక్క, భూతయోః=భూతార్థముయొక్క- క్రియాన్తస్య= క్రియాపదములయొక్క అంత్యవర్ణమునకు, ఇత్ =ఇకారము వచ్చును. క్త్వాప్రత్యయమున కుదాహరణము:- ఘటించి, పోయి,పచ్చి, చని, పిసి, కసి- ఇత్యాదికము చూచుకొనునది. భూతార్థమున కుదాహరణము బహువచనము చూచుకొనునది. ఏకవచనమైన- "ప్రథమైకస్యైద్భవేచ్చ భూతార్థే" అని యుత్తర సూత్రము వలన, ఎత్వము వచ్చుచున్నది. పోషించె, నుతించె. "అద్యః క్రియా

సు భూతార్థద్యోతిత మాద్యగం వినా సర్వః" అని క్రిందఁ జెప్పినాఁడు గనుక భూతార్థద్యోతితక్రియయందు యకారమున కెత్వము వచ్చుచున్నది. ఆభూతార్థక్రియలు, లఘుపూర్వకములై నాంతము లాయెనా ఎత్వవిశిష్ట యకారము గలవి యగును. చనియె, వినియె, కనియె, కొనియె, మనియె- కొన్నిచోటుల లఘుపూర్వకనాంతము గాకున్నను వచ్చుచున్నది. పోయె. "ఎత్వంభూత క్రియాయాం స్యా దేకత్వే పీంచుగిష్యుకా" అను విశేషవచనమువలన, భూతార్థైకవచనమునందు ఇంచుగాగమమును వచ్చును. అపయిని ఎత్వము వచ్చును. పోషించె, నుతించె, అనుభవించె, భజియించె, జయించె, అర్థించె, సంహరించె, పఠింపించె, ఏలించె, దున్నించె, రాజిల్లె, భాసిల్లె- ఇత్యాదికము చూచుకొనునది. బహువచనములైన, "సర్వేషాం బహువచనే రుః" అను నుత్తరసూత్రముచేత, రు వచ్చిన, ఆపైని "క్త్వాభూతయోః క్రియా స్వస్యేత్ -అని ఉకారమును గొట్టి ఇకారమువచ్చిన, పోషించిరి, నుతించిరి, అనుభవించిరి, అర్థించిరి, పలికిరి, వినిరి, కనిరి, అని యగును. తద్ధర్మాతీతయోః=తద్ధర్మమునందును, భూతార్థమునందును, వచ్చునటువంటి, క్రియాణాం=క్రియాపదములకు, ప్రథమైకవచనలోపః=ప్రథమపురుషైకవచన లోపము, స్యాత్ =అగును. అనఁగా-తిబాదులు లోపమైనయెడల, ఘటించెనతఁడు, కనియెనితఁడు, అని యించె యంచున్నది గాని పైని ప్రత్యయాదేశములైన డుజాదులు లేవనుట- ఇంక నిక్కడ డుజాదులు వచ్చు ననిన, వచ్చుస్థలము లుత్తరసూత్రమున విధించుచున్నాఁడు.]

---

వ్యతిరేకార్థే లృటి లటి డుజ్ స్యాత్ త్ర్యర్థేపున ర్దుదీభవతః-

ఇది మూఁడు సూత్రములు. వ్యతిరేకార్థే=వ్యతిరేక మందును, లృటి=భవిష్యదర్థమందును, లటి=వర్తమానార్థమందును, డుజ్ స్యాత్ =డుజ్వర్ణకమగును. జకారలోప మగును. జిత్తుగనుక, అర్థబిందుయుక్తమౌను. పూర్వసూత్రానువృత్తిచేతఁ బ్రథమైకవచనమున కని తెలియునది. ఘటింపఁడు, ఘటింపఁగలఁడు, ఘటింపుచున్నాఁడు. "చురితి క్రియాపదానాం" అని చువర్ణకము వచ్చినది. త్ర్యర్థేపునః=త్రీకర్తృకమైనపుడు, దుది=దుది అనునవి, భవతః=అగుచున్నవి. వ్యతిరేక లృడర్థములయందు, దువర్ణకమును లడర్థమందు దివర్ణకమును నగు ననుట- ఘటింపదు, ఘటింపఁగలదు, ఘటింపుచున్నది. త్ర్యర్థమనుమాట యమహాత్తులకెల్ల నుపలక్షణముగాఁ దెలియునది.

[వ్యతిరేకార్థేల్ఌలటి డుజ్వాస్యాత్ స్త్ర్యర్థేపున ర్దుడీభవతః
అన్యస్మాచ్చాధాతోర్ధాతుత్వ వివక్షయైవ భవతీంచుక్.

ఇది మూఁడుసూత్రములు. వ్యతిరేకార్థే = వ్యతిరేకార్థమందును, ఌటి = భవిష్యదర్థమునందును, లటి = వర్తమానార్థమునందును, డుజ్వాస్యాత్ = డుజ్జు అవును, అనఁగా నేకవచనమందు లడాదులం గొట్టి డుజ్వాదులువచ్చును- స్త్ర్యర్థేపునః = స్త్రీవాచకము కర్తయైనప్పుడు, దుడీ భవతః = దు ది అనువర్ణకములువచ్చును, వీని కుదాహరణము:-కాంత ఘటింపదు, చేయదు, పోషింపఁగలదు, రాఁగలదు_ "వ్యతిరేకాదా భావిని చాత్స్యాత్" అని యకారము వచ్చినపు డీరూపములు వచ్చిన వని గ్రహించుకొనునది. వర్తమానార్థమున కుదాహరణము:—కాంత ఘటించుచున్నది, చేయుచున్నది- ఈస్త్రీశబ్దము తిర్యగ్జడములకు నుపలక్షణము. అందుచేత, చిలుక భావింపఁగలదు, పలుకఁగలదు; భావించదు, పలుకదు; ఇత్యాదిశబ్దములు భవిష్యద్వ్యతిరేకార్థముల యందుఁ జూచుకొనునది. వర్తమానార్థమునకైన, చిలుక పలుకుచున్నది- అని దివర్ణకము చూచుకొనునది. "దుదీ తిర్యగ్జడస్త్రీషు తేష్వర్థే ష్వేకతాం గతౌ" అని యథర్వణవచన మున్నది గనుక నీప్రయోగము లీలాగున గ్రహించుకొనునది. "తచ్ఛబ్దస్యాన్వయో వాస్యా ద్భవిష్యద్వర్తమానయోః" అను విశేషవచనము వలనఁ దచ్ఛబ్దార్థము గలుగుటచేతను, ఘటింపఁగలవాఁడు, ఘటించుచున్నాఁడు, ఘటింపఁగలయది, ఘటించుచున్నయది-అని రూపములు గ్రహించుకొనునది. అనవుడు, నావుడు, అడ్డమగుడు, ఇత్యాదిరూపములు వర్తమానార్థమందు, ఇంచుగాగమములేకయే "లటిడుజ్వాస్యా"త్తని డుజ్జు వచ్చిన నయిన వని తెలిసికొనునది. "కేషాంచి ద్దేశ్యశబ్దానా మించుగిల్లుగపీష్యతే" అని యించుగాగమము రాకపోయినది. అన్యస్మాచ్చాధాతోశ్చ, అన్యస్మాత్ = తద్ధర్మమిూఁదను, అధాతోశ్చ = ధాతువు గానటువంటి మఱియొకశబ్దము మిూఁదను, ధాతుత్వవివక్షయైవ = ధాతుస్వరూపముగానె వివక్షించుటచేత, ఇంచుక్ = ఇంచుగాగమము, భవతి = అవుచున్నది. అస్తమించుచున్నాఁడు, అంతరించుచున్నాఁడు, అస్తమింపఁగలఁడు, అస్తమించెడిన్, అస్తమించున్, అస్తమించెన్, సుఖించెన్, కరుణించెన్, పల్లవించెన్-ఇత్యాది. ఉరవడి, ఇనుమడి, ముమ్మడి, తుఱఁగలి, చెంగలి, తొలకరి, తల్లడ-ఇత్యాది దేశ్యశబ్దముల మిూఁదను, నీసూత్రముచేతనే యించుగాగమము వచ్చినది. ఉరవడించె,

ఇనుమడించె, ముమ్మడించె, తుఱఁగలించె, చెంగలించుచున్నది, తొలకరింపఁ గలదు, తల్లడించుచున్నాఁడు. ఈసూత్రముచేతనే తద్భవశబ్దములమీఁదను నించుగాగమును గలదు. త్రుళ్ళించె, వ్రక్కలించె-ఇత్యాది. అన్యస్మాత్ అన్నాఁడు గనుక తద్ధర్మముమీఁద నించుగాగమము గలదు. అది యేలాగున నంటేని-ఉపపాదించుచున్నాఁడు:-"క్రియామాత్రయాగోచరార్థ స్తద్ధర్మ ఇతి కథ్యతే, ధాతోర్ధర్మ ఇతి ప్రోక్తో వికృతౌ పూర్వసూరిభిః"అను విశేషవచనమువలన, భూతాద్యర్థత్రయవిలక్షణమైన యొకానొకధర్మము తద్ధర్మ మనిపించుకొనును. అదియేదంటేని, వాచ్యార్థమాత్ర మైన ధాతుధర్మమే. అటువంటి ధాతుధర్మముమీఁదను,"అన్యస్మా...భవతీంచుక్"అని యించుగాగమము వచ్చిన, పోషించు-అని యుండ, "ప్రథమైకవచనలోప స్తద్ధర్మాతీతయోః క్రియాణాం స్యాత్" అని ప్రథమైకవచనలోపము వచ్చి "పోషించు" అని తద్ధర్మక్రియారూప మాయెను. ఈలాగుననే, జయించు నతఁడు, అనుభవించు నితఁడు, సంహరించు భవుఁడు, అర్థించు యాచకుఁడు- అని యుపకృతిపరిణతిసంవృతిక్రియల తద్ధర్మరూపములు చూచుకొనునది.]

---

తిర్యగ్జడేషు కర్తృషు బహువచనం చైకవచనమేవ స్యాత్
భూతే తద్ధర్మేచాన్యత్రవుపీ*ప్రాగ్వ దేకవచనంతు.

ఇది మూఁడుసూత్రములు. తిర్యగ్జడేషు=తిర్యగ్జంతువులును, అప్రాణులును, కర్తృషు సత్సు=కర్తలై యుండిన, భూతే తద్ధర్మే చ=భూత తద్ధర్మముల యందు, బహువచనం=ప్రథమపురుష బహువచనమును, ఏకవచనమేవ=ఏకవచనమే, స్యాత్=అగును. చిలుకలు రంజిల్లె, రంజిల్లు, చివుళ్ళు విలసిల్లె, విలసిల్లు. అన్యత్ర=వ్యతిరేకసానుబంధములయందు, వుపీ=వు, వి- అనునవి వచ్చును. ఏకవచనం=ఏకవచనము, ప్రాగ్వత్=మునుపు చెప్పిన ప్ర్యత్యర్థములకువలె నేయగును. వ్యతిరేకభవిష్యదర్థముల బహువచనములకు వు వర్ణకమును, వర్తమానబహువచనమునకు, వివర్ణకము నగు ననుట. చిలుకలురంజిల్లవు, చిలుకలురంజిల్లఁగలవు, చిలుకలు రంజిల్లుచున్నవి. ఏకవచనమునకు దుదివర్ణకములు వచ్చును. రంజిల్లదు, రంజిల్లఁగలదు, రంజిల్లుచున్నది.

[తిర్యగ్జడేషు-తిర్యక్=పశుపక్షిమృగాదులును, జడేషు= తరుశైలాదు

---

* కెండవప్రతిలో- స్త్రీవదేకవచనంతు.

లును, కర్తృషు=కర్తలగుచుండఁగా, భూతే=భూతార్థమునందును, తద్ధర్మేచ=తద్ధర్మమునందును, బహువచనం చ= ప్రథమపురుషబహువచనము, ఏకవచనమేవ స్యాత్=ఏకవచనమే యగును. ధేనువులు రంజిల్లు, చిలుకలు వర్ధిల్లు, మేఘములువర్షించు- అని తద్ధర్మమున కుదాహరణములు. ధేనువులు రంజిల్లె, చిలుకలు వర్ధిల్లె, మేఘములు వర్షించె, వృక్షములు ఫలించె, శిలలు చలించె, వీణలు పలికించె (తంత్రులు)-అని భూతార్థమున కుదాహరణములు. గోవులు మేసవు, చిలుకలు పలుకవు, గోవులు మేసె, చిలుకలుపలికె, అని వికృతిక్రియల కుదాహరణములు. "యద్యన్యసహయోగస్యాద్రూపమేవతు విద్యతే" అను నథర్వణవచనము వలన, మహత్సహయోగమైన, బహువచనమే యగును. ఉదా-కాంచిరి తామరయు నెలయు ఘనకవివృత్తుల్. అన్యత్ర=వ్యతిరేకార్థ భవిష్యదర్థవర్తమానార్థములయందు, వువీ=వు అనువర్ణకమును, వి అనువర్ణకమును వచ్చును. అనఁగాఁ దిర్యగ్జడాదులు కర్తలయిన, వర్తమానార్థక్రియా బహువచనము వి అనియు, వ్యతిరేకభవిష్యదర్థక్రియాబహువచనము వు అనియు వచ్చు ననుట. వృక్షములు ఫలించుచున్నవి, వృక్షములు ఫలింపఁగలవు, చిలుకలు రంజిల్లఁగలవు, చూతములు పూయఁగలవు-ఇత్యాది. స్త్రీవదేకవచనంతు-ఈయర్థములయందె యేకవచనము, స్త్రీవత్=స్త్రీలింగములకుం బలెనే యుండును. అనఁగా- "స్త్ర్యర్థే పునర్దదీ భవతః" అని చెప్పినాఁడు గనుక నాలాగుననే వర్తమానార్థమునందు ది యనువర్ణకమును వ్యతిరేక భవిష్యదర్థములయందు, దు అనువర్ణకమును వచ్చుననుట. చిలుక రంజిల్లుచున్నది, రంజిల్లఁగలదు, రంజిల్లదు, వృక్షము ఫలించుచున్నది, వృక్షము ఫలింపఁగలదు, ఫలింపదు.]

---

ఉత్వయుతౌ వనకారౌ స్యాతాం మధ్యోత్తమైకవచనానామ్

సర్వేషాం బహువచనే రు ఇతి స్యాదుత్తమస్యతు భవే న్మః. ౫

ఇది మూఁడుసూత్రములు. మధ్యోత్తమైకవచనానాం=వ్యతిరేకాదుల యొక్క మధ్యమ పురుష, ఉత్తమ పురుషైకవచనములకు, ఉత్వయుతౌ=ఉత్వముతోఁ గూడిన, వనకారౌ=వకార నకారములు, స్యాతాం=అవును. ఘటింపవు, ఘటించుచున్నావు, ఘటింపఁగలవు, ఘటింతువు. ఇవి మధ్యమపురుషలు- ఘటింపను, ఘటింపఁగలను, ఘటించుచున్నాను, ఘటింతును, ఇవి- యుత్తమపురుష

లు. సర్వేషాం=సమస్తమైనయర్థములకును, బహువచనే=బహువచనమందు, రు ఇతి=రు- అను వర్ణకము, స్యాత్=అవును. ఉత్తమస్య తు=ఉత్తమపురుష బహువచనమునకు, ము- భవేత్=ము వర్ణక మగును. వీరలు ఘటియించుచున్నారు, మీరలు ఘటించుచున్నారు, మేము ఘటించుచున్నాము, మీరలు ఘటింపరు, మీరలు ఘటింతురు, వీరలు ఘటించిరి, మీరలు ఘటించితిరి, మేము ఘటించితిమి- భూతార్థమందు, ఇత్వము చెప్పినాఁడు. వీరలు ఘటింపఁగలరు, మేము ఘటింపఁగలము, మీరుఘటింపరు.

[సర్వేషాం=ఉపకృతి, పరిణతి, సంవృతిరూపములైన సమస్తక్రియలకును, మధ్యోత్తమైకవచనానాం=మధ్యమపురుషయొక్కయు, నుత్తమపురుషయొక్కయు, నేకవచనములకు, ఉత్వయుతౌ=ఉకారముతోఁ గూడుకొనినటువంటి, వనకారౌ=వకారనకారములు, స్యాతాం=అవును. అనఁగా మధ్యమపురుషకు వుకారమును, ఉత్తమపురుషకు నుకారమును, వ్యతిరేకవర్తమాన భవిష్యత్తద్ధర్మవాచకక్రియలకు వచ్చుననుట. వీని కుదాహరణములు. వ్యతిరేకార్థమునకు- ఘటింపవు, ఘటించవు, చేయవు, డాయవు. వర్తమానమునకు- ఘటించుచున్నావు, ఘటింపుచున్నావు. భవిష్యదర్థమునకు- ఘటింపఁగలవు, ఘటించఁగలవు, చేయఁగలవు. తద్ధర్మమునకు- ఘటింతువు, చేయుదువు. ఇవి యన్నియు మధ్యమ పురుషోదాహరణములు. ఇంక నుత్తమపురుషోదాహరణములు చెప్పుచున్నాము. వ్యతిరేకార్థమునకు-ఘటింపను, ఘటించను, చేయను. వర్తమానార్థమునకు- ఘటించుచున్నాను, ఘటింపుచున్నాను, చేయుచున్నాను. భవిష్యత్తద్ధర్మములకు- ఘటింతును, చేయుదును, అని యుండును. సర్వేషాం=సమస్తమైనక్రియలకును, బహువచనే=భూతభవిష్యద్వర్తమాన తద్ధర్మార్థబహువచనములయందు, రు ఇతి స్యాత్=రు అనువర్ణకము వచ్చును. ఈ రు అనువర్ణకము ప్రథమపురుష మధ్యమపురుషలయందే యని గ్రహియించుకొనునది. “ఉత్తమస్యతు భవేన్మః” అని విశేషించి యుత్తమపురుషకు ముకారము చెప్పినాఁడు గనుక వీనికుదాహరణములు:—వర్తమానార్థమందు ప్రథమపురుషకు:- వారు ఘటించుచున్నారు వీరు రక్షించుచున్నారు. మధ్యమపురుషకు:- మీరు ఘటించుచున్నారు. భవిష్యదర్థమునకు:-వారుఘటింపఁగలరు, రక్షింపఁగలరు, మీరుఘటింపఁగలరు, పోషించఁగలరు. తద్ధర్మమునకు:-వారుఘటింతురు. వ్యతిరేకార్థమునకు:-వారుఘటింపరు, మీరుఘటింపరు. భూతార్థమునకు:-

"క్త్వాభూతయోః క్రియాన్త్యస్యేత్" అని యికారము వచ్చుచున్నది గనుక వారుఘటియించిరి, మీరుఘటించితిరి- అనియుండును. ఉత్తమస్యతు=ఉత్తమ పురుషకు, ము=మువర్ణకము, భవేత్ = అవును. మేము ఘటింపుచున్నాము. ఘటింపఁగలము, ఘటింతుము. "క్త్వా భూతయోః క్రియాన్త్యస్యేత్" అని యికారమువచ్చి ఘటించితిమి, అనివచ్చును. ఏకవచనమునకును, "ఉత్వాయు తౌవనకారౌ" అను సూత్రమువలన నుకారము వచ్చిన, నాపైని "భూతా దుతాం పరేషా మిత్" అను నుత్తరసూత్రముచేత నిత్వమువచ్చి-ఘటించితిని అనివచ్చును.]

---

ఏకత్వేథ బహుత్వే ముడుజౌ సంప్రార్థనార్థకేషు స్తః
దాచోర్లు క్తద్ధర్మే ప్రథమైక స్యైద్భవేచ్చ భూతార్థే. ౧౦

ఇది మూఁడు సూత్రములు. సంప్రార్థనార్థకేషు= ప్రార్థనార్థములయందు, ఏకత్వే= ఏకవచనమునందును, అథ= ఆవెనుక, బహుత్వే= బహువచనము నందును, ముడుజౌ= ముడుజ్వర్ణకములు, స్తః=అవును. ఘటింపుము, ఘటింపుఁడు. జిత్తు గనుక బిందువు. తద్ధర్మే=తద్ధర్మార్థమందు, చోః=ఇంచుగాగమచు కారమునకు, దా=దువర్ణకము పరమైన, లుక్=లోప మగును. ఘటింతు, నటింతు. దకారమునకు తకారమువచ్చుచున్నది. భూతార్థే=భూతార్థమందు, ప్రథమైకస్య=ప్రథమపురుషైకవచనమునకు, ఎత్=ఎకారము, స్యాత్=అవు ను. ఘటించె, చేసె.

[అథ=అతర్వాతను, సంప్రార్థనార్థకేషు=సంప్రార్థనార్థకములు వివక్షిత ము లగుచుండఁగా, ఏకత్వే=ఏకవచనమందును, బహుత్వే=బహువచనమందు ను, ముడుజౌ=మువర్ణకడువర్ణకములు, స్తః=అవును. అనఁగా- నేకవచనమున కు ముకారమును బహువచనమునకు డుకారమును వచ్చుననుట. నన్నుఁ బోషింపుము, నన్నుఁబ్రోవుము, అని ముకారమున కుదాహరణము. నన్నుఁబోషింపుఁడు, నన్నుఁబ్రోవుఁడు, అని డుకారమున కుదాహరణము. తద్ధర్మే=తద్ధర్మార్థమునందు, దా=దు పరమగుచుండఁగా, చోః=ఇంచుగాగమ సంబంధియైన చుకారమునకు, లుక్=లోపము వచ్చును. ఈలోపము మధ్యమోత్తమపురుషలకే యని గ్రహించుకొనునది. "మధ్యోత్తమైకవచనానాం" అని చెప్పినాఁడు కనుక-ఉదా:-ఘటింతువు, ఘటింతును, నటింతువు, నటింతును. ఈత

కారమునకు ముందరఁ జెప్పఁబడుచున్నది. భూతార్థే=భూతార్థమునందు,ప్రథమైకస్య=ప్రథమపురుషైకవచనమునకు, ఎత్ =ఎకారము, భవేత్ = అగును. "ప్రథమైకవచనలోపః" అనుసూత్రముచేతఁ బ్రథమైకవచనలోప మగును. ఉదా:-చనియె, కనియె, వినియె మొదలైనవి.]

---

దుతివర్ణకౌ క్రమాత్స్తో నాద్యస్యాదేర్ద్వయోశ్చ భూతార్థే
బిందుపరస్య తకారో దోస్స్యాద్భూతా దుతాం పరేషామిత్. ౧౧

ఇది యైదుసూత్రములు—దుతివర్ణకౌ=దు, తి, వర్ణకములు, క్రమాత్=క్రమమున (తద్ధర్మభూతార్థములకు) స్తః=అవును. ఆద్యస్య=తద్ధర్మమునకు, ఆదేః=ప్రథమపురుషైకవచనమునకు, న=లేదు. భూతార్థే=భూతార్థమందు, ద్వయోశ్చ=ప్రథమపురుషైకవచన బహువచనములకు రెంటికిని, న=లేదు. ఘటించు, ఘటింతురు, ఘటింతుము, ఘటించె, ఘటించిరి, ఘటించితివి, ఘటించితిరి, ఘటించితిమి. ఇత్యాది- బిందుపరస్య=బిందువుకంటెఁ బరమైన, దోః=దువర్ణకమునకు, తకారః=తకారము, స్యాత్=అవును. ఘటింతు, ఘటింతురు. "డాచోర్లు" క్కని చు లోపమైనమొడల బిందుయుతత్వము. భూతాత్=భూతార్థమువిూఁదను, పరేషాం=పరమైన, ఉతాం=ఉవర్ణకోకారములకు, ఇత్=ఇత్వమౌను. ఘటించితివి, ఘటించితిరి, ఘటించితిని, ఘటించితిమి. వు ను రు ముల కిత్వము వచ్చినది.

[దుతివర్ణకౌ క్రమాత్ స్తః-తద్ధర్మభూతార్థములయందు, మధ్యమపురుషకును, ఉత్తమపురుషకును ఏకవచనములందు- అని పూర్వసూత్రము వలన నధ్యాహరించుకొనునది; క్రమాత్=క్రమమువలన, దు తి వర్ణకౌ=దువర్ణకమును, తివర్ణకమును, తద్ధర్మార్థ మధ్యమోత్తమ పురుషైకవచనములకు, దు అను వర్ణకమును తిఅనువర్ణకమును వచ్చుననుట-ఉదా:—తద్ధర్మమునకు,నీవు పోషించుదువు, చేయుదువు, నేను బోషించుదును, చేయుదును. భూతార్థ మధ్యమోత్తమ పురుషైకవచనముల కుదాహరణము:—నీవు పోషించితివి, నేను బోషించితిని, అనుశబ్దములు. నాద్యస్యాదేః=ఆద్యస్య=తద్ధర్మవాచక ప్రథమపురుషయొక్క, ఆదేః=ప్రథమైకవచనమునకు, న=దువర్ణకము లేదు. ఉదాహర:—పోషించును,చేయును మొదలైనవి, భూతార్థే=భూతార్థమునందు,ద్వయోశ్చ=ప్రథమపురుషైకవచన బహువచనములు రెంటియందును, న=తివర్ణకము లేదు.

ఉదా:—పోషించెను, చేసె, పోషించిరి, చేసిరి, మొదలైనవి, బిందు...స్యాత్, బిందుపరస్య—బిందు=బిందుప్రకంబెను, పరస్య=పరమైనటువంటి, దోః=దువర్ణసంబంధి యైన హల్మాత్రమునకు, తకారః=తకారము, స్యాత్ =అవును. అనఁగా "డాచోర్లుక్తద్ధర్మే" అను పూర్వసూత్రముచేత, దుకారలోపము గలుగుచుండఁగా బిందుపరత్వము దకారమునకు సిద్ధించుచున్నది. కనుక, అటువంటి దకారమునకు తకారము వచ్చుననుట, ఉదా:—నేను ఘటింతును, నీవు ఘటింతువు. భూతా...మిత్- భూతాత్ =భూతార్థముకంటె, పరేషాం=పరమైయున్న-ఉతాం=ఉకారములకు, ఇత్ =ఇకారము వచ్చును. ఉదాహరః:—నీవు ఘటించితివి, నేను ఘటించితిని. మీరు ఘటించితిరి. మేము ఘటించితిమి.

ప్రార్థనార్థే మర్వికల్పే కథ్యతే మధ్యమార్థకః
విభాషాం తం వదన్త్యేకే నవ్యాణేతు కదాపిచ.

అను నథర్వణవచనమువలన ముకారలోపము మధ్యమపురుషకుఁ గలదు. అచ్చుపరముం డుండిన లోపము లేదు. ఉదా:—సుఖము ఘటింపు, మమ్ముఁ గరుణఁ జూడు. అచ్చు పరమై యుండిన, ఘటింపు మమలసుఖము—ఇత్యాదికము చూచుకొనునది.

తద్ధర్మప్రథమస్యైతాం డుడివర్ణాచ నాంతకౌ
దోస్తు భేదకతాపి స్యా దితి కేషాంచి దీరితమ్
డుడ్యాదివర్ణే భూతార్థే చాపి తద్వద్భవే త్సదా.

అను నథర్వణవచనము వలనఁ దద్ధర్మప్రథమైక వచనమందు, డు, డి, యను వర్ణకములు నాంతములై వచ్చును. డువర్ణకమునకు భేదకత వచ్చును. ఉదా:—వచ్చెడున్, పోషించెడున్, వచ్చెడిన్, పోయెడిన్, రక్షించెడిన్, విశేషణమాట కుదాహరణము:—వచ్చెడి రాజిల్లెడు మోము, అభీష్టమొసఁగెడు దేవుఁడు. ఇత్యాది. ఈడుడ్యాదివర్ణకములు భూతార్థమునందైన నిత్యమే వచ్చును. పాడెన్, వీడెన్, వినఁబడెన్, ఇత్యాది.]

---

లఘ్వేకాక్షరపూర్వక్రియాన్తిమస్యానయోర్భవే దిదావ
తిఙ్మధ్యనామకాః స్యుర్మధ్యమపురుషాశ్చ యే రమాన్తాశ్చ. ౧౨

ఇది రెండుసూత్రములు. అనయోః=అయ్ పరిణతి లేని, లఘ్వేకాక్షరపూర్వక్రియాన్తిమస్య=లఘువయిన యేకాక్షరము పూర్వమందుఁ గల క్రియ

ర్యొక్కతుదకు, ఇత్=ఇకారము, వా=వికల్పమున వచ్చును, ఘటించె, ఘట్ అనునది లఘ్వేకాక్షరపూర్వమును అయ్ లేనిది గనుకను దీని తుది టకారము మీఁద నిత్యము వచ్చిన నించుగాగమము, ఇకారము, ఆపైని ప్రత్యేకము నిల్చెను. ఘటియించె, ఘటించె, వికల్పము గనుక నటియించె, నటించె-లఘుపూర్వమైనఁగాని యేకాక్షరము కాదు గనుక కరుణించె, శయనించె నిత్యాదుల లేదు. ఏకాక్షరమైనఁ గాని లఘుపూర్వము గాదు గనుక సాధించె, బోధించె, నిత్యాదుల లేదు. అనయః అన్నందుచేత జయించె, క్రయించె నిత్యాదుల లేదు. మధ్యమ పురుషాశ్చ=మధ్యమ పురుషలును, రమాన్తాః=రుము, రిమి, యనునవి యంతమందుఁ గలవియు, యే=ఏవో, అవి యన్నియు, తిజ్మధ్యనామకాః= తిజ్మధ్యములను పేరుగలవి, స్యుః=అగును. తిజ్మధ్యములు ద్రుతప్రకృతులు గావు గనుక ఘటించి రుత్సవము, ఘటించితిరి కుశలములు, చూతురు ప్రభువుల, చనిరి పురికి, వింటిమి పురాణములు, కొలుతుము పరమేశ్వరుని-ఇత్యాదుల కెల్లఁ బ్రవేశము లాయెను. ఇవి ప్రథమామాత్రములు గనుక వినరుగాక, చూచితిమిగదా ఇత్యాదుల గసడదవలు రాను.

[అనయః=అయంతము గానటువంటి, లఘ్వేకాక్షర పూర్వ క్రియాన్తిమస్య-లఘు=లఘువైనటువంటి, ఏకాక్షర=ఒకయక్షరము, పూర్వ=పూర్వము నందుఁ గల, క్రియా=క్రియాపదముయొక్క, అన్తిమస్య=అంతిమవర్ణమునకు, వా=వికల్పమున, ఇత్=ఇకారము, భవేత్=అవును. ఉదాహర:—ఘటించె, ఘటియించె, నటించె, నటియించె, లఘ్వేకాక్షరపూర్వము కాకుండిన వికల్పము లేదు. రంజించె, అనియే కాని రంజియించె నని లేదు. ఏకాక్షరము కాకున్నను వికల్పము లేదు. కరుణించె. అయంతమైన వికల్పము లేదు. జయించె, నయించె. "న ప్రాద్యవ్యయ సంబంధస్తన్నిషేధే ప్రయోజకః" అను నథర్వణ వచనమువలనఁ బ్రాదులచేత నేకాక్షరపూర్వకత్వము లేకున్నను వికల్పము కలదు. ఉదా:-విఘటించె, విఘటియించె, ఉత్తరించె, ఉత్తరియించె-ఇత్యాది. తిజ్మధ్య ....రమాన్తాశ్చ-మధ్యమపురుషాశ్చ=మధ్యమపురుషలును, రమాన్తాశ్చ=రేఫాంత మకారాంతములును, యే=ఏవిగలవో యవి, తిజ్మధ్యనామకాః= తిజ్మధ్యనామకములు, తిజ్మధ్య లను సంజ్ఞ కలవి. స్యుః=అవును. ఈ సంజ్ఞకు ఫలమే మంటేని, "తిజ్మధ్యశేషషష్ఠీ" అను సూత్రమునందుఁ గళాసంజ్ఞ గలుగుట.

రంజిల్లితిరి, చేసితిరి; ఘటించితిరి, ఘటించితిమి, చేసితిమి. ఇత్యాదికము లయినవి రమాంతములు.]

---

చో రాత్మనేపదార్థే గృహ్ణాతౌ వాగమస్య చేత్వంస్యాత్
రఞ్జతి ఘట్యాదీనాం బిన్దో శ్చస్యాపి లావుభౌ భవతః. ౧౩

ఇది రెండుసూత్రములు. ఆత్మనేపదార్థే=ఆత్మనేపదార్థమయిన, గృహ్ణాతౌ=గ్రహిధాత్వర్థము పరమైనపుడు, ఆగమస్య చ=ఇంచుగాగమముయొక్క, చోః=చుకారమునకు, వా=వికల్పమున, ఇత్వం స్యాత్=ఇత్వము వచ్చును. ఘటించుకొని, ఘటించికొని, క్రియాఫలము కర్తృగామి యైన క్రియ గనుక నాత్మనేపదము "కొని" యనునది గ్రహిధాత్వర్థము. ఈయిత్వ మించుగాగమము లేని దేశ్య క్రియలకును వచ్చును. నేర్చికొని, అంటికొని రఞ్జతి ఘట్యాదీనాం=రఞ్జ రాగే, ఘట సంఘటనే మొదలయినధాతువులయొక్క, బిన్దోః=ఇంచుగాగమములోని సున్నకు, చ స్యాపి, ఆచువర్ణమునకును, లౌ=లకారములు, ఉభౌ=రెంటికి రెండు, భవతః=అవును. రెండులకారములు గూడి సంయుక్తమైన, రంజిల్లు, ఘటిల్లు, వర్తిల్లు, వర్ధిల్లు-ఇత్యాది.

[ఆత్మనేపదార్థే=ఆత్మనేపదమున కర్థమైనటువంటి, గృహ్ణాతౌ=గృహ్ణాతి ధాత్వర్థము పరమాచుండఁగా, ఆగమస్య=ఇంచుగాగమముయొక్క, చోః=చుకారమునకు, వా=వికల్పమునను, ఇత్వం=ఇకారము, స్యాత్=అగును. "స్వరితఞితః కర్త్రభిప్రాయే క్రియాఫలే," అనువ్యాకరణసూత్రమువలనఁ గ్రియాఫలము కర్తృగామి యగుచుండఁగా, నాత్మనేపదము వచ్చినది గనుక నిక్కడ గృహ్ణాతి కర్థమైనటువంటి "కొని"యన్నశబ్దము కర్తృగామి గనుక దానికి "ఆత్మనే పదార్థే" అని విశేషణము పెట్టినాఁడు. అటువంటి కొనియనుశబ్దము పరమైయుండిన నించుగాగమ చుకారమునకు, ఇకార ముండును. ఇకారము వచ్చుననుట. ఉదా:-ఘటించికొనియె, ఘటించుకొనియె- ణిజర్థమైన- ఘటింపించికొనియె, ఘటింపించుకొనియె, కావించుకొనియె, కావించికొనియె- నిత్యాదికములు. ఇంచుగాగమము లేకున్నను గాని యీవికల్పము వచ్చును. నేర్చుకొనియె, నేర్చికొనియె; అందుకొనియె, అందికొనియె. రఞ్జతి ... భవతః-రఞ్జతి ఘట్యాదీనాం=రఞ్జతి, ఘటి, మొదలుగాఁగల, అకర్మకధాతువులయొక్క, బిన్దోశ్చస్యాపి=ఇంచుగాగమసంబంధియైన బిందువునకును, చకారమునకును, ఉభౌ

లౌ భవతః=రెండులవర్ణము లాదేశములై వచ్చును. ఉదాహరణము:--రంజిల్లు, ఘటిల్లు, విస్తరిల్లు-అపిశబ్దమువలన-వర్ధిల్లు, వర్తిల్లు, శోభిల్లు, సంధిల్లు, రాగిల్లు, అనురాగిల్లు, మత్తిల్లు మొదలయినవి గ్రహించుకొనునది. ఒకానొకచోట నించుగాగమమును వచ్చును. చింతిల్లె, చింతించె; సంతోషించె, సంతోషిల్లె; ఉద్భవించె, ఉద్భవిల్లె; సంభవించె, సంభవిల్లె; వికసించె, వికసిల్లె; ప్రకాశించె, ప్రకాశిల్లె; అతిక్రమించె, అతిక్రమిల్లె. తద్భవములయందు లాదేశద్వయమే వచ్చుచున్నది. ఉప్పతిల్లె, సొమ్మసిల్లె, సొంపిల్లె, తళుకొత్తిల్లె, దద్దరిల్లె, దోరగిల్లె, ఆవటిల్లె, నివ్వటిల్లె-తత్సమములయందును గొన్నిచోట్ల వర్ణలోపవర్ణాగమములు వచ్చును. తేజరిల్లు, ప్రజ్వరిల్లు- అనుచోట "రలయో రభేదః" అని కొందఱు రకారస్థానమందు రేఫవ్యవహార మన్నారు. "తత్రోభయో ర్భవే దేకో లకార ఇతి కేచన" అనునథర్వణవచనము వలనఁ గొన్నిచోటుల నేకలకారమే వచ్చును. పాటిలు, వర్తిలు, అవతరిలు-ఇత్యాది].

---

నతు ణౌ భవేచ్చలోపో ణ్యర్థే యోవర్తతే పరత్రాస్య
పునరాగమః క్రియాణాం పర్యాప్తో మన్మతేతు సంకేతః. ౧౪

ఇది మూఁడు సూత్రములు. ణౌ=ణిజర్థమైన యించుగాగమము పరమైనయెడల, న=లకారములు లేవు. ణిజర్థ మనఁగాఁ గ్రియ మఱియొకరిచేతఁ జేయించునది. రంజించె, ఘటించె నిత్యాది- ణేశ్చ అని ణిచ్ఛ్వకించుగాగమము వచ్చినది. స్వభావపుటించుగాగమము అనంతరసూత్రమున లోప మైనది. ణ్యర్థే=ణిజర్థమందు, యః=ఏయించుగాగమము, వర్తతే=వర్తించునో, పరత్ర=అది పరమయినయెడల, అస్య=స్వభావపుటించుగాగమమునకు, లోపః=లోపము, భవేత్=అవును. రంజించె. ఉత్తరసూత్రము సంపదాయవేద్యము.

[ఇదినాలుగుసూత్రములు-నతుణౌభవేచ్చ-ణౌ=ణిజంతమునందు, నభవేచ్చ=లాదేశద్వయమురాదు. ఇంకనేమంటేని-ఇంచుగాగమమే వచ్చును. రంజించె మమ్ము, ఘటించె సత్కార్యము, జల ముత్పాదించె, ఘూర్ణించె రిపుల, రంజించె నాశ్రితుల- లోపో ణ్యర్థేయో వర్తతే పరత్రా స్య-ణ్యర్థే=ణ్యర్థము, పరత్ర=పర మగుచుండఁగా యః=ఏయించుగాగమము, వర్తతే=వర్తించునో, అస్య=ఈ యించుగాగమమునకు, లోపః=లోపము వచ్చును —

ఒనర్చె, తనర్చె, నిత్యాదికము చూచుకొనునది. కొన్నిశబ్దముల కర్థవిశేషము గలుగుచుండఁగా సకర్మకత్వము వచ్చుచున్నది, గనుక, దాని మీఁద ణిజర్థము వచ్చిన, ఘటింపించె, వర్ధింపించె-ఇత్యాదిరూపములు వచ్చును. "కేచిత్తు ణిచమిచ్ఛన్తి ధాతోరేవ" అను నథర్వణసూత్రమువలన నించుగాగమరహితమైనట్టి ధాతువుమీఁదను గొన్నిచోటుల ణిజర్థము వచ్చును పురసుల చేలుకాఁపులు ధాన్యరాసులు పండును(!) ఇత్యాదులు చూచుకొనునది. పునరాగమః క్రియాణాం-క్రియాణాం=క్రియలకు, పునరాగమః=విశేషాగమము వచ్చును. ఇక్కడఁ బునశ్శబ్దము విశేషార్థవాచకము. ఉదాహరణము :—అవధరింపుమా యనుచోట-"అవధారు" అనిపదము. మన్మతే=మామతమునందు, సంకేతః=శిష్టప్రయోగానురూపశబ్దము, పర్యాప్తః=సుప్రసిద్ధము. అనఁగా నీ శాస్త్రము దిక్ప్రదర్శనమాత్రముగాని, యాంధ్రమునకు సంకేతిత మైనపదము ప్రయోక్తవ్య మనుట]

---

సంప్రార్థనార్థకా దీదేదాతౌ ప్రశ్నలక్షణౌ భవతః
ఏదోతౌ వ్యతిరేకా దపి సంప్రార్థనపరౌ క్రియాణాం స్తః. ౧౫

ఇది మూఁడుసూత్రములు. సంప్రార్థనార్థకాత్=సంప్రార్థనార్థకమయిన క్రియాపదము మీఁద, ఈత్=ఈకారము వచ్చును. రక్షింపుమీ, ప్రోవుమీ, ఏదాతౌ=ఏకారాకారములు, ప్రశ్నలక్షణౌ=ప్రశ్నలక్షణములై స్వభావములు, భవతః=అగును. నను బ్రోవవే గౌరి, చేపట్టవా యంబ, చేయవే, చనియెదా, ఏదోతౌ=ఏకారౌకారములు, వ్యతిరేకాదపి=వ్యతిరేకముమీఁదను, సంప్రార్థనపరౌ=సంప్రార్థనార్థప్రధానములు, క్రియాణాం=క్రియలకు, స్తః=అవును. ననుఁ బ్రోవవే గౌరి, చేపట్టవో య-బ.

[సంప్రార్థనార్థకముడుజ్వర్ణాద్యన్తాత్క్రియాపదాదీత్స్యాత్
వ్యతిరేకేతుసుబన్తా దేదాతౌ ప్రశ్నలక్షణౌ భవతః.

ఇది నాలుఁగుసూత్రములు. సంప్రార్థనార్థక=సంప్రార్థనార్థకము లయినటువంటి, ముడుజ్వర్ణాద్యన్తాత్=ముకారము డుకారము మొదలైనవి యంతమందుఁ గలట్టి, క్రియాపదాత్=క్రియాపదముమీఁదను, ఈత్స్యాత్=ఈకారము వచ్చును. రక్షింపుము, అనుచోట రక్షింపుమీ, యనవచ్చును. రక్షింపుఁడు అనుచోట రక్షింపుఁడీ-కావుమీ, పొమ్మీ, కావుఁడీ, పొండీ, రండీ యను శబ్ద

ములు చూచుకొనునది. ఆదిశబ్దముచేతఁ బ్రశ్నాదివాచకములకును ఈకారము గలదు. నీసాటి యేదీ, నీసాటి యేరీ, వ్యతిరేకే=వ్యతిరేకము కలుగుచుండఁగా, సుబన్తాత్=సుబంతమైన శబ్దమునుండి, ఏదౌతౌ=ఏకారాకారములు, ప్రశ్న లక్షణౌ=ప్రశ్నవాచకములు, భవతః=అవుచున్నవి. మమ్ముఁ గాచితివే, మమ్ము రక్షించితివా, నన్నుఁ బ్రోవవే, ఇత్యాది- "వ్యతిరేకే సుబన్తాదపి" యన్నాఁడు గనుక సుబంతమందును ఏకారముగలదు. పల్లవిదేటికే, ఏమేయబలా, శిరీష గాత్రీ, నీయార్జవమునకా యీయాదరణ, ఇత్యాది].

---

భావే టవర్ణకోన్తే సర్వేషాం చ క్రియాపదానాం స్యాత్
కర్మణ్యనుబన్ధస్స్యా త్పతిధాతుః కర్తృవచ్చ తద్విధయః. ౧౬

ఇది రెండు సూత్రములు. భావే=భావార్థమందు, సర్వేషాం=సమస్త మయిన, క్రియాపదానాం=క్రియాపదములకు, అన్తే=తుదను, టవర్ణకః=టవ ర్ణకము, స్యాత్=అవును, ఘటించుట, హరించుట- "సమస్తానాం" అన్నందు చేత, దేశీయక్రియలమీఁదను వచ్చును- చేయుట, మ్రోయుట-ఇత్యాది- కర్మణి=కర్మార్థమందు, పతిధాతుః=పడ్గతౌ అనుధాత్వర్థము, అనుబన్ధః=అను బంధము-స్యాత్=అవును. తద్విధయః=ఏత్వేత్వాదివిధులు, కర్తృవత్= కర్త్రర్థరూపములకు వలెనే యగును. పడు నన్నది పతిధాత్వర్థము, హరింపఁ బడుచున్నాఁడు, హరింపఁబడును, భజింపఁబడెను, సేవింపఁబడఁగలవాఁడు, ఇత్యాది.

[ఏదోతౌ వ్యతిరేకాదపి సంప్రార్థనపరౌ క్రియాణాం స్తః
భావే టవర్ణకోన్తే సర్వేషాంచ క్రియాపదానాం స్యాత్.

ఇది రెండుసూత్రములు. వ్యతిరేకాదపి=వ్యతిరేకార్థమువీఁదను, క్రియాణాం=క్రియాపదములకు,ఏదోతౌ=ఏకార, ఓకారములు, సంప్రార్థనపరౌ= ప్రార్థనార్థకములై, స్తః= అగును. నన్ను రక్షింపవే, నన్నుం బ్రోవవో, అపిశబ్ద మువలన, మఱియొక యర్థముమీఁదను గూడ వచ్చును. వచ్చునో రాఁడో వాఁడు, వానిఁ దలఁచితో. ఇత్యాదులు చూచుకొనునది. భావే.....స్యాత్- సర్వేషాం= సమస్తమైన, క్రియాపదానాం= క్రియాపదములకును,అంతే= కడను,భావే= భావార్థకమునందు, టవర్ణకః= టవర్ణకము, స్యాత్=అవును. అతఁడు వచ్చుట, మిమ్ము రంజించుట. ఇది సమాసమందునుగలదు. నావచ్చుట,

నీవచ్చుట- వికృతిపదములయందును గలదు. అనుట, వినుట, కొనుట, తినుట, కనుట, మనుట. "పూర్వస్య న వికారో నోః" అను సూత్రమువలనను, అంట, కంట, యిత్యాదిశబ్దములు సాధువులు గావు. "మింటఁ గడుఁ దెల్లనై పాలు చుంట చూచి" యిత్యాదిప్రయోగములు డువర్ణలోపముచేత వచ్చిన వని తెలిసికొనునది.

విభక్తిమాత్రం సర్వత్ర మహితస్యా ట్టవర్ణకాత్ -
కేచి న్నాంతాత్పదా ద్గుర్వాద్యుత్తరా త్పట్టి మూచిరే.

అను నథర్వణవచనమువలన ఘటించుటకొఱకు, వచ్చుటకొఱకు, అని యు, నీవు రాఁబట్టి, నీవు తేఁబట్టి, కాఁబట్టి- ఇత్యాదిప్రయోగములు గలవు.

భవేత్క్రత్రిసమం నామ్నా మత్వం తస్మి౯ పరే భవేత్
క్త్వార్థేచ వ్యతిరేకార్థే ధాతో స్తత్రైవ మిర్భవేత్.

అను నథర్వణవచనమువలన వ్యతిరేకార్థము లైన క్త్వాప్రత్యయార్థము లందు క ప్రత్యయము ధాతువులమీఁద వచ్చును. ఘటింపక, ఘటించక, చేయ మి, ఘటించుకొనమి, నేరమి, ఇత్యాది- చూడఁగ, చూడక; చేయఁగ, చేయ; ఇత్యాదులు తుములలోనివి యని గ్రహించునది. "క్వచి ద్ద్రూఢాపి సాధుత్వం దృశ్యతే కవిభాషితే" అను విశేషవచనము తెలిసికొనునది.]

---

అత్వాది తత్సమానా మివ దేశ్యానాం క్రియాపదానాం చ
వర్ణాగమో విశేషః పురుషే ష్వర్థేషు చాపి వచనేషు. ౧౭

ఇది యేకసూత్రము-దేశ్యానాం=దేశీయము లైన, క్రియాపదానాం=క్రియా పదములకు, అత్వాది=అకారము మొదలయినవి, తత్సమానా మివ=ఉపకృ త్యాది తత్సమక్రియలకు వలె నగును. చేయంబడు, చేయంగలఁడు, ఇత్యాదు లత్వాదులు. ఆదిశబ్దముచేత నెత్వము మొదలైనవి. పిలిచె, కొలిచె నిత్యాది. పురుషేషు=ప్రథమాదిపురుషలయందును, అర్థేషు చ = తద్ధర్మాద్యర్థములయం దును, వచనేషు=ఏకవచన బహువచనములయందును, వర్ణాగమః=అక్షరభేద ములు వచ్చుట, విశేషః=తత్సమములకంటె విశేషము. దీని తాత్పర్యము:- దేశీయతెలుఁగులకు, ఎత్వాత్వములు సమములే యగును. స్థానాస్థానముల వర్ణవిశేషములు వింత. అదె ట్లంటేని:—వచ్చెననుక్రియకు - తద్ధర్మమధ్యమపు రుషకు వత్తు. లృడర్థమందు, రాఁగలఁడు. ప్రోచు ననుక్రియకు-బహువచన

మందు, ప్రోతురు. ప్రార్థనమందు, ప్రోవుము. చనియె, వినియె నిత్యాదిక్రియలకు భూతార్థమందు వచ్చు నెత్వము పరమైయుండఁగా, ఇకారము- ఇది మొదలైన వర్ణాగమములు బహువిధములు, ప్రయోగవేద్యము లావశ్యకము.

[అత్వాది=అత్వైత్వాది కార్యము, తత్సమానా మివ=తత్సమంబులకుం బలెను, దేశ్యానాం=దేశ్యము లైనటువంటి, క్రియాపదానాం=క్రియాపదములకు, స్యాత్=అవును. ప్రోచుచున్నాఁడు, ప్రోవఁగలఁడు, ప్రోచెన్, ప్రోచున్, పురుషేషు=ప్రథమ మధ్య మోత్తమ పురుషలయందును, వచనేషు=ఏకవచన బహువచనములయందును, అర్థేషు=భూతభవిష్యద్వర్తమాన తద్ధర్మములయందును, వర్ణాగమః=వర్ణాగమము, విశేషః=విశేషము, ఇందు కుదాహరణములు:—వచ్చు నను క్రియకు, వర్తమానార్థమునందు వచ్చుచున్నాఁడు, భవిష్యదర్థమునందు,రాఁగలఁడు, భూతార్థమునందు వచ్చె, తద్ధర్మమునందు వచ్చున్, వ్యతిరేకమునందు రాఁడు, ఉత్తమపురుషయందు వత్తును, మధ్యమపురుషయందు వత్తువు, వచ్చెదవు, వచ్చితివి. ప్రార్థనమందు రమ్ము, రావే. ణిచ్చు, రప్పించె, రావించె. కర్మార్థమునందు రాబఁడెన్. ఇత్యాదులు చూచుకొనునది• ఈ చెప్పిన సూత్రార్థముకంటె విశేషము లథర్వణవచనములవలనఁ దెలియునది.]

---

[కర్మణ్యనుబన్ధస్స్యా త్పతిధాతుః కర్తృవచ్చ తద్విధయః
ఆశిషి కావుత*కాతా వెడు తేత్యాద్యా భవన్తి కాకశ్చ.†

ఇది మూఁడు సూత్రములు, కర్మణి=కర్మార్థమునందు, పతిధాతుః=పత్ పతనే” అను ధాత్వర్థము, అనుబన్ధస్స్యాత్=అనుబంధ మగును. ఘటింపఁబడుచున్నాఁడు, ఘటింపఁబడఁగలఁడు, ఘటింపఁబడఁగలరు, ఘటింపఁబడెన్, చేయఁబడుచున్నాఁడు. కర్తృవచ్చ తద్విధయః తద్విధయః=ఆవిధులు, కర్తృవచ్చ=కర్త్రర్థములవంటివియు నగును. “రమణీ నీకతన మాకు రాఁబడె నిట కున్”-ఆశిషి=ఆశీరర్థకమునందు, కావుత, కాత, ఎడు, త, కాక అనుశబ్దములు వచ్చును. రాముఁడు మమ్ము రక్షించుఁ గావుత, మిమ్ముఁబోషించుఁగాత, పాలిం

*మూలము-గావుత గాత గాక యని సరళాదిగా నున్నది. గాతావెడుమిత్యాద్యా- వెడమెత్యాద్యా- అనియు నున్నది.

† రెండవ ప్రతిలో నీశ్లోకముతర్వాత, అత్వాదితత్సమ, అనుశ్లోకమున్నది.

చెడు, పాలించుత, పాలించుఁగాక. ఆదిశబ్దము వలనను ప్రోవుతక, పోషించుతక, ఇత్యాదులు చూచుకొనునది.]

---

శా. పర్వేందుప్రతిమానసుందరముఖీ పద్మోదరాంచద్విరా
డర్వాదిత్యవిభుప్రపూజితపదా హర్యక్షరాడ్గామినీ
శర్వాంభోరుహలోచనా ప్రవిలసచ్చామీకరా గారయు
క్సర్వైశ్వర్యకరీ నగాధిపతనూజాతా జగన్మాతృకా!

గద్యము. ఇది శ్రీసకలభాషావాగనుశాసన నన్నయభట్ట విరచితాంధ్రశబ్ద చింతామణియందు సకలకవితాస్వతంత్రభట్టారక యెలకూచి బాలసరస్వతి కవిమహోపాధ్యాయప్రణీతంబైన శబ్దానుశాసనటీకాగ్రంథమునందుఁ బంచమము క్రియాపరిచ్ఛేదము.

సంపూర్ణము.

---

]ఇట్టిగుర్తుల నడుమనున్న విషయము 4095 గ్రంథములోనిదానికంటె రెండవప్రతిలోఁ గ్రియాపరిచ్ఛేదమున భేదముగానున్నది.